నుండు తాటాకుపుస్తకములపెట్టెలో "ధనుశ్శాస్త్రం, సస్యానందం" అనురెండు శీర్షికలుగలసుమారు ఇరువదిపత్రముల తాటాకుపుస్తక మొకటినాకంటఁబడినది. కాని, అది యేమైనదో, యిపుడు కనఁబడలేదు. అందలిభాష సంస్కృతమో తెలుఁగో, యిపుడు జ్ఞప్తి లేదు. ఎట్లయిన నేమి? ఇపుడు సంస్కృతధనుశ్శాస్త్రకృతి యొక్కటి మాత్రము. కృష్ణమాచార్యునికృతిలో మూఁడాశ్వాసములందు, ధనుర్నిర్మాణము తత్పరిమాణము మార్గణపరిగణనము, శరవిధానమానప్రశంస, పుంఖోపసంఖ్యానము, ధనుర్బాణగోపనార్హానిచోళనిషంగరచనము, మౌర్వీవిధానము, అంగుళిత్రాణవిధానము, జ్యారోపణము, లక్ష్యశుద్ధి మొదలగు పెక్కువిషయములు వర్ణింపఁబడినవి. ఇదియు ముద్రిత మైనట్లు కనఁబడదు. ఇఁక—

## గాంధర్వవేదము

దీనికి సంబంధించినవిజ్ఞానము సామవేదముతోనే యుదయించి వికసించిన దనుటకు దానియనుక్రమణికలఁ గనవచ్చుసామగానప్రవర్తకులపట్టికలే నిదర్శనము[1]. రాణాయని మొదలుగా జైమినివఱకును గలపదుముగ్గురాచార్యులవల్ల సామగానవిద్య తొలుత దేశమునందు తలచూపినది. తరువాత జైమినిమహర్షి సంతతివారును, తచ్ఛిష్యప్రశిష్యులును దీని నభివృద్ధికిఁ దెచ్చిరి. ఇట్లతిప్రాచీనముగాఁ గనవచ్చుసామగానమే భరతవర్షీయగానవిద్యకు నిదాన మైనట్లు నారదశిక్ష యీక్రిందివిధముగాఁ దెలుపుచున్నది.

> "య స్సామగానాం ప్రథమ స్స వేణో ర్మధ్యమ స్స్మృతః
> యో ఽసౌద్వితీయో గాంధార స్తృతీయ స్త్వృషభ స్స్మృతః
> చతుర్థ షడ్జ ఇత్యాహుః పఞ్చమో ధైవత స్స్మృతః
> షష్ఠో నిషాదో విజ్ఞేయ స్సప్తమః పఞ్చమ స్స్మృతః."

ఈశ్లోకములనుబట్టి సామగానభారతగానస్వరములును, సంగీతశాస్త్రవిహితము లైనసప్తస్వరములగుర్తులు నిట్లుండును.

| సామస్వరములు | భారతగానస్వరములు | వీనిగుర్తులు |
|---|---|---|
| ప్రథమము | మధ్యమస్వరము | మ |
| ద్వితీయము | గాంధారస్వరము | గ |
| తృతీయము | ఋషభస్వరము | రి |
| చతుర్థము | షడ్జస్వరము | స |
| పంచమము | ధైవతస్వరము | ధ |
| షష్ఠము | నిషాదస్వరము | ని |
| సప్తమము | పంచమస్వరము | ప |

1. చూ. సం. వా. చ. ప్రథ—పుటలు 272—74.

దీనినిబట్టి సామగానములోని ప్రథమాది సప్తస్వరములవల్లనే భారతగానములోని మధ్యమగాంధారాది సప్తస్వరము లేర్పడినట్లును, ఆస్వరములయాద్యక్షరములే 'సరిగమపధని' యనుస్వరసంజ్ఞ లైనట్లును విదితమగును[1]. మఱియుదక్షిణాటికి వ్యాప్తిలో నున్నప్రాచీనసంప్రదాయమునుబట్టి దత్తిలనారదసంవాదరూపమున నున్న రాగసాగర మనుసంగీతశాస్త్రగ్రంథము రాగోత్పత్తిని నిర్ణయించుచు, "భైరవభూపాలరాగములు విప్రజాతివి, అవి సామవేదజన్యములు. మంజరీశ్రీరాగములు క్షత్రియజాతివి, అవి యజుర్వేదజములు. వసన్తమాలవరాగములు వైశ్యజాతివి, అవి ఋగ్వేదసంజాతములు. నాటబంగాలరాగములు శూద్రజాతివి, అవి యథర్వవేదసంభూతములు" అని ప్రశంసించుటనుబట్టియు[2], ఛాందోగ్యోపనిషత్తు దేవజనవిద్య యనుపేర గాంధర్వవిద్య నుదాహరించుటనుబట్టియు, గర్భోపనిషత్తు గావించినగానవిద్యాప్రసంగమునుబట్టియు, తొలుత గంధర్వులవలన వ్యాప్తికి వచ్చి గాంధర్వ మనుపేరుగాంచినయీవిద్యకు వేదసంబంధము కలదని స్పష్టమగును. అట్టిదీని ప్రాచీనస్వరూపమును దెలుపుపురాతనగ్రంథము లేవియు లభింపకున్నవి కాని, గాంధర్వవేద మనియు నాట్యవేద మనియు రెండుశబ్దములు మాత్రము వైదికలౌకికవాఙ్మయముల సందందు గనవచ్చుచున్నవి. అందు—

"గాంధర్వవేదము ముప్పదియాఱువేలగ్రంథము. అందు సప్తస్వరోత్పత్తి వీణాకలారాగమేలతాలమిశ్రగీతికాలాసికోల్లాసికాదిబహుతంత్రములును, జాతిగ్రహలయస్థానములు మార్గాంగప్రక్రియ కాలజ్ఞానము వాద్యజ్ఞానము మొదలగు నసంఖ్యాకవిషయములును వర్ణింపఁబడినవి" అనుచు యామలాష్టకతంత్రము చెప్పిన మాటనుబట్టి[3], గాంధర్వవేద మనుపేర నొకప్రాచీనగ్రంథ ముండెడి దని తెలియవచ్చును గాని, యది యిపుడు మృగ్యము. ఇంక, శారదాతనయవిరచిత మైనభావప్రకాశన మనుగ్రంథము—

"నాట్యవేదాచ్చ భరతాః సార ముద్ధృత్య సర్వతః
సంగ్రహం సంప్రయోగార్థం మనునా ప్రార్థితా వ్యధుః
ఏకం ద్వాదశసాహస్రైః శ్లోకై రేకం తదర్ధతః
షడ్భిః శ్లోకసహస్రైర్యో నాట్యవేదస్య సంభవః"[4].

అని చెప్పినమాటలనుబట్టి భరతులు రచియించినద్వాదశసహస్రీరూప షట్సహస్రీరూపములైననాట్యశాస్త్రగ్రంథములురెంటికిని మూలాధార మైన నాట్యవేద మొకటి యుండెడి దనవలసివచ్చుచున్నదిగాని, గాంధర్వవేదస్వరూ

1. సం. వా. చ. ప్ర. 175, 275, 276.
2. విప్రా భైరవభూపాలౌ కీర్తితౌ సామవేదజౌ. ఇత్యాది.
3. గాంధర్వవేదః షట్త్రింశత్సహస్రగ్రంథసమ్మితః. ఇత్యాది.
4. దశమాధికారము, 34, 35, శ్లోకములు.

షమువలె దానిస్వరూప మెందును వర్ణింపఁబడియుండలేదు. అందుచేఁ బూర్వ గురుపరంపరాప్రాప్త మైనప్రాచీననాట్యసంప్రదాయమే యర్వాచీనులకు నాట్య వేద మైనదనియు, అదియాధారముగా వృద్ధభరతుఁడు తొలుతఁ బండ్రెండువేల గ్రంథముతో నొకనాట్యశాస్త్రము రచియించె ననియుఁ బిదప భరతముని దానిని సంగ్రహించి యాఱువేలగ్రంథముతో మఱియొకనాట్యశాస్త్రము నిర్మించె ననియు, 'భరతాః' అనుబహువచనప్రయోగము[1] పూజ్యార్థకమై వృద్ధభరత భరతమును లిద్దఱినిమాత్రమే తెల్పునది యనియుఁ బైశ్లోకములభావము గ్రహింపవలసియున్నది. కాని, ఆప్రకరణముమాత్ర మీభావమున కవకాశమిచ్చుట లేదు. ఇంతకును, నాట్యవేదము ధనుర్వేదమువలె నాదిని సంప్రదాయరూపమే కాని, గ్రంథరూపము కా దనియే తోఁచుచున్నది. పోనీ! గాంధర్వవేదమునే కొందఱు నాట్యవేద మని వ్యవహరించి రంద మన్నను, ఇం దొకదాని కొకటి నామాంతర మనుటకుఁ బ్రమాణము లభింపదు. ఉపవేదగణనమున సర్వత్ర గాంధర్వవేదశబ్దమే కాని, నాట్యవేదశబ్దము కనఁబడదు. దానంజేసి రెండునొకటే యనుటకు సాహసము చాల కున్నది. అయినను, అందలివిషయము కొంతగాంధర్వ విద్యకు సంబంధించినది కావున నీసందర్భమందే నాట్యశాస్త్రసంగీతశాస్త్రగ్రంథ ములనుగూర్చి ప్రసంగింతము.

వేదములందు వేదాంతములందు రామాయణమహాభారతాదులందును నటనాట్యనృత్యనర్తనాదిశబ్దములు కనఁబడుచున్నను నటధర్మములను దెలుపుశాస్త్ర మెప్పు డుదయించిన దని విచారింపఁగాఁ బాణినికిఁ బూర్వమే యది యుదయించి నట్లు గోచరించినది. శిలాలిప్రోక్త మైననటసూత్రము లధ్యయనముచేయునటులు శైలాలు లనియు, కృశాశ్వప్రోక్తనటసూత్రములు చదువునటులు కృశాశ్వుల నియు, ద్వివిధనటులను నిరూపించుచుఁ బాణిన్యాచార్యులు తనకు మున్ను శిలాలియుఁ గృశాశ్వుఁడు ననువారు నటసూత్రములు రచియించియున్నట్లు తెలిపియున్నాఁడు. మఱియు నటులధర్మము గాని, ఆమ్నాయము గాని నాట్య మగు ననియు రూప నిష్పత్తి గావించియున్నాఁడు[2]. ఆసూత్రము లిపుడు లభింపకున్నను, అవియే తరు వాత వెలువడిననాట్యశాస్త్రగ్రంథముల కాధారము లని విశ్వసింపవచ్చును. ఈవిషయ మింత విస్పష్టముగా నుండఁగా, పాణినిధాతుపాఠమున నటధాతువు నాలుగుచోట్ల[3]. దృగ్గోచర మగుచుండఁగా, పాణినినాఁడు నాట్యశబ్దము నృత్య

1. ఇది యింకను విచారణీయము.
2. పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః. అష్టా. 4. 3-110.
కర్మన్దకృశాశ్వాదినిః. 4. 3-111.
ఛన్దోగౌక్థికయాజ్ఞికబహ్వృచనటాఞ్ఞ్యః. 4. 3-129.
3. నటనృత్తౌ. నట అవస్యన్దనే. ఇత్యాది.

పరమేకాని నాటకాభినయపరము కాదని స్వాభిప్రాయము తెలిపినఁ దెలుపునుగాక, అంతేకాని, క్రింద నుదాహరించినపాణినిసూత్రములు మూఁడును మహాభాష్యమున వ్యాఖ్యాతము లైనట్లు తనకుఁ గనఁబడ లేదని యీసూత్రములు పతంజలి తరువాతికాలమం దష్టాధ్యాయిలోఁ జేరియుండు నన్నవీబరుపండితునిసాహసము మాత్ర మీపట్టున విస్మయము గలిగింపకపోదు[1]. పాశ్చాత్యవిమర్శకులసాహసోక్తుల కిట్టి వెన్నేని యుదాహరణములు కలవు. ఇపుడు వానిమాట యటుండనిండు.

పాణిని పేర్కొన్నపై నటసూత్రములకుఁ బిదపఁ జెప్పఁదగినగ్రంథము ద్వాదశసహస్రి యగునాట్యశాస్త్రమే. ఇది వృద్ధభరతుఁడు రచియించిన దని ప్రతీతి. ఇందలికొంతగ్రంథముమాత్రమే యిపుడు సజీవమై యున్న దని తెలియవచ్చుచున్నది గాని, పూర్వ మీగ్రంథము ప్రచారములో నున్నట్లుగా, దశరూపవ్యాఖ్యాత యగుబహురూపమిశ్రుఁడు మొదలగువారు ద్వాదశసహస్రీకారమత మెత్తి యిందలివాక్యము లుదాహరించుటయే చెప్పుచున్నది[2]. వృద్ధభరతుఁడు క్రీ. పూ. నాల్గవశతాబ్దిలోనివాఁడు. అందుచేఁ బాణిని చూచినశిలాలికృశాశ్వనటసూత్రములు తరువాత సుమారు మఱిమూఁడువందలయేండ్లు ప్రచారములో నుండె ననుట యాశ్చర్యకరము కాదు కావునను, ఆమధ్యకాలమున నేయాధారము లేక నాట్యకళ ప్రవృత్త మయ్యె ననుట యనూహ్యము కావునను, తననాఁటికి నాట్యవేదముగాఁ బ్రశంసింపఁబడుచు వచ్చినయాసూత్రములసారమునే శ్లోకరూపముగా నాట్యశాస్త్ర మనుపేర వృద్ధభరతుఁడు ద్వాదశసహస్రగ్రంథము నిర్మించె నని విశ్వసింపవలసియున్నది.

ద్వాదశసహస్రికిఁ బిదప మఱినూటేండ్లకు షట్సహస్రి యుదయించినది. దానికర్త భరతముని యని ప్రతీతి. అతఁడు క్రీ. పూ. మూఁడువందలయేళ్లనాఁటివాఁడు[3]. వృద్ధభరతుఁడు నాట్యవేదోత్పత్తి నెట్లు వర్ణించెనో, తనగ్రంథమున కాధారముగా దేనిని బ్రశంసించెనో తెలియరాదు గాని, భరతమునిమాత్రము తననాట్యశాస్త్రము ద్వాదశసహస్రికి సంగ్రహ మని చెప్పలేదు సరిగదా! పైగా నాట్యవేదము బ్రహ్మ నిర్మించి తన కిచ్చినట్లుగా గ్రంథమహత్త్వప్రశంసాపరమైన ప్రాచీనశైలినిబట్టి "నాట్యశాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా య దుదాహృత"మ్మని యారంభించి, ఆత్రేయాదిమునులు తన్నుపాసించి "నీవు సమకూర్చినవేదసమ్మిత

1. వీబరు H. I. L 197 P.

2. సమాప్యతే హి నాట్యజ్ఞై రఙ్కావతార ఇష్యతే-ఇతిద్వాదశసహస్రీకారః

3. వృద్ధభరతభరతమునులనుగూర్చియు వారికాలములనుగూర్చియుఁ గొంద ఱుసంశయించుట కలదు. భరతాచార్యుడు క్రీ. మూఁడవశతాబ్దికిఁ బూర్వుఁడని పి. వి. కాణేపండితుఁడు మొదలగువా రనిరిగాని, అది యూహయేకాని సిద్ధాంతముకాదు.

మైనవాట్యవేద మెట్లుత్పన్న మయ్యె'' నని యడుగఁగా, వారికిఁ బ్రత్యుత్తర మిచ్చి నట్లుగా నాట్యవేదకథను బ్రథమాధ్యాయమున విపులముగా వర్ణించియున్నాఁడు. దానిసార మిందు సంగ్రహించి చూపుచున్నాను.

"వైవస్వతమన్వంతరమందు త్రేతాయుగమున లోకము గ్రామ్యధర్మప్రవృత్తమై కామలోభపరవశమై సుఖదుఃఖసమాకులమై యున్నప్పు డింద్రాదిదేవతలు బ్రహ్మను సమీపించి—మేము దృశ్యము శ్రవ్యము నైన క్రీడనీయకము కోరుచున్నాము. శూద్రజాతులయందు వేదవ్యవహారము శ్రవ్యము కాదు. కావున సార్వవర్ణిక మైన పంచమవేదము సృజింపుము—అని వేఁడుకొనిరి. అంతఁ బితామహుఁడు 'సర్వశ్రావ్య మైనవేదము నిర్మింతు' నని ప్రతిజ్ఞ చేసి, ఋగ్వేదమునుండి పాఠ్యమును సామవేదమునుండి గీతమును యజుర్వేదమునుండి యభినయములను, అథర్వవేదమునుండి రసములను గ్రహించి చతుర్వేదాఙ్గసంభవముగా నాట్యవేదము నిర్మించి... ప్రక్క నున్న నన్ను (భరతమునిని) ఉద్దేశించి—నీవు పుత్రశతయుక్తుఁడవై యీ వేదమునకుఁ బ్రయోక్తవు కమ్మని పలికెను. నేనును బ్రహ్మవలన నాట్యవేదము తెలిసికొని, శాండిల్యవాత్స్యకోహలతండుదత్తిలాదు లగు నానార్యపుత్రులకు దానిని సప్రయోగముగా నేర్పి, స్త్రీలు తప్పఁ బురుషులు కైశికీవృత్తి ప్రయోగింపఁ జాల రని నేను మనవి చేయఁగా స్వయంభువు దయాళువై యప్పుడ మనస్సున సంకల్పించి నాట్యాలంకారచతుర లైన మంజుకేశీసుకేశీసులోచనామనోరమాదిసంజ్ఞలు గలయిరువదినలుగు రప్సరసలను సృజించి నాకిచ్చియు, గీతాతోద్యములందు సశిష్యుఁ డైనస్వాతినామకఋషిని, గానయోగమునందు నారదాదిగంధర్వులను నాకు సహాయులను గా నియోగించెను. అంత నేను నాట్యసంపూర్ణత గాంచి కృతాంజలినై నే నేమిచేయవలెనో సెలవి మ్మని లోకేశుని బ్రార్థింపఁగా నతఁడు 'ఇది ప్రయోగమునకు మంచిసమయము. మహేంద్రపర్వతముపై జరుగు విజయోత్సవమునం దీనాట్యవేదము ప్రయోగింపు' మని శాసించెను. నేను నట్లే యచ్చట నాంది గావించితిని. అట్టి సర్వాతిశాయి యైన దీనాట్యవేదము."

ఈశాస్త్రమునందు భరతశబ్దము నటనాట్యనాట్యప్రవర్తకపరముగాఁగూడ నున్నను, భరతసంజ్ఞ కలయొకముని ద్వాదశసహస్రియు, ఇంకొకముని షట్సహస్రియు రచియించి రనులోకప్రసిద్ధి విశ్వసనీయము కాకపోదు. కాని, విమర్శవిచారణనుబట్టి పైకథ యిందు కేవలము కల్పిత మనక తప్పదు. అయినను, ఇట్టికల్పనము లాకాలమందలి కొన్ని స్మృతులలోఁ గూడఁ గనవచ్చుటంజేసి గ్రంథమహాత్మ్యావాప్తికై యిట్టియపూర్వకల్పనములు గావించుట యానాఁటి కొందఱి శైలి యనియు, అందుచేతనే యీముని తనకు మున్నున్న నాట్యసూత్రములను గాని ద్వాదశసాహస్రినిగాని పేర్కొనక బ్రహ్మనోటఁ బుట్టిన నాట్యవేదమే యీనాట్య

శాస్త్ర మనుభావము ప్రకటించె ననియు, అభినవగుప్తాచార్యుఁడు చెప్పినట్లు మొదటియధ్యాయమందలి కొంతభాగముగూడఁ దచ్ఛిష్యప్రక్షిప్తముగాక యంతయు మునిప్రణీతమే యనియు నొకవిధముగా మనస్సమాధానము గావించుకొనవలసియున్నది.

ఈనాట్యశాస్త్రము ముప్పదియే డధ్యాయముల గ్రంథ మని కూడ నొక ప్రతీతి కలదుగాని, అభినవగుప్తాచార్యుఁడు వ్యాఖ్యానావతారికలో 'షట్త్రింశకం భరతసూత్ర మిదం వివృణ్వన్' అని చెప్పినదానినిబట్టి యిది ముప్పదియాఱధ్యాయముల గ్రంథమే యని నమ్మఁదగును[1]. బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లుగా నితనియభినవభారతీవ్యాఖ్య దీనికి మఱింత ఖ్యాతి తెచ్చినది. ఇది రూపకప్రదర్శనము ప్రధానప్రయోజనముగా నుదయించిన దైనను, సాహిత్యముపాలిటి కల్పద్రుమ మనఁదగియున్నది. రసభావనాయకాదిలక్షణముల దీనిమాట వేదవాక్కు. ఇందు నిరూపింపఁబడిన విషయములు విధులు నసంఖ్యాకము లమోఘము లపూర్వములు. తరువాత బయలుదేఱిన వివిధరూపకాలంకారనాట్యాదిలక్షణముల కెల్ల నిది పెట్టినది భిక్ష. దేశకాలపాత్రముల మార్పులనుబట్టి రుచి మాఱుటచే నిందలి రూపకప్రదర్శనవిధు లీకాలమున రుచింపకున్నను, చిరకాలము దీనిమాటయే శాసన మైనది. ఈశాస్త్రమందు ముఖ్యముగా నిరువదియెనిమిదవయధ్యాయము మొదలుగా ముప్పదినాల్గవయధ్యాయము తుదవఱకును సప్తస్వరములు గాత్రగాన తంత్రీగానాదులు విశదీకరింపఁబడినవి. ఇంక—

పూర్వోక్త మైననాట్యవేదోత్పత్తికథ పేర్కొన్న నూర్వురును భరతముని పుత్రు లన్నను, కొందఱు భావించిన ట్లతని శిష్యు లన్నను, అతనికి సమకాలికులనవలెనుగదా! వారిలో, కోహలుఁడు సంగీతమేరువును నఖకుట్టకుఁ డొక నాట్యశాస్త్రమును దత్తిలుఁడు గాంధర్వవేదసారమును రచియించినట్లు తెలియుచున్నది. తండు వనునతనికి నంది యనునామాంతర మున్నట్లుగా 'తండుమునిశబ్దో నన్దిభరతయో రపరనామనీ' అను నభినవగుప్తవచనమునఁ దెలియుచున్నది. ఈనన్దియే నందికేశ్వరుఁ డైనచో నందికేశ్వరభరత మనఁబడెడి యభినయదర్పణమును, భరతార్ణవము నితని వనవలసివచ్చును. ఇట్లింక నెన్నెని గ్రంథములు వారు వారు రచియించి యుందురు గాని, నాట్యవేదోత్పత్తికథ చూపిన భరతపుత్రనామావళి సత్య మని నమ్మి యీగ్రంథము లన్నియు భరతనాట్యశాస్త్రమునకు సమకాలికములనుటకు మాత్రము మన సొప్పకున్నది. అయినను, క్రీ. ౧౦౦-౨౦౦ నడుమనున్న మతంగముని బృహద్దేశి యను తనసంగీతగ్రంథమున దత్తిలుని స్మరించుటచేతను, అర్వాచీనగ్రంథము లనేకములు కోహలదత్తిల (దంతిల) నందినారదాదులను

1. కడపటి యధ్యాయమును లేఖకు లెవరో రెండుగా విభజించుటచే 37 అధ్యాయముల ప్రతీతి వచ్చినట్లు కనఁబడుచున్నది.

చార్యోత్తములను గా స్తుతించుటచేతను, వారు క్రీ. పూ. ప్రథమశతాబ్ది [illegible] యావలివారై యుందు రని తోచుచున్నది.

వీరిలో దత్తిలుఁడు రచియించినదిగా దత్తిల మను నొకగ్రంథ మహాత్రశయనమున ముద్రిత మైనది. బృహద్దేశీకర్త యగుమతంగమునివలెనే, సంగీతసమయసారకర్త యగు పార్శ్వదేవుఁడును, సంగీతసుధాకారుఁ డగు రఘునాథభూపుఁడును, అభినవభారతీవ్యాఖ్యాకర్త యైనయభినవగుప్తాచార్యుఁడును, దత్తిలమతము నుద్ఘాటించుటంబట్టి యిది దత్తిలమునికృతమే యని తత్ప్రకాశకులు సమర్థించియున్నారు. ఇది ౨౪౩ శ్లోకముల చిన్న గ్రంథము. సప్తస్వరూప మైనగీతజాతము సామవేదమునుండి పుట్టిన దని యిది యిట్లు చెప్పుచున్నది.

"ఇత్యేవ మృషిభి ర్గీతం సామవేద సముద్భవమ్,
సప్తరూప మతో జాతం గీతజాతం పురా కిల"

అమరకోశవ్యాఖ్యాత యగుక్షీరస్వామి నాట్యవర్గులో నుదాహరించిన స్వరస్థానవిషయక మైన యీక్రిందిశ్లోక మిందలిదే.

"నృణా మురసి మంద్ర స్తు ద్వావింశతివిధో ధ్వనిః
స ఏవ కంఠే మధ్యః స్యా త్తారః శిరసి గీయతే"

దీనినిబట్టికూడ నీగ్రంథము దత్తిలమునికృతమే యని విశ్వసింపఁదగియున్నది. ఇందు, స్వరగ్రామమూర్ఛనాస్థానవృత్తిజాతివర్ణాదు లగుబహువిధసంగీతశాస్త్రవిషయములు విశదీకరింపఁబడినవి.

'గీతం వాద్యం తథా నృత్యం త్రయం సంగీత ముచ్యతే' అనునది సంగీతలక్షణము[1]. ఇందు నృత్యము వాద్యానుగము, వాద్యము గీతానువృత్తి. అందుచే గీతము ప్రధాన మగుచున్న దని సంగీతరత్నాకరకారాదులనిర్ణయము. పితామహుఁడు సామవేదమునుండి తొలుత గీతమును గ్రహించె నని వారివిశ్వాసము. గీత మనాదిగా నెల్లలోకముల వారిచేఁ గూడఁ బ్రేమింపఁబడుచువచ్చిన దని పౌరాణికమతము. బ్రహ్మాయు నాదివిష్ణువును సామగానలోలురు. పార్వతీపతి గీతనృత్యప్రియుఁడు. రాధాకృష్ణుఁడు వేణుగానరతుఁడు. సరస్వతి వీణాసక్త. ఇంతయేల? అజ్ఞాతవిషయాస్వాదు లయ్యు ఫణిమృగబాలురుగూడ గీతము శ్రుతిగోచర మైనంతనే తన్మయచిత్తులై పరవశత్వమున నానందింతురుగదా! ఇఁక నట్టిసంగీతము మహిమ వేఱ పొగడవలెనా? 'ధర్మార్థకామమోక్షాణా మిద మే వైకసాధన' మ్మనుశార్ఙ్గదేవునివచన మెంతయు నియ్యెడ సముచితము. లోకములో నాదమునుండి వర్ణమును దానినుండి పదమును దానినుండి వాక్యమును దానివలన వ్యవహారమును సిద్ధము లగుచున్న వనుట యనుభవసిద్ధమే కావున, జగ మంతయు నాదాధీన మనుట స్పష్టము. అట్లే గీతము నాదాత్మకము, నాదవ్యక్తియే వాద్య

1. గాంధర్వం త్రివిధం గీతవాద్యనృత్తభేదతః. నాట్యచూడామణి. సోమనార్యమతము.

ములకి మూలము. ఈ గీతవాద్యములు రెంటిని నృత్య మనుగమిం
నీమూఁడును నాదాధీనము లనుటయు విదితము. అట్టియానాదము
అనాహతము నని ద్వివిధము. దీనివలన శ్రుతియు దానివలన స్వరము
వలన రాగమును దానివలన గీతము నుత్పన్నము లగునుగావున గీతమునకు నా
దమే యాత్మ యనియు, మూలాధార మనియుఁ దలంపఁబడుచున్నది. తదాత్మ
మైనగీతము నధికరించియే సంగీతశాస్త్ర మావిర్భవించినది. ఆగీతమునకు వాద్య
నృత్తములు సహకారులు. అందుచే నీమూఁడును సంగీతశాస్త్రమున కవలంబ
నము లైనవి.

సంగీతము, మార్గము దేశి యని ద్వివిధము. విరించిప్రోక్తమై సదాశివుని
యెదుట భరతాదిప్రయుక్త మైనది మార్గమనియు, ఆయా దేశములజనులకు హృద
యరంజకమై వ్యాపించినది దేశి యనియు సంగీతలక్షణకర్తలమతము. గీతవాద్య
నృత్తాత్మక మైనయీసంగీతమున గీతము ప్రధానముగా, రాగవర్ణనిరూపణము
రాగసాగరము సంగీతదర్పణము సంగీతవిషయము మొదలుగా బహుగ్రంథము
లుత్పన్నము లైనవిగాని, వానిలో సంగీతరత్నాకరమునకు భరతఖండ మంతటను
ప్రాచుర్యము హెచ్చినది. దీనికర్త శార్ఙ్గదేవుఁడు. ఇతఁడు కాశ్మీరదేశమునుండి
దక్షిణాపథమునకు వలసవచ్చినభాస్కరపండితునిపౌత్రుఁడు. సోఢలదేవునిపుత్రుఁడు.
సింఘణభూపాలునియాస్థానములోనివాఁడు. యాదవవంశీయుఁడైన యీరాజు
దౌలతాబాదను దేవగిరినగరము రాజధానిగా శాలివాహనశకము ౧౧౩౨–
౧౧౬౯ నడుమ రాజ్యము చేసినవాఁ డగుటచే శార్ఙ్గదేవుఁ డతనిసమకాలికుఁడై
క్రీ. శ. ౧౨౨౦ ప్రాంతమున నీగ్రంథము రచియించె నని విశద మగుచున్నది.
ఇది, స్వరరాగవివేకప్రకీర్ణకప్రబంధతాలవాద్యనర్తననామకము లైనయేడధ్యాయ
ములమహాగ్రంథము. చతురకల్లినాథవిరచితకలానిధివ్యాఖ్యతో, పూనానగర
మున ముద్రిత మైనదీనికి, సింహభూపాలుఁడు కుంభకర్ణనరేంద్రుఁడు గంగారా
ముఁడు హంసభూపాలుఁడు నను నలుగురును సంస్కృతవ్యాఖ్యలు రచియించినట్లు
తెలియుచున్నది. మఱియు హిందీభాషలో నొకవ్యాఖ్యయు, తెలుఁగున రెండు
వ్యాఖ్యలు నున్నవని యందురు. ఒక తెలుఁగువ్యాఖ్యతోడియీపుస్తకము మదరాసు
ప్రాచ్యపుస్తకాలయపట్టికలోఁ గనవచ్చుచున్నది. దీనినిబట్టి యీగ్రంథము సార్వ
త్రికమై సకలరసికహృదయాహ్లాదకారి యైన దని స్పష్ట మగును.

శార్ఙ్గదేవుఁడు, సంగీతవిశారదు లగుపూర్వులమతపయోనిధిని మథించి
యందలిసారమునే యీగ్రంథముగా రచియించుచున్నా నని ప్రతిజ్ఞ చేయుచు,
శివాసదాశివ బ్రహ్మ రంభార్జున నారద తుంబురు విశ్వావసుప్రముఖులను బేర్కొనుట
యేటున్నను, భరత కశ్యప మతంగ యాష్టిక శార్దూల కోహల విశాఖిల దత్తిల

కంబల మాతృగుప్త స్వాతి గుణ బిందురాజ క్షేత్రరాజ రాహల రుద్రట భోజరాజ పరమర్ది సోమేశ జగదేకమహీశ్వరాదుల ననేకులఁ బేర్కొనుట చూడ సంగీత విషయమున పీరిమతములు కల వని తెల్లమగుచున్నది. మఱియు, రుద్రభట్టు (క్రీ. ౯౦౦) రచియించిన యెనిమిదివేల గ్రంథముతోడి స్వరనిర్ణయమును, చాళుక్య వంశ్యుఁడైన ప్రతాపచక్రవర్తి (క్రీ. ౧౦౦౦) నిర్మించిన సంగీతచూడామణియు, నాన్యదేవుఁడు మిథిలాపురరాజు (క్రీ. ౧౧౦౦) రచించిన సరస్వతీహృదయాలంకారమును, బెల్లామునివాసియు జైనపండితుఁడు నగుపార్శ్వదేవుఁడు (క్రీ. ౧౨౫౦) వ్రాసిన సంగీతసమయసారమును, నారదుఁ డనునొకకవి (క్రీ. ౧౩౦౦) కల్పించిన సంగీతమకరందమును, మీవాఁడుదేశ మేలిన కుంభకర్ణుని (క్రీ. ౧౪౨౦) యొక సంగీతకృతియు, అళియరామరాజు సేనానాయకుఁడైన బయకారరామామాత్యుఁడు (క్రీ. ౧౫౫౦) రచియించిన స్వరమేలకలానిధియు, రఘునాథరాయని గురువైన గోవిందదీక్షితుని (క్రీ. ౧౫౭౦) కృతియు, ఇట్లే యింక ననేకములును సజీవములై యున్నవి. పైవారిలో సంగీతాకరసూరిబిరుదాఙ్కితుఁ డగు పార్శ్వదేవుఁడు "మీమాంసాదిసకలశాస్త్రములచేఁ గూడ గమ్యుఁడు కాని శంకరుఁడు గీతముచే గమ్యుఁ డగును. పారాశర్యాదిసకలస్మృతికర్తలుగూడ గీతమే మోక్షద మనిరి" అనుచు సంగీతము సర్వోత్తమ మని ప్రశంసించియున్నాఁడు. పదియధికారములతోడి యితని గ్రంథమున స్వరరాగనృత్తవాద్యతాలాదివిషయములు సవిమర్శముగా నిరూపింపఁబడినవి.

రెండవది యగువాద్యము ప్రధానముగా మృదంగలక్షణ తాలలక్షణ తాలాధ్యాయ తాలవిషయ తాలప్రకరణ తాలదశప్రాణప్రకరణాది గ్రంథములు పెక్కు పుట్టినవి. ఇందు తాలలక్షణము కోహలుఁడు రచియించినట్లుగా దాని వ్యాఖ్యాత యీక్రిందివిధముగాఁ జెప్పియున్నాఁడు.

"ఇహ ఖలు సకలభరతపండితమండలాఖండలసకలభరతప్రవర్తకశిఖామణిః కోహలాచార్యనామకః...తౌర్యత్రికోపకారాయ...తాలస్వరూపం ప్రతిపాదయితుకామః చికీర్షితం ప్రతిజానీతే" ఇత్యాది. ఇది గాక మఱియొక తాలలక్షణము గూడ నర్వాచీనమైనది కలదు.

తాలము వాద్యముకంటె భిన్నమై తౌర్యత్రికమున సహాయకారి యని తాలశాస్త్రవేత్తలమతము. నృత్తగీతవాద్యములు తాలము లేక శోభింపవు. కావునఁ దాలస్వరూపము ముందెఱుఁగవలె నని వా రందురు. ఇది నిజమైనను దీనిని ప్రకరణవశమున వాద్యమునఁ జేర్చితిని.

మూఁడవది యగునృత్తము సంగీతగ్రంథములం దంతటను ప్రశంసింపఁబడి దానిగూర్చి కూడ, అభినయదర్పణము అభినయశాస్త్రము నాట్యచూడామణి తాలనిధి నృత్తతాలలక్షణము భరతార్ణవము భరతార్థచంద్రిక మొద

లగుననేక గ్రంథము లుదయించినవి. ఇవి యన్నియు భరతనాట్యశాస్త్రము ననుస రించినవే కాని స్వతంత్రములు కావు. శార్ఙ్గదేవుఁడు నృత్తతాలకపూర్తన మను గ్రంథమును గూడ రచియించినట్లు కనఁబడుచున్నది. నర్తనము, నాట్యనృత్య నృత్తభేదమునఁ ద్రివిధ మని తల్లక్షణవేత్తలమతము. దశరూపకకర్తకూడ 'అవ స్థానుకృతి ర్నాట్య' మిత్యాదిగా నీమూఁడింటికి వేఱుగా లక్షణములు నిర్వచించి యున్నాఁడు. మఱియు,

ఆంగి కాహార్యక వాచిక సాత్త్విక భేదమున నభినయము చతుర్విధ మనువిషయమున నాట్యగ్రంథకర్తలమతము లేకీభవించుచున్నవి గాని, సంయుతా సంయుతసంకరహస్తములను జూపుటలో నభినయశాస్త్రభరతార్ణవాదులకు మత భేదములు కలవు. ఆభేదము లన్నియుఁ గాలక్రమమున నభినయకల వృద్ధి గాంచు టలో దేశభేదమునుబట్టి వచ్చిన వని తెలియఁగలదు. ఇట్లు గాంధర్వవిద్య భరత ఖండ మంతట ననాదిగా వ్యాపించి పరమాత్మజ్ఞానమునకు సంగీతము సాధన మనెడిఖ్యాతి వహించుటయేకాక దేశభేదమునుబట్టి రాగస్వరకల్పనతాలలయాదు లందు శాఖోపశాఖలుగావిజృంభించినది. సంగీతవిషయ మనుగ్రంథము రాగములు ౭౨ అనిమాత్రమే నిరూపించి కనకాంగిరత్నాంగిప్రముఖము లైనవానినామము లెల్లఁ బేర్కొన్నది కాని, సంగీతరత్నాకరము ద్వితీయాధ్యాయమున రాగభేదము లపారముగాఁ జూపి వానిలక్షణములు విశదీకరించియున్నది. అందు నిందును గూడఁ బేర్కొనఁబడినయనేకరాగములు దక్షిణకర్ణాటాంధ్ర దేశములలో వినఁ బడవు. దీనినిబట్టి రాగము లాయాదేశీయులు ప్రేమించుగీతముల నాశ్రయించి వాడుకలోఁ బెరిఁగిన వని తెలియవచ్చును. ఇఁక భావప్రకాశనమునుగూర్చి రెండు మాటలు.

"ఆర్యావర్తదక్షిణభాగమున మేరూత్తర మనుజనపదమున మాఠరపూజ్య గ్రామమున నివసించునట్టియష్టాదశవిద్యాపారంగతుఁ డగుభట్టభూపాలుఁడు సంతా నార్థియై శారదాదేవి నారాధింపఁగా నొకపుత్త్రుఁ డుదయించెను. అతనిపేరు శారదాతనయుఁడు. అతఁడు వేదవేదాఙ్గవిద్యలు నేర్చి యొకచైత్రమాసోత్సవమున శారదాలయమున కేగి యామెచెంతఁ గూర్చుండి భావాభినయకోవిదు లగునటు లభినయించుముప్పదివిధములరూపకములను జూచి 'అమ్మా! నాకు నాట్యవేదము దయచేయు'మని యాచించెను. అపు డాదేవినియోగమున నాట్యశాలాపతి యగు దివాకరుఁ డనువిప్రుఁడు, గౌరీశంకర వాణీ బ్రహ్మ వ్యాసాగస్త్య నారద భరతాదుల నాట్యమతము లన్నియు నుపదేశించెను. అంత శారదాతనయుఁడు నాట్యవేదుల హితార్థమై భావభావభేదనాయికానాయకభేదశబ్దార్థసంబంధభేదనాట్యభేదనాట్య ప్రయోగభేదాదిరూపమున దశాధికారములుగా భావప్రకాశన మనుమహాగ్రం

థము రచియించెను” అని 'భావప్రకాశావతారిక చెప్పుచున్నది. చాలవఱ కభినవగుప్తాచార్యునిమార్గ మవలంబించి నాట్యవేదమునకు సంబంధించినయెల్లవిషయములు విశదీకరించినయీశారదాతనయుఁడు క్రీ. పన్నెండవశతాబ్దిమొదటిభాగములోనివాఁ డని తలపఁబడుచున్నది. నాట్యవేదవేత్తయై యుత్తరదేశమున ఖ్యాతి వహించినయుత్తమాలంకారికుఁడైనయీశారదాతనయున కీడై తరువాత దక్షిణదేశమున శారదామూర్తిగా నవతరించి దక్షిణాపథమును సంగీతరసామృతమున ముంచినమహనీయుఁడు త్యాగరాజే. ఇతనికృతు లాంధ్రము లయ్యు ద్రవిడకర్ణాటత్రిలింగాది దేశములలోసంగీతసారస్వతమున నగ్రస్థాన మధిష్ఠించి యున్నవి.

## శిల్ప వేదము

గాంధర్వవేదమువలె నిది యిప్పుడు చతుష్షష్టికలలలోఁ బరిగణింపఁబడుచున్నను, తొల్లి యుపవేదముగా నే గణన కెక్కినది. దీనికి స్థాపత్యవేద మను నామాంతరము కలదు. ప్రాచీనులశిల్పకల మిక్కిలిశాస్త్రసమ్మతమై హృదయంగమముగా నుండెడి దనుటకుఁ బురాణాదులఁ గనఁబడుపురగ్రామతటాకారామదేవాలయాదినిర్మాణవర్ణనలే కాక, మహింజోదారోమొద లగుపురాతనభ్రష్టపురాదులలోనివిచిత్రవస్తుసంతతియు సాక్ష్యమిచ్చుచున్నది. ఇంత యేల? తొమ్మిదియద్భుతములలో నొకటిగాఁ బ్రశంసింపఁబడుచు నేఁటికిని సకలప్రపంచమున కచ్చెరువు గొలుపుచున్న తాజ్‌మహాలుశిల్పము, ప్రాచీనులనిరుపమాననిర్ణిద్రనిర్దుష్టశిల్పకలాకౌశలమున కంత్యోదాహరణమై ప్రత్యక్ష మగుచుండ నిఁకఁ బురాతనార్యులశిల్పవిజ్ఞానము సర్వాతిశాయి యనుట కెవ్వరు శంకింతురు? అట్టియిది ఛాందోగ్యోపనిషత్తునం దష్టాదశవిద్యలలో, దేవజనవిద్య యనుపేర నృత్తగీతవాద్యములతోఁ దుల్యముగాఁ బ్రశంస కెక్కినను, ఈవిజ్ఞానముతోడి ప్రాచీనగ్రంథములుమాత్రము కనరావు. దృగ్గోచరము లగుచున్నకొన్నిగ్రంథములు ప్రాచీనమునినిర్మితములుగా భ్రాంతి గొలుపుచున్నను, అవి పూర్వులపేర నర్వాచీనులు రచియించినవి గాని పురాతనములు గా వని వానిస్థితిగతులే తెలుపుచున్నవి. అందుచే శిల్పసారస్వతమునం దేగ్రంథ మాద్యమో నిర్ణయింప వీలుపడ కున్నది. అయినను, దొరకిన ప్రమాణవచనములనుబట్టి దీనియుత్పత్తిమార్గము లవలోకింతము.

“పూర్వము త్రేతాయుగమున మహోన్నతము మహావిశాలము నగుశరీరముతో నొకమహాభూత మావిర్భవించి తిరుగఁజొచ్చెను. దానిని జూచి దేవతలు భయపడి బ్రహ్మదేవుని శరణుచొచ్చి ప్రార్థించిరి. అతఁడు వారి కభయమిచ్చి, ఆపురుషుని బట్టుకొని తలక్రిందుగాఁ బడవేయుఁ డనెను. వా రట్లు గావించిరి. వాఁడే వాస్తుపురుషుఁడు. బ్రహ్మసృష్టుఁడు. అతఁడు భాద్రపదకృష్ణతృతీయాశనివాసరమునందు కృత్తికానక్షత్రమున జన్మించినవాఁడు. వాఁ డట్లు దేవతలచేఁ బీడింపఁ

బడి బ్రహ్మను స్తుతించుచు, నిరపరాధుఁడను రక్షింపుమని కోరెను. అపుడు బ్రహ్మ ప్రసన్నుఁడై నిన్నుఁబూజింపక యెవరు గ్రామపురగృహారామదుర్గాద్యారంభము గావింతురో వారికి సిరి యబ్బదు. వారియుద్యమము కొనసాగదు. నిన్నుఁ బూజించినవారియత్నము ఫలించును. అని వర మిచ్చెను. అట్టివాస్తుపురుషుని గూర్చి తెల్పునది వాస్తుశాస్త్రము. ఈశాస్త్రము బ్రహ్మవల్లనే తొలుత వెలసినది. పురాతన మైనదీనిని శంభువు పరాశరునికి, అతఁడు బృహద్రథునికి, అతఁడు విశ్వకర్మకుఁ గ్రమముగా నుపదేశించిరి. బహుభేదయుత మైనయీశాస్త్రమును లోకహితార్థమై విశ్వకర్మ ప్రకాశింపఁ జేసెను. అదే విశ్వకర్మప్రకాశము, లేక వాస్తుశాస్త్రము" అని విశ్వకర్మప్రకాశావతారిక చెప్పుచున్నది. ఆగ్రంథమునందే త్రయోదశాధ్యాయముతుద "గర్గుఁడు పరాశరునికి, అతఁడు బృహద్రథునికి, అతఁడు విశ్వకర్మకును గ్రమముగా నీశాస్త్ర ముపదేశించినట్లు కనఁబడుచున్నది. ఇది యిట్లుండ—

వివిధశిల్పవిద్యారహస్యములను శివుఁడు కాశ్యపుని కుపదేశించినట్లుగా, కాశ్యపీయ మనఁబడెడియంశుమద్భేద మనుగ్రంథము తెలుపుచున్నది. ఇది గాక, మయమత మనుపేర వాస్తుశాస్త్రమును మయుఁడు రచియించినట్లుగా ముప్పదియాఱధ్యాయములగ్రంథమును, మనునిర్మితముగా నొకవాస్తులక్షణమును, మానసారరచితముగా నొకవాస్తుశాస్త్రమును, అగస్త్యవిరచితముగా నొకశిల్పశాస్త్రమును, గనవచ్చుచున్నవి. సనత్కుమారుఁడు తనపేర గృహవాస్తువు నిర్మించినట్లుగా సనత్కుమారసంహిత యనుచిన్నపుస్తక మొకటి కనఁబడుచున్నది. ఇవిగాక, పరాశరమునికృత కృషిపద్ధతి, నీలకంఠభట్టవిరచితకుండోద్ద్యోతము, విశ్వనాథదేవనిర్మితకుండమండపకౌముది, నరహరిభట్టవిరచితమండపకుండమండనము, విఠలదీక్షితప్రణీతకుండసిద్ధి, విశ్వనాథద్వివేదిరచితకుండరత్నాకరము మొదలగు శిల్పశాస్త్రగ్రంథము లింకను గలవు. వీనిలో నర్వాచీనకృతులనుగూర్చి యాలోచింపఁబనిలేదు కాని, విశ్వకర్మాదినిర్మితములుగాఁగనవచ్చునవి తత్తన్నిర్మితములాయనునది మాత్రము సందిగ్ధముగా నున్నది. కానిండు. ఈగ్రంథముల ప్రాచీనత యెట్టిదైనను, వీనియందలి వాస్తుశిల్పవిజ్ఞానముమాత్ర మతిప్రాచీన మని, ఆరుణకేతుకచిత్యమందలిపురీరథాదివర్ణనములును, వాల్మీకిరామాయణమందలి మనునిర్మితాయోధ్యావర్ణనాదులును, మహాభారతమందలి మయసభాదివర్ణనలును, విష్ణుపురాణాదులలోని వివిధశిల్పవర్ణనలు నేకగ్రీవముగా సాక్ష్య మిచ్చుచున్నవి. అందుచే శిల్పవేద మథర్వసంహిత కుపవేద మనెడిచరణవ్యూహాదులయభిప్రాయము సముచితమే యనవచ్చును. ఇట్లు పురాతన మైనయీవాస్తుశిల్పవిజ్ఞానమునుగూర్చి పైగ్రంథములవల్లఁ గొన్ని విశేషవిషయము లీక్రిందివిధముగా దెలియవచ్చుచున్నవి.

వాస్తుశిల్పవిజ్ఞానవిషయమునఁ బురాతనసంప్రదాయసిద్ధమై తొలుత గర్గమత ముదయించినది. దానినిబట్టి విశ్వకర్మమతమును మానసారమతమును బుట్టినవి. ఇందు మానసారమత మతివిశాలము. ఇవియును వీనింబోలియు నభినవ లక్షణములు కొన్ని కలదియు నగుమానవమతమును దొల్లి యుత్తరహిందూదేశమున నెక్కువగా వ్యాపించినవి. పైవాని కించుక భిన్నమార్గములు త్రొక్కిన మయమతాగస్త్యమతములు సంపూర్ణలక్షణలక్షితములై దక్షిణహిందూదేశమున హెచ్చుగా వ్యాపించినవి.

మానసారము ౭౦ అధ్యాయముల గొప్పగ్రంథము. మానసారుఁ డనుముని రచియించిన దగుట నీవాస్తుగ్రంథమున కీపే రబ్బినది. భూపరీక్షాశంకుస్థాపన గృహరాజగృహగ్రామపుర దేవాలయాదినిర్మాణవిధాన మితరగ్రంథములందువలెనే యిందు నున్నది గాని, యిందలివిషయవివరణ మసామాన్యము. బౌద్ధజైనలక్షణ వర్ణములనుబట్టి యిది యర్వాచీన మనఁదగియున్నను, ఋషిదేవరాజమానవాది లక్షణవిశేషములను విశదీకరించుచుఁ బ్రపంచవిజ్ఞానమున కాకరముగా నున్న దనుటయే దీనిమహత్త్వమునకు గుర్తు. ఇది గాక, సమరాంగణసూత్రధార మను మఱియొకమహాగ్రంథము క్రీ. ౧౯౨౪ లో బరోడాసంస్థానమువారు ప్రకటించినది కనవచ్చుచున్నది. అధ్యాయాంతముల నున్న "మహారాజాధిరాజశ్రీ భోజదేవ విరచితే సమరాఙ్గణసూత్రధారాపరనామ్ని వాస్తుశాస్త్రే—" ఇత్యాదిగద్యము లనుబట్టి ౮౩ అధ్యాయముల యీగ్రంథమును[1] ధారానగరాధీశుఁడును సరస్వతీకంఠాభరణాదిబహుగ్రంథకర్తయు నగు భోజమహారాజు రచియించినట్లు తెలియుచున్నది. ఇది, మొన్నటివఱకును లోకముకంటఁ బడకుండుటచేతను, భోజుని యితరగ్రంథములందు పేర్కొనఁబడకపోవుటచేతను, ఇతరకవు లేసందర్భమందును దీనిని స్మరింపకపోవుటచేతను, ఇది భోజునిది కాదేమో యనియు, పైగద్యమును గ్రంథప్రశస్తికై లేఖకు లెవరో కల్పించియుందు రనియుఁ గొందఱికిఁ దోఁచ వచ్చును గాని, పైకారణాభాసములు తప్పఁ బ్రబల మైనకారణము లేవియు నిది యితనిది కా దనుటకుఁ గనరావు. కావున నిప్పటి కిది యితనిదే యని విశ్వసింప వలసియున్నది. అది గాక విద్వత్కవియు విద్వత్కవిశేఖరాశ్రయుఁడు నగునితఁ డీకృతి రచియించె ననుటయు నబ్బురము కాదు. విశ్వకర్మప్రకాశము ననుసరించిన యీకృతి యన్నివిధముల మానసారమునుగూడ మించిన దనవచ్చును. ఇందు రమారమి రెండు వేలవిషయము లున్నవి. భాష మిక్కిలిమృదువు నిర్దుష్టము. శైలి సరళము. మొదటియేడధ్యాయములందును ఖగోళభూగోళవిజ్ఞాన ముపదేశింపఁబడినది. అచ్చటినుండి భూపరీక్షాదివాస్తువిషయములు సంపూర్ణముగా

1. అసంపూర్ణమైనది. ఇంకను గొన్ని యధ్యాయములు మిగిలియున్నట్లు తెలియుచున్నది.

వివరింపఁబడినవి. ఇంతె యేల ? ఇందు తెలుపఁబడనివాస్తుశిల్పవిషయములే దనుట కంటె దీనిసర్వాంకషత్వమును వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదు. పూర్వోక్తము లయిన మహాగ్రంథములలోని యాయాభాగములను దీసి శిల్పరత్న మనుపేర ౮౧ అధ్యాయముల గ్రంథమును, కేరళదేశీయుఁ డగుకుమారకవి సమకూర్చెను. ఇవి గాక, క్రీ. ౧౪౩౩—౧౪౬౮ నడుమ మేదపాటపురముపాలించిన కుంభకర్ణ (కుంభో) రాజునాస్థానములోనివాఁ డగుమండనుఁ డనుకవి ప్రాసాదాదినిర్మాణమునధికరించి నిర్మించిన రాజవల్లభమండన మనువాస్తుశాస్త్రగ్రంథ మొకటికలదు. అది విశ్వకర్మమతము ననుసరించినదే. ఆంధ్రులలో, కనుపర్తి బసవాచార్యుఁడు రచించినవిశ్వవిద్యాభరణము శిల్పకారువిధులను, విశ్వకర్మకులజులరథకారాదిశాఖలను విశదీకరించుచు శిల్పశాస్త్రగ్రంథములలో గణన గాంచినది. ఇది గాక గన్నమాచార్యుఁడు పెద్దనాచార్యుఁడు గార్లపాటలక్ష్మణాచార్యుఁడు మొద లగువారు మయమతము ననుసరించినవాస్తుగ్రంథములు కొన్నిటికిఁ దెలుఁగుటీకలు నిర్మించిరి. దీనినిబట్టి, మయమత మాంధ్రదేశమున నెక్కువగా వ్యాపించిన దని తెలియఁగలదు.

ఇట్లు గ్రామపురదుర్గారామాదినిర్మాణమున భరతఖండమునకు సౌందర్యము తెచ్చినయీశిల్పవాస్తువిద్య యీకాలమున వాడుకలో లేనిమాటవాస్తవమే కాని, దానివాసన నేఁటికిఁగూడఁ గొంచె మేని హైందవులహృదయముల నంటియుండక పోలేదు. అయిన నేమి ? రాజావలంబనమును, ప్రజాదరణమును లేక దీనికిఁ జెందినగ్రంథములు గూడ నెన్నో స్వదేశమునకు దూరములై విదేశపుస్తకాలయముల నిద్రించుచున్న వనుట విచారకరము. ఇఁక వీనిని విడిచి సంస్కృతకవితాకల్పలతామూలము లనఁదగి జగదేకపూజ్యము లైనరామాయణమహాభారతము లవలోకింతము.

ఇది శ్రీహరితసగోత్ర పవిత్ర మల్లాది వెంకమాంబా శ్రీరామావధానిపుత్ర సూర్యనారాయణశాస్త్రి ప్రణీతమైన
సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయభాగమగు
లౌకికవాఙ్మయచరిత్రయందు
ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము



## రామాయణమహాభారతములు

ఇవి యెప్పటివి? వీనిలో నేది ముందు? ఏది వెనుక? అనువిషయముల ననేకు లనేకవిధములఁ జర్చించి వారివారికిఁ దోఁచినట్లు సిద్ధాంతీకరించియున్నారు. అందుకుఁ గారణ మిద మిత్థ మనఁదగినప్రబలప్రమాణములు లేకపోవుటయే. ఇపుడు వారిచర్చ లన్నియు గ్రహించి పరామర్శించుట యనావశ్యకము. మనకు లభించినయాధారములనుబట్టి వీనిపౌర్వాపర్యాదివిషయములు తెలిసికొందము.

ఇతిహాసము సంహిత ఆఖ్యానము, అనునామము లీరెంటికిని వీనియందే లభించుచున్నవి. జయ మనుపేరు రామాయణమున లేదుకాని, భారతమువలెనే యిదియును, అష్టాదశపురాణములుఁగూడ జయసంజ్ఞకల వని భవిష్యత్పురాణము చెప్పుచున్నది[1]. విశేషించి రామాయణ మాదికావ్య మార్షము వేదసమ్మితము. భారత మార్షము పంచమవేదము. ఏకనాయక మగురామాయణము పరిక్రియ యనెడియితిహాసము. బహునాయకమైనభారతము పురాకల్ప మనెడియితిహాసము[2]. ఆకథ త్రేతాయుగములోనిది. అందలినాయకుఁ డవతారపురుషుఁడైన శ్రీరాముఁడు. ఈకథ ద్వాపరాంతమునాఁటిది. కలియుగమున ౬౫౩ సంవత్సరములు గడచినంతఁ గురుపాండవులు దయించి రని రాజతరంగిణీమతము. ఇందలికథాప్రవర్తకుఁడు శ్రీరామునితరువాతియవతారపురుషుఁ డగురామకృష్ణుఁడు. ఇది, యిట్లుండ, సప్తమహర్షులలోని అత్రిభరద్వాజవసిష్ఠవిశ్వామిత్రులకు రామకథతో సంబంధము కలదు గాని, ఆప్రాచీనమహర్షులలో నొకరికిని భారతప్రధానకథతో సంబంధము లేదు. మఱియు, ఉత్పత్తిక్రమమునుబట్టి యేకనాయకకావ్యము ముందుపుట్టుటయు, బహునాయకకావ్యము దానిమీఁదిపెంపుగాఁ దరువాతఁ బుట్టుటయు సహజము. అట్లే మొట్టమొదటికథ సరళముగా నుండుటయు, తరువాతికథ తికమకలుగా నుండుటయుఁగూడ సాజమే. దీనికిఁ దగినట్లుగా శ్రీరాముఁడు ధర్మనిష్ఠయే కాని, తనచర్యయందు రాజనీతిజ్ఞత చూపినవాఁడు కాఁడు. ధర్మరాజు ధర్మవర్తనుఁ డయ్యు రాజనీతిపారంగతుఁడై కార్యము నడపినవాఁడు.

---

1. అష్టాదశపురాణాని రామస్య చరితం తథా,
కార్ష్ణో వేదఃపంచమశ్చ యం మహాభారతం విదుః,
జయేతినామ్నా త్వేతాం స్తు ప్రవదంతి మనీషిణః.
2. పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్వివిధా.
స్యాదేకనాయకా పూర్వా; ద్వితీయా బహునాయకా; కా. మీ

సీత అయోనిజ, పతియే తక్క నన్య మెఱుఁగనియమాయికురాలు. ద్రౌపదియు నయోనిజ. కాని, పతులకు సమరోత్సాహము కలిగించినలోకజ్ఞురాలు ధీరురాలు. భరతలక్ష్మణులు మిన్ను విఱిగి మీఁదఁ బడినను, అన్నగారిమాట కడుగుదాఁటని వినయమూర్తులు. భీమార్జునులుగూడ నట్టివారే యైనను, అప్పుడప్పుడు కార్యవేగమున మైమఱచి యన్నను దాఁటినమత్సరగ్రస్తులు. అందు ప్రతినాయకుఁ డైన రావణునిమూర్ఖత్వము సీతను గొనిపోయి బెదరించుటతో సరిపోయినది. ఇందు దుర్యోధనునిమొఱకుఁదనమో ద్రౌపదిని గొప్పువట్టి సభ కీడ్పించి భర్తలయెదుట నామెచీర లొలిపించువఱకును బోయినది. సంగ్రామనియమములు సమయములు వ్యూహములు రామరావణరణరంగమున నంతగా లేవు. అవి యన్నియుఁ గురుక్షేత్రమునఁ దలచూపినవి. దానినాఁడు కొంచె మెచ్చుతక్కువగా గాంధారాద్యామైనదక్షిణహిందూదేశమున దీనినాఁడు కొంచెము నాగరికతగాంచినజనపదము లేర్పడినవి. ఇంత యేల? రామాయణమున నద్భుతవర్ణన లెక్కువ. భారతమున నవి తక్కువ. రామునిది వానరసేన. కురుపాండవులదిమానవసేన. అక్కడలేని చతురంగబల మిక్కడ నున్నది. దీనినంతనుబట్టి రామాయణకథ ముందనియు భారతకథ వెనుక యనియుఁ దెలియకపోవునా? అయినా, రామకథ పూర్వమే కావచ్చును గాని, రామాయణరచనముకంటె భారతరచనము పూర్వమనెడిమతము మాత్ర మొకటి యున్నది. ఈయభిప్రాయ మావిష్కరించినవారు మఱికొందఱు కూడఁ గలరుగాని, యిం దెక్కువపట్టుదల చూపినవాఁడువాష్‌బర్న్‌హాప్కిను పండితుఁడు. (E. Wash Burn Hopkin)[1]. కావున నీవిషయము పరామర్శించి యీమత మెంతవఱకు నిలచునో చూతము.

భారతమున రామోపాఖ్యానము కనఁబడుచున్నది కాని, రామాయణమున నేసందర్భమందును భారతప్రధానకథలోనియొకపాత్రము పేరైనఁ గనరాదు. రామచరితమును వాల్మీకిని బేర్కొని యందలికొన్నిశ్లోకములను భారతముదాహరించినదిగాని, భారతమును గాని తత్కర్తను గాని రామాయణ మెందును స్మరింపలేదు. ఇందుకుఁ గొన్నియుదాహరణములు:—

"భీష్మద్రోణులు ధర్మమునందు దాశరథిరామునికిఁ దీసిపోరు" అని విదురుఁ డనును.[2].

"సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తా స్సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్."

అనురామాయణశ్లోకముభారతమున సరిగా నిట్లే యున్నది.[3]. మఱియు—

1. See The Great Epic of India. Ch. II.
2. భార. ఆది. 205 అధ్యా.
3. రా. అయో. 105. 16—భా. శాం. 27. 31.

"యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే,
సమేత్య చ వ్యపేయాతాం కాల మాసాద్య కంచన." [1].
"ఆసన్ వర్షసహస్రాణి తథా పుత్రసహస్రిణః,
నిరామయా విశోకా శ్చ రామే రాజ్యం ప్రశాసతి." [2].
"దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ,
భ్రాతృభి స్సహిత శ్శ్రీమాన్ రామో రాజ్య మకారయత్" [3].

అనురామాయణశ్లోకము లొకటిరెండుమాటలమార్పుతో భారతమునఁ గనఁబడుచున్నవి. "సరే కాని, భారతములోని రామోపాఖ్యానమునే వాల్మీకి తీసికొని విస్తరింపఁజేసి రామాయణము రచియించెననియు, పైశ్లోకములను భారతమునుండియే రామాయణము గ్రహించె ననియు నేల తలంపరాదు" అనెడి యాక్షేప మిక్కడ గలుగవచ్చును. అందుకు సమాధానము :—

స్త్రీవధ యుచితము కా దని రామాయణము చెప్పినయీక్రిందిమాటలను వాల్మీకిపేరెత్తి భారతము గ్రహించియున్నది.

"నహన్తవ్యాః స్త్రియ ఇతి యద్బ్రవీపి ప్లవంగమ !"
రా. యు. 81. 29.

"అపి చాయంపురాగీతః శ్లోకో వాల్మీకినా భువి,
న హన్తవ్యాః స్త్రియ ఇతి య ద్బ్రవీపి ప్లవంగమ !"
భా. ద్రో. 143. 68.

మఱియు నయోధ్యాకాండములోని యఱువదియేడవసర్గయందలి 'నారాజకే జనపదే' అనుపాద మారంభముగాఁగల శ్లోకములవిషయము శాంతిపర్వమున ౬౭, ౬౮, సర్గలయందు 'యది రాజా న పాలయేత్' అనుపాదము మకుటముగాఁ గల శ్లోకములఁ గనవచ్చుచున్నది. మఱియు "అరాజకే ధనం నాస్తి నాస్తి భార్యా ప్యరాజకే" ఇత్యాదిరామాయణశ్లోకముల[4] యర్థమును భారతము గ్రహించి విశదీకరించుచు—

"శ్లోక శ్చాయం పురాగీతో భార్గవేణ మహాత్మనా,
ఆఖ్యానే రామచరితే నృపతిం ప్రతి భారత...
రాజ న్యసతి లోకస్య కుతో భార్యా కుతో ధనమ్" [5].

---

1. రా. అయో. 105. 26—భా. శాం. 28. 37.
2. రా. యు. 131. 103—భా. శాం. 29. 58.
3. రా. యు. 131. 108—భా. శాం. 29. 64.
4. రా. అయో. 67. 11
5. భా. శాం. 57. 40.

అని రామాఖ్యానమును భార్గవుఁడైనవాల్మీకిని బేర్కొనెను. ఇంకొకచో రామాయణమును[1] పెక్కుచోట్ల వాల్మీకిని[2] పేర్కొనెను. ఇట్లు భారతార్వాచీనత్వము తెలియవచ్చుచున్నను, ఈశ్లోకము లన్నియుఁ బ్రక్షిప్తము లని యెవరైన ననవచ్చును. కాని, అరణ్యపర్వమునఁ గొంత యర్వాచీన మనియు శాంత్యాదిపర్వములు కొన్ని తరువాతఁ జేరిన వనియుఁ గొందఱూహించినమాట సత్యమే కాని, ద్రోణపర్వము ప్రక్షిప్త మన్నవారు లేరు. అందుచే వాల్మీకిని బేర్కొన్న యందలిశ్లోకము ప్రక్షిప్త మనుట పొసఁగదు. ఇఁక దీని నిట్లుంచి పురాణసాక్ష్యము గైకొందము.

పురాణములు పూర్వాపూర్వమహాయుగవృత్తాన్తజ్ఞాపకములును స్థలజలమహాపురుషాదిమహత్త్వబోధకములు నై యతిశయోక్తిభూయిష్ఠము లైనట్లు కనఁబడుచున్న వని కొందఱు తలంచుట కలదు కాని, ఆయతిశయోక్తుల నించుక తొలఁగించుకొని, యందు చొచ్చి నిదానించి పరీక్షించినచో నందు మఱుఁగుపడియున్నసత్యము కొంత బయటఁ బడక పోదు.

వాఙ్మయసంబంధము గలవాల్మీకు లిద్దఱుముగ్గు రున్నట్లు ప్రబలప్రమాణ మెందును గనరాదు. అట్లే వాల్మీకికి వేదవిభజనముతో సంబంధ మున్నదనుటకుఁ బురాణవచనములు తప్ప రామాయణమం దేమియు నాధారము కనరాదు. కాని, వాల్మీకియే రామాయణకర్త యనుటమాత్రము నిర్వివాదము.

పరాశరులు ముగ్గురు నలుగురును వ్యాసులు పెక్కండ్రును గల రనుటకు వైదికలౌకికవాఙ్మయముల ననేకాధారములు కలవు. వేదవ్యాసునికి వేదవిభజనముతో సంబంధ మున్న దని పురాణములు చెప్పుచున్నవి. అతఁడే పంచమవేదము రచియించె నని భారతావతారిక చెప్పుచున్నది. కాని, వేదవ్యాసుఁడు లేక వ్యాసుఁ డనునది బిరుదము కాని, యొకఋషినామధేయము కా దనియుఁ బురాణములు చెప్పుచున్నవి. ఇపు డేపరాశరునిపుత్త్రుఁ డైనయేవేదవ్యాసుఁడు భారతము రచియించె ననుప్రశ్న మటుంచి, కృష్ణద్వైపాయనుఁ డనఁబరగుపారాశర్యవ్యాసుఁడు భారతము రచియించె నన్నయితరపురాణవచనములను భారతవచనమును గ్రహించి రామాయణభారతములపౌర్వాపర్య మవలోకింతము.

పురాణములలో వాయువిష్ణుపురాణములు ప్రాచీనము లనికొందఱిమతము. అందు, వేదములను విభజించినమునులను బేర్కొనుచు, ఇరువదినాల్గవ వేదవ్యా

---

1. రామాయణేఽతివిఖ్యాతః శ్రీమాన్ వానరపుంగవః. భా. అర. 147-11
2. .. వాల్మీకిశ్చ మహాతపాః, శమీక స్సత్యవాక్ —భా. సభా. 7-16.
ఋషిముఖ్యా స్సదా యత్ర వాల్మీకి స్త్వథ కశ్యపః. భా. అర. 85-120
అసితో దేవల స్తాత వాల్మీకి శ్చ మహాతపాః. భా. శాం. 207-4

మాఁడు ఋక్షుఁ డనియు, ఇరువదియెనిమిదవ వేదవ్యాసుఁడు ద్వైపాయనుఁ డనియు వాయుపురాణము చెప్పినది[1]. ప్రతిద్వాపర మేకరాశిగా నున్న వేదములను విభజించుమహర్షి వేదవ్యాసబిరుదము వహించు ననియు, ఈవైవస్వతమన్వంతరమునఁ గడచినయిరువైయెనిమిదిద్వాపరములందు నిరవైయెనమండుగురు ఋషులు వేదవ్యాసబిరుదము గాంచి రనియుఁ జెప్పుచు, ఇరవైనాల్గవ వేదవ్యాసుఁడు భార్గవుఁడైన వాల్మీకియనుఋక్షుఁడనియు, ఇరవైయెనిమిదవవ్యాసుఁడుకృష్ణద్వైపాయనుఁడనియు, విష్ణుపురాణము చెప్పినది[2]. కూర్మపురాణాదులు కొన్ని ఋక్షభార్గవనామములకు బదులుగా వాల్మీకి పేరే చెప్పినవి[3]. ఈపురాణసంప్రదాయమునుబట్టియు, 'భృగుర్వై వారుణిః' అనుతైత్తిరీయోపనిషద్వాక్యమునుబట్టియు, వరుణవంశమువాఁడు భృగువంశమువాఁడు నైనవాల్మీకి యొకఁడే యనియు, అతఁడు వేదవ్యాసుఁడు కూడనై యుండె ననియుఁ దెలియుచున్నది. కృష్ణద్వైపాయనుఁ డనునొకఋషియు వేదవ్యాసుఁ డైనట్లు తెలియుచున్నది. "ఇఁక వీరే రామాయణమహాభారతకర్తలనెడిప్రతీతినిబట్టి రామాయణము భారతముకంటెఁ బూర్వ మనుట కాక్షేపమేమి?" అని మన మొకవిధముగా వీనిపౌర్వాపర్యము నిర్ణయించుకొనుటకు ముందుగా గ్రాంథిక మైనప్రబలప్రమాణ మొకటి యరయుదము.

శ్రీరాముఁడు రావణుని సంహరించి లంకారాజ్యమున విభీషణునికిఁ బట్టము గట్టినట్లు రామాయణము వర్ణించినదిగదా! సహదేవుఁడు దక్షిణదిగ్విజయయాత్రకు వెళ్లినపుడు లంకేశ్వరుఁడు పౌలస్త్యుఁడు నగువిభీషణునివద్దకు దూతను బంపి యతనివల్ల రత్నాదులు కానుకగాఁ బుచ్చుకొనె నని భారతము వర్ణించినది[4]. విభీషణుఁడు పాండవులనాఁటికి లంకాపాలకుఁడుగా నుండెనోలేదో, అది యన్యవిషయము. వర్ణితాంశక్రమమునుబట్టి చూచినను భారతకథకంటెను దానిరచనము కంటెను రామాయణకథయు దానిరచనమును బూర్వము లని విదిత మగుచున్నది. ఇఁక భారతపూర్వత్వవాదులముఖ్యాక్షేపములు కొన్నిటికి మనము సమాధానము చెప్పవలసియున్నది.

---

1. పరివర్తే చతుర్వింశే ఋక్షో వ్యాసో భవిష్యతి...
 అష్టావింశే పునఃప్రాప్తే పరివర్తే క్రమాగతే...
 యదా భవిష్యతి వ్యాసః, నామ్నా ద్వైపాయనః ప్రభుః. పూర్వా. 23. అధ్యా.
2. ఋక్షో ఽభూ ద్భార్గవ స్తస్మా ద్వాల్మీకి ర్యో ఽభిధీయతే,
 తస్మా ద స్మత్పితా శక్తి ర్వ్యాస, స్తస్మా దహం మునే (పరాశరః)
 జాతుకర్ణో ఽభవ న్మత్తః, కృష్ణద్వైపాయన స్తతః. 3. 3. 11-19.
3. తృణబిందు స్త్రయోవింశే, వాల్మీకి స్తు తతః పరః—
4. ప్రేషయామాస రాజేంద్ర పౌలస్త్యాయ మహాత్మనే,
 విభీషణాయ ధర్మాత్మా ప్రీతిపూర్వ మరిందమః. సభా. 31-75.

రామాయణము, జనమేజయుని — కురుపాంచాలములను — హాస్తినాపురమును పేర్కొన్నమాటసత్యము[1]. కాని, కురుపాంచాలములు బ్రాహ్మణారణ్యకములందు కనవచ్చుచుండ, నివి భారతమునాఁడే వెలసిన వని కాని, ఈపేళ్లను భారతమునుండియే రామాయణము గ్రహించిన దని కాని యూహించుట యసంగతము కదా! పోనీ! హాస్తినపురస్మరణ మందుమా, కౌరవపాండవులకుఁ బదుమూఁడుతరములు పూర్వుఁడైనహస్తి యనురాజు నిర్మించినహాస్తినపురమును వాల్మీకి యెఱుఁగుటకు భారతమే గతి యయ్యెనని తలంచుటకంటె వింత వేఱుండునా? ఇఁక జనమేజయశబ్దప్రయోగ మున్నది. ఈజనమేజయుఁడు కురువంశమువాఁ డని కాని, హాస్తినాపురరా జని కాని, రామాయణము చెప్పలేదు. దశరథబాణవిద్ధుఁడై మృతుఁడైనతనపుత్త్రునిగూర్చి యంధముని విలపించుచు "నాయనా! సగర శైబ్య దిలీప జనమేజయ నహుష దుంధుమారులు పొందినసద్గతిని జెందుము" అని పలికిన సందర్భమున నున్నజనమేజయుఁడు, తక్కినసగరాదులకుఁ గొంచెము దగ్గఱగా నున్నపురూరవునితరువాత నైదవపురుషుఁ డగుజనమేజయుఁ డని చెప్పుట యుచితము గాని, ఎపుడో తరువాతఁ గొన్నివందలయేండ్లకుఁ బుట్టినపాండవప్రపౌత్త్ర జనమేజయుఁ డని యూహించుట యెంతమాత్ర ముచితము కాదు. కావున నాక్షేపకులయాక్షేపములు పరిహరించుటతో భారతరచనముకంటె రామాయణ రచనమే పూర్వ మని విశ్వసించుచు దీనిని విద్వల్లోకమునకు విడుచుచున్నాను. ఇఁక—

## రామాయణభారతములకాలము

వీనికాలమునుగూర్చి పెక్కండ్రు వ్రాసియున్నారు. నేటికిని వ్రాయుచున్నారు. వారిలోఁ గొందఱు వీని నెంతోమీఁదికి లాగిరి. కొందఱు మిక్కిలి దిగలాగిరి. వేదములే మొన్నమొన్నటి వన్నపాశ్చాత్యు లివి నిన్నటి వనుట వింత కాదు కాని, జాకోబీ వీబరు మొద లగువారియభిప్రాయముల నీవిషయమునఁ జర్చించినమాగ్డొనలుపండితుఁడు, రామాయణము క్రీ. పూ. ఐదవశతాబ్ది కించుక ముందు రచియింపఁబడిన దనియు, భారతము క్రీ. పూ. మూఁడవశతాబ్దికిని మొదటిశతాబ్దికిని నడుమ రచియింపఁబడి యుండుననియు[2] సిద్ధాంతీకరించుటకుఁ గలహేతువుల నించుక విమర్శింతము.

---

1. తే హాస్తినపురే గంగాం తీర్త్వా ప్రత్యఙ్ముఖా యయుః,
పాంచాలదేశ మాసాద్య మధ్యేన కురుజాఙ్గలమ్. అయో. 68–13.
యాంగతిం సగరశ్శైబ్యో దిలీపో జనమేజయః—అయో. 64-43.

2. Sansk. Lit Ch. X.

"క్రీ. పూ. ౩౨౬ లో నుత్తరహింధూదేశముపై ద్దాడి సలిపిన యలగ్జాండ రనుగ్రీకువీరునితో గ్రీకుసైనికులు వచ్చిరి. వారే భారతమున వర్ణింపఁబడిన యవనులు. శకులు పహ్లావులు కూడఁ తత్ప్రాంతముననే హిందూదేశమునకు వచ్చిరి. శకయవనవర్ణనము రామాయణములోఁ గూడఁ గనఁబడును గాని, అది ప్రక్షిప్త మని జాకోబీపండితుఁ డనెను. భారతప్రధానకథలో దుర్యోధనునికి సహాయు లైనట్లున్నయవనులవర్ణనము ప్రక్షిప్తము కాఁజాలదు. కావున రామాయణ మలగ్జాండరుదండయాత్ర కావలిది. భారతము దాని కీవలిది." అనునది యితనిసిద్ధాంతమందలిసారాంశము. దీనినిబట్టి, అలగ్జాండరుతో వచ్చి యుత్తర మున నిలిచినసైనికులకు సంబంధించిన గ్రీకులే భారతములో వర్ణింపఁబడినయవను లని వాదమున కంగీకరించినను, అలగ్జాండరుతో నే కాక గ్రీకు లంతకు ముందే హిందూదేశమునకు వచ్చినట్లు కనఁబడుచున్నది. క్రీ. పూ. ౫౦౦ ప్రాంతమున డేరియస్ (Darius) అనుపారసీకరాజు దాడివచ్చి పంజాబులోఁ గొంతభాగ మాక్రమించె ననియు, అతనిసేనలో, అయోనియా (Ionia) ద్వీపవాసులు (గ్రీకులు) కొందఱు కల రనియు నొకచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు[1]. దీనిని బట్టి మేగ్డోనలు తలంపునకు విరుద్ధముగా గ్రీకులరాక, అలగ్జాండరుదాడిని దాఁటి డేరియస్సుదాడివఱకును రెండుశతాబ్దులువెనుకకుఁ బోయినను, భారతములో వర్ణింపఁబడినయవనుఁ లాగ్రీకులైనఁ గావచ్చు ననుట కవకాశము లేకపోలేదు. అందుచే, క్రీ. పూ. పంచమశతాబ్దికి మున్నే యవనశబ్దమువాఙ్మయములోనున్నట్లు చూపించినఁ గాని మేగ్డోనలువాదము పూర్తిగాఁ బ్రతిహతము కాఁజాలదు.

పాణినీయవార్త్తికకారుఁ డగువరరుచికాత్యాయనుఁడు యవనశబ్ద ముదాహరించి యవనులలిపి యవనాని యని చెప్పియున్నాఁడుగాని[2] అతఁడు పంచమ శతాబ్దిలోనివాఁడే యని యందురు. కాని, క్రీ. పూ. సప్తమశతాబ్ది కావలివాఁ డని బహుపరిశోధకులు నిర్ణయించినపాణిన్యాచార్యులు యవనశబ్ద ముదాహరించి యున్నాఁడు[3]. అతనికిఁ బూర్వుఁ డయినశాకటాయనుఁడును యవనశబ్దము వక్కాణించియున్నాఁడు[4]. దీనినిబట్టి డేరియస్సునకు మిక్కిలి పూర్వమే, ఉత్తరహిందూ దేశమున యవనజాతి యొకటి యున్నట్లును, దానిలిపి యవనాని యనఁబడినట్లును విదిత మగును. కావున భారతములోనియవనులు, పాశ్చాత్యులు తలంచినట్లు, డేరియస్సుతోఁ గాని, అలగ్జాండరుతోఁ గాని వచ్చిన అయోనియనులును గ్రీకులును గా రనుట నిజము. కాని, యిక్కడ నొక్కమాట. పూర్వమందు హిందూదేశ

---

1. Cambridge History of India – Vol. I P. 540.
2. యవనాల్లిప్యామ్.
3. ఇంద్రవరుణ...యవనమాతులాచార్యాణామానుక్. అష్టా. 4. 1. 49—1. 175.
4. యవనయవాల్లిపిదుష్టే. శా. వ్యా. 1. 3. 56—గణపాఠములో_యవన_శక_చోళ—

మున నున్నయవనులను బోలి యుండుటచేతనో మఱెందుచేతనో కాని, అలగ్జాండరుతో వచ్చి యిందు నిలిచినగ్రీకులను మనపూర్వులు యవను లను పేర వ్యవహరించి రనిమాత్ర మంగీకరింపవచ్చును. ఇందు కాంగ్లేయులను మొన్నమొన్నటివఱకును మనవారు హూణులని వ్యవహరించుటయే యొకనిదర్శనము. కావున, కాళిదాసాదులు గ్రీకులను యవను లని వాడినను, ఆగ్రీకులే శాకటాయనాదులు సూచించినయవను లని భ్రాంతిపడరాదు. అయితే, శాకటాయనాదులు పేర్కొన్న యవను లెవరు? ఎక్కడివారు?

భారతకాలమున నుత్తరమందును దక్షిణమందును గూడ యవనులజాతి నివసించియున్నట్లు కనఁబడుచున్నది[1]. క్రౌర్యమునుబట్టి యవి యట్లు పరిగణింపఁబడెనేమో చెప్పఁజాలముగాని, శకజాతి తప్పఁ దక్కినహూణ పారసిక పహ్లావ యవన చీనకాంభోజ చీనకళింగాదిజాతులు కొన్ని మ్లేచ్ఛజాతులుగాఁ జెప్పఁబడినవి. కాని, మ్లేచ్ఛపదమున కపశబ్ద మర్థ మైనట్లు "మ్లేచ్ఛోహ వా ఏష యదపశబ్దః" అని భగవత్పతంజలివాక్యమునఁ దెలియుచున్నది. దీనినిబట్టి తొల్లి, అపశబ్దము లుచ్చరించువారు మ్లేచ్ఛజాతులుగా గణింపఁబడిరనియు భాషచేతను లిపిచేతను గూడ యవను లట్టిమ్లేచ్ఛజాతులలోఁ జేరినవా రనియుఁ జెప్పవచ్చును. ఇందుకు, జుగుప్సార్థక మైనయుధాతువునుండి యవనశబ్దము నిష్పన్న మైనట్లుచెప్పినపాణిన్యాచార్యుల నిర్వచనముగూడఁ దోడ్పడుచున్నది[2]. ఇది యిట్లుండ, రామాయణము హూణపారసికపహ్లావజాతులపే రెత్తలేదు గాని, కాంభోజయవనశకాదిదేశము లుత్తరదిశలోని వని చెప్పినది[3]. మఱియు, సీత నన్వేషింపఁ దగినపూర్వదిశలోనినదీగిరిపురజనపదాదులు కొన్ని పేర్కొని తరువాత యవద్వీపశోణసముద్రాదులను వర్ణించినది[4]. దీనినంతను బట్టి యవను లనునొకజాతివారు, యవద్వీపమునుండికాని,

---

1. యవనాశ్చీనకాంభోజా దారుణా మ్లేచ్ఛజాతయః।
సకృద్గ్రాహాః కులత్థాశ్చ హూణాః పారసికైస్సహ। భీ. పర్వ. 9 అధ్యా.
అటవీం చ పురీం రమ్యాం యవనానాం పురం తథా. సభా. 31 అధ్యా.

2. యు జుగుప్సాయామ్. చురాది—నన్దిగ్రహిపచాదిభ్యోల్యుణిన్యచః. అష్టా. 3. 1. 134. గణపాఠే. యవనః—

3. కాంభోజాన్యవనాంశ్చైవ శకా న్నారట్టకా నపి. కిష్కిం. 43 సర్గ.
4. రత్నవంతం యవద్వీపం సప్తరాజ్యోపశోభితమ్
సువర్ణరూప్యకం చైవ సువర్ణాకరమండితమ్.
యవద్వీప మతిక్రమ్య శిశిరోనామ పర్వతః
తతో రక్తజలం శోణ మగాధం శీఘ్రగామినమ్. కిష్కిం. 40 స.

మఱియొకద్వీపమునుండికాని — అది దేశచరిత్రవేత్తలు నిర్ణయింపవలసినమాట[1] — క్రీ. పూ. వెయ్యేండ్లకు మున్నే యుత్తరహిందూదేశమునకు వచ్చి నిలచినవా రనవలెను గాని, గ్రీకుపారసీకవీరులతో వచ్చి యిందు స్థిరపడినవా రనిమాత్రము తలంచుట సరి గా దని తేలుచున్నది. కావునఁ బాశ్చాత్త్యులు నిర్ణయించిన రామాయణభారతకాల మీహేతువునుబట్టి యుక్తము కాదనుట నిశ్చయము. ఇంక—అష్టాధ్యాయిలో భారతకథకు సంబంధించినప్రధానపాత్రములనామములు కనరావు. కనవచ్చినవానియర్థ మచ్చట వేఱుగా నున్నది. కావున నిది దానితరువాతిదే—అన్నయాక్షేప మొకటి యున్నది. కాని, యిది యనాలోచితము. కొన్ని శబ్దములయర్థము వారి కట్లు కనఁబడినదేమో కాని, అనేకసూత్రములందును గణపాఠములందును గూడ భారతరామాయణములలోని స్త్రీపురుషదేశసంజ్ఞ లనేకములు కనవచ్చుచునేయున్నవి[2]. అది గాక, రామాయణభారతములు పాణినీయము తరువాతివే యైనచో దానికి విరుద్ధము లయినబహుప్రయోగములు వానియం దుండియుండవు. వానికాలమున వాడుకలో నున్నకొన్నిశబ్దములరూపములు పాణినినాఁటికి మాఱి యనుశాసనము గాంచినవి. వానిలో నున్న వట్లే యుండి యార్షము లనుపేరు గాంచినవి. అందుచే నీవాదము నిలచునది కాదు. ఇఁక నివి మనుస్మృతికిఁ బూర్వములా పరములా? యనుట విచారణీయము.

రామాయణములో మనువుపే రుండుటయు[3] మనుగీతములుగా రెండు శ్లోకములు కనఁబడుటయు[4] ఆశ్లోకములు మనుస్మృతిలో నుండుటయు, నిజమే కాని, శరవిద్ధుఁడై తన్ను గర్హించుచున్నవాలికి రాముఁడు రాజధర్మములు తెలుపు

---

1. సి. వి. వైద్యాపండితులు చూపినభరతఖండపటమునుబట్టియు, వారియభిప్రాయమును బట్టియు, గాంధారదేశమునకును, కుభానదికి నుత్తరముగా నున్నయవనదేశమునుండి యవనులు వచ్చి నట్లు తెలియవచ్చును. అది సత్య మైనను, వారు, పాణినిశాకటాయనులకుఁ బూర్వ మిక్కడికి వచ్చినవారే కాని క్రీ. పూ. 326 ప్రాంతమున వచ్చినవా రనిమాత్రము తలంచుటకు వీలులేదు.

2. అష్టా. 3. 1. 134, 162,—4. 1. 96, 105, 114, 168—175, 178—
4. 2. 80, 127, 138, 196,—4. 3. 93, 104,—6. 2. 38. మొద—

3. అయోధ్యాం మనునా రాజ్ఞా విర్మితాం సందదర్శ హ. అయో. 71-18.

4. శ్రూయతే మనునా గీతౌ శ్లోకౌ చారిత్రవత్సలౌ.
గృహీతౌ ధర్మకుశలై స్తథా తచ్చరితం హరే. కిష్కిం. 18-31.
రాజభి ర్ధృతదండా స్తు కృత్వా పాపాని మానవాః
నిర్మలా స్స్వర్గ మాయాన్తి సన్త స్సుకృతినో యథా.
శాసనా ద్వా విమోక్షా ద్వా స్తేనః స్తేయా ద్విముచ్యతే.
రాజా త్వశాస త్పాపస్య త దవాప్నోతి కిల్బిషమ్.
వా. కిష్కిం. 18-32, 33.—మను స్మృతి. అధ్యా 318. 316.

సందర్భమున నున్నయాశ్లోకములస్థితిగతులు పరిశీలింపఁగా నది వాల్మీకి మను స్మృతినుండి గ్రహించినవి కా వనుటకుఁ గొన్ని హేతువు లగపడుచున్నవి.

౧. మనుస్మృతికర్త యితరగ్రంథములనుండి కొన్నిశ్లోకములు గ్రహించె ననుటకు నిదర్శనములు కనఁబడుచున్నవి. పెక్కండ్రుపరిశోధకులు నట్లు భావించిరి కాని, వాల్మీకి తనరామాయణమున నితరలౌకికగ్రంథములలోనిశ్లోకములను గూర్చి నట్లు కనఁబడదు. పరిశోధకు లెవ్వరు నట్లు భావించి యుండలేదు.

౨. రామాయణములో రాజధర్మవర్ణనమునం దున్న 'రాజభిర్ధృత దండాస్తు' ఇత్యాదిశ్లోకములు రెంటిని మనుస్మృతి గ్రహించి యుండఁగా, ఈ విషయము పరామర్శింపనిమనుస్మృత్యభిమాని యొకఁడు పైశ్లోకములను మను స్మృతినుండియే రామాయణము గ్రహించిన దని భ్రమపడి "శ్రూయతే మనునా గీతౌ" అనుశ్లోకము కల్పించి రామాయణమునఁ బైశ్లోకములమొదట నతికి యుండవలెను. లేదా?

3. అయోధ్యానిర్మాత యగుమనువు పఠించినవిగాఁ జాటువులై తననాఁటికి వినవచ్చినపైశ్లోకములను మాత్రము పూజ్యస్మృతికై వాల్మీకి రామాయణమునఁ గూర్చియుండ దానినుండి వాటిని మనుస్మృతి సేకరించియుండవలెను.

౪. అయోధ్యానిర్మాత యగుమనువుగాని, సప్తమనువులలో నొకఁడుగాని, ఋగ్వేదద్రష్టలలోనిమనువుగాని, మనుస్మృతి రచియించె ననుట సప్రమాణము కాఁజాలదు[1]. కావున వాల్మీకి రామాయణమునఁ బేర్కొన్నమనువే మనుస్మృతి కర్త యనుట పొసఁగదు.

పై కారణములనుబట్టి రామాయణము మనుస్మృతికంటెఁ బరము కా దనుట విశ్వసనీయము. ఇఁక భారతము—

ఇందును రెండుమూఁడుచోట్ల మనువుపేరును, మనుప్రోక్తములుగా రెండు శ్లోకములును గనవచ్చుట సత్యమేకాని[2] అవి ముద్రితమనుస్మృతిలోఁ గనరావు. అందలివిషయ మైనను సరిగా మనుస్మృతిలోనిరాజధర్మవచనములలోఁ గనఁబడదు. మఱియు "ష డేతాన్ పురుషో జహ్యా" దిత్యాదితత్పద్యములు సరిగా నట్లే

1. చూ. సంస్కృతవాఙ్మయచరిత్ర, ప్రథమభాగము. అధ్యా. 9. 'స్మృతులు'
2. అపి చైత త్పురా రాజన్ మనునా ప్రోక్త మాదితః. శాంతి. 121. 10.
యుక్తోక్త మేత ద్వచనం ప్రా గేవ మనునా పురా. శాం. 121. 12.
ష డేతాన్ పురుషో జహ్యా ద్భిన్నాం నావ మి వార్ణవే,
అప్రవక్తార మాచార్య మనధీయాన మృత్విజమ్,
అరక్షితారం రాజానం భార్యాం చాప్రియవాదినీం
గ్రామకామంచ గోపాలం వనకామం చ నాపితమ్.
ఉద్యో. 32. 84, 85.—శాంతి. 57. 44, 45.

యుద్యోగపర్వమునఁ గూడఁ గలవు గాని, అక్కడ మనుప్రస్మరణమే లేదు. అందుచే వీనిస్థితియు నవిశ్వాస్య మగుచున్నది సరిగదా, ఉద్యోగపర్వములోని వీనిసందర్భము పరిశీలింపఁగా నివి తప్పక భారతకర్తవే యని తోఁచుచున్నది. ఏ మనఁగా ? శాంతిపర్వ మర్వాచీనరచిత మన్నవారు కలరు కాని, ఉద్యోగము ప్రక్షిప్త మన్నవారు కనరారు. ఇంతకు నివి మనుస్మృతిలో లేకపోయినా మనుస్మృతిలోనివే యని యంగీకరింత మన్నను, భారతప్రధానకథారచనము మనుస్మృతికంటెఁ బర మనుట కివి చాలవు. అదిగాక, భారతమునుండి కొన్నిశ్లోకములను మనుస్మృతి గ్రహించిన దనుట నిజ మగును గాని, మనుస్మృతినుండి భారతసంహిత గ్రహించిన దనుట సప్రమాణము కాఁజాలదు. కావున భారతసంహిత మనుస్మృతికంటెఁ బూర్వ మనుట కాక్షేప మేమి ? ఇఁకనో, తైత్తిరీయారణ్యకమునఁ బేర్కొనఁబడినపారాశర్య వ్యాస వైశంపాయనులు[1] భారతరచనప్రవచనకర్తలై యుందురా యనువిషయ మాలోచింతము[2]. సంహితాబ్రాహ్మణాదులలోనిపురుషులసంజ్ఞలు కొన్ని పురాణములోఁ గనవచ్చుటచే వారే వీ రనువిషయమందును, వారు వీరు కారనువిషయమందును గూడ విమర్శకులు తబ్బిబ్బుపడుచునే సాహసించి యేదో యొకమార్గము త్రొక్కుచువచ్చిరి. దీని కంతకును, పురాతనగాథ లెత్తుకొని తమనాఁటివిషయములు కూడ నందు చేర్చుచువచ్చినగ్రంథకర్తలరచనలును, నడుమ నడుమ వానియందు చేరినప్రక్షిప్తభాగములును గారణము. అందుచేఁ బ్రస్తుత మీవ్యాసవైశంపాయనవిషయము సందిగ్ధ మైనది.

ఇంతకు మున్ను మనము తెలిసికొన్నపరాశర పారాశర్య వ్యాస వేదవ్యాస ద్వైపాయన కృష్ణద్వైపాయన సంజ్ఞలనుగూర్చి వాయువిష్ణుపురాణాదులు చెప్పిన మాటలు చూచినచో నిరువదియాఱవద్వాపరమందు పరాశరుఁడు, ఇరువదియేడవద్వాపరమందు జాతూకర్ణుఁడు, ఇరువైయెనిమిదవద్వాపరమందు ద్వైపాయనుఁడు[3] క్రమముగా వేదవ్యాసు లైనట్లు కనఁబడును. ఇపు డీపరాశరుని కొడుకీద్వైపాయనవ్యాసుఁ డందు మేని, యితఁడు మూఁడు ద్వాపరము లొక్కజన్మములో నెట్టెఁగినవాఁ డనవలెను. పోనీ ! ఇతఁడు పరాశరునిగోత్రాపత్య మందు మేని భారతాదుల సర్వత్ర కృష్ణద్వైపాయనుఁడు పరాశరాత్మజుఁ డని యున్నది.

---

1. స హోవాచ వ్యాసః పారాశర్యః, విద్యుద్వధ మే వాహం మృత్యు మైచ్ఛ మితి. ప్రశ్న 1. అను. 9.
ఏత యైవాఽఽవృతా ఽఽసహస్రసూర్యతాయా ఇతి వైశంపాయనః. ప్రశ్న 1. అను. 7.

2. వీరును, వారే భారతకర్త లని భావించెను. చూ. H. I. Lit P. 184

3. కొన్నిటిలో, "కృష్ణద్వైపాయనః" అనియున్నది.

ఇరువైయెనిమిదవద్వాపరములోని మఱియొక పరాశరునికొడుకు కృష్ణద్వైపాయనుఁడు, ఇతఁడే పైయారణ్యకమునఁ బేర్కొనఁబడినవాఁ డని తలంతు మేని, అందు పారాశర్యవ్యాసుఁ డనియే యున్నది గాని, కృష్ణద్వైపాయనసంజ్ఞ కనరాదు. కనఁబడకున్న నితఁడే యతఁ డని యంగీకరింత మన్నను, అందు తెలుపఁబడినవిద్యావ్యాధవిషయము వైదికశాఖాసంబంధము గాని భారతసంహితాసంబంధి కాదు. ఇఁక వైశంపాయనవిషయము—ఇతఁడు యజుశ్శాఖతో సంబంధము కలవాఁడుగాఁ బురాణములలోను, చరణవ్యూహాదులలోను గనవచ్చును[1]. పైయారణ్యకమునఁ జెప్పఁబడినసూర్యవిషయముగూడ వైదికశాఖకుఁ జేరినదే కాని, భారతమునకు సంబంధించినది కాదు. అందుచేఁ దైత్తిరీయారణ్యకములోఁ బేర్కొనఁబడినవీరు భారతసంహితారచనప్రవచనకర్త లని విశ్వసించి, భారతసంహిత తైత్తిరీయారణ్యకముకంటెఁ బ్రాచీన మనుట సంగతముకాదు. విషయమిట్లున్నను, సి. వి. వైద్యాపండితులు, డిక్సిట్టుపండితునియభిప్రాయమునుబట్టి మూలకథ యగుభారతసంహిత క్రీ. పూ. ౧౪౦౦ ప్రాంతములోని దని భావించుచుఁ దైత్తిరీయారణ్యకములోఁ బేర్కొనఁబడినపారాశర్యవ్యాసుఁడే తత్కర్త యనియు, అందలివైశంపాయనుఁడే జనమేజయునికిఁ గథ చెప్పినవాఁ డనియు నభిప్రాయము తెలిపిరి[2]. కాని, భారతకథ యెప్పటిది? కౌరవవంశము నిలిపినట్లున్న యితనికి మూలకథతోఁ గనవచ్చుముఖ్యసంబంధముమాట యేమి? కథాకాలమునకును గ్రంథరచనకాలమునకు నంతర మున్నదా లేదా? తైత్తిరీయారణ్యక మెప్పటిది? అనువిషయము లాలోచించినట్లు కనఁబడదు. ఈ యారణ్యకమందలిపారాశర్యుఁడు మత్స్యగంధిపరాశరులకు జన్మించి కౌరవవంశము నిలిపిన కృష్ణద్వైపాయనుఁ డని మనము విశ్వసించిన విశ్వసింపవచ్చును గాని, యితఁడే భారతసంహితారచయిత యన వీలులేదు. ఇందలివైశంపాయనుఁడు కూడ నీపారాశర్యుని శిష్యుఁడై యితఁ డుపదేశించినభారతకథను లోకమునఁ బ్రవర్తింపఁజేసెనేమోయని నమ్మవచ్చునుగాని, యితఁడే భారతసంహితాగ్రంథమును జనమేజయునికి వినిపించినవాఁ డన వీలు లేదు[3]. ఇందుకుఁ దైత్తిరీయారణ్యకము క్రీ. పూ. పదునాల్గవశతాబ్ది కీవలిది కాకపోవుటయే కారణము. ఇఁకనో, బృహదారణ్యాచ్ఛాందోగ్యాదులందు కనవచ్చురామభారతకథలలోని కొన్నిముఖ్యపాత్రములపేళ్లను బట్టి వానికంటెను, తైత్తిరీయారణ్యకముకంటెను గూడ నీకథలు ప్రాచీనము లవి చెప్పవచ్చును. కావున వీనికాల మిట్లు తెలిసికొందము.

---

1. చూ. సం. వా. ప్రధ. ఫుటలు. 177—184
2. The Mahabharata. A Criticism P. 16, 17,
3. అతఁడు మఱియొక వైశంపాయనుఁడు కావచ్చును.

పాణిని క్రీ. పూ. సప్తమశతాబ్ది కావలివాఁడుకాని యీవలివాఁడుకాఁడు. అతనియష్టాధ్యాయికంటె నాపస్తంబసూత్రమును దానికంటె మనుస్మృతియుఁ బూర్వములు[1]. మనుస్మృతి దశమశతాబ్దిని దాఁటి యీవలికి రాదు. కావున దానికిఁ బూర్వము భారతసంహితయు దానికిఁ బూర్వము రామాయణమును జనియించి యుండును. ఆకాలము వెనుకకుఁ గ్రమముగాఁ క్రీ. పూ. ౧౧, ౧౨ శతాబ్దులు కావచ్చును. ఇందుకు విద్వల్లోకమే ప్రమాణము. వాష్‌బర్న్ హాప్కిన్సు పండితుఁడు, "రామాయణము పన్నెండు లేక పదమూఁడగు శతాబ్దిలోని దని కొందఱు హైందవపండితులును పాశ్చాత్యపండితులును గూడ హాస్యాస్పదముగా భావించిరి" అనుచు వ్రాసెను[2]. కాని, అతనిమాట యాదరణీయము కాదు. అయిన నిక్కడ నొక్కమాట. ఇపుడు మనకంటికి గోచరించుచున్న లక్షగ్రంథమగు మహాభారతము పదునొకండవశతాబ్దిలోఁ బుట్టిన దని నాయభిప్రాయము కాదు. ఇరువదినాలుగువేలభారతసంహితాగ్రంథము మాత్రము నాఁటి దనియుఁ దరువాతఁ గొందఱు విమర్శకు లూహించినట్లు క్రీ. పూ. మూఁడవశతాబ్ది కించుక యీవలివఱకుఁ గూడ నడుమనడుమఁ గొంతకొంత గ్రంథము చేరుచు వచ్చె ననియు విశ్వసింపవచ్చును. ఇఁక నొక్కొక్కదానినే పరిశీలింతము.

## రామాయణము

ఇది వాల్మీకిమహర్షికృత మనువిషయమున వివాదము లేదు. సకలపురాణేతిహాసము లాదికావ్య మని ప్రశంసించుటనుబట్టి యిది లౌకికభాషలో మొట్టమొదట నుదయించినకావ్య మనువిషయమునఁ గూడ సంశయము గలుగరాదు.

"మానిషాద! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌఞ్చమిథునా దేక మవధీః కామమోహితమ్"

అనుశ్లోకము వేదములతరువాత నవతరించిననూతనచ్ఛంద స్సని భవభూతి రాజశేఖరాదికవీంద్రులు పలికియున్నారు. అయితే, బాలకాండద్వితీయసర్గలోని యీశ్లోకము చూచి వా రట్లు ప్రశంసించినంతమాత్రమున నిదియే మొదటి దని విశ్వసింపనగునా? అని సంశయము కలుగవచ్చును. సత్యమే. దీనినిబట్టి, ఇట్లు వర్ణించుట ప్రాచీనులశైలియా? లేక, వాల్మీకి తనకావ్య మాద్యము కాకపోయినను, ఇట్లు వర్ణించి లోకప్రతారణము కావించెనా? లేక, మ తెవరయిన నిట్లు వర్ణించి యీశ్లోకముతోడికథను రామాయణమునఁ జొనిపిరా? అని యిచ్చట మూఁడుప్రశ్న లుదయించుచున్నవి.

---

1. మా. సం. వా. ప్రథ. 291,—309—319.
2. The great Epic of India, Ch. II. P. 61.

విషయము ప్రౌఢముగా నుండుటకై పూర్వగ్రంథకర్తలు, కొందఱితరులు చెప్పినట్లు ప్రథమపురుషక్రియ లుపయోగించి వర్ణించుట కలదు గాని, స్వవిషయమున నిట్లసత్యమైనదానిని వర్ణించుట కనరాదు. అదిగాక ప్రాచీనగ్రంథకర్త యెవ్వఁడును, తాను గనిపెట్టనివిషయము తానే నూతనముగాఁ గనిపెట్టినట్లుగా వర్ణించుకొన్నట్లెందును గనఁబడదు. తుదకుఁ గొందఱిమతమున నాద్యమైనభారతసంహితలోఁ గాని, మఱి యేయితరలౌకికభాషాగ్రంథములోఁ గాని, లౌకికకవిత్వము వాల్మీకితోనే పుట్టిన దని చెప్పెడియిట్టిమాటలు కనఁబడవు. కావున నిది ప్రాచీనులశైలి యన వీలులేదు. ఇంక, వానప్రస్థుఁడై నిష్కాముఁడై లోకానుగ్రహాకాంక్షియై తనవిజ్ఞానమును బ్రసాదించి లోకమును దరింపఁ జేయ నెంచిన ప్రాచేతసమహర్షి యైహికాముష్మికములు రెంటికిని గాని యిట్టిమాటలు చెప్పి లోకవంచన మాచరించె ననుట కలలోనైన స్మరింపరానిది. అట్లననేల? కథాభాగములు కల్పించినట్లే కవిత్వోత్పత్తికథను గల్పించియుండు నందు రేని, పాఠకప్రరోచనార్థ మయినకథాభాగకల్పనమునకును, ఆత్మమహత్త్వప్రశంసాపరమైన యేతత్కథాకల్పనమునకు నెంతేనివాసి కలదు. కావున నతని కట్టిదోష మంటఁగట్టుటకంటెఁ గృతఘ్నత వేఱుండఁబోదు. ఇఁకనో, ఈభాగము ప్రక్షిప్త మనునది యున్నది. బాలకాండములోని కొన్నిభాగము లర్వాచీనులు రచియించిన వనెడియొకవాదమునుబట్టి యెవ రేని రామకథకు సంబంధించినమొదటిభాగము కల్పించి రనవలెను గాని, గురుపరంపరాగతమైన యీకవిత్వోత్పత్తిసంప్రదాయము నెఱుఁగకయే స్వప్రతిభచేతనే యీకథకూడఁ గల్పించియుందు రనుట యుచిత మగునా? కావున బ్రహ్మ ప్రత్యక్షమై తన్ను రామచరితము వర్ణింపఁ బ్రోత్సహించె నన్నయతిశయోక్తి యించుక యున్నను, క్రౌంచపక్షికథతోడిమానిషాదేత్యాదిశ్లోకము వాల్మీకి నోటనుండి వచ్చినదే కాని యన్యులది కా దనుట నమ్మి, రామాయణ మాదికావ్య మని విశ్వసించుటయే సరియగును. ఇఁక నిందు ప్రక్షిప్తభాగములు కల వనువాద మెంతవఱకు సత్యమో పరిశీలింతము.

## ప్రక్షిప్తభాగవిచారణ

రామాయణము శతకోటిశ్లోకపరిమిత మనియు, ఆయాదేవగంధర్వాదిలోకములం దేఁబదికోట్లు పదికోట్లు కోటిగా వ్యాపించిన దనియుఁ జెప్పుచు, మానవలోకమందు విస్తరించిన దిరువదినాలుగువేలశ్లోకములగ్రంథమే యని బ్రహ్మాండపారశర్యోపపురాణాదులు నిర్ణయించినవి. ఇది చతుర్వింశతిసాహస్రికసంహిత యని దీనికాండాంతగద్యములు వక్కాణించినవి. గాయత్రీమంత్రములోనియిరువదినాలు గక్షరములు క్రమముగా నొక్కొక్కశ్లోకసహస్రము మొదట నున్న వని గాయత్రీరామాయణము నిరూపించినది. వీటినిబట్టి రామాయణ

మూఁ డుకాండము లిరువదినాలుగు వేలశ్లోకము లని లోకప్రసిద్ధి కలిగినది. కాని, బాలకాండచతుర్థసర్గలోని యీక్రిందిశ్లోకము—

"చతుర్వింశత్సహస్రాణి శ్లోకానా ముక్తవా నృషిః,
తథా సర్గశతా న్పఞ్చ షట్కాణ్డాని తథోత్తరమ్,
కృత్వాపి తన్మహాప్రాజ్ఞ స్సభవిష్యం సహోత్తరమ్"

వాల్మీకి వర్ణించినరామచరిత మిరువదినాలుగువేలశ్లోకము లయిదువందల సర్గ లాఱుకాండములు, మఱియు భవిష్యదుత్తరభాగముతోడియుత్తరకాండము." అనిచెప్పుచున్నది. దీనిని సరిచూచుటకు నేను గణింపఁగా వచ్చినమొత్తము లివి[1].

| షట్కాండ సర్గలు, | శ్లోకములు సుమారు, | అధిక పాఠ శ్లోకములు సుమారు, | ఉత్తరకాండ సర్గలు, | శ్లోకములు సుమారు, | అధిక పాఠ సర్గలు, | శ్లోకములు సుమారు, |
|---|---|---|---|---|---|---|
| ౫౩౭ | ౨౦౭౦౦ | ౫౦౦ | ౧౧౧ | ౪౫౦౦ | ౧౩ | ౧౨౨౮ |

చూచితిరా మొత్తములు ? సర్గలందుమా, ఆఱుకాండములలోనే ౩౭ ఎక్కువ. ఉత్తరకాండసర్గలు కలిపినచో ౬౪౮ అగును. శ్లోకము లందుమా, షట్కాండములలో ౨౪ వేలకు మిక్కిలి తక్కువ. ఉత్తరకాండశ్లోకములు కలిపినచో సుమారు ౨౫ వేలగును. రెంటియందును గూడ నధికపాఠశ్లోకములు నిజముగా నధికములే. అవి కలుపఁదగినవి కావు. అందుచేఁ బైశ్లోకము చూపిన లెక్క లెట్లున్నను, అవి యాఱుకాండముల నుద్దేశించినవే కాని, ఏడుకాండముల నాశ్రయించినవి కా వనుట నిజము. అయితే పూర్వోక్తసాక్ష్యములగతి యేమి ? అందలిసర్గశ్లోకసంఖ్యలభేదములకు గతి యేమి ?—ఇందు కూహయే గతి. వేద మంత్రములలెక్కల కనుక్రమణికలు నిర్ణయించినవారివలెనే, దీనిలెక్కలు చూపిన వారు గూడ నన్యులే కాని, వాల్మీకియే యీలెక్కలు చూపినాఁ డనుటకు వీలు లేదు. తరువాత నెవరో సర్గలు శ్లోకములు గణించునాఁటి కిది పైలెక్కలకు సరిపడి యుండు ననియుఁ, బిదప మఱియొకకాలమునకు ౩౭ సర్గలు పెరుగుటయు నింకొక కాలమునకు సుమారు మూఁడువేలశ్లోకములు తఱుఁగుటయు సంభవించియుండు ననియు నూహింపవలసియున్నది. ఇందుకు షట్కాండములలోనియధికపాఠములే నిదర్శనము. కావునషట్కాండములలోఁదెలియనిలుప్తభాగముల మాట యేమైనను[2] తెలియుచున్నయధికపాఠములు ప్రక్షిప్తము లనుట స్పష్ట మనియు, కుండలీకృతములై ముద్రితపుస్తకములఁ గనవచ్చుశ్లోకములే కాక, బాలకాండము మొదటిసర్గలలోఁ గుండలీకృతములు గానికొన్నిభాగములుకూడ నట్టివే యనియు,

1. శ్లోకములమొత్తము లేప్రతినిబట్టి చూచినను, ఒకటిరెండువందల తేడాతో సరిపడును.

2. ఇప్పు డధికపాఠశ్లోకములు లేని సుమారు 20 వేలగ్రంథమే వాల్మీకికృత మని యూహించుటయు నసమంజసము కాదు.

ఉత్తరకాండ మంతయుఁ గూడ వాల్మీకిరచియించినది గా దనియు విశ్వసింపవలసి యున్నది. ఇవు డీమూఁడువిషయములు నిశ్చయింప నించుక యత్నింతము.

కైకేయి రామప్రవాసాదివృత్తాంతము చెప్పినపిదప—భరతుఁ డామాటలు విని దుఃఖితుఁడై యిట్లు పలికెను—అనునర్థముగలమాటలతోఁదరువాతిసర్గయారంభమగును [1]. అట్లగుటయే యచ్చోట సముచితము. కాని, పైమాటలకు ముందు పదిశ్లోకములు చేరినవి. అవి కుండలీకృతములే కాని, కాకున్నను, అందలి విషయము భరతుని కుచితము గాక తప్పక ప్రక్షిప్తమే యనిపించుకొనును. ఇట్లు కుండలీకృతము లైన వన్నియు [2] పునరుక్తములో యసంగతములో యనుచితములో యై కనవచ్చుట పాఠకలోకి మెఱుఁగనిది కాదు. ఇంక—

బాలకాండము మొదటిసర్గలో, సకలసద్గుణపరిపూర్ణుఁ డైనమహావీరుఁ డెవఁ డన్నవాల్మీకిప్రశ్నకు శ్రీరాముఁ డట్టివాఁ డని నారదుఁడు సమాధాన మిచ్చుట, దశరథుఁ డతనిని యౌవరాజ్యాభిషిక్తుని జేయ నెంచుట మొదలుగా రావణవధానంతర మతఁడు వచ్చి రాజ్యము స్వీకరించి ప్రజారంజకముగాఁ బరిపాలన మొనర్చె నన్నంతవఱకుఁ గలరామచరితములోనివిషయముల నెల్ల వివరించునొకవిషయసూచిక వర్ణింపఁబడినది. రెండవసర్గలో, క్రౌంచపక్షికథ 'మానిషాద' శ్లోకావిర్భావము బ్రహ్మసాక్షాత్కారము మొద లగువిశేషవిషయములు వర్ణింపఁబడినవి. సర్వవిధముల గ్రంథావతారికగా నున్నయీరెండుసర్గలు రామాయణమునకుఁ బునాదులై యెంతయు నొప్పుచున్నవి. ద్వితీయసర్గాంతమందలి—

"రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్"

అనువాక్యముతోఁ బంచమసర్గ మొదట నున్న—

సర్వా పూర్వ మియం యేషా మాసీ త్కృత్స్నా వసుంధరా"

ఇత్యాదికథారంభశ్లోకములు సరిగా నతుకుచున్నవి. ఇట్లుండఁగా మూఁడవసర్గయంతయు మరల విషయసూచికయై కథ కడ్డ మైనది. రెండవసర్గలోనివిషయసూచికలో లేనియక్కఱమాలినచిన్నవిషయము లేవో నాలు గున్నను, మొత్తముమీఁద నీరెండవవిషయసూచిక మొదటివిషయసూచికకు భంగ్యంతరముగాఁ గల్పింపఁబడినదే కాని యన్యము కాదు. కాని దీనిచివర—

1. "తత్పుత్ర శీఘ్రం విధినా...ఆత్మాన మభిషేచయస్వ. అయో. 72 చివర—
శ్రుత్వాతుపితరం వృత్తం భ్రాతరౌ చ వివాసితౌ, భరతో దుఃఖిత స్తప్త ఇదం వచన మబ్రవీత్. అయో. 73—11 శ్లో.

2. ఈకుండలీకరణము కూడ నియతముగా లేదు. వావిళ్లవారియాంధ్రాక్షరపుస్తకములోని కుండలీకరణములు కలకత్తా నాగరాక్షరప్రతిలోఁ గొన్నిచోట్లఁ గనరావు. అందలిని యిందలివి గూడఁ గొన్ని బొంబాయిప్రతిలోఁ గనఁబడవు. లిఖితపుస్తకములలోఁ గుండలీకరణములే కనఁబడవు. అందుచే నిది యవ్యవస్థమై యనియతముగా నున్నను ప్రక్షిప్తములే లే వని యూహింపరాదు.

"వైదేహ్యాశ్చవిసర్జనమ్, అనాగతంచ యత్కించి ద్రామస్య వసుధాతలే,
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకి ర్భగవా నృషిః"

సీతను విడిచిపెట్టుట రామునిసంబంధ మగుననాగతము ననునవి యుత్తర కాండమునఁ గవి వర్ణించె నన్నుక్తమాటలుమాత్రము చేరినవి. దీనివలెనే నాల్గవ సర్గయుఁ కథ కడ్డము వచ్చినది. అందు షట్కాండలసర్గశ్లోకసంఖ్యలు చూపఁ బడినవి. ఉత్తరకాండము గూడ వాల్మీకి రచియించె నని చెప్పఁబడినది. మఱియు, కుశలవులు రామాయణకావ్య మందందు గానముచేయుచు నయోధ్యాపురమున వీథులలోఁ దిరుగుచుండ రాముఁడు వారిని జూచి పిలిపించి వారిచే రామచరితమట పాడించె నని వర్ణింపఁబడినది. ఇట్లున్నదీనిలో మరల నాఱుశ్లోకము లధిక పాఠముగాఁ గుండలీకృతము లైనవి. ఇట్టియీసర్గలసంగతిసందర్భములు పరిశీలించినచో నివి రెండును బ్రక్షిప్తము లని తోఁచకపోదు. ఇందు కుత్తరకాండము వెలసినపిదప నీసర్గలు రెండు నిందు చేరినట్లు కనవచ్చుటయే తార్కాణము. కావున నుత్తరకాండముమాట యొకింత చూతము.

'ప్రాప్తరాజ్యస్య రామస్య [1]' ఇత్యాదిశ్లోకముతో నుత్తరకాండ మారంభ మైనది. శ్రీరాము నభినందించుట కన్నిదిక్కులనుండి వచ్చినఋషివర్యు లింద్రజి ద్రావణాదిరాక్షసవీరుల యుదంతములను హనుమదాదిశూరుల వృత్తాంతములను వర్ణించుటతో ౩౦ సర్గలు గడచినవి. అట్టివీరుల నీ వణఁగించితి వని రాముని స్తుతించుటకుఁ దప్ప, ఆరాక్షసుల్వర్ణనల కుత్తరకథతో నెట్టిసంబంధమును లేదు. అయినా, సగముగ్రంథము దానికే వినియుక్త మైనది. తరువాత సీతావిసర్జన కథాబీజ మంకురించినది. దానికి ౧౨ సర్గలు పట్టినవి. అంత నృగనిమ్యాదుల కథలతోఁ గొన్ని గతించినవి. ఇట్లుఇువదియైదుసర్గలు వెళ్లినతరువాత, కుశలవ జన్మవృత్తాంత ముదయించినది. తరువాత నేవో కథలు. పిదప ౯౯ వ, సర్గనుండి భవిష్యదుత్తరకథ. వీనినడుమ నడుమ నధికపాఠసర్గలు. ఈవిధముగాఁ బూర్వ రామాయణకథారచనముతో నెట్టిపోలికయు లేనిడొంకతిరుగుడు రచనయు, అందలికవిత్వప్రౌఢశైలి కేరీతి నీడుగానిసామాన్యశైలియు, అందలిమాధుర్య ములో నావగింజం తైనలేనివర్ణనలును గలిగినయుత్తరకాండము వాల్మీకిమహర్షి కృత మని రెండును జక్కఁగాఁ బఠించినవిమర్శకు లెవ్వరును జెప్పసాహసింపఁ జాలరు. అట్లెవరైనఁ జెప్పిరా, వారు చిరకాలముగా వచ్చుపురాణప్రసిద్ధికి విరుద్ధముగాఁ జెప్ప జడియుటయే యందుకుఁ గారణ మగును గాని వేఱు కాఁబోదు. కావున రామాయణమహాభారతములు దేశమున బాగా వ్యాపించినపిదప వానిం జదివినయొకవిద్వాంసుఁడు, భారతకథతోఁ గృష్ణద్వైపాయనునికిఁగల సంబంధము జూచి రామకథతో వాల్మీకికి సంబంధము కలిగించుటకై యుత్తరకాండకథ

1. కలిగా పిథాగమూలోనే బాలకాండ చతుర్థసర్గాదిశ్లోక మారంభమైనది.

కల్పించివర్ణించి యుండుననియు, పూర్వరామాయణము నుత్తరకాండమును జదివినతరువాతిపండితుఁ డొకఁడు, ఉత్తరకాండకథాప్రసక్తి కలుగునట్లు బాలకాండమునఁ దృతీయచతుర్థసర్గలుకల్పించి చేర్చి యుండు ననియు నమ్మవచ్చును. ఈ విశ్వాసము నక్కఱలేనివిషయసూచికతోఁడితృతీయసర్గతుదిశ్లోకములును, అసంగతముగా నున్నచతుర్థసర్గోపక్రమోపసంహారములును బలపఱుచును గావున దీనిని గూర్చి యింతకంటె వ్రాయఁబనిలేదు. ఈవిషయమున జర్మనీభాషలో రామాయణావిమర్శనము వ్రాసినజాకోబీపండితుఁడు వ్రాసినహేతువు లేమో తెలియరావు గాని, అతఁడు త్తరకాండము సుతరాము వాల్మీకి వ్రాసినది గా దనియు, బాల కాండము గాక తక్కినయైదుకాండము లొక్కసారి యుదయించిన వనియు, బాలకాండములోనిపెక్కుభాగములు తక్కినకాండములవిషయమునకు సరిగాఁ బొసఁగకున్న వనియు వ్రాసినట్లు మాగ్డోనలుపండితుఁడు చెప్పియున్నాఁడు[1]. కాని బాలకాండ మంతయుఁ బ్రక్షిప్త మనుట శక్యము గాదు. ఇఁకఁ గథను గూర్చి యాలోచింతము.

## కథాసంవిధానము

ఇక్ష్వాకురాజవంశమునకు సంబంధించినయీరామాఖ్యానము బహుపురాతన మైనది. సరయూనదీతీరమందలియయోధ్యాపురము రాజధానిగాఁ గోసలదేశము పరిపాలించినదశరథమహారాజునింటఁ బుట్టినది—దశరథునిపెద్దకొడు కగు శ్రీరాముఁడు మిథిలాపురరాజగుజనకునికూఁతు రగుసీతాదేవిని బెండ్లాడి, సవతితల్లికోరికనుబట్టి పదునాలుగేండ్లు రాజ్యము విడువ నిష్టపడి పితృవాక్యపరిపాలన మాచరింప ధర్మపత్నీసమేతుఁడై తమ్ముఁ డైనసౌమిత్రి వెంట రా నడవుల కేగి యందు వసియించుచు, రావణుఁ డనురక్కసుఁడు తనభార్య నపహరింప సుగ్రీవుఁ డనుకపిరాజుతో మైత్రి చేసి వానరసేన సహాయముగా రావణుని సంహరించి తన సాధ్విని దోడ్కొని యయోధ్య కేతెంచి మూర్ధాభిషిక్తుఁడై ప్రజారంజకముగాఁ జిరకాలము పరిపాలన మొనరించెను—అనునది యీయాఖ్యానమునకు మూలము. ఈమూలకథ వాల్మీకినాఁటికిఁ బెద్దలవల్లఁ గర్ణాకర్ణికగా వచ్చినదే కాని, అతని నాఁటిది కా దని యతఁడు, రచియించినబాలకాండపంచమసర్గావతారికవల్లను, అతఁడే యందం దుపయోగించినయితిహాసాఖ్యానశబ్దములవల్లను గూడఁ జక్కఁగా సూచింపఁబడుచున్నది. రామాయణ మితిహాస మని వివిధపురాణాదులును వక్కాణించియున్నవి. ఇతిహాస మనఁగాఁ బురావృత్తము కదా! అయిన నిది సత్యమా లేక కల్పితమా? అని కొందఱు శంకింపవచ్చును. కాని, సుశీలుండు శూరుఁడు నగునొకయుత్తమక్షత్రియునికృత్యములను దెల్పుచున్నయీమూలకథ

1. See. Sansk. Lit. P. 304.

మానవాతీతముగాఁ జిత్రించి సత్య మని భరతఖండమున కస్థిగత మైన విశ్వాసము నకు విరుద్ధముగా నిది కల్పిత మని యూహింపవలసినంత ప్రబల హేతు వేమియుఁ గనఁబడదు. వాల్మీకియు—

"ఇక్ష్వాకూణా మిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనాం
మహ దుత్పన్న మాఖ్యానం రామాయణ మితి శ్రుతమ్"

ఈ రామాయణమహాఖ్యాన మిక్ష్వాకురాజవంశమం దుత్పన్న మైనదిగా వినవచ్చుచున్న దనుచు నిది సత్య మైనపురావృత్త మనెడివిశ్వాసమునే వెల్లడించి యున్నాఁడు. ఇది గాక, ఐక్ష్వాకులచరిత్రములు ఋగ్వేదాదులందును, ఆవంశము వారిరాజధాని యైనయయోధ్య యుత్తరదేశమందును బ్రత్యక్ష మగుచుండ నవి కల్పితము లనఁజాలముగదా! ఇఁక నావంశమందు శ్రీరాముఁ డనుమహావీరుఁ డవతరించి లోకోత్తరవర్తనుఁడై కీర్తనీయుఁడయ్యె ననునది మాత్రము కల్పిత మనఁదగునా? ఇంతయేల? అపూర్వకాలమహర్షులు కేవలకల్పితవృత్తములను వర్ణించినవారు కా రనుట విశ్వసనీయ మగుచుండ, నీరామాయణమూలకథ సత్య మనువిషయమున మనకు సంశయ మెందుకు? ఇఁకనో, గ్రంథమందలికొన్ని యద్భుతవర్ణన లట్టిసందేహమున కెడ మిచ్చుచున్న వందురేని వానిని సమర్థించు కొందముగాక.

శుద్ధసత్త్వప్రసన్న మయ్యుఁ బ్రచండశౌర్యభాసుర మైనశ్రీరామునిచరిత మపూర్వ మసాధారణ మాశ్చర్యానందదాయక మచింత్య మతిపావనమునై యాదినుండియుఁ బ్రాజ్ఞులహృదయ మాకర్షించుచు వచ్చి క్రమముగా వాల్మీకి నాఁటికి మహామహిమాభిరామ మైనపరమేశ్వరచరితమై ప్రత్యక్ష మైనది. కావు ననే యట్టిమహానాయకుఁ డవతారపురుషుఁడు కానోపు నని భావించి, శిష్టరక్షణ దుష్టశిక్షణార్థమై శ్రీమహావిష్ణువే దశరథునియింట శ్రీరాముఁడై యవతరించె నని వాల్మీకి కథారంభము గావించెను. అది సముచితమే. ఏదోయొక్కొక్కఘన కార్యము గావించిన మహాపురుషు లెల్ల నీశ్వరాంశసంభూతు లని కొనియాడఁ బడియుండ సకలసద్గుణపుంజము సచ్చిదానందమూర్తియు నైన శ్రీరాముఁ డీశ్వరావతార మని భావింపఁబడుట కబ్బుర మేమి? అందుకే పరమేశ్వరాను గ్రహపాత్రు లైనఋషులజ్ఞాననేత్రములనుండి ధర్మాధర్మబోధకము లైనవేదము లావిర్భవించినట్లే వేదవేద్యుఁ డైనపరమపురుషుఁ డవతరించినంత వేదతుల్య మైనరామాయణము ప్రాచేతసునినోట నావిర్భవించె నని తత్త్వజ్ఞులు తలంచిరి. ఇదియును సముచితమే. ఒకవిశేషప్రతిభాశాలిబుద్ధి కైన నూహింప నలవిగాని యామహావతారపురుషులయామానుషాతీతకృత్యములే కదా, భగవంతుఁ డొకఁ డున్నాఁ డని యనుమానప్రమాణముచే సాధించినవిషయమును బ్రత్యక్షప్రమా ణముచే స్థిరపఱిచెడియాస్తికుల కాధారములై యితిహాసపురాణాదిరూపమున

నిజగ మెల్ల నాక్రమించినవి! లేదేని, ఆ స్థితమతి మేమై యుండునో [illegible] తొలుదొల్తఁ గథానాయకుఁ డీశ్వరావతార మని నిరూపింపఁబడినపిదప [illegible] గథలో భగవద్విలాసములుగా నహల్యాశాపవిమోచనాదు లగునద్భుతవిషయములు కొన్ని వర్ణింపఁబడిన వన్న నసంగత మేమి? అది గాక, కావ్యదృష్టితోఁ జూచినను, అద్భుతవర్ణన లాకాలమునఁ బాఠకరంజకము లగుట కవికావ్యసృష్టిలోని విశేషవిషయ మేకదా! కావున నిష్కాముఁడును లోకానుగ్రహాకాంక్షియు నైన వాల్మీకిమహర్షి, ధర్మార్థవిజ్ఞానమున లోకము తరించుఁగాక యని సంకల్పించి నిర్మించినరామాయణేతిహాసము కథానాయకమహామహిమచిహ్నము లయిన కొన్నియద్భుతవర్ణనలతో విలసిల్లినను, అందలిమూలకథ కల్పితము గాక సత్య మనియే విశ్వసింపనగును. ఇఁక నాంతరవిషయము లించుక పరిశీలింతము.

పర్యవసానమునుబట్టి దుష్టనిగ్రహముతోడిశిష్టపరిపాలనమే యీకథకు ఫల మని తెలియవచ్చునుగాని, కథాసంవిధానదృష్టితోఁ బరిశీలించినచోఁ గైకేయీవర మీకథకు బీజ మని చెప్పకతప్పదు. దాని కంగములుగా నెన్నేనికారణము లుండుఁగాక; ఆవరమే లేనిచో రామకథ సీతాకల్యాణముతో సమాప్తము కావలసినదే. కైకేయీపాత్రవృత్తముచూచుట కిసుమంతయైనను, నీళ్లమీఁది నూనెచుక్కవలెఁ గథయంతటఁ బ్రాఁకినది. మూర్ధాభిషేకవార్త విన్నపుడును బదునాలుగేండ్లడవుల నివసింపు మనుమాట విన్నపుడును గూడ హర్షవిషాదము లించుకేని లేక యొక్కతీరున నున్నశ్రీరామునంతటిమహానుభావుఁడుగూడ మానవస్వభావమునకు లోనై వనవాసము చేసినన్నాళ్లు నెడనెడ సవతితల్లిమూలముగా సంభవించినమనసులోనినొవ్వు వెలిపుచ్చక మానలేదనుటయే యిందుకు నిదర్శనము.

సుఖ మున్నదో లేదో, దానిమాట యటుండనీ! లోకములోఁ గలహమునకుఁ గాని కష్టమునకుఁగాని స్త్రీయే మూల మనెడిసిద్ధాంతము నెలకొల్పుటకో యన రామమూర్ధాభిషేకసమయమున మెల్లగాఁ గైకేయీపాత్రము రంగమునఁ జొచ్చి దేవాసురయుద్ధమున దేవతలకు సహాయుఁడై కీర్తి గాంచినదశరథునివంటి రాజాధిరాజునుగూడ నోరు మూయించినది. రాము నడవికిఁ బంపినది. కౌసల్య కడుపునఁ జిచ్చు పెట్టినది. వసిష్ఠవామదేవులవంటిమహర్షులను గూడ నిశ్చేష్టులను గావించినది. ఇంత యేల? ఆదిని రాజును మ్రింగినది, అంతమున రావణుని నిర్మూలము గావించినది. దీనిమహిమ యింతేనా? బంగారమువంటిభరతుని వైరాగిని జేసినది. సీతారామలక్ష్మణులను మెల్లమెల్లగా జనస్థానమువఱకు గెంటుకొనిపోయి యక్కడఁ జేయూఁతయిచ్చి పంచవటీఘట్టమును లేవనెత్తి [illegible] నుండి [illegible]—అది కిష్కింధ[illegible] [illegible]

ఘటనాచతుర మైనయీవరముగాక కథాబీజము మఱేదగునో చూడుఁడు. కైకేయీవరమే లేనిచో నయోధ్యాకాండమున కాహార మేది? అరణ్యకాండమున కవలంబన మెక్కడిది? కిష్కింధాకాండకుఁ గీర్తి యేమి? సుందరకాండకు సొగ సెక్కడ? యుద్ధకాండముపద్ధతి యెట్లు? ఆహా, ఆద్యమహాకవిచతురాస్యుని కథాసంవిధానవైచిత్రి! ఇంక—

## పాత్రౌచితి

నవరసముల కాటపట్టయినయీమహేతిహాసమందలిపాత్రము లొక్కొక్కటి యొక్కొక్కగుణవిశేషమునఁ దీర్చి దిద్దిన ట్లున్నవి. అందు కొన్ని—

దశరథుఁడు—ప్రేమపాశసత్యపాశములు కంఠమున కురులై చెఱియొక ప్రక్క లాగుచుండ నేమిచేయుటకుఁ దోఁచక యూపి రాడక గిజగిజలాడి తుదకుఁ బ్రేమపాశమునకుఁ బ్రాణ మర్పింప నిశ్చయించుకొని నోరు మూసికొని ముందుగా సత్యపాశమునకు సాఫల్యము సమర్పించెను. ఈగుణ మెవరో మెచ్చుకొనుట యాశ్చర్యకరము కాదు. పుత్రవియోగదుఃఖితయై మైమఱచి పతిని నిందించి కొంతవడికిఁ దెలివి తెచ్చుకొని "దేవా! పుత్రశోకార్తనై నే నేదో ప్రేలితిని. అకటా! శోక మెంతటియకృత్య మైనఁ జేయించునుగదా? కాని, ధర్మమెఱుఁగుదును. ధర్మజ్ఞుఁడ వైననీవు సత్యవాది వనియు నెఱుఁగుదును" అనుచు రామమాత యైనకౌసల్య మెచ్చుకొనుటయే విశేషము.

కైకేయి—ఈపాత్రము రామాయణములోనియితరపాత్రములకును లోకమునకును గూడ నిందాపాత్ర మైనమాట నిజము. ఇందుకుఁ గనబడుముఖ్యకారణము రాజ్యలోభమే. కాని, కైక యుత్తమక్షత్రియాంగన. తనపుత్త్రునికంటెఁ గూడ రాము నెక్కువగాఁ బ్రేమించినయుదారహృదయ. తాను జేని కెక్కుడనురాగభాజన మైనను, కౌసల్యయెడ గౌరవము చూపిన వివేకిని. శ్రీరామునియభిషేకవార్త తెలిపినమంథర కతిహర్షముతో మణిభూషణ మిచ్చినసుశీల. రామభరతులలో నెవఁడు రాజైనను సమానమే యని సంతోషము చూపినసమదర్శిని. అయిన నేమి? ఇట్లు చిత్రింపఁబడినయీపాత్రము మంథరాదుర్బోధలపాలై యొక్కమాఱు తలక్రిందైనది. వెనుక భర్తయిచ్చినరెండువరము లప్పు డడిగి పుచ్చుకొనుటకు నిశ్చయించినది. మనసు మాఱుటతో నెనుకటివివేక మంతయు మటుమాయ మైనది. ముందువెనుక లాలోచింపక పట్టినపట్టు సాధించినది. స్త్రీసాహసమున కడ్డ ముండునా యన్నసామెత స్థాపించి రాజ్యలోభమున నకృత్యమాచరించె నన్ననిందకు గుఱియైనది. ఇందులో మంథరదుర్బోధ కాని, భర్తయిచ్చినవరము లడిగిపుచ్చుకొనుట కామెకుఁగలహక్కుగాని పైకి రావు. కులక్రమాగత మైనమూర్ధాభిషేకమున కొర్వ్యక విఘ్నము కలిగించి సుకుమారుఁడును

సుశీలుఁడు నైనరాము నడవిపాలుగావించుటమాత్రమే పైకిఁ గనఁబడును. మహర్షి కూడ నీపాత్రము కేవలనింద్యముగాఁ గనరాకుండుట కేవో హేతువులు చూపియుఁ దుదకు నిందకే పట్టము కట్టెను. కథాప్రవర్తనదృష్టి కది యుక్తమే కదా ! చూడుఁడు.

వరములనుగూర్చి తీవ్రసంవాదము జరిగినపిదప దశరథుఁడు ప్రాణమువిసిగి "ఓసీ ! నేను ధర్మపాశబద్ధుఁడ నైతిని. నాచేతన మడుగంటినది. ఇఁక ధార్మికుఁ డైననాపెద్దకొడుకును మాత్రము చూడఁగోరుచున్నాను" అనెను. సరే యని కైక రాముని రప్పించినది. అతఁడు వచ్చి నమస్కరించినంత రాజు 'నాయనా రామా' అని, కన్నుల నీరు గ్రమ్మఁ గంఠము స్తంభింప మఱి చూడలేదు పలుకలేదు. ఆయవస్థలోనితండ్రిని జూచి రాముఁడు భయవిషాదకంపితాంతరంగుఁడై "అమ్మా! మానాయనగారియీయపూర్వవికారమునకుఁ గారణ మే"మని గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. అట్లు దీనావస్థలో నున్నతండ్రికొడుకులను జూచి యించుకైన జాలి పడక కైక నిర్లజ్జయై "కుమారా ! నీ వనుకొన్న కారణ మేమీ కాదు. మీ తండ్రి తనమనసులోనియొకమాట నీతోఁ జెప్ప జంకుచుండెను. మున్ను నాకిచ్చిన వాగ్దానమున కిపుడు పశ్చాత్తాపపడుచున్న ఁడు నీతో నది చెప్పఁజాలక యిట్లుం డెను. ఆమాట నేనే చెప్పెదను వినుము" అని తనవరములు రెండును వెడలఁ గ్రక్కెను. భర్తప్రాణ మైన సరకుగొనక లోకనింద కొడిగియొగ్గి స్త్రీజాతికి సహజ మైనకుసుమసుకుమారహృదయము నల్లరాయి గాఁగ వినయమూర్తియు సుగుణ రాశియు నైన కుమారరామునితో నీ వడవికి లేచిపొ మ్మని నిర్దాక్షిణ్యముగాఁ బలికినయీపాత్ర మిఁక నింద్య మెట్లు కాకపోవును ? ఈఘట్ట మిట్లుండ కున్నఁ గథ యెట్లు నడచును ? కావునఁ గైకేయీపాత్రము లోభగుణమున కాద్య నిదర్శనమై సముచితముగాఁ బోషింపఁబడిన దనియే తలంపవచ్చును.

శ్రీరాముఁడు[1]—తాతపాదుల కసత్యదోషము తగులకుండుటకై రాజ్యము విడిచినస్వార్థత్యాగియు సాధుబాధకులును లోకకంటకులు నగుదుష్టులను సంహ రించినవీరాతివీరుఁడును సచ్చరిత్రమున లోకము నాకర్షించినసుగుణరాశియు నైన యీపాత్రము లోకోత్తరమై, యాద్యంత మొక్కరీతి నెట్లు పోషింపవలెనో యట్లు పోషించినమహర్షి వాక్కునం బడి, యాసేతుహిమాచల మాబాలగోపాలము నిరం తరకీర్తనీయ మగుటయే దీనియౌచిత్యపారంగతత్వమునకుఁ దార్కాణము. మహిమపక్షమున విష్ణునియవతారముగా నందందు చూపించినను, కథాపక్షమున సర్వత్ర ధీరోదాత్తుఁ డగునుత్తమక్షత్రియుని గావించి దానదయాయుద్ధవీరముల నితని కితఁడే సాటి యనునట్లు వర్ణించినవాల్మీకిమాటలనుబట్టియే యితనిపితృభక్తిని మాత్ర మొకింత తరచి చూతము.

---

1. ఇతఁడు, ఈజిప్టుదేశ చక్రవర్తి యనుమత మొకటి క్రొత్తగాఁ బుట్టినది.

శ్రీరామదశరథులభక్తివాత్సల్యము లింతంత యని నిర్ణయింప నలవిగా నంతగా బాలాయోధ్యాకాండముల వెల్లివిరిసినవి గాని, "సూర్యుఁడు లేకుండ లోక మైన నిలచును గాని రాముఁడు లేకుండ నాప్రాణము నిలవఁ జాల"దని కైకేయి చెంత విలపించినదశరథునిపుత్రవాత్సల్యముకంటె, "మాతండ్రినిమిత్తము నే నేమి చేయవలసినఁ జేయుదును. అతఁడు చెప్పకున్నను నీమాటనుబట్టియే నే నడవికిఁ బోవుదును. మాజనకునిప్రతిజ్ఞ నెఱవేర్చుటకంటె నాకు ధర్మాచరణము వేఱేమి యుండును?" అని కైకతో నెట్టిసంకోచమును లేక పలికి, మూర్ధాభిషేకమండపమునఁ బెట్టనున్న కాలు గాఢారణ్యమునఁ బెట్టినరామునిపితృభక్తి వేయిరెట్లెక్కు డని క్రియనుబట్టి చెప్పవచ్చును. ఇది యిట్టి దైనను, రాముఁడు గంగానది దాఁటి వెళ్లిననాఁటిరాత్రి సౌమిత్రితో నన్నమాట లి ట్లున్నవి.

"ధ్రువ మద్య మహారాజో దుఃఖం స్వపితి లక్ష్మణ!<br>
కృతకామా హి కైకేయీ తుష్టా భవితు మర్హతి<br>
సా హి దేవీ మహారాజం కైకేయీ రాజ్యకారణాత్<br>
అపి న చ్యావయే త్ప్రాణాన్ దృష్ట్వా భరత మాగతమ్<br>
అనాథ శ్చైవ వృద్ధశ్చ మయా చైవ వినాకృతః<br>
కింకరిష్యతి కామాత్మా కైకేయీవశ మాగతః<br>
ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞశ్చ మతివిభ్రమమ్<br>
కామ ఏవార్థధర్మాభ్యాం గరీయా నితి మే మతిః<br>
కో హ్య విద్వా నపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్<br>
ఛందానువర్తినం పుత్రం తాతో మా మివ లక్ష్మణ!"

ఈమాటలు తనతండ్రి వార్ధకదశలోఁ దన్ను విడిచి దుఃఖింపవలసి వచ్చినదిగదా యని జాలిపడియన్నవే యైనను "కామాత్ముఁడై కైకేయీవశుఁడైనవాఁ డేమిచేయును? అతనివ్యసనము చూడఁగా నర్థకామములకంటెఁ గామమే గొప్ప దని తోఁచినది. ఎంత తెలివిమాలినవాఁ డైనను, ఆఁడుదానికొఱకు మన తండ్రివలె వశవర్తి యైనపుత్రుని విడుచునా?" అనుమాటలలో నించుక నింద స్ఫురింపకపోదు. ఇది యుద్దేశపూర్వక మైననింద యై రామునిపితృభక్తి కేమేని కళంక మాపాదించునా యనుటయే విచారణీయము.

దశరథుఁడు సత్యబద్ధుఁడై తన్ను విడిచెనో కైకేయీవశుఁడై తన్ను విడిచెనో రాముఁ డెఱుఁగకపోలేదు. కాని, దేవాసురరణరంగమునకుఁ బోవునపుడు కూడఁ గైకేయిని విడువకుండుటయు, ప్రభు వయినవాఁ డందు దూరదృష్టి లేకుండ రెండువరము లిచ్చితి ననుటయు, అనిర్దిష్టము లైనయావరములయుద్దేశ మిది గాక పోయినను వాని నీవిధమునఁ దీర్చు మని కైక కోపాగారమున భూశయ్యనుండి కోరినప్పు డెంతయు విచారించియుఁ దుదకు సమ్మతించి లోకారకుండు

టయు, కౌమారుఁ డయినయతని కైకేయీపారవశ్యతను దెలుపుచున్న వని యీయాయా స్థలో మానవస్వభావమునుబట్టి రాముఁ డూహించుట యసంగతము కాఁజాలదు. ఇంతకును గవీంద్రుఁ డీపట్టునఁ గైకేయీవరములకుఁ గాను దెచ్చి యతిమాయతిమానుష మైనదేవాసురసంగ్రామసాహాయ్యకథ యిఱికించక యుద్దపడినది గాని లేకున్న దశరథపాత్ర మెట్టినిందపాలై యుండునో! కావున దశరథునికైకేయీ వశ్యత్వ మిరుతెఱఁగుల సూచించినకవివశమున రాముఁ డన్నపై మాటలు తండ్రి పుత్రవిరహదురవస్థకుఁ బరితాపము తెలుపునవే కాని నిందను సూచించునవి కావని సంతసింపవచ్చును. అందుచే రామునిపితృభక్తి యెంతమాత్రము కలంకితము కాఁజాలదు. ఇఁకనో—'రాజ్యముకోస మింకఁ గైకేయి మహారాజుప్రాణము తీయకుండుఁగాక'యని యిక్కడను, 'కైకేయికోరిక ఫలించిన'దని సీతావియోగ సందర్భమందును, రాముఁడు కైక నుద్దేశించి రెండుమాట లన్నను, ఇవి యెంతటి యుదారహృదయునినోట నైనను గష్టదశలో నప్రయత్నముగా సహజముగా నాత్మదుఃఖము వెల్లడింప వచ్చునవేకాని యుపాలంభపరములు కా వనుట లోకానుభవసిద్ధము. కావున వీనినిబట్టి రామునిమాతృభక్తినిగూడ శంకింపఁ బని లేదు. సకలసద్గుణపుంజ మైనరామునిశీల మెవరికిఁ గ్రొత్త?

సీత—మహావిష్ణువు నాశ్రయింప భూదేవి కవతరించినలక్ష్మి యైనయీమె కావ్యవశమునఁ బ్రాణము పోసినపాతివ్రత్యరాశియై యయోనిజ యయ్యెను. చచ్చినా బ్రతికినా సతికిఁ బతియే గతి యఁట. భర్త కెట్టికష్టము కలిగింపక యతని నీడయై యడవుల నుండునఁట. మగనితో నున్నవనమే మగువకుఁ బుట్టిల్లఁట. భర్త లేనిస్వర్గ మైనను బొడకొంపయఁట. అర్ధాంగి యైనభార్య భర్తృసుఖదుఃఖ భాగిని యఁట. వీరుఁ డైనపురుషుఁడు తనపెండ్లామును బోషింప నన్యుల కప్పగించఁగూడ దఁట. ఆహా! అసూర్యంపశ్య యైనరాజకుమారి యరణ్యావాసదీక్ష! ఏమి సౌశీల్యము! తనపెనిమిటియభిషేకమున కంతరాయము కలిగించినసవతి యత్తచర్య నైన స్మరింపలేదు. మామమాట యెత్తలేదు. కలిమి విడువఁ గలఁత పడలేదు. బంధువులకు దూర మగుదు నని పరితపింపలేదు. పతి ననుగమించుట తప్ప రెండవది యీమెడెందమున లేదు. పరనింద యీమెపాశముననే లేదు. తన్నాదరించి మాటాడినయనసూయతోఁ దనజన్మవృత్తమును వివాహోదంతమును జెప్పినది గాని లోకములోనియాఁడుదానివలెఁ దమవనసంచారమునకు మూల మైనయప్పటిమాట లేమైన నెత్తెనా? భరతునిరాకఁ జూచి లక్ష్మణుఁ డైన మతిచెడినమాట లనెను గాని యీమెముఖమున నసూయాచిహ్న మైన నగపడెనా? అట్టియీసతీమతల్లి మారీచమాయాసమయమునఁ గాఁగలకార్యమును బట్టి సౌమిత్రి నుద్దేశించి యుబ్బించుక పరుషభాషణము గావించినది. ఆమాట లన రానివే కాని, తనభర్త నిజముగా నాపదపా లయ్యె నని నమ్మి దుఃఖమగ్న మానస

నైనయీామె కెన్ని చెప్పినను విననిలక్ష్మణుఁ డిల్లు కదలి వెళ్లుటకంతకంటె వేఱుగతి కనఁబడలేదు. లోకములో నట్టియవస్థలో నున్నయెట్టిసుశీలహృదయ మం దైనను సహజముగాఁ బుట్టఁదగినయట్టి భావమునే పుట్టించి కవిచంద్రుఁ డీమెచే నట్లు పలికించెను. సీత లక్ష్మణునిభావ మెఱుఁగనిది కాదు. అతనిసత్ప్రవర్తనము తెలియనిది కాదు. అయిన నేమి? అతనిఁ బంపకున్న నీమెమనసులోనిసంతాపము చల్లారదు. ఆమాట యన్నఁగాని యతఁడు కదలఁడు. అందుచే నీసందర్భమందలిసీతనిష్ఠురోక్తు లనుచితములు కావనియే భావింప నగును. ఇంతకంటె నీమెసౌశీల్యమున శంకింపఁదగినవిషయమే కనఁబడదు.

భరత లక్ష్మణ శత్రుఘ్నులు—సౌభ్రాత్రము సాకార మైనపాత్రము లివి. అన్నతోడిదే లోక మని భార్య నింట విడిచి బ్రహ్మచారియై సీతారాములపాద సేవయే జీవితఫల మని వానప్రస్థుఁ డైనభక్తిమూర్తి లక్ష్మణుఁడు. లోకాపవాద మునపాలై తల్లి సంపాదించిన రాజ్య మొల్లక వానప్రస్థునివలె జటావల్కలధారియై ఫలమూలాశనుఁడై శత్రుఘ్నునింగూడి శ్రీరామపాదుకలు సేవించినభక్తియోగి భరతుఁడు. ఇద్దఱు నిర్మలభక్తులే కాని, సౌమిత్రికంటె భరతుఁ డించుక యెక్కువ భక్తుఁ డని కథాస్థితిని బట్టియు "భరతుండు నీకంటె భక్తుండు నాకు" అని రామునిచే ననిపించిన రంగనాథుని పరిశీలనమునుబట్టియు నమ్మవచ్చును. ఇరువురును సహృదయులే కాని, కైకను జంపెదను భరతుని బరిమార్చెద ననుచుఁ దాత్కాలికావేశమున నావేగము చూపినసౌమిత్రికంటె, అపకీర్తిలజ్జితుఁడై యమ్మను నిందించినను, జరిగినదానికిఁ బ్రతిక్రియ చేయఁజాలక రామపాదుకలచే రాజ్యము చేయించినభరతుఁ డెక్కువదీర్ఘదర్శి. ఇట్లు లీషద్భేద మున్నను, వీర లన్నకుఁ దగినతమ్ము లనఁదగిన సుశీలు రనుట స్పష్టము. ఇఁకఁ గవితాగురుఁ డప్రతిమాన ప్రతిభచే నడపించినపాత్రములయౌచితిని బరామర్శింపఁ గాలహరణము గావింపక గ్రంథవిశేషము లొకింత కనుఁగొందము.

## రామాయణవిశేషములు

రాజవంశములు:—నేఁటికిని వివాహములందు గనవచ్చుకన్యావరగోత్ర ప్రవరకథనరూప మైనసనాతనవైదికాచారమునుబట్టి జనకునికన్యలను రామలక్ష్మ ణులకుఁ గోరినవిశ్వామిత్రుఁడు సూర్యవంశపురుషక్రమమును దెలిపెను. జనకుఁడు నిమివంశపురుషక్రమము తెలిపెను. ఈసందర్భమునందును, వసిష్ఠుఁడు శ్రీరాము నికి సనాతనకులధర్మ ముపదేశించినసందర్భమందునుగూడ సూర్యవంశమందలి జ్యేష్ఠపురుషులక్రమము చూపఁబడినది. [1]. కాని మొదటిక్రమమున నున్నయ యాతి రెండవక్రమమున లేఁడు. అంబరీషునికి నహుషుఁడు నతనికి యయాతి

1. బాలకాం. 70_71 అయో. 110.

యతనికి నాభాగుఁడు పుట్టినట్లు మొదటిపాఠమును, నహుషునికొడుకు నాభాగుఁడని రెండవపాఠమును జెప్పుచున్నవి. వాల్మీకియే యిట్లు రెండువిధములఁ జెప్పియుండఁడు గావున నిం దేదో యొకపాఠము ప్రక్షిప్త మనవలసివచ్చుచున్నది [1]. అ దేదో నిర్ణయించుట కష్టసాధ్యమే కాని రెండవపాఠమే ప్రామాదిక మని తోఁచుచున్నది. ఇది యిట్లుండ, దిలీపునికొడుకు భగీరథుఁడు—అతనికుమారుఁడు కకుత్స్థుఁడు అతనికొడుకు రఘుమహారాజు—అని రామాయణములో నాలుగైదుచోట్లఁ గనవచ్చుచుండఁగా భాసమహాకవిప్రతిమానాటకమందును, మహాకవికాళిదాసురఘువంశమునందును, దిలీపునికొడుకురఘువు. అతనికొడుకు అజుఁడు—అతనికొడుకు దశరథుఁడు—అనుక్రమము కనఁబడుచున్నది [2]. ఇట్టివిరోధములు పౌరాణికరాజవంశక్రమములందు సర్వత్ర కనవచ్చునవే కావున గ్రంథవిస్తరభీతిచే నిం దేది సముచితమో నిర్ణయింపక యీవిషయము పాఠకలోకమునకు విడుచుచున్నాను.

సీతారామవయోవిచారము :—రాముఁడు విశ్వామిత్రునితో యాగసంరక్షణార్థము వెడలునాఁటి కూనషోడశవర్షుఁడు [3]. స్వయంవరకాలమునకు సీత పతిసంయోగసులభవయస్క [4]. అక్కడక్కడ మున్యాశ్రమములోఁ గొంతకొంత కాలము నివసించుచు సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణాశ్రమము చేరునాటికి వనవాససంవత్సరములు పది గతించినవి [5]. జనస్థానమున సీత రావణునితోఁ జెప్పిన వృత్తాంతమునుబట్టి చూచినచో, ఆమె యత్తవారింట సకలభోగము లనుభవించిన కాలము పన్నెండుసంవత్సరములు. రాముఁ డడవికి బయలుదేఱునాఁటి కతని వయస్సు, ఇరువదియైదువత్సరములు. అప్పటికి సీతవయస్సు పదునెనిమిదియేండ్లు [6].

ఎట్లు చూచినను బైమాటలు వీరివయస్సువిషయమునఁ బరస్పరవిరుద్ధములే. ఇవి ఋషివాక్యము లనుటకు మన సొప్పదు. ప్రక్షిప్తము లనుటకు వీలుకనఁబడదు. కావున వీనిం గూర్చి చర్చింపక విడుచుటయే యుచితము.

రామాయణరచననాఁటిభాష :—అగస్త్యభ్రాతయాశ్రమమున బ్రాహ్మణవేషధారులై యిల్వల వాతాపు లనెడి యసురు లుండెడివారు. వారిలో నిల్వలుఁడు సంస్కృతమున మాట లాడుచు బ్రాహ్మణులను శ్రాద్ధభోజనమునకుఁ బిలుచుచు మేషరూపుఁడైనవాతాపిని జంపి వానిమాంసము వండి వారికిఁ బెట్టి పిదప వాతాపీ! ర మ్మని పిలువ వాఁడు బ్రాహ్మణులపొట్టలు చీల్చుకొని యీవలికి వచ్చెడి

1. చంద్రవంశమందలి నహుష యయాతు లాయువుపుత్రపౌత్రులు.

2. దిలీపరఘువులనడుమనిద్దఱును, రఘువునకు నజునికినడుమఁ బదునొకండుగురును, పురుషులుగలరు. మొత్తము బ్రహ్మ మొదలుగా శ్రీరామునివఱకు 40 తరములు, మనువు మొదలుగా 36 తరములు, రామాయణమునఁ గనఁబడును.

3. బాల. 20.　　4. అయో. 118.　　5. అర. 11.　　6. అర. 47.

వాఁడు[1]. సుగ్రీవసచివుఁ డగుహనుమంతుని సంభాషణమునకు సంతోషించి రాముఁడు సౌమిత్రితో "వేదత్రయము చదువని వాఁడిట్లు మాటలాడఁజాలఁడు. ఇతనికి వ్యాకరణజ్ఞానము పూర్తిగాఁ గలదు. ఇంతసేపు మాట లాడెనుగాని యొకయపశబ్దమైన రాలేదు." అని పలికెను[2]. అశోకవృక్షముమీఁద నున్న యాంజనేయుఁడు క్రింద దుఃఖించుచున్నసీత నాశ్వాసింప నుద్యుక్తుఁడై "నేను వానరుఁడను. ద్విజాతివారివలె సంస్కృతవాక్కున మాటలాడినయెడల నన్ను రావణునిగా భావించి సీతాదేవి భయపడునేమో! అయినను సంస్కృతముననే నేను దప్పకమాటలాడవలసియున్నది" అని తలంచెను[3]. ఇట్లున్నవాక్యములను బట్టి చూడఁగా నాకాలమున ద్విజాతివారు సంస్కృతభాషలో మాటలాడుచుండెడివా రనియుఁ దక్కినవారు ప్రాకృతమున మాట లాడెడివా రనియుఁ దెలియక పోదు. ఈవిషయము ప్రథమసంపుటమున విశదీకరింపఁబడి యున్నది గావున నిందీసూచనము చాలును[4].

నాఁటిభరతఖండస్థితి:—ఈవిషయము మొదట నించుక సూచింపఁబడినది. వేదములందు గనరానికొన్నిజనపదములును బురములును ద్వీపములును నదులును బర్వతములును రామాయణమునఁ గనవచ్చుచున్నవి. కిష్కింధాకాండములోని వీనివర్ణనములనుబట్టి చూచిన[5]. రామాయణకాలమునాఁటి కార్యులు భరతఖండ మంతట నాక్రమించినసూచనలు కనవచ్చును. ఇందు వర్ణింపఁబడినజనపదాదులు చాలవఱకు, భరతఖండమునందును దీనిచుట్టుపట్టులను గన విన వచ్చుచున్నవి గాని, యందలికొన్నిటిపేళ్లు మాఱిపోయినవి. కొన్ని రూపుమాసినవి. ఇందు కొకయుదాహరణము. పశ్చిమసముద్రవేలాతటమునందు "మురచీ—జటీ—అవంతీ—అంగలోప—" అనునగరము లున్నట్లువర్ణన కలదు[6]. ఈపురము లిపు డున్నట్లు తెలియరాదు. అవంతి యుజ్జయిని యనఁ బరగిన దనవచ్చుఁగాని యిది పశ్చిమ సముద్రతీరమున లేదు. కిష్కింధాకాండము చదివినవారి కిట్టియుదాహరణము లెన్నేని కనఁబడును. హిందూదేశమునలుదెసల నున్నజనపదాదులనే కాక, శాంత మహాసముద్రము లోహితసాగరము, ఆమమీనాశన మన్తర్జలచరమునై నరవ్యాఘ్ర మనఁబడుకిరాతజాతి, లోహముఖమై యతిజవనమైనయేకపాదజాతి, మొదలుగాఁ గలదేశాంతర ద్వీపాంతర ఖండాంతర విషయములను వర్ణించినవాల్మీకిభూగోళ విజ్ఞాన మత్యాశ్చర్యకరమై కిష్కింధాకాండమునఁ బ్రతిఫలించుచున్న దనుట సత్యము. అరణ్యకాండమునం దానాఁటియుత్తరదక్షిణహిందూదేశములు కన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినవి. అంతకుమున్ను నిర్మనుష్యము నిర్మృగము తరుగుల్మ

1. అర. 11, 2. కిష్కిం. 3. 3. సుంధ. 30. 4. సం. వా. చ. ప్ర. పుట. 61—64. 5. కిష్కిం. 40_43 సర్గలు. 6. కిష్కిం. 42—13,14.

లతాహీనము తాపసహితము నైనవింధ్యపాదదక్షిణభాగ మగుదండకావనిలోఁ దరువాత దారుణకాంతార మేర్పడినది. అగస్త్యుఁ డచ్చటికి వచ్చునాఁటి కందు వానలు లేవు. సుఖప్రద మైనగాలి లేదు. హిమవచ్ఛిఖరమునుండి యతఁడు వచ్చిన పిదప సకృత్తుగా వాన కురియుట మొదలుపెట్టినది [1].

ఇత్యాదిబహువర్ణనలతో నిండియున్న రామాయణము కేవలము కావ్యముగానే కాక దేశభూగోళచరిత్రముగాఁ గూడ నుపయోగించుచున్న దనవచ్చును.

రాజధర్మములు :—వీనిని జక్కఁగా వివరించినది కచ్చిత్సర్గ [2]. బహువిధ మైనలోకజ్ఞానమును సకల మైనశాస్త్రజ్ఞానమును సంపూర్ణ మైనరాజనీతిని స్వచ్ఛ మైనశీలమును బోధించుచున్న యిందలివిషయ మానాఁటినాగరికత కాదర్శమై యతిమనోహరముగా నున్నది. ఇందు గనవచ్చులోకాయతికనిందనుబట్టి వాల్మీకి నాఁటికే స్వభావవాదమత మంకురించినట్లు కనవచ్చును.

సాంఘికాచారములు :—సీత సహగమనమును బ్రశంసించుటనుబట్టి యా కాలమున నది యున్న దని యూహింప నగునుగాని, కౌసల్యాదులు దాని నాచరింపకపోవుటనుబట్టి యది యైచ్ఛికముగా నుండెనేమో యని తోఁచుచున్నది. కాని, మృతకళేబరముతో స్త్రీలు శ్మశానవాటికకుఁ బోవుటమాత్రము నాఁటి యాచార మని కౌసల్యాదులయనుగమనమునఁ దెలియుచున్నది. ఋశ్యశృంగుఁడు శాంతను బరిణయమగుటనుబట్టియు, దశరథవిద్ధుఁ డైనమునిబాలుఁడు వైశ్యునకు శూద్రస్త్రీయందు జన్మించినవాఁ డగుటనుబట్టియు వేదములనాఁటియనులోమ వివాహము లానాఁ డాచరణములో నున్న వనుట విదితము. ఆనాఁటికిఁ జతుర్వర్ణములును స్వస్వవిహితవృత్తుల స్థిరపడినవి. ఆవృత్తులే తరువాత స్మృతులలో విధింపఁబడినవి.

విద్యాజ్ఞానము :—మంత్రబ్రాహ్మణారణ్యకోపనిషత్తులనుండి యుద్ధృత మైన వివిధవిద్యాజ్ఞాన మాకాలమున ద్విజాతులయందు విస్తరించినట్లుగా, ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వ ధర్మశాస్త్ర వ్యాకర ణాన్వీక్షకీ వార్తా దండనీ త్యాదిసంజ్ఞలవల్లఁ దెలియనయ్యెడి. అపు డీవిజ్ఞాన మేరూపమున నుండెడిదో చెప్పఁజాలము కాని తరువాత నీపేళ్ల వెలసినగ్రంథములలోనివిషయముల కప్పటికి వెనుకటినుండియు నాఁటినుండియుఁ బారంపర్యోపదేశమున వచ్చునిదియే యాధారమని చెప్పవచ్చును. అట్లే జాబాల్యాదిమహర్షులమాటలలోనితత్త్వజ్ఞానమే తరువాత వెలసిన వివిధమతసూత్రములకు మూల మని విశ్వసింపవచ్చును. ఇంత యేల? భాసకాళిదాసాదిమహాకవులకావ్యములలోనివివిధవర్ణనలకును శబ్దార్థాలంకారములకును రసపాత్రపోషణాదిపద్ధతులకును రామాయణమే గురువనియు దీని ననుసరించి బహు

1. అరణ్యా. 13.    2. అయో. 100.

విధ కావ్యము లావిర్భవించినవనియుఁ బాఠకలోక మెఱుఁగక పోలేదు. ఇఁక దేవతారాధనము.

భారతీయుల కిది క్రొత్త కాదు. ఈశ్వరునికి రూపము కల్పించి స్తుతించుట వేదములనాఁటియాచార మని మున్ను చదివియుంటిమి [1]. అట్లే, బ్రహ్మ విష్ణు రుద్రులు సృష్టి స్థితి లయ కర్తలుగా వర్ణింపఁబడుట రామాయణమందును గనఁ బడును. ఈ యారాధనము కేవలస్తుతిరూపము గాక విగ్రహారాధనపరముగా మాఱె ననుటకు రామాయణములోని—

"కచ్చి చ్చైత్యశతై ర్జుష్ట స్సునివిష్ట జనాకులః
దేవస్థానైః ప్రపాభిశ్చ తటాకై శ్చోపశోభితః" [2].

అనుశ్లోక మొకటి కనఁబడుచున్నది. ఇందలి చైత్యశబ్దమునకు, యజ్ఞశాల రచ్చవ్రాను గుడి యనునర్థము లగును గాని, అప్పటికి బౌద్ధమతప్రసక్తి లేదు కావున బౌద్ధాలయ మర్థము కానేరదు. దేవస్థానశబ్దము వేఱుగా నుండుటచే గ్రామములోనిపదిమంది యొకచోటఁ జేరి ముచ్చట లాడుచుఁ గూర్చుండురచ్చవ్రా ననెడియర్థమే దీనికి సముచిత మగును. ఇఁక దేవస్థానము ప్రతిష్ఠించినవిగ్రహముల యాలయమా ? లేక యీశ్వరుని ధ్యానించుపవిత్రస్థలమా ? అనువిషయ మజ్ఞే యముగా నున్నది. ఈశ్వరునికి రూపకల్పన మానాఁటి కెంతో పూర్వమే యున్నది గావున నిది విగ్రహస్థానపర మని చెప్పినను దోషము కాదు. ఇట్లే బాలకాండ మున—

"వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్" [3].

అనుమాట యున్నది. ఇవి, రంగస్థలములరూపకములఁ బ్రదర్శించుసంఘ ములు గాక, నాట్యము లేక నృత్యము సలుపునట్టి స్త్రీసంఘము లని భావింప వలసియున్నది. ఛాందోగ్యోపనిషదాదులందు దేవజనవిద్య యనుపేర గాంధర్వ విద్య విదితమై యుండ రామాయణమునాఁడు నృత్యకల విస్తరించి యుండు ననుట కాక్షేపము లేదు. కాని, యా వధూనాటకసంఘస్వరూపముమాత్ర మిట్టిదని నిరూపింప శక్యము గాకున్నది. ఆవధువులు సంసారిణులో గణికలో ! ఆసంఘ ములు పాడెడివో లేక యాడెడివో ! [4].

ఇట్లు సర్వలక్షణసంపూర్ణ మైనయిది పుట్టిననాఁటనుండి నేఁటిదనుక నొక్క రీతి నార్యజాతికి భజనీయమై వెలయుచున్నది. కావుననే బ్రహ్మాండపారాశర్యపురా

---

1. చూ. సం. వా. ప్ర. భా. 120_124, 208. పుటలు.
2. రామా. అయో. 100-43.
3. బాల. 5_12.
4. ఈవిషయమింకను విచారణీయము.

రాదులు దీనిమహిమను వేనోళ్లఁ బొగడినవి. అట్టిమహిమ కలది కావుననే తత్త్వ సంగ్రహరామాయణము, పఠనశ్రవణంబుల నొక్కొక్క కాండమునకు నొక్కొక్క ఫలము కల దని నిరూపించినది. అట్టిఫలము కలిగించునది కావుననే షట్కాండము కాని సుందరకాండము గాని నియమపూర్వకముగాఁ బారాయణము గావించి యిష్టార్థసిద్ధిని బడయుచున్న భక్తులు నేఁడు గూడఁ గనఁబడుచున్నారు. అట్టిపరమపావనము వేదతుల్యము నైనదీనిమహిమ నెంతని పొగడఁగలము? కావున నేతాదృశ మైనమహేతిహాసము రచియించిన వాల్మీకి మహర్షిని—

"కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వన్దే వాల్మీకికోకిలమ్"

అని స్మరించి, దీనివ్యాఖ్యానముల నించుక యవలోకింతము.

రామాయణవ్యాఖ్యలలోఁ బ్రసిద్ధి గాంచినది తత్త్వదీపిక. నారాయణ తీర్థులశిష్యుఁ డగుమహేశ్వరతీర్థులు రచియించినయిది తీర్థీయ మనఁబడును. ఈ యతీంద్రునికిఁ బూర్వము కొందఱు టీకలు రచియించినట్లుగా నవతారికలోని "నానాటీకాస్థవాక్యాని లిఖ్యన్తేఽత్ర యథామతి" అనుదానివల్లఁ దెలియును. దీని తరువాత గోవిందరాజకృతములయిన, మణిమంజీర—పీతాంబర—మణిమేఖల—అను వ్యాఖ్యలు విఖ్యాతములు. ఇతఁడు శఠకోపదేశికునిశిష్యుఁడు. ఇవి గాక, కందాళ రామానుజకృత రామానుజీయవ్యాఖ్య, వనము భవానీనృసింహులపుత్త్రుఁ డగు బ్రహ్మవిద్యాధ్వరి రచించిన విరోధభంజని, అహోబలసూరికృతవాల్మీకిహృదయము, విద్యానాధదీక్షితకృతదీపిక, వాదిహంసవలాహకాన్వయగోపాలగురు శిష్యరంగా చార్యకృతరామాయణాన్వయి, వెంకటసూరికృతార్థప్రకాశిక, అనువ్యాఖ్యలును, చతురర్థి విద్వన్మనోరంజన్య మృతకతక టీకలును గన విన వచ్చుచున్నవి. ఇంక నజ్ఞాతము లైన వెన్నికలవో! ఇట్లు విద్వజ్జనహృదయాకర్షకము సకలజనరంజకము నైన వాల్మీకిరామాయణము మహత్త్వము చెప్పెడి దేమి? ఇంక—

## మ హా భా ర త ము

దీనికర్తృత్వము మిక్కిలి సందిగ్ధముగా నున్నది. వైయాసికీసంహిత యనెడి ప్రసిద్ధినిబట్టి దీనికర్త వ్యాసుఁ డందుమేని, వ్యాసుఁ డనునది బిరుదనామమై పెక్కండ్రకుఁ గనవచ్చుచున్నది. అట్టిబిరుదు గలపరాశరపుత్త్రుఁ డందుమేని, పరాశరులు ముగ్గురు నలుగురున్నారు. సత్యవతియందు పరాశరుఁ డనునొక మహర్షికిఁ బుట్టినకృష్ణద్వైపాయనుఁ డనువ్యాసుఁ డని నిశ్చయింత మన్న భారత కథావతారికనుబట్టి యతఁడు కురువంశము నిలిపినవంశకర్త కావచ్చును గాని, యతఁడే భారతగ్రంథకర్త యనుటకు వీలు గాకున్నది. అట్లు చెప్పినచోఁ గథా

కాలమునకును గ్రంథకాలమునకును మహాంతరము కనవచ్చును. కొందఱిమతి మునుబట్టి యాయంతర మెంత తగ్గినను, అతఁడు రమారమి వెయ్యేండ్లు జీవించి యుండె నని చెప్పవలసివచ్చును. అయితే, తనపుత్త్రుఁ డైనపాండురాజు మొదలుగా జనమేజయునివఱకు నైదుతరములు గడపినట్లు వర్ణింపఁబడినచిరకాలజీవియు మహాయోగియు నైనయాసాత్యవతేయుఁడు తరువాతఁగూడఁ గొంతకాలము జీవించి హిమాలయగుహాలలో యోగనిష్ఠనుండి భారతము రచియించె ననుట యబ్బురమా యని కొందఱికిఁ దోఁచవచ్చును గాని, అంతకంటె వర్ణితగ్రంథపద్ధతినిబట్టి, యాపారాశర్యవ్యాసుఁ డొకానొకశిష్యునికిఁ గౌరవపాండవసంగ్రామోదంతము చెప్పియుండఁ దచ్ఛిష్యపరంపరనుండి వ్యాసప్రోక్తముగా వచ్చినయాయుదంతమునే యొకశిష్యుఁడు వ్యాసప్రణీత మైనట్లే భారతసంహితఁగా రచియించి యుండు నని యూహించుట యెక్కువ సమంజస మగు నని పూర్వోక్తభారతకాలచర్చనుబట్టి నే నభిప్రాయపడుచున్నాను. ఇందుకు, భారతయుద్ధకాలము ననేకు లనేకవిధములుగాఁ జర్చించి యిచ్చినయభిప్రాయములనుబట్టి యెంత క్రిందికిఁ జూచినను, ఆకాలము క్రీ. పూ. పదునాఱవశతాబ్దిని దాఁటి యీవలికి రాకుండుట యొకకారణము. వైశంపాయనుఁడును[1] సౌతియు రచియించినభాగము లనేకములు మహాభారతమునఁ గల వని పరిశోధకులు నిర్ణయించి యుండుట మఱియొకకారణము. ఇదే కాక, మిక్కిలి యర్వాచీనము లయినయుపపురాణములలోఁ గూడఁ గొన్ని పరాశరునిపేరను గొన్ని పారాశర్యునిపేర నుండుట యింకొకకారణము.

జయ మనుపేరఁ జతుర్వింశతిసాహస్రిక వ్యాసరచిత మని కొందఱువిమర్శకు లని యున్నారుకాని, మన మొదటిపరిశీలనమునుబట్టి యదియు నుపపన్నముగాఁ గనఁబడదు. కాని, భారతకథాప్రవచనకర్తమాత్రము కృష్ణద్వైపాయనుఁ డని విశ్వసింపవచ్చును. అందుచే నతనిశిష్యపరంపరలోనివా రెవరు రచియించినను, భారతసంహిత వ్యాసప్రణీతముగా వెలయుట సముచితమే యగును. ఇదే కాదు, పురాణము లన్నియు వ్యాసనిర్మితము లనెడిపౌరాణికసంప్రదాయము సమర్థనీయ మగుటకుఁ బ్రధానపురాణకథ లన్నియు వ్యాసోపజ్ఞము లన్నను సముచితమే. భారతసంహితాకాలము క్రీ. పూ. దశమశతాబ్దిని దాఁటి యీవలికి రా దన్న చక్రవర్తిపండితులుగూడ భారతకర్తృత్వము వ్యాసుని కారోపింపఁబడిన దను భావమే సూచించిరి[2]. కావున వ్యాసునికర్తృత్వము మూలకథోపదేశరూప మనెడి నాయభిప్రాయమును బాఠకలోకమునకు విడుచుచున్నాను. ఇంక—

---

1. పారాశర్యవ్యాసునిశిష్యపరంపరలోని యొకవైశంపాయనుఁడు భారతరచనము కొంత గావించి యుండును గాని, అతఁడు తైత్తిరీయారణ్యకములోని వైశంపాయనుఁడు మాత్రము కాఁడు.

2. చక్రవర్తిగారి S. H. S. Lit P. 112.

## గ్రంథస్థితి

ఇది మిక్కిలి యవ్యవస్థముగా నున్నది. గ్రంథవిషయమున భరతఖండ మందలియొక దేశములోని ప్రతితో మఱియొక దేశములోని ప్రతి పోలకపోవుటయే కాదు, ఒక దేశమందలియొకమరడలములోని ప్రతితో మఱియొకమండలములోని ప్రతి పోల దని కూడఁ జెప్పవచ్చును. భారత మాంధ్రీకరించిన నన్నయ తిక్కనల నాఁటికిని దరువాతను గూడ దీనిస్థితి యవ్యవస్థముగానే యున్న దనుట కనేకనిదర్శనములు కనవచ్చును. భారతము వ్యాసవైశంపాయనసౌతికృతము లైనత్రివిధభాగములతోఁ గలసియున్న దని యనుక్రమణికాధ్యాయములోనికొన్నిశ్లోకములనుబట్టి విమర్శకులు కొందఱూహించిరి. ఇందుకు—

"మన్వాదిభారతం కేచి దాస్తికాది త థాపరే
త థోపరిచరా ద్యన్యే విప్రా స్సమ్య గధీయతే [1].

అనుశ్లోకమును వా రుదాహరించి యున్నారు. వ్యాఖ్యాత వ్రాసినయర్థమునుబట్టి 'మన్వాది' యనుదాని కిపుడు గ్రంథాదిని సర్వత్ర కనవచ్చు "నారాయణంనమస్కృ" త్యేత్యాదిశ్లోకము భారతారంభ మనియు, ఆస్తీకమునికథ కలిగిన 'కిమర్థం రాజశార్దూ' లేత్యాదిత్రయోదశాధ్యాయప్రథమశ్లోకము భారతారంభ మనియు, ఉపరిచరకథగల 'రాజోపరిచరోనా' మేత్యాదిత్రిషష్టితమాధ్యాయప్రథమశ్లోకము భారతారంభ మనియు, పైశ్లోకమునర్థము తెలియవచ్చును [2]. ఇట్లుఱువదిమూఁడధ్యాయములలో మూఁడువిధములయిన యారంభము లున్నట్లు తెలియఁజేసెడిపైశ్లోకమునుబట్టి భారతారంభ మవ్యవస్థ మని తలంపనగును గాని, ఇందు మొదటియారంభము సౌతి దనియు, రెండవయారంభము వైశంపాయనుని దనియు, మూఁడవయారంభము వ్యాసుని దనియుఁ బైశ్లోకము సూచించుచున్న దని వారు తలంచుటమాత్ర ముచితము కాదు. ఏ మయిన నేమి? అనేక ప్రతులలోఁ గనవచ్చుపైశ్లోకమునుబట్టి [3]. భారతారంభము చిరకాలముక్రిందటనే యవ్యవస్థస్థితి గాంచిన దని చెప్పవచ్చును. ఇది యిట్లుండ—

"నాలేఖిని యాఁప నక్కఱ లేకుండఁగాఁ జెప్పినచో నేను లేఖకుఁడుగా నుందు"నని గణేశుఁ డంటె, 'అర్థము తెలియకుండ వ్రాయవ'ద్దని వ్యాసుఁడు పలికి, అందుకై కుతూహలముతో గూఢార్థమైనగ్రంథగ్రంథిగా నెనిమిదివేలయెనిమిదివందలశ్లోకములను జెప్పె ననియు; పూజ్యుఁ డైనవ్యాసమహర్షి యుపాఖ్యానము

1. ఆదిప. 1-59.
2. ఇవి మూఁడును, ఆదిపర్వములోనివే.
3. ఈశ్లోక మొకప్రతిలో. ఆదిప. 1-59, ఇంకొకదానిలో 1-63. మఱియొకదానిలో 11-52. ఇంక వేఱుప్రతులలో నెక్కడ నున్నదో

లతోఁగూడ నూఱువేలశ్లోకముల యుత్తమభారతము (మహాభారతము) రచియించె ననియు; ఉపాఖ్యానములు గాక యిరువదినాలుగువేలశ్లోకములతో భారతసంహిత రచియించె ననియు, ఏఁబదిశ్లోకములతో సర్వపర్వములయనుక్రమణికను సంగ్రహముగా రచియించె ననియు; మొదటియధ్యాయము చెప్పుచున్నది. ఆదిపర్వాది స్వర్గారోహణికాంతము లయినపదునెనిమిదిపర్వములతరువాత హరివంశ—విష్ణు—భవిష్యము లనెడిమూఁడు పర్వములు రచియించెననియు; ఈ మూఁడును ఖిలసంజ్ఞితము లనియు, అవాంతరపర్వములతోడిపదునెనిమిదిపర్వములు నివియుఁ గలసి మొత్తము నూఱుపర్వములు వ్యాసప్రోక్తము లనియు; సూతపుత్త్రుఁ డైనరామహర్షణి నైమిశారణ్యమునఁ జెప్పినవి పదునెనిమిదిపర్వములే యనియు; ద్వితీయాధ్యాయము చెప్పుచున్నది [1]. ఇందు ౮౮౦౦ వ్యాసుని వనియు, ౨౪ వేలు వైశంపాయనుని వనియు, తక్కినవి సౌతి వనియుఁ గొందఱి యూహ. ఈయూహ నిజ మంద మన్నను, ఆ భాగములు విడఁదీసి చూపువారు లేరు. ఇది యిట్లుండ—

వేదములను విడఁదీసి (వివ్యాసవేదాన్) వేదవ్యాసుఁ డనుబిరుదు గాంచిన పారాశర్యుఁడు పైల జైమిని వైశంపాయన సుమంతు లనుశిష్యులకుఁ గ్రమముగా ఋ క్సామ యజు రథర్వ సంహితలను బంచి యిచ్చెనని భాగవతాదిపురాణములు చెప్పుచున్నవి [2]. సుమంతు జైమిని పైల శుక వైశంపాయను లనువారికి మహాభారతపంచమము లైనవేదముల నుపదేశించె ననియు, వారు భారతసంహితలను

---

1. .. గ్రంథగ్రంథిం తదా చక్రే ముని ర్గూఢం కుతూహలాత్...
అష్టౌ శ్లోకసహస్రాణి వ్యాష్టౌ శ్లోకశతాని చ...
ఇదం శ్లోకసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్యకర్మణామ్
ఉపాఖ్యానైః సహ జ్ఞేయం శ్రావ్యం భారత ముత్తమమ్...
చతుర్వింశతిసాహస్రీం చక్రే భారతసంహితామ్,
ఉపాఖ్యానై ర్వినా తావ ద్భారతం ప్రోచ్యతే బుధైః,...
తతో ధ్యర్ధశతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః
అనుక్రమణికాధ్యాయం వృత్తానాం సర్వపర్వణామ్...
హరివంశ స్తతఃపర్వ పురాణం ఖిలసంజ్ఞితమ్.
విష్ణుపర్వ శిశో శ్చర్యా విష్ణోః కంసవధ స్తథా
భవిష్యం పర్వ చాప్యుక్తం ఖిలే ష్వే వాద్భుతం మహత్.
ఏతత్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తంమహర్షిణా
యథావ త్సూతపుత్త్రేణ రోమహర్షణినా తతః
ఉక్తాని నైమిశారణ్యే పర్వా ణ్యష్టాదశైవతు......
2. చూ. సం. వా. చరిత్ర. [illegible] పుట.

వేఱువేఱుగాఁ బ్రకాశింపఁ జేసి రనియు నీభారతము చెప్పుచున్నది[1]. [illegible] స్పరవిరుద్ధములుగా నున్న వీనిమాటలనుబట్టి విషయము సందిగ్ధముగా నున్నను, కొందఱు భారతసంహితలే యైదుండె ననియు వానికి వీ రైదుగురు ప్రకాశకు లుగా నుండి రనియు భావించుచున్నారు. ఇందుకుఁ గారణము జైమినిభారత మనుపేర నశ్వమేధపర్వ మొకటి మహాభారతాశ్వమేధపర్వముకంటె వేఱుగాఁ గనవచ్చుటయే. సుమంతుఁడు మొద లగువారిభారతసంహితలు నశించిన వఁట. జైమినిభారతసంహిత యంతయు, బోఁగా నశ్వమేధపర్వము మాత్రము మిగిలె నఁట. మన కిపుడు లభించినమహాభారతసంహిత వైశంపాయనుఁడు ప్రకాశింపఁ జేసిన దఁట. ఈ యభిప్రాయ మంగీకరింత మన్న మొదటఁ బారాశర్యుఁ డైదుభారతసంహితలను వేఱువేఱుగా రచియించె నని సప్రమాణముగా నిర్ణయింపవలెను. కాని, యది శక్యము కాదు. తరువాత సామసంహితాప్రవర్తకుఁ డైనజైమినియే భారతసంహితాప్రకాశకుఁ డని నిశ్చయింపవలెను. అదియు శక్యము కాదు. పిదప నిపు డున్నమహాభారత మంతయు వైశంపాయనుని నోటనే లోకమునఁ బ్రచారమునకు వచ్చె నని నిరూపించవలెను. రోమహర్షణి యగు నుగ్రశ్రవసుఁడుకూడఁ గర్త యైనట్లును బ్రవక్త యైనట్లును గనవచ్చుటం జేసి యదియు శక్యము కాదు. ఎట్లయిన నేమి? మహాభారతగ్రంథ మంతయు నొకనోట వచ్చినది కాదు. ఒకకాలమునఁ బుట్టినది కాదు. అందుచేతనే గ్రంథకర్తృత్వమును గ్రంథస్థితియుఁ గూడ నవ్యవస్థములుగా నున్న వని తలంప వలసి వచ్చినది. ఇఁక—

## గ్రంథపరిమితి

అనుక్రమణికాధ్యాయములోని శ్లోకము లొకప్రతిలో నున్న ట్లింకొక ప్రతిలోఁ గనఁబడవు. దీనినిబట్టి యాయాకాలములందు తమలెక్కకు వచ్చినపర్వశ్లోకసంఖ్యనుబట్టి యనుక్రమణిలోనిశ్లోకములను సవరించుచు వచ్చి రని స్పష్టమగును. అట్లగుటచేతనే వావిళ్లవారిప్రాచీనముద్రితప్రతినిబట్టి యష్టాదశపర్వశ్లోకసంఖ్య ౮౪౭౭౦, వచ్చినది. ఆంధ్రసాహిత్యపరిషత్తులోని తాళపత్రప్రతినిబట్టి ౯౯౦౫౭౨ వచ్చినది. నన్నయభట్టారకుఁడాదిపర్వమునఁ జూపిన లెక్కనుబట్టి ౧౦౦౭౦౦ వచ్చినది. ఒక తెలుఁగుదేశములోని ప్రతుల నిట్లుండ నితరదేశములలోని

1. వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్,
సుమంతుం జైమినిం పైలం శుకం చైవ స్వమాత్మజమ్,
ప్రభు ర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవచ
సంహితా స్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః—[illegible], 90.

ప్రతులలో శ్లోకసంఖ్య యెట్లుండునో కదా! ఇందేది సత్యమన్నను లక్షశ్లోకసంఖ్య సరిపడదు. హరివంశాదిపర్వత్రయితో డిశతపర్వములశ్లోకసంఖ్య లక్షయేమో యందమన్న, ఆమూఁడుపర్వములలోనిశ్లోకములు ౧౨ వేలని యొకపాఠము. సుమారు ౧౮ వేలని యొకపాఠము, కనవచ్చుటచే[1] అపుడును లెక్క సరిపడదు. నిజముగా ననుక్రమణియభిప్రాయము పద్ధెనిమిదిపర్వములలోనిశ్లోకములు లక్ష యనియే. అయితే నేమి? లెక్క లిట్లు సిద్ధమైనవి. దీనిని బట్టి గ్రంథపరిమితి గూడ నవ్యవస్థ మనియుఁ బర్వశ్లోకానుక్రమణి యసంగతమనియు విదితమగుచున్నది. ఇఁక—

## మహాభారత విషయ పరిశీలనము

పదార్థానుక్రమణి యర్వాచీనమైనను దానం దెలియవచ్చుబహువిషయములలో సంప్రదాయసిద్ధములై ముఖ్యములైనవి సత్యవతి నియోగమునఁ గృష్ణద్వైపాయనుఁడు గావించిన కురువంశప్రతిష్ఠ పాండవులసత్యశీలము ధార్తరాష్ట్రుల దుర్వృత్తము వాసుదేవునిమాహాత్మ్యము, అనునవి. దానినిబట్టియు గ్రంథస్థితిని బట్టియుఁ బరిశీలించినచో భారతకథ కౌరవపాండవ మహాసంగ్రామముతో ముగిసినట్లు తెలియకపోదు. ఇందుకు స్త్రీపర్వాంతమున నున్న భారతఫలశ్రుతియే నిదర్శనము. స్వర్గారోహణపర్వముకడపటియధ్యాయములు విశేషఫలశ్రుతిపరములైనను, అవి యర్వాచీనములని తెలియకపోదు. స్త్రీపర్వముతుద నున్న—

ఇమం మహాయుద్ధమఖం మహాత్మనాం
శృణోతి నూనం పఠతే చ యః పుమాన్
స సమ్యగిష్టస్య మఖస్య యత్ఫలం
తదాప్నుయాద్వంశవివృద్ధిమాత్మనః
మఖో హి విష్ణుర్భగవాన్ సనాతనో
వహంతి తం చాగ్న్యనిలేందుభానవః
తద్దివ్యచారిత్రమిదం హి యః పఠేత్
సంప్రాప్తసంపత్స సుఖీ భవేదిహ.

అనుశ్లోకములు భారతము మహాసంగ్రామరూపయాగమని తెలుపుచుండ, నట్టియజ్ఞము సమాప్తమైన వెనుక నింకఁ గథాశేషమున కవకాశ మెక్కడిది?

---

1. దశశ్లోకసహస్రాణి వింశచ్ఛ్లోకశతాని చ
ఖిలేషు హరివంశేచ సంఖ్యాతాని మహర్షిణా
అష్టాదశసహస్రాణి శ్లోకానాం చ శతం తథా
ఖిలేషు హరివంశే చ సంఖ్యాతాని మహర్షిణా

శాంత్యాదిపర్వములలోని విషయమునకు భారతప్రధానకథతోఁ గలయిక యెక్కడిది? కావున శాంతి మొదలుగా నేడుపర్వములును మహాభారతమున నధికముగాఁ దరువాతఁ జేరిన వనుట నిజము. ఈ పక్షమున మొదటిపదునొకండుపర్వములలోని యుపాఖ్యానములును భగవద్గీత మొదలుగాఁ గల ప్రధానకథాసంబంధము లేని విషయములును గాక తక్కిన గ్రంథ మిరువదినాలుగువేలకు సరిపడి భారతసంహిత యగును. అనుక్రమణిలోని వాక్యములయభిప్రాయమును దీనికి సరిపడును. కాని, ఒకటిమాత్రము సత్యము. కేవలకురుపాండవకథయే యైనచో దీని కింతయశస్సు రాదు. ఏవి ప్రక్షిప్తభాగము లని యూహింపఁబడుచున్నవో వానికి సంబంధించిన డెబ్బదియాఱువేలగ్రంథము చేరుటచేతనే యిది ధర్మశాస్త్రమై వేదాంతమై పురాణసముచ్చయమై నీతిశాస్త్రమై మహాకావ్యమై యితిహాసమై వేదపఠనాధికారము లేనివారికి శ్రవణపఠనంబులఁ దరణోపాయమై పంచమవేదమై జగద్వంద్యమై మహాభారత మనుప్రసిద్ధి వహించినది. తరువాత వెలువడినబహువిధకావ్యములకుఁ దల్లియైనది. వర్ణాశ్రమాచారధర్మము లుపదేశింపఁ బరమగురు వైనది. వింటే భారతమే • వినవలె నన్నసామెతకు గుఱి యైనది. సకలప్రపంచ మావరించినది. కావున నిది యెట్లు పుట్టిన నేమి? ఎట్లు పెరిఁగిన నేమి? ఈపంచమామ్నాయమందలిపావనవిషయమే యాస్తికలోకమునకుఁ బెట్టినది భిక్ష. ఇందలిప్రధానవిషయము లోకమున కాబాలగోపాల ముగ్గుపాలతోఁ బెట్టినదే కావున దానిని గూర్చి వివరింపఁ బని లేదు. అయినను గొంత—

కథాప్రరోచనార్థమై యిందలి కొన్నిప్రధానపాత్రములజన్మవృత్తాంతము మహత్త్వబోధకముగా నున్నను, వానితరువాతిచర్య యంతయు మానవాతీతము గాదు. భారతయుద్ధము నిజముగా జరిగినదే యని యెల్లవిమర్శకులు నంగీకరించుటయే యిందలిమూలకథ మానవోచితమై సత్యమైన దనుటకుఁ దార్కాణము. కురుపాంచాలదేశములకు రాజకీయమైనసహజవైర మంతరంగముల నంకురించియున్నది. అది ద్రుపదునిచేఁ దిరస్కృతుఁడైన ద్రోణుఁడు, ద్రుపదుని బట్టి కట్టి తెం డని శిష్యులను బంపుటతో రేఁగినది. అది తరువాతఁ గౌరవపాండవుల యంతఃకలహమునఁ బుట్టి మహాసంగ్రామములో లీన మైనది. తుద కిటు కౌరవులు నటు పాంచాలురును నశించిరి. పంచపాండవులు మిగిలిరి. పరీక్షిత్తుతో నర్జునవంశము భూమిపై నిలచినది. ఇదికథాసారము. ఇఁకఁ గౌరవపాండవదాయభాగము.

"ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డి. విదురుఁడు పారశవుఁడు. అందుచే వారికి రాజ్యము లభించలేదు. కావునఁ బాండురాజు రాజయ్యెను—ధృతరాష్ట్రునకు మొదటనే రాజ్యము రాలేదు. అతఁ డిప్పు డెట్లు రా జగును? పూర్వము

రాజ్యము వదలుకొన్న భీష్ముఁడు మరల దానిని గైకొనఁడు కదా ! కావునఁ బాండవజ్యేష్ఠుని మూర్ధాభిషిక్తుని జేయుదము—నీవుజాత్యంధుఁడ వగుటచే మీతండ్రి రాజ్యము నీకు రాలేదు. పాండురాజునకు వచ్చినది. ఇపుడు దానిని ధర్మరాజు పొందె నేని క్రమముగా రాజ్య మతనివంశములోనివారికే లభించుచుండును. మేమును మావంశమువారును బరపిండోపజీవులమై యుండవలసివచ్చును—పాండురాజు ధర్మపరాయణుఁడు నన్ను మన్నించుచుండెడివాఁడు. ధర్మరాజు నట్టివాఁడే. పితృపైతామహ మైనరాజ్యమునుండి యతనిఁ దొలఁగించుట యెట్లు శక్యమగును—" [1].

అనెడివైశంపాయన పౌరజన దుర్యోధన ధృతరాష్ట్రులమాటలనుబట్టి పైతృకరాజ్యము పాండురాజునకు సంక్రమించినట్లు తెలియుచున్నది గాని, యతఁ డెంతో కాలము రాజ్యము చేయలేదు. రా జయినవెంటనే జైత్రయాత్ర వెడలి ధనరాసులు గొనివచ్చి యొకనెలమాత్రము రాజధానిలో నుండి పిదప భార్యలతో వేఁట నెపమున నడవులకుఁ బోయెను. అతఁడు మరల రాలేదు. అతనికొడుకులు వచ్చు నాఁటికి ధృతరాష్ట్రుఁడు రాజుగా స్థిరపడియుండెను. ప్రకృతిరంజను లైనపాండవులను జూచి యతఁడు నంతకంటె నెక్కువగా దుర్యోధనుఁడు నసూయాగ్రస్తులైరి. అందుచేతనే వారిని జంపించునుపాయములు గావించిరి. ఇందుకుఁ గారణము పైతృకరాజ్యమునఁ బాండవులకు హక్కు కల దనెడిచింతయే కదా ! పాండవులు ద్రౌపదిని బెండ్లాడి పాంచాలరాజు నింట సుఖులై యున్నా రని విన్నంతనే దుర్యోధనునిదుఃఖము దురంత మైనది. వారిని యుద్ధమునఁ జంపి రాజ్యము స్థిరముగా స్వాయత్తము గావించుకొనఁ గర్ణునియాలోచనంబున నిశ్చయించెను. అది తెలిసి భీష్ముఁడు "దుర్యోధనా ! ఇది నీతండ్రిరాజ్య మని నీవు తలఁచునట్లే తమతండ్రి రాజ్య మని పాండవులును దలంతురు. నీతండ్రి యిపుడు రాజుగా నుండుటచే నీకు రాజ్యము వచ్చిన దని నీయభిప్రాయము గాని, కులక్రమాగత మైనయీరాజ్యమును బాండవులు పూర్వమే పొంది రని నాయభిప్రాయము. వారి కీరాజ్యము రా దేని నీకుమాత్ర మెట్లు వచ్చును? కావున నపకీర్తికర మైనదురాలోచనము చేయక వారి కర్ధరాజ్య మిచ్చుట శ్రేయస్కరము" అని ధృతరాష్ట్రునిసమక్షమున హిత ముపదేశించెను. ద్రోణవిదురులు గూడ నిది మే లని తేనికిని గొడుకునకును జెప్పిరి. ఆంబికేయుఁడును వారిమాట కెదురాడ లేక పాండవులను రావించి యర్ధరాజ్య మిచ్చి వారిని ఖాండవప్రస్థమున నుండఁ బనిచెను [2]. పైమాటలనుబట్టి, పెద్దవాఁ డైనను అనర్హుఁ డగుటచే నాంబికేయునకు రాజ్యము సంక్రమింపనట్లును,

1. ఆది. 109. 141. 142. అధ్యా.
2. ఆది. 202. 203. 207. అధ్యా.

రాజై రాజ్యము దృఢపఱిచినపాండురాజునకు రాజ్యమున హక్కు వచ్చినట్లును, అతఁ డడవికి వెళ్లినతరువాత భీష్మవిదురులసాహాయ్యమునఁ బుడమికి నేలిక యైన ధృతరాష్ట్రునకుఁ దాత్కాలిక మైనహక్కేర్పడినట్లును, దానిని స్థిరపఱుచుకొన దుర్యోధనుఁడు కర్ణాదులతోఁ గలసి చేయుదురాలోచనములకువగచి కురుపితామహుఁడు వంశహాని కలుగకుండుటకై రాజ్యము చెఱిసగ మనుభవింప నిర్ణయము గావించినట్లును, ఆనిర్ణయమే పాండవులయర్ధరాజ్యప్రాప్తికిఁ బ్రమాణ మైనట్లును విదిత మగును. కావున నీవిషయము తరువాతిధర్మశాస్త్రాదులనుబట్టి నిర్ణయింపఁ దగదు. ఇక్కడ భీష్మవచనమే ధర్మశాస్త్రము. ఇదియే కౌరవపాండవులదాయభాగమునకు మూలము. ఇంక—

## కథాపాత్రౌచిత్యాదులు

భారతయుద్ధమునకుఁ బ్రధానకారణము దుర్యోధనునిరాజ్యకాంక్షయే యైనను, దానికంగములై యనేకకారణములు కథాపోషణమున నౌచిత్యపారము గాంచినవి. ఈవిషయమున గ్రంథకర్త యేపాత్రము నెట్లు లేవనెత్తెనో, యట్లే యెందును దడఁబాటు లేకుండఁ దుదముట్ట నొక్కరీతిని నడపె ననుటయే యీమహేతిహాసరచనలోని మహాద్భుత మైనవిశేషము. రాజ్యమునుగూర్చి దుర్యోధనునికిఁ బాండవులయెడ నసహనము. విలువిద్యనుగూర్చి కర్ణున కర్జునునెడ నసూయ. అట్టియిద్దఱికిఁ గుమారాస్త్రవిద్యాసందర్శనసమయమున గాఢమైత్రి. దురభిమాను లగుటచే ద్రుపదానయనమున కేగి యోడివచ్చినవీరిహృదయము మాఱలేదు. అర్జునుఁడు ద్రుపదుని బంధించుటయే పాంచాలపాండవులబాంధవమునకు మూలమైనది. మత్స్యయంత్ర మేయ లేక తిరిగివచ్చియుఁ బార్థుఁ డాపని చేసెనని విన్నంతనే వీరిరువురి యీసును మితిమీఱినది. రాజసూయమునఁ బాండవేయులవిభవము చూచినగాంధారేయునిహృదయము భగ్గు మన్నది. దానిపై ద్రౌపదినవ్వు నెయ్యి పోసినది. ఇఁకఁ జెప్పెడి దేమి? అది జూదము కల్పించినది. అది కౌంతేయులరాజ్యలక్ష్మి నపహరించుటతోఁ బాంచాలిని సభ కీడ్చించి ఫలించినది. అపుడు భీమార్జునులహృదయమున శౌర్యాగ్ని రగులుకొన్నది. కాని, ధర్మజునిసత్యమున నది నివుఱుగప్పినట్లయినది. అంతటితో వారిచల ముడిగినదా? పునర్ద్యూతమునఁ బాండవుల నడవులకుఁ దఱిమినది. ఘోషయాత్రనెపమున వారిని బరిహాసింపఁ గడంగినది. అందు గర్వభంగ మైనను వారియసహనముచల్లారినదా? అపుడు గాకున్న మానె. ఉత్తరగోగ్రహణమందు గాని తుదకు శ్రీకృష్ణునిరాయబారమందుగాని యుపశమించెనా? అసహనము తొఱ్ఱలోనినిప్పు. అది తానాశ్రయించినవారిని నశింపఁజేయకుండఁ దాను నశించునా? కడ కంతే యైనది. ఈవిషయమున నిట్లు పోషింపఁబడినయీపాత్రములు త్యాగభోగపరాక్రమంబులందు

నెంతయు సముచితముగాఁ బోషింపఁబడిన వనుట విదితము. ఇంత యేల! పితృభక్తి పరాక్రమప్రతిజ్ఞాపరిపాలనంబుల భీష్ముఁడును సత్యధర్మపరిపాలనంబున ధర్మరాజును బలశౌర్యసౌశీల్యముల భీమార్జునాదులును రాజనీతిని శ్రీకృష్ణుఁడును నిరుపమాన విక్రమంబున నభిమన్యుఁడును, ఇంకను వివిధగుణంబుల ద్రోణాదులును ప్రవర్తించినవిధ మెఱిఁగినపాఠకలోకమునకు భారతకవి పాత్రపోషణవిధానము పట్టిచూపవలెనా? ఇతనిపాత్రపోషణకల కాద్యుదాహరణ మనఁదగినది ద్రౌపదీపాత్రము. పంచపాండవులలో నెవ్వరిమనసు నొవ్వకుండ మెలఁగునప్పుడును ద్యూతసభకుఁ బోయి ధర్మసందేహము తీర్చుకొని రమ్మని ప్రాతికామిని బంపునప్పుడును సభ కీడ్వఁబడి మానరక్షణార్థము గోవిందుని స్మరించుతఱిని వనములో సైంధవునుద్రేక మణఁగించుతఱిని సుధేష్ణయింట సైరంధ్రియై యున్నపట్టున సింహబలునిచేత భంగపాటు తప్పించుకొనుపట్టున భర్తలకు వీరావేశముగలిగించుచు మనసులోనిదుఃఖము వెడలఁగ్రక్కుచుఁ గృష్ణునితో మాటలాడునెడఁ బాతివ్రత్యము ధర్మజ్ఞత ధైర్యము చిత్తస్థైర్యము పరేంగితజ్ఞానము సమయస్ఫూర్తి లోకజ్ఞత రాజనీతిజ్ఞత యను సుగుణములు మూర్తీభవించినట్లుగాఁ బాంచాలీపాత్రమును బోషించినభారతకవిది గాక పాత్రపోషణము మఱెవరిసొమ్ము? ఇది యిట్టి దని విద్వల్లోకప్రసిద్ధమై యుండ, సెండర్ (Sehneider) అనుపాశ్చాత్యవిమర్శకుఁ డొకఁడు "మహాభారతముముఖ్యోద్దేశ మేదో యొకవిధమున శత్రువులను సంహరించుటయే యనియు, ఇందలిపాత్రములు కొంతవఱకు బాగుగాఁబోషింపఁబడినను, మొత్తముమీఁద మానవశీలమున కుచితములుగా లేవనియు"[1] విమర్శించుట యెట్టిదో యూహింపుఁడు.

ఇందలి యష్టాదశసంఖ్యానియమ మెందుకు వచ్చినదో సరిగాఁ దెలియరాదు గాని, అష్టాదశద్వీపములకును, అష్టాదశవిద్యలకు నిది స్మారక మేమో యని తోఁచుచున్నది. ఈమహాకథలో యుద్ధము పదునెనిమిది దినములు జరిగినట్లు వర్ణింపఁబడినది. అందుకుఁ దగినట్లు రెండుపక్షములలోని సేనలమొత్తము పదునెనిమిదియక్షౌహిణులు. ఈసంఖ్యలకు సాటిగాఁ బర్వములు పదునెనిమిది. ఈమూఁడింటిని సమర్థించుటకో యన సకలవేదాంతసారమైన భగవద్గీతోపనిషత్తు పదునెనిమిదియధ్యాయములు. ఇది యెప్పుడు పుట్టిననేమి? నిజముగా నీశ్వరుని నోటనే వచ్చినదేమో యనునట్లుగా ముముక్షువులకు జీవేశ్వరతత్త్వమును గరతలామలకము గావించు దీనివంటియుత్తమమత గ్రంథము వేఱొండు లే దనుట సాహసము కాదు. దీనితరువాత నెన్నఁదగినది సనత్సుజాతీయము. ఐహికజ్ఞానమున కాకరమైనది విదురనీతి. ఐహికాముష్మికములు రెంటిని సోదాహరణముగా బోధిం

1. The History of World Civilization Vol. II. P. 736.

చునది శాంతిపర్వము. సుమారు పదునాలుగువేలగ్రంథ మయినశాంతివలెఁ జిత్త శాంతిని గలిగించుసాధనము మఱొకటి కానరాదు. ఏతాదృశమహాత్త్వంబునఁ బరిఢవిల్లుపంచమవేదము వెలయుట భరతఖండముపాలిటి భాగ్యముగాక మఱేమి ? ఇట్టిమహాభారతమున కనుబంధముగా వెలసినది హరివంశము. మూఁడుపర్వము లతో విలసిల్లునిది శ్రీకృష్ణునిమహామహిమను దెలుపుచున్నది. దీనితోఁ గలసి మహాభారతము శతపర్వసంజ్ఞను గాంచిన దగుటచే నిది, యది వెలసినవెంటనే యుదయించిన దనితోఁచుచున్నది. ఇందు భగవదవతారకథలు వర్ణింపఁబడినవి. భారతమందలి యుత్తమోపాఖ్యానములంబోలిన యుపాఖ్యానములు నిందు గలవు. ఇఁక—

"ధర్మార్థకామమోక్షార్థై స్సమాసవ్యాసకీర్తనైః,
తథా భారతసూర్యేణ నృణాం వినిహతం తమః
ఇతిహాసప్రదీపేన మోహావరణఘాతినా
లోకగర్భగృహం కృత్స్నం యథా వత్సంప్రకాశితమ్"

అనుచును, 'యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్' అనుచును భారతమహిమను మనసార స్మరించి దీనివ్యాఖ్యానములను గూర్చి యించుక తెలిసికొందము.

దీనివ్యాఖ్యలలో సర్వజగద్వ్యాప్త మైనది భావదీపము. దీనికి నీలకంఠీయ మనియుఁ బేరు కలదు. గోవిందసూరితనయుఁ డగునీలకంఠపండితుఁడు దీనికర్త. గోదావరికిఁ బశ్చిమమున మహారాష్ట్రదేశమం దున్నకూర్పర మనుగ్రామమున నితఁడు నివసించినవాఁ డని తెలియవచ్చినది. అర్జునమిశ్రుఁ డితనికిఁ బూర్వము భారతమునకు వ్యాఖ్య రచియించిన ట్లితనిరచనలో నందందు గనవచ్చును. అభయానందపూజ్యపాదుని శిష్యుఁడును, విద్యాసాగరనామాంతరుఁడు నగునానందపూర్ణమునీంద్రుఁడు రచియించిన వ్యాఖ్యానరత్న మను మఱియొకవ్యాఖ్యయు, లక్షాభరణ మను నింకొకటీకయుఁ గలవు. మఱియు, సర్వజ్ఞనారాయణకృత మైన మహాభారతవ్యాఖ్య యొకటి కలకత్తాపుస్తకభాండాగారమున నున్నట్లును, అది నీలకంఠీయమువలెనే యుత్తమవ్యాఖ్య యైనట్లును దెలియవచ్చును. ఇంక నెన్ని యొందెందు కలవో !

మహాభారతము శతపర్వ మనెడి దృఢవిశ్వాసముతోనే, అర్జునమిశ్రుఁడు హరివంశముమూఁడుపర్వములకుఁ గూడ వ్యాఖ్యానము రచియించెను గాని, కేవలము శ్రీకృష్ణచరితము బోధించుదానికి భారతముతో నెట్టిసంబంధమును లేదు.

అయినను మహాభారతకథలో ధర్మపక్ష మవలంబించి దానికి జయముకలిగించిన శ్రీకృష్ణునిమహాత్త్వము హరివంశరూపమున మహాభారతమున కనుబంధముగా దానివెంటనే యుదయించి యుండు నని భావింపవచ్చును గాని జైమినిభారత మట్టిది కాదు. ఇది రామాయణము నుత్తరకాండ ముదయించినతరువాతఁ బుట్టిన దని యిందలి కుశలవవృత్తాంతమే తెలుపుచున్నది. అందుచే నర్వాచీనకాలమున నుత్పన్నమైన యిది జైమినిపేరఁ బ్రసిద్ధి కెక్కినను భారతసంహితాసమకాలిక మని తలంపరాదు. అట్టి యీరెంటికర్తృత్వముగూడ సందిగ్ధముగానే యున్నది. వీనిదే కాదు, తక్కినపురాణముల కర్తృత్వమునిట్టిదే. ఇఁకఁ బురాణములు.

ఇది, ఆంధ్రమహావీరచరిత్రోత్తరరామచరిత భీష్మప్రతిజ్ఞా సత్యకీర్త్యాది
రూపకకర్తయగు మల్లాది సూర్యనారాయణశాస్త్రి నిర్మించిన
సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయభాగమగు
లౌకికవాఙ్మయచరిత్రయందు
ద్వితీయాధ్యాయము.

---

# తృతీయాధ్యాయము



## పురాణములు

చతుర్దశవిద్యలలో గణనకెక్కినయివి జన్మచే నర్వాచీనము లయ్యును మిక్కిలిపురాతనము లయినబహువిషయములను వర్ణించిన వగుటచేఁ బురాణము లైనవి. రామాయణమహాభారతములవలె శ్రవణపఠనవ్యవహారమున సార్వజనీనములై భరతఖండమంతట వ్యాప్తి గాంచినయివి మిత్రసమ్మితము లని విఖ్యాతి కెక్కినవి. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితము లెందు వర్ణింపఁబడునో యది పురాణ మనులక్షణమునకుఁ దగినట్లుగాఁ బురాణములందు పూర్వసృష్టి స్థితిలయములు పునస్సృష్టి దేవతావంశక్రమము బ్రహ్మర్షి రాజర్షి గోత్రక్రమములు మన్వంతరములు సూర్యచంద్రవంశరాజులచరితములు మొదలగుబహువిషయములే కాక సంహితాబ్రాహ్మణారణ్యకోపనిషత్తులందును రామభారతాఖ్యానములందును బీజరూపమున నున్నవివిధేతిహాసములును సవిస్తరముగా వర్ణింపఁబడియున్నవి. అట్లని, యన్నిటియందును బై విషయము లన్నియు సక్రమముగా సంపూర్ణముగా వర్ణింపఁబడిన వని భావింపరాదు. ఒకదానియందు సంగ్రహముగా నున్నది మఱియొకదానియందు వివరముగా నుండును. ఒకచో లేనిది మఱొక్కచో నుండును. ఒకట నొకమార్గమున నున్నది మఱొకట వేఱొకత్రోవ నుండును. అయినను పౌరాణికసంప్రదాయమున నట్టివెల్ల సమన్వయైక్యము గాంచు ననుటయే యిందలివిశేషము. ఇది వాయుప్రోక్తము, ఇది పరాశరప్రోక్తమిత్యాద్యవాంతరమతములతోనివి యన్నియు వ్యాసప్రోక్తము లనెడిమతము సుప్రసిద్ధమై యున్నది గాని, ఇవి యొకకాలమందు పుట్టినవియు నొకనోటఁ బుట్టినవియుఁ గావనుట స్పష్టము గావున వీనికర్తృత్వ మజ్ఞేయ మనవచ్చును. ఇఁక, స్మృతులవలె దేనికదే యాద్య మని భ్రాంతి గొలుపుచున్నవీనికాలమందుమా, అది మఱియు దురవగాహము గా నున్నది. బ్రాహ్మణారణ్యకములందు పురాణశబ్ద మున్నది గాని, అందది ప్రాచీనగాథాపర మని కొందఱు తలంచిరి. భారతమున నీపద మున్నది. అదికూడఁ బురాణశబ్దవాచ్యమయినట్లు నందే యున్నది. ఆపస్తంబధర్మసూత్రము భవిష్యత్పురాణమును బేర్కొన్నది [1]. అష్టాదశపురాణములసారము సంగ్రహించి కృష్ణద్వైపాయనుఁడు భారతసంహిత రచియించె నని పారాశర్యోపపురాణము చెప్పినది. పదునెనిమిదిపురాణములను వ్యాసుఁడే నిర్మించె నని సకలపురాణములు చెప్పినవి. పాద్మవారాహాశ్వ

---

1. ఇపుడు కనవచ్చునది యంత ప్రాచీనము గాదు, దీనికంటె నది వేఱై యుండును.

తాదికల్పములందు బ్రాహ్మ పాద్మ వాయవ్యాదిపురాణము లుత్పన్నములైన వని మాత్స్యాదిపురాణములు చెప్పినవి. ఎట్లు చూచినను బురాణములకాలము క్రీ. శ. ఆఱవశతాబ్దినిదాఁటియావలికిఁ బోఁజాల దని కొందఱు పాశ్చాత్యపరిశోధకులు వక్కాణించిరి. ఇట్లొకటి యేటికిఁ దీసిన నొకటి కోటికిఁ దీయుచున్నది. ఈరీతి నిది యిత్థమనుటకు వీలు గాకున్న వీనికాలమునుగూర్చి చర్చించినలాభము లేదు గావున నాకుఁ దోఁచినయభిప్రాయ మిచ్చెదను.

రామభారతాఖ్యానములలోనివే కాక హరివంశములో వర్ణితము లైన విషయములుకూడఁ గొన్ని వాయు విష్ణు భాగవతాదులందు కనవచ్చుచున్నవి కావునఁ బురాణములమాటలనుబట్టి యివి భారతాదులకుఁ బూర్వము లనుటకు వీలు లేదు. వైదికగ్రంథములందు పురాణేతిహాససంజ్ఞ లుండుటను, ఆపస్తంబాదులందు కొన్నిపురాణములపే ళ్లుండుటను జూచినచో, వ్యాసోపజ్ఞము లైనవివిధ పురాణగాథ లిప్పటివేళ్లతోనే తొల్లివ్యవహారమున నుండెడి వనితోఁచకపోదు. వీనియుదంతము వేదాంగములవృత్తాంతమువంటిది [1]. మఱియు, అమరసింహుని నాఁటికిఁ బురాణము పంచలక్షణ మని నిర్ణీత మగుటను భాసకాళిదాసాశ్వఘోషాదులు పురాణముల నెఱిఁగియుండుటను దెలిసికొన్నచో నివి క్రీస్తుశకారంభమున కీవలి వని చెప్పుట కవకాశము కనఁబడదు. కావునఁ గర్మ భక్తి జ్ఞానమార్గములను సులభముగ నుపదేశించుచు నడుమనడుమ నాస్తికమతముల నణఁగఁద్రొక్కుచు శైవవైష్ణవమతములను విగ్రహారాధనమును విస్తరింపఁజేయుచు వచ్చిన యివి హరివంశమునకును గ్రీస్తుశకారంభమునకును మధ్యకాలమున నుదయించి యుండు నని తోఁచుచున్నది. తరువాత శైవవైష్ణవాదిమతములు పరస్పరము ప్రతిఘటించుకాలమం దనఁగాఁ గ్రీస్తుశక మాఱేడుశతాబ్దులలోపల నుపపురాణములును, ఆగ్నేయము స్కాందము మొదలగుపెక్కుపురాణములలోని యనేక భాగములును వెలసియుండును. ఈ విషయ మింకను చారిత్రకలోకము పరిశీలించుఁ గాక.

పురాణములు, మహాపురాణము లని యుపపురాణము లని రెండు విధముల నున్నవి. ఇవి పదునెనిమిదేసి యని సర్వత్ర కనవచ్చును గాని, లెక్కింప నంతె కెక్కువగా నే కనఁబడుచున్నవి. ఒకపట్టికలోనిబ్రహ్మాండపురాణమునకు బదులుగా మఱియొకపట్టికలో వాయుపురాణ మున్నది. మహాపురాణములలో దేవీభాగవతమును గొందఱు, భాగవతమును మఱికొందఱు పరిగణించిరి. ఒకచోటఁ జేరిననారదీయ మింకొకచోటఁ జేరలేదు. ఇఁక నుపపురాణము లందుమా, వానికి లెక్కయే లేదు. ఇట్లవ్యవస్థముగా నున్నవీనిలెక్కలను గూర్చి చర్చింపక విష్ణుపురాణమునుబట్టి ముందుగా మహాపురాణములను జూపుచున్నాము.

1. మా. సం. వా. ప్రథ. పుట. 271, 272.

| ౧ | ౨ | ౩ |
| --- | --- | --- |
| వైష్ణవము | బ్రహ్మాండము | మాత్స్యము |
| నారదీయము * | బ్రహ్మకైవర్తము * | కౌర్మము |
| భాగవతము | మార్కండేయము | లైంగము |
| గారుడము | భవిష్యము | శైవము |
| పాద్మము | వామనము * | స్కాందము |
| వారాహము | బ్రాహ్మము | ఆగ్నేయము |

ఇందు ౧ గుర్తుకలవి శ్రీమన్నారాయణుని బ్రశంసించునవి కావున సాత్త్వికములు మోక్షప్రదములు. ౨ గుర్తుకలవి సరస్వతీచతుర్ముఖకృశానులను స్తుతించునవి కావున రాజసములు స్వర్గప్రదములు. 3 గుర్తుకలవి దుర్గా శివలింగ విఘ్నేశకుమారులను జెప్పునవి కావునఁ దామసములు దుర్గతిదాయకములు. వీనిని గలలోనైనఁ జూడఁగూడదు. వీనిని విన్నవారికి మతిపోవును. అని పారాశర్యోపపురాణము నిర్ణయించినది. వీనిలో * పువ్వుగుర్తుగలవానికి బదులుగా వాయవ్య బ్రహ్మవైవర్త [1]. మహా(దేవీ)భాగవతములను బృహద్ధర్మపురాణము చేర్చినది. నారసింహపురాణమును మఱికొన్ని చేర్చినవి. ఇట్లు మహాపురాణము లిరువదిరెండైనవి [2]. వీనివృత్తాంతము తెలుప నివియే గతి కావున మత్స్యవిష్ణుపురాణాదులనుబట్టి దాని నిందు సంగ్రహముగాఁ జూపెదను.

"కృతయుగమునందు బ్రహ్మ శతకోటిప్రవిస్తరము బ్రాహ్మసంజ్ఞము నైన పురాణసంహితాస్కంధము నిర్మించెను. దానిసారమును వేదవ్యాసుఁడు నాలుగు లక్షలశ్లోకములపరిమితి గలయష్టాదశపురాణసంహితనుగా రచియించి సూతుఁడైనరోమహర్షణునికిఁ జెప్పెను. అతఁడు తనకొడుకైనయుగ్రశ్రవసునికి బోధించెను. ఆ రౌమహర్షణి నైమిశారణ్యమందలి శౌనకాది మహర్షులకుఁ దెలియఁజెప్పెను. అన్నిపురాణములలోను బ్రాహ్మము మొదటిది. మరీచికి బ్రహ్మ యుపదేశించిన యాగ్రంథము పదివేలు. పద్మపురాణగ్రంథ మేఁబదియైదువేలు. సకలధర్మముల నుపదేశించువిష్ణుపురాణములోనిశ్లోకసంఖ్య, ఆఱు—ఎనిమిది—తొమ్మిది—పది—ఇరువదినాలుగు—వే లని పాఠాంతరములు కలవు. కాని, లోకములో శ్రీధరీయవిష్ణుచిత్తీయవ్యాఖ్యలతో ముద్రితమైనయిందలిగ్రంథ మాఱువేలుమాత్రమే. రుద్రమాహాత్మ్యబోధకమై వాయుప్రోక్తముగా ఖ్యాతి గాంచినశైవపురాణ మిరువదినాలుగువేలశ్లోకములు కలది. ఇందు గాయత్రి నధికరించి ధర్మవిస్తరము వర్ణింపఁబడినది. వృత్రాసురవధ వర్ణింపఁబడినభాగవతము పదునెనిమిదివేలగ్రంథము. నార

1. దీనినిగూర్చి ముందు తెలిపెదను.
2. కాని, వాయుపురాణము శైవపురాణముకంటె వేఱుకాదు.

డుఁడు బృహత్కల్పాశ్రయము లైనధర్మము లుపదేశించిననారదీయగ్రంథ మిరు వదియైదువేలు. జైమినిమార్కండేయసంవాదరూప మైనమార్కండేయములోని శ్లోకసంఖ్య ముప్పదిరెండువేలు. భృగుమహర్షి, చయనములయుత్పత్తియు నిష్టకా గణనము మొద లగుక్రతువిషయములు తెలిపినయాగ్నేయ మష్టసాహస్రము. వ్యాసశిష్యుఁ డైనసుమంతుఁడు శతానీకున కుపదేశించినధర్మసారముతోడిభవిష్య మున ముప్పదియొక్కవేయి గ్రంథము కలదు. వసిష్ఠుఁ డంబరీషునకు వైష్ణవధర్మ ములును బ్రాహ్మసర్గము నుపదేశించినబ్రహ్మకైవర్తము ద్వాదశసాహస్రకము. నంది చెప్పినయీశానకల్పవృత్తాంతముతోడిలైంగ మేకాదశసహస్రకము. విష్ణుమూర్తి భూదేవికిఁ జెప్పినవరాహావతార మాహాత్మ్యము గలవరాహపురాణ మిరువది నాలుగువేలగ్రంథము. షణ్ముఖుఁడు చెప్పినమాహేశ్వరధర్మములు రుద్రచరితములు గలస్కాందము లక్షగ్రంథము. చతుర్ముఖుఁడు త్రివిక్రమమహాత్త్వమును, త్రివర్గము లను త్రిమూర్తులను వర్ణించినవామనము చతుర్దశసహస్రశ్లోకము. కూర్మరూపి యగుజనార్దనుఁడు దేవేంద్రసన్నిధిని ఋషులకు ధర్మార్థకామమోక్షములు బోధిం చినకూర్మపురాణము షట్సహస్రశ్లోకము. మత్స్యరూపి యగుమాధవుఁడు మనువు నకు నరసింహోపవర్ణనముం గూర్చి చెప్పినమత్స్యపురాణము చతుర్దశసహస్ర శ్లోకము. గారుడకల్పమున విశ్వాండ మంతయు గారుడోద్భవ మని విష్ణువు చెప్పినగారుడపురాణము షోడశసహస్రగ్రంథపరిమితము. బ్రహ్మ, యజాండమహా త్త్వము వర్ణించినబ్రహ్మాండపురాణమందలిశ్లోకములు పన్నెండువేలరెండువందలు[1]

1. ఇట్లు మత్స్యపురాణ మిచ్చినపురాణగ్రంథసంఖ్యలు సరి యని కాని, దాని నాఁటికే పదునెనిమిదిపురాణములు సిద్ధ మైన వని కాని తలంపరాదు. ఇట్టిలెక్కలును, అష్టాదశపురాణ నామములును గొంచె మెచ్చుతక్కువగా నన్ని పురాణములందును గనవచ్చుటనుబట్టి యర్వాచీను లెవరో తమనాఁటికిఁ గనవచ్చిన గ్రంథసంఖ్యలతోఁ బురాణములపేళ్లను బ్రతిపురాణమందును జేర్చుచు వచ్చి రని విశ్వసింపనగును. ఇందుకు వాయుపురాణము చూపినయీక్రింది లెక్కలు పైవానిని బోలకుండుటయే నిదర్శనము.

| పురాణము. | శ్లోకసంఖ్య. | పురాణము. | శ్లోకసంఖ్య. | పురాణము. | శ్లోకసంఖ్య. |
|---|---|---|---|---|---|
| మాత్స్యము. | ౧౪౦౦౦ | బ్రాహ్మము. | ౧౦౦౦౦ | పాద్మము. | ౫౫౦౦౦ |
| భవిష్యము. | ౧౪౫౦౦ | వామనము. | ౧౦౦౦౦ | కౌర్మము. | ౧౭౦౦౦ |
| మార్కండేయము. | ౯౦౦౦ | ఆగ్నేయము. | ౧౦౬౪౦ | వారాహము. | ౨౪౦౦౦ |
| బ్రహ్మవైవర్తము. | ౧౮౦౦౦ | వాయవ్యము. | ౨౩౦౦౦ | స్కాందము. | ౮౧౦౦౦ |
| బ్రహ్మాండము. | ౧౨౧౦౦ | నారదీయము. | ౨౩౦౦౦ | | |
| భాగవతము. | ౧౮౦౦౦ | గారుడము. | ౧౯౦౦౦ | | |

ఇది, అష్టాదశపురాణగ్రంథసంఖ్యలు చెప్పఁ బ్రతిజ్ఞ చేసినదిగాని, విష్ణులింగ పురాణముల కీశ్లో ముద్రిత పుస్తకములో లేవు.

ఇందు రాఁబోవుకల్పములవృత్తాంతము వర్ణింపఁబడినది. అన్నిపురాణములందును సర్గ ప్రతిసర్గాదికర్త శ్రీవిష్ణు వనియే చెప్పఁబడినది. యతో వా ఇమాని భూతా నీత్యాదిశ్రుతివాక్యముల తాత్పర్యము నట్టిదే. విష్ణువే బ్రహ్మ, విష్ణువే శివుఁడు, విష్ణువే యాదిత్యుఁడు. సర్వము విష్ణుమయము. ఇదే పౌరాణికవాక్కు. అష్టాదశ పురాణములందు నట్టియేకాద్వితీయపురుషునే భావింపవలసినది. దీని నతిక్రమించిన వారు నారకు లగుదురు''

ఇత్యాదిగాఁ దెలియవచ్చుపురాణవృత్తాంతమందలి గ్రంథసంఖ్యలు సరిగా నిప్డు లేవు. అన్నిటిలోను బ్రక్షిప్తగ్రంథము చేరి యున్నది. మఱికొన్ని విశేషములు.

వాయుపురాణము, శైవపురాణము :—ఇవి రెండును వే అని కొన్ని యుప పురాణములలోనిపురాణనామపట్టికలు భ్రాంతి కలిగించినమాట సత్యము. దానిని బట్టి మహాపురాణములలోనిది శైవపురాణ మనెడిప్రతీతి కలిగినది. ప్రాచీనముగాఁ గనవచ్చువాయుపురాణము మహాపురాణములలో గణింపఁబడక పోవుటకుఁ గారణ మేమని పెక్కండ్రకు సంశయమును గలిగినది. ఇందలివాస్తవ మరయఁగా నీరెండు నొకటే కాని వేఱుకా వని—

"యత్ర త ద్వాయవీయం స్యా ద్రుద్రమాహాత్మ్యసంయుతమ్
చతుర్వింశ త్సహస్రాణి పురాణం శైవ ముచ్యతే"

అనుమత్స్యపురాణవచనము వల్లఁ దెలియ వచ్చినది. బొంబాయినగర మున ముద్రిత మైనవాయుపురాణములోని గ్రంథసంఖ్య పండ్రెండువేలుమాత్రమే. అందు శైవసంజ్ఞ కనరాదు గాని వ్రాతప్రతులందు—

"ఇతిశ్రీవాయుపురాణం శివాపరాహ్వాయం సమాప్తమ్''
"ఇతిశ్రీవాయూక్తచతుర్వింశతిసాహస్ర్యాం శివసం
హితాయా ముత్తరఖండే శ్రీనర్మదామాహాత్మ్యే—''
"ఇతి శ్రీవాయుపురాణే లక్ష్మీసంహితాయా మానందకాననమాహాత్మ్యే"
"ఇతి శ్రీమహాపురాణే వాయుప్రోక్తే ద్వాదశసాహస్ర్యాం
సంహితాయాం బ్రహ్మాండావర్తం సమాప్తమ్"
"పంచదశసహస్రాణి ఖండేఽస్మిన్ మునినా పురా,
గ్రంథసంఖ్యాని గదితా—ఇతి శ్రీవాయుపురాణం శివా
పరాహ్వాయం సమాప్తమ్".

ఇత్యాదిగా భిన్నభిన్నదేశలిఖితవాయవ్య గ్రంథాంతగద్య లనేకములు కనఁ బడుచున్నవి [1]. వీనినిబట్టియు, గ్రంథవిషయ వివరణాదులనుబట్టియుఁ జూడఁగా,

---

1. లండన్, ఇండియా ఆఫీసు సంస్కృతగ్రంథ విషయ వివరణపట్టిక. Vol. VI

పూర్వోత్తరఖండములతో ముద్రిత మైనవాయుపురాణములోని గ్రంథసంఖ్య పన్నెండువేలు మాత్రమే యనియు, తక్కినపండ్రెండువేలగ్రంథము ముద్రితము కాలే దనియు, తొలుత నిది యిరువదినాలుగువేలే యైనను మఱిమూఁడువేల గ్రంథ ముత్తరఖండమునఁ బ్రక్షిప్త మైన దనియు, వాయుప్రోక్త మనెడిమాటను బట్టి యిది వాయుపురాణముగాఁ బ్రసిద్ధి గాంచినది గాని విషయమునుబట్టి యిది శివపురాణమే యనియు, మత్స్యపురాణము చెప్పిన వాయుశైవపురాణములు రెండు నొకటే యనియుఁ దేలినది. కాని, కొన్ని యుపపురాణములును మాడ్డోనలు మొద లగుకొందఱువిమర్శకులును వీనిని వేఱుగా గణించుటకు శివపురాణ సంజ్ఞ కలమఱియొకపురాణము కనవచ్చుటయే కారణము. ఎట్లయినను, అనేకము లైన నదీవర్ణనములును బహుతీర్థవర్ణనలును ముద్రితవాయుపురాణమున లేక లిఖిత పుస్తకములం దుండుటయు, ప్రక్రియాపాదము—అనుషంగపాదము—ఉపోద్ఘాత పాదము—ఉపసంహారపాదము—అనుభాగములు క్రమముగా నుండవలసినట్లు సర్వత్ర కనవచ్చుచుండ ముద్రితపుస్తక మనుషంగపాదమందలి సృష్టివర్ణనముతో సమాప్తి గాంచుటయు వాయవీయసంహితయనుపేర ముప్పదియధ్యాయముల గ్రంథము దీని కధికముగాఁ శైవాపరనామమునఁ జేరుటయుఁ జూచినచో ముద్రితగ్రంథ మసంపూర్ణ మనియు శివాపరాహ్వయవాయుపురాణము తొల్లియిరువది నాలుగు వేలగ్రంథ మనియుఁ దెలియకపోదు. ఇంక—

భాగవత దేవీ (మహా) భాగవతములలో నేది మహాపురాణములలోని దను విషయమును గూర్చి రెండుశతాబ్దుల క్రిందటనే యుత్తరహిందూదేశమున వివాద ముదయించి గ్రంథరూపముదాల్చి యచ్చటనే యణఁగినది కాని, దానివాసన దక్షిణహిందూదేశమునకుఁ గూడ రాకపోలేదు. ఈరెండునుగూడ ఖ్యాతి కెక్కి నవే యైనను, భాగవత మీరెంటిలో నెక్కువ ప్రసిద్ధి గాంచిన దనువిషయము నెవరును మఱుఁగుపఱుపఁ జాలరు. అయితే నేమి? మతాభినివేశము కారణముగా భాగవత మనార్ష మంటే దేవీభాగవత మనార్ష మనెడి కలహము పుట్టినది. అందలి కారణములను జర్చించుచుఁ గాశీనివాసియు దక్షిణాచారప్రవర్తకుఁడు నైనగడా కాశీనాథభట్టు, దేవీభాగవతమే ప్రమాణము; అదే మహాపురాణములలోనిది, భాగవత మార్షమే కాదు, అని నిర్ణయించుచు, దుర్జనముఖచపేటిక యనుగ్రంథము రచియించి భాగవతపక్షవాదులను నిరసించెను. దాని కుపోద్బలకముగా “భాగవతము వ్యాసునిపేర వోపదేవుఁడు రచియించినది గాని వ్యాసుఁడు నిర్మించినది కా దనువాదము పుట్టినది. ఆవాదమును నిరసించుచు భట్టోజీదీక్షితులశిష్యుఁ డగు రామాశ్రమపండితుఁడు “భాగవతము వోపదేవరచితము గాదు, అది యార్షమే, దేవీభాగవత మార్షము కాదు” అనుచు దుర్జనముఖచపేటికయను మఱియొకఖండనగ్రంథము రచియించి దేవీభాగవతపక్షవాదులను ధిక్కరించెను. అంతట మఱి

యొకపండితుఁడు దానిని ఖండించుచు దేవీభాగవతార్షత్వము స్థిరపఱచుచు దుర్జనముఖపద్మపాదుక యనుఖండనగ్రంథము రచియించెను. దీనినిబట్టి మనదేశములోఁ గూడ నీరెంటిలో నేది యార్ష మనియు, భాగవతము వోపదేవనిర్మితమా యనియుఁ గొందఱు సంశయించుట కలదు. ఈపెద్దచర్చ కిం దవకాశము తక్కువ గావున నాయభిప్రాయము సంగ్రహముగాఁ దెలిపెదను.

బృహద్ధర్మపురాణాదులు కొన్ని యీరెంటినిగూడ నష్టాదశపురాణములలోఁ జేర్చియుండ వీనిమహాపురాణత్వము మనము చర్చింపఁ బనిలేదు. తక్కిన పురాణములవలె నివియు నార్షములే యని బహుకాలముగా విద్వల్లోక మెల్లను విశ్వసించినది గావున వీనియార్షత్వమును మనకుఁ జర్చనీయము కాదు. ఇఁక భాగవతము వోపదేవనిర్మిత మనెడినవీనసిద్ధాంతముమాత్రమే మన కిపుడు విమర్శనీయము.

క్రీ. ౧౨౭౧—౧౩౦౯ నడుమ యదువంశసంజాతుఁడును రామచంద్రాపరనాముఁడు నగురామరాజు దేవగిరిరాజ్యము పాలించెను. అతనియాస్థానమున మహామంత్రి హేమాద్రి యనుద్విజవరుఁడు. అతఁడు కటకపురనివాసియు, కామదేవనామాంతరుఁడు నగుకామరాజుపుత్త్రుఁడు. స్మృతీతిహాసపురాణవేత్త, గణకాగ్రణి, వదాన్యుఁడు. అతనిపండితమిత్త్రుఁడు వోపదేవుఁడు. ఇతఁడు సకలశాస్త్రవేత్త యగుధనేశపండితునిశిష్యుఁడు, భిషగ్వరకేశవునిపుత్త్రుఁడు. వ్యాకరణ వైద్య సాహిత్య జ్యోతి ర్విషయకము లైనబహుగ్రంథములు రచియించినమహాకవి, విద్వద్వరిష్ఠుఁడు. ఈమహాపండితుఁడు భాగవతము నెల్లస్కంధములలోనివిష్ణులక్షణ విష్ణుభక్తి విష్ణుతత్త్వ ప్రతిపాదకము లైనపద్యముల నుద్ధరించి ముక్తాఫల మనుపద్యాత్మకగ్రంథమును దానికిఁ గైవల్యదీపిక యనువ్యాఖ్యానమును రచియించి హేమాద్రిపేరు పెట్టెను. ఈవిషయము మూలవ్యాఖ్యలలోని యీక్రిందిమాటలవల్ల స్పష్ట మగుచున్నది.

"విద్వద్ధనేశశిష్యేణ భిషక్కేశవసూనునా
హేమాద్రి ర్వోపదేవేన ముక్తాఫల మచీకరత్."
"చతురేణ చతుర్వర్గ చింతామణివణిజ్యయా
హేమాద్రి ణార్జితం ముక్తాఫలం పశ్యత కౌతుకాత్"
"తేన ముక్తాఫలం తేనే య ల్లోక మనుగృహ్ణతా
తత్ర టీకాం యథాబుద్ధి కుర్వే కైవల్యదీపికామ్"
"ఇహాచ స్వకర్తృకేఽపి యదురాజమహామంత్రిణా ఽభ్యర్థిత ఆచార్యః (వోపదేవః) తత్కర్తృకత్వం (హేమాద్రికర్తృకత్వం) ఖ్యాపితవాన్"
"ఇతి శ్రీవోపదేవకృతా ముక్తాఫలటీకా సమాప్తా"
"ఇతి శ్రీహేమాద్రికృతా ముక్తాఫలటీకా కైవల్యదీపికా సమాప్తా"

ఇట్లిద్దఱిపేళ్లను రెండుగ్రంథములు కనఁబడుచున్నను రెంటికర్త వోపదేవుఁ డనుట స్పష్టము. దీనినిబట్టి భాగవతముతో వోపదేవునికిఁ గలసంబంధ మందలి పద్యము లుద్ధరించి వానితో ముక్తాఫలప్రకరణము రచియించుట తప్ప వేఱే యేమియు లేదని విదిత మగుచున్నను, ఇతఁడే భాగవతముకూడ రచియించి వ్యాసునిపేరు పెట్టె ననెడివాదము లేవనెత్తుట యెట్టిదో యూహింపవలసినదే. ఇతరులపేర గ్రంథములు రచియించుస్వభావము వోపదేవునికిఁ గలదు గదా యనియు, నితని కేదో కొంత భాగవతముతో సంబంధము కలదుగదా యనియు నూహించి, భాగవతమును గాదని దేవీభాగవతమునకు మాత్రమే యార్షత్వము దృఢపఱుప నిది శాక్తేయు లెత్తినయెత్తు గాక, యిం దేమయిన నౌచిత్య మున్నదా? భాగవతపురాణమహత్త్వము బహువిధముల గరుడమత్స్యస్కంద పురాణములు ప్రశంసించియున్నమాట యటుండ, క్రీ. శ. ఎనిమిదవశతాబ్ది కడపట నున్న శంకరభగవత్పాదులు భాగవతమునకు వ్యాఖ్య రచియించియున్నా రని, దీనికి ద్వైతవ్యాఖ్య రచించినవిజయధ్వజాచార్యులు చెప్పుచుండ నేఁటి కాఱువందలయేళ్లక్రిందటి వోపదేవుఁడు భాగవతము రచియించె ననుట కంటె నసంగత మయినమాట వేఱుండునా? కావున బహువిధముల హరివంశవిష్ణు పురాణముల ననుసరించినయిదికొన్ని యితరపురాణములవలెఁ బ్రాచీనమే కాని మొన్న మొన్నటిది కాదని విశ్వసింపవచ్చును. ఇఁక దీనిఘనత యందుమా, నిరుప మానము. రామాయణమహాభారతములతరువాత వ్రేలు మడఁచి చెప్పఁదగిన యుత్తమగ్రంథము భాగవత మని భరతఖండ మంతయు నెఱుఁగును. త్రిమతముల వారికి నవలంబనమై బ్రహ్మసూత్రములవలె జీవేశ్వరతత్త్వ మావిష్కరించు పద్య గ్రంథము దీనిని బోలినది లే దనుట యతిశయోక్తి కాదు. ఇపుడు ముద్రితము లై లభించుచున్న త్రిమతవ్యాఖ్యలే కాక, సారార్థదర్శిని—వైష్ణవతోషణి— సుబోధిని—భాగవతప్రకాశము—మొదలగుమఱికొన్ని వ్యాఖ్యానములు గూడ దీని సర్వాతిశాయిత్వమును దెలుపుచున్నవి. ఇఁక నిది యాధారముగా జన్మించిన భాగవతామృత భాగవతసందర్భాదిగ్రంథము లందుమా, అసంఖ్యములుగా నున్నవి. ఇట్టిసుగుణసంపద కాకరమైనభాగవతము నెంతని పొగడఁగలము? వృత్రవధాశ్రయ మైనదీనివలెనే శుంభవధాశ్రయ మైనదేవీభాగవతము గూడఁ జిరకాలమునుండి ప్రశంస కెక్కినదే కాని వేఱుకాదు. దీనివలె నదియును ద్వాదశ స్కంధము, అష్టాదశసహస్రగ్రంథము. దీనికి శ్రీకారమున్నది. దానికి దేవీ శబ్దము. ఇది భాగవతము, అదిమహాభాగవతము, ఇది కృష్ణలీలాశ్రయము, అది పార్వతీపరమేశ్వరవిలాసాశ్రయము. ఈదృశ మైనపోలికలను జూడఁగా భాగవత మును జూచి మహా (దేవీ) భాగవత ముదయించిన దని తోఁచుచున్నది. ఇఁకఁ దక్కినవానినిగూర్చి యొకింత.

ఆంధ్రీకృతములు ప్రసిద్ధములు నైనవిష్ణు పద్మ వరాహ మార్కండేయాదులను గూర్చి వ్రాయఁదగినది లేదు. వీనిలో, సృష్టి భూమ్యాదిపంచఖండముల విలసిల్లుపద్మపురాణమున నపూర్వము లైనయుపాఖ్యానములును దీర్థమాహాత్మ్యములును గొన్ని కలవు. తక్కినమాహాత్మ్యాదులు కొన్ని భగవదవతారపరములు. శైవపురాణములలో నుత్తమము స్కాందము. ప్రసిద్ధము లైనకాశీభీమాదిఖండములు దానియేఁబదిఖండములలోనివే. అందలిబ్రహ్మోత్తరఖండాదులును సూతసంహితాదులును బ్రత్యేకపురాణములవలెనే దేశమున ఖ్యాతి కెక్కి యున్నవి. భవిష్య భవిష్యత్పురాణములు రెండు నొకటే కాని వేఱుకావు. ఇందు బ్రాహ్మ వైష్ణవ శైవ త్వాష్ట్ర ప్రతిసర్గము లనుపేరఁ దత్తద్వర్ణనలతోడిపంచపర్వములు గలవు. సౌరమతప్రవర్తకుఁ డగుభోజకునిమహత్తు వర్ణించునిందలితుదియధ్యాయము ప్రక్షిప్తమేమో యనితోఁచుచున్నది. బ్రహ్మపురాణ మాద్య మనెడిప్రశంస కొన్నిటఁ గనవచ్చును గాని విషయమునుబట్టి యది యర్వాచీనముగానే యున్నది. నదీతీర్థమాహాత్మ్యవర్ణనముల నిండియున్నయందలిమణిమండపవర్ణనము కాశీక్షేత్రముకంటె సత్యభామాశ్రీకృష్ణుల కావాసమైనమణిమండప మెక్కువ యని తెలుపుచున్నది.

బ్రహ్మవైవర్త బ్రహ్మకైవర్తములు రెండునొకటే కాని వేఱుకావు. కాని, వైవర్త మని యుత్తరదేశీయులును, కైవర్త మని దక్షిణదేశీయులును వ్యవహరింపఁ జొచ్చిరి. కొన్నివ్రాతప్రతులనుబట్టి చూడఁగాఁ గడపటిఖండమునఁ గొంత గ్రంథము దక్షిణదేశపుస్తకముల నధికముగాఁ జేరినట్లు కనఁబడును. బ్రహ్మ–ప్రకృతి–గణేశ–కృష్ణ–సంజ్ఞలుగల నాలుగుఖండములవిలసిల్లు నీపురాణము విష్ణుపద్మపురాణములసమకాలిక మనితోఁచుచున్నది. ఇఁక నీవిషయము ముగించుటకు ముందుగాఁ బురాణములనుగూర్చి స్కాంద మిచ్చినయభిప్రాయము నీక్రిందఁ జూపుచున్నాను.

"శైవ–భవిష్య–మార్కండేయ–లైంగ–వారాహ–స్కాంద-మాత్స్య–కౌర్మ–వామన-బ్రహ్మాండ–సంజ్ఞలుగలపదియును శివునేప్రశంసించుచున్నవి. శివుఁడే యందు ప్రకాశించుచున్నాఁడు. ఈపదిపురాణములగ్రంథసంఖ్య మూఁడులక్షలు. వైష్ణవ–భాగవత–నారదీయ-గారుడములు నాలుగును విష్ణుని బ్రశంసించుచున్నవి. బ్రాహ్మపాద్మములురెండును బ్రహ్మను, ఆగ్నేయ మగ్నిని, బ్రహ్మవైవర్తము సవితను జెప్పుచున్నవి. ఈయెనిమిదింటిగ్రంథ సంఖ్యలక్ష. మొత్తముపురాణగ్రంథసంఖ్య నాలుగులక్షలు" ఇట్టివానిం గూర్చి లోకమున వ్యాప్తమై యున్నయార్యోక్తి యిది—

"అష్టాదశపురాణేషు వ్యాసేన కథితం ద్వయమ్
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"

## ఉపపురాణములు

ఇవి పదునెనిమిది యని ప్రతీతియే కాని, కొన్నిపురాణములలోనిపట్టిక లనుబట్టి చూడ లెక్కకు మిక్కిలిగానే కనఁబడుచున్నవి. వీనిలోఁ గొన్ని నామ మాత్రావశేషములే కాని, అనేకములు ముద్రితములు గాక లిఖితపుస్తకభాండా గారములఁ బడియున్నవి. కొన్ని, మహాపురాణములపేళ్లతోనున్నవి. వీనిలో శైవవైష్ణవమతప్రతిపాదకములే కాదు, సౌర శాక్త గాణాపత్యాదిమతప్రవర్త కము లైనవియుఁ గలవు. మొత్త మివి యన్నియు నర్వాచీనము లనుటస్పష్టము. తెలిసినంతవఱకు వీనినామము లిందు చూపుచున్నాను.

| | | | |
|---|---|---|---|
| నారదీయ | దేవీ | ధర్మ | ఆది |
| బృహన్నారదీయ | కాళికా | శివధర్మ | ఆదిత్య (సౌర) |
| నందీశ్వర | చండికా | బృహద్ధర్మ | నాంద |
| బృహన్నందీశ్వర | వాసిష్ఠ | విష్ణుధర్మ | దౌర్వాస |
| శివ | మారీచ | విష్ణుధర్మోత్తర | కాపిల |
| సాంబ | వారుణ | నారసింహ | మానవ |
| గణేశ | పారాశర్య | భార్గవ | ఔశనస |
| లైంగ | వామన | బ్రహ్మాండ | భవిష్యోత్తర- |
| కల్కి | సనత్కుమారీయ | | |

సంజ్ఞలు కలవి ముప్పదినాలుగు. ఇంక నెన్ని యెం దెం దణఁగి యున్నవో! ఇట్లు పురాణవాఙ్మయము సమృద్ధిగా విస్తరించినది. భరతఖండమందలియెల్లదివ్య క్షేత్రములమాహాత్మ్యములను దెల్పుస్థలపురాణము లన్నియుఁ జాలావఱకు స్కాందాదులలోనివే కాని, కొన్నిస్వతంత్రములు గా నుదయించినవియుఁ గలవు. ఉపపురాణములగ్రంథసంఖ్య యంతయు నొకలక్ష యని స్కాందము చెప్పుచున్నది.

శ్రుతులు స్మృతులు పురాణేతిహాసములు, అనునవి క్రమముగా ధర్మనిర్ణ యమునఁ బ్రమాణము లని యార్యులు విశ్వసించిరి. సార్వజనీనోపయోగపరములు పురాణేతిహాసములు. అట్టివాని ననుసరించి యివి దేవతాభక్తి విజృంభింపఁజేయ నవతరించినవి. ఇం దనేకములు పంచాశత్ఖండమండిత మైనస్కాందమునందలి సనత్కుమార—సూత—శాంకరీ—వైష్ణవీ—బ్రాహ్మీ—సౌరసంహితలలోని వివిధోపా ఖ్యానస్థలమహత్త్వతత్తద్దేవతామాహాత్మ్యము లాధారములుగా నావిర్భవించి భరతఖండ మంతయు నావరించినవి. కొన్నిరామాయణమహాభారతబ్రాహ్మభాగవ తాదులలోనిగాథ లాధారముగాఁ బుట్టినవి. వీనిలోఁ గల్కిపురాణ మనుభాగవత భవిష్య మనఁబడును. ఇది ముప్పదియైదధ్యాయముల గ్రంథము. కలియుగాంత మున శ్రీవిష్ణువు శంభలగ్రామమున సుమతీవిష్ణుయశులపుత్త్రుఁడై యుదయించి

జగము నుద్ధరించువిషయ మిందు వర్ణింపఁబడినది. ఇనుక పాతఅవంటియీపురాణ వా ఙ్మయమున కిఁక స్వస్తి చెప్పి యీసందర్భముననే తంత్రాగమాదు లించుక పరిశీలింతము.

## తాం త్రి క వి ద్య

భరతఖండమున వ్యాపించినమతవిద్యలలో నొకటై సనాతనసంప్రదాయసిద్ధ మయ్యుఁ గొన్నిపురాణముల కించుక సమకాలికముగా సారస్వతరూపము దాల్ప నారంభించి క్రీ. పదునేడవశతాబ్దికడపటివఱకును గూడ శాఖోపశాఖలుగా విస్తరిల్లుచువచ్చినదీనికి సంబంధించినగ్రంథములు సంహితాగమయామలతంత్ర సంజ్ఞలతో నున్నను, తంత్రసంజ్ఞ కలవి యెక్కువగా నుండుటంబట్టియు విషయైక్య మునుబట్టియు నిది యిందు తాంత్రికవిద్య యనఁబడినది. లోకమున మంత్రశాస్త్ర మని ప్రసిద్ధి కెక్కినది యిం దంతర్భూతమే కాని యన్యము కాదు. తంత్రశబ్దమున కెందును సరి యైనవ్యుత్పత్తి కనఁబడలేదు కాని, ఉద్దిష్టార్థము సాధింప నద్భుతము లైనవివిధోపాయము లిందు వర్ణింపఁబడుటచే నిది తంత్ర మనఁబడె ననవచ్చును.

వేదోపదిష్టము లైనకర్మజ్ఞానోపాసనాకాండములలో నిది కడపటిదాని ననుసరించినది. కాని, వేదప్రతిపాదిత మైనదానికంటె నిందలియుపాసనవిధాన మత్యంతము భిన్నము సవిస్తరము. మంత్రతంత్రవిద్య కథర్వవేద మాధార మను మతము కలదు గాని, అందలిమంత్రము లట్లే యిందు కనరావు సరిగదా! యీరెండింటిమార్గములే వేఱు. అయినను, వేదవిహిత మైనగాయత్రీ విష్ణు రుద్రాదిదేవతారాధనవిధాన మిందు సవిశేషముగాఁ గనవచ్చుటం బట్టియు, ఉపాసన మాత్రత త్త్వజ్ఞానమునకు హేతువై పరమపురుషార్థసాధన మగు నని యిది యుపదేశించుటంబట్టియు, ఇది వైదికమతమునకు సన్నిహిత మనవలసివచ్చి నది గాని, నిజముగా వేదవేదాంతముల కనుకూలమును బ్రతికూలమును గాని యిది యొకస్వతంత్రవిద్య యనియే చెప్పవచ్చును. అందుచేతనే యిది ప్రమా ణము శ్రద్ధేయ మని కొందఱును, అప్రమాణ మశ్రద్ధేయ మని కొందఱును, భావించిరి. ఈమతములు రెండును బూర్వములే కాని నేటివి కావు.

వేదమార్గము విడిచి వేఱుత్రోవ పట్టినవాఁడు చేతిలోనిపాయసము విడిచి మోఁచేతిని నాకినవాఁ డగు నని సూతసంహిత. వైదికమార్గము విడిచి లోభోప హతచిత్తులమై తంత్రదీక్ష నవలంబించుటచే నీగతిపాలైతి మని నరకవాసులు విచారించినట్లుగా నగ్నిపురాణము. పాషండులకును, తాంత్రికులకును, నాస్తికుల కును, ఈతీర్థము దుర్లభ మని పద్మపురాణము. సాంఖ్యయోగములమాడ్కిఁ దంత్రవిద్యయుఁ బ్రమాణము కా దని కుమారిలభట్టాదివైదికకర్తవాదులు. ఇట్లే

తంత్రనింద బహుళముగాఁ గనవచ్చుమాట సత్యము కాని, తంత్రస్తుతియుఁ గొన్నిచోటులఁ గనఁబడుచున్నది.

శక్తిపూజ బాహ్యాభ్యంతరభేదమున ద్వివిధము. బాహ్యపూజ వైదికీ తాంత్రికీ భేదమున ద్వివిధము. పాంచరాత్రాదితంత్రములలోనియేయంశము వేద విరుద్ధము కాదో, అది ప్రమాణమే యగును. కాని, వైదికుల కవ్యవధానము గాను, తాంత్రికులకు వ్యవధానముగాను, పరమేశ్వరానుగ్రహము లభించునని మఱియొకచోట సూతసంహిత. తంత్రవిద్య గోప్యము ప్రమాణ మని బ్రహ్మాండ పురాణము. తాంత్రికమార్గము ననుసరించి బ్రాహ్మణక్షత్రియపుత్రులకుఁ బ్రదోష పూజ యుపదేశించినది బ్రహ్మోత్తరఖండము. 'సర్వాగమామ్నాయమహార్ణవాయ' యని సర్వేశ్వరుఁడు తంత్రాగమప్రియుఁ డని చెప్పినది భాగవతము. "ఆమ్నాయాగమవేద్యాయ శుద్ధబుద్ధాయ తే నమః" యని భగవంతుఁడు వేద వేద్యుఁ డైనట్లే తంత్రాగమవేద్యుఁ డని వక్కాణించినది భారతము. వైదికతాంత్రికమంత్రములు రెంటికిని—

'మంత్రాం స్తాంత్రికవైదికాన్ పరిపఠన్ సానన్ద మత్యాదరాత్
స్నానం తే పరికల్పయామి జనని స్నేహా త్త్వ మఙ్గీకురు'

అని సమత్వ మిచ్చినది శంకరభగవత్పాదులమానసపూజ. ఇట్లున్న స్తుతి నిందావచనములను బరిశీలింపఁగాఁ గేవలవైదికకర్మవాదులు కానివారిమతము నందు తంత్రవిద్య యుపాదేయ మగునన్నభావము విదిత మగుచున్నది గావున బహువిధము లైనశక్తిసాధనశాస్త్రములలో నిది యొకటి యని పూర్వాచార్యుల మాటలను బట్టియే విశ్వసింతము.

తాంత్రికగ్రంథరచనారంభ మెప్పుడో నిర్ణయింప వీలు గాకున్నది. పాంచరాత్ర రుద్రయామలాది ప్రధానతంత్రగ్రంథములు భగవంతుఁడు నారదునికిని, శివుఁడు పార్వతికి, నుపదేశించిన ట్లుండుటచే వీనికర్తృత్వము దురవగాహముగా నున్నది. కాని, కొన్నిపురాణములలోఁ దంత్రప్రసక్తియుఁ గొన్నితంత్రములలోఁ బురాణప్రసక్తియుఁ గనవచ్చుచుండుటచేఁ గొన్నియర్వాచీనపురాణములును గొన్నిపూర్వతంత్రగ్రంథములును సమకాలికము లగు నని తోఁచుచున్నది. మఱియు సాంఖ్యయోగమతముల ప్రశంస ముఖ్యతాంత్రికగ్రంథములందు గూడ వచ్చుటం జేసి సాంఖ్యయోగసూత్రములకు దీనిరచనారంభ మర్వాచీన మని తేట పడుచున్నది. అందుచే నిది క్రీ. పూ. మూఁడవశతాబ్ది ప్రాంతమున మెల్లమెల్లగా నారంభమై యుండు ననియు, తాంత్రికవిజ్ఞానము మాత్రము మిక్కిలిపురాతన మనియు, నొకవిధముగా నిప్పటికి నిర్ణయించుకొందము.






పరమపురుషార్థసాధన మగుమంత్రదీక్ష లేనియుపాసనము నిరర్థక మని యెల్లతంత్రములును, ముక్తిసాధమునకుఁ బ్రథమసోపానము మంత్రదీక్షణమే యని పరమానందతంత్రమును ఘోషించుటంబట్టి తంత్రమంత్రవిద్య యాముష్మికానంద ప్రయోజన మనుట నిశ్చిత మైనను, కాలక్రమమున నిది యైహికలాభపరము గూడ నగుచు వచ్చె ననుటకుఁ బ్రమాణములు లేకపోలేదు. శత్రువులకు హాని కలిగింపఁ బ్రయోగము గావించుటయు, వారు చేసినప్రయోగము త్రిప్పికొనుటయు పురాణేతిహాసములఁ బెక్కుసందర్భములఁ గనవచ్చును. రాజ్యమున కాపదలు రాకుండఁ జూచుటకై తాంత్రికులసాహాయ్య మావశ్యక మని యర్థశాస్త్రమునఁ గౌటిల్యుఁడు చెప్పియున్నాఁడు. అతఁడు విషకన్యను బ్రయోగించి పర్వతరాజును జంపించుట తన్మూలక మనుట స్పష్టము. శుక్రుఁడు మృతసంజీవనిఁ బంపి యసురహతుఁ డైనకచుని బ్రతికించుట, రైభ్యుఁడు కృత్తిని రక్కసుని బ్రయోగించి యవక్రీతుని జంపుట, వామదేవుఁడు తనయశ్వముల నపహరించినశలునిఁ జంపి తలునిచేతులు స్తంభింపఁజేయుట, మొద లగుమంత్రతంత్రప్రయోగవర్ణన లనేకములు భారతాదులఁ గలవు. అథర్వవేదమునఁ బ్రయోగములు శపథములు పెక్కు కనవచ్చును [1]. రాజపురోహితుఁ డథర్వవేదజ్ఞుఁడు కావలె నని విధి వచన మున్నది [2]. ఇఁక మంత్రబలమున మహర్షులు గావించినయద్భుతకార్యములందుమా, ఋగ్యజుస్సుల ననేకములు గోచరించును. వీటినిబట్టి యీ విజ్ఞానము సనాతన మనుట యసంశయము. ఏతాదృశవిజ్ఞానమున నిబద్ధము లైనవే తంత్రాగమయామలములు. ఇవి స్త్రీపురుష దేవతోపాసనార్థము లైనమంత్రములను, తత్తద్దేవతారాధనవిధానములను దెల్పునవి మాత్రమే కావు. ఇందు విశేషగుణములు కలవు.

సర్గ ప్రతిసర్గ మంత్రనిర్ణయ దేవతాసన్నివేశ తీర్థ వర్ణాశ్రమ యుగధర్మ రాజధర్మ పుణ్యా నరక లోకవాస దేవతా చక్ర యంత్ర లక్షణ స్త్రీపురుషలక్షణ బ్రాహ్మణసంసేవన వ్రత జ్యోతిర్విజ్ఞానాది బహువిషయములను బోధించునదితంత్ర మనియు, సృష్టి ప్రలయ దేవతారాధన మంత్రపురశ్చరణ షట్కర్మసాధన ధ్యాన యోగాది విషయములను దెల్పున దాగమ మనియు, సృష్టి గ్రహ తారాదివిజ్ఞాన వర్ణజాతిభేద దేవతారాధన యుగధర్మ నిత్యకృత్య నిర్ణయాదివిషయములు విశదీకరించునది యామల మనియు [3]. వీనిలక్షణములు కలవు. ధాతు కల్పవల్ల్యాదు లగుకొన్నితంత్రములందు పూర్వోక్తవిషయములు విశేషించి కనరావు కాని, అందు, రసవాద (వెండిబంగారములుచేయుట) వైద్య ప్రశ్నశకున భావి ఫలకథ

1. చూ. సం. వా. చ. ప్రథ. 225—229 పుటలు
2. పురోహితం తథాథర్వమంత్ర బ్రాహ్మణ పారగమ్. మత్స్యపు.
3. చూ. శబ్దకల్పద్రుమము—తంత్ర నిర్వచనము.

నాదు లగునద్భుతవిషయములు మఱికొన్ని కనవచ్చును. ఏతాదృశ మైనయీ స్త్రీ తాంత్రికసారస్వతము ననుకరించి బౌద్ధతాంత్రికగ్రంథములు కొన్ని యుదయించినవి. ముందు వానినిగూర్చి యించుక—

బౌద్ధమతము నిరీశ్వర మైనను, అర్వాచీనబౌద్ధులు కొందఱు తమయభీష్టములు నిర్వహింప దేవతారాధన మారంభించి రని తెలియుచున్నది. బౌద్ధతాంత్రికమతమందు యోగాచారులు మాధ్యమికులు మొదలగు తెగలు కలవు. వారి యుపాసనభేదముల ననుసరించి వజ్రయాన సహజయాన కాలచక్రయాన రూపమైన సారస్వత ముదయించినది. ఈయానములందు మహాయాన భద్రయానాద్యవాంతరభేదములు కలవు. 'ధర్మం శరణం గచ్ఛామి సమగ్రం మహాయానమ్' అని మహాయానవాదము, 'అస్తి నాస్తి తదుభయానుభయచతుష్కోటివినిర్ముక్తం శూన్యరూపమ్' అని మాధ్యమికవాదము. శూన్యరూపమే నిర్వాణ మని వీరిమతము. ఇట్లే బోధిసత్త్వులు కొంచెకొంచెము భేదములతో నిర్వాణము నిర్వచించియు, ఇష్టదేవతామంత్రజపహోమతర్పణార్చనాదులుగూడ నాచరింపఁ గడంగి రని సాధనమాలాదిగ్రంథములవల్లఁ దెలియుచున్నది. ఈమతమునఁ దొలుత నుదయించినతంత్రగ్రంథములు కనరావు గాని, వాని టిబిటన్భాషానువాదములు తంజావూరులైబ్రరీలో నున్నట్లు సాధనమాలాప్రకాశకులు చెప్పుచున్నారు. ఆగ్రంథములను బరిశోధించినభట్టాచార్యులుగారు బౌద్ధతాంత్రికసారస్వతము క్రీ. శ. ఏడెనిమిదిశతాబ్దులలో నుత్పన్నమై యుండు నని యభిప్రాయపడిరి.

సాధనమాలలో, త్రిసమయరాజసాధనము మొదలుగా షోడశభుజమహాకాలసాధనమువఱకు ౩౧౨ సాధనములు వివరింపఁబడినవి. శైలినిబట్టి యీప్రకరణము లన్నియు నొకకవి రచియించిన వని చెప్పవచ్చును గాని ఒక్కొక్కసాధనము కడపట 'కృతి రియం పండితకుముదాకరమతిపాదానామ్' అనురీతిని, సహజవిలాస—సుమతిభద్ర—కుక్కురిపాద—ధర్మాకరమతి — చింతామణిదత్త—నాగార్జునపాద — ప్రభాకరకీర్తి — స్థవిరానుపమరక్షితాదినామధేయము లుండుటంబట్టి యిది పెక్కండ్రు రచియించినదిగా భ్రాంతి కలుగుచున్నది. సాధనవిషయ మాయా పండితులకు సంబంధించిన దైనను, భాషమాత్రము వారితరువాతివాఁ డగునొక కవిదే యని విశ్వసింపవచ్చును. లేదా, బౌద్ధతాంత్రికులు ప్రాకృతములో వేర్వేఱుగా రచియించినయాసాధనముల నర్వాచీనుఁ డొకఁడు సంస్కృతభాషకు మార్చి వాఁడవే ళ్లట్లే యుంచె నని యైనను జెప్పవచ్చును.

ఇందలిమంత్రజపహోమవిధానము విలక్షణము. ఇందు, తారా వజ్రతారా మారీచీ జ్వాలాముఖి మంజుశ్రీ జాంగులీ లోకనాథ మహాకాలాదిస్త్రీపురుష

దేవతాసాధనములు సమంత్రకములై యున్నవి. కురుకుల్లా దేవీసాధనవిధాన మిం దిరువదివిధముల నున్నది. ఓమ్‌కురుకుల్లేహ్రీః హుంస్వాహా' అనుమంత్ర మాఱు మాసములు నిరంతరము జపించినచో ఖడ్గాంజన పాదలేప రసరసాయనాం తర్ధాన ఖేచరాది సిద్ధులు లభించును. ఇట్లే కొన్నిబీజాక్షరములమార్పులతోడిమంత్రము లను సాధనోక్తవిధానములనుబట్టి జపించినయెడల మంత్రి రాజ స్త్రీ పురుషులు వశ్యు లగుదురు. ఇత్యాదిగా జపధ్యాన భావనా ముద్రా బలి ఫలాదులు నిరూ పింపఁబడినవి. దీనినిబట్టి బౌద్ధతాంత్రికసారస్వతస్వరూపము తెలియ నగును. ఇట్లే శ్రీగుహ్యసమాజతంత్రము శ్రీచక్రసంభారము మొదలుగా మూఁడు నాలుగుబౌద్ధతంత్రములు సంస్కృతమునఁ గనఁబడుచున్నవి. అం దొకటి మహా చీనక్రమాచారతంత్రము. పేరునుబట్టియే యిది చీనాదేశములోని బౌద్ధు లాచ రించుతాంత్రికాచారవిషయక మని తెలియఁగలదు. బుద్ధరూపజనార్దనునియాచా రము ననుసరించి యారాధించినఁగాని నేను బ్రసన్నురాలను గా నని సంసార తారిణి యగుతారాదేవి పలుకఁగా, తదాచారము తెలిసికొనుటకు వసిష్ఠమహర్షి చీనాదేశమునకు వెళ్లి హిమవత్పార్శ్వమునందు సాధకేశ్వరసేవితుఁడును మది రాపానమత్తమత్తకామినీసహస్రపరివేష్టితుఁడు నగుబుద్ధరూపజనార్దనుని సేవించి నంత నతఁ డమ్మునికుపదేశించినట్లుగా నిది పార్వతికి శివుఁడు చెప్పిన ట్లున్నది[1]. దీనినిబట్టియే యీగ్రంథ మత్యంత మర్వాచీన మని బోధపడఁగలదు. ఇఁక నుప దిష్టవిషయమందుమా, వినుటకుఁ జెప్పుటకుఁ గూడ నలవికానిది. పూజలలో మానసికపూజ శ్రేష్ఠ మనియు దానికి సమయనియమము గాని స్నానాదినియమ ములు గాని యక్కఱలేదనియు ముందు మంచిమాట చెప్పి, తరువాత బహిః పూజావిధాన మిట్లు నిర్వచించినది.

బహిఃపూజకు రాత్రిముఖ్యము. దేవీపూజ కితరపీఠములకంటె యోనిపీఠ ముత్తమము. ఏజాతికన్యనైనను, లేక సిగ్గులేనియేజాతియువతినైనను దీసికొని వచ్చి దిగంబరఁ గావించి దానిగుహ్యావయవపీఠము మీఁద దేవి నావాహనచేసి పూజింపవలెను. పూజాకాలమందు మాత్రము మదిరాపానము యుక్తము. ఈసందర్భమందలిమాటలు తెలిగించుటకన్న వానినే వ్రాయుట మంచిది.

"పీత్వా పీత్వా పునఃపీత్వా యావ త్పతతి భూతలే
ఉత్థాయచ పునః పీత్వా పునర్జన్మ న విద్యతే
పీత్వా లింగ్య కులాచారే ప్రమదాం యావనోన్మదామ్
కోటిజన్మార్జితం పాపం తత్ క్షణా దేవ నాశయేత్"

---

1. తతో గత్వా మహాదేశే చీనే స మునిపుంగవః
దదర్శ హిమవత్పార్శ్వే సాధకేశ్వరసేవితమ్...
కామినీనాం సహస్రేణ పరివేష్టిత మీశ్వరి.

దీనినిబట్టి బౌద్ధకౌలాచార మెంత ఘోరరూపమునఁ జీనాదేశమందు వ్యాపించెనో తెలియఁగలదు. ఇది యిట్లున్నను, సాధనమాలాదులు విధించినపూజాదికము సౌమ్యముగానే కన్పట్టును. ఆర్యమంజుశ్రీ మూలకల్ప మనుమఱియొక గ్రంథము ముద్రితమై యున్నది. అది ౫౫ అధ్యాయములపెద్దగ్రంథము. దానికి బోధిసత్త్వపిటకావతంస మనునామాంతరము కలదు. కుమారీభూతబోధిసత్త్వుఁడే మంజుశ్రీ యనఁబడును. అందుపాసనావిధులు సౌమ్యముగాఁ గనఁబడుచున్నవి[1]. ఇట్లున్నబౌద్ధతాంత్రికగ్రంథములలో, మత్స్యమాంసములు పూజాద్రవ్యములుగాఁ గనరా వనుట యొకవిశేషము. ఇఁక వీని నిట్లుంచి, ఆస్తికతంత్రవిద్యను బరిశీలింతము.

వేదాస్తశాస్త్రములవలె నిదియును ముక్తిమార్గ మన్వేషింప నుద్దేశించినదనుట విదితము. ఇందు శ్రీమన్నారాయణుఁడు పరమేశ్వరుఁ డని వైష్ణవతంత్రములును, పరమశివుఁడు పరబ్రహ్మ మని శైవతంత్రములును, పరాశక్తియే జగదాధార మని శాక్తతంత్రములును భిన్నమార్గములు త్రొక్కినవి. ఆత్మ విద్యా శివులనుమూఁడే జగత్తత్త్వము లనియు, పృథివ్యాదిమహాభూతము లైదే తత్త్వములనియు, చతుర్వింశతితత్త్వము లనియు, పంచవింశతితత్త్వము లనియు, మతభేదములు కలవు. కాని, తాంత్రికులు కొందఱు ముప్పదియాఱు తత్త్వములు నిర్వచించిరి. వానిలోఁ బరమశివుఁడు సిసృక్షాశక్తి జగదహంభావముతోడి సదాశివుఁడు జగద్భేదవృత్తితోడియీశ్వరుఁడు విద్యారూపమైనజగదాత్మకసదాశివునివృత్తి జగత్తు వేఱనెడియీశ్వరునిమాయారూపవృత్తి జ్ఞానావరకమైనయవిద్య కలారూపమైనజీవునికర్తృత్వము రాగరూపమైనజీవునినిత్యతృప్తి కాలపదవాచ్యమైనజీవునినిత్యత్వము జీవపరశివభేదరూపమైనయవిద్యకుమూలకారణము నియతి కలారాగకాలనియత్యవిద్యాశ్రయుఁడైనజీవుఁడు ననుపండ్రెండుతత్త్వము లిందధికము లని శక్తిత్రయపరీక్షాపరశురామకల్పాదులు చెప్పుచున్నవి. 'షట్త్రింశద్విధమేతద్వై తత్త్వచక్రం సమీరితమ్'అని పరమానందతంత్రము. దీనిని 'షట్త్రింశత్తత్త్వప్రాసాదభూనాథాయ నమః' అనుస్కాందవచనము బలపఱుచుచున్నది. దీనినిబట్టి సాంఖ్యయోగసూత్రములను జూచియే తాంత్రికులు తత్త్వనిర్ణయము గావించి రనియు స్కాందాదులలోనికొన్నిభాగములకంటె ముందే శక్తిత్రయపరీక్షాదితంత్రములు కొన్ని యుదయించిన వనియుఁ దెల్ల మగుచున్నది. ఏతాదృశతత్త్వవివేకమున జీవుఁ డవిద్యకుఁ దొలఁగి నైజమైనకేవలపరమశివత్వమును గాంచు ననియు నదియే ముక్తి యనియు వీనియుద్దేశము. 'శరీరకంచుకితుఁడైన శివుఁడు జీవుఁడు. నిష్కంచుకావస్థలో నతఁడే పరమశివుఁడు'అని చెప్పుకల్పసూ

---

1. ఈగ్రంథ మనంతశయనమున లభించును.

త్రమునుద్దేశము గూడ నద్వైతమునకు భిన్నముగాదు. వైష్ణవశాక్తతంత్రములు నిట్లే విష్ణునకును శక్తికిని గ్రమముగాఁ బ్రాధాన్య మిచ్చినవి. కావున వీనిప్రథమోద్దేశము జీవేశ్వరతత్త్వవివేకపరమే యనుట సిద్ధము.

తాంత్రికవాఙ్మయములో, అహిర్బుధ్న్య - ఈశ్వర—విష్ణు—కపింజల - జయాఖ్య—పరాశర—బృహద్బ్రహ్మ—భారద్వాజ—శ్రీప్రశ్న—సాత్త్వతాదిసంహితలును ; లక్ష్మీ—కాళీ—విష్ణుతిలక—కామకలావిలాస — తంత్రాభిధాన — షట్చక్రనిరూపణ — కాలార్ణవ—ప్రపంచసార—కాళీవిలాస—తంత్రాభిధాన—తంత్రరాజ— శారదాతిలక—మహానిర్వాణాదితంత్రములును;ఆనందలహరీకర్పూరాదిస్తోత్రములును, మొదలుగా సుమారేఁబదిగ్రంథములు ముద్రితములైనవి. అగస్త్య-అనిరుద్ధ-ఉపేంద్ర-కాశ్యప-కాశ్యపోత్తర—నారదీయ—పరమాదిసంహితలు సుమారునలువది యముద్రితములై యున్నట్లు తెలియుచున్నది. సర్ జాన్‌వుడ్రాఫ్‌పండితుఁ డీశాస్త్రము చక్కఁగాఁ బఠించి యిందలిసారము సంగ్రహించి, 'శక్తి—శాక్తము' అనుపేరను వర్ణమాల యనుపేరను రెండుమహాగ్రంథములు ప్రకటించియున్నాఁడు. అతఁడే, ఆర్థర్ ఎవెలన్, అనుపేరుపెట్టుకొని ప్రాచ్యవిజ్ఞానమును మెచ్చుకొని, తంత్రరాజమహాతంత్రనిర్వాణాదికములు సుమా రిరువదిగ్రంథము లాంగ్లభాషలో ననువదించి దీనిగొప్పతనమును బాశ్చాత్యఖండములఁ జాటియున్నాఁడు. బరోడాసంస్థానసంస్కృతగ్రంథాలయద్రష్ట లగుకృష్ణమాచార్యులు గారును భట్టాచార్యులుగారును, మూలమూలల నణఁగియున్న తాంత్రికగ్రంథముల నుద్ధరించి ప్రకటించి భరతఖండమం దీవిద్యకుఁ బునర్వ్యాప్తిని గలిగించుచున్నారు. ఇట్లు మూలములును వ్యాఖ్యలును భాషాంతరీకరణములును బ్రయోగాదిగ్రంథములును వెలయ విలసిల్లునీవిద్య తొలుత హిందూ దేశమంతట వ్యాపించిన దనుటకు నేటికిఁ గూడ నుత్తరదక్షిణదేశముల సజీవములై యున్న దేవతాపీఠములే సాక్షులు. ఇట్లు చిరకాలముగా నిది హెచ్చుదశలో నున్నను, కశ్యప భరద్వాజ మహర్షులపేళ్లనుబట్టి వారు సంప్రదాయకర్తలై యుందు రని యూహింపవలెనే కాని, వారే సంహితాదికర్త లని మాత్రము భ్రాంతిపడరాదు. పెక్కు స్మృతులవలెనే యివియును వారిపేళ్ల వెలసినవి గాని తత్కృతములు కావు. ఇందు కొకదృష్టాంతము.

పరశురామకల్పసూత్ర మనునొకతంత్రగ్రంథము పరశురాముఁడు నిర్మించినట్లుగా 'ఇతి దుష్టక్షత్రియాన్తకరేణుకాగర్భసంభూతమహాదేవప్రధానశిష్యపరశురామశ్రీభార్గవమహోపాధ్యాయ శ్రీమత్కౌలాచార్యవిరచితకల్పసూత్రే' ఇత్యాదిఖండాన్తగద్యములు చెప్పుచున్నవి. ఋగ్వేదద్రష్టలలోనిభార్గవుఁడైనజమదగ్నిపుత్త్రుఁ డగుపరశురాముఁడు దేవతోపాసనవిధానమున నొకసంప్రదాయకర్తయై యుండునేమో కాని, పురాణములలో మహేశ్వరశిష్యక్షత్రియాన్తకావతార

పురుషుఁడుగా మాఱినయతఁడే పైకల్పసూత్రము రచియించినవాఁ డనుటకు వీలు లేదు. శైవతాంత్రికగ్రంథము లెన్నో పుట్టినపిదప వానికిఁ గల్పముగాఁ గ్రీస్తు శకారంభకాలమున నుదయించినయీసూత్రమును గ్రీ. పూ. సుమారు నాలు గైదువేలసంవత్సరములనాఁటిజామదగ్న్యుఁడు రచియించె ననుట యసంభవము. కావున నర్వాచీనతాంత్రికుఁ డొకఁడు దీనిని రచియించి గ్రంథప్రశస్తికై యతని పేరు పెట్టెనని గ్రంథవిషయమునుబట్టియుఁ బైగద్యమునుబట్టియుఁ గూడఁ దెలియవచ్చును. ఇట్లే తక్కినమహర్షులపేళ్ల నున్నతంత్రములకర్తృత్వముగూడ నూహ్యము. అనేకతంత్రములకర్తృత్వ మిట్టిదే యైననుఁ గ్రోధీశభైరవ—విద్యాపతి—కృష్ణానందభట్టాచార్యాదులు రచియించిన భూతభైరవ—దుర్గాభక్తితరంగిణీ—తంత్రసారాదిగ్రంథముల కర్తృత్వము వారివారిపేళ్లనుబట్టి విశదమగుచునే యుండును.

ఈవాఙ్మయమందు పాంచరాత్ర మనుపే రధికముగావినవచ్చును. నారాయణముఖోద్గీతము చతుర్వేదసమన్వితము సాంఖ్యయోగకృతము నైనపాంచరాత్ర మహోపనిషత్తును నారదుఁడు ఋషులకు వినిపించె ననిభారతశాంతిపర్వము. వేదములయుత్తమాంగ మేకాయనవేదము. తదర్థక మైనపాంచరాత్రము మోక్షప్రద మని శ్రీప్రశ్నసంహిత. పాంచరాత్రశ్రుతి పాంచరాత్రోపనిషత్తు పాంచరాత్రసంహిత యని స్పందప్రదీపము. శ్రీవిష్ణువు తనపంచాయుధములయంశముల వల్ల జనించినయౌపగాయన శాండిల్య మౌంజాయన కౌశిక భారద్వాజులకు వేర్వేఱుగా నైదురాత్రు లీశాస్త్ర ముపదేశించుటంజేసి యిది పంచరాత్రమైన దని యీశ్వరసంహిత. ఇతరశాస్త్రము లైదుగొప్ప వైనను, దీనివద్ద రాత్రులవలెఁ బ్రకాశహీనము లగుటచే నిదిపాంచరాత్రమైన దని పద్మసంహిత. శబ్దాదిపంచవిషయములో లేక పంచమహాభూతములో యనఁబడునైదురాత్రులు దేని తేజస్సున నణఁగునో యట్టియజ్ఞాననాశక మైనది పాంచరాత్రమని విష్ణుసంహిత. అయిదు రాత్రులు విష్ణువ్రత మాచరించుభక్తులు పంచరాత్రులు. వారికివిహితమైన శాస్త్రము పాంచరాత్ర మని శక్తిసంగమతంత్రము. ఇట్లెన్నెని నిర్వాచనములు కలవు. ఆగమ మంత్ర తంత్ర తంత్రాంతరము లన నాలుగుసిద్ధాంతభాగము లిందు గలవనియు, వాసుదేవప్రోక్తమై బ్రహ్మాదులవలన దివ్యలోకముల వ్యాపించినయిది దివ్యమనియు, ఋషీశ్వరులు స్వయముగా నిర్మించినపాంచరాత్రము మునిభాషితమనియు, సాత్వత పౌష్కరజయాఖ్య సంహితలు దివ్యపాంచరాత్రభాగము లనియు, దీనిమహత్త్వము నీశ్వరసంహిత పొగడుచున్నది. దీనినిబట్టి దివ్యపాంచరాత్ర మెంతో ప్రాచీనమై యుండు నని తెలియవచ్చును గాని, జయాఖ్యసంహితను బ్రకటించినభట్టాచార్యులుగా రీమూఁడుసంహితలు క్రీ. పంచమశతాబ్దిలోనివై యుండు

నని యూహించిరి. అది యూహయేకాని సిద్ధాంతము కాదు [1]. పై సంహితలు పాంచరాత్రభాగములుగాక స్వతంత్రములైనచో నివి వారు చెప్పినకాలములోని వైనఁ గావచ్చును గాని, ఎంత ప్రక్షిప్త మన్నను, క్రీ. పూ. రెండవశతాబ్దిని దాఁటి యీవలికిరానిభారతశాంతిపర్వము స్తుతించినదివ్యపాంచరాత్ర మంతకు మున్నే యున్న దనక తప్పదుగదా! ఇది యిట్లుండ నిందు—

విష్ణు రుద్ర భేదము వేదములనాఁడే యున్న దని కొన్ని ఋగ్వేదసూక్తములును, తైత్తిరీయములోనిరుద్రాధ్యాయనారాయణములును దెలుపుచున్నవి. తరువాత విష్ణువు వాసుదేవుఁ డైనాఁడు. రుద్రుఁడు శివుఁ డైనాఁడు. వాసుదేవార్చనము పాణిన్యాచార్యులనాఁ డున్నది. పాంచరాత్రులమతమునకు వాసుదేవపూజయే మూలము. క్రీ. పూ. పంచమశతాబ్దిలోని దగుభారతభగవద్గీత వాసుదేవమహత్త్వమునే చాటుచున్నది. పాంచరాత్రులకు సాత్వతులు భాగవతులు వాసుదేవు లనియు సంజ్ఞలు కలవు. ఇందు సాత్వతసంజ్ఞ, ఐతరేయశతపథబ్రాహ్మణములఁ గనవచ్చును [2]. దీని నంతను బట్టి చూచినచోఁ బాంచరాత్ర మతశాఖ క్రీ. పూ. పదునాల్గవశతాబ్దివఱకును బోవుచున్నది. శైవశాఖ దానిని దాఁటుచున్నది. ఈవిషయ మిట్లు సప్రమాణమై గోచరించుచుండ, క్రీ. శ. పంచమశతాబ్దివఱకును బదునెనిమిదివందలయేళ్లు తాంత్రికవిద్య గ్రంథము లేకయే యున్న దనుట సముచితముకా నేరదు. కావున నిది క్రీ. పూ. మూఁడవశతాబ్ది కీవల గ్రంథరచనారంభదశ గాంచిన దనరాదు.

వైష్ణవతంత్ర మైనజయాఖ్యసంహిత పాంచరాత్రమహాతంత్రభాగ మైనట్లు 'ఇతి శ్రీపాంచరాత్రే జయాఖ్యసంహితాయాం' మిత్యాదిప్రకరణాంతగద్యలవల్లనే తెలియుచున్నది. ఇందు ముప్పదిమూఁడుపటలములు కలవు. మొదటిపటలము కడపట నధికపాఠ మనుపేర ౧౬౩ శ్లోకము లున్నవి. ఇందు స్వయంవ్యక్తము లైన యష్టోత్తరశతదివ్యక్షేత్రములలో శ్రీరంగాదులతో వేంకటాద్రి (తిరుమల) కూడఁ జేరినది. రామానుజాచార్యులు విష్ణుస్థలముగా మార్చినవెంకటాద్రిని జేర్చినయీ భాగము తప్పక ప్రక్షిప్త మర్వాచీనము నగుచున్నది. ఈగ్రంథమున సృష్టిప్రక్రియ బ్రహ్మజ్ఞానము మానసికయాగ బాహ్యయాగములు మంత్రదీక్షాదులు వర్ణింపఁబడినవి. కడపటిపటలములలో ముద్రలు వాసుదేవానిరుద్ధాదిమంత్రసాధనములును దెలుపఁబడినవి. ఇట్లే, నారదపాంచరాత్రమునకు సంబంధించినవి గాఁ గనవచ్చు ౪౩ పటలములపౌష్కరసంహితయు, నాలుగుపాదములపాద్మసంహితయు, ౯౨ పటల

1. చూ. బరోడాప్రతి, జయాఖ్యసంహిత పీఠిక.
2. ఐ. బ్రా. 2. 25. 6; 8. 14. 3.
శ. బ్రా. 13. 5, 4, 21.

ముల పరమాగమచూడామణియు మొదలుగా వైష్ణవతంత్రములు షడ్గుణైశ్వర్య సంపన్నుఁ డగు వాసుదేవునిపూజావిధులు వివరించుచున్నవి. పాద్మసంహితలో ౧౦౮ వైష్ణవతంత్రములు పేర్కొనఁబడినవి. వానిలో ననేకములు సజీవములు. దీనినిబట్టి వైష్ణవతాంత్రికవిద్య యెంతవఱకు విస్తరించెనో తెలియఁగలదు.

శైవతంత్రము లఱువదినాలు గని కాదిమతతంత్రము చెప్పుచు, వానిలో రుద్రయామలమహాతంత్రమును ముందు పేర్కొన్నది. ఇందు పరమశివారాధనమే కాదు, శక్తిగణపత్యాదిపూజావిధులును బహువిధము లైనవరివస్యారహస్యములును వర్ణింపఁబడినవి. దీనిపరిమితి యెంతో తెలియకున్నది. కాని, దేవీరహస్య—కల్పవల్లీ—శారికాకవచ—భగవతీపంచాఙ్గ — ధాతుకల్పాదితంత్రములు దీనిభాగములుగాఁ గనఁబడుచున్నవి. ఇవి గాక, భూతడామర—ఆనందతంత్ర—భూతభైరవ —రహస్యార్ణవ—శివరహస్య—మహాతంత్రాదు లనేకములు స్వతంత్రములై శైవారాధనవిశేషములను బోధించుచున్నవి. మంత్రజపహోమతర్పణార్చనాది విధానము లన్నిటియందును సాధారణముగానుండును గాని, కొన్నిట మఱికొన్ని విశేషవిషయములు కలవు. ధాతుకల్పము రసవాదవిద్యను, కల్పవల్లి యౌషధరసాయనములను భూతడామర మణిమాదిసిద్ధులను, భూతభైరవ మష్టనాయికాసాధనములను, అకులాగమము షడ్విధయోగములను, మహామేరుతంత్రము వామమార్గదక్షిణమార్గలక్షణములను, బీజవ్యాకరణము బీజాక్షరమహత్త్వమును, కులార్ణవతంత్రము కులధర్మాదులను, ఇట్లే మఱికొన్ని యితరవిశేషములను వివరించినవి. ఈశైవమునందే గాణాపత్యకాపాలికము లవాంతరము లయ్యు మతాంతరవ్యవహారము గాంచినవి. ఇంక—

శాక్తమతమును బోధించుతంత్రములు రుద్రయామలభాగములే కాక, శక్తిసంగమమహానిర్వాణాదు లసంఖ్యాకములు కలవు. శైవవైష్ణవములను మించి భరతఖండమంతట నెక్కువగా వ్యాపించినయిది ఋగ్వేదములోని శ్రీసూక్తము మార్గదర్శకముగా నుదయించి కొంతవఱకు వేదాన్తములను, కొంతవఱకు సాంఖ్యయోగముల ననుసరించి నూతనమార్గము త్రొక్కినది. దుర్గా చండీ భైరవీ భద్రకాళీ త్రిపురసుందరీ బాలా శ్యామలా మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యాది సంజ్ఞలతో నారాధింపఁబడుపరాశక్తి యీమతమునకు మూలము. కొల్లాపురాద్యష్టాదశపీఠముల నాచరింపఁబడుమహాలక్ష్మీపూజయు సవిశేషముగా వంగదేశమున నొనర్పఁబడుకాళీపూజయు, ఎల్ల దేశముల దేవీనవరాత్రములఁగావింపఁబడుదుర్గా శారదాపూజలును శాక్తేయములు. జగద్గురు శంకరాచార్యు లాచరించినశ్రీచక్రపూజనము శాక్తము. ఇంతయేల? ప్రస్థానత్రయము పఠించుమహాపండితులు గూడ ననేకులు శ్రీవిద్యోపాసనము ముక్తికి సులభమార్గ మని దీని నాచరింపఁ

జొచ్చి రనుటకంటె దీనిమహత్త్వమును, దీనివ్యాప్తిని వేఱుగాఁ బ్రశంసింపఁ బని లేదు. ఈశాక్తమాధారముగా హిందూదేశ మంతట వివిధనామరూపములతో గ్రామదేవతలు వెలసి రనుటకంటె నిది సర్వవర్ణసాధారణమైన దనుటకు వేఱొక్క నిదర్శన మక్కఱలేదు.

"పరబ్రహ్మప్రతిబింబమైనమూలప్రకృతియే పరాశక్తి. సర్వాద్యయు బ్రహ్మరూపచిదానందయుఁ బరబ్రహ్మరూపయు నైనయాప్రకృతినుండి మహత్తత్త్వమును, దానినుండి యహంకారమును, దానివల్ల నాకాశమును దరువాతఁ గ్రమక్రమముగా వాయ్వగ్నిజలపృథివ్యోషధ్యన్నప్రాణములును, ప్రాణమునుండి జీవుఁడును బుట్టిరి. కావునఁ బరబ్రహ్మమే యీచరాచరజగము. తత్ప్రతిబింబమైనపరాశక్తి యక్షరరూపిణి యవినాశిని. అది లేక శివునికి నామధామములు లేవు. మూలప్రకృతి యగుదానివిక్రృతులు మహాకాళీ సుందరీ రక్తవర్ణా బాలభైరవీ విద్య లనువారు. ప్రపంచమూల మాపరాశక్తిరూపప్రకృతి. తన్మాయారూపధారి ప్రపంచాత్మ యగు శివుఁడు. అతఁడు త్రిగుణాత్ముఁడు. అతనికృపాలేశమువల్ల సదాశివుఁ డుదయించెను." ఇత్యాదిగా శక్తిసంగమతంత్రము సృష్టిక్రమ ముపదేశించుచున్నది. జగదుత్పత్తిస్థితివినాశములకు మూలము పరాశక్తిరూపప్రకృతి యనియు, పురుషుఁ డవలంబనముగాఁ గ్రీడించుదానిలీలయే జగద్వ్యాపార మనియు నిక్లే శాక్తతంత్రము లన్నియుఁ జెప్పుచున్నవి. జీవుఁడు నిజస్వరూపము తెలిసికొనుటయే ముక్తి యని యెల్లశాక్తతంత్రము లేకగ్రీవముగాఁ దెలుపుటంబట్టి యద్వైతమతమును, మూలప్రకృతి నంగీకరించుటం బట్టి సాంఖ్యయోగములను, ఇది యనుసరించె ననుట విదితము.

నవద్వీపనివాసి యగుకృష్ణవిద్యావాగీశభట్టాచార్యుఁడు ప్రాచీనప్రధాన తంత్రములలోని ముఖ్యవిషయకశ్లోకములుసంగ్రహించి తంత్రరత్నమనుగ్రంథము సమకూర్చెను. అది, వైదికమార్గావలంబనము లయినశాక్తశైవవైష్ణవగాణాపత్యసౌరము లాచరణీయము లని వక్కాణించుచు, చార్వాక జిన జైమిని కపిలాక్షపాద సుగతు లార్గురును హేతువాదు లని హాయశీర్షశ్లోకమున నిరసించినది[1]. శక్తిసంగమతంత్రములోనికాళీఖండము, బౌద్ధపాషండమతనాశనార్థమును సంప్రదాయసాంకర్య మణఁచుటకును, సత్సంప్రదాయము స్థాపించుటకును బ్రాహ్మణ్యరక్షణార్థమును, కాళీ తారా సుందరీ ఛిన్నమస్తకా ఖండము లనెడియుత్తమ తంత్రభాగములు కలియుగమున ననుసరణీయము లని బౌద్ధాదివైదికేతరమతనిరసనముతో బ్రాహ్మణమతప్రశంస గావించినది. "కలియుగమున మానవులు వర్ణా

1. జైమిని స్సుగత శ్చైవ నాస్తికో నగ్న ఏవచ
కపిల శ్చాక్షపాదశ్చ షడేతే హేతువాదినః

శ్రమధర్మదూరగులై పాపకర్ములై దురాచారులై యజ్ఞానాంధకారమున నణఁగుచున్నారు. వారు వేదోక్తకర్మ లాచరింప సమర్థులు గారు. శాస్త్రజ్ఞానమున ముక్తి గాంచఁజాలరు. వారికిఁ దరణోపాయ మేమి?" అని యడిగినయాదిశక్తిరూప యగు పార్వతికి "సకలవేదవేదాంగతంత్రాగమాదులసార మైనయీతంత్రము పఠించి దీని ననుసరించినవారు వేదోక్తకర్మ లాచరింపక పోయినను, స్మృతీతిహాసపురాణముల ననుసరింపక పోయినను, వారికి నిర్వాణము సులభసాధ్య మగు" నని శివుఁడు చెప్పినట్లుగా మహానిర్వాణతంత్రము చెప్పుచు, వైదికకర్మాలసు లగువారిముక్తికిఁ దాంత్రికవిధి మార్గాంతర మనుభావము వెల్లడించినది. పైతంత్రాభిప్రాయములను బట్టి తాంత్రికవిద్యాచరణము వైదికము కాక పోయినను, దానికి సన్నిహితమై వైదికేతరమతములకు విరోధియై యొప్పుచున్న దని తెలియనగును.

శాక్తేయతంత్రములలో నెల్ల నుత్తమ మైనది మహానిర్వాణతంత్ర మని కొందఱందురు. ఇది పదునాలు గుల్లాసములమహాగ్రంథము. శక్తిశివులప్రశ్నోత్తరరూప మైనయిందు చర్చింపఁబడనితాంత్రికవిషయము లేదనుట సత్యము. మఱియు, సర్వవర్ణాశ్రమాచారవిషయములను జక్కఁగ విమర్శించి సరియైన సిద్ధాంతములు చూపినయిది శ్రుతిస్మృతీతిహాసపురాణాదులసార మనుట యతిశయోక్తి కా దని యిందలియెల్లప్రకరణములఁ దెలియవచ్చును. పంచతత్త్వసంస్కరణాదుల కిది విధించినవేదమంత్రములే దీనివైదికమార్గసన్నిహితత్వమునకు నిదర్శనము. దీనికర్త గాని కాలముగాని తెలియ రాకున్నను, 'వేదానా మాగమానా ఞ్చ తన్త్రాణా ఞ్చవిశేషతః, సార ముద్ధృత్య' ఇత్యాదిశ్లోకములనుబట్టియుఁ బూర్వతంత్రములందు గజిబిజిగానున్నవిషయము లిందు సక్రమముగా గోచరించుటనుబట్టియు, శక్తిపూజావిధాన సంస్కారనిర్ణయాదులను బట్టియు నిది, శాక్తము దురాచారాక్రాంత మగుచున్నయర్వాచీనకాలమున దానిని సదాచారమార్గమునకుఁ ద్రిప్పు నుద్దేశమున నుత్పన్న మైన దని కొందఱియభిప్రాయము. దీని నాంగ్లీకరించిన ఎవెలన్ పండితునియుద్దేశ మిట్టిదే. ఇందు—జీవనిస్తరోపాయప్రశ్నలు, పరబ్రహ్మోపదేశపరాప్రకృతిసాధనరూపసమాధానములు మంత్రోద్ధారము కలశస్థాపనము పంచతత్త్వసంస్కారములు పాత్రస్థాపనహోమచక్రానుష్ఠానములు స్తోత్రకవచకులతత్త్వలక్షణములు వర్ణాశ్రమాచారధర్మములు దశవిధసంస్కారములు పూర్ణాభిషేకము ప్రాయశ్చిత్తవిధులు సనాతనవ్యవహారము కాళీప్రతిష్ఠానుష్ఠానము శివలింగస్థాపనము చతుర్విధావధూతవిధులు మొదలగు బహువిధవిషయములు వర్ణింపఁబడినవి. విప్రాదిచండాలాంతమానవు లందఱును, కులాచారమం దధికారులు, కులవిహిత మగుటచే శాక్తము కౌల మనఁబడుచున్నది. కౌల మాచరింపనికొలుఁ డధమగతి పాలగును. కౌలాచరణము జీవన్ముక్తి హేతువు. ఇత్యాదిగా నిది శాక్తమును బ్రశంసించుచున్నది. కాని,

మద్య మాంస, మత్స్య ముద్రా మైథునము లనెడిపంచతత్త్వములు లేని శక్తిపూజ ఫలదాయకము కా దనియు, అట్టిది యభిచారవిధి యగు ననియుఁ జెప్పుచు, తదాచరణమును సంస్కారవిశేషములచే మిక్కిలి నియమితముఁ గావించినను, సురాపాన మాంసభక్షణాదికము మితిమీఱినచో రోగహేతు వగు ననెడి యభిప్రాయముతోఁ బరిశోధనసంస్కారనియమవిశేషములను గావించినను, వామాచారవిహిత మైనశాక్తమున కిది ప్రాధాన్య మిచ్చినమాట సత్యము. బెల్లమునుండి కాని, పిండినుండిగాని, ఇప్పపువ్వులనుండి గాని తీసినమద్యము సుర యనఁబడును. అదే దేవినివేదనకు శ్రేష్ఠ మని చెప్పుచు, తాళఖర్జూరాదివృక్షముల నుండిపుట్టినసుర గూడఁ జక్కఁగాఁ బరిశోధించి యుపయోగించ వచ్చునని సెల విచ్చినది. ఇది బోధించినపరిశోధనములు మద్యమాంసాదులయందలిరోగబీజములు నశించుటకే కాని, వానియుద్రేక మణఁగించుటకుఁ బనికిరావు.

ఇది దేవీయాగమునకు విధించినపురుషపశుబలి, జ్యోతిష్టోమాదులలోని పశ్వాలంభమువంటిదే యని శాక్తేయులు సమర్థింపవచ్చునుగాని, దానివలె నిది వేదవిహితమా ? కావుననే యవైదిక మైనశాక్త మప్రమాణ మని వైదికకర్మ వాదులు దీని నిరసించిరి. అయినను, శక్తిబలిపూజావిధానమునకు వేదమే మార్గ దర్శక మైన దని మాత్ర మంగీకరింపక తప్పదు. ఇట్టిమద్యమాంసాదినివేదనిషే వణములు దూష్యము లనెడివైదికవాదము హెచ్చుగుటచేతనే కాఁబోలు నిది—

"సర్వం మూలేన సంశోధ్య మహాదేవ్యై నివేదయేత్,
నచాత్ర ప్రత్యవాయోఽస్తి నాజ్ఞవైగుణ్యదూషణమ్,
సత్యం సత్యం పున స్సత్య మితి శంకరశాసనమ్"

అనుచు గొంతెత్తిముమ్మాఱు ఘోషించినది. ఈయాచారమున కిష్టపడని కొందఱురాగిపాత్రములోఁబోసినగుడోదకముకాని, పాలుగాని మద్యతుల్య మనుచు దానినే దేవికి సమర్పించుట కలదు కాని, మొత్తముమీఁద శాక్తతంత్రము లన్నియు మకారపంచక మంగీకరించిన వనియే చెప్పవచ్చును. ఈయైదింటి మొదట మకార ముండుటంబట్టి వీనికి మకారపంచకసంజ్ఞ శాక్తసమ్మత మైనది. ఇందు ముద్ర లనఁగా శాలి యవ గోధూమాదిచూర్ణముతోఁ జేసినఘృతపక్వము లైనచక్కిలాలు అప్పాలు మొద లగుభక్ష్యములని యర్థము. ఈయైదుతత్త్వము లును గ్రమముగా, తేజఃపవనజలపృథివ్యాకాశస్థానీయము లని వీనియభిప్రాయము. ఈమతము గూడఁ బూర్వసంప్రదాయసిద్ధ మగుటచే నీతత్త్వము లెట్లో సమర్థ నీయము లైనను, మొదటిమూఁడును జుగుప్సాకరములును, కడపటిది దేవీపూజాం గమై లజ్జాకరమును. పశుబలివిధానము భయంకరమగుటచేతనే పూర్వ విద్వాంసులును శాస్త్రకర్తలును గొందఱు మకారపంచకనిరసనము గావించి రన

వచ్చును. అయిన నేమి? ఇదియే శాక్తవ్యాప్తికి హేతు వైనది. శాక్తు లంద ఱును నిగ్రహానుగ్రహసమర్థులై కేవలపరాశక్తితత్త్వవిజ్ఞానమునఁ బరమపురు షార్థసిద్ధిగాంచినవా రనవచ్చునా? కానివా రందఱును మకారపంచకాసక్తులే కదా! కావున నిది త్రాఁచుతోడిచెలగాటమువంటిది. వశ్య మైనసరే. కాకున్న నెదురు తిరిగి మాంత్రికు నధోగతిపాలుచేయును. ఈభావమునే—

"ఆనందం బ్రహ్మణో రూపం తచ్చ దేహే వ్యవస్థితం తస్యాభి
వ్యంజకాః పంచమకారాః తై రర్చనం గుప్త్యా, ప్రాకట్యా న్నిరయః"

ఇత్యాదివాక్యములఁ బరశురామకల్పాదులు తెల్పుచు, ఒడలు తెలియ కుండఁ ద్రాగినచో నరకప్రాప్తి తప్ప దని శాక్తులను మేలుకొల్పుచు, అయిదు తులములయెత్తు మద్యమున కధికార మిచ్చినవి. ఈవిషయమై కాళీఖండ మిట్లు చెప్పుచున్నది.

"పూజాద్రవ్యకల్పము కాశ్మీరము గౌడము కైరళము నని త్రివిధము. పాలు వంకాయ కందగడ్డ పాలమీఁగడ కుమారి (కన్య) అనునవి పంచతత్త్వ ములు. కాశ్మీరమందు వీనిలోఁ గొన్నిటి కనుకల్పములు కల్పించి, రాగిపళ్లెము లోనిపాలు నువ్వులపిండి గుంజనము క్షీరాన్నము మైథునమునను వానిని శాక్తులు పంచతత్త్వములనుగా గ్రహించుచున్నారు. ఉగ్రగౌడులు ప్రత్యక్షము లయిన మద్యమాంసాదులనే స్వీకరించుచున్నారు. పరిశుద్ధ మైనపాలే కేరళదేశీయు లనుమ తించుచున్నారు. శుద్ధకేరళులు కేవలజలముతోను, చైతన్యకేరళులు శీతలజలము తోను, ఋక్కేరళులు సుగంధిజలముతోను, గుప్తకేరళులు పాలతోను బూజ గావించుట యాచారము. మద్యమాంసాదులను దామ్రపాత్ర క్షీరాదులందు భావనచేయుట శుద్ధకాశ్మీరాచారము. అల్లపురసముతోడిగుడోదక ముపయోగిం చుట గుప్తకాశ్మీరమార్గము. గోక్షీరనివేదనమే శుద్ధగౌడమతము. ఋగ్గౌడులు పాలలోఁ దేనె కలుపుదురు. ఇతరవర్ణములవారు మద్యాదులు నివేదించినను, బ్రాహ్మణుఁడు మాత్రము వానిని నివేదించి భక్షింపరాదు. 'తామ్రే గవ్యం మధు సమం దైవే పిత్ర్యే న దుష్యతి' అనువచనమును బ్రాహ్మణుఁ డాశ్రయింపఁ దగును" ఇత్యాదిగా మకారపంచకమునేడ నొక్కొక్కదేశమందును వేఱు వేఱాచారములు కనవచ్చుచున్నవి. "సామాన్యముగా గౌడకాశ్మీరదేశము లందు, నేయి పాలు వెన్న మజ్జిగ పెరుగు విఱుగుడుపాలు తేనె నీళ్లుకలిపినతేనె నూనె అల్లపురసము కలిపినపానకము, అనువానిని బూజాద్రవ్యములను గా వీని యోగింతురు" అని కాళీఖండము చెప్పుచున్నది గాని, మద్యమాంసాది నివేదనమే తరువాత నెక్కువగా నందలిశాక్తులయభీష్ట మైనట్లు తెలియవచ్చుచున్నది, ఎట్లయిన నేమి? మకారపంచకము మొదటికల్ప మనియు, దాని కిష్టపడనివారు ప్రత్యామ్నాయపద్ధతి కల్పించికొని రనియు స్పష్టము. ఇఁక—

మంత్రములందుమా, "సప్తకోటిమహామంత్రా శ్శివవక్త్రవినిర్గతాః" అను స్కాందవచనమున నేడుకోట్లని తెలియుచున్నది. ఇందొకటియు వేదములోనిది కాదు. వీనిలో, అకారాదిక్షకారాంతవర్ణము లన్నియు అం—కం—క్షం—ఇత్యాదిగా బీజములగును. కొన్ని హ్రీం. క్లీం—ఇత్యాదిగా సంయుక్తాక్షరబీజము లగును. కొన్ని మంత్రములలో దేవతలపేళ్లుండును. కొన్నింట, తత్తద్దేవతాకము లైనబీజాక్షరములు మాత్రమే యుండును. పరమేశ్వరీమంత్రబీజములు—హ్రీం శ్రీం క్రీం—అనునవి మూఁడు. వీనితో దేవతపేళ్లు కలుపుటచేఁ బండ్రెండుమంత్రము లేర్పడును. అందు కడపటిది పదియేడక్షరములసప్తదశీమంత్ర మగును. ఇత్యాదిగా మంత్రోద్ధారము బహుముఖముగా నిష్టదేవతలపేళ్లతోను వివిధము లైనబీజాక్షరముల కలయికలోను గనవచ్చును. అపార మైనమంత్రవిషయ మిట్లుండ, దేవీపూజ కాధార మైనశ్రీచక్రము తంత్రములందు మహోత్కృష్టముగా వర్ణింపఁబడినది. కామకలావిలాస మనుతంత్రము దానింగూర్చి కావించినయద్భుతవర్ణనము చదివి తెలిసికొనఁదగినదే కాని, రెండుమాటలతోఁ దేలునదికాదు. అయిన నించుక—

ఆద్యశక్తి యగుపరాభట్టారిక శివాదిభూమ్యంతషట్త్రింశత్తత్త్వమైన సర్వప్రపంచాత్మిక—స్వానందమయనిత్యనిరుపమాకార. త్రి=మూఁడు తేజస్సులకంటె, పురా=పూర్వ మున్నదగుటచే నామె త్రిపుర, లేక త్రిపురసుందరి యనఁబడుచున్నది. ఆదేవియే సకలచరాచరబీజము. అహంకారవాచ్యుఁడు జ్ఞానరూపుఁడు నైనశివుఁడు ప్రతిఫలించు నిర్మలదర్పణము. చిదానందేచ్ఛాజ్ఞానక్రియారూప.

'యదా సా పరమాశక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ,

'న శివేన వినా దేవీ న దేవ్యా చ వినా శివః,

అని, ఆగమములు చెప్పుచున్నవి. జ్ఞానరూపశివుఁడును, క్రియారూపశక్తియుఁ గలియుటచే, బీజమునుండి యంకురము, అంకురమునుండి బీజము పుట్టునట్లుగా శివాదిక్షిత్యంతము లైనతత్త్వము లుత్తరోత్తరక్రమమున హేతువు లగుచుఁ బుట్టుచున్నవి. తాదృశతత్త్వములకుఁ బ్రధానకారణమును, తత్త్వరూపయు, చిదానందరూపయు, ఇచ్ఛారూపయు నైనది యాదిశక్తి. శివశక్తిసమాగమమే ప్రపంచోత్పత్తికి మూలము.

'శివశక్తి రితి హ్యేకం తత్త్వ మాహు ర్మనీషిణః'

అనెడివచనమునుబట్టి శివశక్తులు వేఱుగా రనియు, శివరూపప్రకాశము విమర్శరూపశక్తియుఁ గలసి పరస్పరాశ్లిష్టమును మిథునరూపమును దివ్యము నైనయొక్కముద్ద యనియుఁ దెలియఁదగును[1]. కోరుచున్నాను, తెలియుచున్నాను

---

1. శివశక్తిమిథునపిణ్డః కబలీకృతభువనమణ్డలో జయతి. కామకలా.

చేయుచున్నాను, అనెడియుత్తమ పురుషక్రియలలో స్ఫురించెడి యహమే ప్రకాశము [1]. అందుచేతనే సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వకర్తృత్వ పూర్ణత్వ వ్యాపకత్వ రూపపంచశక్తుల కాశ్రయ మైనయది పరబ్రహ్మ మని చెప్పఁబడుచున్నది. ఆశివ శక్తియే 'అహ' మ్మనుచో, అకారాదిహకారాంతపంచాశదక్షరరూపిణి, వర్ణపద మంత్రకలాతత్త్వభువనాత్మకసర్వప్రపంచజనయిత్రి, పరాశక్తి, అనఁగా, అంతర్గర్భితసమస్తవర్ణ మయిన 'అహ' మ్మనెడిప్రకాశమును, తత్ప్రతిఫలనదర్పణ మైన విమర్శరూపశక్తియు ననుసంపుటమే, శబ్దార్థరూపసకలప్రపంచవికాస మగుచున్న దనిభావము. ఇందుకు శ్రుతిప్రమాణము—

"ఏకో వర్ణో బహుధా శక్తియోగా ద్వర్ణా ననేకాన్ నిహితార్థో దధాతి"
"క స్త్వ మిత్యహ మితి హో వాచ. అహ మే వేదం సర్వమ్. తస్మా దేవా
హ మితి సర్వాభిధానమ్—"

ఆశివశక్తిరూప మైనశుక్లరక్తబిందుయుగళమే పరా పశ్యన్తీ మధ్యమా వైఖరీరూప సమస్తశబ్దార్థసృష్టికిని, ముప్పదియాఱుతత్త్వములసృష్టికిని మూలకారణము. తద్బిందుద్వయమిశ్రరూపమే సర్వతేజోమయ మైనపరమాత్మస్వరూప మని పరమార్థము. వికాసావస్థయందు, ఆమిశ్రబిందు వహంకారాత్మక మయిన సూర్యతేజస్సు, అదే ప్రకాశము, కామశబ్దవాచ్యము. విమర్శశక్తి కల యనఁబడును. అది, అగ్నిచంద్రాకారబిందుద్వయాత్మిక. తాదృశబిందుత్రయసమష్టిరూప యగు మహాత్రిపురసుందరి కామకల యనఁబడుచున్నది. దేవీచక్రాత్మికయగు నదియే కామకలావిద్య. ఏతాదృశ తేజస్త్రయమునకుఁ బురాభూత కావుననే శక్తి త్రిపుర యనఁబడినది.

'పరం ధామ త్రైపురం చావిశన్తి'
'బ్రహ్మ వి ద్బ్రహ్మైవ భవతి. సవా ఏష ఏవం పశ్య న్నేవం మన్వాన
ఏవం జానన్ ఆత్మరతి రాత్మక్రీడ ఆత్మమిథున ఆత్మానన్ద స్స ఏవ భవతి'

ఇత్యాదిశ్రుతివచనములు పై యర్థమును స్థిరపఱుచుచున్నవి. ఈవిధముగా శివశక్తిరూపపరాశక్తిని వర్ణించి, ఆశక్తియే సకలజగదావిర్భావతిరోభావములకుఁ గారణ మని వర్ణించి, ఆమెరూపమే శ్రీచక్ర మని యిట్లు నిరూపించినది.

శ్రీచక్రమునకును, పరాశక్తికిని భేదలేశ మైన లేదు. నవయోన్యాత్మక మైనశ్రీచక్రముయొక్క మధ్యభాగ మైనబిందుతత్త్వము పరాశక్తిస్వరూపము. ఈబిందుతత్త్వమే, ఆనందేచ్ఛాశృంగాటకరూపమునఁ బరిణతమై త్రికోణాకృతిని బొందుచున్నది.

1. ప్రకాశ స్యాత్మ విశ్రాన్తి రహంభావో హి కీర్తితా.

శృంగాటరూప మాపన్న మిచ్ఛాజ్ఞానక్రియాత్మకమ్' అని తంత్రవచనము. ఈ త్రికోణచక్రమునుండి, ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులపరిణామరూపము లైనపశ్యన్తీ మధ్యమా వైఖరీ శక్తు లుదయించును. ఇవే వాక్శక్తు లనఁబడును. 'వామా-జ్యేష్ఠా-రౌద్రీ-అమ్బికా-పరా-'అనెడిశక్తు లైదుగురు శ్రీచక్రాంతర్గతములం దధోముఖములు నైనపంచత్రికోణము లగుదురు. ఇచ్ఛా-జ్ఞాన-క్రియా-శాంతా-శక్తులు నలుగురును, శ్రీచక్రములోనియూర్ధ్వముఖము లైననాలుగు త్రికోణము లగుదురు. అనఁగా, పరాశక్తివిలసనరూపములే తక్కినయెనిమిదిశక్తుల యాకృతులు. ఏతాదృశనవశక్తిమయమై నవత్రికోణమై నవయోన్యాత్మక మనఁబడునది శ్రీచక్రము. 'ఆత్మనః స్ఫురణం పశ్యే ద్యదా సా పరమాకలా' ఇత్యాది వాక్యముల, వామకేశ్వరతంత్రమును, ఇట్లే శ్రీచక్రమును నిరూపించినది. ఈవిధముగా శుక్లరక్తమిశ్రబిందుత్రయాత్మికయు, ప్రణవాత్మికయు, సకలామ్నాయసారభూతయు, సత్త్వరజస్తమోరూపిణియు, జగన్నిర్మాత్రియు నైనయాద్యపరాశక్తి త్రికోణచక్రరూపిణియై భజనీయు రాలగుచున్న దనుచు, శ్రీచక్రమండలినవత్రికోణములరూపములను వసుకోణదశారాదులను సవిశేషముగాఁ దంత్రములు వర్ణించి యున్నవి. దీనినిబట్టి పరమశివపరాశక్తుల యభేదరూపమే పరబ్రహ్మ మని తెలియవచ్చును. ఇదే శ్రీచక్రనిరూపణమందలిముఖ్యతాత్పర్యము.

ఏతాదృశశ్రీవిద్యోపాసనమునకు దీక్ష యావశ్యకము. దీక్షారహితుఁ డిందు కధికారి కాఁడు. గురువర్యునినిర్వ్యాజకృపామాత్రసాధ్య మైనయాదీక్ష, ఆణవ శాక్త శాంభవ భేదమునఁ ద్రివిధము. శాస్త్రవిహిత మైనసకలపూజాద్రవ్యసమర్పణముతోడిపరదేవతాతర్పణధ్యానములయందలియత్యాసక్తి, ఆణవదీక్ష యనఁబడును. శక్తికొలఁది సంపాదించినద్రవ్యములతోడిపరదేవతాపూజయందలియాసక్తి శాక్తేయి. పూజాద్రవ్యసంపాదనసామర్థ్య మెంతమాత్రము లేనిచో, ఆచార్యానుగ్రహము కారణముగాఁగలిగినదేవీపూజాసక్తి శాంభవి. దీనిని బట్టి పరదేవతాసంతర్పణసాధ్యము దీక్ష యని తేలినది. ఆసంతర్పణము ద్రవద్రవ్యసాధ్యము. ఆద్రవ్యము పరమామృతరూప మైనమధువు. అగ్నిష్టోమము సోమరససాధ్య మైనట్లే పరదేవతాయాగము మధురససాధ్యము. దీక్షితుఁ డగువానికి మధుసేవనము నిషిద్ధము కాదని ఋగ్వేదీయశాఖలలో నొకటి యగుసాంఖ్యాయనశాఖ. ఆదిసుందరీవరివస్యాముఖమున దేవతాసామ్రాజ్యము సాధించుటకు మధురసము నిదాన మని పుణ్యానందయోగివిరచితకామకలావిలాసముగూడ మద్యప్రాధాన్యమును సమర్థించుచున్నది. ఇట్లెన్నెని తంత్రములు దేవతారాధనవిధానముల నెన్నెనిభంగుల నిరూపించినవి. ఈవిషయ మిసుకపాఁతఅవంటిది. ఎంత తీసినను, తఱఁగదు. శైవ శాక్త వైష్ణవ భేదమున నున్నయాగమములు మకార

పంచకవిషయము ప్రధాన మనుభావము ప్రకటింప లేదుగాని, అర్చనమందును విశేషనియమబద్ధమై యున్నది. ఆగమవిధానము గూడ వైదికేతర మైనను వైదికవిధానసన్నిహితమై వేదోక్తమంత్రములకలయికతో దేవాలయములం దాచరింపఁబడుచున్నది. యంత్రములు విగ్రహములు ధ్వజస్తంభములు తత్ప్రతిష్ఠలు మొదలగున వన్నియు నాగమోక్తవిధానముననే జరుగుచున్నవి. వైదికు లాచరించుపార్థివలింగపూజ యాగమోక్తమయ్యు వైదికమై వెలయుచున్నది. ఆరాధ్యబ్రాహ్మణులవీరశైవపూజ సర్వవిధముల నాగమవిహితము. వైష్ణవాలయములందలి పూజాతంత్ర మంతయు నాగమోక్తమే. ఇంతయేల? ఆగమములే దేవతాపూజావిధానవిశేషములను దేశమున వెదచల్లిన వనుట నిర్వివాదము. దేవతాభక్తియు విగ్రహరూపదేవతారాధనము ననునవి రెండే యీయపారమయిన తాంత్రిక విద్యావ్యాప్తికిఁ బరమకారణము. శక్తియామలమును పౌష్కరాగమమును రుద్రయామలమును గూడ భక్తిమార్గముతోడియిష్టదేవతాపూజనమును ముందునిరూపించుచు, తరువాత జ్ఞానోపదేశమునను, యోగమార్గోపదేశమునను భక్తులకుఁ బైమెట్టు చూపఁగడంగినవి. నిష్కామభక్తియే మోక్షసాధన మని వీనిపరమోద్దేశము. "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనమ్" "ఆత్మతత్త్వానుసంధానం భక్తి రిత్యభిధీయతే" అనెడియాచార్యోక్తులు పైయభిప్రాయమునే స్థిరపఱుచుచున్నవి. అద్వైతాచార్యు లగుశంకరభగవత్పాదులు గూడ సౌందర్యలహరీ శివానందలహరీ లక్ష్మీనృసింహస్తవాదులు నిర్మించి శక్తి శివ విష్ణు భక్తిమార్గమునకు మార్గదర్శకు లైరనుటకంటె నిష్కామభక్తిమార్గ ముత్తమ మనుటకు వేఱొక్కదృష్టాంత మక్కఱలేదు. ఇఁక నీభక్తిని విస్తరింపఁజేసిన మహాత్ముల యష్టకములు శతకములు సహస్రనామావళులు మొద లగుస్తుతికావ్యము లందుమా, అనంతములు. ఇదంతయుఁ దాంత్రికవిద్యాపరిణామమే యనుటనిజము. ఇఁక దర్శనములు.

ఇది, ఆంధ్రవిశ్వకలాపరిషత్కలాశాలా సంస్కృతాంధ్రాధ్యాపకుఁ
డగు మల్లాది సూర్యనారాయణశాస్త్రి రచియించిన
సంస్కృతవాఙ్మయచరిత్ర, ద్వితీయభాగమగు
లౌకికవాఙ్మయచరిత్రయందలి
తృతీయాధ్యాయము.

---

# చతుర్థాధ్యాయము



## దర్శనములు

సంస్కృతవాఙ్మయమున వివిధవిషయకము లైనశాస్త్రము లనేకములు కలవు. వానిలో, సంహితాబ్రాహ్మణములందలి పరమార్థబోధకము లైనవాక్యము లాధారముగా వెలసినయీశావాస్యాదివేదాన్తములు విస్తరిల్లినపిదప బయలుదేఱిన వేదప్రామాణ్యాప్రామాణ్యవాదములు, జీవేశ్వరభేదాభేదవాదములు ఈశ్వరాస్తిత్వ నాస్తిత్వవాదములు ఊఁతగాఁ దత్త్వ మన్వేషింపఁ గడంగి పూర్వమునులు రచియించినమతవిషయకశాస్త్రములు దర్శనము లనఁబడినవి. ఇచ్చట దర్శన మనఁగాఁ దత్త్వనిరీక్షణరూపజ్ఞాన మని యర్థము. దానిని బ్రతిపాదించుటం జేసి శాస్త్రము దర్శన మైనది. ఈనిరీక్షణజ్ఞానము చేతనాచేతనవస్తుమూలతత్త్వానుసంధానరూపము. ఈయనుసంధానమునకుఁ బ్రమాణము లనేకము లున్నను, అందు ప్రత్యక్షము అనుమానము శబ్దము, అనుమూఁడును బ్రధానములు. అక్షిగోచర మైన ప్రత్యక్ష మధ్యక్ష మనియు, ఊహారూప మైనయనుమానము తర్క మనియు, వర్ణాత్మక మైనవేదశబ్దము శ్రుతి యనియుఁ జెప్పఁబడును. దీనినిబట్టి, ఆధ్యక్షికము తార్కికము శ్రౌతము నని దర్శనములకును; ఆధ్యక్షికులు తార్కికులు శ్రౌతులు నని దర్శనకారులకును వ్యవహారము వచ్చినది.

దర్శనము లాఱే యని శిష్టప్రతీతి కలదుకాని, అవి లెక్కకుఁ బదునాఱున్నవి. ఈమతములవా రందఱును, నాస్తికులు—ఆస్తికులు నని రెండు తెఱఁగులగుదురు. ప్రత్యక్షప్రమాణము వీరి కందఱికి నభిమత మైనను, అది యొకటియే ప్రమాణ మని విశ్వసించువా రాధ్యక్షికులు. వారికి వేదము ప్రమాణము కాదు, పరోక్ష మనునది లేదు. అందుచే వారు రెండువిధముల నాస్తికు లైరి; వారు చార్వాకులు. అనుమానము ప్రధానప్రమాణ మనువారిలో, తర్కమునుబట్టి జగద్వస్తుస్వరూప మిట్టిది యని నిశ్చయించుకొని పరోక్షార్థ మన్వేషించువారు తార్కికులు. వారిలో సర్వం దుఃఖ మిత్యాదితత్త్వచతుష్టయ ముపదేశించినబుద్ధముని మతమువా రైకాన్తికులు [1] బౌద్ధులు క్షణికవాదులు. తర్కసహాయముననే వస్తుస్వరూప మన్వేషింపఁ గడంగియు నెందును నిశ్చితబుద్ధి లేక స్యా ద్దుఃఖం స్యాత్సుఖ మిత్యాదిగా నే మైనఁ గాని మ్మను జినమునిమతము వా రనైకాన్తికులు జైనులు

1. ఏకాన్త మనఁగా నిశ్చయము.

స్యాద్వాదులు. ఈరెండు తెగలవారును బర మున్న దనుచున్నను శ్రుతిప్రామాణ్య మంగీకరింపమిచే నాస్తికు లనఁబడిరి. దీనినిబట్టి, అవైదికమతములు నాస్తికము లనఁబడిన వనుట విదితము.

తర్కానవానికన్న శ్రుతినే ప్రధానప్రమాణముగా నంగీకరించువారు శ్రౌతులు. వారిలో, కర్మకాండము ముఖ్య మనువారు పూర్వమీమాంసకులు. జ్ఞానకాండము ప్రధాన మనువా రుత్తరమీమాంసకులు. ఈభేదమున్నను, వీరిరువురుగూడ వేదము ప్రత్యక్షరము విశ్వసించునట్టివైదికులు. కొందఱు తార్కికులు తత్త్వాన్వేషణమున శ్రుతికంటె ననుమానమునే మిక్కిలి యాదరించువారైనను, చార్వాకాదులవలె శ్రుతినింద చేయక, యెందేని తర్కమునకుఁ దోడ్పడుశ్రుతివచన ముద్ఘాటించుటంబట్టి యాస్తికు లైరి. కాని, వారు శ్రుతినే నమ్మునట్టిశ్రౌతులవంటియాస్తికులు కారు. ఇట్లున్నయాస్తికప్రభేదముల నీక్రింది విధమునఁ దెలియఁ దగును.

ప్రచ్ఛన్నద్వైతులై విశిష్టాద్వైతు లనఁబడురామానుజీయులును, స్పష్టద్వైతు లగుమాధ్వులును, కర్మాపేక్ష లేనియీశ్వరవాదు లగునకులీశపాశుపతులును, కర్మాపేక్ష గలయీశ్వరవాదు లైనశైవులును, ఆత్మైక్యవాదు లగుప్రత్యభిజ్ఞాదర్శులును, జీవన్ముక్తివాదు లగురసేశ్వరులును, శబ్దము ప్రమాణాంతరముగా నంగీకరింపనివైశేషికులును, శబ్దప్రామాణ్య మంగీకరించెడినైయాయికులును, సగుణాత్మవాదులు తార్కికులు నైనయాస్తికులు.

వాక్యార్థవిజ్ఞానవాదు లైనపూర్వమీమాంసకులును, పదార్థవిజ్ఞానవాదు లైనపాణినీయులును, సగుణాత్మవాదులు శ్రౌతులు నైనయాస్తికులు.

నిరీశ్వరు లైనసాంఖ్యులును, సేశ్వరు లైనపాతంజలులును, నిర్గుణాత్మవాదులు తార్కికులు నైనయాస్తికులు.

శుద్ధాద్వైతవాదులు, నిర్గుణాత్మవాదులు శ్రౌతులు నైనయాస్తికులు. వీరే, ఉత్తరమీమాంసకులు బ్రహ్మవాదులు శారీరకమీమాంసకులు శాంకరులు. ఇట్లాస్తికులు పదుమూఁడు తెఱఁగుల నున్నారు. వీరివాదముల కాధారము అయిన దర్శనములలో వేదవేదాన్తరగత మై సంప్రదాయసిద్ధ మైనతత్త్వవిషయకవిజ్ఞానము మూలముగా నవతరించినషడ్దర్శనములు విఖ్యాతములు. అవి, పూర్వమీమాంస ఉత్తరమీమాంస న్యాయము వైశేషికము సాంఖ్యము యోగము, అనునవి.

ధర్మసూత్రములను జైమినియు బ్రహ్మసూత్రములను బాదరాయణుఁడును నిర్మించిరి. ఈబాదరాయణుఁడు, పరాశరపుత్త్రుఁడు కృష్ణద్వైపాయనుఁడు భారతకర్తయు నైనవేదవ్యాసుఁ డనియు, ఇతనిశిష్యుఁ డీజైమిని యనియు భారతభాగ

పరాధములు చెప్పినవి. వ్యాఖ్యానకారులు విశ్వసించిరి. ఇందుకుఁ దగినట్లుగా జైమిని బాదరాయణమతమును బాదరాయణుఁడు జైమినిమతము నుల్లేఖించుటయుఁ బ్రమాణ మగుచున్నది[1]. దీనినిబట్టి వీ రిరువురును సమకాలికులై యొకరిరచన మొక రెఱిఁగి యొకమాఱుగానే ధర్మబ్రహ్మసూత్రములు రచియించి రని యంగీకరింపక తప్పదుగాని, వీరిగురుశిష్యసంబంధ మెంతవఱకు సత్యమో, ఈజైమినిబాదరాయణు లెవరో విచారింతము.

పరాశరులు ముగ్గురు నలుగురు, వేదవ్యాసులు సుమా రిరువదియొనమండుగురు నున్నారు. వేదవ్యాసుఁ డనునదిబిరుదు గాని, యేమునికిని సంజ్ఞ కాదు. సత్యవతీపరాశరపుత్త్రకృష్ణద్వైపాయనవేదవ్యాసుఁడు భారతకథోపదేష్ట గాని, యతఁడు భారతసంహితాకర్త కాఁడు. సుమంతు జైమిని పైల వైశంపాయనులు సంహితాప్రవర్తకులు గావచ్చును గాని, యతనిసాక్షాచ్ఛిష్యులు గారు. ఈవిషయములు వెనుకఁ జదివి యున్నాము. ఇది యిట్లుండ, సామాగాచార్యులలో రాణాయనికిఁ బిదపఁ బదుమూఁడవపురుషుఁడును సామగానప్రవచనకర్తలలో నొకఁడగుసుమంతునికిఁ దండ్రియు, అందలిసుమన్వంతునికిఁ బితామహుఁడును సామవేదీయగృహ్యసూత్రాదికర్తయు సామశాఖీయకర్మకాండప్రవర్తకుఁడు నై సామవేదముతో నత్యంతసంబంధము గలవాఁడు గా జైమిని కనఁబడుచున్నాఁడు. ఇతఁడే ధర్మసూత్రకర్త యై నట్లుగా జైమినిసూత్రనవమాధ్యాయద్వితీయపాదారంభమందు 'సామములు ప్రగీతమంత్రములా లేక గీతులా' అనువిషయ మెత్తుకొని నిర్ణయించుచు నన్యులమతములు గూడ నుద్ఘాటించుచుఁ దుదకు "అధికఞ్చ వివర్ణఞ్చ జైమినిః స్తోభశబ్దత్వాత్" అని స్వమతావిష్కరణమున సామవేదీయసంపూర్ణజ్ఞానము విశదీకరించుటకో యనఁ దనపేరు చెప్పికొనుటయే నిదర్శనము. జైమినిభారతకర్త యగుజైమిని యితఁ డనుటకుఁదగినప్రమాణము లేవియుఁ గనరావు. ఒకవేళ నితఁడే యైనను, జనమేజయునికి భారతకథ వినిపించినవైశంపాయనుఁ డెట్లు భారతసంహితాకర్త యని లోకము తలంచెడి వేదవ్యాసునిసాక్షాచ్ఛిష్యుఁడు కాఁడో, అట్లే యితఁడును గాఁ డని మున్నె తెలిసికొంటిమి. మహాభారతాదిపర్వములో సుమంతుజైమిన్యాదు లతనిశిష్యు లనెడిశ్లోకములు ప్రక్షిప్తము లనుట విదితము. ఇంక—

కొన్నిపురాణములలో, కృష్ణద్వైపాయనుఁ డనువేదవ్యాసునికి బాదరాయణసంజ్ఞ కనవచ్చుటచే వ్యాఖ్యాతలును బండితలోకమును, ఆబాదరాయణుఁడే బ్రహ్మసూత్రకర్త యని భావించుట తప్పు కాదు గాని, వైదికవాఙ్మయమం దావేదవ్యాసుని కపరనామముగా బాదరాయణసంజ్ఞ కనరాదు. అథర్వవేదసప్తమకాండ

1. జై. సూ. 1. 1-5—బ్ర. సూ. 1. 2-28, 31,—3. 2-40, ఇత్యాదులు.

ములో రెండుసూక్తములు దర్శించినబాదరాయణి యొకఁడు కలఁడు గాని, అతఁడీతనిపుత్త్రుఁ డైనట్లును గనరాదు. ఇది యిట్లుండ, బ్రహ్మసూత్రకర్త స్వపక్ష ప్రతిజ్ఞ చేయుపట్టుల నాలుగైదుచోట్ల[1] బాదరాయణసంజ్ఞనే వ్యవహరించుకొనెను గాని వేదవ్యాసపారాశర్యకృష్ణద్వైపాయనాదిసంజ్ఞలలో నొకదానినే నొకచోట నైన వాడుకొనలేదు. తుదకు, జైమినిగాని శంకరాచార్యాదిభాష్య కర్తలుగాని బ్రహ్మసూత్రప్రసక్తి వచ్చినపుడు బాదరాయణనామమే యుచ్చరించిరి గాని మాఱు పేరెత్తలేదు. ఇంతకును నిజముగా జైమిని బాదరాయణశిష్యుఁడే యైతే పూజ్య వాచకము లైనభగవదాచార్యాదిశబ్దము లుపయోగింపక ప్రాచీనసంప్రదాయ విరుద్ధముగా 'బాదరాయణస్య' అని ప్రయోగించి యుండునా? కావున నీబాద రాయణుఁడు పారాశర్యకృష్ణద్వైపాయనవేదవ్యాసుఁడు కాఁడు, జైమినిగురువును గాఁడు. మ ఱెవరు?—.

బాదరాయణసంజ్ఞ గలవారును ముగ్గురు కనవచ్చుచున్నారు. ఇంతకు మున్ను చెప్పినయాథర్వణసూక్తదర్శి యగుబాదరాయణితండ్రి యొకఁడు. పరాశరపుత్త్రకృష్ణద్వైపాయనుఁ డొకఁడు. ఉభయమీమాంసాసూత్రకర్తలు సగౌరవముగాఁ దమసూత్రములఁ బేర్కొన్నబాదరిమునిసంతతివాఁ డొకఁడు[2]. కర్మబ్రహ్మజ్ఞానములు రెంటియందును బ్రామాణికుఁ డైనయాబాదరిమునిగోత్రాపత్యమే బ్రహ్మసూత్రకర్త యగునీబాదరాయణుఁ డైయుండు నని తోఁచుచున్నది. సర్వసమర్థుఁ డైనయితనికిఁ గూడ వేదవ్యాసబిరుద ముండెనేమో! అది యసంభవము కాదు. కావునఁ బైజైమినియు నీబాదరాయణుఁడును గూడఁ బలుకుకొని వైదిక ధర్మముల కనర్థము సంభవించినతఱి వేదప్రామాణ్యము నిలువఁబెట్టుటకై కర్మ జ్ఞానకాండములు విశదీకరించుచు నొకరు ధర్మమీమాంసను మఱియొకరు బ్రహ్మ మీమాంసను సమానకాలమున రచియించియున్నా రని విశ్వసింతము.

న్యాయసూత్రకర్త గౌతముఁడు. ఇతని కక్షపాదుఁ డనినామాంతరము. సప్తర్షులలోనివాఁ డగుగోతముడే న్యాయదర్శనకర్త యని గ్రంథగౌరవబుద్ధితో నాధునికులు కొందఱు తలంచిరికాని, తద్గోత్రజాతుఁ డగుగౌతముఁడే దీనికర్త యనుట సముచితము. ఇతనిఁగూర్చి యొకకథ గలదు—వేదవ్యాసుఁ డొకప్పుడితనిని సమీపించి, నీవు తర్కమున జీవేశ్వరులకు భేదము సాధించితివి కావున నీమొగము చూడ ననె నఁట. అయితే పాదమే చూచు మని యితఁ డతనివైపు కాలు చాపె నఁట. అంత దాని కొకకన్ను పుట్టిన దఁట. ఇతనిమాహాత్మ్యమునకు

1. బ్ర. సూ. 1. 3-33; 3. 4-1, 19, 41; 4. 4-7.
2. వర్ణేతు బాదరి ర్యథా ద్రవ్యం ద్రవ్యవ్యతిరేకాత్. జై. సూ. 9. 2-33.
అనుస్మృతే ర్బాదరిః. బ్ర. సూ. 1. 2.30.

వ్యాసుఁడు విస్మయపడి యితని కక్షపాదుఁ డనుబిరు దిచ్చె నఁట— ఈకథ సత్యము గాకున్నను, ఇతనికక్షపాదనామ మెట్లు వచ్చెనో మఱియొకకారణము తెలియ రాకున్నను, దర్శనకర్తలలో నితఁడు మహాప్రతిభాశాలియై తనకాలమున విజయము గాంచె నని మాత్ర మూహింపవచ్చును. ఇతనిన్యాయమునకుఁ బ్రాచీనతర్క మను వాడుక కలదు. తర్కశాస్త్రగ్రంథము లన్నిటియందు గౌతమాక్షపాదసంజ్ఞలు కనవచ్చుటం జేసి యితఁ డీదర్శనము రచియించె ననువిషయమున భిన్నాభిప్రాయములు కనరావు. కాని—

"ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా
యస్తర్కేణానుసంధత్తే సధర్మం వేద నేతరః"

అను మనుస్మృతి శ్లోకములోనితర్కశబ్దము గౌతమన్యాయపరమే యని యొకరు వ్రాసినది మాత్రము విశ్వసనీయము కాదు[1]. అం దది యూహార్థకమే. కొన్ని పూర్వపురాణములలోఁ గూడ దీనికిఁ దర్కనామము కనరాదు. ఛాందోగ్యోపనిషత్తులో నేది వాకోవాక్య మనఁబడినదో, అదే న్యాయ మనుపేర నితిహాస పురాణములలోఁ బేర్కొనఁబడినది. చతుర్దశవిద్యలలో న్యాయ మనుపేరే యున్నది. విద్యలు నాలు గనుపక్షమం దీన్యాయము త్రయీవార్తాదండనీతుల తరువాత, ఆన్వీక్షికి యనుపేర గణింపఁబడినది. భాష్యకర్త దీని నాన్వీక్షికి యని వక్కాణించియున్నాఁడు. తరువాత నెపుడు న్యాయము తర్కశబ్దవాచ్య మయ్యెనో కాని, అమరసింహుఁడు 'ఆన్వీక్షికీ దండనీతి స్తర్కవిద్యార్థశాస్త్రయోః' అని చెప్పియున్నాఁడు.

వైశేషికదర్శనము కణాదుఁడు నిర్మించిన దని వాఙ్మయప్రసిద్ధి. ఈముని కపోతవృత్తి నవలంబించి వీథులలోఁ బడియుండెడిగింజ లేఱుకొని తిని జీవించువాఁ డగుటచేఁ గణాదుఁ డనఁ బరఁగె ననియు, కశ్యపగోత్రుఁ డైనయులూకమహర్షి పుత్రుఁ డగుటచే నౌలుక్యుఁ డైనయితని కీశ్వరుఁ డులూకరూపమున వచ్చి షట్పదార్థవిజ్ఞాన ముపదేశించె ననియు నైతిహ్యములు కలవు. కణభుక్కణభక్షనామములతో శాస్త్రములందు సర్వత్ర కనవచ్చునితఁ డీదర్శనము రచియించె ననుట కాక్షేపము లేదు. ఇది పదార్థము, ఇవి దీనిగుణము లనుచు విస్పష్టముగా షట్పదార్థవిజ్ఞానము విశదీకరించుట యనువిశేషమునుబట్టి యితనిదర్శనము వైశేషిక మైనది.

సాంఖ్యసూత్రములు కపిలముని ప్రణీతములు. సమ్పూర్వకఖ్యాధాతువు నుండి పుట్టినసంఖ్యాశబ్దమునకు సమ్యగ్వివేకమున నాత్మను దెలియఁజెప్పుట యని యర్థము. అట్టిసమ్యగాత్మకథన మిందు కలదు గావున నీదర్శనము సాంఖ్యమను

---

1. చూ. 1928 కాశీముద్రణము. న్యాయభాష్యపీఠిక.

దీని ననుసరించువారు సాంఖ్యులు నైరి. సాంఖ్యప్రవచన మనెడియాశాస్త్రము నకు మూలపురుషుఁడు కపిలుఁ డనుట నిర్వివాదము. కాని, భారతభాగవతాదులలోనికపిలవృత్తాంతములనుబట్టి సాంఖ్యయోగప్రవర్తకుఁ డయినకపిలుఁ డగ్నియవతారమనియు విష్ణువునవతార మనియు దేవహూతిపుత్రుఁ డనియు బ్రహ్మపుత్రుఁ డనియు సాంఖ్యసూత్రాదివ్యాఖ్యాత లెవరికిఁ దోఁచినట్లు వారు వ్రాసియున్నారు. అందుకు భారతాదులలోనికపిలమహత్త్వప్రశంసాపరము లైన వాక్యములే ప్రమాణ మైనను, సాంఖ్యకర్త యైనయొకకపిలుఁ డిందఱియవతార మగుట సంభవింపదుకావున నవి ప్రక్షిప్తము లనవలసి యున్నది. వీనినిబట్టి మిక్కిలిప్రాచీనకాలమందే కపిలాచార్యుఁడు ప్రఖ్యాతి కెక్కె నని మాత్రము విశ్వసింపవచ్చును. మఱియు బ్రహ్మపుత్రకపిలుఁ డిరువదినాలుగుతత్త్వములవిషయ మంతయు సూచించుచు నిరువదినాలుగుసాంఖ్యసూత్రములు తొలుత రచియించె ననియు, తరువాత వైశ్వానరావతార కపిలుఁ డాఱధ్యాయములకపిలసూత్రములు రచియించె ననియు నింకొకవ్యాఖ్యాత తెలిపియున్నాఁడు. తత్త్వసమాసాఖ్యము లైనచతుర్వింశతిసూత్రములు సంక్షేపరూపములు, షడధ్యాయి విస్తరరూపము, రెంటికర్తయొకఁడే యని విజ్ఞానభిక్షువు సమర్థించియున్నాఁడు. కాని, చతుర్వింశతిసూత్రము లాదిసాంఖ్య మనుతలంపునే సర్వోపకారిణీటీక యావిష్కరించినది. అయినను విజ్ఞానభిక్షువుమాట విశ్వసనీయము కాక పోదు.

యోగశాస్త్రమునకు సేశ్వరసాంఖ్యప్రవచన మనియు, పాతఞ్జలదర్శన మనియు నామాంతరములు కలవు. దీనికర్త మహాభాష్యకారుఁ డగుపతంజలి యని—

"యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య తు వైద్యకేన
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతఞ్జలిం ప్రాఞ్జలి రానతోఽస్మి"[1]

అనుశ్లోకమునుబట్టి కొందఱనుచున్నారు. మఱికొందఱు, కపిపుత్రుఁడును బతంజలిగోత్రప్రవర్తకుఁడు నైనయాద్యపతంజలి యోగసూత్రము నిర్మించె ననియు, దానినే పారాశర్యుఁడు "ఏతేన యోగః ప్రత్యుక్తః" అని, తనభిక్షుసూత్రమునఁ బ్రత్యాఖ్యానము గావించె ననియు, భిక్షుసూత్రకర్త యైనపారాశర్యుఁడు[2] పాణినికిఁ బూర్వుఁ డనియు, ఆయాద్యపతంజలి దీనికర్త యనియు భావించుచున్నారు. పారాశర్యప్రత్యుక్త మైనయోగము యోగాభ్యాసపరము గాక యోగశాస్త్రపరమే యని నిశ్చయింపఁ గలిగినచో నాద్యపతంజలి యొకఁ డుండె ననియు దీని నతఁడు రచియించె ననియు నమ్మవచ్చును గాని, అది సాధ్యము కాదు.

---

1. ఈశ్లోకము భోజరాజుశబ్దానుశాసనములోనిదేమో యని మహాభాష్యటీక.
2. పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః అష్టాధ్యాయి. 4. 3. 110.

ఇఁక మొదటిమతమునకు విరుద్ధములైన ప్రబలకారణములు కనఁబడినచో దానిని త్రోసివేయవచ్చును గాని, అవియుఁ గనఁబడవు. కాన నిది మహాభాష్యకార ప్రణీతమే యనుట సముచిత మని తోఁచుచున్నది. ఇఁక వీనియుత్పత్తిక్రమమును, కాలమును శక్యమైనంతవఱకుఁ దెలిసికొందము.

లోకములో మంచికానీ చెడ్డకానీ! అది సంఘములో సంబంధించినపుడు సంఘమునఁ గొంద ఱయినను దానికిఁ బ్రతిపక్షు లుండక పోరు. అట్లే సంహితా బ్రాహ్మణోక్తము లైనయజ్ఞాదికర్మలు పారంపర్యముగా వచ్చుచున్నను, అవి బహుముఖముల దేశమున విస్తరించుకాలమునఁ గొందఱు వైదికకర్మలు నిరసింప నారంభించిరి. వారిలో నగ్రేసరుఁడు బృహస్పతి యనువాఁడు. "వేదములు పౌరుషేయములు తదుక్తకర్మము లాచరించిన లాభము లేదు. పుణ్యాపాపములు లేవు. పునర్జన్మము లేదు పరలోకము లేదు ఈశ్వరుఁడు లేఁడు" అనునాస్తికశిరోమణి. వానిశిష్యుఁడు చార్వాకుఁడు. వానిమొదటి పేరేమో తెలియరాదు గాని "బ్రతికినన్నాళ్లు సుఖముగాఁ దిని యథేచ్ఛముగా విహరింపుము. పరలోక మున్న దని భ్రాంతిపడకు. పుణ్యాపాపము లున్న వని పొరపడకు. చావు తప్పదు. చచ్చి భస్మమైన దేహము మరలి రాదు. దేహముకంటె వేఱే యాత్మ లేదు" అనుచు వాఁడు లోకులకు బృహస్పతిమతము హృదయరంజకముగా నుపదేశించుమృదుమధుర భాషణుఁ డగుటచే, చార్వాకుఁ డనఁబడెను. చారుః=రమణీయమైనవాకః=మాట గలవాఁడు (ఉకారలోపము) చార్వాకుఁడు. ఈమత మనాయాసముగా నాచరింపఁదగిన దగుటచేతను సుఖప్రదముగా నుండుటచేతను లోకులలో వ్యాపింపఁజొచ్చి లోకాయత మనుపేరు గాంచినది. అందుచే నీనాస్తికమతమువారు లోకాయతికులైరి. వీరిని రామాయణకర్త యగువాల్మీకి యెఱుఁగును. ఆకాలమునందాస్తికులు వీరినెక్కువగా గర్హించుచువచ్చిరి. అయోధ్యాకాండమున, శ్రీరాముఁడు భరతుని బ్రశ్నించినట్లుగా నున్నయీవాక్యము లివి :—

"కచ్చి న్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే,
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః,
ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః,
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదన్తి తే"

దీనినిబట్టి క్రీ. పూ. పండ్రెండవశతాబ్దికి మున్నే యీమత ముదయించిన దని విదిత మగును. దీనితరువాత దీనివలెనే వేదప్రామాణ్యము నంగీకరింపక, దీనికంటె నధికముగాఁ బుణ్యాపాపములను బూర్వోత్తరజన్మముల నంగీకరించినయీ ర్హాత మనెడిజైనమత మావిర్భవించినది. దీనిని రామాయణము పేర్కొనకపోవుటచే దానికాలమున నిది యుండెనో లేదో సందిగ్ధముగా నున్నది. గాని, పాణిని

స్మరించినశాకటాయనుఁడు జైనుఁ డగుటచే నతనికి మున్నే యిది యుదయించె ననుట కవకాశ మెక్కువ కలదు. దీనినిగూర్చి యార్హతదర్శనచరిత్రమునఁ జదువుదము.

ఇట్లు కేవలము వేదనిందకములై వైదికకర్మవిరుద్ధము లైనవీని నణఁగించుటకుఁ గేవలము కర్మమే నిశ్శ్రేయససాధనము నిత్యమైనవేదమే శరణ మనెడి ధర్మజిజ్ఞాసామతమును, వేద ముత్తమప్రమాణ మనుచు నాత్మైకత్వజ్ఞానమే ముక్తిదాయక మనెడిబ్రహ్మజిజ్ఞాసామతము నుదయింపవలసివచ్చినది. అవియే జైమిని బాదరాయణులపూర్వోత్తరమీమాంసలు. ఇవి తా ముదయించినప్రయోజనమ్ము నిర్వహించుచున్నతఱిని, వేదశబ్దమే జగన్మూల మనెడిధర్మమీమాంస యీశ్వరుని మాటయే యెత్తకున్న దనియు, ఈశ్వరు నెత్తినబ్రహ్మమీమాంస జగత్తే యసత్య మనుచున్న దనియుఁ గనిపెట్టి, గౌతముఁడు ప్రమాణప్రమేయాదితత్త్వజ్ఞానమున నీశ్వరప్రసాదమును దానివల్ల నభీష్టసిద్ధియు నగు ననుచు జీవేశ్వరభేదముతోడి న్యాయదర్శనమును లేవనెత్తెను. తరువాతఁ బరమాణువులు జగన్మూలకారణ మను వాద మంగీకరించువాఁడైనను, న్యాయమందలిశబ్దప్రామాణ్యము షోడశపదార్థతత్త్వజ్ఞానము మొద లగుకొన్నివిషయము లంగీకరింపక, శ్రుతిని బ్రమాణాన్తరముగా నంగీకరింపక దాని ననుమానప్రమాణసాధనమాత్రముఁగా గ్రహించుచు, ద్రవ్యగుణాదిషట్పదార్థతత్త్వజ్ఞానముననే పరమేశ్వరసాక్షాత్కార మగు నని కణాదుఁడు వైశేషికమత మావిష్కరించెను. ఈదృశభేద మున్నను, ఇదియును న్యాయమువలెనే యారంభవాదముతోడితార్కిక మైనద్వైత మనుట స్పష్టము.

ఇట్టిమతములు విజృంభించుచుండ, పరమాణువులు జగత్కారణ మనుట కిష్టపడక, న్యాయవైశేషికము లాత్మ జడరూప మనుట కంగీకరింపక, సత్త్వరజస్తమోరూప మైనప్రధానము జగత్కారణ మనియు, ఆత్మ, జ్ఞానస్వరూప మనియు నిర్ణయించుచుఁ బరిణామవాదము లేవనెత్తి, చతుర్వింశతితత్త్వజ్ఞానమున సంభవించుతాపత్రయనివృత్తిచేఁ బురుషునికిఁ బరమపురుషార్థము సిద్ధించు నని కపిలాచార్యుఁడు నిరీశ్వర మైనసాంఖ్య ముపదేశించెను. తరువాత, నీశ్వరుఁడు లేఁ డనుట సరి గా దని సాంఖ్యమున కీశ్వరుని జేర్చి పతంజలి సాంఖ్యప్రవచనయోగదర్శనము నిర్మించెను. కాని, ఇక్కడ నొక్కమాట. ఒకదర్శనములో నింకొకదర్శనములోనివిషయము స్మరింపఁబడినట్లు కనవచ్చును గావున నిం దేది ముందు? ఏది వెనుక? అనువిషయమునఁ బరిశోధకులు భ్రాంతిపడుచున్నా రనుట సత్యము. ముఖ్యముగా నుత్తరమీమాంసలో న్యాయవైశేషికసాంఖ్యయోగ సంప్రదాయము లుద్ఘాటితము లగుటంజేసి వానికంటె నిది పర మని తలఁచెడివారును గొందఱున్నారు. కాని, బ్రహ్మమీమాంసలో నెత్తఁబడినయావిషయములు వేదవేదా

న్తాంతర్గతములై సంప్రదాయసిద్ధ తత్త్వవిజ్ఞానమూలకములే యని భావించి నచో నట్టిభ్రాంతి కలుగదు. ప్రతిదర్శనమునకును నాధారము లైనబీజము లుప నిషత్తులలోఁ గనవచ్చుచునే యున్నవి. కావున నింతకంటె సరియైనయాధార ములు లభింపమిచే నాబుద్ధికి గోచరించిన ట్లేర్పఱచినపై దర్శనక్రమమం దేదేని పొరపా టున్నచోఁ బ్రాజ్ఞులు సవరింతురుగాక. ఇది యిట్టి దైనను గొన్నిదర్శన ములు కొన్నిదర్శనములను గంఠోక్తిగాఁ బేర్కొనక పోలేదు. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు.

పూర్వోత్తరమీమాంసలు జైమినిబాదరాయణులను బరస్పరము పేర్కొ న్నవని మున్నే చదివితిమి. పరమాణువాదప్రధానవాదఖండన ముత్తరమీ మాంస గావించినది గాని, ఆఖండనము నాఁటికి సంప్రదాయసిద్ధము లైనవాద ములకు సంబంధించినదిగాని న్యాయవైశేషికసాంఖ్యదర్శనములను జూచి కావించి నది గా దని తెలియనగును. శంకరాచార్యులు న్యాయవైశేషికాదిశబ్దము లుచ్చ రించుట తమనాఁటి కావాదములు దర్శనరూపము దాల్చుటచేతనే కాని, అవి ప్రత్యక్షముగా బ్రహ్మసూత్రోక్తము లగుటచేత నని తలంపరాదు. ఇఁక వైశేషిక మును బేర్కొన్నకపిలసాంఖ్యము దానికంటెఁ బరమనుట విదితము[1]. బ్రహ్మసూత్ర ములకు బోధాయనుఁడు వృత్తి రచియించినట్లు శ్రీభాష్యావతారికలో రామా నుజాచార్యులు చెప్పియున్నారు గావున, క్రీ. పూ. ఆఱవశతాబ్ది కావలివాఁ డైన యతనికిఁ బూర్వమే బ్రహ్మసూత్రము లుదయించిన వనియు పాణిన్యాచార్యులు మీమాంస నుదాహరించుటచే[2] నతని కివి రెండునుగూడఁ బూర్వము లనియు విశద మగుచున్నది. కావున నివి యైదును రామాయణము తరువాత బుద్ధునికిఁ బూర్వము పుట్టిన వని నమ్మవచ్చును.

ఇందు సూచిత మైననాస్తికమతఖండనము చార్వాకజైనపరము గాని బౌద్ధపరము గాదు. భాష్యమున శంకరాచార్యులు దాని నెత్తుటకుఁ గారణము వారికాలమున బౌద్ధమతము వ్యాప్తిలో నుండుటయే. ఆ స్మరణము ప్రాసంగికము. ఇఁక, పతంజలి గౌతమబుద్ధుని స్మరించుటచేఁ బాతంజలదర్శన మతనికిఁ బర మగుట స్పష్టము. గౌతమబుద్ధుఁడు క్రీ. పూ. ౫౦౦ లకుఁ బైవాఁడు. అందుచేఁ బాతం జలము క్రీ. పూ. నాల్గవశతాబ్దిలోని దగుట తెల్లము. దీనినిబట్టి, ధర్మకీర్తి మొద లగువారివల్ల వెలసినబౌద్ధదర్శనమున కాధారము లైనగౌతమబుద్ధునియుప దేశములు క్రీ. పూ. ౫౦౦ లకుఁ బైవని విశద మైనది. ఇఁక, ముందు నాస్తిక

1. సాం. సూ. 1. 25.

2. క్రమాదిభ్యోవుఞ్. అష్టా. 4. 2. 61. మీమాంసా, మీమాంసకః, గణపాఠే,

దర్శనములను, పదపడి యాస్తికదర్శనములను గ్రహించి వానియుదంతము సంగ్రహముగాఁ దెలిసికొందము.

చార్వాకము :—ఈమతమును బ్రతిపాదించుగ్రంథ మిపు డున్నట్లు తెలియరాదు. సర్వదర్శనసంగ్రహమున మాధవాచార్యులు చార్వాకులయభిప్రాయములను దెల్పుకొన్నిశ్లోకము లుదాహరించి యున్నారు కాని, అవి వారియుపదేశములను విశదీకరించెడియితరులశ్లోకములు గాఁ గనఁబడుచున్నవి. చిరకాలము దేశమున వ్యాపించినయీలోకాయతమునకు గ్రంథ ముండక పోదు గాని కాలక్రమమున నది మఱుఁగుపడియుండును.

ఈమతమున భూమి నీరు తేజస్సు వాయువు ననెడినాలుగే తత్త్వములు. ఆకాశము దృగ్గోచర మగునది కాదు కావునఁ జార్వాకులు దాని నంగీకరింపలేదు. సురాబీజము లైనద్రవ్యములు సురగాఁ బరిణమించునపుడు మదశక్తి పుట్టునట్లే, నాలుగుభూతములును శరీరముగాఁ బరిణమించునపు డందు చైతన్యము పుట్టు ననియు, శరీరము నశించుటతో నే యదియును నశించు ననియు, చైతన్యముతోఁ గూడిన దేహమే యాత్మ యనియుఁ జెప్పుచు, ఇందుకు బృహదారణ్యకములోఁ బూర్వపక్షరూపమున నున్నయొకవాక్యమును బ్రమాణముగాఁ జూపుదురు[1]. అంగనాలింగనజన్య మైనసుఖమే పురుషార్థము, కంటకాదిబాధాజన్య మైనదుఃఖమే నరకము, పరిపాలించురాజే పరమేశ్వరుఁడు, దేహనాశమే ముక్తి. ఇత్యాదులు వారిసిద్ధాంతములు. ఇందుకుఁ గొన్నిపద్యములు[2].

గీ. స్వర్గ మనునది లే దపవర్గ మనుట
కల్ల, వేదంబు శాస్త్రంబు కల్పితంబు,
కర్మకాండంబు ఫలదాయకంబు కాదు,
పారలౌకిక మాత్మ నా భ్రాంతి వలదు.

పరులకష్టంబు తొలఁగింపవలయుఁ గాని
జీవహింస యొకప్పుడుఁ జేయరాదు
త్రోసికొని వచ్చుదుఃఖంబు తొలఁచి వైచి
సౌఖ్య మందుట యొక్కటే జన్మఫలము.

ఈనాస్తికులవేదాదినింద యపార మైనది. "వేదములు శాస్త్రములు అగ్నిహోత్రములు బుద్ధిపౌరుషహీను లగువారు జీవికార్థము కల్పించుకొన్నవి. యాగమందు చంపిన మేఁకకు స్వర్గము లభించు నేని, యజమానుఁడు తనతండ్రిని జంపి

1. బృ. అ. 2. 4–12. స యథా సైంధవఖిల్య ఉదకే ప్రాస్త ఇత్యాది
2. ఇవి నేను రచియించిన ప్రేమతత్త్వములోనివి. ఇఁక ముందు చూపింపఁబడువి యీనందలివే.

యజ్ఞ మేల చేయరాదు? చచ్చినవారికి శ్రాద్ధము తృప్తికారణ మగునేని, ఆఱి పోయినదీపమును, చమురు వెలిఁగింప దేమి? శ్రాద్ధకర్మ బ్రాహ్మణులజీవనోపాయము గాని వే ఱేమియుఁ గాదు. భండ ధూర్త నిశాచరులు వేదకర్తలు.* ఇత్యాది నిందావాక్యములతోడిశ్లోకము లనేకములు గలవు. మాధవు లుదాహరించినశ్లోక ముల భావము గలయితరశ్లోకములు కొన్ని విష్ణుపురాణమందుగూడఁ గనవచ్చు చున్నవి. అవి ప్రక్షిప్తములే యనఁదగినను, చిరకాలముక్రిందటనే యాస్తికులు చార్వాకులయుపన్యాసములను గ్రంథముగాఁ గూర్చిరని వానినిబట్టి తెలియ గలదు[1].

ఆర్హతము :—ఈదర్శనమునకు సంబంధించిన గ్రంథము లనేకములు కలవు. ఈమతమునకుఁ బ్రధానప్రవచనకర్త క్రీ. పూ. ఆఱవశతాబ్దికడపటివాఁ డగు వర్ధమానమహావీరుఁ డని పాశ్చాత్యవిమర్శకులు దారి తీసిరి కాని, అది సరికాదు. పాణినిసూత్రములు[2] అర్హన్—జిన—శబ్దములను సాధించినవి. ఈరెండును, ఆర్హత జైనమతస్థాపకపరము లని తెలియవచ్చును. ఇందు మొదటిదాని కర్థాంతరము చెప్పవచ్చును గాని, రెండవది[3] జినమునిని దప్ప మఱెవరిని గాని దేనిని గాని చెప్పినట్లుగా సంస్కృతవాఙ్మయమున గోచరింపదు. కావునఁ జైనసంజ్ఞలు గలయొక మహాపురుషుఁడు పాణినికిఁ బూర్వమే ప్రసిద్ధుఁ డగుట నిర్వివాదము. అతని మతమే, ఆర్హతము లేక జైనము. పాణిని క్రీ. పూ. సప్తమశతాబ్ది కావలివాఁడు గాని పరుఁడు గాఁడు. ఇది యిట్లుండ—పాణిన్యుదాహృతుఁడును వ్యాకరణకర్తయు నైనశాకటాయనుఁడు జైనుఁ డైనట్లు కొన్ని హేతువు లగపడుచున్నవి. ఇతని వ్యాకరణమున నధ్యాయాంతగద్యములందు "ఇతి శ్రుతకేవలిదేశీయాచార్యస్య శాకటాయనస్య కృతౌ శబ్దానుశాసనే" అనుమాట లున్నవి. ఈవ్యాకరణమునకుఁ జింతామణి యనుపేర వృత్తి రచియించినయక్షవర్మ—

"స్వస్తి శ్రీసకలజ్ఞానసామ్రాజ్యపద మాప్తవాన్
మహాశ్రమణసంఘాధిపతి ర్యశ్శాకటాయనః"

---

1. ఈచార్వాకమతమువా రిప్పటికి నందందు గలరు. నేను విద్యార్థిగా నున్నపు డనఁగా ముప్పదిరెండేండ్లక్రిందట నొకఁడు మాపాఠశాలకు వచ్చి చార్వాకుఁ డనని చెప్పి పైవిధముగానే మాతో వాదించెను.
2. అర్హః ప్రశంసాయామ్. అష్టా. 3. 3-133. "అర్హన్"—
   ఇణ్ సి ఞ్ జి దీ ఙు ష్య వి భ్యో నక్. ఉణాదిసూత్రము. తృతీయపాదములోనిది.
   'జినః'—
3. జినశబ్దమును బుద్ధపర్యాయములలో నమరసింహుఁడు చేర్చెను. పాణినినాఁటికి బుద్ధుఁడు లేఁడు గనుక నిందలిజినశబ్ద మర్హదీశ్వరపరమే యగును.

అని స్తుతించి యున్నాఁడు. దీనియింకొకవ్యాఖ్యలో 'మహాశ్రమణ సంఘాధిపతే శ్రుతకేవలిదేశీయాచార్యస్య' అని యున్నట్లు తెలియుచున్నది. దీనినిబట్టి శాకటాయనుఁడు జైనసంఘమున కాచార్యుఁడుగాఁ బ్రసిద్ధిగాంచినట్లు తెలియుచున్నది. కావునఁ బాణినికిఁ బూర్వుఁడై క్రీ. పూ. ఎనిమిదవశతాబ్ది కావలివాఁ డనఁదగునీజైనాచార్యునిబట్టి యెంతక్రిందికిఁ జూచినను, ఆర్హతమతోత్పత్తి క్రీ. పూ. పదిపదకొండుశతాబ్దులమధ్యకాలము దాఁటి యీవలికి రాదనుట విశ్వసనీయము. జైనచరిత్రనుబట్టి మతప్రవర్తకు లిరువదియిద్ద అయిన తరువాత, పార్శ్వనాథుఁడును, అతనిపిదప నిరువదినాల్గవప్రవచనకర్తగా వర్ధమాన మహావీరుఁడు నుదయించినట్లును, పార్శ్వనాథుఁడు కాశీపురమునందు క్రీ. పూ. ౮౧౭ లోఁ బుట్టినట్లును జైనగ్రంథములనుబట్టి యూహింపఁబడినది. మహావీరుఁడు మగధరాజ్యములోనివైశాలపట్టణపాలకు లయినయుత్తమక్షత్రియనాయకులలో నొకనికిఁద్రిశాల యనుసాధ్వియందు క్రీ. పూ. ౫౯౯ ప్రాంతమునఁ బుట్టియుండు నని కొంద ఱూహించిరి కాని, ఇతఁడు పార్శ్వనాథు నెఱుఁగు ననెడిమతమును బట్టి క్రీ. పూ. ౭౫౦ ప్రాంతముననే జనించెనేమో యని తోఁచుచున్నది.

జైనులకు నిర్గ్రంథు లని తొలుత వాఁడుక. వేదాదులు వీరికిఁ బ్రమాణగ్రంథములు కా వనియు, వట్టిమాటలే కాక వీరిమతమునకు గ్రంథము లే దనియుఁ గూడ దీని కర్థ మగును. ఈలోపము మహావీరునితరువాతఁ బూర్తిగాఁ దీఱినది. వీరిదర్శనమున కాద్యగ్రంథ మేదో చెప్పఁజాలము గాని, పరమాగమసార మను పేరఁ గూర్పఁబడినయర్హన్మునిప్రవచనములసంగ్రహమే దీనికిఁ బరమప్రమాణము. దీనితరువాత, ఉమాస్వాతివాచకాచార్యులు రచియించినతత్త్వార్థాధిగమసూత్రములు, స్యాద్వాదమంజరియు; హేమచంద్రసూరికృత మైనయాప్తనిశ్చయాలంకారము వీతరాగస్తుతియు; మొదలైనవి గణనీయములు. మఱియు, ప్రమాచంద్రుఁడు పద్మనంది జినదత్తసూరి అనంతవీర్యుఁడు మొదలగువారు రచియించిన ప్రమేయకమలమార్తాండము స్వరూపసంబోధనము మొదలగుగ్రంథములు గూడ జైనసారస్వతమునఁ బ్రసిద్ధములు. కాని, ఈగ్రంథము లన్నియు మహావీరుఁడు నిర్వాణము చెందినతరువాత నపు డపుడు పుట్టుచు వచ్చినవి. బౌద్ధమతమును ఖండించినయాప్తనిశ్చయాలంకారాదులు తదర్వాచీనము లగుట స్పష్టము.

ఈమతము తొలుత నుత్తరహిందూదేశమందును పిదప దక్షిణహిందూదేశమందును వ్యాపించినది. క్రీ. తొమ్మిదవశతాబ్దిలో నిది మైసూరు మధుర రాజ్యములందు విస్తరిల్లినది. అకలంకుఁ డనుజైనాచార్యుఁడు కాంచీపట్టణమున బౌద్ధుల నోడించె నఁట. ద్రవిడకర్ణాటభాషలలోఁ గూడ జైనమతగ్రంథములు కలవు. క్రీ. పన్నెండవశతాబ్దివఱకుఁ గూడ నిది యితరమతములతోఁ బోరాడుచు

వచ్చెను గాని తరువాత నిది సన్నగిల్లినది. ఐనను బౌద్ధమతమువలె నిది దేశము పరిత్యజించి పోలేదు. ఇప్పటికిని హిందూదేశమున సుమారు పదమూఁడులక్షల జైనులున్నారఁట.

అహింస సత్యము బ్రహ్మచర్యము మొదలగుసుగుణములవల్ల నలవడిన సమ్యక్చరిత్రమును, అర్హదీశ్వరుఁ డుపదేశించిన జీవతత్త్వము తెలియుట యను సమ్యగ్దర్శనమును, ఆతత్త్వమందలిసత్యము చక్కఁగా నెఱుఁగుట యనుసమ్యగ్జ్ఞానమును, అనుమూఁడును గలసి జీవునకు ముక్తి కలిగించును. ఇందేది లేకున్నను ముక్తి లేదు. సృష్టికొకకర్త లేఁడు. అది యనాది. జీవుఁడు అజీవుఁడు పుణ్యము పాపము బంధము నిర్జరము ముక్తి, అనునవి తత్త్వములు. వీని నెఱింగిన ముక్తి సిద్ధము. ఇందు ప్రతితత్త్వమును—స్యాదస్తి—స్యాన్నాస్తి—స్యాదస్తిచనాస్తిచ—స్యాదవక్తవ్యః—స్యాదస్తివక్తవ్యః—స్యాన్నాస్తివక్తవ్యః—స్యాదస్తిచనాస్తిచావక్తవ్యః—అని సప్తభంగినయమున విచారింపఁ దగును. నున్నగాఁ దలగొఱిగించుకొనుటయు దుమ్ము తుడుచుకొనుటకై పిచ్ఛిక చేతిలో నుంచుకొనుటయు భిక్షాశనమును జైనసన్యాసులసామాన్యలక్షణము. వీరిలో శ్వేతాంబరులు, క్షమాశీలురు నిస్సంగులు. కరతలమే పాత్రముగా నుపయోగించువారు దిగంబరులు. కేవలి యైనవాఁడు భోజనము చేయఁడు. స్త్రీకి ముక్తి లేదు. మరల మగవాఁడై పుట్టినపిదప ముక్తి చెందును. ఇది జైనమతసారము.

బౌద్ధము :—ఈదర్శనమునకు మూలాధారము గౌతమబుద్ధునిప్రవచనములు. భరతఖండమునందే కాదు, ఇతరఖండములందును బుద్ధునిచరిత్రము విఖ్యాత మైనది. పూర్వమతకర్తలలో నుత్తమఖ్యాతి గడించినయితనిమహత్త్వమును జగద్గురుశంకరాచార్యులవంటివారు గూడ 'భగవాన్ బుద్ధః' అనుచుఁ బ్రశంసించి యున్నారు. సకలభాషలలోను విలసిల్లునితనిచరిత్ర మిందు సవిస్తరముగాఁ దెలుపుట యనావశ్యకము. కపిలవస్తునగర మితనిజన్మభూమి. అది కోసలదేశమునఁ గాశీనగరమున కుత్తరముగా హిమాలయప్రాంతమున రోహిణీనదీతీరమున నున్నది. అందు శాక్యరాజగుశుద్ధోదనునికి మాయాదేవియం దితఁడు క్రీ. పూ. ౫౬౬ ప్రాంతమున జన్మించె నని పాశ్చాత్యపరిశోధకులు తీసినదారియే వ్యాప్త మైనది కాని, బౌద్ధగ్రంథములనుబట్టియు గయాశాసనమునుబట్టియుఁ దెలియుచున్న యితని నిర్వాణకాలము క్రీ. పూ. ౫౪౩ అగుటచే నెనుబదిసంవత్సరములు జీవించినయితని జన్మకాలము ౬౨౩ అనుట సముచిత మగు నని కొందఱియభిప్రాయము [1]. సంసారవిరక్తుఁడును భూతదయాళువు నైనయీమహాత్ముఁడు ముప్పదియేండ్లు నిండకమున్నే యువతీమణి యగుయశోధర యనుభార్యను ముద్దులొలుకురాహులుఁ డనుపసిపిల్ల

1. వేలూరి సత్యనారాయణగారి బౌద్ధమహాయానము. పీఠిక.

వానిని రాజ్యమును జననీజనకులను బరిత్యజించి తత్త్వాన్వేషణతత్పరుఁడై యిల్లు వెడలిపోయెను. పూర్వమతముల ననుసరించి ముక్తిమార్గము తెలిసికొనఁ గొంత కాలము యత్నించెను గాని, అవి యతనికి సత్యము గనుఁగొను సాధనములు కాక పోయెను. తుద కతఁడు గయలో నొకరావిచెట్టుక్రింద నిశ్చలచిత్తుఁడై కూర్చుండి తదేకనిష్ఠతోఁ బరతత్త్వగవేషణము గావింపఁగాఁ గొంతకాలమున కది లభ్య మైనది. ఆతత్త్వబోధచే నతఁడు బుద్ధుఁ డయ్యెను. ఆగయ బుద్ధగయ యైనది. ఆరావి బోధివృక్ష మైనది. ఇతనిప్రవచనము లన్నియు, పిటకము లనుపేరఁ బ్రాకృతభాషలోఁ గూర్పఁబడినవి. పిటక మనఁగాఁ బేటిక. సూత్రపేటిక వినయ పేటిక అభిధర్మపేటిక యనుమూఁడే బౌద్ధులమతమునకును బౌద్ధదర్శనమునకును బరమాధారము. ఈమత ముత్తరహిందూదేశమం దాకాలమున మిక్కిలి చుఱు కుగా వ్యాపించినది. బుద్ధుఁడు నిర్వాణము చెందినపుడు రాజగృహమునొద్ద ౫౦౦ మంది బౌద్ధాచార్యులు కూడి పైపిటకములు సంగ్రహించి రనియు, తరువాత నూఱేండ్లకు వైశాలినగరమున ౭౦౦ మంది పరిషత్తుగాఁ జేరి మతములోనిశాఖా భేదములు విమర్శించి రనియుఁ జరిత్రములు చెప్పుచున్నవి. ఇట్లు లోకప్రసిద్ధుఁ డైనయితనిచరిత్రము నశ్వఘోషుఁడు సంస్కృతమునఁ జక్కఁగా వర్ణించి యున్నాఁడు. క్రీ. శ. నాల్గవశతాబ్ది మొదలుగా నేడవశతాబ్దిలోపల నితనిమతము భరతఖండమంతటనే కాక, చీనా జపాను మంగోలియా సైబేరియా సయాం జావా సుమిత్రా మొద లగునితరదేశములందును జక్కఁగా వ్యాపించినది. నేఁటికిని బైదేశములవారు నామమాత్రమున బౌద్ధులైనను, అహింసాభూతదయాదిప్రధాన మతలక్షణములు వారిలోఁ గనరావు. ఎట్లయిననేమి? కుమారిల శంకరాచార్యుల యుపదేశములు భరతఖండమున వ్యాపించినపిదప బౌద్ధమతమున కిందు తావు లేకపోయిన దనుమాట మాత్రము సత్యము.

మిక్కిలి యభివృద్ధి చెందినబౌద్ధవాఙ్మయములోఁ గేవలము మతమును బోధించుగ్రంథములు ననేకములు కలవు. తొలుతఁ బ్రాకృతమందును దరువాత సంస్కృతమునందుఁ గూడ నవి యుదయించినవి. ధర్మకీర్తి జ్ఞానశ్రీ బుద్ధఘోషుఁడు మొదలగువారు బౌద్ధసంప్రదాయము విస్తరింపఁ బాటుపడినవారు. న్యాయ బిందువు బోధిచిత్తవివరణము బౌద్ధనయము వివేకవిలాసము మొద లగుపెక్కు గ్రంథము లీమతమునకుఁ బ్రమాణములు. బుద్ధఘోషుఁ డనునాచార్యుఁడు బౌద్ధ ధర్మసూత్రములకు భాష్యము రచియించెను.

సర్వము దుఃఖము, సర్వము క్షణికము, సర్వము స్వలక్షణము, సర్వము శూన్యము, అనునవి భావన లనఁబడును. బుద్ధుఁడు, దుఃఖ సముదాయ నిరోధ మార్గము లనునాలుగుతత్త్వము లుపదేశించెను. సంసార మంతయు దుఃఖమయ

మగుటయే దుఃఖము. దానికిఁ గారణము సముదాయ మనఁబడును. ఆ రెంటిని నిరాకరించుట నిరోధము. తరువాత నయ్యేడివిమలజ్ఞానమే ముక్తి. అదే నిరోధోపాయ మైనమార్గము. ఈమతమునఁ బ్రత్యక్షానుమానములు రెండే ప్రధాన ప్రమాణములు. ఇది వేదమును విశ్వసింపదు. ఈశ్వరాస్తిత్వము నిరూపింపదు. ఆకాశమును దత్త్వాంతరముఁగా నొప్పుకొనదు. పుణ్యపాపములను బూర్వోత్తరజన్మల నంగీకరించును. అహింసా భూతదయా సత్యములు దీని కవలంబనములు. సంస్కారము లన్నియు క్షణికము లనెడివాసన స్థిరపడుటయే మార్గ మదే మోక్షమని దీనిపరమసిద్ధాంతము. ఈమతమునందు, మాధ్యమిక యోగాచార్య సౌత్రాంతిక వైభాషికము లనునాలుగుభేదములు కలవు. ఈమతములవారిలో నీమద్భేదము లున్నను, రాగద్వేషాదిసంస్కారవినాశమున సంభవించువిమలజ్ఞానమే ముక్తిమార్గ మనువిషయమున నందఱు నేకీభవింతురు. దీనిసారము దెల్పు నొకపద్యము:-

"పరహితవర్తనంబు మృదుపావనభాషణమున్ విరాగసం
చరణ మహింస సర్వసమసమ్మతి భూతదయోపకారముల్
నరున కవశ్యకార్యము లనందగు వీనినిబట్టి ముక్తికిన్
దెరు వగుతత్త్వబోధము జనించు నటంచును గౌతముం డనెన్.

ఇట్లు బౌద్ధభేదములతో నాస్తికమతము లాఱైనవి. ఆస్తికమతములలోని భేదము లందుమా? మిక్కిలి యెక్కువ. అవి జీవేశ్వరులనుగూర్చి వచ్చినవి. నైయాయికులు వైశేషికులు మాధ్వులు మాహేశ్వరులు ననునలుగురును, జగత్తున కీశ్వరుఁడు నిమిత్తకారణమే కాని, ఉపాదానకారణము కాఁ డందురు. అతఁడు కర్మఫల మిచ్చువాఁ డనివారిమతము. కాని, మాహేశ్వరులలో నకులీశపాశుపతులును ప్రత్యభిజ్ఞావాదులును, ఈశ్వరుఁడు జీవులు చేసికొన్నకర్మనుబట్టి ఫల మిచ్చునన్నవిషయ మంగీకరింపరు. వారు, జీవులు చేసికొన్నకర్మమే స్వతంత్రముగా నుత్పత్త్యాదివిషయముల నిమిత్తకారణ మగు నందురు. యోగమతమందును, ఈశ్వరుఁడు జీవునికంటె భిన్నుఁడే కాని, అతఁడు నిర్లిప్తుఁడు నిర్గుణుఁడు నిర్విశేషుఁ డనియు జగత్తునకు నిమిత్తకారణము నుపాదానకారణముఁ గూడఁ గాఁ డనియు నది చెప్పును. అద్వైతమతమందో, "జగత్తునకుఁ బారమార్థిక మైన సత్తయే లేదు. ఉన్న దనుకొనుచున్నది వ్యావహారికసత్త. జీవుఁ డీశ్వరునికి వేఱు కాఁడు. మాయాప్రతిబింబితచైతన్యమే జీవుఁడు. మాయాశ్రయుఁడు మాయావిశిష్టుఁడు కేవలుఁడు నైనపరమాత్మయే వ్యావహారికజగత్తున కుపాదాననిమిత్తోభయకారణ మగుచున్నాఁడు. పరమార్థదృష్టిలో, జగత్తు పరమాత్మయం దధ్యస్తము కాని సత్యము కాదు. అందుచేఁ బరిణామము కూడ లేదు. అంతయు వివర్తమే." ఇందు చేతనే, అద్వైతము వివర్తవాదాశ్రయ మైనది. ఇట్లు వాదభేదమున శాఖోపశాఖ లైనయాస్తికదర్శనములలో—

పూర్వమీమాంస—కర్మమీమాంస లేక ధర్మమీమాంస యనునామాంతరములు గలదీనికర్త జైమిని. దీని కుపవర్షుఁడు తొలుత వృత్తి రచియించెను. ఇతఁడు జైమినిగురు వగువర్షోపాధ్యాయునితమ్ముఁ డని వైదికప్రతీతి. ఇది సంప్రదాయసిద్ధ మగుట విశ్వాస్యము కావున, జైమిని వేదవ్యాసునిశిష్యుఁ డనెడిపౌరాణికప్రతీతి కల్పితము కాక పోదు. ఉపవర్షునివృత్తి యాధారముగా శబరస్వామి ధర్మసూత్రములకు గొప్ప భాష్యము నిర్మించెను. ఇతఁడు క్రీస్తుశకమున కించుక పూర్వుఁ డని కొందఱును, క్రీ. పూ. ౫౭ లోని విక్రమాదిత్యునిగురు వని కొందఱును, భావించిరి [1]. బౌధాయనకల్పవివరణకర్త యగుభావస్వామి కూడ జైమిని సూత్రములకు భాష్యము రచియించె నని తెలియును గాని [2] యది కనరాకున్నది. పైసూత్రములను శాబరభాష్యమును గైకొని భట్టకుమారిలస్వామి రచియించిన తంత్రవార్తిక మీ శాస్త్రమున కలంకారముగా నున్నది. క్రీ. శ. ఆఱవశతాబ్ది రెండవభాగములోనిబౌద్ధమతగ్రంథకర్త యగుధర్మకీర్తి నెఱిఁగినవాఁడును ౭౩౦ ప్రాంతమున నున్నమహాకవిభవభూతికి గురువుగఁ జెప్పఁబడువాఁడు నగుకుమారిలుఁడు ౬౫౦—౭౩౦ నడుమ దీనిని రచియించె నని చెప్పవచ్చును. ఇది సూత్రములకును శాబరభాష్యమునకును గూడ భాష్య మయ్యు స్వతంత్ర మైనమహాగ్రంథముగఁ గనవచ్చును. ఇది శ్లోకవార్తికము తంత్రవార్తికము టుప్టీక యనఁ ద్రివిధముగా నున్నది. మీమాంసాసూత్ర ప్రథమాధ్యాయములోని తర్కపాద మనెడిమొదటిపాదమునకు శ్లోకరూపముగా నున్నవ్యాఖ్య శ్లోకవార్తిక మనియు, అందలిరెండవపాదము మొదలుగా మూఁడవయధ్యాయముచివరవఱకు గద్యరూపముగా నున్నది తంత్రవార్తికమనియు, అక్కడినుండి పండ్రెండవయధ్యాయము కడపటివఱకును మిక్కిలి సంగ్రహముగా నున్నగద్యవ్యాఖ్య టుప్టీక యనియుఁ జెప్పఁబడును. కృష్ణదేవునితంత్రచూడామణి, కుమారిలుఁడు శాబరభాష్యమునకు బృహట్టీక మధ్యమటీక యనునామముల మఱిరెండు టీకలు రచియించె ననియు, లభ్య మైనతంత్రవార్తిక మాబృహట్టీక సంగ్రహ మనియుఁ జెప్పెను [3]. కాని, ఆటీక లిపుడు కనరావు. లోకవ్యాప్త మైనతంత్రవార్తికమునకు భట్టసోమేశ్వరునిన్యాయసుధ, భట్టభవదేవుని తౌతాతితమతతిలకము, గంగాధరమిశ్రునిన్యాయపారాయణము, అన్నంభట్టుసుబోధిని, గోపాలభట్టుమితాక్షర, పరితోషమిశ్రునియజిత, పార్థసారథిమిశ్రునితంత్రరత్నము, అనువ్యాఖ్యలు కలవు.

---

1. విద్యాపతి ఠాకూరుపండితుఁడు పురుషపరీక్షయను గ్రంథమునఁ జెప్పినట్లు, ఆంగ్లప్రభాకర మీమాంస. 127 పుట.
2. సం. వా. చ. ప్ర. పుటలు, 297, 335.
3. మహా. గంగానాధఝాగారి యాంగ్లకృత తంత్రవార్తిక పీఠిక.

దీని ననుసరించిన వింకను గొన్ని కలవని తెలియుచున్నది. ఇవి యన్నియుఁ గుమారిలభట్టుమతము ననుసరించిన వగుట మీమాంసాశాస్త్రమున భాట్టమను పేర నొక మత మేర్పడినది. దీని కించుక వేఱుగాఁ బ్రాభాకరమత మేర్పడినది. ఈరెంటిలో నేది ముం దనువిషయమున మతభేదములు కలవు.

ప్రభాకరుఁడు కుమారిలశిష్యుఁ డని పండితలోకప్రసిద్ధి కలదు. ఇందుకు శంకరాచార్యకృతముగాఁ జెప్పఁబడుసర్వసిద్ధాన్తసంగ్రహమందును మాధవాచార్యకృతశంకరవిజయమందును, ప్రభాకరమిశ్రుఁడు కుమారిలభట్టుశిష్యుఁడుగా వర్ణింపఁబడుటయే కారణము[1]. ఇందు మొదటిది జగద్గురుశంకరాచార్యకృతము గాక మఱియేశంకరునిదో యని పెద్ద లూహించుచున్నారు. ఇఁక, శంకరవిజయము జగద్గురుమహత్త్వమును దెల్పఁ గడంగినది కాని చరిత్రము దెలుపఁ బూనినది కాక పోవుటచే నందలికొన్నిచారిత్రకవిషయములు విశ్వసనీయములు గాఁజాలవు. అందు పేర్కొనఁబడినగ్రంథకర్తలును బండితులును వాఙ్మయప్రసిద్ధులే కాని, వారందఱును శంకరాచార్యులకు సమకాలికులు కారు. అందుచే నుత్తమకావ్యముగా గణింపఁదగినశంకరవిజయములోనిచరిత్రాంశములు సత్యము లని నమ్మి ప్రభాకరుఁడు కుమారిలశిష్యుఁ డనుట కవకాశములే దని కొందఱందురు. డాక్టరుకీతు, ప్రభాకరుఁడు క్రీ. శ. ౬౦౦—౬౫౦ నడుమ నున్నవాఁ డని వ్రాసెను గాని, అందుకుఁ దగినయాధారములు మాత్రము చూపలేదు. ఉపవర్షవృత్తిని శాబరభాష్యముననుసరించినప్రభాకరునిబృహతియు, కుమారిలునితన్త్రవార్త్తికమును గూడ 'వార్త్తికకార, వార్త్తిక' శబ్దములను బ్రయోగించుటచే, బృహతి తన్త్రవార్త్తికకారు నుద్దేశించి వార్త్తికకారశబ్దము ప్రయోగించి యుండు ననుటకును వీలు లేదు. ఈరెండు గ్రంథములును గూడ నొకదానిలోనివిషయము నెంతమాత్రము మఱియొకటి యెందును స్పృశించినట్లును గనరాదు. కాని, ప్రభాకరునిబృహతి, వృత్తిశాబరభాష్యములకు విరుద్ధముగాక సరిగా వాని ననుసరించె ననియు; కుమారిలుని వార్త్తికము పెక్కుచోట్ల వానికి వేఱై స్వాభిప్రాయ మావిష్కరించె ననియు[2] కొందఱందురు. మహామహోపాధ్యాయగంగానాథఝాగారి యభిప్రాయము నిదియే[3]. అయిన నీవిషయ మింతటితో సమాప్తము కాలేదు. విద్వల్లోకవ్యాప్తమై యర్వాచీనగ్రంథములకుఁ గూడ నెక్కినమఱియొక కథ కలదు. అది కుమారిలునికి 'తుతాత' బిరుదమును, ప్రభాకరునికి 'గురు' బిరుదమును బ్రతిపా

---

1. శం. వి. 7-77.
2. చూ. తన్త్రవార్త్తికము. 1. 2-1 అధికరణము, 1. 3-1, 4, 5, 7, 10,—1. 4-1. మొద—
3. చూ. ఆంగ్లీకృతతన్త్రవార్త్తికపీఠిక.

దించుచున్నది. ఇట్లది ద్వివిధ మగుటచేతనే కల్పిత మని తెలియుచున్నది గాని ప్రభాకరునికుమారిలశిష్యత్వమునుమాత్రము విడువకున్నది. ఆకథ యిది :—

"కుమారిలభట్టు గురువునొద్దఁ జదువుచుండఁగా మీమాంసలో నొక చోట "అత్రాపి నోక్తం తత్ర తు నోక్త మితి ద్విరుక్తమ్" అనుమాట వచ్చినది. ఇక్కడను జెప్పఁబడలేదు, అక్కడను జెప్పఁబడలే దనుచు, రెండుసార్లు చెప్పఁబడిన దనుట యెట్లు సంగత మగు నని గురు వాలోచించి, అర్థము కుదురక పాఠము విడిచి యాలోచించుచు నూరివెలుపలికిఁ బోయెను. తరువాత, కుమారిలభట్టు విచారణచేసి, "అత్ర=ఇక్కడ, అపినా=అపిశబ్దముచేఁ జెప్పఁబడినది, తత్ర=అక్కడ, తునా=తుశబ్దముచేఁ జెప్పఁబడినది. కావున రెండుసార్లు చెప్పఁబడినది" అనునర్థము సాధించి తాటాకుమీఁద వ్రాసి గురువుగారిభార్య కిచ్చి వెళ్లెను. పిదప గురు వింటికి వచ్చి నంత నామె కుమారిలుఁ డిచ్చినపత్ర మిచ్చెను. అది గురువు చూచి యతని తెలివికి మెచ్చుకొని, తుశబ్దార్థము చక్కఁగా సాధించి నందుకు 'తుతాత' బిరుద మిచ్చెను"—తుశబ్దార్థము సాధించుటచే దానికిఁ దండ్రి యని దానియర్థము—ఇది యొకపాఠము.

"ప్రభాకరుఁడు కుమారిలభట్టునొద్ద మీమాంస చదువుచుండఁగా 'అత్రాపినోక్తమిత్యాదివాక్యము రాగా, కుమారిలుఁడు దానియర్థము కుదురక యాలోచించుచుండెను. అపుడు ప్రభాకరుఁడు—అపినా—తునా—అనిపదవిభాగముచేసి యర్థము కుదిర్చెను. అంత నతఁ డానందించి ప్రభాకరునికి 'గురు' బిరుద మిచ్చెను" అని మఱియొకపాఠము.

పైకథాపాఠములనుబట్టి కుమారిలభట్టుమతము భాట్ట మనునట్లే తౌతాతికము లేక తౌతాతితముకూడ నయినట్లును, ప్రభాకరుఁడు గురుశబ్దవాచ్యుఁ డైనట్లును నవీనము లైనగ్రాంథికప్రమాణములు కనఁబడుచున్నవి [1]. బాలవలభీభుజంగుఁ డనుమాఱుపేరు గలభట్టభవదేవుఁడు కుమారిలవార్తికమునకు వ్యాఖ్యగా,

---

1. అస్యాం సూత్రం జైమినీయం శాబరం భాష్య మస్య తు
మీమాంసావార్త్తికం భాట్టం భట్టాచార్యకృతం హి తత్,
తచ్ఛిష్యో ఽప్యల్పభేదేన శాబరస్య మతాన్తరమ్,
ప్రభాకరగురు శ్చక్రే తద్ధి ప్రాభాకర మ్మతమ్.
ఇట్లు, కేశవపండితుని సర్వసిద్ధాన్తరహస్యము, గోవిందునివ్యాఖ్య,
"నైవాశ్రావి గురో ర్మతం న విదితం తౌతాతితం దర్శనమ్"
ఇత్యాది- ప్రబోధచంద్రోదయనాటకము. అంకము 2. శ్లో. 2.
దీనివ్యాఖ్య గురువు ప్రభాకరుఁ డనియు, తుతాత కుమారిలుఁ డనియు విశదీకరించినది.
ప్రభాకరగురో ర్దృష్ట్యా మీమాంసారంభసిద్ధయే" ప్రకరణపంచిక.

తౌతాతితమతతిలకము రచియించె నని చదివియున్నాము. ఇందలియీప్రయోగము కుమారిలమతపర మనుట స్పష్టము. కాని, మాధవాచార్యు లీశబ్దము బౌద్ధపరముగాఁ బ్రయోగించిరి[1]. బౌద్ధులలోఁ గూడ, 'తుతాత' యున్నాఁడేమో తెలియదు. ఏది యెట్లయినను, వీరి కీబిరుదు లిచ్చినపై కథలు సత్యము కాక పోయినను, పూర్వోక్తగ్రంథప్రమాణములనుబట్టి వీరి కీబిరుదు లెట్లో వచ్చిన వని మాత్రము నమ్మవలసియున్నది. ఇంక, ప్రభాకరుఁడు కుమారిలునిశిష్యుఁ డనెడిపండిత జనశ్రుతియందు మా॥—మహామహోపాధ్యాయ యస్. కుప్పుస్వామిశాస్త్రిగారీ వదంతినే సమర్థించుచుఁ జక్కనివ్యాసము వ్రాసియున్నారు[2]. సర్వసిద్ధాన్తరహస్యకారాదులుకొందఱు, కుమారిలభట్టశిష్యుఁడైనప్రభాకరుఁడు శాబరభాష్యమునకు స్వల్పభేదముతో మతాంతరము కల్పించి ప్రాభాకరమతము లేవనెత్తె నని యిట్లునిరూపించియున్నారు.

"తస్యతు భాష్యవార్తికకర్తుః భట్టాచార్యస్య శిష్యః ప్రభాకరగురుః భాట్టమతాత్, ఉపాదానగ్రాహకగ్రహణాదిరూపప్రమాణాన్తరనియోగశబ్దబలవాదార్థబలవాదాదిరూపమద్భేదస్వీకారేణ శాబరస్య భాష్యస్య మతాన్తరం ప్రాభాకరన్నామ గ్రన్థభేదం కృతవాన్"

కుమారిలుఁడే శాబరభాష్యమునకుఁ గొన్నిచోట్ల వేఱై స్వమతము నిరూపించుచు నర్థభేదకల్పనము గావించెనుగాని ప్రభాకరుఁ డట్లు గావింప లేదని గంగానాథఝూ పండితు లనుచున్నారు[3]. ఇట్లువివాదగ్రస్తమైనకుమారిలప్రభాకరగురుశిష్యత్వనిరూపణము గ్రంథవిస్తరభీతిని గలిగించుచున్నది గావునను, కీతుపండితుఁడు చెప్పినప్రభాకరకాలమునకును బ్రసిద్ధమైనకుమారిలకాలమునకును జెప్పఁదగినయంతరమే కనఁబడదు కావునను, ప్రభాకరుఁడు కుమారిలునిశిష్యుఁ డైనను గాకపోయినను, అప్పటికి వృద్ధుఁడై యున్నను లేకయౌవనదశకు వచ్చినవాఁడై యున్నను, భాట్టమత మెఱిఁగియే శాబరభాష్యమునకుఁ గొంచెము వేఱుగా మద్భేదస్వీకారముతోఁ దన పేరఁ బ్రాభాకరమత మావిష్కరించియుండు నని యిప్పటికి విశ్వసింతము. అది యట్టిది కావుననే భాట్టమత మనుసరించి తరువాతఁ బుట్టిన గ్రంథములలో దశాంశ మైనను బ్రాభాకరమత మనుసరించి పుట్టినవి కనరావు. దాని కున్నవ్యాప్తిలో శతాంశ మైనను దీనికిఁ గనరాదు.

1. చూ. స. ద. సం. ఆర్హతదర్శనము.

2. The Proceedings of the second oriental conference held at Calcutta. P. P. 407. 412.

3. see Prabhakara mimansa. P. P. 131. 133.

ఇట్లు మీమాంసాదర్శనమును జగత్ప్రసిద్ధము గావించినకుమారిలభట్టు శ్లోకవార్తికారంభమునందు శివుని ధ్యానించి, మీమాంసాశాస్త్ర తేజస్సులచే నుజ్జ్వలించు వేదార్థజ్ఞానరత్నమున నా కాశ విజృంభించుచున్న దని చెప్పుచు ని ట్లనెను.

"ప్రాయేణైవ హి మీమాంసా లోకే లోకాయతీ కృతా
తా మాస్తికపథే కర్తు మయం యత్నః కృతో మయా"

కొంచె మెచ్చుతక్కువగా మీమాంస లోకాయత (నాస్తిక)ముగా మాఱినది. దానిని, ఆస్తికమార్గమునకుఁ ద్రిప్పుటకై నే నీయత్నము చేయుచున్నాను. అన్నమాటలనుబట్టి కుమారిలునికాలమునం దాస్తిక మైనమీమాంసా మతము క్రిందికిని, నాస్తికమతములు పైకిని వచ్చినట్లు తెలియుచున్నది. ఇతని నాఁడు నలాందలో బౌద్ధమతవిద్యామఠము సుప్రసిద్ధమై వర్ధమానదశలో నున్నది. అందలిబౌద్ధాచార్యులు దేశమంతట సంచరించి హైందవమత మణఁగించుచు బౌద్ధమతము నెలకొల్పఁ బాటుపడుచున్నారు. పార్థసారథిమిశ్రుఁడు తెలిపినట్లుగా, భర్తృమిత్రుఁడు మొద లగువారు మీమాంసామతమును లోకాయతమతముఁ గావించుచున్నారు.

"ద్విజన్మనా జైమినినా పూర్వం వేదమయార్థతః
నిరీశ్వరేణ వాదేన కృతం శాస్త్రం మహత్తరమ్"

ఇత్యాదిగా సాంఖ్యేతరమతనిందతోడిశ్లోకములు పద్మపురాణమున కెక్కి మీమాంస నిరీశ్వరవాదదర్శన మని చాటుచున్నవి. కొందఱు బౌద్ధసన్యాసు లందందలిమండలేశ్వరుల నాశ్రయించి వారియానతిని బ్రజలను బౌద్ధమతావలంబులను గావించుచున్నారు. హిందూబౌద్ధమతములకు గొప్పపోరాటము సిద్ధమైనది. ఆసమయమున వైదికమతమును బునరుద్ధారణముగావింపఁ గంకణము కట్టుకొని కుమారిలభట్టు మీమాంసాభాష్యము ననుసరించి గ్రంథము రచియించి దానిని లోకమున వ్యాప్తికిఁ దెచ్చి ధర్మమీమాంసను నిలువఁ ద్రొక్కెను. ఇతని శ్లోకవార్తికములో నెక్కువగాఁ గనిపించుబౌద్ధమతనిరాసమే యితఁడు బౌద్ధమత మణఁగఁ ద్రొక్కఁ బూనినపట్టుదలను దెలియఁజేయును. ఇతఁడు మాఱువేషముతో నొకబౌద్ధాచార్యునివద్దఁ దన్మతరహస్యము లెఱిఁగి పిదప వానిని ఖండించినందువ గురుద్రోహి యైనయితనికన్ను పోయిన దనియు, ఇతఁడు గురుద్రోహదోషము శాంతించుటకై తుషాగ్నిలోఁ బ్రవేశించె ననియు, జైనవేషముతో నితఁడు జైనాచార్యుని శిష్యుఁడై తన్మతధర్మములు తెలిసికొని తరువాత జైనమతము ఖండించె ననియు, మేదినీపురరాజు జైనసుధన్వు నాశ్రయించి యతనిని వశపఱచుకొని యతనిచే బౌద్ధులను జైనులను జంపించె ననియు, శంకరాచార్యులు తనభాష్య

మునకు వార్త్తికము వ్రాయవలసిన దని తుషాగ్నిఁ జొచ్చినయితనిని గోరె ననియు, ఇంక నేవేవో యీమహాపురుషునిగూర్చి పెక్కు కథలు కలవు[1]. ఇవి యన్నియు విశ్వసనీయములు కాకున్నను, వీనినిబట్టి యితఁడు బౌద్ధజైనమతములను జక్కఁగాఁ దెలిసికొని యందలిదోషములు గ్రహించి యవి యవలంబనీయములు కావని నిశ్చయించి వానిని నిర్మూలింప యత్నించె ననుటమాత్రము సత్యమని నమ్మవచ్చును. ఇతనిపూనికవల్లనే యానాస్తికమతములు రెండును దమయున్నతస్థితి నుండి జారి క్షీణదశకువచ్చె ననుట వాస్తవము. ఇతఁ డారంభించినపరమతవిదళన కృత్యమును పిదప శంకరాచార్యులు తుదముట్టించిరి. అట్టివైదికమతవీరుఁడు మన కుమారిలభట్టు. వైదికమతపునస్థాపకుఁ డైనయితనిమీమాంసామతమే భాట్టమత మనుపేర మీమాంసాదర్శనమునకు జీవ మైనది. ఇతఁడు బౌద్ధజైనమతఖండనమునకు హిందూదేశమునలుఁగడల యాత్ర సలిపినకారణమున నుత్తరదేశీయుఁ డనియు, దాక్షిణాత్యుఁ డనియు, ఆంధ్రద్రవిడబ్రాహ్మణుఁ డనియు, కుమారస్వామి యవతార మనియు, జన్మచే బౌద్ధుఁడై తరువాత వైదికమతము స్వీకరించినవాఁ డనియు, వారు వారు తలంచిరి. ఈయూహల కాధారము లైనకథ లెంతవఱకు సత్యములో కాని, జినవిజయ మనెడిగ్రంథములో నితఁ డిట్లు వర్ణింపఁబడి యున్నాఁడు.

"ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగలే
గ్రామే ఽన్తికే మహానద్యా భట్టాచార్యః కుమారిలః
ఆంధ్రజాతి స్త్రిత్రికో మాతా చంద్రగుణా సతీ
యజ్ఞేశ్వరః పితా యస్య......
మహావాదీ మహాన్ ఘోరః శ్రుతీనాం చాభిమానవాన్
జినానా మంతక స్సోఽభూ ద్గురుద్వేష్టా ఽతిపాపవాన్" [2].

జినవిజయము నాకు లభింపలేదు కాని, ఈశ్లోకములలో నవిశ్వసనీయవిషయ మేమియుఁ గనరాదు. అసాధారణప్రజ్ఞాధురంధరుఁడును జైనమతకంటకుఁడు నైన యితని శీలమును జినవిజయము సరిగా వర్ణించిన దనియే చెప్పవచ్చును. ఇతఁడు జైనులను జంపించకపోయినను, జైనాచార్యునొద్దఁ దన్మతరహస్యము లెఱిఁగి జైనమతము నణఁగింపఁబూనుటచే గురుద్రోహి యనియు జైనాంతకుఁ డనియుఁ గసితీఱఁ బైగ్రంథ మితని నిందించుటయు సముచితమే యగుచున్నది. ఇంతకును బైశ్లోకములలోఁ బరమతమువాఁడు కావించిననిందయే కనఁబడుచున్నది గాని,

1. చూ. జినవిజయ, శంకరవిజయాదులు.

2. హిందూదేశ కథాసంగ్రహము. పుట. 177 లో నున్నది.

ఆంధ్రుఁ డెవఁడో కుమారిలగౌరవమునఁ జేసిన స్తవ మేమియుఁ గనఁబడదు. కావునఁ బరమతగ్రంథమండలిపై వర్ణననుబట్టి, ఇప్పటిగంజాముజిల్లాలో జయమంగలగ్రామమునందు కుమారిలభట్టు చంద్రగుణాయజ్ఞేశ్వరులగర్భమున జన్మించె ననియు, తైత్తిరీయశాఖాధ్యేత యగునితఁడు వేదప్రామాణ్యావాదమున గెలుపొందిన యాంధ్రబ్రాహ్మణుఁ డనియు విశ్వసింతము.

ఇతనిమత మనుసరించినవారిలో మండనమిశ్రునివిధిభావనావిభ్రమవివేకములును, వాచస్పతిమిశ్రునిన్యాయకణికయు, పార్థసారథిమిశ్రునిశాస్త్రదీపికాన్యాయరత్నమాలాదులును, రామానుజాచార్యునిన్యాయరత్నమాలావ్యాఖ్యయగు నయరత్నమాలయు, మాధవాచార్యునిజైమినీయన్యాయమాలావిస్తరమును, ఖండదేవునిభాట్టదీపికాభాట్టరహస్యాదులును, అప్పయదీక్షితుని మయూఖావల్యాదులును; కృష్ణయజ్వమీమాంసాపరిభాషయు, ఆపదేవునిమీమాంసాన్యాయప్రకాశమును మీమాంసకులపొగడ్త గాంచియున్నవి. పైవారిలో స్వతంత్రగ్రంథకర్త యగు పార్థసారథిమిశ్రుఁడు భాట్టమతమునకు మధ్యకాలమున మఱియు మెఱుఁగు తెచ్చిన మహావిద్వాంసుఁడు. ఇతఁడు క్రీ. శ. దశమశతాబ్దిలోనివాఁడు. పదునేడవశతాబ్దిలోనిఖండదేవుఁడు కడపట మీమాంసాశాస్త్రమునకు వన్నె దెచ్చినఘనుఁడు. ఇతనిమీమాంసాకౌస్తుభము మీమాంసప్రాచీనస్వరూపమును గరతలామలకము గావించును. ఇంకను దుదియుగమున శాస్త్రదీపికాదులకు వ్యాఖ్యానములు రచియించినశంకరమిశ్రాదు లనేకులు కలరు [1]. ఇంక, ప్రభాకరుఁడు జైమినిసూత్రభాష్యము ననుసరించివ్రాసినలఘ్వీబృహతీవ్యాఖ్య లాధారముగాను స్వతంత్రముగాను గూడ వెలసినప్రాభాకరమత మీమాంసాగ్రంథములలో శాలికనాథమిశ్రుని ఋజువిమలాప్రకరణపంచికలు ప్రధానము లని తెలియుచున్నది. ఇట్లపారముగాఁ బెరిఁగిపోయినయీశాస్త్రమండలిగ్రంథముల నైనఁ బేర్కొనుట కిందు తావు చాలదు. ఇఁకఁ బ్రాచీనగ్రంథకర్తలు కొందఱినిగూర్చి వెలసినపుక్కిటిపురాణగాథలు విశ్వాస్యములుగా వనుటకుఁ బండితలోకప్రసిద్ధ మైనయొకశ్లోకమును, ఒకకథయు :—

"బ్రాహ్మణ్యా మభవ ద్వరాహమిహిరో జ్యోతిర్విదా మగ్రణీః,
రాజా భర్తృహరి శ్చ విక్రమనృపః క్షత్రాత్మజాయా మభూత్,
వైశ్యాయాం హరిచంద్రవైద్యతిలకో జాతశ్చ శంకుః కృతీ,
శూద్రాయా మమరః, షడేవ శబరస్వామిద్విజ స్యాత్మజాః"

శబరస్వామి యనుబ్రాహ్మణునకు బ్రాహ్మణస్త్రీయందు వరాహమిహిరుఁడు, క్షత్రియకాంతయందు భర్తృహరివిక్రమాదిత్యులు వైశ్యవనితయందు హరిచంద్ర

1. చూ. ఇండియాఆఫీసు లైబ్రరీకేటలాగు నాల్గవసంపుటము,

శంకువులు, శూద్రభామినియందు, అమరసింహుఁడు ననునార్వురుపుత్రు లుదయించిరఁట. శబరస్వామి మొదటిపే రాదిత్యదేవుఁడు. అతఁడు జైనులతో వాదించి యోడిపోయి వారు హింసింతు రన్నభయముచే నడవులకుఁ బాఱిపోయి యాట విక లైన శబరులకు నాయకుఁడై శబరస్వామి యనుపేరు గాంచెనఁట. ఇఁక వీనిని విమర్శింపక సంకర్షకాండముమాట చూతము.

"జైమినిముని రచియించినపూర్వమీమాంసాసూత్రము ద్వాదశాధ్యాయి మాత్రమే కాదు. అది పదునాఱధ్యాయముల గ్రంథము. కడపటినాలుగును సంకీర్ణార్థనిరూపణపరము లగుటచే వానికి సంకర్షకాండ మనుపేరు వచ్చినది. ఆనాలుగధ్యాయములకుఁ గూడ శబరస్వామి భాష్యమురచియించినట్లుగా నందందలియుల్లేఖనములవల్లఁ దెలియుచున్నది. జగన్నాథపండితరాయలమీమాంసాగురు వగు ఖండదేవుఁడు సంకర్షకాండమునకు రచియించినభాట్టదీపికలోఁ గొన్నిలోపములు కనిపెట్టి గంభీరపండితపుత్రుఁ డగుభాస్కరభట్టు సంకర్షకాండాధ్యాయములు నాల్గింటికిని భాట్టచంద్రిక యనుపేర వ్యాఖ్య రచియించినట్లు గ్రంథాంతశ్లోకములవల్లఁ దెలియుచున్నది. కావున నీనాలుగధ్యాయములు కూడ జైమినివే" అని సంకర్షకాండప్రకాశకులు పీఠికలోవ్రాసిరి[1]. కాని, సూత్రములు ద్వాదశాధ్యాయిలోని సూత్రములవలె స్పష్టార్థములు గాక—అనుయజతీతి—యోఽగ్నిఞ్—అభితః—అను రీతిని వ్యాఖ్యానప్రతీకలవలె నుండుట చూచినను, వానిశైలి చూచినను, అందలి విషయము చూచినను, అవి యెంతమాత్రముజైమినికృతములు కా వని తెలియక పోదు. భట్టభాస్కరుఁడు ద్వాదశాధ్యాయికి సంగ్రహవ్యాఖ్య రచియించియు, మీమాంసాశాస్త్రమందలియాదరాతిశయముననను, భాట్టదీపికవంటిగ్రంథము రచియించునభిలాషను,కల్పసూత్రభాష్యశాబరభాష్యాదులలోనియందందలి యాగాది పరములైన కొన్నివిశేషవిషయములను సూత్రవ్యాజమున సంగ్రహించి సంకర్షకాండ మనుపేరు పెట్టి దానికి భాట్టచంద్రిక యనువ్యాఖ్యానము రచియించెనేమో యని తోఁచుచున్నది. లేదా? అట్టిసూత్రము లెవరో రచియించినవి లభింపఁగా నితఁడు వ్యాఖ్య వ్రాసి తనకు లభించినసంప్రదాయమునుబట్టి యవి జైమిని వని భ్రాంతి పడియుండవచ్చును. అంతేకాని, అవి జైమిని వనుటకు మాత్రము సరియైనయితరప్రమాణ మేమియు దొరకలేదు. దొరకునన్నయాశయు లేదు. ఇందుకు దీనియాద్యంతవాక్యములు పరిశీలింతము.

౧. "ప్రణమ్య జైమినిమునిం ఖండదేవకృతా విహ,
అనుగ్రహాయ మందానాం సంగ్రహో ఽయం విధీయతే"

---

1. కాశీముద్రణము. క్రీ. 1864 సం.

౨. "ఏవం ద్వాదశభి రధ్యాయైః ప్రకృతివికృతిభేదేన కతిపయాన్ న్యాయాన్ సంశోధ్య తై రేవ న్యాయై రిత స్తతో విప్రకీర్ణా న్వేదవాక్యార్థా నైదం పర్యేణ సమ్య క్నిష్కృష్య నిర్ణేతు మేషా చతురధ్యా య్యారభ్యతే"

3. "జైమినే ర్విమలసూక్తితటిన్యాం మగ్న మాప శుచితాం మమ చేతః
తేన ఖేలతు పినాకిపదాబ్జే యేన జన్మనివహో న పున స్స్యాత్,
ఖండదేవకృతభాట్టదీపికా లక్షణైః కతిపయై రసంభృతా
ఇత్యుదీక్ష్య బుధభాస్కరాగ్నిచి ద్భారతీ బరిభరామ్యభూవ తామ్,
అద్యావధి కృతి రేషా ఽఽదిన్య స్తవిహీ నేతి దీపి కాఖ్యాసీత్
షోడశకలాభి రధునా పరిపూర్ణా భాట్టచంద్రికాత్వ మగాత్,
ఆసీత్ షోడశలక్షణీ శ్రుతిపదా యా ధర్మమీమాంసికా
సంకర్షాఖ్యచతుర్థభాగవిధురా కాలేన సా ఽజాయత
గాయత్రీ త్రిపదా త్రి కేవ విబుధై రద్యాపి పాపఠ్యతే
తాం పూర్ణా మతనో ద్క్రమేణ మహతా గంభీరజో భాస్కరః"

ఇందు, మొదటిశ్లోకములో ఖండదేవునిసంకర్షకాండవ్యాఖ్య యగుభాట్ట దీపికకు సంగ్రహము రచియించుచున్నట్లు భాస్కరుఁడు సూచించియున్నాఁడు. రెండవ దగునవతారికలో, అక్కడక్కడ నున్న వేదవాక్యార్థములను దీనిపరముగా నిర్ణయింపఁ జతురధ్యాయి యారంభింపఁబడుచున్న దని చెప్పినాఁడు. ఈయారంభము జైమినిది గా నితఁ డవతారికచే సూచించె ననుట విదితము. ఇఁక మూఁడవదానిలో రెండవశ్లోకమున, ఖండదేవునిభాట్టదీపిక (ఇక్కడసంకర్షకాండవ్యాఖ్య) యసంపూర్ణ మగుటచేఁ దా నాలోపము పూరించినట్లు చెప్పినాఁడు. మూఁడవ శ్లోకములో నింతవఱకు నిది భాట్టదీపిక యనఁబడినది గాని, ఇపు డిది భాట్టచంద్రిక యైన దన్నాఁడు. నాల్గవశ్లోకములో 'ధర్మమీమాంస పదునాఱధ్యాయములదే, కాలవశమున నందలికడపటినాలుగధ్యాయములును దానినుండి విడిపోయినవి. నేఁటివఱకును (తాను భాట్టచంద్రిక రచియించువఱకును) మూఁడుపాదములగాయత్రీమంత్రమువలెనే సంకర్షకాండము లేని పన్నెండధ్యాయములమీమాంసాసూత్రములనే పండితులు చదువుచున్నారు. ఇప్పుడు భాస్కరభట్టు దానిని సంకర్షకాండముతోఁ గలిపి సంపూర్ణము గావించెను' అని తా నతికష్టము మీఁద సంకర్షకాండమును దనవ్యాఖ్యతో బయటఁ బెట్టినట్లు తెలిపినాఁడు. చూచితిరా? ఖండదేవుఁ డీయధ్యాయములకు వ్యాఖ్య రచియించెనఁట. కాని, తననాఁటిదాఁక నెవరును వీని నెఱుఁగ రఁట. దేశములోనిపండితు లందఱును మూఁడువంతులే చదువుచున్నా రఁట. తా నిపుడు నాల్గవవంతు లోకమున కిచ్చెనఁట. ఈయసంగతవాక్యములే జైమినిసంకర్షకాండ మనునాలుగధ్యాయములు

రచియింపలేదనియు, ఖండదేవుఁడు వీనికి వ్యాఖ్యయే వ్రాయలేదనియు, ఈయల్లిక యంతయు భట్టభాస్కరునితలనుండి పుట్టినదే యనియుఁ దెలుపుచుండ నింతకంటె నితనిమాటలు వేఱుగా విమర్శింపనేల? అయిన నీవిషయ మింకను బరిశోధకులు విమర్శింతురుగాక.

జైమినిమత మిట్లు చిరకాలముగా బ్రాహ్మణాశ్రయమై వచ్చినను, దీని సిద్ధాంతములు కొన్ని నచ్చకపోవుటచేతనే యితరమతములు తలచూపిన వనుట నిక్కము. "వేదము స్వతఃప్రకాశము. దానికిఁ గర్త లేఁడు. విధ్యర్థవాదమంత్రరూప మయినవేదశబ్దరాశి నిత్యము. దాని కెన్నఁడును నాశము లేదు. సృష్టి యంతయు శబ్దమూలకమే. వేదము ననుసరించియే ప్రజాపతి స్థావరజంగమాత్మకమైనసకలజగము సృజించుచుండును. ఉత్తరసృష్టి పూర్వసృష్టిని బోలియుండును. ధర్మాచరణమే యిష్టార్థసిద్ధికి మూలకారణము. వేదము విధించినదే ధర్మము. యజ్ఞాదిక్రతువులే యజమానునికి ఫలము నిచ్చునుగాని ఫలదాతయైనయీశ్వరుఁడు వేఱుగా లేఁడు. జ్యోతిష్టోమాదులు స్వర్గాదిలోకసుఖము నొసఁగును." ఇత్యాదులు దీనిసిద్ధాన్తములు. దీనితత్త్వము పరామర్శించినచో, 'వేదము ప్రమాణము కాదు, దేహాతిరిక్తమైనయాత్మ లేదు' అనిచెప్పెడిలోకాయతమత మణఁచుటకై, 'వేదమే ప్రమాణము. దేహాతిరిక్తమై జ్ఞానాశ్రయ మైనయాత్మ కలదు. అది కర్మజన్యమైనస్వర్గాదిసుఖ మనుభవించును' అనునిశ్చితాభిప్రాయమును వేదార్థవిచారమూలకముగా నావిష్కరించుటకే యిది యుదయించె నని విశదము కాఁగలదు. కర్మఫలదాత వేఱుగా లేఁడనియు, ఆత్మ జ్ఞానాశ్రయమే కాని జ్ఞానస్వరూపము కాదనియుఁ జెప్పుటచే నిదియును నిరీశ్వరమతమే యని తక్కినవారు కొందఱనిరి. సూత్రములం దెందును, ఆత్మ విజ్ఞానస్వరూప మనెడిభావము సూచితము కాదనుటయు నిజము. శంకరభగవత్పాదులు గూడ, జైమినిమతమందాత్మ జ్ఞానాశ్రయమనుభావమే వెల్లడించిరి. కాని, శబరస్వామి నాస్తికత్వనిరాసకై విజ్ఞానాత్మాస్తిత్వ మొకచో సూచించెను. ఈవిషయ మెఱిఁగియే భట్టపాదులు శ్లోకవార్తికమున నిట్లనిరి.

"ఇత్యాహ నాస్తిక్యనిరాకరిష్ణు రాత్మాస్తితాం భాష్యకృ దత్ర యుక్త్యా,
దృఢత్వ మేతద్విషయః ప్రబోధః ప్రయాతి వేదాన్తనిషేవణేన"

దీనినిబట్టి జైమినిమతమం దాత్మ విజ్ఞానస్వరూపము కాదనెడియభిప్రాయము స్పష్టమగును. కాని, సూచనగా' భాష్యకర్తయుఁ బైని జెప్పినవిధముగా వార్తికకారుఁడును, వీరి ననుసరించి తక్కినవారును, విజ్ఞానాత్మత్వ మంగీకరించినట్లు కనఁబడును. శ్లోకవార్తికము మొదల నున్న—

"విశుద్ధజ్ఞానదేహాయ త్రివేదీదివ్యచక్షుషే
శ్రేయః ప్రాప్తి నిమిత్తాయ నమ స్సోమార్ధధారిణే"

అనుశ్లోకము కుమారిలుఁ డీశ్వరుని స్తుతించుటను విస్పష్టముగాఁ దెలుపుచున్నది. కొందఱిది యీశ్వరస్తుతిపరము కాదని వాదింతురుకాని, వాసుదేవదీక్షితునికుతూహలవృత్తి కుమారిలుఁ డీశ్వరవాది యనుభావమునే వెల్లడించెను[1]. ఇది సత్యమైనను, ఇతనిశ్లోకవార్తిక మీశ్వరుఁడు జగత్కారణ మనుమాట యెందును జెప్పియుండ లేదు. అందుచేఁ బూర్వమీమాంస నిరీశ్వరమే యని చెప్పఁదగియున్నది. ఇఁకఁ గ్రమభంగ మైనను, ఉత్తరమీమాంసను జివర కుంచి తక్కినవాని నవలోకింతము.

న్యాయము :—గౌతమసూత్రము దీనికి బీజము. అయిదధ్యాయముల యీగ్రంథమున ౫౨౮ సూత్రము లున్నవి. వానికి వాత్స్యాయనుఁడు తొలుత గొప్పభాష్యము నిర్మించెను. అదే తరువాత వెలసినన్యాయతర్కగ్రంథములకు మూలము. ఈశాస్త్రము మహాసముద్రమువలె నపారముగా నున్నది. ఇందలి వ్యాఖ్యాతరంగములను లెక్కింపఁ దరము కాదు. అయినను గొన్నిటి నిందు స్మరింతము. న్యాయభాష్యము చూచియే విశ్వనాథభట్టు వృత్తిని, ఉద్ద్యోతకరుఁడు వార్తికమును సూత్రవ్యాఖ్యలుగా రచియించిరి. ఈమూఁడును గాక గౌతమభాష్యమనుపేర మఱియొకవ్యాఖ్య సజీవమై యున్నట్లు తెలియుచున్నదిగాని[2] అది వాత్స్యాయనభాష్యవ్యాఖ్యయే యని దానియవతారిక చెప్పుచున్నది. తరువాతఁ బైవార్తికమునకు వాచస్పతిమిశ్రుఁడు టీకయు, దాని కుదయనాచార్యుఁడు తాత్పర్యపరిశుద్ధి యనుపేర న్యాయనిబంధనమును, దానిలోనికొంతభాగమునకు వర్ధమానపండితుఁడు త్రిసూత్రీప్రకాశమును వ్యాఖ్యలుగా రచియించిరి. ఇట్లు పెరిఁగినన్యాయశాస్త్రము ప్రౌఢమై సుఖబోధ్యము గా కున్న దని కేశవమిశ్రుఁడు సూత్రభాష్యముల ననుసరించి తర్కభాష యనుపేరఁ బ్రత్యక్షాదిచతుఃప్రమాణములను విశదీకరించుచు నుత్తమకృతి నిర్మించెను. దానికి గోవర్ధనుఁడు గౌరీకాంతుఁడు మాధవదేవుఁడు చెన్నుభట్టు రామలింగపండితుఁడు మొద లగుతార్కికాచార్యులు వ్యాఖ్యలు రచియించిరి. భాష్యాదు లవలోకించియే వాచస్పతిమిశ్రుఁడు న్యాయతత్త్వాలోకమును భాసర్వజ్ఞుఁడు న్యాయసారమును స్వతంత్రముగా నిర్మించిరి. కడపటిదానికిఁ బిదప జయసింహసూరి యనుజైనుఁడును రాఘవభట్టును, టీకలు వ్రాసిరి. ఇవి యిట్లుండ గంగేశపండితుఁడు తర్కశాస్త్రమునకు శిరోమణిగాఁ

1. ప్రథమసంపుటము పుట 47.
2. చూ. ఇండియా ఆఫీసు లైబ్రరీ కేటలాగు Vol. IV

దత్త్వచింతామణి యనుమహాగ్రంథము రచియించెను. ప్రత్యక్షానుమానోపమాన శబ్దము లనెడినాలుగుప్రమాణములనుగూర్చి నాలుగుఖండములతో విలసిల్లుదీనికి వ్యాఖ్యలుగా జయదేవుఁడాలోకమును, అతనిశిష్యుఁడు టీకను, రాజచూడామణి దర్పణమును, రఘుదేవుఁడు దీపికను, రుచిదత్తుఁడు ప్రకాశమును, మధురాంతకుఁడు ఫక్కికను, జగదీశుఁడు మయూఖమును, రఘునాథతార్కికశిరోమణి దీధితిని రచియించిరి. దీధితికిఁ బ్రకాశిక యనుపేర గదాధరభట్టాచార్యుఁడు గొప్పవ్యాఖ్య వ్రాసెను. గౌడదేశీయుఁడైనయితఁడు తార్కికచక్రవర్తి యన ఖ్యాతి కెక్కెను. ఇతనిప్రకాశిక ననుసరించి భవానందుఁడు జయరాముఁడు దినకరుఁడు జగదీశుఁడు మొదలగుమహాతార్కికాచార్యు లనేకగ్రంథములు రచియించిరి. వానిలోఁ గొన్ని నేఁటికిని బఠనపాఠవ్యవహారమున నున్నవి. ఇంకఁ బైన్యాయతర్కగ్రంథముల ననుసరించి మహాపండితులు రచియించినమూలములు వ్యాఖ్య లనువ్యాఖ్యలుగా నున్నకారికావళి ముక్తావళి దినకరభట్టీయము ప్రభ మంజూష; మొదలైన యుద్గ్రంథములెన్నెని మొన్నమొన్నటివఱకు నుదయించుచునే వచ్చినవి. వానిలోఁ బందొమ్మిదవ శతాబ్దికడపటివారును విజయనగరసంస్థానపండితులు నాంధ్రులు నగు సంగమేశ్వరశాస్త్రిగారు రచియించినసంగమేశ్వరక్రోడ మనుగ్రంథము జగదీశపండితుని సిద్ధాంతలక్షణిమీఁదిక్రోడపత్రమై తార్కికులమెప్పు గాంచియున్నది[1]. ఇట్లు తర్కశాస్త్రము సహస్రముఖముల వ్యాపించినను, దీనిపేరెత్తినంతనే స్మృతికివచ్చునది తర్కసంగ్రహము. దీనికర్త అన్నంభట్టు. న్యాయవైశేషికములు రెంటి ననుసరించినయీచిన్నగ్రంథము జన్మించిన దాదిగాఁ దర్కశాస్త్రపఠనమునఁ బ్రథమ ప్రకరణముగా లోకమున వ్యాపించుచు వచ్చుచున్నది. ఇతఁడును, తర్కభాషాప్రకాశకర్త యగుచెన్నుభట్టునుగూడ నాంధ్రదేశీయపండితు లని ప్రసిద్ధి. అన్నంభట్టు తనసంగ్రహమునకుఁ దానే దీపిక యనువ్యాఖ్య రచియించెను. దానికి నీలకంఠ నరసింహ గోవర్ధన సుధీ పట్టాభిరామప్రభృతిపండితులు వ్యాఖ్యలు రచియించిరి. వానిలో న్యాయబోధిని కెక్కువప్రచారము కలదు. ఇఁక నీశాస్త్రమందు వెలసిన వాదగ్రంథములు క్రోడపత్రము లందుమా! వందలు. అందుగదాధరభట్టాచార్యుల శక్తివాదవ్యుత్పత్తివాదములు తార్కికలోకము నెక్కువగా నాకర్షించినవి. ౬౪ వాదగ్రంథములు నిర్మించినయీవిద్వద్రాజు క్రీ. ౧౬౬౦ ప్రాంతమున నవద్వీపమున నవీనతర్కము ప్రతిష్ఠించి కీర్తి గాంచెను.' యాదవపండితునిసర్వసిద్ధాంతసంగ్రహమును, ఉదయనాచార్యునిన్యాయకుసుమాంజలియు న్యాయవైశేషికములు రెంటి ననుసరించిన వయ్యు న్యాయశాస్త్రమునఁ బ్రామాణికములై వెలయు

---

1. ఇదియు హరిశాస్త్రిలవారి చిత్రప్రభయు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే నిపుడు ప్రకటింపఁబడినవి.

చున్నవి. ఇట్లు వటవృక్షమువలె శాఖోపశాఖలుగాఁ బెరిఁగినయీశాస్త్రము తొలుత నెందు పుట్టి యెందు సంచరించినను, తరువాత దీనికి నవద్వీపము ముఖ్యాశ్రయ మైనది.

వైశేషికము—దీనికి మూలము కణాదసూత్రము. ఇది పదియధ్యాయముల గ్రంథము. ఇందలిసూత్రములు ౩౬౯. దీనికిఁ బ్రశస్తపాదులు రచియించినపదార్థధర్మసంగ్రహ మనుభాష్య మొకటి కలదు. ఇది ప్రతిసూత్రవ్యాఖ్య గాక షట్పదార్థనిర్ణయపర మైన దని పేరునుబట్టియు గ్రంథసరణివిబట్టియు విదిత మగును. ఈప్రశస్తపాదుఁడు వాత్స్యాయనునివలెఁ బ్రాచీనుఁ డని కొందఱిమతము. పై భాష్యమునకు వ్యాఖ్యలు రచియించినవారిలో నొకఁ డగుశ్రీధరపండితుఁడు శా. శ. ౯౧౩ లోనివాఁ డని డాక్టరుబుహ్లారువ్రాసియున్నాఁడు. ఇతనినాఁటికే మిక్కిలిపూర్వమని ప్రశంసింపఁబడుధర్మసంగ్రహమును రచియించినప్రశస్తపాదుఁడు మిక్కిలి ప్రాచీనుఁ డనుట కాక్షేపమురాఁబోదు. కణాదసూత్రములకు వ్యాఖ్యగా భవనాథమిశ్రునికొడుకు శంకరమిశ్రుఁడు వైశేషికసూత్రోపస్కార మనుగ్రంథము రచియించెను గాని, అది ధర్మసంగ్రహమునెదుట వన్నె గాంచినట్లు కనఁబడదు.

ఈశాస్త్రమున వాత్స్యాయనభాష్యము మిక్కిలిప్రాచీనము. అత్యంతము ప్రశస్తము. దీని కెనిమిదివృత్తులు పుట్టినవి. వానిలో, వ్యోమశివాచార్యుని వ్యోమవతియు, శ్రీధరాచార్యునికందళియు, ఉదయనాచార్యుని కిరణావళియు, శ్రీవత్సాచార్యునిలీలావతియుఁ బూర్వములు. జగదీశతర్కాలంకారునిభాష్యసూక్తియు, పద్మనాభమిశ్రునిసేతువును, మల్లినాథసూరిభాష్యనికరమును, శంకరమిశ్రునికాణాదరహస్యమును బరములు. ఇందు మొదటిమూఁడును సూత్రముల ననుసరించినవి. నాల్గవది భాష్యమునుమాత్రమే యనుగమించినది. ఇవిగాక జయనారాయణ తర్కపంచాననవిరచిత మైనసూత్రవివృతి యొకటి కలదు. ఇన్ని యున్నను, భాష్యమువలెఁ గీర్తి కెక్కినది కిరణావళియొకటియే యని దానివ్యాఖ్యలవల్లఁ దెలియుచున్నది. మఱియు సర్వదేవసూరి ప్రత్యక్షాదిప్రమాణములనుగూర్చి ప్రమాణమంజరియు, ఉదయనాచార్యుఁడు సప్తపదార్థాంగీకారముతో లక్షణావళియు, శివాదిత్యుఁడు సప్తపదార్థియు, స్వతంత్రముగా నిర్మించిరి. ఇందు ప్రతిదానికిని వ్యాఖ్యలు కలవు. ఇవి గాక శిరోమణిభట్టాచార్యులు మొద లగుననేకులు రచియించిన పదార్థతత్త్వాదులు పెక్కు కలవు. పై వానిలోఁ గొన్నిటికి న్యాయగ్రంథకర్తలే కర్తలుగా నున్నారు. వారు వర్ధమానాదులు.

సాంఖ్యము :—దీని కాధారము కపిలసూత్రము. షడధ్యాయియగునిందు ౫౨౬ సూత్రము లున్నవి. దీనివ్యాఖ్యాతలలో నెవరు ముం దనువిషయము నిర్ణయింపఁ గష్టముగా నున్నది. ఈశ్వరకృష్ణభట్టు రచియించినసాంఖ్యకారిక సాంఖ్య

సూత్రములమొదటిశ్లోకరూపవ్యాఖ్య యనియు, దానికి భాష్యము వ్రాసినగౌర పాదుఁడు శంకరులగురువుగురు వైనగౌడపాదుఁడే యనియు నొక రభిప్రాయపడిరి గాని యది సంగతము కాదు. వాచస్పతిమిశ్రునిసాంఖ్యతత్త్వకౌముది ప్రథమ వ్యాఖ్యాన మనెడిమఱియొకరియుద్దేశమును సముచితముగా లేదు. విజ్ఞానభిక్షువు నిర్మించినసాంఖ్యప్రవచనభాష్యము మొదటి దని పెక్కండ్రు భావించుచున్నారు. కాని, యతనిని వాచస్పతిమిశ్రునితరువాతివాఁ డగుననిరుద్ధుని కర్వాచీనునిగా సాంఖ్యవృత్తిప్రకాశకులు తలఁచుచున్నారు. అయినను, పై భాష్యమే నిలిచియున్న సూత్రవ్యాఖ్యలలో మొదటి దనుట కవకాశ మెక్కువగా నున్నది. విజ్ఞాన భిక్షువు భాష్యావతారికలో—

"కాలార్కభక్షితం సాంఖ్యశాస్త్రం జ్ఞానసుధాకరమ్
కలావశిష్టం భూయోఽపి పూరయిష్యే వచోఽమృతైః"

అనుచుఁ బ్రాచీనము లైనసాంఖ్యశాస్త్రగ్రంథము లనేకములు పేరు లేకుండఁగఁ బోయినట్లు వక్కాణించి యున్నాఁడు. అతనినాఁ డేవేనిసూత్రవ్యాఖ్యలున్నచో వాని నెందు నేవిధముగా ను స్మరింపకయే నిష్కాముఁ డైనభిక్షు వట్లు చెప్పియుండు ననుట సాహసము కావున నతనినాఁటికి సూత్రములు తప్ప మఱేమియు నిలచియుండ లేదనియే భావింపవలెను. అతఁడు భాష్యములోఁ గొన్ని పాఠాంతరము లెత్తుటయు 'యత్తు కశ్చి దవివేకీ' ఇత్యాదిగా విరుద్ధమతనింద గావించుటయు సత్యమే కాని, యీ ప్రసంగ మనిరుద్ధునిగూర్చి కావించిన దని తలంచుటమాత్ర మర్హము కాదు[1]. భాష్యకర్తల నిందలకుఁ బాల్పడినవా రందఱును గ్రంథకర్తలే యని భావింపరాదు. తమమతమునకు విరుద్ధాభిప్రాయము గలయితరులమాట లెత్తుకొని యేవిధముగాఁ జర్చ సలుపుట భాష్యకర్తలశైలి యనుట ప్రసిద్ధము. ఇఁకఁ బాఠాంతరము లందుమా? అతనికి లభించినప్రతులలో నవి యుండవచ్చునుగదా! కావున నిప్పటికి లభించినయాధారములనుబట్టి విజ్ఞానభిక్షువుభాష్యమే మొదటి దనవచ్చును. వాచస్పతిమిశ్రుఁడు దశమశతాబ్ది మధ్యభాగములోనివాఁడు గావున భిక్షు వంతకుఁ బూర్వుఁ డగును. అతఁడు సాంఖ్యసార మనుమఱియొకపుస్తము వ్రాసెను. వాచస్పతితత్త్వకౌముదికి వ్యాఖ్యగా రామకృష్ణభట్టు సాంఖ్యకౌముదిని, దానికి వ్యాఖ్యగా రాఘువేంద్రసరస్వతి తత్త్వామృతప్రకాశినిని వేదాంతిమహాదేవుఁ డనిరుద్ధునిసాంఖ్య సూత్రవృత్తికి వ్యాఖ్యగా వృత్తిసారమును, స్వతంత్రముగా గోవిందభట్టు సదసత్ఖ్యాతివిచారమును నిర్మించిరి. ఇట్టి వేవో మఱికొన్ని కలవు గాని చాలావఱకీశాస్త్రగ్రంథము లర్వాచీనములే.

1. చూ. సాంఖ్యసూత్రవృత్తిపీఠిక.

“అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానా” మిత్యాది శ్రుతినిబట్టి సత్త్వరజస్తమోగుణములసామ్యావస్థయు మహదాదులకు మూలమైనదియు నగుప్రధాన మనఁబడుమూలప్రకృతియే జగత్కారణము. దీనికంటె వేఱుగా జగత్కారణ మేదియు లేదు. మూలప్రకృతి యగుప్రధానమునకు మఱియొకమూలము లేదు. పృథివ్యాదిమహాభూతములును, ఏకాదశేంద్రియములును, శబ్దస్పర్శాదిపంచతన్మాత్రలును, తత్త్వము లనఁబడును. పురుషుఁడు కూటస్థనిత్యుఁడు, అపరిణామి. ప్రకృతియు వికృతియుఁ గానియతఁడే జీవాత్మ. ఈప్రకృతిపురుషుల సంబంధమువల్లనే సృష్టి యగుచున్నది. వీరిసంయోగము పంగ్వంధసంయోగము వంటిది. పరిణామరూపక్రియాసహిత మయ్యు నచేతన మగుటచేఁ బ్రధానము గ్రుడ్డిది. చేతనుఁ డయ్యుఁ గ్రియారహితుఁ డగుటచేఁ బురుషుఁడు కుంటివాఁడు. కుంటివాఁడుగ్రుడ్డివానిబుజ మెక్కియు, గ్రుడ్డివాఁడు వానిని బుజములమీఁద నెక్కించుకొనియు నెట్లు తమయభీష్టములు నెఱవేర్చుకొందురో, అట్లే భోగ్యమైన ప్రకృతి భోక్తయగుపురుషు నపేక్షించి తత్సహాయమునఁ బ్రవర్తించుచున్నది. పురుషుఁడును బ్రకృతిసంబంధమునఁ దద్గతదుఃఖత్రయము నివారించుకొని కైవల్య మపేక్షించుచున్నాఁడు. ఇక్కడఁ బ్రవృత్త మైనప్రకృతి నివర్తించునా యని సంశయింప నక్కఱలేదు. తప్పు చేసినభార్య భర్తకు మరలఁ గనఁబడకుండఁ బోవునట్లును, రంగస్థలమున నృత్యము సలిపిన నర్తకి యానృత్యమునుండి నివర్తించు నట్లును బ్రకృతి నివర్తించును. తత్త్వాన్వేషణమున సంభవించుదుఃఖత్రయ నివృత్తియే కైవల్యమూలము. అదే పరమపురుషార్థము.” అనుచు సాంఖ్యసమ మైనజ్ఞానము లేదని యిది సిద్ధాంతీకరించును.

యోగము:—దీనిమూలము పాతంజలసూత్రము. ఇది, సమాధి—సాధన నిర్దేశ—విభూతి—కైవల్య—సంజ్ఞలుగలనాలుగుపాదములగ్రంథము. దీనికి సాంఖ్య ప్రవచననామమున నొకభాష్య మున్నది. అది యెప్పుడు పుట్టెనో తెలియదు గాని దానికర్త వేదవ్యాసుఁ డనుప్రతీతిమాత్రము చిరకాలముక్రిందటనే సిద్ధమైనది. ఈప్రతీతిని విశ్వసించియే కొందఱు భగవత్పతంజలి వ్యాసునికిఁ బూర్వుఁ డనియుఁ గొందఱు వ్యాసునిసమకాలికుఁ డైనమఱియొకపతంజలి సూత్రకర్త యనియు భావించిరి కాని యిది యంతయు నసమంజసము. భాష్యకర్తపేరు తెలియక పోవుటచే నెవరో యతఁడు వ్యాసుఁ డనఁగా, ఆమాటయే పండితలోకమున వ్యాపించియుండును. లేదా, అన్యు లెవరో తొల్లి భాష్యము రచియించి వ్యాసుని పేరు పెట్టియుందురు. కాదేని వ్యాసుఁ డనుపేరు గలయొకవిద్వాంసుఁడు భాష్యము వ్రాసియుండ నతఁడు వేదవ్యాసుఁడే యని తరువాతివారు భావించియుందురు. అంతేకాని వేదవ్యాసుఁ డనుకృష్ణద్వైపాయనుఁడు మాత్రము భాష్యకర్త కాఁ డనుట స్పష్టము. ఐనను ఈప్రతీతిమాత్రము భాష్యమునకు వ్యాఖ్యానములు

వ్రాసినవాచస్పతిమిశ్రుఁడు నాగోజీభట్టు రామానందసరస్వతి మొదలగువారు విశ్వసించి రని వారిగ్రంథారంభశ్లోకములు చెప్పుచున్నవి.

యోగసూత్రములకు రాజమార్తాండ మనుపేర భోజరాజు రచియించిన వ్యాఖ్యయు, సూత్రార్థచంద్రిక యనుపేర ననంతాచార్యునివ్యాఖ్యయుఁ గనవచ్చుచున్నవి. ఆత్మారామయోగీంద్రునిహఠప్రదీపికయు, గోరక్షనాథునిసిద్ధసిద్ధాంతపద్ధతియు నీశాస్త్రమున స్వతంత్రములై యున్నవి. ఇంక నేవేని కలవేమో! ఇది యీశ్వరాస్తిత్వ మంగీకరించినసాంఖ్యము. దీనితత్త్వముం దెల్పుపద్య మిది—

సీ. "అపరిగ్రహము సత్య మస్తేయము నహింస బ్రహ్మచర్యం బనఁబరఁగుయమము,
స్వాధ్యాయసంతోషశౌచతపోబ్రహ్మనిరతచిత్తత లన నియమ మగును,
పద్మాదిదశవిధభవ్యాసనంబుల నాచరించుట యగు నాసనంబు,
వాయుపూరకము కుంభకము రేచక మనఁబరగుఁ బ్రాణాయామ మురుగుణంబు
చక్షురాదీంద్రియసన్నిరోధంబె ప్రత్యాహార మనెడియుత్తమగుణంబు,
బంధించి చిత్త మీశ్వరునిపైఁ దిరముగాఁ దగులంగఁజేయుట ధారణ యగు,
అఖిలంబు మఱచి యేకాగ్రచిత్తత నీశు ననయంబు తలఁచుట ధ్యాన మగును,
ప్రత్యగాత్మకుఁ బరబ్రహ్మంబునందు నైక్యము గల్గుట సమాధి యనఁగఁ జెల్లు,
గీ. వీనియాచరణమునఁ బ్రధానమునకుఁ దొలఁగి జీవుం డవిద్యచేఁ గలిగినట్టి
దుఃఖసంసారమునకును దొలఁగి యిష్టసిద్ధి గనఁ జాలు నిదియె నిశ్శ్రేయసంబు."

ఉత్తరమీమాంస :—ఇదియే నిజమైనవేదాన్త మతము. ఇదే బ్రహ్మవిద్య. శరీరనివాసి యగుజీవునితత్త్వ మావిష్కరించుటం జేసి యిది శారీరకమీమాంస మైనది. ఉపనిషత్తు లాధారముగా బాదరాయణుఁడు రచియించిన బ్రహ్మసూత్రములు దీనికిఁ బునాది. కర్మ, జ్ఞానమునకు సాధన మనెడియాచార్యోక్తినిబట్టి పూర్వమైనకర్మను దెల్పునది పూర్వమీమాంస యనియు, ఉత్తరమైనబ్రహ్మజ్ఞానమును దెల్పునది యుత్తరమీమాంస యనియు విద్వల్లోకమున వ్యవహారము వచ్చినది గాని యివి దీనిమొదటిపేరు గాదు. శంకరులు దీనిని వేదాంతమీమాంసాశాస్త్ర మని పేర్కొని యున్నారు. ప్రతిసూత్రమందు నుపనిషద్వాక్యార్థ మిమిడి యుండుటంజేసి దీని కాపేరు తగును.

బ్రహ్మసూత్రములు నాలుగేసిపాదములు గలనాలుగధ్యాయములుగా నున్నవి. ఇందు ౫౫౫ సూత్రము లున్నవి. వీనికి శంకరరామానుజపూర్ణప్రజ్ఞులు క్రమముగా భాష్యములు వ్రాయుటంజేసి యీదర్శనము శాంకర రామానుజీయ మాధ్వసంజ్ఞలఁ ద్రివిధ మైనది. ఇందు, శంకరభాష్య మాధారముగా వెలసిన యద్వైతమతగ్రంథము లనంతములు. శంకరులు క్రీ. శ. ౭౫౦ ప్రాంతమున

బౌద్ధజైనమతము లణఁగించుటకును వైదికమత ముద్ధరించుటకును భూమి నవత రించినశంకరుఁడే యని విశ్వసింతురు. శంకరవిజయము కొంతయద్భుతము నతిశ యోక్తి భూయిష్ఠము నైనను, అందలియితనిజన్మవృత్తాంతము కొంత విశ్వసనీయ ముగానే యున్నది. దానినిఁబట్టియు, దేశచరిత్రలనుబట్టియు నితనిచరిత్ర మీక్రింది విధముగాఁ దెలియుచున్నది.

కేరళదేశమున, పూర్ణానదీతీరమున వృషాద్రి కలదు. అందు శంభువు లింగరూపమున నావిర్భవించెను. ఆకొండకు దగ్గఱగా నొకయగ్రహార మున్నది. దానిపేరు కాలటి. అందు విద్వద్వర్యుఁ డైనవిద్యాధిరాజనుబ్రాహ్మణునికి శివగురు వనుపుత్రుఁడు కలఁడు. అతనితనయుఁడు శంకరాచార్యుఁడు. ఇతనిజీవితకాలము ముప్పదిరెండేం డ్లని కొందఱును ముప్పదియాఱే ళ్లని కొందఱును వ్రాసిరి. ఎట్ల యిన నల్పాయుర్దాయమే. ఈస్వల్పకాలములో నుపనీతుఁడై వేదవేదాంగాది విద్య లభ్యసించి శతాధికగ్రంథములు రచియించి హిందూదేశ మంతటఁ బర మతజైత్రయాత్ర సలిపి వైదికమతస్థాపనము గావించి పెక్కండ్రుశిష్యులకు బ్రహ్మ విద్య బోధించి, బ్రహ్మీభూతుఁ డయ్యె నన్న చరిత్రాంశము లన్నియు సత్యము లైనట్లు తెలియుచుండ నితఁడు మహామహిమసంపన్నుఁ డైనయీశ్వరతేజోఽంశ సంభూతుఁ డని విశ్వసించుట కబ్బుర మేమి? ధర్మపరిపాలకుఁడై జగద్గురు వను బిరుదొందినయీమహాపురుషుఁడు మతరక్షణమునకై తూర్పున జగన్నాథమం దును, దక్షిణమున శృంగేరియందును, పశ్చిమమున ద్వారకలోను, ఉత్తరమున బదరీకేదారములోను, తనపేర మఠములు స్థాపించెను. ఈజ్ఞానీంద్రుఁడు బదరీ కేదారమందే శరీరము పరిత్యజించి బ్రహ్మ మయ్యెను.

ఈజగదేకపూజ్యుఁడు జీవేశ్వరైక్యవాదము సమర్థించుచు వ్రాసినభాష్యాది గ్రంథము లసంఖ్యములు. అందు మహాగ్రంథము లన్నిటికిని వ్యాఖ్య లను వ్యాఖ్యలు టిప్పణులు వృత్తులు కారికలు సహస్రముఖముల నుదయించినవి. అద్వైతమతస్థాపనపరముగా నీమహాత్ముఁడు రచియించిన [1] బ్రహ్మసూత్రభాష్య మున కుపవర్షుని బ్రహ్మసూత్రవృత్తి పూర్వ మని శంకరు లతనిని స్మరించుటవల్లనే విశద మగును[2]. శంకరాచార్యగురు వగుగోవిందయోగీంద్రునిగురువుగాఁ జెప్పఁబడు గౌడపాదు లుపనిషదర్థమును జక్కఁగాఁ గూర్చి కారిక రచియించియున్నారు. అందలిశ్లోకములును శంకరభాష్యమునఁ గనవచ్చును. ఇవి శంకరుల కాధారములై యుండును. ఇఁక బ్రహ్మసూత్రములకు శంకరభాష్యమే కాక, బ్రహ్మానందసరస్వతి

1. ఇతనిభాష్యమందు బోధాయనుఁడు నిర్మించినబ్రహ్మసూత్రవృత్తి మాట యెందును గనరాదు. దానిని చెప్పినవాఁడు రామానుజుఁ డొకఁడే యని తెలియుచున్నది.
2. బ్ర. సూ. ఏక ఆత్మనః శరీరేభావాత్. 3, 3-53 భాష్యమున—

వేదాన్తముక్తావళియు, రంగనాథునివిద్వజ్జనమనోహారమును, రామానంద సరస్వతి బ్రహ్మామృతవర్షిణియు, రంగనాథుని విద్వజ్జనమనోహారమును, సదానంద సరస్వతి బ్రహ్మసూత్రపదయోజనమును, నిర్మలకృష్ణుని నిర్మలకృష్ణభాష్యమును, గంగాధర భక్తకింకరునిసుబోధినియు మొదలుగా బహువ్యాఖ్యలద్వైతపరముగా నవతరించినవి. వీనిలోఁ గొన్నిటి కనువ్యాఖ్యలు మరలఁ బుట్టినవి. ఇవి యిట్లుండ శ్రీశంకర భాష్య మాధారముగాఁ బుట్టినవ్యాఖ్యలలో, గోవిందానందునిరత్నప్రభయు వాచస్పతిమిశ్రునిభామతియు, ఆనందగిరియానందగిరీయయు, పద్మపాదాచార్యుని పంచపాదికయు, అద్వైతానందునిబ్రహ్మవిద్యాభరణమును మొదలుగా సుమారు పది కనవచ్చుచున్నవి. ఈవ్యాఖ్యలకును మరల వ్యాఖ్యలు వెలసినవి. వానిలో భామతికి అమలానందునివేదాంతకల్పద్రుమము, దానికప్పయదీక్షితునిపరిమళము, దానికి వైద్యనాథునివేదాంతకల్పతరుమంజరియు వరుసగా జన్మించినవి. పంచపాదికాదులకుఁ బ్రకాశాత్ముని వివరణాదులు వెలసినవి. ఇంక, ప్రత్యధికరణమందలి సూత్రముల తాత్పర్యమును సంగ్రహించి వేదాంతాధికరణమాల యనుపేర భారతీతీర్థముని శ్లోకములు రచియించెను. భావగర్భితములు మనోహరములునైనయవి భాష్యముతో ముద్రితములై యున్నవి. తరువాత—

ఈయద్వైతమూర్తి దశోపనిషత్తులకును భగవద్గీతకును దివ్యమైనభాష్యములు రచియించెను. ఈరెంటికి నానందగిర్యాదులవ్యాఖ్యలు కలవు. ఇవి గాక శ్రీశంకరులు నిర్మించినవి గద్యాత్మకపద్యాత్మకభాగములతో సకలోపనిషత్సారోపదేశసహస్రి, పంచీకరణ మనుప్రకరణము, దశశ్లోకి, ద్వాదశమహావాక్యవివరణము, ఆత్మబోధ అధ్యాత్మవిద్యోపదేశవిధి, ఆత్మషట్కభాష్యము, అపరోక్షానుభూతి, బాలబోధిని, దృగ్వాక్యవృత్తి, స్వరూపనిరూపణము, స్తవము లష్టకములు, మొదలయినవి శతాధిక మున్నవి. వీని కన్నిటికిని వ్యాఖ్యలు కలవు[1]. ఒకయుపదేశసహస్రిమీఁద వెలసినటీకలే యేఁబది కలవు. కాని, ఈసహస్రి యిపుడు వ్యాప్తిలో నున్నట్లు కనరాదు. విదేశపుస్తకాలయములందు వ్యాఖ్యలతోడియాగ్రంథ మున్నట్లు తెలియుచున్నది. ఇఁక నీశాంకరమతము ననుసరించి యుత్పన్నము లైనయద్వైతవేదాంతగ్రంథము లందుమా, లెక్కింప శక్యము కాదు. అందు ప్రసిద్ధము లైనవి, సురేశ్వరాచార్యునినైష్కర్మ్యసిద్ధి, సర్వజ్ఞాత్మమహామునిసంక్షేపశారీరకము, విద్యారణ్యులవేదాన్తపంచదశి, ప్రకాశానందుని సిద్ధాన్తముక్తావళి, ముకుందమునివివేకసింధువు. ధర్మరాజాధ్వరీంద్రునివేదాన్తపరి

---

1. లండన్ లైబ్రరీలోని వేదాంతగ్రంథరాశిలో నిపుడు మనవారెఱుఁగని పనేకము లున్నవి.

భాష, సదానందయోగీంద్రునివేదాన్తసారము, సదానందునిప్రత్యక్తత్త్వచింతామణి, మధుసూదనసరస్వతి యద్వైతసిద్ధి, శ్రీహర్షునిఖండనఖండఖాద్యము, (వాల్మీకికృతమనెడి) యోగవాసిష్ఠము, అప్పయదీక్షితులసిద్ధాంతలేశసంగ్రహము, మొదలైనవి. ఇం దద్వైతసిద్ధ్యాదులు కొన్ని గౌడబ్రహ్మానందీయాదివ్యాఖ్యలతో వేదాన్తశాస్త్రపఠనమున నుత్తమపఠనీయములుగా నున్నవి. ఇట్లు శరపరంపరగా బయలువెడలినగద్యపద్యాత్మకవేదాంతగ్రంథములను బేర్కొనుట కైన నిందు తావు లేదు. ఇట్లెన్నేని మొన్నమొన్నటివఱకు ను గ్రంథములు ఉత్పన్నము లగుచునే వచ్చినవి కాని, ఈశాస్త్రమున నాఁటినుండి నేఁటిదనుక నుత్తమ ప్రమాణమై జగదేకపూజ్యత గాంచినశంకరభాష్యత్రయమువంటిగ్రంథము మాత్రము మఱియొకటి కాదనుట ముమ్మాటికి సత్యము. ఇందు బ్రహ్మసూత్ర భాష్యము సర్వసమదర్శియైనన్యాయాధికారివంటిది. ఇది సకలమతములవారిని బిలిచి విచారించి వారిమతములను వారిమాటలచేతనే కాదనిపించి తత్త్వము బయటఁ బెట్టినసత్యపరిశీలకాగ్రణి. "దృశ్య మంతయు నశ్యమే. దృశ్యమానమైన జగము శుక్తియందు రజతమువలెనే బ్రహ్మమం దధ్యస్తమైనది గాని సత్యము గాదు. అవిద్యావశమున నుపాధివిశిష్టుఁడైన ప్రత్యగాత్మ యాత్మజ్ఞానమున దేహాది బంధవిముక్తుఁడై స్వస్వరూపసంధానమునఁ బరబ్రహ్మ మగును. అదియే ముక్తి యనఁబడును. త్రికాలాబాధ్యమును సత్యజ్ఞానానంతరూపమును శుద్ధబుద్ధముక్త స్వభావమును స్వప్రకాశము నగుపరబ్రహ్మ మొకఁడే నిత్యము, తక్కిన దంతయు ననిత్యము. ఈసత్యము తెలియుటకు బ్రహ్మజిజ్ఞాస కర్తవ్యము. దానికి నిత్యానిత్య వస్తువివేకాదిసాధనచతుష్టయసంపత్తి యావశ్యకము" అని దీనిపరమోపదేశము[1]. ఇఁక, రామానుజీయాదిదర్శనములను బరిశీలించుటకు ముందుగా నింతకు మున్నె యుదర్శనములందును గూడఁ గనవచ్చినవాచస్పతిమిశ్రునిస్వరూప మించుక తెలిసికొందము.

వాచస్పతిమిశ్రుఁడు :—ఆయుదర్శనములకును దివ్యములైనటీకలు రచియించి షడ్దర్శనటీకాకారుఁ డనుఖ్యాతి వహించినయతఁడు మైథిలదేశీయుఁడు. మిశ్రకుటుంబములకుఁ జేరినమండనమిశ్ర మురారిమిశ్రాదిమహావిద్వాంసులలో నొకఁడు. వాచస్పతి నామము గలగ్రంథకర్తలు ముగ్గురు నలుగు రున్నారు కాని,

1. బ్రహ్మసూత్రములకును, శాంకరభాష్యమునకును, అపరిమితము లయినవ్యాఖ్యలు కల వని యెఱింగియు, రత్నప్రభాభామత్యానందగిరీయవ్యాఖ్యలతో సూత్రభాష్యము గురు ముఖమునఁ జదువుకాలమం దీగ్రంథములమీఁదిగౌరవాదరాతిశయములనుబట్టి బ్రహ్మ సూత్రార్థదీపిక యనుపేర సంస్కృతమున సూత్రతాత్పర్యము విశదీకరించుచుఁ జిన్న గ్రంథము రచియించియున్నాను.

పూర్వోక్తములైనదర్శనవ్యాఖ్యలకర్త యైనవాఁడొక వాచస్పతిమిశ్రుఁడే కాని, యందు మఱియొకఁడు లేఁడని, యొకగ్రంథమునందు స్వవిరచితమైనమఱియొక గ్రంథము నితఁడు పేర్కొనుటచేతనే విశదమగుచున్నది. ఇతఁడు సాంఖ్యతత్త్వకౌముదిలో న్యాయవార్త్తికతాత్పర్యటీకను, అందు బ్రహ్మతత్త్వసమీక్షాన్యాయకణి(ణి) కలను, తత్త్వబిందువులో మరల న్యాయకణికను, భామతిలో బ్రహ్మతత్త్వసమీక్షను, ఇట్లే తనగ్రంథములను బేర్కొని యున్నాఁడు. మఱియు, భామతి కడపట—

"యన్న్యాయకణికాతత్త్వసమీక్షా తత్త్వబిందుభిః
యన్న్యాయసాంఖ్యయోగానాం వేదాన్తానాం నిబన్ధనైః
సమచైషం మహత్పుణ్యం తత్ఫలం పుష్కలం మయా
సమర్పిత మథైతేన ప్రీయతాం పరమేశ్వరః
నరేశ్వరా యచ్చరితానుకార మిచ్ఛన్తి కర్తుం నచ పారయన్తి
తస్మిన్ మహీపే మహనీయకీర్తౌ శ్రీమన్నృగే ఽకారి మయా నిబన్ధః"

ఇత్యాదిశ్లోకములనుబట్టి మీమాంసాదిసకలదర్శనముల కితఁడు టీకలు వ్రాసినట్లు స్పష్ట మగుటయే కాక నృగమహారాజునాస్థానములోనివాఁ డనికూడ విదిత మగుచున్నది. ఈరాజెపుడే దేశ మేలినవాఁ డనుటకుఁ బ్రత్యక్షమైన గ్రాంథికనిదర్శనము లభింపలేదు కాని, వాచస్పతిమిశ్రుఁడు న్యాయసూచీనిబంధము తుద వ్రాసియున్న—

"న్యాయసూచీనిబంధో ఽసా వకారి సుధియాం ముదే,
శ్రీవాచస్పతిమిశ్రేణ వస్వఙ్కవసువత్సరే"

అనుశ్లోకమునుబట్టి శా. శ. ౮౯౮ అనఁగా, క్రీ. ౯౭౬ లోఁబై గ్రంథము రచియించినట్లు కనఁబడుచున్నది. సూచీనిబంధకర్త మఱియొకవాచస్పతి యనెడి యనుమానము కలుగకుండుటకు మఱియొకప్రమాణము కూడఁ గలదు. శా. శ. ౧౧౧౨ లోయాదవాచలముపై విష్ణుప్రతిష్ఠ గావించినరామానుజాచార్యులు శ్రీభాష్యములో భామతిని ఖండనఖండఖాద్యమును గూడఁ బేర్కొని యున్నాఁడు. ఖాద్యకర్త యగుశ్రీహర్షునికిఁ బూర్వుఁడైనయుదయనాచార్యులు, శా. ౯౦౬ లోనివాఁడు. ఇతనితాత్పర్యపరిశుద్ధిలోఁ బేర్కొనఁబడినమనవాచస్పతి మిశ్రుఁడు శా. ౮౯౮ లోనున్నాఁ డనుట కాక్షేప మేమి? మఱియు, క్రీ. శ. ౧౦౯౮ లోనికీర్తివర్మవిభునకు।సమకాలికుఁడైనకృష్ణమిశ్రుఁడు ప్రబోధచంద్రోదయములో—

"నైవాశ్రావి గురోర్మతం నవిదితం తౌతాతితం దర్శనమ్,
తత్త్వం జ్ఞాత మహోన శాలికగిరాం వాచస్పతేః కా కథా"

అని పూర్వమీమాంసాప్రసక్తితో వాచస్పతిమిశ్రుని బేర్కొనియున్నాఁడు. ఇది కూడ మనమిశ్రుఁడు పూర్వోక్తకాలములోనివాఁ డనుటకుఁ బ్రమాణము కాక పోదు. ఇతఁడు తన బ్రహ్మవిద్యాగురు వగుమార్తాండతిలకస్వామిని భామతి మొదలను, శాస్త్రగురు వగుత్రిలోచనపండితుని న్యాయతాత్పర్యటీకయందును బ్రశంసించియున్నాఁడు. కాని, స్వామి సుప్రసిద్ధుఁ డైనపూర్వాచార్యుఁడు గాని యితనిగురువు కాఁ డని కొందఱ అనుచున్నారు.

రామానుజీయము:—విశిష్టాద్వైత మనఁబడెడిద్వైతభేద మగునీమతము గూడఁ బ్రాచీన మైనను, రామానుజాచార్యులు దీని నుద్ధరించుటంజేసి యిది రామానుజీయ మైనది. ఈమహనీయుఁ డర్వాచీనమతసంస్కర్తలలో నగ్రగణ్యుఁ డనఁదగినవాఁడు. ఇతఁడు చెన్నపురికి దగ్గఱగా నున్న పరమత్తూ రనుగ్రామమునఁ గాంతిమతీకేశవభట్టు లనుసత్కులీనులగర్భమున నుదయించెను. ఇతని మొదటిపేరు, ఎంబెరుమానారు. ఉపనీతుఁ డైనపిదప నితఁడు కాంచీపురమున వేదవేదాంగాదు లభ్యసించి మతగ్రంథములు పరిశోధించి, శాంకరమతము నిరాకరించుచుఁ దన మతమును జనులకు బోధింపఁ గడంగెను. కాని, అం దున్న చోళరాజు శాంకర మతనిరాకరణమున కంగీకరింపక యితని నూరినుండి వెడలఁగొట్టించెను. అంత నితఁడు మైసూరు వెళ్లి జైనరాజైనవెల్లాలరాయనికూఁతురిరోగమును గుదిర్చి యతని వశ్యుని జేసికొని యతని వైష్ణవునిగా మార్చి యారాజుసాయమున వైష్ణవ మతాభివృద్ధి గావింప సంచార మొనర్చి పదునొకండవశతాబ్దికడపట, తిరుపతిసింహాచలము మొద లగుచోట్ల నున్నశైవాలయములను వైష్ణవాలయములను గా మార్చి తూర్పున జగన్నాథమువఱకును వైష్ణవమతోపన్యాసము లిచ్చుచు నందందు ప్రజలను స్వమతమునకుఁ ద్రిప్పుచు మరలి వచ్చి కడపట శ్రీరంగ క్షేత్రము చేరి సన్యసించి యచ్చటనే దేహము పరిత్యజించి విష్ణుసారూప్యము నొంది నట్లు చరిత్రవల్లఁ దెలిసియున్నది.

ఈమహావిద్వాంసుఁడును, బ్రహ్మసూత్రములకును భగవద్గీతోపనిషత్తులకును భాష్యములు రచించియు, వేదాంతదీపము వేదాంతతత్త్వసారము మొద లగుపెక్కుగ్రంథములు నిర్మించియు విశిష్టాద్వైతమునకు గట్టిపునాది వేసెను. తరువాత సాయణమాధవుల కించుక పూర్వుఁడై క్రీ. పదుమూఁడవశతాబ్దికడపటివాఁ డయినవేదాంతదేశికులనఁబడువేంకటనాథాచార్యులు తత్త్వముక్తాకలాపము న్యాయసిద్ధాంజనము రహస్యత్రయసారము మొద లగుమతగ్రంథములు నిర్మించి విశిష్టాద్వైతమతమున కెక్కువ విఖ్యాతి తెచ్చెను. కవితార్కికసింహుఁడు సర్వ

తంత్రస్వతంత్రుఁడు నని ప్రసిద్ధిగాంచిన యీవిద్వన్మణి తర్క-వేదాంతశాస్త్రములం దెన్నేని గ్రంథములు రచియించి యున్నాఁడు. ఇతనిన్యాయబిందువు న్యాయభాస్కరము ననునవి విద్వల్లోకమునాదరము గాంచినవి. ఇతనితిరువాతఁ బూర్ణానందుఁడు మొదలగువారు తత్త్వముక్తావళ్యాదులు రచియించియు, రంగరామానుజాదులు భాష్యాదుల కనువ్యాఖ్యలు నిర్మించియు రామానుజీయమున కించుక వ్యాప్తి తెచ్చిరి. ఈమతమును సవిస్తరముగా వర్ణించినగ్రంథములు ద్రవిడభాషలోఁ గలవు.

రామానుజునిసూత్రభాష్యము శ్రీభాష్య మనఁబడును. దీనికి బోధాయనవృత్తి యాధార మైనట్లుగా భాష్యకర్త యిట్లు వ్రాసియున్నాఁడు.

"భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాస్సంచిక్షిపు స్తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యన్తే" కాని, పూర్వాచార్యు లెవరును దాము సంక్షేపించినయావృత్తిని బేర్కొన లేదు. అది యిపుడు లభ్యము కాదు. అందుచే నది విశిష్టాద్వైతానుకూలముగా నున్న దేమో మన మూహింపఁజాలము. "జగత్కారణ మీశ్వరుఁడే. అతఁడే కర్మఫల మిచ్చువాఁడు. దృశ్య మైనజగత్తు భోగ్యము. జీవుఁడు భోక్త. తన్నియంత పరమేశ్వరుఁడు. ఈవిషయ మెఱిఁగి బంధహేతు వగుసంసారమున సక్తుఁడు గాక భక్తిప్రపత్తులతో శ్రీవిష్ణువు నారాధించు జీవుడు ముక్తికాలమున శరీరము విడిచి శంఖచక్రగదాదులు ధరియించి విష్ణుసారూప్యము గాంచి విష్ణులోకమున నివసించును. కాని, యాజీవుని కీశ్వరుని కున్నకర్తృత్వము మాత్రము కలుగదు" అని రామానుజీయసిద్ధాన్తము. అందుచేతనే, జీవేశ్వరభేదవిశిష్ట మయ్యు నీశ్వరసారూప్యరూప మైనయద్వైతమును బోధించునిది విశిష్టాద్వైత మని తన్మతానుయాయులయాశయము.

మాధ్వము :—పూర్ణప్రజ్ఞుఁడు, ఆనందతీర్థుఁడు ననునామాంతరములు గల మధ్వాచార్యు లుద్ధరించుటం జేసి దీనికి మాధ్వ మనుపేరు వచ్చినది. నైయాయికాదితార్కికు లందఱు జీవేశ్వరభేదముపాటించుద్వైతు లైనను, తక్కినమతచిహ్నములనుబట్టి ద్వైతు లనుపే రీమతమువారికే వ్యవహారమున స్థిరపడినది. ఇతఁడు కర్ణాటదేశమండలియుడిప్రిగ్రామమున వేదవేదీమధ్యగేహభట్టులకు జన్మించి, అచ్యుతప్రేక్షుఁ డనుగురువునొద్ద విద్య లభ్యసించినఘనవిద్వాంసుఁడు, ద్వైతమతస్థాపనాచార్యుఁడు. ఇతనిజన్మభూమి యగుటచే నేఁటికిని మాధ్వుల కుడిప్పిగ్రామము పుణ్యక్షేత్రముగా నున్నది. మతసంరక్షణమునకై యితఁడు ద్వైతమతపీఠ మొకటి నెలకొల్పి క్రీ. శ. ౧౧౯౭ లో సిద్ధి పొందెను. ఈయన పుట్టుపేరు వాసుదేవాచార్యులు.

ఆనందతీర్థులకు మాయావాద మన్న మహాద్వేషము. ఇందు కొకకథ కలదు. “ఒకసభలో మాయావాదద్వైతవాదములకుఁ బరీక్ష సంభవించినది. ఆనందతీర్థులు సశిష్యుఁడై యచ్చటికి వెళ్లెను. అతనిని జూచి నంతనే సభ్యులును సభాపతియుఁ గూడ నిశ్చేష్టప్రతిమ లైరి. అద్వైతవాదమునకుఁ బూని వచ్చిన పుండరీకుఁడు నోరెత్తక యూరకుండెను. అపుడు మధ్వాచార్యుఁడు మాయావాదము ఖండించుచు మహోపన్యాస మిచ్చెను. అది విని ప్రతివాది పాఱిపోయెను. అంత నాచార్యశిష్యు లీవృత్తాంతము వర్ణించుచు శ్లోకములు రచించిరి” అనుకథ గలశ్లోకము లతనిగ్రంథమునొకవ్రాఁతప్రతిచివర నున్నవి[1]. ఈకథ సత్యమైనను గాకపోయినను, పైత్రిమతములవారికిఁ గూడ నొకరన్ననొకరికిఁ గిట్ట దనుట సత్యము. వీ రందఱు గూడ మతములయుద్దేశ మేమో తెలియక యే మతాచార పద్ధతులే ప్రధానముగాఁ జూచుకొని యంతఃకలహములపా లగుట నాఁటినుండియుఁ బరిపాటి యైనది. దేశమునకు సంభవించినయనర్థములలో మతవైషమ్య మొకటి యనుట చరిత్రప్రసిద్ధము కదా!

ఆనందతీర్థులు పూర్వోక్తాచార్యులవలెనే సూత్రభగవద్గీతోపనిషత్తులకు భాష్యములు రచియించెను. ఇతనిబ్రహ్మసూత్రభాష్యమున కక్షోభ్యతీర్థునిశిష్యుఁడగుజయతీర్థుఁడు తత్త్వప్రకాశిక యనువ్యాఖ్య వ్రాసెను. ద్వైతమతగురువులలో నీతీర్థుఁ డాఱవపురుషుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౩౮౮ లోఁ బరమపదించినట్లు తెలియుచున్నది. మఱియు నానందతీర్థులు, తత్త్వోద్ద్యోతము ప్రపంచమిథ్యాత్వానుమానఖండనము కృష్ణామృతమహార్ణవము మొదలగుగద్యపద్యరూపగ్రంథములు పెక్కు రచియించిరి. ఇందు మొదటిరెంటికిని జయతీర్థభిక్షువే వ్యాఖ్యలు నిర్మించెను. రఘూత్తమయతి యానందతీర్థునిబృహదారణ్యకభాష్యమునకు వ్యాఖ్య (పరబ్రహ్మప్రకాశిక) రచియించుచు జయతీర్థాదులను బ్రశంసించియున్నాఁడు. విజ్ఞానీంద్రుఁడు మధ్వగురుమత మావిష్కరించుచుఁ బరతత్త్వప్రకాశికను, వ్యాసయతి తర్కతాండవమును, త్రివిక్రమాచార్యుఁడు వాయుస్తుతిని, వేదాంగభిక్షువు దానివ్యాఖ్యను, నిర్మలాచార్యుఁడు ద్వైతసిద్ధిని, వ్యాసతీర్థుఁడు ద్వైతవేదాంతభాష్యటీకను రచియించిరి. ఈవిధముగా ద్వైతసారస్వత మభివృద్ధి గాంచినది. ఆకాలమున నద్వైతమును వీరు ద్వేషించినట్లే ద్వైతము నద్వైతులును

---

1. ఆనందతీర్థపుంసింహో మాయావాదిదితేః స్సుతాన్
విదార్య యుక్తినఖరైరప్రతీతో౽భిభాసతే.
పలాయధ్వం పలాయధ్వం త్వరయా మాయిదానవాః
సర్వజ్ఞహరి రాయాతి తర్కాగమదరారిభృత్. ఇత్యాది.

ద్వేషించుచు వచ్చిరి. వారిలో గణనీయుఁ డప్పయదీక్షితులు మధ్వతంత్రముఖ మర్దనమును, మధ్వముఖభంగమునకు వ్యాఖ్యగా మధ్వవిధ్వంసనమును రచియించెను. ఇట్టిఖండనములు సకలమతములందును గనిపించును. జగత్తు మిథ్య కాదని వాదించెడియీవైష్ణవమతమందలిసార మిది.

"సత్యము జీవాత్ముండును, సత్యం బీశ్వరుఁడు సకలసద్గుణుఁ డతఁడౌ,
సత్యము వీరికి భేదము, సత్యము భేదంబు జీవజడముల కరయన్.
జీవుఁ డస్వతంత్రభావుండు, విష్ణువు సుస్వతంత్రుఁ డతనిసుగుణములను,
పొగడి యతనికరుణఁ బొందినజీవుండు, హరిసమీప మేగు నదియె ముక్తి."

శైవము :—ఇది విష్ణువుస్థానమున శివుని నిలిపినది. ఇందు, పాశుపతము శైవము నని రెండుశాఖలు కలవు. "వైష్ణవమతమున ముక్తి స్వతంత్రము కాదు. కావున దుఃఖమున కత్యంతవినాశము కలుగదు. ముక్తులయ్యును జీవులు నిరంతరము విష్ణుసేవకు లగుటయే యందలిదుఃఖము" అనుచు వైష్ణవమతమును నిరసించి, పరమైశ్వర్యయుక్తమైనమోక్షమునకుఁ బాశుపతమే మూల మని యిది వక్కాణించినది. ఈమతమునందు ముక్తుఁ డైనజీవుఁడు పరమేశ్వరునివలె సకలసద్గుణపూర్ణుఁడై స్వతంత్రుఁడై యుండును. ఆయవస్థలో నీశ్వరుని సేవకుఁడు కాఁడు. పాశుపతవైష్ణవముల కిదియే భేదము. శైవమువలెనే యిదియును లింగస్కాందశివపురాణము లాధారముగా వెలసినయర్వాచీనమతము. దీనికర్తలలో నగ్రగణ్యుఁడు నకులీశుఁడు. బ్రహ్మాదిస్థావరాంతము లైనజీవులు పశువు లనియు, మహేశ్వరుఁడు పశుపతి యనియు నిది చెప్పును.

"అథాతః పశుపతేః పాశుపతయోగవిధిం వ్యాఖ్యాస్యామః" అనుసూత్రము మొదలుగాఁ గలపాశుపతసూత్రములు దీనికి మూలము. కార్యము కారణము యోగము విధి దుఃఖాంతము, అనెడిపంచపదార్థములతత్త్వము విశదీకరించు నీసూత్రము, ఆధ్యాత్మికాదిదుఃఖత్రయవినాశమే ముక్తి యని బోధించును. ఈసూత్ర మాధారముగాఁ బంచార్థభాష్యము దీపిక గణకారిక మొద లగు గ్రంథము లుదయించినవి.

'కర్మాదినిరపేక్షుఁ డైనపరమేశ్వరుఁడు జగత్కారణ' మనెడిపైపక్షమును నిరసించుచు మఱికొందఱు మాహేశ్వరులు, కర్మాదిసాపేక్షుఁ డైనపరమేశ్వరుఁడే కారణ మని నిరూపించుచు, పశువు పశుపతి పాశము నను మూఁడుపదార్థము లేర్పఱిచి తద్వివేకమున జీవుఁడు ముక్తిగాంచు నని శైవతంత్రము లేవనెత్తిరి. దీనికర్తలలోఁ బ్రధానుఁడు బృహస్పతి. మృగేంద్రుఁడు భోజరాజు[1] సోమశంభువు

1. ఇతఁడు ధారానగరాధీశుఁడు కాఁడేమో!

మొద లగువారు తదనుయాయు లైనమతప్రవర్తకులు. శైవతంత్రము పౌష్కరము కరణము తత్త్వప్రకాశము బహుదైవత్యము తత్త్వసంగ్రహము కాలోత్తరము సారభేయము కిరణము మొదలైన వీతంత్రమును బోధించువిశేషగ్రంథములు.

సృష్టి స్థితి సంహార తిరోభావానుగ్రహ కరణము లనెడి యైదుకృత్యము లకుఁ గర్తయు సర్వజ్ఞుఁడు నైనపరమేశ్వరుఁడు పతి. అణువు కానివాఁడును[1] క్షేత్రజ్ఞాదిపదవాచ్యుఁడు నైనజీవాత్మ పశువు. అవిద్యాప్రాప్త మైనపాపము ఫలాపేక్షతోఁ జేయుధర్మాధర్మాత్మక మైనకర్మము మొద లగుబంధహేతువులు పాశము. ఈతత్త్వము లెఱిఁగి పాశవిమోచనము గావించుకొనుజీవుఁడు శివసారూప్యముక్తి నొందు నని జ్ఞానరత్నావళ్యాదిగ్రంథములు చెప్పుచున్నవి.

ఏతాదృశ మైనశైవదర్శనమును నిరాకరించుచుఁ గొందఱు మాహేశ్వరులు ప్రత్యభిజ్ఞాదర్శనమును లేవనెత్తిరి. దీనియుత్పత్తిస్థానము కాశ్మీరము. కాశ్మీరదేశశైవదర్శనమును బ్రతిపాదించుగ్రంథము లనేకములు కలవు.

"సూత్రం వృత్తి ర్వివృతి ర్లఘ్వీ బృహతీ త్యుభే విమర్శిన్యౌ,
ప్రకరణవివరణపంచక మితి శాస్త్రం ప్రత్యభిజ్ఞాయాః"

అనురీతి నీశాస్త్రము సిద్ధ మైనది. ఈదర్శనము నుద్ధరించినవారిలో నగ్రగణ్యులు సోమానందనాథుఁడు ఉత్పలాచార్యుఁడు ఉదయాకరసూనుఁడు మొద లగువారు. మాధవాచార్యులవారీదర్శనమును సంగ్రహించి వ్రాయుచుఁ బూర్వోక్తులను మాత్రమే పేర్కొనిరి కాని, కాశ్మీరశైవసారస్వత మవలోకింప ననేకు లింకను గనవచ్చుచున్నారు.

"ఈశ్వరుఁడు కర్మసాపేక్షుఁడు కాఁడు. స్వేచ్ఛావశమున నే యతఁడు ప్రపంచము సృజించుచున్నాఁడు. అతఁడు సర్వస్వతంత్రుఁడు. ఈజగ మంతయు వేఱు కాదు. తదంతర్గతమే. ఒకచెట్టుకొమ్మలు చెట్టుకంటె భిన్నములు గా వాడఁబడుచున్నను యథార్థదృష్టిలో నవి చెట్టుకంటె నెట్లు వేఱు కావో, అట్లే జీవులు భిన్నులు గా వ్యావహారికదృష్టిలోఁ గనవచ్చుచున్నను; వారు పరమేశ్వరునికి భిన్నులు కారు. పరమేశ్వరుఁడు జీవతాదాత్మ్యము నొందె నన్నవిషయము స్వానుభవము చేతను, అనుమానముచేతను శైవాగమముచేతను దెలియఁగలదు. నే నీశ్వరుఁడనే కాని యన్యుఁడను గా ననెడినిశ్చయజ్ఞానముచే నయ్యెడియాత్మసాక్షాత్కారమే ప్రత్యభిజ్ఞ. అది పరాపరసిద్ధికి హేతువు. దానికై బ్రహ్మచర్యాదికము

---

1. ఇక్కడ రేణువు కానివాఁ డనియర్థము. పశువు లణువు లని మఱియొకచోట నున్నది. అక్కడ జీవులు మాత్మరూపు లని యర్థము.

గాని ప్రాణాయామాదికముగాని యావశ్యకములు కావు. పరసిద్ధి ముక్తి. అపర సిద్ధి దేవలోకప్రాప్త్యనురూప మైనయభ్యుదయము. ఇం దేదైనను సాక్షాత్కారమునుబట్టి యుండును" ఇత్యాదికము వీరిసిద్ధాంతసారము. ఈమతమును బ్రతి పాదించుగ్రంథములు పూర్వోక్తములు గాక యింకను గలవు.

స్పందసూత్ర మనుపేర వసుగుప్తుఁడు రచియించినశైవసూత్రముల కతని శిష్యుఁ డయినభట్టకల్లటుఁడు కారికయు, దానికి రాజానకరాముఁడు వృత్తియు రచియించిరి. భట్టకల్లటుఁ డుజ్జయినీరాజైనయవంతివర్మ యాస్థానములోనివాఁ డగుటచే, క్రీ. శ. ౮౩౦ ప్రాంతమున నుండెననుట విదితము.

"యో నారాయణ ఇత్యభూ చ్ఛ్రుతనిధిః శ్రీకాన్యకుబ్జే ద్విజ,
స్తద్వంశే స్వగుణప్రకర్షఖచితే ముక్తాకణాఖ్యో ఽభవత్,
త స్యైషా సదృ శానుజేన రచితా రామేణ విద్వజ్జన
శ్లాఘ్యత్వా త్సఫలక్రమేణ భగవద్గీతాపదార్థప్రథా"

అనుభగవద్గీతావ్యాఖ్యాంతశ్లోకమునుబట్టియు, నరేశ్వరపరీక్షాప్రకాశమను గ్రంథమందలి 'నారాయణకంఠసూనురామకం'ఠేత్యాది వాక్యమునుబట్టియు, అవంతీవర్మయాస్థానకవులలో ముక్తాకణకవినామము కనవచ్చుటనుబట్టియు, కాన్యకుబ్జనివాసి యగునారాయణపండితునిపుత్త్రుఁడును (సంతతివాఁడు) ముక్తాకణుని తమ్ముఁడును రాజానకోత్పలదేవునిశిష్యుఁడును భగవద్గీతావ్యాఖ్యాతయు నగురాజానకరామకంఠుఁడే భట్టకల్లట కారికకు వ్యాఖ్యరచియించినట్లును, అవంతివర్మకాలమువాఁ డయినట్లును దెలియుచున్నది. కాని బుహ్లారుపండితుఁడు మాత్రము కారణము తెలుపకయే యితఁడు దశమశతాబ్దిలోనివాఁ డని వ్రాసెను.

ఇతనిగురు వైనయుత్పలదేవుఁడు ప్రత్యభిజ్ఞ యనుగ్రంథము రచియించె నని తెలియవచ్చును. ఇతనిమఱియొకశిష్యుఁ డైనరాజానకాభినవగుప్తుఁడు కాశ్మీరశైవదర్శనమైనత్రింశికకు, తత్త్వవివరణ మనువ్యాఖ్య రచించెను. ఇతఁడు గ్రంథావతారికలో వ్రాసినశ్లోకములనుబట్టి యీక్రిందివిషయము తెలియనయ్యెడి.

"కాశ్మీరపాలకుఁ డైనయశస్కరనృపతిమంత్రియు బ్రాహ్మణోత్తముఁడు నగువల్లభునికి శౌరి యనుపుత్త్రుఁ డుదయించెను. శివధ్యానపరతంత్రుఁ డైనయతనికి శంకరధ్యానార్చాపరిచింత నేకరసికుఁ డైనకర్ణుఁ డనుకొడుకు పుట్టెను. అతఁ డాబాల్యముగా సుఖవిముఖుఁడై యౌవనమున విషయాసక్తుఁడు కాక సర్వదా శివతత్త్వజ్ఞానరతుఁడై సంసారనిర్మూలనవిమర్శనపదవి నాశ్రయించి శైవతత్త్వము శోధించుచుండెను. అతనియుపదేశములచేఁ బవిత్ర మైనకాశ్మీరమున కనేక

బ్రాహ్మణులు వచ్చిరి. వారిలో నంతర్వేదినుండి వచ్చినమాతృగుప్తునివంశమున జన్మించినవరాహగుప్తునిపుత్త్రుఁడు చుఖలపండితుఁడు. సంసారవృత్తాంతవిముఖుఁడైనయామహామహునిశిష్యుఁడ నే నభినవగుప్తుఁడను. నాయన్న యగుమనోరథగుప్తుఁడును శివశాస్త్రరసికుఁడై పదవాక్యప్రమాణజ్ఞుఁడైనరామదేవపండితుఁడును సంతోషింపఁ ద్రింశికాతత్త్వవివరణము రచియింపఁ బూనితిని"

దీనినిబట్టి ప్రత్యభిజ్ఞానామక మైనయీశైవము తొలుతఁ గాశ్మీరరాజమంత్రివంశమున నుదయించిన దని స్పష్ట మగుచున్నది. ఈయభినవగుప్తుఁడు పరమార్థసారసంగ్రహము, స్వచ్ఛందనయము ననుమఱి రెండుగ్రంథములు నిర్మించెను. మొదటిదానికి వితస్తాపురీనివాసుఁ డగురాజానకయోగరాజు వ్యాఖ్య వ్రాసెను. ఇవి గాక రాజానకక్షేమరాజపండితుఁ డీశ్వరప్రత్యభిజ్ఞాహృదయ మను తత్త్వవిమర్శనగ్రంథమును స్వచ్ఛందోద్ద్యోత మనుపేర స్వచ్ఛందనయవ్యాఖ్యను రచించెను. ఈపైగ్రంథకర్తలపేళ్లనుబట్టి చూడఁగా రాజానకవంశమునకుఁ జేరిన వారే యెక్కువగా నీదర్శనమున శ్రద్ధ వహించి దీనివ్యాప్తికై పాటుపడి రని తోఁచుచున్నది. ఇట్లు వ్యాప్త మైనయీమతమందును గొందఱు మాహేశ్వరులు దోషము లెంచి రసేశ్వరమతము స్థాపించిరి.

"పరమేశ్వరతాదాత్మ్యవాది యైనశైవమునకును శరీరస్థితికాలమందే జీవన్ముక్తి యభిమత మైనట్లు తెలియుచున్నది గావున శరీరస్థైర్యమునకై పారదాదిశబ్దవాచ్య మైనరస మావశ్యక" మనుచు రసేశ్వరమతదర్శనము వీ రారంభించిరి. "జీవన్ముక్తి కోరునట్టియోగి ముందుగా దేహమును దివ్యముఁ గావించుకొనవలెను. దానికి హరగౌరీసంయోగజనిత మైనరసము ముఖ్యము. రస మీశ్వరబీజము, అభ్రకము గౌరీబీజము. ఈరెంటిని గలిపి యథోక్తముగా సేవించువారికి మృత్యువు లేదు. దేవ దైత్య ముని మానవాదులలోఁ గొందఱు రససామర్థ్యమువల్లనే దివ్యదేహులై జీవన్ముక్తి నాశ్రయించిరి. మహేశ శుక్ర వాలఖిల్య గోవిందభగవత్పాదాచార్యాదు లట్టివారే." అనుచు రసేశ్వరసిద్ధాంతాదిగ్రంథములు చాటుచున్నవి. "రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా నందీభవతి" అను తైత్తిరీయశ్రుతి చెప్పినది సంసారదైన్యదుఃఖతరణోపాయ మైనయీరసమే యనుట సిద్ధము గావునఁ బరబ్రహ్మతుల్య మైనరసమును నిందింపరాదు." అనుచు రసహృదయాదిగ్రంథములు ఘోషించుచున్నవి. కాశ్యాదులలో సర్వలింగముల నర్చించుటకన్న రసలింగార్చనమే శ్రేయస్కరము, భోగారోగ్యామృతప్రద మని మఱియొకకృతి సమర్థించుచున్నది. రసకల్పన విశేష మొకటి యున్నను, తక్కినవిషయములం దిది ప్రత్యభిజ్ఞామతమును బోలియున్నది. ఇవి రెండును జీవేశ్వరైక్యవాదమున

శాంకరమతమును సమీపించుచున్నవి గాని వేదో క్తకర్మాచరణము నివి ప్రశంసింపవు.

పాణినీయదర్శనము :—పాణినికాత్యాయనపతంజలికృతము లైనయష్టాధ్యాయీవార్తికమహాభాష్యములే పాణినీయదర్శనము. ఇదే పరమపురుషార్థసాధన మని తదభినివిష్టుల మతము. దీనిని స్ఫోటవాద మందురు. ఇది ప్రాచీనవాదమే యనుటకు బాదరాయణులు దీనిని 'శబ్దఇతి చే న్నాతః ప్రభవా'దిత్యాది సూత్రమున[1] గ్రహించుటయే నిదర్శనము. ఇట్లు సంప్రదాయసిద్ధ మైనదీనిని హరికృతవాక్యపదీయము మొదలయినయర్వాచీనగ్రంథములు బలపఱచినవి. నిరవయవము నిత్యము నైనస్ఫోట మనెడిశబ్దమే పరబ్రహ్మ మని యది యిట్లు చెప్పెను.

"అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం తదక్షరమ్
వివర్తతే ఽర్థభావేన ప్రక్రియా జగతో యతః"

ఇట్లున్న పదునాఱుదర్శనములసారాంశము గా నీశ్వరవిషయమున నేది యెట్లు చెప్పినదో, అది యంతయు నిచ్చట సంక్షేపించి చూతము.

## ఈశ్వరవాదభేదములు

చార్వాకమం దీశ్వరుఁడే లేఁడు. ఆర్హతమందు సర్వజ్ఞుఁ డైనయర్హన్మునియు, బౌద్ధమునందు సర్వజ్ఞుఁ డైనగౌతమబుద్ధుఁడును దప్ప వేఱె యీశ్వరుఁ డనుకర్త లేఁడు. కాని, బుద్ధునియుపదేశము లీశ్వరాస్తిత్వమున మూకీభావము వహించినవి కాని కంఠోక్తిగా నీశ్వరుఁడు లేఁ డన లే దని తన్మతరహస్యవేత్త లందురు. సాంఖ్యము జీవునికంటె వేఱె యొకపురుషుఁ డున్నాఁ డని యంగీకరింపదు. పూర్వమీమాంస వేదోక్తకర్మకంటె నితర మేదియు ఫల మిచ్చునది లే దని చెప్పుచున్నది. అర్వాచీను లైనమీమాంసకవిశేషులు కొందఱీశ్వరుని భావించినను, ఈమతమున నీశ్వరుఁ డనువాఁడు లేఁ డనియే స్పష్ట మగును. పాణినీయము పరా పశ్యన్తీ మధ్యమా వైఖరులలో, పరారూపశబ్దమే యీశ్వరుఁ డనును. అందుచే విస్పష్టముగా నైతే నేమి? అస్పష్టముగా నైతే నేమి? ఈయాఱుమతములును వేదవేదాన్తప్రతిపాద్యుఁ డైనపరమేశ్వరు నంగీకరింపని నిరీశ్వరము లని తేలుచున్నది.

రామానుజీయము, జీవనియంతయై జీవాంతర్యామియై జీవకృతకర్మముల కర్త యైనఫల మిచ్చునీశ్వరుఁడు జీవునికంటె వేఱుగా నున్నాఁ డని విశ్వసించును. నైయాయికము వైశేషికము మాధ్వము పాశుపతము శైవము ప్రత్యభిజ్ఞ రసేశ్వ

1. బ్ర. సూ. 1. 3-28

రము నను నేడును, ఈశ్వరుఁ డున్నాఁడు కాని, అతఁడు జగత్తున కుపాదానకారణము కాఁడు, కేవలము నిమిత్తకారణ మని నమ్ముచున్నవి. కాని పాశుపతమును బ్రత్యభిజ్ఞయు నీశ్వరునికిఁ గర్మాపేక్షిత్వ మంగీకరింపవు. తక్కినవైయెదును, కర్మసాపేక్షుఁ డగుచునే యీశ్వరుఁడు జగత్తు నిర్మించుచున్నాఁ డని చెప్పును. అయినా, ముక్తి మీఁదేడును జీవుఁ డీశ్వరునికంటె వే అని విశ్వసించినవి, అందుచే నివి ద్వైతము లనుట విదితము. విశిష్టాద్వైత మనెడిరామానుజీయమును, ఈశ్వర సారూప్య మంగీకరించి ద్వైతమే యగుచున్నది. జగత్తున కీశ్వరుఁడు నిమిత్తకారణ ముపాదానకారణము గూడఁ గాఁ డనుయోగమును జీవునికి వేఱుగా నతఁ డుండె నని యంగీకరించుటంబట్టి ద్వైతమే యగుచున్నది. దీనినిబట్టి పైతొమ్మిది మతములును సేశ్వరములు ద్వైతములు నని తేలినది. నిరీశ్వరము లాతే గావున సేశ్వరము లైనతొమ్మిదియు నీశ్వరాస్తిత్వవాదమున గెలిచిన వనవచ్చును గాని, ముక్తి మీఁపదియేనింటి నద్వైత మెట్లు గెలుచు నని యిచ్చట సంశయింపఁ బనిలేదు.

"పరమార్థదృష్టిలో నిర్విశేష నిర్లిప్త నిర్గుణుఁ డైనపరమాత్మ యొక్కఁడే యున్నాఁడు. అతనికి వే తేమియు లేదు. వ్యవహారదృష్టిలో మాయోపాధివిశిష్టుఁ డైనయాపరమాత్మ, స్వప్రాధాన్యమున జగత్తునకు నిమిత్తకారణమును మాయా ప్రాధాన్యమున నుపాదానకారణము నగుచున్నాఁడు. మాయాశ్రితుఁ డై శరీరోపాధివిశిష్టుఁడై జీవాత్మ యనఁబడునతఁడే విజ్ఞానమున స్వస్వరూప మెఱిఁగి బంధ విముక్తుఁ డగుచున్నాఁడు. అదే ముక్తి యనఁబడును" అని సర్వమతవిమర్శన పూర్వకముగా నఖిలమతసారముగా సత్యము బయటఁ బెట్టినయద్వైతసౌధమున కితరమతము లన్నియు మెట్లు గాని వేఱుగావు. సముద్రజల మావిరియై పై కెగసి మేఘమై వర్షరూపమున భూమిపైఁ బడి నదీసంజ్ఞ చెందుచున్నది. ఆనదియే మరల సముద్రమునఁ బడి సముద్రమే యగుచున్నది. అట్లే జీవునివిషయమును, దీనినే మహిమ్నస్తోత్ర మిట్లు వర్ణించినది.

"త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవ మితి
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః పథ్య మితిచ
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం
నృణా మేకో గమ్య స్త్వ మసి పయసా మర్ణవ ఇవ"

శుక్తియందు రజతమును మరుమరీచికలయందు జలము నెట్లాభాసించుచున్నవో, పరమాత్మయందు జగము నట్లాభాసించుచున్నది గాని సత్యము కాదు. ఘటాకాశము మహాకాశమున కెట్లు భిన్నము కాదో, అట్లే జీవాత్మయుఁ బరమాత్మకు వేఱుకాదు. అనునదియే దీనితత్త్వము.

"అఖిలవేదాన్తవాక్యసమన్వయంబు, సకలమతభేదవాదైక్యసాధనంబు,
నైనయద్వైతమును దెల్పు నఖిలగురుఁడు, శంకరాచార్యులకు నమస్కారశతము.
ఆత్మతత్త్వంబు గాంచ మహానుభావు, లెంద ఱెన్నేని మార్గంబు లెఱుఁగఁజేసి,
రైన నవియెల్ల నెప్పటికైనఁ దుదకు, ఘనతమాద్వైతమార్గంబు కలసితీరు.
అపరిణామియు సన్మయుఁ డవ్యయుండు, నైనపరమాత్ముని వివర్తమగునుగాని,
కానవచ్చెడి జగము నిక్కంబు గాదు, తలఁప జీవేశ్వరులకు భేదంబు లేదు."
ఇఁక దర్శనముల కంజలి ఘటించి తక్కినశాస్త్రములు పరిశీలింతము.

ఇది, శ్రీమంథా చెన్నయశాస్త్రి గురువర కరుణాధీతోత్తరమీమాంసా
దర్శనుండును, బ్రహ్మసూత్రార్థదీపికా రజోఽనన్తరవివాహ సంస్కృత
భాషాస్వరూపాది సంస్కృతగ్రంథకర్తయునైన మల్లాది
సూర్యనారాయణశాస్త్రి రచియించిన సంస్కృత
వాఙ్మయచరిత్ర ద్వితీయభాగమగు
లౌకికవాఙ్మయచరిత్రయందు
చతుర్థాధ్యాయము.

---

# పఞ్చమాధ్యాయము



## శాస్త్రములు

వ్యాకరణములు :—ప్రాతిశాఖ్య లనుపేరు గల కేవల వేదవ్యాకరణములను గూర్చి యీచరిత్రము ప్రథమభాగమునఁ జదివియున్నాము. ఇపుడు ప్రధానముగా లౌకికశబ్దముల కనుశాసనము లయినవ్యాకరణగ్రంథములనుగూర్చి ప్రసంగింతము. శబ్దశాస్త్రకర్తలుగా నెనమండుగురు ప్రసిద్ధి కెక్కియున్నారు. వోపదేవునికవికల్పద్రుమ మనెడిధాతుపాఠమునందు వారిని దెలుపుశ్లోక మిట్లున్నది.

"ఇన్ద్రి శ్చన్ద్రిః కాశకృ త్స్నాపిశలీ శాకటాయనః
పాణి న్యమర జైనేన్ద్రా జయ న్త్య ష్టాదిశాబ్దికాః"

వీరిలో నింద్రుఁడు శాకటాయనమునఁ బేర్కొనఁబడెనుగాని, అతనివ్యాకరణ మిపుడు కనరాదు. చంద్రుఁడు పూర్వవ్యాకరణములఁ గనరాఁడు కాని, చాంద్రవ్యాకరణ మున్నది. ఆపిశలి కాశకృత్స్నులష్టాధ్యాయిలోఁ గనవత్తురు. వారిగ్రంథములు లేవు. అమరుఁడు నామలింగానుశాసన మనుశబ్దకోశమునుబట్టి, పైశ్లోకములోనిశాబ్దికులలోఁ జేరెనేమో! అది గాకున్న, నమరకృతవ్యాకరణ మెందును గనరాదు. జైనేంద్రవ్యాకరణము ముద్రితమై యున్నది. పైశ్లోకము వీరినిమాత్రమే పేర్కొన్నది గాని, శాకటాయనమున నుదాహృతు లైన-ఆర్య వజ్రుఁడు—సిద్ధనందియు, పాణినీయమునఁ బేర్కొనఁబడిన—శాకల్య—గార్గ్య—గాలవ—కాశ్యప—స్ఫోటాయన—చాక్రవర్మణ—భారద్వాజ—ప్రభృతులును బ్రాచీన శాబ్దికులే. వారిమతములును బైవ్యాకరణములం దుదాహృతము లై యున్నవి. కాని, వారిగ్రంథములు లేవు. పూర్వోక్తవ్యాకరణములు గాక, అర్వాచీనము లైన కాతంత్ర సారస్వత వ్యాకరణములును లోకమునఁ గలవు. దీనినిబట్టి శబ్దశాస్త్రము కొన్నివేలసంవత్సరములుగా భరతఖండమున బహుముఖములవ్యాపించి వచ్చుచున్నదని తెలియఁగలదు. ఇఁక లభించినశాకటాయనాదులయుదంతము—

శాకటాయనము :—శబ్దానుశాసన మనఁబడు దీనికర్త యగుశాకటాయనుఁడు జైనాచార్యుఁ డైనమహాపండితుఁ డనియు, క్రీ. పూ. తొమ్మిదవ శతాబ్దిలోనివాఁ డై యుండు ననియు నార్హతదర్శనసందర్భమునఁ జదివియున్నాము. ఈవ్యాకరణమునఁ దక్కినయెల్లవిషయము లుండియు, స్వరవైదికవిషయములు లేకపోవుటకూడ నితఁడు తప్పక జైనుఁ డని వెనుకఁ జూపినకారణములకుఁ దోడ్పడు

చున్నది. ఇది సత్యము కావుననే, సర్వలక్షణసంపూర్ణ మైనయావ్యాకరణము పుట్టుకలోనే బ్రాహ్మణసంఘబహిష్కృత మై మూలమూలల నణఁగిపోవుటయు, తరువాత దీనిని జూచి యింతకన్న మనోహరరూపముతోఁ బయలుదేఱినపాణి నీయము వాయువేగమున దేశమునలుఁగడల వ్యాపించుటయు, సంభవించె నని విశ్వసింపవచ్చును. అయిన నిదికూడ జైనమత మభివృద్ధిలో నున్నకాలమున జైన సంఘమందుమాత్రము పఠనపాఠవ్యవహారము గాంచక పోలేదు. ఇందుకు దీని వ్యాఖ్యాత లందఱు నించుమించుగా జైనపండితు లగుటయే నిదర్శనము. ఈవిషయముగూడ మనవిశ్వాసమును స్థిరపఱుచుచున్న దనుటకు సందేహము లేదు. జైనమత మణఁగిపోయిననాఁటినుండియు నవఁగా సుమారువెయ్యేండ్లుగా నేమాత్రము ప్రచారము లేక యిది యందందు పుస్తకాలయములలో నిద్రించుచు, మొన్నమొన్న ముద్రణవశమున మరల లోకముకంటఁ బడినది. అయిన నేమి లాభము? స్థితి మాఱినను గతి యట్లే యున్నది. ఇందుకుఁ బాణినీయము సహస్ర ముఖముల విజృంభించుటయే కారణము.

శాకటాయనకృతి చతురధ్యాయి. ఇందలిసూత్రములు, ౩౨౩౬. దీనికి సూత్రపాఠక్రమము ననుసరించి కాశికావృత్తివంటియమోఘవృత్తియు, చింతా మణి యనులఘువృత్తియు, వ్యాఖ్యలుగా నుదయించినవి. ఇం దమోఘవృత్తికి న్యాస మనువ్యాఖ్యానమును, చింతామణికి మణిప్రకాశిక యనునదియుఁ దరువాతఁ బుట్టినవి. అటుపిదప సిద్ధాన్తకౌముదివంటి ప్రక్రియాసంగ్రహమును, లఘుకౌముది వంటి రూపసిద్ధియు నుత్పన్నము లైనవి. వీనిలో నభయచంద్రసూరికృత మైన ప్రక్రియాసంగ్రహముతో నీవ్యాకరణము సర్వాంగసుందరముగాఁ దోఁచుత, క్రీ. ౧౮౯౩ లోఁ బ్రకటింపఁబడినది[1]. ౧౯౨౧ లో, యక్షవర్మకృతచింతా మణితో, కాశీపురమునఁ బ్రకటిత మైనది[2]. సూత్రపాఠము రెంటియందును గలదు గాని, రెండవదానిలో గణపాఠధాతుపాఠములు గూడఁ గలవు. ఇందలిధాతువులు రమారమి ౧౨౦౦. పాణినిధాతుపాఠమున సుమారు ౧౯౦౦. ఇంతే భేదము. ధాతువులును, వానిక్రమమును, అర్థములును, చాలావఱ కిందున్నట్లే యందున్నవి. ఏధి—ఏధ—అనురీతినిందలియికారాంతములు కొన్ని, అకారాంతములుగా నందు కనఁబడును. కొన్నియర్థము లిందలి వందు కొంచెము మాఱినవి.అంతే కాని, ఇందలి ధాతుపాఠము నందలిధాతుపాఠము నెదుటఁబెట్టుకొని సరిచూచువారికి గణింపఁ దగినభేద మే కనఁబడదు. దీనినిబట్టి పాణినీయధాతుపాఠముగా మనము చదువు చున్నది శాకటాయనధాతుపాఠ మే యని తెలియనగును. అందుకే, పాణిన్యా

---

1. ప్రకాశకుఁడు Guston oppert చెన్నపురిప్రెసిడెన్సీకాలేజి సంస్కృతాధ్యాపకుఁడు.
2. ప్రకాశకుఁడు డాక్టరు జగన్నాథప్రసాదు.

చార్యు లీమాట చెప్పకపోయినను, భగవత్పతంజలి, వైయాకరణు లందఱికిని నామము ధాతుజన్య మని చెప్పినవాఁడు శాకటాయనుఁడే యని చెప్పుచు; ధాతుపాఠము శాకటా యనోపజ్ఞ మనుభావము సూచించియున్నాఁడు[1]. మఱియు నిందలిసూత్రపాఠములోని ౭౨ సూత్రములు సరిగా నట్లే యష్టాధ్యాయిలోఁ బఠితములైనవి[2]. సుమారు రెండువంద లించుక భేదముతో నం దున్నవి. ఇంక గణపాఠములో నిందున్న శబ్దజాల మెంతేని యందు కనఁబడును. ఇందలి 'అఇఉణ్' ఇత్యాదిత్రయోదశసూత్రములే చిన్న చిన్న మార్పులతో నందు ప్రత్యాహార సూత్రములనుపేరఁ బరునాలు గైనవి. ఇంత యేల? దీనిని జక్కఁగాఁ జూచి బయలు దేఱిన దగుటచే సూత్రసన్నివేశము విషయప్రదర్శనము మొద లగున వష్టాధ్యాయిలో సులభపద్ధతి ననుసరించినట్లు కనఁబడును గాని, దాని కంతకును మార్గదర్శకము శాకటాయనమే యనుటకు సంశయము కలుగఁబోదు. వార్త్తికకారవరరుచి తన ప్రాతిశాఖ్యమునఁ బెక్కుచోట్ల శాకటాయనమతము పేర్కొనియుండుటకూడ దీని గొప్పతనమును దెల్పును. ఇట్టిదియును, చూచి చెప్పెనో లేక కర్ణాకర్ణికగా విని చెప్పెనో, అమోఘవృత్తికారుఁడు చెప్పినట్లు[3] మూఁడధ్యాయములకాశకృత్స్న వ్యాకరణమును, ఎనిమిదధ్యాయములయాపిశలివ్యాకరణమును, పూర్వ మున్నను, గార్గ్య శాకల్య భారద్వాజాదులు వ్యాకరణకర్తలుగాఁ దెలియవచ్చుచున్నను, వ్యాకరణనిర్మాణయశస్సు భగవత్పాణినికి దక్కినది. అందు కతఁడర్హుఁ డనుటకు సందేహము లేదు గాని, ఈవిషయమున శాకటాయనుఁడు గూడ మఱవఁ దగిన వాఁడు కాఁడు.

శాకటాయనసూత్రపాఠమందలి యన్నిసూత్రములకును, చింతామణిలో నర్థము కనఁబడుచున్నది. ప్రక్రియాసంగ్రహములో సుమారు వేయిసూత్రముల కర్థము కనరాదు. ఆపట్టపండితుఁ డాసూత్రములకు గుర్తుపెట్టి విడిచెను గాని కారణ మేమియుఁ జెప్పలేదు. పరిశీలింపఁగా లఘువృత్తియైనచింతామణి పెద్దదియైనయమోఘవృత్తికి[4] సంగ్రహ మని యక్షవర్మమాటలవల్లనే విశదమగుచున్నది[5]. అట్టిలఘువృత్తియందే సూత్రపాఠములోని సకలసూత్రముల కర్థము

1. ఉణాదయో బహులమ్. అష్టా. 3. 3–1, భాష్యమున—
2. శాక. 1. 2–187, 189, 190—పాణి. 7. 2–94, 95, 96. ఇత్యాదులు.
3. "అష్టకా ఆపిశలపాణినీయాః త్రికాః కాశకృత్స్నాః చతుష్కా శ్శాకటాయనీయాః"
4. ఆపట్టపండితుఁ డమోఘవృత్తిని రెండవసంపుటముగాఁ బ్రకటింపఁదలఁచితి నని వ్రాసెను గాని, ఆభాగ్యము భాషకుఁ బట్టినది కాదు. అం దన్నిసూత్రముల కర్థ ముండుటచేతనే, ఆపట్టపండితుఁడు సంశయింప లే దని తోఁచుచున్నది.
5. యస్య శబ్దానుశాసనే–ఽ త్యాతిమహతీం వృత్తిం సంహృత్యేయం లఘీయసీ, సంపూర్ణ లక్షణా వృత్తి ర్వక్ష్యతే యక్షవర్మణా.

కనవచ్చుచుండ గురువృత్తియం దుండు ననుటకు సంశయ మేమి? అం దున్న యాసూత్రములు శాకటాయనునివి గాక మతెవరి వగును? కావునఁ బ్రక్రియా సంగ్రహ మనెడినామము సార్థక మగునట్లుగా, అభయచంద్రసూరి గ్రంథవిస్తర భీతిచేఁ గొన్నిసూత్రముల కర్థము వ్రాయక విడిచె నని యూహింపవలసియున్నది. లేదా, అతనికి దొరకినసూత్రపాఠ మసమగ్రమైన దైనఁ గావచ్చును. ఇది యిట్లుండ, ఉణాదిసూత్రములు శాకటాయనుఁడు రచియించినట్లును, వాని కుజ్జ్వల దత్తుఁడు మాధవుఁడు మొదలగువైయాకరణులు టీకలు వ్రాసినట్లును దెలియు చున్నది. దీనిని, చింతామణికర్త యగుయక్షవర్మ, అవతారికలో నిట్లు ధ్రువ పఱుచుచున్నాఁడు.

"ఇంద్రచంద్రాదిభి శ్శాబ్దై ర్యదుక్తం శబ్దలక్షణమ్,
త దిహాస్తి సమస్తం చ య న్నేహాస్తి న తత్ క్వచిత్,
గణధాతుపాఠయో ర్గణధాతూన్, లిఙ్గానుశాసనే లిఙ్గగతమ్,
ఉణాదికా నుణాదౌ శేషం నిశ్శేష మత్రవృత్తౌ విద్యాత్"

ఇట్లితఁడు కంఠోక్తిగాఁ జెప్పినను, గ్రంథవిస్తరభీతిని గాఁబోలును, ప్రకాశకు లుణాదిభాగము ముద్రింపకపోవుటచే సరిచూచుట కవి లభించినవి కావు. అయినను, సూత్రకర్త యుణాదిసూత్రములు గూడ రచియించె ననుట సత్యము. దీనికిఁ దోడుగాఁ బాణిన్యాచార్యు లుణాదిసూత్రములు నిర్మింప లే దని ప్రతీతి యొకటి యున్నది. 'ఉణాదయో బహుళమ్' అనుసూత్రమునకు భాష్యము వ్రాయుసందర్భమందే భగవత్పతంజలి, నామము ధాతుజన్య మని తొలుతఁ జెప్పినవాఁడు శాకటాయనుఁ డని కావించిన ప్రశంస కనఁబడుచున్నది. దీని నంతను బట్టి చూడఁగా, సిద్ధాంతకౌముదిలో ముద్రితము లైనయైదుపాదములయుణాది సూత్రములు శాకటాయనకృతములే యని విశ్వసింపవలసియున్నది. అయిన నీ విషయ మింకను విచారణీయము.

కాశీప్రతిలో, జైనవర్ధమానస్తవాదికముతోడి నాలుగుశ్లోకములు శాక టాయనకృతములుగాఁ గనవచ్చుచున్నవి గాని, అవి వ్యాఖ్యాత వనితోఁచుచున్నది. అం దొకశ్లోకము—సంజ్ఞ—నియమము—అపవాదము—విధి—పరిభాష—అతిదేశము—విషేధము—అధికారము—నిత్యము—వికల్పము—అనునవి శబ్దానుశాసనసూత్రముల పదిగతు లని తెలుపుచున్నది. ఇట్లు సర్వలక్షణసంపూర్ణమైనదీనిమహత్త్వమును దెల్పుచింతామణిస్తవ మిది.

"సర్వశాస్త్రామ్బుధిం బుద్ధి మన్దరేణ ప్రమథ్య యః,
సయశశ్శ్రీ సముద్దధ్రే విశ్వం వ్యాకరణామృతమ్,

స్వల్పగ్రన్థం సుఖోపాయం సంపూర్ణం యదుపక్రమమ్,
శబ్దానుశాసనం సార్వ మర్హాచ్ఛానసవ త్పరమ్"

పాణినీయము :—ఖండఖండాంతరములందు ప్రసిద్ధమై జగ మెఱిఁగిన బ్రాహ్మణుఁడైనయీవ్యాకరణమునుగూర్చి విశేషించి వ్రాయవలసినపని లేదు. తనకుఁ బూర్వ మున్న మహావైయాకరణులమతములనుగూడ గ్రహించి లౌకికశబ్దజాలము నకును వైదికశబ్దములకుఁ గూడ ననుశాసన మైనయీవ్యాకరణము పాణిన్యు పజ్ఞమై పాణినీయ మన్న పేరుగాంచినను, పాణినికాత్యాయనపతంజలిమునులు ముగ్గురుకూడ దీనికిఁ గారకు లగుదు రనుట సుప్రసిద్ధము. ఇందు, పాణినికృతము లైనయష్టాధ్యాయీసూత్రములు ౩౯౮౧. అందలిలోపములను బూరించినవర రుచివార్త్తికములు ౪౨౬౬. వీనిమీఁద లేచినదివ్య సౌధము మహాభాష్యము. అందు విధిరూపము లైనయిష్టులును నిషేధరూపము లైనయనిష్టులును వందలకొలఁదిగా నున్నవి. అవియును దరువాతివ్యాఖ్యాతలకు సూత్రవార్త్తికములవలెనే ప్రమా ణము లైనవి. పాణిని క్రీ. పూ. ౭౦౦ లకుఁ బైవాఁ డనియు, వరరుచికాత్యాయ నుఁడు ౫౦౦ లకుఁ బైవాఁ డనియు, పతంజలి ౩౫౦ ప్రాంతమువాఁ డనియు, ప్రథమభాగమందు నిందునుగూడఁ బెక్కుచోట్లఁ జదివియున్నాము గావున నిఁక వీరికాలముంగూర్చి చర్చింపఁ బనిలేదు. అయిన నించుక—

పండితభాష్యాచార్యులు పతంజలి క్రీ. పూ. తప్పక దశమశతాబ్దిలోనివాఁ డని వ్రాసిరి[1]. మహామహోపాధ్యాయశివదత్తశర్మగారు రాజతరంగిణీవిష్ణువాయు పురాణములలోనిపుష్పమిత్రప్రశంస గలశ్లోకములను బరిశీలించి చంద్రగుప్తపుష్ప మిత్రసభలను బేర్కొన్నపతంజలి క్రీ. పూ. ౬౦౦ ప్రాంతమువాఁ డని నిరూ పించిరి[2]. చంద్రగుప్తుఁడు క్రీ. పూ. ౩౨౧ లో సింహాసన మెక్కెనుగావున నతనిని బేర్కొన్నపతంజలి యంతకుఁ దరువాతివాఁడై యుండు నని కొంద ఱనిరి. పాశ్చాత్యులుకొందఱు క్రీ. పూ. ౧౫౦ ప్రాంతమువాఁ డనిరి. ఎట్లయినను సరి యైనకాల మింతవఱకుఁ దెలియరాలే దనుట స్పష్టము. కాని, రాజతరంగి ణినిబట్టి చూచినను, శాక్యసింహునితరువాత ౧౫౦ సంవత్సరముల కనఁగా, క్రీ. పూ. ౩౩౬ లో రాజైనయభిమన్యుఁడు పతంజలిమహాభాష్యపుస్తకమును

1. **The Age of Patanjali, P. 33.**
2. బొంబాయిప్రతి 1917. మహాభాష్యపీఠిక. దీని కాధారము
"శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే, కలే ర్గతేషు వర్షాణా మభవన్ కురు పాండవాః" రాజతరంగిణి 1-51. దీనియర్థమున మతభేదము లున్నవి—653 అనియు—903_అనియు.

గా శ్రీరమునకుఁ దెప్పించినట్లు తెలియుచున్నదిగావున[1] మన మింతకు ముఖ్ను తలఁచినట్లు మహాభాష్యము ౩౧౦ ప్రాంతమునఁ బుట్టిన దనుట కవరోధ మేమియు లేదు. ఇట్లయినచోఁ బూర్వోక్తములైనపాణినికాత్యాయనగౌతమబుద్ధాదుల కాలములకును గణింపఁదగినవిరోధము సంభవింపదు. ఇఁక హారచరితచింతామణ్యాదులు[2] వర్ణించినమునిత్రయచరిత మతిశయోక్తిభూయిష్ఠముగా నున్నను, అందలి కొన్నివిషయములు సంప్రదాయసిద్ధములు గాఁ గనవచ్చుచున్నవి గావునఁ బాఠక రంజనమునకై వాని నిందు చూపుచున్నాను.

"ఇపుడు లాహోరనఁబడుచున్న 'శలాతురు' మనుగ్రామము పాణినిజన్మభూమి. దాక్షీశలంకు లితనితల్లిదండ్రులు. ఇతనిపే రాహికుఁడు. పాణిని యనునది గోత్రనామము. ఇతఁడు, నందరాజరాజధాని యగుపాటలీపుత్రమున నివసించిన శంకరస్వామికిఁ బుత్త్రుఁడును, పూర్వోత్తరమీమాంసాసూత్రములకు వృత్తులు రచియించినవిద్వాంసుఁడు నైనయుపవర్షునిజ్యేష్ఠసోదరుఁ డగువర్షోపాధ్యాయునిప్రియశిష్యుఁడు. కౌశాంబీనివాసియు వసుదత్తాసోమదత్తులతనయుఁడును, కాత్యాయన గోత్రుఁడును శ్రుతధరనామాంతరుఁడు నగువరరుచియు; వేతసీతీర్థవాసుఁడును నందినీకరంబవాడవులకొడుకును వ్యాడిగోత్రసంభూతుఁడై వ్యాడి యనుపేరఁబిలువఁబడువాఁడును బాణినికి సతీర్థ్యులైనవర్షోపాధ్యాయునిశిష్యులు[3]. వీరిలో వరరుచి పాణినీయవార్త్తికకారుఁడు. పాణినికి మేనత్తకొడుకైనవ్యాడి పాణినిసూత్రములకు లక్షశ్లోకాత్మకమైనసంగ్రహ మనెడివ్యాఖ్యానము రచియించెను[4]. తరువాత, కుణి మొదలగుకొంద ఱాచార్యు లష్టాధ్యాయికి వృత్తులు నిర్మించిరి[5]. అవియును సంపూర్ణవ్యాఖ్యలు గాకపోవుట యెఱింగి భగవత్పతంజలి, పాణినిసూత్రవ్యాఖ్యగా మహాభాష్యము నిర్మించెను."

మహాభాష్యమునకు బహువ్యాఖ్య లుదయించినవి. అందలికొన్నిటికాల మజ్ఞేయముగా నున్నది. కొన్నిటికర్తలు తెలియరాకున్నారు. కొన్నిటినామములు

---

1. తదా భగవతః శాక్యసింహస్య పరనిర్వృతేః, అస్మిన్ మహీలోకధాతౌ సార్ధం వర్షశతం హ్యగాత్, పరార్ధ్యవిభవం శ్రీమా నభిమన్యుపురం వ్యధాత్, ప్రవర్తితం మహాభాష్యం స్వంచ వ్యాకరణం కృతమ్" ఇత్యాది. రాజత. ౧. ౧౭౦—౧౭౬. కలియుగమున శాక్యసింహనిర్వాణకాలము ౨౬౧౫. అనఁగాఁ క్రీ. పూ. ౪౮౬ అగుచున్నది: ఈసమయమును గొందఱు చూపిరి.
2. జయద్రథవిరచితమైనహారచింతామణిలోని 27 వ, సర్గ శబ్దశాస్త్రావతారమును వర్ణించినది. చూ. నవాహ్నికభాష్యము. శివదత్తశర్మగారిపీఠిక.
3. 4. ఈవిషయములు సందిగ్ధములు. సంగ్రహముపే రెవ్వరు నెత్తలేదు.
5. కుణి మొదలగువారికొన్నివృత్తులను, కైయటనాగేశాదులు స్మరించిరి.

గూడఁ దెలియకున్నవి. ఐనను, లభించినయాధారములనుబట్టి వానివిషయము సాధ్య మైనంత తెలిసికొందము.

భర్తృహరిపేరు జగత్ప్రసిద్ధము. తక్కినయన్నిటికంటె నితనికీర్తికి మూల కారణము సుభాషితత్రిశతి. ఈమహనీయుఁడు పాణినీయమున నపారపరిశ్రమ చేసి, పాతంజలమునకు మహాభాష్యత్రిపది మహాభాష్యదీపిక యనుపేళ్ల రెండు వ్యాఖ్యలను, సాంగవైయాకరణసిద్ధాంతనిరూపణ మనఁబడుకారికాత్మక మైన వాక్యపదీయమును నిర్మించి, యంతటితోఁ దనివి తీఱక లక్ష్యలక్షణాత్మకముగా శ్రీరామకథాశ్రయ మైనభట్టికావ్యము రచియించెను. ఇతనివ్యాకరణగ్రంథము లవలోకించి వాని ననుసరించి మహాభాష్యమునకుఁ బ్రదీపవ్యాఖ్య రచియించిన కైయటుఁ డవతారికలో నిట్లు చెప్పియున్నాఁడు.

"భాష్యాబ్ధిః క్వా తిగమ్భీరః క్వా హం మన్దమతి స్తతః
ఛాత్రాణా ముపహాస్యత్వం యాస్యామి పిశునాత్మనామ్,
తథాపి హరిబద్ధేన సారేణ గ్రన్థసేతునా
క్రమమాణః శనైః పారం తస్య ప్రాప్తాస్మి పఙ్గువత్"

కాశ్మీరరాజగుముక్తాపీడునిమంత్రి యైనలక్ష్మణుని వంశములోనివాఁడును భూపతిరాజుపుత్త్రుఁడు నైనహేలరాజు హేలరాజీయ మనుపేర వాక్యపదీయమునకు వ్యాఖ్య వ్రాయుచు, అవతారికలో భర్తృహరి నిట్లు స్తుతించియున్నాఁడు.

"త్రైలోక్యగామినీ యేన త్రికాణ్డీ త్రిపదీ కృతా,
తస్మై సమస్తవిద్యాశ్రీకాన్తాయ హరయే నమః.
సూక్తిశ్రియః స్ఫుటా ఏతా జయన్తి జగతాం గురోః,
హరే ర్భాష్యాబ్ధిపీయూషచ్ఛటాచ్ఛురితవిగ్రహాః"

ఇందలిహరిశబ్దము భర్తృహరినామైకదేశ మనుట వైయాకరణలోక ప్రసిద్ధము. దీనినిబట్టి కైయటహేలరాజులవంటి మహావిద్వాంసులస్తుతికిఁ బాత్రము లై వారికి సహాయము లైనట్లు తెలియవచ్చెడిభర్తృహరివ్యాఖ్యలు తరువాత మఱుఁ గుపడిపోయిన వనుట మిక్కిలి విచారకరము. అట్టి యీతనికాలమునుగూర్చియు భట్టికావ్యకర్తృత్వమునుగూర్చియు మతభేదములు కలవు. వాని నలంకారశాస్త్ర సందర్భమునఁ బరిశీలింతము — మహాభాష్యమున కిట్లు తెలియవచ్చినమూఁడు వ్యాఖ్యలు గాక, నారాయణశేషునిప్రకాశమును, కృష్ణాత్మజనారాయణశేషుని సూక్తిసారమును, జీవదేవపుత్త్రనృసింహునిమఱియొకసూక్తిసారమును, మురారి పుత్త్రలక్ష్మణునియాదర్శమును, శివరామేంద్రసరస్వతి సిద్ధాంతరత్నప్రకాశమును,

సదాశివుని గూఢార్థదర్శినియు, వినవచ్చుచున్నవి. ఇట్లు మహాభాష్యమునకుఁ బది వ్యాఖ్యానము లుదయించినను, కైయటుని ప్రదీపమే లోకమున బహుళవ్యాప్తిని గాంచిన దనుట సుప్రసిద్ధము.

కైయటులును ఉవటులును, ఇద్దఱుచొప్పున వాఙ్మయమునఁ గనవచ్చుటచే, ప్రదీపకర్త యగు కైయటుని కాలమునుగూర్చి పరిశోధకులు సందేహించుట కలదు. కాని యితఁడు క్రీ. ౧౦౭౦—౧౧౪౦ నడుమవాఁ డని నిశ్చయింపవచ్చును [1]. ఈ కైయటుఁడు జైయటపుత్త్రుఁడు కాశ్మీరదేశీయుఁడు మమ్మటునితమ్ముఁడు ఉవ్వటునియన్న. ఈవిషయము భీమసేనపండితుని మమ్మటకావ్యప్రకాశవ్యాఖ్యలో నిట్లున్నది.

"అయం మమ్మటః కాశ్మీరదేశీయో జైయటపుత్త్రః వారణాసీ మాగత్యాధీతశాస్త్రః, అస్యచ మమ్మటస్య పతంజలిప్రణీతమహాభాష్యటీకా కర్తా కైయటః, వేదచతుష్టయ భాష్యకర్తా ఉవటాపరనామా జౌవటశ్చేతిద్వావపి కనిష్ఠ భ్రాతరౌ"

ఈభీమసేనుఁడు క్రీ. ౧౭౨౨ లోనివాఁడు. ఇతఁడుపై మాటలు వినికినిబట్టి వ్రాసినవిగాని గ్రంథాంతరములు పరిశీలించి వ్రాసినవి కావు. అందుచేఁ దక్కినది సరి యైనను, కైయటసోదరుఁ డైనఉవటుఁడు వేదచతుష్టయభాష్యకర్త యను మాటమాత్రము పొరపా టైనది. ఈవిశేషణము నితఁడు వేయుటచేతఁ గైయట మమ్మటకాలనిరూపణము విమర్శకులకుఁ గష్టమైనది. ఈయువటుఁడు గూడ గొప్ప పండితుఁడై గ్రంథములు రచియించియుండవచ్చును గాని, ఋగాదివేదముల ప్రాతిశాఖ్యభాష్యాదులు రచియించినవాఁ డితఁడు కాఁడు. అతఁడు వజ్రటపుత్త్రుఁడు, అవంతీపురనివాసుఁడు, భోజమహారాజుకాలములోనివాఁడు [2].

"ఆనన్దపురవాస్తవ్యవజ్రటాఖ్యస్య సూనునా...,
మంత్రభాష్య మిదం చక్రే భోజేరాజ్యం ప్రశాసతి"

కావున భోజమహారాజునకుఁ బరుఁడును, కావ్యప్రకాశమునకు సంకేతాఖ్య వ్యాఖ్య వ్రాసినమాణిక్యచంద్రునికి (క్రీ. ౧౧౬౦) పూర్వుఁడు నైనమమ్మటభట్టునకు సోదరుఁ డైనమహాభాష్యప్రదీపకర్త యగుకైయటుఁడు [3]. క్రీ. శ. ౧౦౭౦-౧౧౪౦

1. చూ. మదియ సంస్కృత కవిజీవితము. మమ్మటచరిత్ర. పుటలు 200, 201. ప్ర. ముద్ర.
2. చూ. సం. వా. చ. ప్ర. 103, 278, 279, 280, 336, పుటలు.
3. ఆనందవర్ధనాచార్యుని దేవీశతకమునకు వ్యాఖ్య వ్రాసినకైయటుఁడు చంద్రాదిత్య పుత్త్రుఁడు, భీమగుప్త నరపతిరాజ్యములో క్రీ. శ. ౯౭౭ లో జన్మించినవాఁడు.

నడిమివాఁ డనుట విశ్వసనీయము. ఇతని ప్రదీపమునకు, అనంతభట్టు—ఈశ్వరానందుఁడు—నారాయణుఁడు—అనుపండితులు వేఱువేఱుగా వేఱుకాలములందు ప్రదీపవివరణ మనుపేర వ్యాఖ్యలు వ్రాసిరి. హరిరాముఁ డనుమఱియొకవిద్వాంసుఁడు ప్రదీపటీక యనుపేరను, నాగేశభట్టు ప్రదీపోద్ద్యోత మనుపేరను వ్యాఖ్యలు రచించిరి. వీనిలో నుద్ద్యోతముమాత్రమే వ్యాప్తికి వచ్చినది. ఈనాగేశభట్టు సతీశివభట్టులపుత్త్రుఁడు, భట్టోజీదీక్షితునిపౌత్త్రుఁ డగుహరిదీక్షితునియంతేవాసి, శృంగబేరపురాధీశుఁ డగురామభూపాలునియాస్థానములోనివాఁడు, క్రీ. ౧౭౦౦ ప్రాంతమువాఁడు. సకలశాస్త్రసమర్థుఁ డైనయీవిద్వన్మణి వ్యాకరణమున, అష్టాధ్యాయీపాఠము—లిజన్తసంగ్రహము — ధాతుపాఠవృత్తి — బృహతీలఘ్వీభేదమున వైయాకరణసిద్ధాన్తమంజూషలు—పరమలఘుమంజూష — గురులఘుభేదమున శబ్దేన్దుశేఖరములు-శబ్దరత్నము—వైయాకరణకారిక—స్ఫోటవాదము—పరిభాషేన్దుశేఖరము-మొద లగుగ్రంథములు నిర్మించెను. వైయాకరణభూషణము, నేరణివాదార్థము నితని వని కొందఱందురు గాని, యది సందిగ్ధముగా నున్నది. ఇతనిపరిభాషేన్దుశేఖరమునకు, భైరవమిశ్ర—రాఘవేంద్రాచార్య—బ్రహ్మానందసరస్వతీ—శంకరభట్ట—హరిరామాదులు సుమా రిరువదిమందివ్యాఖ్యలు రచియించుటనుబట్టియు, ఇతని మంజూషకు, కృష్ణమిత్ర—దుర్బలాచార్య—రాజారామదీక్షిత — హరిరామ—రామనాథాదులు టీకలు నిర్మించుటనుబట్టియు, అర్వాచీనులలో వ్యాకరణశాస్త్రమున నితనికిఁ గలయున్నతస్థానము విదిత మగుచున్నది. మఱియు నితఁడు, పాతంజలసూత్ర—తర్కభాషా—శబ్దకౌస్తుభ—వేదసూక్త—రామాయణ— కువలయానంద—రసగంగాధర—రసతరంగిణీ — రసమంజరీ—కావ్యప్రదీపాదులటీకలను, ఇష్టికాలనిర్ణయాశౌచనిర్ణయములను, ఆచారేందుశేఖర—తిథీన్దుశేఖర—తీర్థేందుశేఖర—వ్యాససూత్రేన్దుశేఖరాదులను, ప్రయోగసరణీ—కాత్యాయనీతంత్రాదులను, రచియించుటనుబట్టి యితనిసర్వతంత్రస్వతంత్రత స్పష్ట మగును. ఇట్టిమహావిద్వాంసునిశిష్యులలో, పాయగుండం వేణీమహాదేవులపుత్త్రుఁ డగువైద్యనాథుఁడు బహుగ్రంథకర్తృత్వమునఁ గీర్తిగన్నవాఁడు. అతఁడు, గురువుగారియుద్ద్యోతమునకును, మంజూషాపరిభాషేందుశేఖర లఘుశబ్దేందుశేఖరశబ్దరత్నములకును; శబ్దకౌస్తుభాదులకును, టీకలు రచియించి, వృద్ధశబ్దరత్నశేఖరపరిభాషేన్దుశేఖరసంగ్రహాది బహుకృతులు నిర్మించెను. ఇఁక—

మహాభాష్యము కంఠస్థము గావించినవారును, క్రీ. ౬౫౦ ప్రాంతమువారు నగువామన జయాదిత్యపండితు లిరువురు పాణినిసూత్రములయర్థము సులభముగా వివరింపఁబూని కాశిక యనుపేర నొకవృత్తి రచియించిరి. ఇంతకు మున్నున్న వృత్తులు, నామపారాయణధాతుపారాయణాదులసంగ్రహరూప మైనయిది యుదయించినపిదప మఱుఁగుపడినవి. వానిలో ధాతుపారాయణము రచియించిన పూర్ణ

చంద్రుఁడు జ్జ్వలదత్తసాయణమాధవాదులపొగడ్త గాంచినవాఁడు. అయినను నేఁడు అతనిధాతుపారాయణము పఠనపాఠవ్యవహారమునకుఁ దొలఁగినది. కాశికావృత్తికి వ్యాప్తి వచ్చినది. ఈవృత్తికి వ్యాఖ్యలుగా, ఉపమన్యుపండితుఁడు తత్త్వవిమర్శినియు, జినేంద్రబుద్ధి న్యాసమును, హారదత్తుఁడు పదమంజరియు, మఱియొకరు చికిత్సయు నిర్మించినట్లు కనఁబడుచున్నది. ఇందు న్యాసమునకు వ్యాఖ్యలుగా మైత్రేయరక్షితుఁడు తంత్రప్రదీపమును, మల్లినాథుఁడు న్యాసోద్ద్యోతమును; పదమంజరికి వ్యాఖ్యలుగా శివభట్టు కుంకుమవికాసమును, రఘునాథుఁడు మకరందమును రచియించినట్లు తెలియుచున్నది. ఇట్లు పెక్కండ్రు పండితుల నాకర్షించిన కాశికావృత్తి వ్యవహారములో నుండఁగా, విద్యార్థుల కెక్కువయుపయోగపడు పద్ధతిని, క్రీ. ౧౪౫౦ ప్రాంతమున రామచంద్రాచార్యుఁడు ప్రక్రియాకౌముది నిర్మించెను. ఈరెంటిని జదివియు మహాభాష్యము పెక్కుసార్లు పఠించియు, కాశికావృత్తి విడిచినధాతూణాదిఫిట్స్వరపాఠలింగానుశాసనాదులను గూడ గ్రహించి, అష్టాధ్యాయీక్రమమున ముందుశబ్దకౌస్తుభమును, తరువాత శబ్దరూపనిష్పత్తి కనుగుణముగా సూత్రక్రమము మార్చి పన్నెండువేలగ్రంథముగా సిద్ధాన్తకౌముదిని, భట్టోజీదీక్షితులు నిర్మించెను. విద్యార్థులపుణ్యమో యన నితని కౌముది చల్లగా వ్యాపించినపిదపనే వ్యాకరణాభిలాషులకు శబ్దప్రక్రియ సుఖముగా గోచరించిన దనుటకంటెఁ బాణినీయమున నితనికిఁ గలయర్థస్థానమును వేఱుగా నిరూపింప నక్కఱలేదు. క్రీ. ౧౬౪౦ ప్రాంతమువాఁ డయినయీఘనుఁడు తన కౌముదికి, ప్రౌఢమనోరమావ్యాఖ్య నిర్మించి, అద్వైత-తంత్ర—ఆగమ—ధర్మ—జ్యోతిరాదివిషయకము లైనముప్పదియితరగ్రంథములు రచియించెను.

రామచంద్రాచార్యుని ప్రక్రియాకౌముదికి, అమృతసృతి తత్త్వచంద్ర—ప్రకాశ—ప్రక్రియాంజన—సత్ప్రక్రియావ్యాకృతి—ప్రసాదము లనునాఱువ్యాఖ్యలు పుట్టినవి. వీనిలోఁ గడపటిది రామచంద్రాచార్యునిపౌత్రుఁ డగువిఠలపండితునిది. దీక్షితులసిద్ధాంతకౌముదికి, తత్త్వబోధినీ—దధిమథీ—ఫక్కికాప్రకాశ—బాలబోధ—బాలమనోరమా — మానసరంజనీ — రత్నాకర[1] —రత్నార్ణవ — విలాస — శబ్దేన్దుశేఖర[2]—శబ్దసాగర—సుబోధినీ—సుమనోరమాదులు రమారమి యిరువదివ్యాఖ్యలు వెలసినవి. వీనిలో వాసుదేవదీక్షితుని బాలమనోరమయు, నాగేశభట్టులఘుశబ్దేన్దుశేఖరమును, జ్ఞానేంద్రసరస్వతితత్త్వబోధినియు, మూలకర్త ప్రౌఢమనోరమయు నెక్కువవ్యాప్తి గాంచినవి. ప్రౌఢమనోరమకుఁ గృష్ణమిత్రపండితుఁడును,

1. ఈపేర, రామకృష్ణుఁడు, శివరామేంద్రసరస్వతియు రచియించినవి రెండు.
2. గురు—లఘుభేదముగల యివి రెండు నాగేశభట్టువి.

హరిదీక్షితుఁడు ననుకూలవ్యాఖ్యలు రచియించిరి. పండితకృష్ణచక్రపాణ్యాదులు కొందఱు ఖండనములు వ్రాసిరి. పండితరాజజగన్నాథుఁడు మనోరమాకుచమర్దన మనుపేర నిర్మించిన ఖండనము భట్టోజీదీక్షితకాలమందే వెలువడెను. దీక్షితుల శబ్దకౌస్తుభము సమగ్ర మేమో కాని, యందలిప్రథమాధ్యాయప్రథమపాదము మాత్రమే నిలచియున్నది. దానికి, నాగేశ వైద్యనాథాదు లుద్ద్యోతప్రభాభావ ప్రదీపాదివ్యాఖ్యలు నిర్మించిరి. భాస్కరపండితుఁడు శబ్దకౌస్తుభదూషణము రచించెను. భట్టోజీదీక్షితునికొడుకు భానుజీదీక్షితుఁడు రచియించినయమరకోశవ్యాఖ్య తప్ప వ్యాకరణగ్రంథ మేదియుఁ గనరాదుగాని, పౌత్రుఁ డనేకగ్రంథములకర్తయై వన్నెగాంచె నని యింతకు మున్నుచదివి యున్నాము. దీక్షితునియన్నకుమారుఁడు కౌండభట్టు వైయాకరణభూషణ—భూషణసార—లఘుసార—సిద్ధాన్తదీపికా — స్ఫోట వాదాదిగ్రంథములు నిర్మించెను.

భట్టోజీదీక్షితునిసిద్ధాన్తకౌముదిగూడ దురవధేయముగా నున్న దని తలఁచి, ఇతనిశిష్యుఁ డగువరదరాజపండితుఁడు—సారకౌముదీ—మధ్యకౌముదీ—లఘుకౌముదీ—నామముల దానిసారము సంగ్రహించియు, గీర్వాణపదమంజరి యను పేర స్వతంత్రగ్రంథము రచియించియుఁ బాణినీయసేవ యొనరించెను. ఇందు మధ్యకౌముదికి మధ్యమనోరమా మధ్యకౌముదీ విలాసము లనువ్యాఖ్యలును, లఘుకౌముదికిఁ బ్రకాశ—వైయాకరణసిద్ధాన్తచంద్రోదయవ్యాఖ్యలును జనించినవి.

మఱియు, ధారానగరాధీశుఁ డగుభోజమహారాజు కాశికావృత్తిమహాభాష్యముల ననుసరించి శబ్దానుశాసనమును, విద్యానగరాధీశబుక్కభూపతిమంత్రి యగుమాధవాచార్యులు ధాతువృత్తియు నిర్మించిరి. కాని, ఇవియు వ్యవహారమున లేవు. ఇట్లు మహావటవృక్షముగా వర్ధిల్లినపాణినీయమున కష్టాధ్యాయి బీజము. ఇం దుదయించినగ్రంథములు వానివ్యాఖ్యలు, అనువ్యాఖ్యలు ననంతములు[1]. ఇపుడు హెచ్చుగాఁ బఠనపాఠవ్యవహారమున నున్న వేయిరువదియో కాని, తక్కినవందలకొలఁదిపుస్తకములు చూచెడిదిక్కు లేక స్వదేశవిదేశపుస్తకాలయములలో నణఁగియున్నవి. ఇందే కాదు, తర్కవేదాన్తశాస్త్రములందును మంచిపాండిత్య మార్జించినపండితు లెల్లరు నేదోయొకగ్రంథము వ్రాయుచునే వచ్చిరి. అందుచే విషయభేద మిసుమంత యైనను గ్రంథసంఖ్యమాత్రము మేరువంత యైనది. తక్కినకొన్నిశాస్త్రములందువలెనే వ్యాకరణమందును, ఇద్దఱాంధ్రులు గ్రంథములు రచియించి ఖ్యాతి గాంచిరి. వారిలో దండిభట్టవిశ్వనాథశాస్త్రిగారమలాపురప్రాంతవాసులు. సుప్రసిద్ధకాశీపండితు లగువీరు వాక్యార్థచంద్రిక

1. See Catalogus Catalogorum by Theodor Aufrecht.

నిర్మించి క్రీ. ౧౮౯౦ ప్రాంతమున దివంగతులైరి. రెండవవారు భాగవతుల హరిశాస్త్రిగారు. వీరు కోటిఫలినివాసులు కాశీపండితులు, విజయనగరసంస్థానపోషితులు. వారిదీక్షితునిలఘుశబ్దరత్నమునకుఁ జిత్రప్రభ[1] యనుపేర వ్యాఖ్య నిర్మించిన యాపండితుఁడు క్రీ. ౧౮౯౯ లో స్వర్గస్థుఁ డయ్యెను. వీ రిద్దఱే కాక మఱికొందఱు పూర్వు లాంధ్రులు వ్యాకరణగ్రంథములు రచియించినట్లు వినికి కలదు గాని, అవి లభింపకున్నవి.

జైనేన్ద్రవ్యాకరణము :—దీనికర్త దేవనందిముని. ఇతఁ డెప్పటివాఁడో చెప్పఁజాలము గాని, అష్టాధ్యాయిలోని పెక్కుసూత్రము లిందుండుటచే[2] నిది దాని కర్వాచీన మగుట స్పష్టము. ఇది పూర్వవైయాకరణుల నెవ్వరిని బేర్కొనలేదు. జైనుఁ డగుటచే శాకటాయనునిమత మైన నెత్తవలసియుండెనుగాని, దీని కాలమున నతనిశబ్దానుశాసన మణఁగియుండి దీనికి గోచరింపక యుండవచ్చును. ఈవ్యాకరణపద్ధతి చూడఁగా మిక్కిలి యర్వాచీనమై మహాభాష్యముగూడ నవతరించినపిదపనే పుట్టినట్లు తోఁచుచున్నది. ఇది రెండధ్యాయములగ్రంథము. ఇందు ౧౦౩౯ సూత్రము లున్నవి. దీనికి సూత్రక్రమ మనుసరించి, అభయనందిముని మహావృత్తి రచియించెను. ఈపేరే దీనికి ముం దొకవృత్తి యున్నట్లు తెలుపుచున్నదిగాని యది కనఁబడదు. ఈవృత్తితోఁడి యీవ్యాకరణము లోకముకంటఁబడక నామమాత్రావశేషమై యుండఁగాఁ గాశీనివాసు లగుమహామహోపాధ్యాయవింధ్యేశ్వరీప్రసాదుగారు క్రీ. 1918 లో దీనిప్రతి యొకటి సంపాదించి ప్రకటించిరి. దీనివ్యాఖ్యాత యగునభయనంది పాణినీయము చదివినవాఁ డని యతని వాక్యరచనవల్లనే విశద మగుచున్నది.

కాతంత్రవ్యాకరణము :—దీని కనేకులు వృత్తులు టీకలు రచియించిరి కాని, ఒకఁడును దీనికర్త యితఁ డని నిర్దేశించి చెప్పలేదు. కాతంత్రచంద్రికాకారుఁడు "నను కాతన్త్రశబ్దః కౌమారవ్యాకరణే రూఢః శాస్త్రాన్తరే దృష్టత్వాత్" అనుచు నిది కుమారస్వామి రచియించిన దని చెప్పియున్నాఁడు. వ్యాఖ్యాసారకర్త యగుహరిరామపండితుఁడు 'కాతంత్రస్య కలాపసూత్రస్య' అన్నాఁడుకాని, కలాపుఁ డెవఁడో వివరింపలేదు. వృత్తికారులు పెక్కంద్రు, "తంత్ర మనఁగా సూత్రాత్మకవ్యాకరణము. అది చిన్నది యగుటచే, కాతంత్ర మైనది" అని కాశబ్ద మల్పార్థక మని మాత్రము దెలిపిరి. లోకములో, కుమారస్వామి, ఆంజనేయుఁడు మొదలగువారు వ్యాకణములు రచియించినవా రని కింవదంతి గలదు. ప్రాచీన

1. దీనిని, ఆంధ్రవిశ్వకలాపరిషత్తువారు ప్రకటించిరి.
2. జై. 1. 3-1, 43, 89, 90, సమర్థః పదవిధిః ఇత్యాదులు కుమారనంద.

మైనయావదంతియే యీశ్వరపుత్రుఁ డైనకుమారస్వామి కీవ్యాకరణము నంటఁ గట్టిన దని తోఁచుచున్నది. అందుచే దీనికర్తృత్వ మనిర్దేశ్య మగుచున్నది.

ఇది నాలుగధ్యాయములకృతి. ఇందు ౧౩౯౭ సూత్రము లున్నవి. సంజ్ఞాదికృదంతము లైనవివిధప్రకరణములు కలవు. ధాతుపాఠగణపాఠము లుణాదులు లేవు. దీనికి శర్వవర్మ దుర్గసింహుఁడు త్రిలోచనదాసుఁడు కవిరాజు హరిరాముఁడు మొదలగువారు వ్యాఖ్యలు రచియించిరి. దీనినిబట్టి వెనుకఁ గొంతకాల మిది వాడుకలో నుండె నని తెలియనయ్యెడి. అష్టాధ్యాయిలోని బహుసూత్రము లిం దుండుటంబట్టి యిది యర్వాచీన మని తెలియుచున్నది. ఇంతకంటె దీనికాలము తెలియ నాధారములు లేవు. ఇది తనకు మున్నున్నవ్యాకరణములను గాని తత్కర్తలను గాని మఱియేగ్రంథములను గాని పేర్కొనలేదు.

సారస్వతవ్యాకరణము :—ఇది, అనుభూతిస్వరూపాచార్యప్రణీతము. దీని యుత్పత్తిని గూర్చి యొకచిన్నకథ కలదు. "ఈయాచార్యుఁ డొకనాఁడు విద్వత్సభ కేగి సంభాషించుచుఁ బ్రమాదవశమున 'పుంక్షు' అని ప్రయోగించెను. అది విని తక్కినపండితు లపశబ్దము ప్రయోగించితివి 'పుంసు' అనునది సప్తమీబహువచనరూపము, అనుచుఁ బరిహసించి, నీవు ప్రయోగించిన దెట్లు సాధు వగునో చూపు మనిరి. అంత నతఁడు రేపు చెప్పెద నని యింటికిఁ బోయి యారాత్రి సరస్వతీదేవిని బ్రార్థించెను. ఆమె ప్రత్యక్షమై యతనికి వర మిచ్చెను. అంత నతఁడు దేవిపేరనే సారస్వతవ్యాకరణము రచియించెను."

ఈకథ, యిందు 'పుంస్' శబ్దమునకు సాధింపఁబడినసప్తమీబహువచనరూప మగుపుంక్షుప్రయోగమునుబట్టి [1] యెవరో కల్పించినదై యుండును. ౧౪౯౩ సూత్రములతోడిదీనియందు సంజ్ఞాదిక్త్వాప్రత్యయాంతప్రకరణములు పెక్కు కలవు. దీనిరచనము సిద్ధాంతకౌముదీ రచనమువలెఁ గనిపించునుగాని దానికంటె నిదే పూర్వము. ఇం దష్టాధ్యాయిలోనిసూత్రములు వంద లున్నవి.

చాంద్రవ్యాకరణము [2].—ఇది చంద్రగోమి యను బౌద్ధపండితుఁడు నిర్మించినది. ఇది సూత్రములు ధాతుపాఠము ఉణాది, అనుమూఁడుభాగములుగా నున్నది. సూత్రములసంఖ్య ౩౦౮౦. అధ్యాయమునకు నాలుగుపాదముల చొప్పున నివి యాఱధ్యాయములుగా నున్నవి. ఇందలిమొదటిపదునాలుగుసూత్రములును, పాణినీయములోనిమాహేశ్వరచతుర్దశసూత్రములే. ఇందలిధాతువులసంఖ్య ౧౦౬౪.

---

1. అసంభవే పుంసః క క్వా. సూ. 300,
2. ఇది జర్మనీదేశమున నచ్చుపడినది.

భూసత్తాయా మిత్యాదిగా నిందలిధాతువులు కొన్నివందలు పాణినీయధాతుపాఠములో నున్నట్లే యున్నవి. మూఁడుపాదములయుణాదిలో ౩౨౮ సూత్రములున్నవి. ఈగ్రంథము మూలముమాత్రము ముద్రిత మైనది. వ్యాఖ్యానములున్నట్లు వినవచ్చును గాని కనఁబడవు. ప్రధానగ్రంథమందలిసూత్రములలోఁ గొన్నివందలు పాణినిసూత్రముల ననుకరించినవే కాని వేఱుకావు. 'ఆదిరన్త్యేన సహేతా' అనుపాణినిసూత్ర మిందు 'ఆది రితా స మధ్యః' అనువిధమున మాఱినది. అర్థము రెంటికి నొకటే. 'జాయాయా నిఙ్' ఇత్యాదులు సరిగాఁ బాణినీయములోనివే యిందున్నవి.

దీనికర్త యైనచంద్రగోమి క్రీ. ౪౭౦ ప్రాంతమువాఁడు. ఇతఁడు వాగీశ్వర మంజుఘోష బుద్ధ ప్రార్థనము గావించుటయు,

"సిద్ధం ప్రణమ్య సర్వజ్ఞం సర్వీయం జగతో గురుమ్,
లఘు విస్పష్టసంపూర్ణ ముచ్యతే శబ్దలక్షణమ్,

అని మంగళాచరణ మొనర్చుటయు నితనిబౌద్ధత్వమును దెలుపుచున్నవి. ఇట్లింకను గొన్ని వ్యాకరణగ్రంథములు కలవు. ఇట్టి వన్నియుఁ బాణినీయము సాధింపనికొన్నిశబ్దములు సాధించుటకును, దానిచే సాధువులు కానికొన్నిశబ్దములకు సాధుత్వము సమకూర్చుటకు నుద్యమించిన వయ్యు, ఆపని చేసి విడువక, పాణినీయము చేసినపనిగూడ యథాశక్తి మరలఁ జేసినవి. అందుచే వీనియందు కొంచెము నూతనత్వ మున్నను, పాణినీయమునెదుట వీనికిఁ బ్రామాణ్యము సిద్ధించినది కాదు. ఐనను భాషలోఁ గలిగినమార్పుల కనుశాసనము చేయుట యనెడి వీనిగుణము శ్లాఘ్యమే.

## జ్యోతిశ్శాస్త్రము.

వేదచక్షు వైనదీనిప్రాచీనత యొకింత ప్రథమభాగమునఁజూపఁబడినది[1]. తొల్లి, రాశి దైవ నక్షత్రవిద్య లని వ్యవహరింపఁబడిన దీనికి లగధముని నిర్మిత మైనవేదాంగజ్యోతిష మాద్యగ్రంథముగాఁ గనఁబడుచున్నది. ఋగ్యజుస్సులు రెంటికి నంగ మైనయది సోమాకరసుధాకరులభాష్యములతో ముద్రిత మైనది[2]. వృద్ధవసిష్ఠాదులపేరఁ గూడఁ గొన్నిగ్రంథము లున్నవి కాని, యవి వారిసంప్రదాయ మాధారముగాఁ దరువాత వెలసిన వని యందలివిషయమును శైలియుఁ గూడఁ జెప్పుచున్నవి.

---

1. సం. వా. ప్రథ. 272–286 పుటలు.   2. సం. వా. ప్రథ. 287 పుట.

జ్యోతిర్విజ్ఞాన మంతయుసిద్ధాంత (గణిత) జాతకసంహితాస్కంధము లనఁ ద్రివిధముగా నావిర్భవించినది. గ్రహములమధ్యమ స్ఫుట భుక్తులు దిక్సంధి లగ్న కాలములు సూర్యచంద్రగ్రహణములు గ్రహసమాగమము యుద్ధభేదములు భగ్రహములయుతులు ఉదయాస్తమయములు పాతవైధృతములు భూగోళము యంత్రములు మానక్రియ తద్భేదములు మొద లగుగణితసాధ్యము లైనవిషయము లన్నియు సిద్ధాంతభాగమునకు సంబంధించినవి. రాశిభేదము ఖేటయోని వియోని జన్మలక్షణము నిషేకజననాదులు ఆయుర్దాయము దశాంతర్దశాదులు అష్టకవర్గము కర్మజీవము రాజయోగములు ద్విగ్రహాదియోగములు రాశిశీలము భావఫలము మొద లగుమానవాదృష్టఫలవాచకము లయినబహువిషయములు జాతకస్కంధమునకుఁ జేరినవి. శాస్త్రోపనయనము గ్రహములచారములు అబ్దలక్షణము తిథివాసరనక్షత్రయోగకరణాదులు ముహూర్తము' అవగ్రహము సూర్యసంక్రాంతి గోచారక్రమము చంద్రతారాబలములు ఉత్పాతలక్షణములు వానిశాంతులు షోడశకర్మక్రియలు యాత్ర సద్మలక్షణము మొదలగుననేకవిషయములు సంహితాస్కంధమునకు సంబంధించినవి. ఏతాదృశలక్షణలక్షిత మైన యీశాస్త్రమునకు, సూర్యుఁడు పితామహుఁడు వ్యాసుఁడు వసిష్ఠుఁడు శాకల్యుఁడు అత్రి పరాశరుఁడు కశ్యపుఁడు నారదుఁడు గర్గుఁడు మరీచి మనువు అంగిరసుఁడు రోమశుఁడు పులహుఁడు చ్యవనుఁడు యవనుఁడు భృగువు శౌనకుఁడు, అను పందొమ్మండుగురు ప్రవర్తకు లని దైవజ్ఞవిలాసము చెప్పుచున్నది. పౌలిశ రోమక వాసిష్ఠ సౌర పైతామహము లనెడియైదుసిద్ధాంతములు పూర్వము లని వరాహమిహిరాదులు చెప్పుచున్నారు. మఱియు వరాహమిహిరాచార్యులు బృహజ్జాతకమున సంహితాస్కంధకర్త లగుపరాశర సత్యాచార్య మయ యవన మణిత్థ విష్ణుగుప్త దేవస్వామి సిద్ధసేన జీవశర్మలమతముల నుదాహరించి యున్నాఁడు. ఇందు, పౌలిశాదిసిద్ధాంతములను, పరాశరాదులకృతులను వరాహమిహిరుఁ డెఱిఁగియున్నాఁ డనుటకు సంశయము లేదు. దైవజ్ఞవిలాసము పేర్కొన్న శాస్త్రప్రవర్తకు లందఱును శాస్త్రగ్రంథకర్త లనుటకు వీలులేదు గాని వారి పేరను గొన్నిగ్రంథము లుండియుండు ననవచ్చును. ఎట్లయిన నేమి? అపూర్వ గ్రంథములలోఁ గొన్నిమాత్రమే యిపుడు సజీవములై యున్నవి. వరాహమిహిరునికాలము మొదలుగా మొన్నమొన్నటివఱకు నుత్పన్నము లైనజ్యోతిషగ్రంథములకు లెక్కలేదు. కాని యిందును వ్యాప్తికి వచ్చినవి తక్కువ. పుస్తకభాండాగారములలో నణఁగిపోయినవి యెక్కువ. అయిన నేమి? ఈశాస్త్రము చిరకాలము రాజావలంబనమును బ్రజాదరమును గూడఁ గాంచి మిక్కిలి యభివృద్ధికి వచ్చి సర్వతోముఖముగా భరతఖండమంతట వ్యాపించిన దనుట నిరాక్షేపము. ఈకాలమందువలె ఖగోళపరిశీలనమునకు సుఖసాధనములు లేనియాకాలమునం

దాముసీశ్వరులు విశేషపరిశ్రమ చేసి గ్రహనక్షత్రాదులగతులు పరిశీలించి కావించినయాసిద్ధాంతములు నేటి నాగరికఖగోళవిజ్ఞాతలసిద్ధాంతములకు సరిపోవుచున్న వనుటకంటె జ్యోతిర్విజ్ఞానమందలి భారతీయవిద్వాంసులయుపజ్ఞను వేఱుగాఁ బ్రశంసింప నక్కఱలేదు. అట్టిపురాతనజ్యోతిర్విజ్ఞానఖని యగునీశాస్త్రమందలి సిద్ధాంతస్కంధగ్రంథములనుగూర్చి ముందుగాఁ గొంత తెలిసికొందము.

ఇపుడు కనఁబడుచున్న ప్రాచీనగ్రంథములలోఁ బంచసిద్ధాన్తములలోనివిగాఁ బూర్వులు గణించినవి సూర్యసిద్ధాంతము వసిష్ఠసిద్ధాంతము. ఇందు మొదటిది [1] మయునితపస్సునకు మెచ్చి సూర్యుఁడు స్వాంశపురుషు నాజ్ఞాపింపఁగా నతఁడు మయునికిఁ జెప్పినట్లున్నది. రెండవదానినామాంతరము విశ్వప్రకాశము. ఇది వామదేవుఁడు ప్రార్థింపఁగా వృద్ధవసిష్ఠుఁడు రచియించిన ట్లవతారిక చెప్పుచున్నది. కొన్ని స్మృతులు ప్రాచీనమహర్షులపేర వెలసినట్లే యిదియును వసిష్ఠునిపేర వెలసినదిగా దీనిశైలియు నిందలివిషయమును జెప్పుచున్నవి. అయినను, ఇది కూడఁ గ్రీస్తుశకమునకు మున్నే యుదయించియుండును. ఈరెండునుగూడ మూఁడు స్కంధములను బూర్తిగా వివరించినమహాగ్రంథములు. ఇందు సూర్యసిద్ధాంతము ముద్రితమైనదిగాని రెండవది ముద్రితమైనట్లు కనఁబడదు. అందలిగణితస్కంధము సజీవమై దృగ్గోచర మగుచున్నది.

సూర్యసిద్ధాంతమే సౌరసిద్ధాంత మనఁబడును. ఇది పదునాలుగధికారముల గ్రంథము. దీనిపూర్వవ్యాఖ్య లేవియుఁ గనరావు గాని, ఇది దేశమునలుఁగడల వ్యాపించిన దని మాత్రము తరువాతిగ్రంథము లన్నియు దీనిని బ్రశంసించుటచేతనే తెలియుచున్నది. దీనియర్వాచీనవ్యాఖ్యలలో భూధరుఁడు (క్రీ. ౧౫౭౨) రచియించినవివరణమును, గోజీదేవీబల్లాలపుత్త్రుఁడగురంగనాథుని (౧౬౦౩) గూఢార్థప్రకాశకమును, నృసింహగణకుని (౧౬౨౦) వాసనాభాష్యమును, దాదాబాయి(౧౭౧౯) పండితుని సౌరసారచంద్రకిరణావళియు చోళసూరి యల్లయార్యుఁడు అమరేద్యుఁడు భైరవుఁడు మొదలగువారు రచియించినవ్యాఖ్యలును గనఁబడుచున్నవి. గ్రహస్ఫుటాదికమున సిద్ధాంతులు దీని నెక్కువప్రమాణముఁగా గ్రహించుచు వచ్చి రనుటయే దీనిమహత్త్వమునకుఁ దార్కాణము. ఇట్టియీరెండుసిద్ధాంతములకును బూర్వమో పరమో నిర్ణయింప నాధారములు లేవు గాని, బ్రహ్మపైతామహ నామముల మఱియొకప్రాచీనసిద్ధాంతగ్రంథము కలదు. శాకల్యసంహితలోని రెండవప్రశ్నమే బ్రహ్మసిద్ధాంత మనఁబడుచున్నట్లుగా నధ్యాయాంతగద్యల వల్లఁ దెలియుచున్నది. దీనినిబట్టి సంహితాకర్త శాకల్యుఁ డనవచ్చును.

---

1. దీనికర్తృత్వ మజ్ఞేయము. కాని, యిది మిక్కిలి ప్రాచీనము.

ఈశాకల్యుఁడు జ్యోతిశ్శాస్త్రప్రవర్తకులలో గణింపఁబడియున్నాఁడు. అందుచే శాకల్యుఁడనునొకముని దీనికర్తయని చెప్పవలసియున్నది గాని, ఈశాకల్యుఁ డేశాకల్యుఁడో నిర్ణయింప వీలులేదు. ఇం దేడధ్యాయముల గ్రంథముమాత్రము కనఁబడుచున్నది. బ్రహ్మ నారదుని కుపదేశించిన దని యవతారిక చెప్పుచున్నది. ఇందు కాలాశ్రయ మైనవివిధజ్యోతిస్సులచరితము వర్ణింపఁబడినది. ఇంకఁ బంచసిద్ధాంతములలోనిపౌలిశరోమకములను బూర్వు లైనవరాహమిహిరాదులు మొదలుగా, క్రీ. ౧౬౨౮ లోనిహాయనరత్నకర్త యగుబలభద్రపండితునివఱకుఁ గలపెక్కండ్రు గ్రంథకర్తలు ప్రశంసించుటనుబట్టి యవి చిరకాలము లోకమున వ్యాపించిన వని తెలియవచ్చును. తన్మతములును బహుగ్రంథముల వక్కాణింపఁబడియున్నవి. కాని, ఆగ్రంథము లిపు డెందయిన నున్నవో లేవో తెలియరాకున్నది. ఇట్టిపంచసిద్ధాంతములకు వెనుక వెలసినమహాసిద్ధాంతములలో గణింపఁదగినవి కొన్ని—

ఆర్యభటసిద్ధాంతము—విశ్వవిఖ్యాత మైనదీనికర్త మహామహుఁ డైన యార్యభటుఁడు. ఇతనిపేర నిది యార్యభటీయ మని ప్రసిద్ధి కెక్కినది. ఇందు దశగీతికాపాదము పూర్వప్రబంధముగాను, గణితకాలక్రియాగోళపాదములు మూఁడు నుత్తరప్రబంధముగాను వ్యవహరింపఁబడుచున్నవి. ఆర్యావృత్తరూప సూత్రబద్ధ మైనయిందు ౧౨౧ సూత్రములుకలవు. పరమాదీశ్వరునివ్యాఖ్య యగుభటదీపికతో నిది ముద్రిత మైనది. ఈసిద్ధాంతమునకు భటప్రకాశ మను మహావ్యాఖ్య రచియించినసూర్యదేవపండితునియుపోద్ఘాత మిట్లు చెప్పుచున్నది.

"బ్రహ్మవద్ద వృద్ధగర్గుఁడు జ్యోతిశ్శాస్త్ర మభ్యసించి యొకగ్రంథము నిర్మించెను. అతనివలన జ్యోతిర్విద్యామర్మము లెఱింగినపరాశరాదులు వేలువేలుపుస్తకములు రచియించిరి. అట్లు సిద్ధములైనగ్రంథములలోఁ గొన్ని కొన్ని భాగములు చిరకాలము గడచుటచేతను సంప్రదాయము విచ్ఛిన్న మగుటచేతను మృగ్యము లైనవి. అట్టియెడ నార్యభటాచార్యుఁడు పూర్వశాస్త్రము లన్నియుఁ బరిశోధించి యందలిలోపములు పరిశీలించి కలియుగాదిగా ౩౬౦౦ సంవత్సరములు గతించినతఱిఁ దనయిరువదిమూఁడవయేట నీసమదృగ్గణితజ్యోతిశ్శాస్త్రము రచియించెను"[1]. దీనినిబట్టి ఆర్యభటాచార్యులు క్రీ. ౪౭౬ జన్మించి ౪౯౯ లో

1. షష్ట్యబ్దానాం షష్టి ర్యదా వ్యతీతా స్త్రయశ్చ యుగపాదాః
త్ర్యధికా వింశతి రబ్దా స్తదేహ మమ జన్మనో౽తీతాః-ఆర్యభటీయే.
తత్ర వరాహకల్పస్య సప్తమే మన్వంతరే౽ష్టావింశచ్చతుర్యుగే అస్య కల్యాదేః ప్రభృతి ఖ ఖ షడ్వర్గ మితే సౌరాబ్దే గతే త్రయోవింశతివర్షే ఆచార్యార్యభటః...సమదృగ్గణితి జ్యోతిశ్శాస్త్రం చికీర్షన్. ఇత్యాది. సూర్యదేవయజ్వావ్యాఖ్యాయామ్.

నీ గ్రంథము రచియించినట్లు విశదమగుచున్నది. సూర్యదేవుఁడు సంక్షేపించి వ్రాసిన యార్యాసూత్రములయర్థము చక్కఁగా వివరించి యనువ్యాఖ్య రచియించిన బాలాదిత్యతనూజసూర్యాచార్యశిష్యుఁడును శ్రీధరాచార్యపుత్రుఁడు నయినయల్ల యార్యుఁడు (ఇతఁ డాంధ్రుఁడు) దీనిమహత్త్వ మిట్లు తెలిపియున్నాఁడు.

"ఆర్యభటీయసూత్రము లతీంద్రియార్థములు. వీనిలో నొక్కొక్కసూత్రమునకు వేయిగ్రంథ మగునట్లు వ్యాఖ్య రచియించినను, అది దానిభావము పూర్తిగాఁ దెలుపఁ జాలదు. అందుకే సర్వజ్ఞఁ డైనసూర్యదేవయజ్వ "అతీంద్రియార్థప్రతిపాదకాని సూత్రా ణ్యమూ న్యార్యభటోదితాని" అని వక్కాణించియున్నాఁడు. అట్టిసూత్రములకుఁ గించిత్తాత్పర్యవ్యాఖ్యానము నేనును యథామతి రచియించితిని" పూర్వగ్రంథములలోపములు పూరించినదియుఁ దరువాతిగ్రంథములకు మార్గదర్శక మైనదియు నగునీసిద్ధాంతము జ్యోతిశ్శాస్త్రాభిలాషుల కారాధ్య మైనయిష్టదైవముగా నున్నది. అట్టిదీనివెనుక నొకశతాబ్ది గడచినంత నుదయించినది—

బ్రహ్మసిద్ధాంతము—దీనికి బ్రహ్మస్ఫుటసిద్ధాంత మనుమాఱుపేరు కలదు. స్ఫుటము గోళము గణితము బీజగణితము మొదల లగుప్రధానవిషయములను విశదీకరించినయిది యిరువదియై దధికారములగ్రంథము. ఆర్యాఛందోబద్ధ మైనయిందు ౧౦౦౮ శ్లోకము లున్నవి. దీనికర్త బ్రహ్మగుప్తుఁడు. ఇతనితండ్రి జిష్ణుగుప్తుఁడు. ఇతఁడు చాపవంశరాజైనవ్యాఘ్రముఖునికాలములోనివాఁడు. శా. శ. ౫౫౦ సంవత్సరములగుతఱిఁ దనముప్పదవయేట నితఁ డీగ్రంథము రచియించె నని తెలియుచున్నది. అనఁగా దీనికాలము క్రీ. ౬౨౮. ఇతఁడు పదునాల్గవ యధ్యాయముచివర, ఆర్యభటుఁడు విడిచిననక్షత్రానయనము తాను వివరించినట్లు చెప్పుకొనియున్నాఁడు.

"పౌలిశ రోమక వాసిష్ఠ సౌర పైతామహేషు య త్ప్రోక్తం,
త న్నక్షత్రానయనం నార్యభటోక్తం, తదుక్తిరతః"

దీనికి భట్టమధుసూదనపుత్రుఁ డైనచతుర్వేదపృథూదకస్వామి వాసనాభాష్య మనుపేర గొప్పవ్యాఖ్య రచియించి యున్నాఁడు. కొన్నివందలయేండ్లు దేశమునఁ బ్రామాణికగ్రంథమై వ్యాపించినయిది ముద్రిత మైనట్లు కనఁబడదు. ఇంకఁ బూర్వోక్తము లైనగ్రంథము లాధారముగా నుత్పన్నము లైనసిద్ధాంతములలో లోకోత్తర మైనది—

సిద్ధాంతశిరోమణి—దీనికర్త సిద్ధాంతిశిరోరత్న మైనభాస్కరాచార్యుఁడు. ఇది ముద్రితమై వ్యాపించియున్నది. ఇందలిగోళాధ్యాయముకడపట నితఁడు వ్రాసికొన్నస్వవిషయ మిట్లున్నది.

దక్షిణమున సహ్యాద్రికి దగ్గఱగా నున్న విజ్జలవిడ మను గ్రామ మితనిజన్మభూమి. శాండిల్యగోత్రుఁడు సకలవిద్యానిధి యగుమహేశ్వరోపాధ్యాయుఁ డితని తండ్రి విద్యాగురువును. ఇతఁడు శా. శ. ౧౦౩౬ లో జన్మించి తనముప్పదియాఱవ యేట నీకృతి నిర్మించెను[1]. అఱువదియాఱవయేటఁ గరణకుతూహలముఁ రచియించె నని దానినిబట్టి తెలియుచున్నది. కావునఁ గ్రీస్తుశకము ౧౧౫౦ లో సిద్ధాంతశిరోమణి పుట్టిన దనుట స్పష్టము. ఇతనిలీలావతికి గణితామృతసాగరీ వ్యాఖ్య రచియించినగంగాధరపండితుఁడు (క్రీ. ౧౪౨౦) ఇట్లు ప్రశంసించి యున్నాఁడు.

"బ్రహ్మాది ర్జగదాదికాలకలనాపంచప్రకారా గతిః
ఖేటానాం చ సవాసనా చ వినియద్గోళప్రపంచస్థితిః
యంత్రాణి ద్వివిధం చ యత్ర గణితం తేన క్రమా ద్విస్తృతం
సచ్ఛిద్ధాంతశిరోమణౌ సుకవినా శ్రీభాస్కరేణ స్ఫుటమ్"

ఇతనిబీజగణితమునకుఁ గల్పలతావివరణ మనువ్యాఖ్య రచించినబల్లాలపండితతనయుఁ డగుకృష్ణగణకుఁ డిట్లు కీర్తించియున్నాఁడు.

"అత్ర శాండిల్యగోత్ర మునివరవంశావతంస జడవిడనగర నివాసి . . మహేశ్వరోపాధ్యాయతనయ నిఖిలవిద్యావాచస్పతి గణితవిద్యాచతురానన ధరణితరణి శ్రీభాస్కరాచార్యః ఖగగణితరూపం సిద్ధాంతశిరోమణిం చికీర్షుః . . ."

ఈమహాగణకుఁడు గణితాధ్యాయము మొదట బ్రహ్మగుప్తుని వరాహమిహిరుని చేర్కొని తక్కినపూర్వులను స్మరించి వారికృతు లవలోకించి తాను గృతి రచియించినట్లు చెప్పుకొనియున్నాఁడు[2]. ఇతఁడు స్వయముగా సిద్ధాంతశిరోమణికి రచియించిన మితాక్షరి యనువాసనాభాష్య మాధారముగాఁ దరువాత లెక్కలేనన్ని వ్యాఖ్యలు వెలసినవి. లీలావతి, ఆంగ్లమునకుఁ బరివర్తిత మైనది. ఈగణితమునకు సంస్కృతముననే కాక దేశభాషలందును బెక్కుటీకలు వెలసినవి. సంస్కృతవ్యాఖ్యలలో రామకృష్ణగణకుని (క్రీ. ౧౩౩౮) గణితామృతలహరి, లక్ష్మీదాసుగణితతత్త్వచింతామణి, సూర్యదాసుని (క్రీ. ౧౫౪౧) గణితామృతకూపికాసూర్యప్రకాశములు, గణేశపండితుని (క్రీ. ౧౫౪౫) బుద్ధివిలాసిని, నృసింహదైవజ్ఞసూనుగణక

1. రస గుణ పూర్ణ మహీసమ శకనృపసమయే ఽభవ న్మ మోత్పత్తిః
రసగుణవర్షేణ మయా సిద్ధాంతశిరోమణీ రచితః.
2. కృతీ జయతి జిష్ణుజో గణకచక్రచూడామణిః,
జయన్తి లలితోక్తయః ప్రథితతంత్రసద్యుక్తయః
వరాహమిహిరాదయ స్సమవలోక్య యేషాం కృతీః
కృతీ భవతి మాదృశో ఽప్యతనుతంత్రబంధే ఽల్పధీః,

సార్వభౌమరంగనాథుని (క్రీ. ౧౬౩౦) మితభాషిణి, రామకృష్ణదేవునిమనోరంజనము, వీరేశ్వరపండితునిలీలావత్యుదాహరణము, మొదలైనవిపెక్కు సటీకములై యున్నవి. కాని, యన్నిటికంటెను బ్రశస్తమైనదిగాఁ గనవచ్చునది మరీచి వ్యాఖ్య. దీనికర్త మునీశ్వరుఁ డనఁబడువిశ్వరూపపండితుఁడు. ఇతఁడు జహాంగీరు సంస్థానమునఁ బండితుఁడై ఖ్యాతి గన్నకృష్ణపండితునిసోదరపౌత్రుఁడు. బల్లాల దైవజ్ఞునిపౌత్రుఁడు. సూర్యసిద్ధాంతవ్యాఖ్య రచియించినరంగనాథగణకునిపుత్రుడు. క్రీ. ౧౬౩౦ ప్రాంతమువాఁడు. ఈవ్యాఖ్య గణితగోళాధ్యాయములు రెంటికి మాత్రమే కనఁబడుచున్నది. దీనివలె గణింపఁదగినది భాస్కరునివాసనాభాష్య మనుసరించినవాసనావార్త్తికము. దీనికర్త కోంకణదేశీయుఁ డగునృసింహపండితుఁడు. ఇతఁడు తనవార్త్తికవిశేషమున నిట్లు చెప్పియున్నాడు.

> "న యా వరాహేణచ జిష్ణుజేన, పృథూదకే నార్యభటేన జుష్టాః.
> అసంస్తుతా భాస్కరదర్శనేన, తా వాసనావార్త్తిక ఏవ లభ్యాః"

ఇంక నిట్టి వెన్నేని కలవు. సిద్ధాంతశిరోమణి జ్యోతిషికులపాలిటికల్పతరు వనుటకు దీనివ్యాఖ్యానబాహుళ్యమే నిదర్శనము. పూర్వాపూర్వగ్రంథములలోని లోపములు పూరించుటకును, తాము స్వయముగాఁ గనిపెట్టిననూతనవిషయములు బోధించుటకును భాస్కరాచార్యులతరువాతఁ గూడఁ బెక్కండ్రు సిద్ధాంతస్కంధమునకు సంబంధించినగ్రంథములు రచియించియున్నారు. వానిలోఁ గొన్నిటిని బరిశీలింతము.

ముద్గలగోత్రుఁడైన ఆశాధరగణకుఁడు గ్రహజ్ఞానమును [1] అతనిపుత్రుఁడో లేకశిష్యుఁడో హరిహరగణకుఁడు గణితచూడామణిని రచియించియున్నారు. వీ రిరువురును భాస్కరాచార్యులసమకాలికులుగాఁ గనవచ్చుచున్నారు. కాని, ఈగ్రంథములు వ్యాప్తికి వచ్చినట్లు కనరాదు. భాస్కరాచార్యుల కించుక పరుఁ డగు శ్రీధరాచార్యుఁడు, గణితసారము లఘుఖేచరసిద్ధి గ్రహసారణి మొద లగుసిద్ధాంతగ్రంథములను రచియించియున్నాఁడు. ఖేచరసిద్ధిలో వ్రాసికొన్నదానినిబట్టి క్రీ. ౧౨౨౭ లో నితఁ డాగ్రంథము రచియించినట్లును [2] ఇతనికి గణకచక్రచూడామణిబిరుద మున్నట్లును గనఁబడుచున్నది. భాస్కరాచార్యులు పన్నెండవశతాబ్ది కడపటివఱకు జీవించియున్నట్లు తెలియవచ్చుచున్నది గావున నతనివార్ధకదశలో

---

1. శాకే ఉదధిబాణదశభిః-శా. ౧౦౫౪. ఈసంఖ్య నొకలెక్కలోఁ జూపుటచే నీకాలము వాఁ డని యూహింపఁబడుచున్నది.

2. నందాబ్ధిరుద్రైశ్శకే-శా. ౧౧౪౯. ఈసంఖ్య నొకలెక్కలోఁ జూపుటచే నీకాలమువాఁ డని యూహింపఁబడినది.

శ్రీధరుఁడు బాలుఁడై యుండవచ్చును. భాస్కరాచార్యుల కించుక పూర్వుఁడై నమఱియొక శ్రీధరుఁ డున్నట్లు సూచనలు కలవుగాని యితఁ డతఁడు కాఁడు, ఇతఁడు, గణితవిద్యాచతురాననేత్యాదిబిరుదములతో భాస్కరుఁడు స్వకాలమున విఖ్యాతుఁడగుట యెఱిఁగియే తా నందఱిని మించినవాఁడ నన్నంతటియహంకారముతోఁ దనగ్రంథముల నిట్లాత్మప్రశంస కావించికొని యున్నాఁడు.

"ఉత్తరత స్సురనిలయం దక్షిణతో మలయపర్వతం యావత్,
ప్రాగపరాంబుధిమధ్యే నో గణకః శ్రీధరా దన్యః"
"పాటీకుట్టకబీజగోళసహితాన్ పైతామహాదీన్ వయం,
సిద్ధాంతా నపి మన్మహే ప్రతిదినం ఖేటా న్నతు ప్రస్ఫుటాన్,
ఇత్యాకర్ణ్య విదాం వచాంసి కృపయా శ్రీశ్రీధరః ప్రస్ఫుటాం
చక్రే ఖేచరసిద్ధి మిందుధవళాం సత్కీర్తివల్లీ మివ"

అయిన నేమి? సిద్ధాంతశిరోమణిని మించి యితనికృతులు పైకిరాలే దనుట విదితము. ఇవియే కాదు, భాస్కరాచార్యుల కించుక పూర్వము క్రీ. ౧౧౯౭లో మధురావాసియగు బ్రహ్మదేవగణకుఁడు నిర్మించినకరణప్రకాశమును, పురుషోత్తమగ్రామవాసి యగుసదానందుఁడు క్రీ. ౧౧౯౯ లో రచియించినభాస్వతీకరణము గూడఁ బైకి రాలేదు. ఇట్లు దశమశతాబ్ది మొదలుగాఁ బందొమ్మిదవశతాబ్దికడపటి వఱకుఁ గూడ వందలకొలఁదిజ్యోతిశ్శాస్త్రగ్రంథము లుదయించుచునే వచ్చినవి గాని యిట్టి వన్నియుఁ బ్రచారములోనికి రాకపోవుట కొకటియే కారణము. అది, మాటలు వేఱగుటయే కాని విషయము వేఱు గాకపోవుటయే. గ్రహస్ఫుటాదిక బహువిషయములందు సూర్యసిద్ధాంతార్యభటీయ సిద్ధాంతశిరోమణ్యాదిప్రసిద్ధ గ్రంథములు గావించినపరిశోధనపరిశీలనములకు భిన్నము లైననూతనపరిశీలనములు గావించినగ్రంథము లేవియు నర్వాచీనములలో లేవు. క్లిష్టములు గా మన్న యందలికొన్నికొన్ని విషయములను వానివ్యాఖ్యాతలు వివరించియే యుండిరి. అట్టియెడ విషయభేదము లేనియర్వాచీనకృతులకుఁ బ్రసిద్ధి యెట్లు వచ్చును? అట్లని వీనిలో గుణము కలవి లే వని తలంపరాదు.

శ్రీపతిపండితుఁడు తనకు మున్నున్న యెల్లసిద్ధాంతము లవలోకించి సిద్ధాంతశేఖర మనుపేర వివిధఖగోళవిషయములు విచారించుచు నిరువదియధ్యాయముల గ్రంథము రచియించెను. ఉత్తరదేశీయుఁ డైన మంజులాచార్యుఁడు తొలుత బృహన్మానసము రచియించి దానికి సంగ్రహముగా లఘుమానసము రచించెను. దానికి శ్రీధరార్యపుత్రుఁ డైనయల్లయార్యుఁడు కల్పలత యనుపేర వ్యాఖ్య వ్రాయుచు—

'ఆర్యభటో గ్రహగణితం గోళం దామోదరో విజానాతి,
యంత్రజ్ఞో జిష్ణుసుత స్సర్వం జానాతి మంజులాచార్యః'

అనుచు నతఁడు సర్వజ్ఞుఁ డని నిరూపించియున్నాఁడు. విఖ్యాతసిద్ధాంతి యగు పద్మనాభగణకునిశిష్యుఁడును, వ్యాకరణాచార్యుఁ డగునారాయణపండితునిపుత్రుఁడును, హాయనరత్నకర్త యగు (క్రీ. ౧౬౭౮) బలభద్రపండితునితండ్రియు నగు పైదామోదరసిద్ధాంతి కరణప్రకాశము మొదలగుబహుగ్రంథములకు వ్యాఖ్యలు సవిశేషముగా రచియించి గోళజ్ఞుఁ డన్నఖ్యాతి గాంచియుండెను. లఘుమానసమునకు వ్యాఖ్య రచియించినయాంధ్రదేశీయుఁ డగుయల్లయార్యుఁడు ప్రసిద్ధములైనపూర్వసిద్ధాంతము లన్నిటికి వ్యాఖ్యానములు రచియించి స్వకృతపరిశోధనములు చూపి విఖ్యాతి కెక్కెను. సిద్ధాంతవిషయమునఁ బ్రాచీనమతములవలె యల్లయార్యమతమును బ్రమాణ మయినది. లొల్లలక్ష్మణార్యుఁ డనుమఱియొకయాంధ్రుఁడు సకలసిద్ధాంతవిషయములు పరామర్శించి ౧౦౮ ఉల్లాసములతో దైవజ్ఞవిలాస మనుమహాగ్రంథము నిర్మించెను[1]. ఇట్టివి కొన్ని యొక్కొక్కవిషయమున విశేషము చూపినను, అనేకములు పూర్వసిద్ధాంతములపుత్రికలే యనఁదగియున్నవి. ఇఁక—

జాతకసంహితాస్కంధములు—ఈరెండును ఫలాభిధాయకము లైనభాగములు. ఇందు జాతకభాగము హోరాశాస్త్ర మనఁబడును, 'అహోరాత్ర' శబ్దమునఁ బ్రథమాంతిమవర్ణలోపముచే హోరాశబ్దము సిద్ధించిన దనుకొందఱిమతమును వరాహమిహిరుఁడు చూపెను. ఇది పూర్వజన్మార్జితము శుభాశుభరూపమునైనకర్మయొక్కఫలమును వ్యక్తపఱుచును. ఇందు, రాశిహోరాద్రేక్కాణనవాంశకద్వాదశభాగత్రింశద్భాగబలాబలములు, గ్రహములదిక్స్థానకాలచేష్టాదులబలాబలములు, ఆయుర్దాయరాజయోగాదులు, తన్వాదిద్వాదశభావములు మహాదశాంతర్దశావిదశాదులు మొదలగువానిఫలములును నిర్ణయింపఁబడును. రెండవదానిలో సూర్యాదిగ్రహములచారములు సప్తర్షిచారములు నక్షత్రగతులు గ్రహములప్రకృతివికృతిప్రమాణవర్ణాదులు శుభాశుభనిమిత్తములు వర్షదిగ్దాహభూకంపాదులు మొదలగువానికి సహేతుకము లైనఫలములు నిర్ణయింపఁబడును. ఇట్టియీశాస్త్రములు రెండునుగూడ గ్రహగణితశాస్త్రముతో సంబంధముకలవియై జ్యోతిశ్శాస్త్రమున నంతర్భూతము లైనవి. వీనికి సంబంధించినప్రాచీనగ్రంథ

1. మదరాసు, తంజావూరు, లండన్, నగరములలోని పుస్తకాలయములలో నిప్పటికిని మెఱుఁగనిజ్యోతిషగ్రంథములు లెక్క లేక దిక్కు లేక వందలు వందలుగాఁ బడియున్నవి.

ములు కొన్నికల వని వరాహమిహిరుఁడు పేర్కొన్న మయ గర్గ గార్గి పరాశర విష్ణుగుప్త మణిత్థ యవన శ్రుతకీర్తి సత్యాచార్య జీవశర్మ దేవస్వామి సిద్ధసేనాదుల మతములనుబట్టి తెలియుచున్నది.

వృద్ధవసిష్ఠసంహిత యన నొకగ్రంథ మున్నది. అది బ్రహ్మర్షి వసిష్ఠనిర్మిత మని గద్య చెప్పుచున్నది. అది యెవరు రచియించిన దైనను, వాసిష్ఠసిద్ధాంతము వలె వరాహమిహిరునికిఁ బూర్వమా కాదా యని సందేహము కలుగుచున్నది. వృద్ధయవనజాతకము లేక, మీనరాజజాతక మనునొకగ్రంథమును మీనరాజ యవనాచార్యుఁడు రచియించినట్లు కనఁబడుచున్నది. అందు మొదట "పూర్వముని యొకఁడు లక్షగ్రంథపరిమిత మైనహోరాశాస్త్రమును మయునికిఁ జెప్పె ననియు, దానినే మీనరా జెనిమిదివేలగ్రంథ మగునట్లు సంగ్రహించి రచియించె ననియుఁ జెప్పెడియొకశ్లోకము కలదు. వరాహమిహిరుఁడు పేర్కొన్నయవనేశ్వరుఁ డితఁడే యైనచో నీగ్రంథ మితని దనవచ్చును. బృహత్సంహిత—

"మ్లేచ్ఛాహి యవనా స్తేషు సమ్యక్ శాస్త్ర మిదం స్థితమ్
ఋషివ త్తేఽపి పూజ్యా స్తే కింపున ర్దైవవి ద్ద్విజః"

అనుచు యవనులు జ్యోతిశ్శాస్త్రనిష్ణాతులై ఋషులవలెఁ బూజింపఁబడు చుండి రని ప్రశంసించినది. బృహజ్జాతకము పేర్కొన్నయవనశబ్దము బహువచనాంతముగా నున్నచోఁ బురాతనయవను లనియు, ఏకవచనాంత మైనచో యవనేశ్వరుఁ డనియు, మ్లేచ్ఛదేశాధిపతి యనియు మూఁడువిధము లైనయర్థములను వ్యాఖ్యాతలు తెలిపియున్నారు. అందుచే నీగ్రంథము కడపటియిద్దఱిలో నెవరిదో తెలియకున్నది. యవనహోర యని మఱియొకజాతకగ్రంథము పదుమూఁడధ్యాయములది కలదు. అది యవనేశ్వరునిదేమో యని తోఁచుచున్నది. అందు ద్వాదశభావములు స్త్రీజాతకమును విచారింపఁబడినవి. అర్థశాస్త్రకర్త యగువిష్ణుగుప్తుఁడు శ్రుతకీర్తి మొదలగువారు రచియించినజాతకగ్రంథములు సజీవములై యున్నట్లు తెలియవచ్చును. వరాహమిహిరుఁడు పేర్కొన్నపై వారిమతములను దెలుపు శ్లోకములను బృహజ్జాతకవ్యాఖ్యాత యుదాహరించి యున్నాఁడుకాని, వారిగ్రంథములను బేర్కొనలేదు. పారాశరీహోర యిపుడు లోకమున వ్యాపించియున్నది. బృహజ్జాతకము పేర్కొనకపోయినను జైమినిసూత్రములు గూడఁ బ్రాచీనము లగుటకు సంశయము లేదు. కావున వరాహమిహిరునికిఁ బూర్వము జాతకసంహితాస్కంధసంబంధము లగు పెక్కుగ్రంథము లుండె నని నిశ్చయింపవచ్చును. అయినను, అతనిగ్రంథములే దేశమున నెక్కువగా వ్యాపించి యవియే యాద్యము లనునంతటికీర్తి గణించినవి.

వరాహమిహిరుఁడు క్రీ. ౫౮౭ లో మృతిచెందె నని ఖండఖాద్యవ్యాఖ్యా నమువల్లఁ దెలియుచున్నది [1]. దీనినిబట్టి యితఁడార్యభటునివార్ధకదశలో జన్మించి యుండు నని విదిత మగుచున్నది. ఇతఁడవంతీనివాసి, కాపిత్థలగోత్రుఁడు, ఆదిత్య దాసతనయుఁడు. జ్యోతిస్సంబంధము లైనవివిధవిషయములను విశదీకరించిన యితనిబృహత్సంహిత విశ్వవ్యాప్తమై ఖండాంతరభాషలలోనికిఁ గూడ ననువదింపఁ బడినది. ఇందు, శాస్త్రోపనయసంవత్సరసూత్ర రవిచారాదినక్షత్రపురుషవ్రతాంతము లైననూటైదువిషయములు గలవు. ఒక్కొక్కవిషయమున కొక్కొక యధ్యాయము చొప్పున నుపసంహారాధ్యాయముతో నిది నూటాఱధ్యాయముల గ్రంథము. ఇది తరువాతివారిసిద్ధాంతాదివివిధగ్రంథరచనకుఁ దోడ్పడిన దని వారు వారు గావించిన ప్రశంసలవల్లనే వ్యక్త మగుచున్నది. దీనికి సంహితావివృతి యను పేర భట్టోత్పలుఁడు క్రీ. ౯౬౬ లో, గొప్పవ్యాఖ్య నిర్మించెను [2]. ఇతనిపద్యమయ వ్యాఖ్య ననుసరించి వార్షగణ్యకులజుఁడు కుమారపండితతనయుఁడు నైనయోగి యనుదైవజ్ఞుఁడు [3] ఉత్పలపరిమళ మను గద్యమయవ్యాఖ్య నిర్మించెను.

ఇతనిహోరాశాస్త్ర మగుబృహజ్జాతక మిరువదియైదధ్యాయములగ్రంథము. ఇదియును జగద్వ్యాప్తమే. దీనికే సంగ్రహముగా నితఁడు లఘుజాతక మనఁ బదుమూఁడధ్యాయములకృతిని, యోగయాత్ర యనెడిమఱియొకగ్రంథమును రచియించెను. ఈకృతు లన్నిటికిని భట్టోత్పలుఁడు టీకలు రచియించెను. కాని, మూలవ్యాఖ్యలు రెండునుగూడ మనదేశమున వ్యాపించినట్లు కనఁబడదు. తొమ్మిదియధ్యాయములజర్మనీభాషానువాదముతోడిదీనిని, కెర్నుపండితుఁడు(Prof. H. Kern) ప్రకటించియున్నాఁడనియు, రాజేంద్రలాల్‌మిత్ర గావించినపరిశోధనలనుబట్టి యిది బృహద్యోగయాత్రయై యుండు ననియు గైక్వారనుగ్రంథపరిశోధకుఁడు వ్రాయుచున్నాఁడు [4]. లండన్ పుస్తకాలయమం దున్నదీనిప్రతిలోఁ బదునాలుగధ్యాయములగ్రంథ మున్నట్లును, ఇంకను గొంతగ్రంథ ముండియుండు ననితోఁచుచున్నట్లును, అతఁడభిప్రాయపడియున్నాఁడు. ఇది సేనలజైత్రయాత్రకు సంబంధించినభవిష్యత్తును దెలుపునట్టిగ్రంథము. ఇందు రమారమి ౫౦౦ శ్లోకము లుండు నఁట. ఎవరో లేఖకులు బృహజ్జాతకము చివర నున్న 'ఆదిత్యదాసతనయ,

---

1. నవాధికపంచశతసంఖ్యేశాకే వరాహమిహిరో దివంగతః. (యామరాజు).
2. వస్వష్టాష్ట ౮౮౮ మితే శాకే కృ తేయం వివృతి ర్మయా,
   చతుర్వింశతిసాహస్రం మాన మస్యా హ్యనుష్టుభామ్,
3. ఒకప్రతిలో నితఁడు భాస్కరుఁ డనుపేరను, నైధ్రువకాశ్యపగోత్రుఁడు గాఁ గన వచ్చుచున్నాఁడు. ఇం దేలేఖకునిపాఠము తప్పో!
4. చూ. లండనులైబ్రరీకేటలాగు సంపుటము ౫.

ఇత్యాదిశ్లోకములను గ్రంథాంతమందు చేర్చుటచే దైవజ్ఞవల్లభ యనుహోరా గ్రంథము కూడ వరాహమిహిరునిదే యనెడిభ్రాంతి కొందఱికిఁ గలుగవచ్చును గాని, అది యితనిది గాదు. శ్రీపతిపండితుఁడో లేక నీలకంఠపండితుఁడో దానిని రచించి యుండు నని రాజేంద్రలాల్‌మిత్రపండితుఁ డభిప్రాయపడియున్నాఁడు.

వరాహమిహిరునిపుత్త్రుఁ డగుపృథుయశుఁడు హోరాషట్పంచాశిక యను కృతి నిర్మించెను. దీనికిని భట్టోత్పలుఁడు వ్యాఖ్యానము రచియించెను.

రోమకసిద్ధాంత మనుపేర షవాయణ మనునొకగ్రంథము కలదు. దీన్ని మొదట నున్న "ధూమ్రం పుత్త్రం ప్రతి రోమకాచార్యో వదతి, పున రేవ ప్రవక్ష్యామి శృణు పుత్త్ర ప్రయత్నతః" ఇత్యాదివాక్యములనుబట్టి యిది రోమకాచార్య ప్రణీత మనెడిభ్రాంతి కలుగును గాని, విషయవివరణమునుబట్టి యిది యర్వాచీన కల్పిత మని తెలియవచ్చును. ఇట్లే జ్యోతిర్విదాభరణ మనుకృతి కాళిదాసకృత ముగాఁ గనఁబడుచు, ధన్వంతరిక్షపణాకమరసింహాది నవరత్నములను శ్రీహర్ష విక్రమాదిత్యునికిఁ జేర్చి ప్రసిద్ధి కెక్కి యున్నది. అది కూడ నర్వాచీన మని యందలివిషయమే విశదీకరించుచున్నది. మఱియు సోమసిద్ధాంత మనునొకకృతి సిద్ధాంతసంజ్ఞచే గణితస్కంధమునకుఁ జేరినదిగా భ్రాంతి గొలుపును గాని, జాతక సంహితలకు సంబంధించినయది యెవరు నిర్మించినదో తెలియరాదు. ఒకలేఖకుఁడు సిద్ధాంతభట్టాచార్యనిర్మిత మనెను గాని, అది పేరో బిరుదో తెలియరాదు. ఇంక జాతకసంహితాస్కంధములకు సంబంధించినయర్వాచీనగ్రంథములు వందలుగా నున్నవి. వాని నెల్ల నిందు పేర్కొనుట కైన నలవికాదు, కాశీనివాసి యగునీలకంఠపండితుఁడు క్రీ. ౧౫౮౭ లో, తాజిక మనుగొప్పగ్రంథము నిర్మించెను. ఇది జ్యోతిర్విషయముల కెల్ల సంబంధించినది. సంజ్ఞాతంత్ర వర్షతంత్రము లనెడురెండుభాగముల ఖిలసిల్లుదీని కెందఱో వ్యాఖ్యలు రచియించి వ్యాప్తికిఁ దెచ్చియున్నారు. ఇఁక ముహూర్తభాగమునకుఁ జేరినవానిలో ముహూర్తదర్పణము ముహూర్తదీపకము మార్తాండము కల్పద్రుమము మొదలుగా ననేకములువ్యాప్తములై యున్నవి. శకునభాగమునకుఁ జేరి, అద్భుతసాగరము సర్వార్థచింతామణి శకునార్ణవము మొదలుగా బహుగ్రంథము లుత్పన్నములైనవి. ప్రశ్నభాగమునఁ బ్రశ్నశాస్త్రము ప్రశ్నలక్షణము ప్రశ్నవిషయము ప్రశ్నజ్ఞానము ప్రశ్నార్ణవప్లవము మొదలగుబహుగ్రంథములు కలవు. ఇందు, పద్మనాభకృతలంపాక ముత్తమముగా నున్నది. స్వప్నఫలములను దెల్పు స్వప్నాధ్యాయాదిగ్రంథములు మఱికొన్ని యున్నవి. ఇట్లు సంహితాస్కంధము బహుముఖముల వ్యాపించి యిప్పటికిని లోకమున వ్యవహారములో నున్న దనుటయే దీనివిశేషము. జాతకస్కంధము గూడ వరాహమిహిరునికిఁ బూర్వము

నుండి నేఁటివఱకుఁ గూడఁ బ్రజాదరణము గాంచుచునే వచ్చుచున్నది గాని, యీభాగమందుదయించినవి వందలకొలఁదిగ్రంథము లున్నను బఠనపాఠవ్యవహారములో నున్నవి మాత్ర మల్పసంఖ్యాకములే. అందును, పారాశరీజైమినీయములు రెండే గణనీయములై యున్నవి. వీని కున్నవ్యాప్తి యిపుడు బృహజ్జాతకమునకు లేదు. పారాశరీహోర ననుసరించి, యజ్ఞనారాయణయజ్వపుత్త్రుఁడు నాథునికుఁడు నైనవేంకటేశ్వరపండితుఁడు రచియించినజాతకచంద్రికయున్నిటిని మించి ఫలకథనమున నుత్తమప్రమాణ మగుచున్నది. సవ్యాఖ్యము లైనజైమిని సూత్రములు భరతఖండ మంతట వ్యాపించియున్నవి. జాతకభాగమున నిదియు నుత్తమప్రమాణ మనుట నిర్వివాదము. ఈసూత్రములు రచియించినయతఁడే జైమినియో నిరూపింప వీలు గాకున్నది. వృద్ధపారాశరీ లఘుపారాశరీకర్తలవిషయము నట్టిదే. కాని, యీగ్రంథములు ప్రాచీనము లనుట నిరాక్షేపము. ఢుంఢిరాజకృత మగుజాతకాభరణము, భట్టజయరామునిజాతకకామధేనువు, కంచం యల్లయ్య రచియించినజ్యౌతిషదర్పణము, మహాదేవశర్మజాతకార్ణవము, ఢుంఢిరాజపుత్త్రుఁడగుశివపండితునిజాతకముకుటావళీపద్ధతి, మొదలైనవి కూడఁ బ్రమాణగ్రంథములు గాఁ గనవచ్చుచున్నవి కాని యెందుచేతనో వీనికి వ్యాప్తి రాలేదు. జాతకార్ణవ మనునాఱధ్యాయములగ్రంథము వరాహమిహిరీయముగాఁ గనవచ్చుచున్నది గాని, చంద్రసూర్యగ్రహణవిషయము పూర్ణముగా వివరించునది సిద్ధాంతమునకుఁ జెందినదిగాని జాతకమునకుఁ జేరినది కాదు, అది వరాహమిహిరుని మతము ననుసరించి యన్యుఁడు రచియించినది కాని యతఁడు నిర్మించినది కాదు. ప్రాణనాథమిశ్రుఁడు రచించినమఱియొకజాతకచంద్రికయు, మాధవపండితునిజాతకదర్పణమును, కేశవపండితునిజాతకపద్ధతియు మొదలైనవికొన్ని ద్వాదశభావములను జక్కఁగ విశదీకరించియున్నవి. ఇంక నిట్టి వెన్నేని కలవు. జాతకస్కంధము విస్తరించుకాలమున దాని ననుసరించి ప్రశ్నశాస్త్రము, కేరళి పంచపక్షి ఛప్పన్నము మొద లగునామముల భావిఫలాభిధాయకమై యుదయించి విస్తరిల్లినది. అట్లు బయలుదేఱినదానికృతులలో, కేరళాచార్యునిచూడామణికేరళి బహువిధ ప్రశ్నఫలనిరూపణపరమై కనఁబడుచున్నది. కేరళచంద్రికా కేరళజ్యౌతిషములు నట్టివే.

రమలశాస్త్రముగూడ నిట్టిదే. ఇది తొలుత, టర్కీదేశమునుండి వచ్చినది. ఈశాస్త్రము మహమ్మదీయసంఘమున నెక్కువగా వ్యాపించినట్లు హాజీకాల్ఫ అను గ్రంథమువల్లఁ దెలియుచున్నది. ఇది హిందూదేశమున కెపుడు వచ్చెనో కాని, క్రీ. ౧౭౦౦ ప్రాంతమున, త్రిపాఠిరుద్రముని రమలేందుప్రకాశ మనుపదునాఱుల్లాసముల సంస్కృతగ్రంథము రచియించెను. తరువాత, చింతామణిపండితుఁడు రమల

ప్రశ్నసంగ్రహమును, రామపండితుఁడు రమలతంత్రమును నిర్మించిరి. ఇతఁడు గ్రంథాంతమున—

"చక్రే రమలపైచిత్ర్యం బద్ధం శకలషోడశైః
దృష్ట్వా యవనశాస్త్రోక్తం బద్ధం గీర్వాణభాషయా,

అనుచుఁ దా నీగ్రంథము యవనశాస్త్రము ననుసరించి రచియించినట్లు తెలిపియున్నాఁడు. ఇంక సాముద్రికము—

ఇది శరీరావయవములనుబట్టియు హస్తములందలి రేఖలనుబట్టియు ఫలము చెప్పునట్టిశాస్త్రము. శ్రీవిష్ణువు నారదుని కుపదేశించినట్లుగా నారదీయ మనుపేర సాముద్రికశాస్త్రము గోచర మగుచున్నది. ఇందు, స్త్రీపురుషాయుష—అంగుళి—నాసా—పార్ష్ణి జంఘా - గతి—జాను—గంధ—లక్షణము లనుపేర నేడధ్యాయముల గ్రంథము మాత్రము కనఁబడుచున్నది. దీనికి లక్షణదీపిక యనుపెద్దవ్యాఖ్య కలదు. ఈశాస్త్రము కొంతకాలము వ్యాప్తిలో నుండి తరువాతఁ గొంచెము విశ్వాసదూరమై మఱుఁగుపడినది. కాని, విదేశీయులసాముద్రికగ్రంథములు మన దేశమున వ్యాపించుట చూచినతరువాత మనవారికిఁ గూడ నిపుడు సాముద్రిక విశ్వాసము కుదురుచున్నది. ఇందు చక్కనిపరిశ్రమ చేసినచో, విమర్శకుఁ డగు దైవజ్ఞుఁడు సరియైనజాతకఫలములు చెప్పునట్లే, గతాగతఫలములు చెప్పవచ్చునని యాశాస్త్రపద్ధతినిబట్టి తెలియుచున్నది. భృగుసంహిత మొదలగుకొన్నిగ్రంథము లున్నవి. అవి, ఈయారాసులం దీయాగ్రహము లున్నపు డిట్టిఫలము సంభవించు నని కూర్చినజాతకచక్రములప్రోగులు కాని, స్వతంత్రశాస్త్రగ్రంథములు కావు. ఆగ్రంథములం దందఱిజాతకములు నుండును. వారివారిజాతకములను బట్టి యందు వ్రాసినఫలములను దెలిసికొనవచ్చును. అందు, కొన్నినాడీగ్రంథములు ముద్రితములు గాక కొందఱివద్దమాత్రమే యున్నవి. ఇఁక నీవిషయ మిటుంచి దక్షిణోత్తరాయణములయెడఁ బూర్వమతము లెట్లున్నవో కొంచెము తెలిసికొందము.

వేదాంగజ్యోతిష మనుగ్రంథ మిట్లు తెలిపి యున్నది.
"ప్రపద్యేతే శ్రవిష్ఠాదౌ సూర్యాచంద్రమసా వుదక్
సార్పార్ధే దక్షిణార్కస్తు మాఘశ్రావణయో స్సదా"

సూర్యుఁడు ధనిష్ఠాప్రథమపాదగతుఁ డగుటచే మాఘమాసమున నుత్తరాయణమును, ఆశ్లేషార్ధగతుఁ డగుటచే శ్రావణమాసమున దక్షిణాయనమును సంభవింపుచుండు నని దీనిభావమును సుధాకరభాష్యము చెప్పుచున్నది. వరాహ

మిహిరుఁడీభావము దెలుపుచుఁ దననాఁటి యయనస్థితి నిట్లు నిరూపించి యున్నాఁడు.

"ఆశ్లేషార్ధా ద్దక్షిణ ముత్తరమయనం ధనిష్ఠాద్యమ్
నూనం కదాచి దాసీత్, యే నోక్తం పూర్వశాస్త్రేషు.
సాంప్రత మయనం సవితుః కర్కటకాద్యం మృగాదితశ్చాన్యత్"

సూర్యుఁ డాశ్లేషార్ధగతుఁ డగుటచే దక్షిణాయనమును, ధనిష్ఠాద్యగతుఁ డగుటచే నుత్తరాయణమును బూర్వ మొకప్పుడు సంభవించెడి దనుట నిశ్చయము. ఇపుడు సూర్యునికర్కటకరాశిప్రవేశమున దక్షిణాయనమును, మకరరాశిప్రవేశమున నుత్తరాయణమును గలుగుచున్నది—దీనినిబట్టి పునర్వసుచతుర్థపాదమున రవి ప్రవేశించినపుడు దక్షిణాయనమును, ఉత్తరాషాఢాద్వితీయపాదమున, బ్రవేశించినపు డుత్తరాయణమును గలుగుచున్న దని విదిత మైనది. ఈభేదము పరిశీలింపఁగా దక్షిణోత్తరాయణములకు సూచక మైనసూర్యునినక్షత్రప్రవేశము వేదాంగజ్యోతిషమునాఁటికంటె బృహత్సంహితనాఁ డాఱుపాదములు వెనుకకు వెళ్లినట్లు స్పష్ట మగును. ఇది ౧౫౦౦ సంవత్సరములనాఁటిమాట. అనఁగాఁ బూర్వకాలమున శ్రావణమాఘమాసములలో వచ్చెడిదక్షిణోత్తరాయణములు వరాహమిహిరునినాఁ డాషాఢపుష్యమాసములలో వచ్చుచుండెడి వనుట. అప్పటికి నిప్పటికిఁ గలయంతరము నిరీక్షించినచో సూర్యునినక్షత్రప్రవేశముమఱికొంత వెనుకకు వెళ్లి యుండు నని తెలియకపోదు. వరాహమిహిరునివలెఁ బ్రత్యక్షపరీక్షణము గావించినయెడ నెంతవెనుకకు వెళ్లెనో తేలును. ఈవిషయము గణితసిద్ధాంతవేత్తలు పరిశీలింతురుగాక.

## అర్థశాస్త్రము.

కొందఱు దీనితో నీతిశాస్త్రమును వేఱుగాఁ బఠించిరి కాని, పృథ్వీలాభతత్పాలనములకు సంబంధించినయెల్లవిషయములను విశదీకరించు నర్థశాస్త్రమునఁ జతుర్విద్యలలో నొకటి యగుదండనీతి యనెడి రాజనీతి యంత ఖ్యాతమే కాని వేఱు కా దనుట వాస్తవము. ఇందలివిషయము మిక్కిలి పురాతనమై యార్యసంఘనాగరికతతో నే యంకురించిన దని వేదములఁ గనఁబడు వర్ణాశ్రమవృత్తిప్రజాపాలనసంగ్రామవిజయాదివర్ణనలే చెప్పుచున్నవి. అదియే రామాయణములోనికచ్చిత్సర్గాదులందును భారతసంహితలో విదురనీతి శ్రీకృష్ణయానపర్వాదులందును తరువాత శాంతిపర్వమందును మనుయాజ్ఞవల్క్యాది స్మృతులం దాచారవ్యవహారకాండములలోను రూప మేర్పడఁ గొంత పెరిఁగినది. అట్టియీయర్థశాస్త్రవిజ్ఞానమునకును, మనువు — బృహస్పతి — శుక్రుఁడు — పరాశరుఁడు—భారద్వాజుఁడు (ద్రోణాచార్యుఁడు)—కౌణపదంతుఁడు (భీష్ముఁడు)

పిశునుఁడు (నారదుఁడు)—వాతవ్యాధి (ఉద్ధవుఁడు) బాహుదంతీపుత్త్రుఁడు (ఇంద్రుఁడు) విశాలాక్షుఁడు—ఖరపట్టుఁడు—ఆచార్యులు (కౌటిల్యునిగురువు)—అనువారు ప్రవర్తకులని కౌటిల్యార్థశాస్త్రము తెలిపినది. పురాణములలోనివర్ణనలనుబట్టి వీరిలోఁ గొందఱు దేవత లనుకొనుట కవకాశ మున్నది గాని, వా రాపేళ్లతోడిమానవ ముని లనియే యిందు తలంతము. అట్టియీప్రవర్తకులలో బృహస్పతి శుక్రుఁడు విశాలాక్షుఁడు ననువా రర్థశాస్త్రవిషయకగ్రంథములు రచియించినట్లు, విశ్వరూపాచార్యుఁ డనఁబడుశంకరభగవత్పాదశిష్యుఁ డగుసురేశ్వరాచార్యుఁడు తాను రచియించిన యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్య యగుబాలక్రీడలో—యథాహబృహస్పతిః—ఏవంచవిశాలాక్షః—అనుచు వారిమతము లుద్ఘాటించుటచేతను, బార్హస్పత్యము శుక్రనీతిసార మనుగ్రంథము లుండుటచేతను జెప్పవలసివచ్చుచున్నది. కౌటిల్యుఁడు "ఓన్నమః శుక్రబృహస్పతిభ్యామ్" అనుమంగళాచరణవాక్యముతో గ్రంథరచన మారంభించుటంబట్టి యుఁ జెప్పవలసియున్నది. కాని, బాలక్రీడ యుదాహరించినబృహస్పతివచనములు మొన్నమొన్నలాహోరులో ముద్రింపఁబడినబార్హస్పత్యసూత్రమునందు కనవచ్చుటలేదనియు, ఆగ్రంథ మర్థశాస్త్రముగా గణింపఁదగినట్లులే దనియు దానిని బరిశీలించినగణపతిశాస్త్రిగారు తెలిపియున్నారు [1]. ఇదియిట్లుండ, క్రీస్తుశకారంభమున కించుక పూర్వమో లేకపరమో యవన జ్యోతిషమునుండి మనదేశమునకు వచ్చినకొన్నిపారిభాషికపదములలో నొకటి యగుహోరాశబ్దమును బేర్కొన్నశుక్రనీతిసారము [2] కౌటిల్యునికిఁ బూర్వ మనుట పొసఁగదు. ఈశుక్రనీతిసారము పురాతన మైన శుక్రనీతికి సంక్షేపమని కొంద ఱందురు గాని యదియును సరిగాదు. ఇందుకు దానిమొదటిశ్లోకములే ప్రమాణము.

"ప్రణమ్య జగదాధారం సర్గస్థిత్యంతకారణం
సంపూజ్య భార్గవః పృష్టో వందితః పూజిత స్తుతః
పూర్వదేవై ర్యథాన్యాయం నీతిసార మువాచ తాన్
శతలక్షశ్లోకమితం నీతిశాస్త్ర మథోక్తవాన్
స్వాయంభూ ర్భగవాన్ లోకహితార్థం సంగ్రహేణవై
తత్సారంతు వసిష్ఠాద్యై రస్మాభి ర్వృద్ధిహేతవే"

వీటినిబట్టి బ్రహ్మ యుపదేశించినకోటిశ్లోకములనీతిశాస్త్రమును వసిష్ఠాదులు సంగ్రహించి రనియు, శుక్రుఁడు దానవులకుఁ జెప్పినదినీతిసారమే యనియుఁ

1. అనంతశయనముద్రణము. కౌటిల్యార్థశాస్త్రపీఠిక.
2. సంహితాం చ తథా హోరాం గణితం వేత్తి తత్త్వతః 2. 182.

దెలియుచుండ, నింక శుక్రుఁడు వేఱుగాఁ జెప్పినపెద్దనీతి యేదో తెలియకున్నది. కావున ముద్రితమైనబార్హస్పత్యసూత్రముకంటె వేఱై బాలక్రీడ యుదాహరించినవచనములతో బృహస్పతిపేర నొకయర్థశాస్త్రగ్రంథమును, అట్లే విశాలాక్షునిపేర నొకటియుఁ బూర్వ ముండెడి వన్నమాట సత్యమే కాని యవి యిపుడు లభించుట లేదనియు, లభించినశుక్రనీతిసారము ప్రాచీనము కాక, శుక్రునిపేర నర్వాచీను లెవరో నిర్మించిన దనియు విశ్వసింపవలసియున్నది. అందుచే నిపుడు లభ్యమైనంతలో నర్థశాస్త్రవిషయకమైనమొదటిగ్రంథము కౌటల్యార్థశాస్త్రమే యన వలసివచ్చినది.

ఈగ్రంథము నిర్మించినలోకజ్ఞుఁడు కౌటల్యుఁడు. కుటలగోత్రమున జన్మించినవాఁ డగుటచే నీపేరు వచ్చినది[1]. ఇతని మొదటిపేరు విష్ణుగుప్తుఁడు. చణకదేశమునఁ బుట్టినవాఁ డగుటచేఁ జాణక్యుఁ డనియు వ్యవహారము కలిగినది[2]. రాజకీయవ్యవహారకౌటిల్య ముండుటచే నితఁడు కౌటిల్యుఁ డయ్యె నని కొంద ఱందురు. లోకమున నికారమధ్యముగా నీపేరు నెట్లో వ్యాప్తమైనది. కాని, అర్థశాస్త్రమూలవ్యాఖ్యానములవ్రాఁతప్రతు లన్నిటియందును, కౌటల్యశబ్దమే కనఁబడిన దని వానిని బరిశీలించినగ్రంథప్రకాశకులు తెలుపుచున్నారు. వరాహమిహిరాదు లితని విష్ణుగుప్తుఁ డనియే వ్యవహరించిరి. జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధుఁడైనమఱియొక చాణక్యుఁ డర్వాచీనుఁ డుండుటచే బృహజ్జాతకవ్యాఖ్యాత యగుభట్టోత్పలుఁ డొకచోట 'విష్ణుగుప్తచాణక్యా వాహతుః' అని యిరువురమతములను దెల్పి, యింకొకచోట 'విష్ణుగుప్తేన చాణక్యాపరనామ్నైవ ముక్తమ్' అని రెండుసంజ్ఞలతో నితనిమతముమాత్రమే యుదాహరించెను. కౌటల్యుని యర్థశాస్త్రమును బురస్కరించుకొని నీతివాక్యామృతము రచియించిన జైనపండితుఁ డగుసోమదేవసూరి "శ్రూయతే హి కిల చాణక్య స్తీక్ష్ణదూతప్రయోగే ణైకం నందం జఘానేతి" అనుచుఁ గౌటల్యుని జాణక్యనామమున వ్యవహరించెను. ఇట్లీమూఁడుపేళ్లు నితనికి సమన్వయించుచున్న ట్లింకను బ్రమాణములు కలవు కాని, కౌటల్యుఁడే గ్రంథాంతమునఁ దనవిష్ణుగుప్తనామము దెలిపియుండ నింకఁ బెక్కేల ?

"దృష్ట్వా విప్రతిపత్తిం బహుధా శాస్త్రేషు భాష్యకారాణామ్
స్వయ మేవ విష్ణుగుప్త శ్చకార సూత్రం చ భాష్యంచ"

ఈచాణక్యుఁడు, కుసుమపురము రాజధానిగా మగధరాజ్య మేలిననందరాజుల నున్మూలించి మౌర్యుఁ డగుచంద్రగుప్తుని వారిసింహాసనముపై నెక్కిం

1. అథ స్యా త్కుటలో గోత్రకృ త్యృషౌ. నానార్థార్ణవసంక్షేపే. కేశవస్వామి
2. కౌటల్య శ్చణకాత్మజః. హేమచంద్రనామమాలిక. చణకపుత్రుఁడనిదీనిసుతము.

చినవాఁడగుటచే, క్రీ. పూ. ౩౨౧ లో నున్నవాఁ డని కొందఱును, చంద్రగుప్తుఁడు రా జైనకాల మంత కింకను గొంచెము పూర్వమే యని కొందఱును భావించియున్నారు. ఈభేద మిటు లుండఁగా వింటర్నిట్జ్ (winternitz) మొద లగుపాశ్చాత్యులు కొందఱు, చాణక్యుఁడు క్రీ. శ. మూఁడవశతాబ్ది లోనివాఁ డని తలంచిరి. వారివ్రాఁతలనుగూడఁ బ్రమాణముగా గ్రహించుచు నర్థశాస్త్రము ప్రకటించినజర్మనీపండితుఁ డగు జే. జోల్లీ (J. Jolly) యనునతఁడు దానిపీఠికలో, మౌర్యులను జంద్రగుప్తసభను బేర్కొన్నభగవత్పతంజలి తన భాష్యములోఁ గౌటల్యుని బేర్కొనలేదు గావునను, గ్రంథరచనాపద్ధతినిబట్టి కౌటల్యుఁ డితరశాస్త్రకర్తలవలెఁ బండితుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు గాని, గొప్పరాజకార్యధురంధరునివలెఁ గనవచ్చుటలేదు గావునను, ఇతఁడు క్రీ. పూ. నాల్గవశతాబ్దిలోనివాఁ డనుట యంగీకార్యము కాకున్న దనుచు వ్రాసెను[1]. మహాభాష్యకర్త యితనిపే రెత్తకపోవుటయే యితఁడు చంద్రగుప్తుని రాజుఁ గావించిన వాఁడు కాఁ డనుట కాధార మయ్యోనేని క్రీ. శ. ఎనిమిదవశతాబ్దిలోనివాఁ డగు విశ్వరూపాచార్యుఁడును దనబాలక్రీడలో బృహస్పతివిశాలాక్షులను బేర్కొని యర్థశాస్త్రవిషయసందర్భమున నితనిపే రెత్తకపోవుటంబట్టి కౌటల్యుఁ డతని కంటెను గూడఁ బరుఁ డనవలసినదేనా? కావునఁ బూర్వగ్రంథకర్తను బరగ్రంథకర్త పేర్కొనుటయుఁ బేర్కొనకపోవుటయుఁ గాలనిర్ణయమునఁ బ్రధానాధారములనుట హాస్యాస్పదము. ఇది యిటు లుండ, అశోకునిశాసనములలో నతనిరాజ్యకాలమును దెలుపుమాట లేవియు లేకున్నను, ఇతరులు వ్రాసినయేవోవ్రాఁతలను బురస్కరించుకొని పాశ్చాత్యులు నిర్ణయించినచంద్రగుప్తకాలముకూడ సరిగా దనియు, అంతకంటె వాయుపురాణమును రాజతరంగిణియుఁ దెలిపినదే యుచితమనియు రెండుమతములను బరిశీలించినహైందవవిద్వాంసులు భావించుచున్నారు.

రాజతరంగిణిలోని [2] శ్లోకమునుబట్టి కలియుగమున ౬౫౩ సంవత్సరములు గడచినంత, కౌరవపాండవయుద్ధము జరిగిన దని కొందఱును, ఆశ్లోకములో 'సార్ధేషు' అనుపదమునకు 'మూఁడువందలతోఁ గూడిన' యనెడియర్థము చెప్పి ౯౫౩ సంవత్సరము లైనపిదప జరిగిన దని కొందఱును జెప్పుచున్నారు. ఇందు మొదటిది ప్రాచీనమతము. రెండవది నవీనమతము. ఇందు మొదటిసమన్వయమే సంప్రదాయసిద్ధము, కాని, కొందఱికాలములను సరిపుచ్చుటకై రెండవ

1. లాహోరుముద్రణము. 1923,

2. శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే
కలేర్గతేషు వర్షాణా మభవన్ కురుపాండవాః. రాజ, 1-51.

మత మెక్కువ సహాయపడుచున్నది. ఆభారతయుద్ధమునఁ బడిపోయిన సహదేవుఁ డనురాజుపిదప నతనికొడు కగుసోమాపి యనురాజపుత్త్రుఁడు రాజ్యమునకు వచ్చి గిరివ్రజ మేలినకాలము మొదలుగాఁ బుష్పమిత్త్రునివఱకును బరిపాలకు లైన పెక్కండ్రు రాజుల రాజ్యకాలములను వాయుపురాణము వక్కాణించియున్నది[1]. ఇది యిచ్చినలెక్కలనుబట్టి చూడఁగా, క్రీ. పూ. ౩౨౧ లో, కౌటల్యుఁడు చంద్ర గుప్తుని రాజుఁ గావించినట్లును, అది మొదలుగా ౧౩౭ సంవత్సరము లతనివంశము వారు పాలకు లైనట్లును, అటుపిదప వారిరాజ్య మపహరించి సేనాని యగుపుష్ప మిత్త్రుఁడు క్రీ. పూ. ౪౦౧ వఱకు నేలినట్లును దెలియుచున్నది. పాశ్చాత్త్యు లిచ్చినచంద్రగుప్తకాలమునకును, ఇది యిచ్చినకాలమునకును సుమారు ౨౫౦ సంవత్సరములయంతర మున్నది. గణపతిశాస్త్రిగారు మొద లగుకొందఱు దేనిని బట్టి నిశ్చయించిరో తెలియరాదుగాని వారు చంద్రగుప్తకౌటల్యులను, క్రీ. పూ. నాల్గవశతాబ్దికిఁ జేర్చిరి. ఈభేదములనుబట్టి వీరికాలము విస్పష్టముగాఁ దెలియ రాలే దని చెప్పక తప్పదు గాని, యెట్లయినను, పుష్పమిత్త్రుని బేర్కొన్నపతంజలి (క్రీ. పూ. ౩౫౦ ప్రాంతము) కంటె వీరు పూర్వు లని మాత్ర మూహింప వచ్చును[2]. ఈసందర్భమున మఱొక్కవిశేషము.

ఇందలిదశమాధికరణతృతీయాధ్యాయములో 'అపీహ శ్లోకౌ భవతః' అను మాటతో రెండుశ్లోకము లుదాహరింపఁబడినవి. 'యాన్ యజ్ఞసంఘై స్తపసా చ విప్రాః' ఇత్యాదియు, "నవం శరావం సలిలస్య పూర్ణ' మిత్యాదియు నైనయీ శ్లోకములు భాసునిప్రతిజ్ఞాయౌగంధరాయణములోని వనుట స్పష్టము. 'వీని నుదా హరించుకొన్నకౌటల్యుఁడు భాసమహాకవి కర్వాచీనుఁ' డనుటకుఁ గొందఱు సాహ సింపకపోరు కావున నీవిషయము విచారణీయము.

అర్థశాస్త్రము పదియే నధికరణములందును గొన్నివందలశ్లోకము లున్నవి. అవి యన్నియుఁ గౌటల్యరచితములే కాని యన్యులవి కా వని పరిశీలకులకుఁ దెలియ నిది కాదు. కౌటల్యుఁడు స్వగ్రంథమందు పరశ్లోకము లుదాహరించుట కిష్టపడని వాఁ డనుటకు నొకగొప్పనిదర్శనము కలదు. దశమాధికరణముక డపట.

---

1. సంగ్రామే భారతే తస్మిన్ సహదేవో నిపాతితః
సోమాపి స్తస్య తనయో రాజర్షిః స గిరివ్రజే......
...పుష్యమిత్రస్తు సేనానీ రుద్ధృత్యై వై బృహద్రథమ్
కారయిష్యతి వై రాజ్యం సమాః షష్టిం స దైవతు. వాయు. ఉత్తరఖం. 37 అధ్యా.
2. పాశ్చాత్త్యులు చంద్రగుప్తునికాలము క్రిందికి దింపుటచేతనే పతంజలికాలమును క్రిందికి దిగి క్రీ. పూ. ౧౫౦ అయినది. వారిసిద్ధాంతము సందిగ్ధమే.

'ఏకం హన్యా న్నవా హన్యా దిషుః క్షిప్తో ధనుష్మతా
ప్రాజ్ఞేనతు మతిః క్షిప్తా హన్యా ద్గర్భగతా నపి'

అనుశ్లోక మున్నది. ప్రకరణోద్దిష్ట మైనయిందలిభావమును శ్లోకముగా రచియించు చాణక్యుఁ డిట్టిభావము గలభారతోద్యోగప్రజాగరపర్వములోని—।

"ఏకం హన్యా న్నవా హన్యా దిషు ర్ముక్తో ధనుష్మతా
బుద్ధి ర్బుద్ధిమ తోత్సృష్టా హన్యా ద్రాష్ట్రం సరాజకమ్"

అనుశ్లోక మెఱిఁగియే కొన్ని మాటలు మార్చుకొని స్వకీయశ్లోకముఁ గావించుకొనునుగాని దానినే స్వీకరింపలేదు. ఇట్లే "కాలశ్చ సకృదభ్యేతి" ఇత్యాదిక మైనయిందలియింకొకశ్లోకము పంచతంత్రములో నున్నది. ఈరెండుచోట్లను 'అపీహ శ్లోకశ్చ భవతి' అనుమాటలేదు. ఇక్కడనే కాదు, పూర్వోక్తస్థలమునఁ దప్ప మఱెక్కడను గూడఁ బరశ్లోకోదాహరణసూచక మైనయిట్టిమాట నాకుఁ గనఁబడలేదు. కావున. భాసునిశ్లోకములు ప్రకరణమునకు సముచితములు గా నుండుట కనిపెట్టి యర్వాచీనపాఠకు లెవరో వాని నర్థశాస్త్రమునఁ జేర్చి రనియు, ఇందలిశ్లోకమే పంచతంత్రమునఁ జేరె ననియు విశ్వసింపవలెను గాని, ఆశ్లోకములను గౌటల్యుఁడే స్వయముగా స్వీకరించె నని మాత్రము చెప్పరాదు. దీనిని బట్టి కౌటల్యుఁడు భాసునితరువాతివాఁ డని కలలో నైనఁ దలంపరాదు [1].

ఈయర్థశాస్త్రమునఁ బదియే నధికరణము లున్నవి. అందు మొత్తము ౧౫౦ అధ్యాయము లున్నవి. దండిమహాకవి 'అధీష్వ దండనీతిమ్. ఇయ మిదానీ మాచార్యవిష్ణుగుప్తేన మౌర్యార్థే షడ్భిః శ్లోకసహస్రైః సంక్షిప్తా" అనుచు వ్రాసినదాని కిది యనుష్టుప్ఛందస్సున నాఱువేలగ్రంథముతోడిశాస్త్ర మగు నని భావము కాని, యీ గ్రంథము శ్లోకాత్మక మని కాదు. ఇందు కొన్నివందల శ్లోకములు కలవు కాని సూత్రాత్మకము భాష్యాత్మకము నైనయిది వాక్యగ్రంథమే యనుట విదితము. ఇం దింతకు మున్ను తెలుపఁబడినయర్థశాస్త్రప్రవర్తకులే కాక, మఱికొందఱు రాజులును విద్వాంసులును గూడ నాయాసందర్భములఁ బేర్కొనఁబడిరి. వారు, భద్రసేన— కారూశ—కాశిరాజ— వైరంత్య—సౌవీర—జాలూథ—విదూరథ—సుయాత్ర—ఉదయన—జయత్సేన— దుర్యోధన— నల—యుధిష్ఠిర—మాండవ్య—కాత్యాయన—కణింక—దీర్ఘచారాయణ— ఘోటముఖ—కింజల్క—పిశున—పిశునపుత్రాదులు—ఇందలికాత్యాయనుఁ డేకాత్యాయనుఁడో యూహింప నలవి కాదు. రాజ్యతంత్రజ్ఞుఁ డొకఁ డీపేర నుండె నేమో!

---

1. కౌటల్యకాలనిర్ణయమునుగూర్చి విశేషములు గణపతిశాస్త్రిగారిపీఠికలలోఁ జూడఁ దగును.

దీనికి భట్టస్వామి ప్రతిపదపంచికాఖ్యవ్యాఖ్యయు, మాధవయజ్వ నయచంద్రిక యనువ్యాఖ్యానమును రచియించిరి. మహామహోపాధ్యాయగణపతిశాస్త్రిగారు స్వవిరచితశ్రీమూలావ్యాఖ్యతో దీని ననంతశయనమునఁ బ్రకటించిరి. మైసూరుప్రాచ్యపుస్తకాలయాధ్యక్షు లగుశ్యామాశాస్త్రిగారు దీని నాంగ్లమున ననువదించి ప్రకటించిరి. వీరిద్దఱియభినివేశముననే లోకజ్ఞానఖని యగు నీగ్రంథము దేశదేశముల వ్యాప్తమైన దనుట వాస్తవము. ఈగ్రంథమునం దపాణినీయము లైనప్రయోగములు కొన్ని యున్నవి. దీనిశైలి మిక్కిలి కఠినమగుటయే కాక దుర్బోధము లైనపారిభాషికపదములతోఁ గూడ నిండియున్నది. ఇందుకు, తత్పురుషః=సేవకుఁడు, పరిధి=పన్ను, యుక్తః=రాజకీయాధికారి, ఇత్యాదు లుదాహరణము. పైవ్యాఖ్యానములే లేనియెడల నీగ్రంథ మీకాలమున నెవరికి నర్థము కా దనునంతటిక్లిష్టముగా నున్నను, ఈయర్థశాస్త్రము సర్వార్థసాధక మైన దని మాత్రము చెప్పక తప్పదు. ఈగ్రంథమునఁ గడపటిశ్లోకమునఁ దప్పఁ దక్కినయెల్లచోట్లను గ్రంథకర్త కౌటల్యనామమునే వ్యవహరించుకొనెను. పూర్వమతము లెత్తుకొని యవి సముచితములు కా వని తోఁచినపు డెల్ల "నేతి కౌటల్యః" అనుచు స్వమత మావిష్కరించినస్థలములు కొన్నివంద లున్నవి. ఇతఁడు తనయాచార్యులు చెప్పినవిషయములు గూడఁ గొన్ని తన కిష్టములు కామింజేసి 'ఇత్యాచార్యాః—నేతి కౌటల్యః' అనుచు, అష్టమాధికరణచతుర్థాధ్యాయ మంతటను గురుమతమునకు వ్యతిరిక్త మైనస్వమతము నావిష్కరించుచు వచ్చెను. దీనినిబట్టి యితఁడు గురునిందకుఁ డని భావింపరాదు. ఆయావిషయముల నితఁ డతనికంటె సూక్ష్మబుద్ధితోఁ బరిశీలించినవాఁ డని భావింపఁదగును. ఇతఁడు కావించినయితరమతఖండనమున కొకయుదాహరణము.

శత్రురాజు ప్రబలుఁడై యెదుర్కొనఁ బోవునపుడు హీనబలుఁ డైనరాజేమి చేయవలె నన్నవిషయమున—ప్రవాహవేగమున కణఁగియుండు వేతసవృక్షమువలె నమ్రుఁ డగుచుండుటయే కర్తవ్య మని భారద్వాజుఁడును, జయము రానీ, అపజయము రానీ, తన కున్నయావద్బలముతో నెదురేగి పోరుటయే క్షత్రియధర్మ మని విశాలాక్షుఁడును జెప్పినమాటలను నిషేధించుచు "శత్రు వెదిరించునపు డెల్ల వినతుఁ డగుచుండునా, అట్టివాఁడు సాధు వైనగొఱ్ఱెవలె నిరాశుఁడై వ్యర్థజీవనుఁ డగును. అల్పసైన్యముతోఁ బోయి పోరాడునా, నావ లేక సముద్రముఁ జొచ్చినవానివలె నశించును. కావున బలవంతుఁ డైన మఱియొకరాజు సాహాయ్యము సంపాదించుట గాని శత్రుభేద్యము కానిగొప్పదుర్గమాశ్రయించుట గాని యట్టిసమయమునఁ గర్తవ్యము" [1], అని యితఁడు స్వమతము తెలిపెను. ఇట్లే,

1. అబలీయస మనుద్వాదశాధికరణము మొదట—

రాజుల కెట్టివా రమాత్యులు కాఁ దగుదు రన్నవిషయమునఁ బూర్వాచార్యమతములు వక్కాణించి స్వమత మిట్లు దెలిపి యున్నాఁడు[1].

నిష్కల్మషహృదయుఁడును రాజకార్యనిపుణుఁడు నైనసహాధ్యాయి నృపునకమాత్యుఁడు కాఁ దగు నని భారద్వాజుఁడు. కలసి మెలసి యాడుకొన్నయట్టివాఁడు ఱేనిని బరిభవించును గావున సహాధ్యాయి పనికి రాఁడు. గుహ్యకార్యములందు రాజునకు సమానుఁడై సమశీలవ్యసనములు గలవాఁడు, ప్రభువు తనమర్మము తెలిసికొనునేమో యనుభయముచేఁ దప్పుచేయకుండును గావున నట్టివాఁడు మంత్రి కాఁదగు నని విశాలాక్షుఁడు. దుశ్శీలత్వ మనునది రాజులకును దదధికారులకును గూడ సాధారణ మైనది. అపుడు తనప్రవర్తనదోషము నమాత్యుఁ డధిక్షేపింపకుండ నతనిదోషమును రా జనువర్తించును గావున గుహ్యసధర్ముఁడు కాఁదగఁడు. ఎవఁడు సత్య మైనయనురాగము చూపి రాజు నాపదలనుండి రక్షించునో యట్టివాఁ డమాత్యుఁడు కాఁ దగు నని పరాశరుఁడు. తనప్రాణ మిచ్చి యైనను రాజును రక్షించుట యనునది భక్తిరూప మైనసేవాధర్మము గాని బుద్ధిగుణము కాదు. అందుచేఁ గేవల మట్టివాఁడు తగఁడు. ఎవఁడు ద్రవ్యోత్పత్తివిషయకము లైన కృత్యములందు నియుక్తుఁడై యర్థమును సవిశేషముఁ గావించునో యట్టివాఁడు సచివుఁడు కాఁ దగు నని పిశునుఁడు. కేవలధనాభివృద్ధిపరునకు మిగిలినయమాత్యగుణము లుండనేరవు. కావున నట్టివాఁడు యోగ్యుఁడు కాఁడు. ఎవఁడు తండ్రితాతలనాఁటినుండి వచ్చుసుగుణములు కలవాఁడో, అట్టివాఁడు తన కొకప్పు డపచారము గావించినను రాజును బరిత్యజింపఁడు, అతనిని ద్వేషింపఁడు, కావున నున్నతవంశములోనివాఁడును గులక్రమాగతుఁడు నగువాఁ డమాత్యుఁడు కాఁదగు నని కౌణపదంతుఁడు. కులక్రమాగతుఁడు రాజును గాదని తానే రాజువలెఁ బ్రవర్తించునుగావున నతఁడు తగఁడు. రాజనీతివేత్త యగుక్రొత్తవానిఁ జేర్పఁదగును. అట్టివాఁడు ఱేని కపరాధము చేయఁబోఁడు, అని వాతవ్యాధి. కేవలము నీతిశాస్త్ర మెఱిఁగినంతనే కార్యము లేదు. తదర్థానుష్ఠానపరిచయము కావలెను. అది లేనినూతనపురుషుఁడు స్వకార్యములందు వికలుఁ డగును. అందుచే సద్వంశజుఁడు ప్రాజ్ఞుఁడు శుచి శూరుఁడు రాజానురక్తుఁడు నగుబుద్ధిశాలి యమాత్యుఁడు కానర్హుఁ డని బాహుదంతీపుత్రుఁడు. ఈమతము లన్నియుఁ జూపి, "ఇవి యన్నియును సముచితములే. కార్యసామర్థ్యమును బట్టి పురుషసామర్థ్యము కల్పింపఁబడుచున్నది కావున సహాధ్యాయి మొద లగువారందఱు నయ్యాకార్యముల సమర్థులే యగుదురు గాని పరిత్యాజ్యులు కారు. కావున నేగుణ మెవని కెక్కువగాఁ

1. అధికరణము 1. అధ్యాయము 8. 9.

గలదో వాని నట్టికార్యమున నమాత్యుని గావింపవచ్చును. కాని, పూర్వోక్తులు మంత్రులు మాత్రము కాఁ దగరు. మంత్రియుఁ బురోహితుఁడును బ్రత్యేకగుణములు కలవారు. అందు మంత్రి ప్రధానామాత్యుఁ డనఁబడును. అతఁడు, విజిగీషురాష్ట్రమున మంచివంశమునఁ బుట్టి విద్యలు చదివి కళ లెఱింగి నీతిజ్ఞుఁడై ప్రతిభాశాలియై వాగ్మియై ప్రగల్భుఁడు దక్షుండునై మఱపు లేక రాజకీయవ్యవహారములు జరుపువాఁడై రాజునందు భక్తి కలిగి క్లేశ మైనను సహించుచు స్థిరుఁడు ధీరుఁడునై శీలబలారోగ్యసత్త్వసంపన్నుఁడై సౌమ్యదర్శనుఁడును రాజకార్యమృదువునై వైరములు కల్పింపక చుఱుకుగా రాజకీయకృత్యముల నిర్వహింపఁ గలవాఁడు కావలెను. ఇది మంత్రిగుణసంపద. సత్కులజన్మము సౌశీల్యము సాంగవేదాధ్యయనము దండనీతిజ్ఞత యనుగుణములు కలిగి దైవికములు మానుషములునైనయాపదల నథర్వమంత్రప్రయోగమునఁ బరిహరింపఁ గలసమర్థుఁడు పురోహితుఁడు కాఁదగును" అనుచు నమాత్యపురోహితలక్షణము లభివర్ణించెను. ప్రపంచజ్ఞానమున కాకర మైనదీనినుండి యొకటిరెండుమాట లిట్లుదాహరించి నంతఁ దనివి తీఱదు. ఈకాలమునఁ దప్పక కలాశాలలలో నీగ్రంథము పఠనీయ మగుట కర్తవ్య మనుటకంటె దీనిప్రయోజనమును వేఱుగాఁ జెప్పఁజాలను. ఇఁక దీని ననుసరించి యుదయించినయితరగ్రంథములు.

చాణక్యనీతిసారసంగ్రహము—ఈపేర ౧౦౮ శ్లోకములకావ్య మొకటి యున్నది. ఇది చిన్నదై యర్వాచీన మైనను, చక్కనిశైలిలో సుబోధకముగా నున్నది. ఇందలివిషయము గ్రంథనామమే తెల్పుచున్నది. గ్రంథకర్త ప్రతిజ్ఞ యిట్లున్నది.

"మూలసూత్రం ప్రవక్ష్యామి చాణక్యేన యథోచితమ్
యేన విజ్ఞానమాత్రేణ మూర్ఖో భవతి పండితః"

నీతిప్రకాశిక—ఇది జనమేజయునికి వైశంపాయనుఁ డుపదేశించిన ట్లున్నదని యీక్రిందిపద్యమువల్లఁ దెలియును.

"నీతిశాస్త్ర మిదం ప్రోక్తం మయా తే జనమేజయ;
సంక్షేపేణ, గమిష్యామి యత్ర వ్యాసో గురు ర్మమ"

ఇది యెనిమిదిసర్గలకావ్యము. ఇందు రాజధర్మ—ధనుర్వేదవివేక—ఖడ్గోత్పత్తి—ముక్తాయుధ — సేనానయన — సైన్యయోగ—రాజవ్యాపారములు వర్ణింపఁబడినవి. ఇదియును బైదానివలె నర్వాచీనమే. ఈరెంటికర్తలును గూడఁ దెలియరారు. కాని, ఇది తత్త్వవివృతి యనువ్యాఖ్యతో దేశమున వ్యాపించినది. వ్యాఖ్యాత నంజుండబుధునికుమారుఁడు సీతారామపండితుఁడు. పేరునుబట్టి కర్ణాటకుఁ డని తోఁచుచున్నది.

నీతివాక్యామృతము—జైనపండితుఁ డగుసోమదేవసూరి నిర్మించిన యిది సముద్దేశము లనెడిప్రకరణములతో సుప్రసిద్ధమై యున్నది. ఇతని గురుఁడు సోమదేవముని యని యీక్రిందిపద్యమునఁ దోఁచుచున్నది.

సోమం సోమసమాకారం సోమాభం సోమసంభవమ్
సోమదేవమునిం నత్వా నీతివాక్యామృతం బ్రువే"

వచనరూపమైనయీగ్రంథము కౌటల్యార్థము ననుసరించియు రాజకీయమైనలౌకికశాస్త్రీయవిజ్ఞానమును విశదీకరించిన స్వతంత్రగ్రంథము. 'అథ ధర్మార్థకామఫలాయ రాజ్యాయ నమః' అనుమొదటివాక్యమే గ్రంథోద్దిష్టవిషయమును సూచించుచున్నది. విషయవివరణమునుబట్టి యిది పైరెంటికంటెను బూర్వమునఁ దగియున్నది. అట్టిదనిని పాశ్చాత్యులు కొందఱు క్రీ. శ. ఎనిమిదవశతాబ్దికిఁ జేర్చిరి కాని, అంత యర్వాచీనమై యుండదు. ఇది యశోధరరాజుకాలమున నావిర్భవించినది. యశోధరునికాలము సునిశ్చితము గాకపోవుటచే సూరికాలము సందిగ్ధమైనది.

శుక్రనీతిసారము—పద్యాత్మకమైనయీగ్రంథమునఁ దొలుత నాలుగు ప్రకరణములే యుదయించినవి. తరువాత ౯౬ శ్లోకములతోడిపంచమాధ్యాయ మిందు చేరినది. ఇందుకు—"నీతిశేషం ఖిలే వక్ష్యే హ్యాఖిలం శాస్త్రసమ్మతమ్' అనుమొదటివాక్యమే ప్రమాణము. ఈగ్రంథ మెక్కువగా రాజధర్మములకు సంబంధించినది. ఇందు ప్రథమాధ్యాయమున రాజకృత్యములు ద్వితీయమున యువరాజాదిలక్షణములు తృతీయమున నృపరాష్ట్రసామాన్యలక్షణములు చతుర్థమున సేనానిరూపణమును వివరింపఁబడినవి. ఇది, చతుర్దశవిద్యలు త్రయి యనియు, కుసీద కృషి వాణిజ్య గోరక్షలు వార్త యనియు, నిర్ణయించి—

'దమో దండ ఇతి ఖ్యాత స్తస్మా ద్దండో మహీపతిః
తస్య నీతి ర్దండనీతి ర్నయనా న్నీతి రుచ్యతే'

అని దండనీతిశబ్దమును నిర్వచించినది. అజ్ఞాతకర్తృకమైనయీగ్రంథము కౌటల్యము ననుసరించిన దనుట స్పష్టము. కాని, యిది దానిపెరెత్తలేదు. గ్రంథశైలి మిక్కిలి మృదువై సుబోధక మగును. దేశమునఁ జక్కఁగా వ్యాపించినయిదియు బహువిధమైనలోకజ్ఞాన ముపదేశింపఁ జాలియున్నది.

నీతిసారము—ఇది పూర్వోక్తము లైననాలుగుగ్రంథములకును బూర్వమై కౌటల్యము ననుసరించి యుద్భవించినయుత్తమగ్రంథము. మల్లినాథాదిమహావ్యాఖ్యాత లందఱును దీనిని స్మరించినవారే. కౌటల్యము తొలుత లోకమున లిఖితరూపమున విస్తరిల్లియుఁ దరువాతఁ బ్రచారము లేక చిరకాల మణఁగి యుండి

మొన్న మొన్న ముద్రితమై దేశవిదేశముల వ్యాపించినది. ఇది యట్లు గాక పుట్టిన నాఁటనుండి యుఁ బండితసంప్రదాయమునఁ బఠనపాఠవ్యవహారసిద్ధమై వచ్చినట్లు కనఁబడును. దీనికర్త కామందకుఁడు. ఇతఁ డేదేశమువాఁడో, ఏకాలమువాఁడో నిర్ణయింపఁ దగినయాధారములు లభింపలేదు. శ్లోకాత్మక మైనయిది యిరువదిసర్గల యుద్గ్రంథము. కౌటలీయమును సంపూర్ణముగా ననుసరించినయీకామందకీయము విష్ణుగుప్తు నిట్లు ప్రశంసించినది.

"యస్యాభిచారవజ్రేణ వజ్రజ్వలనతేజసః
పపా తామూలతః శ్రీమా& సుపర్వా నందపర్వతః
ఏకాకీ మంత్రశక్త్యా యః శక్త్యా శక్తిధరోపమః
ఆజహార నృచంద్రాయ చంద్రగుప్తాయ మేదినీమ్
నీతిశాస్త్రామృతం శ్రీమా నర్థశాస్త్రమహోదధేః
య ఉద్దధ్రే నమ స్తస్మై విష్ణుగుప్తాయ వేధసే"

దీని కుపాధ్యాయనిరపేక్ష, నయప్రకాశము, ననురెండువ్యాఖ్యలు కలవు. ఇందు మొదటిది చిక్కదేవరాజమంత్రి యగులక్ష్మీపతిచేఁ గర్ణాటభాషలో ననువదింపఁబడినది. ఈగ్రంథమందు, ఇంద్రియజయము—విద్యావృద్ధసంయోగము—విద్యావిభాగము—దండమాహాత్మ్యము — ప్రకృతిసంపద— రాజపుత్రరక్షణము—ఆత్మరక్షణము—మండలయోగము—సైన్యము—సంగ్రామము— మొద లగుబహువిధము లైనవిషయములు వర్ణింపఁబడినవి. ఇట్లు కామందకుఁ డును (కామందకి యని కొన్నిగ్రంథముల నున్నది) సోమదేవసూరియుఁ గొలఁదిగాఁ గొన్నినూతన విషయములు వివరించినను, వీరికిఁ జాణక్యనీతియే ప్రధానాధారము. అర్థశాస్త్రము లేక రాజనీతి యనుపేరఁ బెక్కుగ్రంథము లుదయింపలేదు గాని, కామందకుఁడు వర్ణించినట్లుగా—

"జాతవేదా ఇ వార్చిష్మా& వేదా& వేదవిదాం వరః
యో గీతవా& సుచతుర శ్చతురో ఽప్యేకవేదవత్"

విష్ణుగుప్తుఁడు నాలుగువేదములసార మొక్కవేద మగునట్లు రచియించిన యర్థశాస్త్ర మొకటే కలకాలము చాలును. ఇఁక నీసందర్భమున దండవివేకమును గూర్చి రెండుమాటలు—

ఈపేర నొకగ్రంథమును గ్రొత్తగా బరోడాసంస్థానమువారు ప్రకటించిరి. ఇదియు నొకవిధముగా రాజనీతియే. కాని, ఎక్కువగా నిది శిక్షాస్మృతి యనఁ దగియున్నది. దీనికర్త యైనవర్ధమానోపాధ్యాయుఁడు బిల్వపంచవంశీయుఁ డైన

భవేశునిపుత్రుఁడు. ఇతఁడు మైథిలరాజైనభైరవునియాస్థానమున ధర్మాధికారి పదవి నధిష్ఠించినవాఁ డగుటచే, క్రీ. పదునాలవశతాబ్దిమధ్యభాగమున నున్నవాఁడని తెలియుచున్నది.

ఈగ్రంథము, కల్పతరు కామధేను హలాయుధ ధర్మకోశ స్మృతిసార కృత్యసాగర రత్నాకర పారిజాత మనుయాజ్ఞవల్క్యసంహితా తట్టీకా తిలక ప్రదీపికా ప్రదీపాదిగ్రంథముల ననుసరించిననిబంధనము. ఏడుపరిచ్ఛేదముల యీమహాగ్రంథమునఁ గొంచె మెచ్చుతక్కువగాఁ బ్రాచీనధర్మశాస్త్రకర్త లందఱిమతములు సందర్భానుసారముగా నుదాహరింపఁబడినవి. ఇందు మనుష్యమారణదండము స్తేయదండము కన్యాదూషణదండము దండపారుష్యదండము ప్రహారణదండము వాక్పారుష్యదండము బంధక్యాద్యభిగమదండము మొదలగుబహువిధశిక్షలు తెలుపఁబడినవి. పదిమంది కలసి యొక్కనిఁ గొట్టినపు డెట్లు శిక్షింపవలెనో, ఏజాతివారి కెట్టి శిక్ష విధింపవలెనో, ఏవిధమైనదొంగతనమున కెట్టిశిక్ష చేయవలెనో చక్కఁగా నిరూపింపఁబడినవి. సాహస మైదువిధము లని యీక్రింది విధముగాఁ జెప్పుచు వీనికిఁ దగినశిక్షలు చూపుట యెంతయు సముచితముగాఁ గనవచ్చును.

"మనుష్యమారణం స్తేయం పరదారాభిమర్శనమ్,
పారుష్య (వాగ్దండ) ముభయం చైవ సాహసం పంచధా స్మృతమ్"

ఈగ్రంథము, ప్రస్తుతశిక్షావిధానము నంతను దెలుపునదియే కాక ప్రాచీనవిధానమును గరతలామలకము గావించుచు శాస్త్రసమ్మతము జనసమ్మతమునైనశిక్షలను విధించుచు సంఘము దుర్నీతిపాలు గాకుండ రక్షించునది గా నున్నది.

## కామశాస్త్రము.

వెనుకటివానివలె నిదియు నొకప్రాచీనశాస్త్రము. దీనియుత్పత్తిని వాత్స్యాయనకామసూత్ర మిట్లు వక్కాణించినది.

"ప్రజాపతి ప్రజలను సృజించి, ధర్మార్థకామములకు సాధనమై వారిసుఖజీవనమునకు హేతు వగునట్టిలక్షాధ్యాయపరిమితమైనశాస్త్రమును బ్రవచించెను. అం దేకదేశమైనధర్మమును వేఱుగా గ్రహించి వైవస్వతమనువు ధర్మాధికారికమైనశాస్త్రము నిర్మించెను. అర్థమును వేఱుగాఁ దీసికొని బృహస్పతి యర్థాధికారికశాస్త్రము రచించెను. మహాదేవునియనుచరుఁ డగునంది, కామమును వేఱుగాఁ గైకొని సహస్రాధ్యాయమైనకామసూత్రము నుడివెను. దానినే, ఔద్దాలకియైనశ్వేతకేతువు సంగ్రహించి యైదువందలయధ్యాయములఁ గామ

శాస్త్రము రచియించెను. దానిని సంక్షేపించి పాంచాలుఁ డైనబాభ్రవ్యుఁడు, సాధారణము సాంప్రయోగికము కన్యాసంప్రయుక్తకము భార్యాధికారికము పారదారికము వైశికము ఔపనిషదికము, అనునే డధికరణములతో నూటయేఁబది యధ్యాయములశాస్త్రము సంతరించెను. అం దాఱవది యగువేశ్యాధికరణమును దత్తకుఁడు పాటలీపుత్రమందలివేశ్యలప్రార్థనమునుబట్టి ప్రత్యేకగ్రంథము గాఁ జేసెను. అది తెలిసికొని, చారాయణుఁడు సాధారణాధికరణమును, సువర్ణనాభుఁడు సాంప్రయోగికమును, ఘోటకముఖుఁడు కన్యాసంప్రయుక్తకమును, గోనర్దీయుఁడు భార్యాధికారికమును, గోణికాపుత్రుఁడు పారదారికమును, కుచుమారుఁ డౌపనిషదికమును, వేఱువేఱుగ్రంథములుగా నొనరించిరి. ఇట్లు పూర్వాచార్యు లనేకులు ఖండఖండములుగా నిర్మించినశాస్త్రము కాలవశమున నుత్సన్నకల్ప మైనది. అందు, బాభ్రవీయనిర్మిత మైనది సంపూర్ణ మయ్యును మిక్కిలి పెద్దది యగుటచేఁ జదువుటకు శక్యము గాని దగుటచేతను, దత్తకాదు లేడుగురు రచియించినవి శాస్త్రభాగములై యసంపూర్ణము లగుటచేతను, పూర్వులు నిర్మించినవాని యందలి యెల్లవిషయమును సంక్షేపించి పఠనయోగ్య మైనయల్పగ్రంథముగా వాత్స్యాయనుఁడు కామసూత్ర మనుపేర నీశాస్త్రము నిర్మించెను''

దీనినిబట్టి శ్వేతకేతువు మొదలుగా, కుచుమారునివఱకును గలపూర్వము లాయాసమయములఁ గామపురుషార్థవిషయకము లైనగ్రంథములు రచియించుచు వచ్చి రనియు, అవి నష్టప్రాయము లైనందున వాత్స్యాయనుఁడు లభించినశాస్త్రభాగము లవలోకించియుఁ, గామసూత్రముతుద నున్న—

"బాభ్రవీయాంశ్చ సూత్రార్థా నాగమయ్య విమృశ్యచ
వాత్స్యాయన శ్చకా రేదం కామసూత్రం యథావిధి"

అనుశ్లోకము చెప్పునట్లు ప్రధానముగా బాభ్రవీయ మైనకామశాస్త్ర మనుసరించియుఁ గామసూత్రము నిర్మించె నని విశద మగుచున్నది. కావున నిపుడు గోచరించుకామశాస్త్రగ్రంథములలో నిది మొదటి దైనను, ఇది పూర్వగ్రంథములసంక్షేపమే కాని కేవలము వాత్స్యాయనోపజ్ఞము కా దని తెలియఁ దగును.

ఈకామసూత్రకర్త, అర్థశాస్త్రము రచియించినకౌటల్యాపరనాముఁ డగు వాత్స్యాయనుఁ డని కొందఱును, న్యాయభాష్యకర్త యగువాత్స్యాయనుఁ డని కొందఱును, చెప్పుచున్నారు గాని, యీ రెండుమతములుగూడ విశ్వాస్యములు గావు. అర్థశాస్త్రము కామసూత్రమును గాని, యిది దానిని గాని స్మరింపలేదు.

దానివ్యాఖ్యాతలు కౌటల్యునికి వాత్స్యాయనసంజ్ఞను వాడలేదు. చాణక్యవిష్ణుగుప్తనామములు వేఱొకయితరగ్రంథకర్తలు కూడ నతని నీపేరఁ బిలువలేదు. కామసూత్రమందు గాని దీనివ్యాఖ్యానములందు గాని వాత్స్యాయననామము తప్ప మఱియొకపేరు కనఁబడదు. ఇది యిట్లుండ, న్యాయభాష్యకర్త కామసూత్రము తన దని యెందును జెప్పలేదు. కామసూత్రకర్త తాను న్యాయభాష్యము వ్రాసినట్లు తెలుపలేదు. ఈరెంటివ్యాఖ్యాత లైనను వీ రిద్దఱు నొకరే యనెడిభావ మెందును సూచింపలేదు. కాని, యాదవప్రకాశ హేమచంద్రులు, అర్థశాస్త్ర కామసూత్ర కర్త లిద్దఱు నొకరే యను నట్లీక్రిందివిధముగాఁ బర్యాయపదము లిచ్చియున్నారు.

"వాత్స్యాయనస్తు కౌటల్యో విష్ణుగుప్తో వరాణకః,
ద్రమిళః పక్షిలః స్వామీ మల్లనాగోఽఙ్గులో ఽపిచ"
"వాత్స్యాయనో మల్లనాగః కౌటల్య శ్చణకాత్మజః,
ద్రామిళః పక్షిలః స్వామీ విష్ణుగుప్తో ఽఙ్గుళశ్చ సః"

విమర్శకులకు మోహము గలిగించెడి యీశ్లోకములయుత్పత్తి యద్భుతమైనది. ఇవి న్యాయభాష్యకర్త నుద్దేశించి పుట్టినట్లు తోఁచునుగాని, అతనికిఁ గౌటల్యచాణక్యనామము లంటఁ గట్టినవి. పోనీ! అర్థశాస్త్రకర్త నుద్దేశించినవే యందుమేని, యతనికి వాత్స్యాయనాదిసంజ్ఞలు తెచ్చిపెట్టినవి. కామసూత్రకర్త నుద్దేశించిన వందుమా, పక్షిలాదిసంజ్ఞలు బాధించుచున్నవి. కాఁబట్టి కలగాపులగముగా నున్నయీపేళ్లపట్టికలు భ్రాంతిమూలకము లనుటకంటె వేఱుగతి కనఁబడదు. ఈసందర్భమున నర్థశాస్త్రకర్తకుఁ గూడ వాత్స్యాయనసంజ్ఞ యున్నదని యంగీకరించినను, ఒక్కొక్క-వాత్స్యాయనుఁడు క్రమముగా, అర్థశాస్త్ర, న్యాయభాష్య, కామసూత్రము లను గ్రంథములలో నొక్కొకటి రచియించినవాఁడే కాని రెండవది నిర్మించినవాఁడుమాత్రము కాఁడు. వీరిలోఁ గామసూత్రకర్త వాత్స్యాయనుఁడు క్రీ. పూ. ప్రథమశతాబ్ది కావలివాఁ డని యొక మతము కలదు. ఇతనికాలము సందిగ్ధము. కాని, కీతుపండితుఁడు మొద లగుకొంద ఱితఁడు వాత్స్యాయనమల్లనాగుఁ డనియు క్రీ. శ. మూఁడవశతాబ్దిలోనివాఁ డనియు నభిప్రాయపడిరి.

కామసూత్రము, సాధారణ — సాంప్రయోగిక—కన్యాసంప్రయుక్తక—భార్యాధికారిక—పారదారిక—వైశిక—ఔపనిషదిక — నామము లైనయేడధికరణముల గ్రంథము. ఇందు మొత్తము ౧౨౦౦ సూత్రములతో ముప్పదియాఱధ్యాయములు కలవు. సూత్రరచనాపద్ధతియుఁ బ్రకరణాదివిభాగరీతియు సరిగా నర్థ

శాస్త్రము ననుసరించినవి గాని, అందలిసూత్రములవలె నిందలివి క్లిష్టములు కావు. లోకజ్ఞానమున కది సాధన మగునట్లే లోకయాత్ర కిది సాధన మగు చున్నది. అయినను, కేవలము విషయసుఖోపాయములను మీఁదు మిక్కిలి పరదారసమాగమోపాయములను బోధించుటచే నిందలివిషయము గర్హ్య మని యిటీవలివారు కొందఱు తలంచుచువచ్చిరి కాని, యీగ్రంథము పూర్వకాలమునఁ దక్కినశాస్త్రములవలెఁ జిరకాలము పండితలోకవ్యవహారమునఁ బ్రసిద్ధము కాక పోలేదు. పూర్వకవు లందఱును గామశాస్త్రము పఠించినవారే యనుటకు వారి వారికావ్యములలో వర్ణింపఁబడిన నాయికానాయకశీలాదులే ప్రమాణము. మహా కవి కాళిదాసు శకుంతల నత్తవారింటికిఁ బంపునపుడు కణ్వునిచేఁ బలికించిన 'శుశ్రూషస్వగురూ' నిత్యాదిశ్లోకములోనినీతులే కాక, యందలిపెక్కుమాట లును, కామసూత్రమందలియేకచారిణీవృత్తములోని వగుటయే యిందు కాద్య నిదర్శనము. దండిమహాకవి యిందలికన్యాసంప్రయుక్తాధికరణములోనియనేక వాక్యముల నట్లే దశకుమారచరిత్రమునఁ గూర్చియున్నాఁడు. మహాకవిభవభూతి మాలతీమాధవము సప్తమాంకమున 'ఏవంహి కామసూత్రకారా ఆమనంతి' యనుచు నిందలివచనము లుదాహరించి యున్నాఁడు. ఇట్లే, అనేకకవులును వ్యాఖ్యాతలును గూడఁ దమరచనలకుఁ గామసూత్రమును సందర్భోచితముగాఁ బ్రమాణముఁగా గ్రహించి రనుటయే దీనియర్హతను జాటుచుండ దీనింగూర్చి చర్చయేల? కాని, ఇం దొక్కమాట. పారదారికాధికరణమున దూతీకర్మా ధ్యాయములో, దూతిక నాయికకుఁ గథలు చెప్పి ప్రవృత్తి గలిగింపవలసిన దను సందర్భమున 'అహ ల్యావిమారక శాకుంతలాదీ న్యన్యా న్యపి లౌకికాని చ కథ యేత్ 'అని యొకవాక్య మున్నది. దీనినిబట్టి, అవిమారకశాకుంతలనాటకములు వ్రాసినభాసకాళిదాసులకంటె వాత్స్యాయనుఁడు పరుఁ డనిమాత్రము భ్రాంతి పడరాదు. శకుంతలకథ భారతప్రసిద్ధమై యుండఁ గాళిదాసనాటకమే దీని కాధార మయ్యె ననుట యుచితము కాదు కదా! జయమంగళవ్యాఖ్యలో నుదాహృత మైనయవిమారకకథ భాసనాటకములోనికథ కించుక భిన్నముగా నుండుటయే యిందలియుద్ఘాటనమున కది యాధారము కా దని స్పష్ట మగుచున్నది. అందుచే భాసునికంటె ముందే వాత్స్యాయనుఁ డవిమారకకథ లోకమునకు సూచించె ననుట విశ్వాస్యము[1]. ఈహేతువునుబట్టి కూడ వాత్స్యాయనుఁడు భాసునికంటెఁ బూర్వుఁడై మన మనుకొన్నకాలమున నున్నవాఁ డని భావింపవచ్చును. అయిన నితనికాల మింకను విచారణీయము.

---

1. అవిమారకకథకు మూలాధార మేదో తెలియకున్నది.

సూత్రకారుఁ డీశాస్త్రము ధర్మార్థకామసాధన మనుదృఢవిశ్వాసముతో 'ధర్మార్థకామేభ్యోనమః' అనుసూత్రము మొదటఁ గూర్చి, గ్రంథాంతమందు—

"తదేత ద్బ్రహ్మచర్యేణ పరేణ చ సమాధినా,
విహితం లోకయాత్రార్థం న రాగార్థో ఽస్య సంవిధిః,
రక్షన్ ధర్మార్థకామానాం స్థితిం స్వాం లోకవర్తినీమ్,
అస్య శాస్త్రస్య తత్త్వజ్ఞో భవత్యేవ జితేంద్రియః"

అనుచు శాస్త్రఫలము వక్కాణించి యున్నాఁడు. దీనినిబట్టి, ఈశాస్త్రము సకలవర్ణములవారును దమతమగృహస్థధర్మమును జక్కఁగా జరుపుకొనుట కుద్దేశింపఁబడినది గాని కేవలము రాగార్థము గా దనియు, దీనిని జక్కఁగాఁదెలిసికొన్నవాఁడు ధర్మార్థకామములకుఁ బరస్పరవైషమ్యముకలుగకుండ జితేంద్రియుఁడై యైహికాముష్మికసాధన మగునట్లు తనజీవయాత్రను సాగించు ననియు విదిత మగుచున్నది. కావునఁ గామశాస్త్రము నీతిబాహ్యము గాక త్రివర్గసాధన మనుట సత్యము. అయితే, పారదారికప్రకరణ మెట్లు సముచిత మగును? అను విషయ మించుక చర్చింతము.

ఈశాస్త్ర మాద్యంతము సవిమర్శముగాఁ జదివినచో సద్బ్రహ్మచారియు లోకహితాభిలాషియు నగువాత్స్యాయనముని యీప్రకరణమును బరదారసమాగమప్రవృత్తికిఁ గాక తన్నివృత్తికే యుద్దేశించినట్లు తెలియును.[1] లోకమునఁ గామాంధులై పరభార్యల నభిలషించువారు చేయునట్టివివిధము లైనయుపాయములను వారిచేష్టలను జూపించిన యీభాగము చదివినవారికిఁ బరదారసమాగమాభిలాషకంటె స్వభార్యాసంరక్షణాభిలాషమే యధికము కాకపోదు. అది గాక, యేశాస్త్ర మైనను మంచిని బోధించుటకుఁ బ్రవృత్త మైనది గాని చెడ్డను బోధించుటకుఁ గాదు. అట్టియెడఁ, బ్రాణికోటికి సహజ మైనకామము ధనాధికారబలమత్తులయెడ దారితప్పి యందందు విజృంభించుట యనుదోషము లోకమున సృష్ట్యాదిసిద్ధమై వచ్చుచుండ, గార్హస్థ్యము త్రివర్గసాధనము గా నుపదేశింపఁబూనినవాత్స్యాయనముని, దోషవివరణమున నట్టిచెడ్డననఁగించుట కుద్దేశించె ననవలెనుగాని, ప్రత్యక్ష మైనయాదోషమునే గుణముఁగా వర్ణించె ననవచ్చునా? అట్లయిన స్త్రీపురుషశీలములను భావపరీక్షను భార్యాధికారికమును ద్రివర్గప్రతిపత్తిని వర్ణించినయీముని యభిప్రాయ మేమై యుండును? అందుచేఁ గామమునకు సంబంధించినయెల్లవిషయములను విశదీకరించునీశాస్త్రమందలియీప్రకర

1. సందృశ్య శాస్త్రతో యోగాన్ పారదారికలక్షితాన్, న యాతి ఛలనాం కశ్చిత్ స్వదారాన్ ప్రతి శాస్త్రవిత్. తదేత ద్దారసుప్తార్థ మారబ్ధం శ్రేయసే నృణామ్, ప్రజానాం దూషణా యైవ న విజ్ఞేయో ఽస్యాయం విధిః. అధి. ౫.

ణము సందర్భోచితమై లోకజ్ఞానదాయక మగుచున్న దనియే విశ్వసింపవలయును. అయినా, ఈశాస్త్రము లౌకికవిద్యానిష్ణాతు లగువిద్వాంసు లెవరికి వారు చదువు కొనఁదగినది గాని, శిష్యులకుఁ బాఠము చెప్పఁదగినది కా దని మాత్రము నా యభిప్రాయము. విశదీకరించి చెప్పుటకు సిగ్గు కలిగించుసందర్భము లిందుండుటయే యందుకుఁ గారణము.

దీని కుదయించినవ్యాఖ్యలలో యశోధరునిజయమంగళవ్యాఖ్యయు, వీర భద్రుని కందర్పచూడామణియు[1] భాస్కరనరసింహశాస్త్రికృతవృత్తియు దృగ్గో చరము లగుచున్నవి. "వాత్స్యాయనీయం కిల కామసూత్రం వ్యాఖ్యాయి త త్రైకశ్చి దిహా న్యథైవ" అనువాక్యమునుబట్టి యశోధరునికిఁ బూర్వము దీనికి గొన్నివ్యాఖ్యానము లున్నట్లు తెలియును గాని యవి కనరావు. యశోధరుఁడు క్రీ. శ. అష్టమశతాబ్దివాఁ డనియు దశమశతాబ్దిలోనివాఁ డనియు రెండుమత ములు కలవు. ఇతఁ డోకసామంతప్రభు వనియు, గురుదత్త మైనయింద్రపదమ నుబిరుదము కలవాఁడనియుఁ దెలియవచ్చును. ఈశాస్త్ర మవశ్యపఠనీయ మని యితఁడు వ్యాఖ్యావతారికయందు చక్కఁగా సమర్థించియున్నాఁడు. భాస్కర వంశమున జన్మించిననరసింహశాస్త్రి కాశీనివాసుఁడు, సర్వేశ్వరశాస్త్రిశిష్యుఁడు. ఇతఁడు వ్యాఖ్యావతారికలోని 'వత్సోపరి వాత్సల్యా ద్వాత్స్యాయననామకామ శాస్త్రం యః' అనువాక్యమున వత్సరాజుమీఁది ప్రేమచే వాత్స్యాయనుఁడు కామసూత్రము రచియించె నని సూచించియున్నాఁడు కాని, యీవత్సుఁడు వత్స దేశరాజో, ఈపేరు గలమఱియొకదేశపు రాజో తెలియఁదగిన మాట లేవియుఁ జెప్పియుండలేదు. కామసూత్రములకుఁ గందర్పచూడామణి యనుపేర శ్లోక రూపవ్యాఖ్య రచియించినవీరభద్రుని స్మరించిననరసింహశాస్త్రివృత్తి జయమంగళ కంటె నర్వాచీన మగుట విదితము. వీరభద్రుఁడు ౧౬౩౩ లోఁదనగ్రంథము పూర్తి చేసినట్లు వ్రాసికొనియున్నాఁడు. ఇది విక్రమశకమో శాలివాహనశకమో తెలుపలేదు. ఎట్లయిన నితనికిఁ బరుఁ డగునరసింహశాస్త్రి పదునెనిమిదవశతాబ్ది మొదటిభాగములోనివాఁ డగును. ఇతఁ డజ్ఞాతానంద మయినమోక్షముకంటె జ్ఞాతానంద మగుకామమే యుత్తమపురుషార్థ మనుభావము వెల్లడించుచు, కామ శాస్త్రమును సమర్థించెను. భాస్కర యనునింటిపే రితఁ డాంధ్రజాతీయుఁ డని తెలుపుచున్నది.

ఏతాదృశ మైనకామసూత్రము ననుసరించి తరువాత నుదయించినకామ శాస్త్రగ్రంథములలో మొదట గణింపఁదగినది రతిరహస్యము. దీనికర్త కొక్కోక కవి యగుటచే నిది కొక్కోక మనియుఁ బిలువఁబడుచున్నది. కొన్నిప్రతులలోని కడపటిపద్యగద్యము లితఁడు, సింహలపాటలీయుఁ డనియుఁ బారిభద్రుఁ డనియు

1. ఇది కామసూత్రము ననుసరించినది గాని సరియైనవ్యాఖ్య కాదని తోఁచుచున్నది.

సింహాలీయుఁ డనియు వేఱువిధముగాఁ జెప్పుచున్నవి. ఎట్లయిన నితఁడు సింహాలీయుఁ డగుట సత్యము. ఇతనిముత్తాత విఖ్యాతపండితుఁ డగు తేజోకుఁడు. ఇతనితండ్రి గద్యవిద్యాధరకవి. ఇది బిరుదై యుండును. మల్లినాథుఁడు పేర్కొన్నయీకవి క్రి. పదియేనవశతాబ్దిలోనివాఁడై యుండును. ఇతఁడు గ్రంథావతారికలోఁ ద న్నిట్లు వర్ణించుకొనియున్నాఁడు.

"కొక్కోకనామ్నా కృతినా కృతో ఽయం శ్రీవైన్యదత్తస్య కుతూహలేన....సకలకలాకలాపనిష్ణాతో వాగ్విలాసజితబృహస్పతిః కొక్కోకనామా కవిః నందికేశ్వర శ్వేతకేతు పాంచాల దత్తక చారాయణ సువర్ణనాభ ఘోటకముఖ గోనర్ద గోణికాపుత్ర కూచిమార వాత్స్యాయన ప్రభృతిభిః కృతేభ్య శ్శాస్త్రేభ్య స్సార మాదాయ రతిరహస్యాఖ్యం గ్రంథ మారభమాణః—"

ఈవైన్యదత్తుఁ డెవఁడో తెలియరాదు. ఇతఁడు, కామసూత్రకర్తపేర్కొన్న పూర్వుల నందఱిని బేర్కొనుచు వారిశాస్త్రములు చూచినట్లు తెలిపెను గాని, వారిగ్రంథములలో ననేకము లుత్పన్నములైనట్లు వాత్స్యాయనుఁడు చెప్పి యుండ నితని కాగ్రంథము లెట్లు లభించెనో తెలియకున్నది. పరిశీలింపఁగా నిది ప్రాచీనకామశాస్త్రగ్రంథకర్తలను సగౌరవముగా స్మరించుట గాని, వారిగ్రంథములను బ్రత్యక్షముగా సందర్శించుట కా దని తోఁచుచున్నది. కావున నితని కృతికి మూలాధారము వాత్స్యాయనీయసూత్రమే యని విశ్వసింపవచ్చును.

కొక్కోకము పదిపరిచ్ఛేదములపద్యగ్రంథము. కాంచీనాథుఁడు దీపిక యనుపేరను, రామచంద్రబుధేంద్రుఁడు ప్రకాశిక యనుపేరను దీనికి వ్యాఖ్యలు నిర్మించిరి. ఇది కామసూత్రము ననుసరించి పుట్టినదైనను దానికంటె నెక్కువగా లోకమున వ్యాపించి ఖ్యాతి గాంచిన దనుట విదితము. తరువాత దీని నెక్కువగా ననుకరించి హరిహరపండితుఁడు శృంగారదీపిక యనునామాంతరముగల మఱియొక రతిరహస్యమును, కల్యాణమల్లుఁ డనంగరంగమును రచియించిరి. 'నాకావ్యము చదివినయోగులమనస్సుగూడఁ జలించు నన్నఁ దక్కినవారిమాట చెప్పనేల?' యని ప్రతిజ్ఞ చేసినహరిహరుఁడు పూర్వులను మించి కొన్నిభాగములు మిక్కిలి పచ్చిగా వర్ణించియున్నాఁడు. 'లోడీఖాన్'అను మహమ్మదీయనాయకునిసంతుష్టికై రచియింపఁబడినయనంగరంగమును 'భోగసుఖము పరాత్మపరమానందముతో సమాన'మనుచుఁ గేవలతుచ్ఛసుఖమునకే ప్రాధాన్య మిచ్చినది. జ్యోతీశ్వరాచార్యుఁ డెక్కువగాఁ గామసూత్రమునే యనుసరించి పంచసాయక మనుగ్రంథము నిర్మించియున్నాఁడు. అది వీనికంటెఁ గొంతమృదువై విశేషాంశముల నలరారుచున్నది. ఇట్లే యింకను రుద్రకవినిర్మిత స్మరదీపికయు, మీననాథకృతరతిరత్నప్రదీపికయు, రతిదేవవిరచితయోగాధికారమును, నాగార్జునకృతవశీకరణతంత్రమును, ఘోటముదత్తనిర్మితవిటవృత్తమును, మొదలగునవి కామపురుషార్థప్రధానములై

యవతరించినవి గాని వీనికి వ్యాప్తిలేదు. క్షేమేంద్రుఁడు కామశాస్త్రగ్రంథము కూడ నిర్మించినట్లు 'శ్రీనందీశ్వర రంతిదేవ ఫణితం క్షేమేంద్రవిద్యాగమమ్' ఇత్యాదిజ్యోతీశ్వరవాక్యమునఁ దెలియును గాని, అది కలావిలాసకుట్టనీమతము లలో నేదైననొకటి యగునేమో యని తోఁచుచున్నది. వీనికి వేఱుగాఁ గామసూత్రసార మతఁడు నిర్మించె ననికొంద ఱందురు గాని యది కనరాదు. ఇవి యిట్లుండ—

దత్తకసూత్రము కూచిమారతంత్రము, అని మఱిరెండుగ్రంథములు కనఁబడుచున్నవి. పేళ్లనుబట్టి యివి కామసూత్రకర్త పేర్కొన్నపూర్వాచార్యులు నిర్మించిన వని భ్రాంతి కలుగవచ్చును గాని యివి వారివి కావు.

"యద్దత్తకేన ప్రమదాహితార్థం కాంతానువృత్తం కథితం స్వతంత్రే,
తస్మాత్సమాహృత్య సమస్త మస్యం వేశ్యాంగనావృత్త మహం ప్రవక్ష్యే"

అనుశ్లోకమునుబట్టి, దత్తకునివైశికాధికరణములోనిశయనోపచారికాదిభాగములను సంగ్రహించి యన్యు లెవరో దత్తకునిపేర నీసూత్రము నిర్మించినట్లు విశదమగును. కాని, వాత్స్యాయనునినాఁటికే యుత్పన్నకల్ప మైనదత్తకునివేశ్యాధికరణ మన్యులెవరికో లభించియుండు ననుటయు విశ్వాస్యము కాదు. అందుచే నెవరో వేశ్యాంగనావృత్తము రచియింపఁ బూని దానిని దొలుత రచియించి ప్రసిద్ధి గన్నదత్తకాచార్యునిపేర నీసూత్రము వెలయించి యుందు రని యూహింపవలసివచ్చినది. అట్లే, కూచిమారునిపేర నెవరో యీతంత్రము రచియించి యుందు రని యిందలి—

"కూచిమారేణ తపసా యత్కృతం క్రీడనం పురా,
తత్ప్రవక్ష్యామి చిత్రార్థం నానార్థపదనిశ్చితమ్"

అనుమాటలవల్లనే స్పష్ట మగుచున్నది. మూఁడుపటలములయీతంత్రమందు వృష్యయోగము లధికముగాఁ జూపఁబడినవి. ఇవి గాక, వీరణారాధ్యుఁడు మొద లగుమఱికొందఱు పంచరత్నము మొద లగుస్వతంత్రము లైనకామశాస్త్రగ్రంథములు రచియించినట్లు తెలియుచున్నది. కాని యిట్టి వన్నియు లోకమున నిపుడు విస్మృతప్రాయము లైనవి.

ఇది శ్రీచర్ల బ్రహ్మయశాస్త్రి గురువరకరుణాధీతపాణినీయుఁడును,
ఆంధ్రభాషానుశాసనాంధ్రదశరూపకాంధ్రభాషావాఙ్మయ
చరిత్ర ప్రయోగచింతామణ్యాదికృతికర్తయు నైన
మల్లాది సూర్యనారాయణశాస్త్రి సంతరించిన
సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయభాగ
మగులౌకికవాఙ్మయచరిత్రయందు
పఞ్చమాధ్యాయము.

# షష్ఠాధ్యాయము



## అలఙ్కారశాస్త్రము

ఇం దలంకారశబ్దము శబ్దార్థాలంకారమాత్రపరము కాదు. విద్వల్లోక ప్రతీతినిబట్టి యీప్రకరణమున కీపేరు పెట్టఁబడినను, సాహిత్యలక్షణకర్తలయభిప్రాయములనుబట్టి కావ్యమునకు శోభను గలిగించునట్టి రీతి వృత్తి శయ్యా పాక ధ్వని భావ రస ప్రసాద యమ కోపమా కథాపాత్రౌచిత్యాదిసకలకావ్యధర్మములును, అలంకారశబ్దవాచ్యములే యని భావింపఁదగును. సాహిత్యవిషయము లైన పై కావ్యధర్మములను గూర్చి యెచ్చుతక్కువగాఁ బరామర్శించిన లాక్షణికు లందఱును దమగ్రంథముల కేదో యొక పేరు పెట్టుచు వచ్చినను, అం దనేకగ్రంథముల నలంకారవిషయ మెక్కువగా నుండుటనుబట్టి వాని కలంకారగ్రంథము లనియు వారి కాలంకారికు లనియు వ్యవహారము వ్యాప్త మైనది. దానంజేసి యిది యలంకారశాస్త్ర మనఁబడినను దీనికి సాహిత్యశాస్త్ర మనుపేరే సముచిత మగును.

అలంకారశాస్త్రము తరువాతఁ బుట్టి క్రమముగా సహస్రముఖముల విస్తరించినది గాని, అందలిబీజములుమాత్ర మనాదు లనఁ దగినంత ప్రాచీనములు. సర్వప్రపంచవాఙ్మయముల కోఙ్కార మైనఋగ్వేదమందు కావ్యధర్మబీజము లెన్నో మొలకెత్తిన వనుటకంటె వానిసనాతనత్వమునకు వే ఱొకనిదర్శన మక్కఱలేదు. ఈసందర్భమున ఋగ్వేదమును బహువిధఖండకావ్యములసంపుట మనియు మహేతిహాస మనియుఁ జెప్పవచ్చును. అందు చిన్నచిన్నయితిహాసములును వివిధము లైన వర్ణనలును లెక్కలే నన్ని యున్నవి. అందు, అపాల ఊర్వశీపురూరవులు భుజ్యుఁడు వృశుఁడు మొదలగువారికథలు శృంగారవీరాద్భుతాదిరసప్రధానములై వెలయుచున్నవి. ఉష స్సింధు సరస్వత్యాదివర్ణన లుపమోత్ప్రేక్షారూపకాద్యలంకారముల విరాజిల్లుచున్నవి. ఈవిషయము ప్రథమభాగమున విశదీకరింపఁబడినది[1].

వేదములలోనియితిహాసములు కొన్ని బ్రాహ్మణారణ్యకోపనిషత్తులందు పెద్దవైనవి. అందు లేనికొన్ని మృదుమధురభాషలోఁ గ్రొత్తగా నుదయించినవి[2]. అట్లు

---

1. చూ. సం. వా. చ. ప్రథ—పంచమాధ్యాయము.
2. చూ. ,, ,, సప్తమాధ్యాయము.

వైదికవాఙ్మయమునఁ గనవచ్చు మొలకలే రామాయణ భారతసంహితాదులందు శాఖోపశాఖలుగాఁ బెరిఁగినవి. ఇందు లేనికావ్యధర్మములే లే వనియు, అందును దొలికావ్య మైనశ్రీమద్రామాయణము సర్వలక్షణసంపన్న మగుకావ్యం బిరవొట్టిల్లనియుఁ బాఠకలోక మెఱుఁగక పోలేదు. భరతముని యుందలిశ్లోకము లుదాహరింపకపోయినను, అతనినాట్యశాస్త్రమందలికావ్యధర్మలక్షణములకుఁ బ్రమాణము రామాయణమే యని యంగీకరింపక తప్పదు. అందుచే ఋగ్వేదాదులందలి కావ్యధర్మములను సేకరించి పెంచి యలంకరించుకొన్న రామాయణము సాహిత్యశాస్త్రమునకు లక్ష్యము లక్షణము నైనయాద్యగ్రంథ మనుట నిర్వివాదము. తరువాత దీనిని నాట్యశాస్త్రమును జూచి భాసకాళిదాసాదులకావ్యములు బయలు దేఱినవి. వీని నన్నిటి నవలోకించి నవనవవేషములతో దండ్యాదులకావ్యలక్షణములు తల యెత్త నారంభించినవి. ఇది యిప్పటికి దృగ్గోచర మగుచున్న యలంకారశాస్త్రోత్పత్తిమార్గము. దీనినిబట్టి కావ్యధర్మములే ప్రాచీనము లనియు వానిసంజ్ఞ లర్వాచీనము లనియు భ్రాంతిపడరాదు. ప్రసక్తి లేకపోవుటచే వేదరామాయణాదులందు రీతి వృత్తి పాక గుణాదులసంజ్ఞ లుండుట కవకాశము లేదు గాని, కొన్నిటిపేళ్లు భరతనాట్యశాస్త్రమునకు మున్ను లేకపోలేదు, రామాయణబాలకాండచతుర్థసర్గ ప్రక్షిప్త మనుమాట నిజమే కాని[1] అది యెంత ప్రక్షిప్తమైనను నాట్యశాస్త్రమునకుఁ దరువాతిది కాదు. కావున నందలిశృంగారాదిరససంజ్ఞలు[2] భరతాచార్యునికిఁ బూర్వమే సారస్వతమున నున్న వనుట విదితము. భగవత్పాణిని, ఆఱుసూత్రములం దుపమానశబ్దమును బేర్కొని మఱియొక సూత్రమం దుపమానోపమేయసాధారణధర్మములను సూచించియున్నాఁడు[3]. యాస్కుఁడు, ఉపమాశబ్దమును నిర్వచించియున్నాఁడు[4]. బాదరాయణుఁడు రూపకశబ్దమును బేర్కొనియున్నాఁడు[5]. ఈశబ్దము లీగ్రంథములం దలంకారపరములు కాకపోయినను, ప్రతిపాదించినవిషయములనుబట్టియు నిర్వచనములను బట్టియు నలంకారజ్ఞాపకము లైనయివియే యలంకారసంజ్ఞ లని తెలియరాకపోదు. కావున నాట్యశాస్త్రమునకుఁ బూర్వమే యాలంకారికసంజ్ఞ లన్నియుఁ గాకున్నఁ గొన్ని యైన నున్న వని నమ్మవచ్చును.

---

1. చూ. ద్వితీయాధ్యాయము. పుట 38
2. రసైః శృంగార కారుణ్య హాస్య వీర భయానకైః
   రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్య మేత దగాయతామ్. రా. 1. 4-9.
3. అష్టా—6. 2-80 ; 3. 1-10; 2. 1-55; 5. 4-97, 137; 3. 4-45,—2. 1-56.
4. నిరు. 3.
5. బ్ర. సూ. 1. 4-1.

ఏతాదృశకావ్యధర్మములను విశదీకరింపఁ బూని కనవచ్చినవానిలో మొదటిది భరతనాట్యశాస్త్ర మనుట పునరుక్తము. దీనింగూర్చి ప్రథమాధ్యాయమునఁ గొంత తెలిసికొనియున్నాము. ఇందలి ౫, ౬, ౭, ౧౬, ౧౭—౨౬ అధ్యాయములు, పూర్వరంగనాందీప్రస్తావనాదులను, శృంగారాద్యష్టరసములను శాంతరసస్వరూపమును, విభావాదిబహుభావభేదములను, కావ్యలక్షణకావ్యగుణదోషాదులను, దశవిధరూపకలక్షణములు భారత్యాదివృత్తులు దూతీపరిచారికానాయికాదిలక్షణములు నటసూత్రధారవిదూషకాదిధర్మములు మొదలగువానిని క్రమముగా వివరించుచున్నవి. తరువాతిలాక్షణికులు నిర్వచించినయలంకారప్రభేదములలోఁ గొన్ని యైనను, దీనికిఁ బూర్వమును దీనినాఁడును సారస్వతమం దున్నను, ఇది—

“ఉపమా దీపకం చైవ రూపకం యమకం తథా
కావ్య స్యైతే హ్యాలంకారా శ్చత్వారః పరికీర్తితాః,

అనుచు, ఉపమాదులు నాలుగే యలంకారము లని నిరూపించినది. ఇట్లు పెక్కు కావ్యధర్మములను బోధించినయీనాట్యశాస్త్రమే తరువాతియాలంకారికలక్షణములకు సర్వవిధముల నాధార మయ్యె ననియు, ఈచతురలంకారనిరూపణము గూడ సాహిత్యలక్షణములలో నిది యాద్య మనెడియభిప్రాయము స్థిరపఱుచునొక హేతు వనియుఁ దెలియనగును. ఈవిషయమున నెల్లవిమర్శకు లేకీభవించుచున్నారు గాని, కొందఱు కాళిదాసకాలమును, క్రీ. పంచమశతాబ్దివఱకు దిగలాగుచు నాట్యశాస్త్రము క్రీ. తృతీయశతాబ్దిప్రాంతమందలి దని యూహించుచున్నారు. భరతకాళిదాసాదిప్రాచీనులకాలములనుగూర్చి విమర్శకులెల్లరు గావించిననిర్ణయము లూహాలమీఁద నాధారపడినవే కాని ప్రబలప్రమాణబద్ధములు కావు, కానేరవు. కావున గాంధర్వవేదసందర్భమునఁ జదివినట్లుగా నాట్యశాస్త్రము క్రీ. పూ. తృతీయశతాబ్దిప్రాంతమందలిదే యని మనము భావింతము. అట్టియీనాట్యశాస్త్రమునుగూర్చియు, తక్కినయాలంకారికలక్షణములను గుఱించియు, తత్కర్తలను గూర్చియు, పరిశోధకులు కొందఱు విపులముగాఁ జర్చించుచు గ్రంథములను వ్యాసములను వ్రాసి యాంగ్లమునఁ బ్రకటించియున్నారు. వారివ్రాఁత లన్నియు నేకగ్రీవము కావు కాని, సందర్భానుసారముగా వారియభిప్రాయములు గూడఁ దీసికొనుచు గ్రంథవిస్తరము గాకుండ దీనిని బరిశీలింతము.

భరతాచార్యునికిని దండిభామహులకును మధ్యకాలమందును, భరతముని నాఁడును, అతనికిఁ బూర్వమును, కొందఱు సాహిత్యలక్షణకర్త లున్నట్లు గ్రంథాంతరవచనములవల్లఁ దెలియుచున్నది గాని, వారికృతులు మాత్ర మెవ్వరి

కిని గోచరింప కున్నవి. కావ్యాలంకారలక్షణసూచనలు భరతునికి మున్నే యున్న వని మన మింతకు మున్నొకవిధముగాఁ దెలిసికొనియున్నాము కాని, రాజశేఖరుఁ డీమార్గమును గాక, తక్కిన పెక్కువిద్యల కున్నట్లే కావ్యవిద్యకును దేవతాసంబంధ మున్నట్లు నిరూపించి, అందలివివిధశాఖలయుత్పత్తిమార్గముల నీక్రింది విధమున వేఱుగాఁ జూపియున్నాఁడు.

“శ్రీకంఠుఁడు, పరమేష్ఠివైకుంఠాదిచతుష్షష్టిశిష్యులకును; భగవానుఁడైనయాస్వయంభువు, నిజేచ్ఛాసంజాతులైన తనశిష్యులకును; ఉపదేశించినరీతిని మేము కావ్యమీమాంస గావించుచున్నాము. బ్రహ్మశిష్యులలో సరస్వతీపుత్త్రుఁడు కావ్యపురుషుఁడు. ప్రజాహితకాముఁడైనప్రజాపతి, కావ్యవిద్యాప్రవర్తనమున కతని నియోగించెను. అతఁ డష్టాదశాధికరణములతోడియావిద్యను దివ్యులకుఁ జెప్పెను. వారిలో సహస్రాక్షుఁడు కవిరహస్యమును, ఉక్తిగర్భుఁ డౌక్తికమును, సువర్ణనాభుఁడు రీతినిర్ణయమును, ప్రచేతాయనుఁ డానుప్రాసికమును, చిత్రాంగదుఁడు చిత్రమును యమకములను, శేషుఁడు శబ్దశ్లేషను, పులస్త్యుఁడు వాస్తవమును, ఔపకాయనుఁ డౌపమ్యమును, పారాశరుఁ డతిశయమును, ఉతథ్యుఁ డర్థశ్లేషను, కుబేరుఁ డుభయాలంకారికమును, కామదేవుఁడు వైనోదికమును, భరతుఁడు రూపకనిరూపణీయమును, నందికేశ్వరుఁడు రసాధికారికమును, ధిషణుఁడు దోషాధికరణమును, ఉపమన్యుఁడు గుణౌపాదానికమును, కుచమారుఁ డౌపనిషదికమును జదివిరి. తరువాత వారు తమచదివినభాగములను వేఱువేఱుశాస్త్రములుగా రచియించిరి. ఇట్లొనరింపఁబడినకావ్యవిద్య ప్రకీర్ణ మగుటంజేసి కొంత యుచ్ఛిన్నమైనది. అందుచే సర్వాధికరణార్థము సంక్షేపించి యల్పగ్రంథమున నీయష్టాదశాధికరణి యగుకావ్యమీమాంసను రచియింపఁ బూనితిమి.”

రాజశేఖరుఁడు, తాను నిర్మింప నుద్దేశించినకావ్యమీమాంసలోనికవిరహస్యాదు లగుపదునెనిమిదియధికరణములను ముల్లోకములలోనిపదియేడుగురు పెద్దల కంటఁగట్టుచు వ్రాసినయీయవతారిక కొన్నిస్మృతీతిహాసపురాణాదులలోని యవతారికల ననుకరించి గ్రంథమహత్త్వప్రశంసాపరముగా నున్న దనుట స్పష్టము. అయినా, అంతా కల్ల గాకుండ నొకపీస మిందు సత్య మున్నది. ఇతఁడు పేర్కొన్న వారిలో భరతుఁడు ‘రూపకనిరూపణీయమునే’ నాట్యశాస్త్ర మనుపేర రచియించినమాట వాస్తవము. సువర్ణనాభుఁడు కుచమారుఁడు ననువారు క్రమముగాఁ గామశాస్త్రసంబంధము లైనసాంప్రయోగికము—ఔపనిషదికము—అనెడిప్రకరణములు రచియించినవా రని వాత్స్యాయనకామసూత్రము చెప్పుచున్నది. కాని, వారు కావ్యవిద్యాసంబంధము లైనరీతినిర్ణయము — ఔపనిషదికము — అనుభాగములు రచియించినవా రనుట కితనిమాట తప్ప వేఱొకప్రమాణము కనరాదు.

తక్కినమానవలోకములోనిపెద్దలు కొందఱిపేళ్లు పురాణాదులలోఁ గనవచ్చినను, వారు కావ్యమీమాంసాభాగములు రచియించినవా రనుట కేయాధారములు దొరకనప్పుడు, స్వర్గపాతాళాదులలోనివారు నిర్మించినగ్రంథములు గగనకుసుమము లనుట కాక్షేప మేమి ?—ఇంక, దండికావ్యాదర్శములోని—[1]

"పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగా నుపలక్ష్య చ"
"ఇతి వాచా మలంకారా దర్శితాః పూర్వసూరిభిః"

అనుచోట, హృదయంగమావ్యాఖ్యాత, కాశ్యపవరరుచిప్రభృతులు నిర్మించినశాస్త్రము లని యర్థము వ్రాసెను గాని, ఆగ్రంథములపేళ్లు చెప్పలేదు. కావ్యాదర్శశ్రుతపాలినీవ్యాఖ్యాకర్త, పై స్థలములందు కాశ్యప బ్రహ్మదత్త నన్దిస్వాములను బేర్కొనెను గాని వారిగ్రంథములను జెప్పలేదు. వీరిలోని వరరుచి వాక్యకారవరరుచి యనుట కాధారము లేదు గావున, వీ రందఱును దండికిఁ బూర్వులై యుందురుగాని భరతునికిఁ బూర్వులు కాఁజాల రని చెప్పవచ్చును. ఇది యిట్లుండ, కావ్యప్రకాశమున కాదర్శవ్యాఖ్య రచియించినమహేశ్వరుఁడును, సాహిత్యకౌముదికిఁ గృష్ణానందినీవ్యాఖ్య నిర్మించినవిద్యాభూషణుఁడును, భరతాచార్యుఁ డగ్నిపురాణములోని యలంకారసాహిత్యశాస్త్రవిషయములను సంగ్రహించి కారికలుగా నిర్మించె నని చెప్పుచున్నారు. అందలి 336—346 వఱకును గలపదునొకండధ్యాయములందు దృశ్యపాఠ్యకావ్యసంబంధము లైనవివిధవిషయములును వర్ణింపఁబడియున్నమాట నిజము. కాని, భరతేన ప్రణీతత్వా ద్భారతీ రీతి రుచ్యతే' అనుచు వృత్తికి బదులుగా రీతిని బ్రయోగించి భరతాచార్యుని బేర్కొన్నయగ్నిపురాణ మతనినాట్యశాస్త్రమునకుఁ బూర్వము గాక పర మని విదిత మగుటచే మహేశ్వరవిద్యాభూషణు లీవిషయమునఁ బ్రమాదపడి రని భావింపవలసియున్నది. మఱియు, సాహిత్యదర్పణకర్త యగువిశ్వనాథకవిరాజు, కావ్య ముపాదేయ మనుటకుఁ బ్రమాణముగా,—

"నరత్వం దుర్లభం లోకే విద్యా తత్ర సుదుర్లభా
కవిత్వం దుర్లభం తత్ర శక్తి స్తత్ర సుదుర్లభా"

అనెడియగ్నిపురాణశ్లోక ముదాహరించియున్నాఁడు. అద్భుతసారకర్త యగుబల్లాలసేనుఁడు మొద లగునిద్దఱుముగ్గురు నగ్నిపురాణమును బ్రమాణముగా స్వీకరించియున్నారు. కాని, వీరు మిక్కిలి యర్వాచీను లగుటచే వీరిమాటలనుబట్టి యది యాలంకారశాస్త్రమునఁ బ్రమాణగ్రంథ మని కాని యాద్య మని కాని

1. 1-2, 2-7,

భ్రాంతిపడరాదు. సుప్రసిద్ధులు ప్రాచీనులు నగుదండిభామహాదు లెవరును దమ గ్రంథములం దగ్నిపురాణములోని కావ్యాలంకారవిషయములను గైకొనలేదు. దానిపేరెత్తలేదు. అందుచేతనే కావ్యాదర్శకావ్యాలంకారధ్వన్యాలోకములలోని కొన్నియలంకారనిర్వచనములును, అగ్నిపురాణములోనితల్లక్షణములును సరిగా నేకీభవించుచున్నను, ఈవిషయమున నది వీని ననుసరించినది గాని, యివి దాని ననుసరింప లేదని విమర్శకు లూహింపవలసివచ్చినది. ఈయంశమును పి. వి. కాణే పండితుఁడు చక్కఁగాఁ జర్చించి సిద్ధాంతీకరించెను[1]. అగ్నిపురాణము వీనిపేరెత్తకపోవుటనుబట్టి యివి యే దాని ననుసరించిన ట్లూహింపరా దని యీ విషయమునఁ గొందఱికిఁ దోఁచవచ్చునుగాని, అది, తా నన్నివిధముల మొదటి దాన ననెడియుద్దేశముతో బయలుదేఱినపురాణ మగుటచే నిట్టిసంశయమున కవకాశమే లేదు. ఇంతకును, పురాణచరిత్రసందర్భమునఁ జదివినట్లుగా, అగ్నిస్కాందాదిపురాణములలోని పెక్కుభాగములు ప్రక్షిప్తము లైనయర్వాచీనము లనుట నిజము. కావున విషయవిమర్శనమునుబట్టి క్రీ. తొమ్మిదవశతాబ్దిప్రాంతమున నగ్నిపురాణమందు ప్రవేశించిన పూర్వోక్తాధ్యాయములు కావ్యాదర్శాదులకుఁ బూర్వములు కా వనవచ్చును. ఇది యిట్లుండ—

భామహుఁడు తనకావ్యాలంకారములో 'త ఏత ఉపమాదోషాః సప్త మేధావినోదితాః' అనుచు మేధావి యనునొకయాలంకారికునిమతము క్రోడీకరించియున్నాఁడు. రుద్రటునికావ్యాలంకారమునకు వ్యాఖ్య వ్రాసిననమిసాధువు 'గూడ మేధావిరుద్రప్రభృతిభిః' అనుచు నతనిఁ బేర్కొనియున్నాఁడు. అయినను, ఆమేధావి, లేక మేధావిరుద్రునిగ్రంథము కనరాదు. అశ్వఘోషుఁ డొకయాలంకారికగ్రంథము నిర్మించె నని దానిచీనాభాషానువాదమువల్లఁ దెలియుచున్నది గాని, ఆసంస్కృతగ్రంథము మృగ్యము. ధర్మకీర్తి యనునొకకవి యాలంకారికుఁ డందురు గాని, అతనికృతియు లేదు. దీనినిబట్టి భరతాచార్యునికిఁ బూర్వమును, అతనికిని దండిభామహులకును నడుమను గొన్ని కావ్యాలంకారలక్షణములు పుట్టినట్లు సూచన లున్నను, అవి చిరకాలముక్రిందటనే యంతర్ధాన మైనట్లు తేలినది. కాని, భట్టికావ్యములోని కావ్యాలంకారలక్షణరూప మైనప్రసన్నకాండము దండిభామహులకృతులకుఁ బూర్వ మని విమర్శకులు కొంద అనుచున్నారు. అందుకు భట్టికావ్యకర్త యెవఁడు? ఏకాలమువాఁడు? అనువిషయములు పరిశీలింపవలసి యున్నది. పెక్కండ్రు పెక్కువిధములఁ జర్చించినదీని నిందు సంగ్రహముగా ముచ్చటింతము.

---

1. చూ. P. V. Kane, M. A. గారి సాహిత్యదర్పణాంగ్లటీక.

పతంజలిమహాభాష్యవ్యాఖ్య లగుత్రిపదీదీపికలును వాక్యపదీయమును సుభాషితత్రిశతియు భట్టికావ్యమును రచియించినమహావిద్వాంసుఁడు మహాకవి భర్తృహరి యని ప్రాచీన మైనపాఠకలోకసంప్రదాయము. ఇందు భట్టికావ్యము మాత్రము భట్టియను నతఁడు రచియించినదే కాని భర్తృహరి నిర్మించినది కాదని కతిపయవిమర్శకమతము. తక్కినవానికర్త యగుభర్తృహరికంటె సుభాషితత్రిశతికర్త యగుభర్తృహరి వే ఱనియేకదేశిమతము[1]. మహాభాష్యవ్యాఖ్యాత యగుభర్తృహరియే పాణినీయసిద్ధశబ్దరూపములకు లక్ష్యలక్షణరూప మైనభట్టికావ్యము నిర్మించియున్నాఁ డని మనము పాణినీయవ్యాకరణసందర్భమున వెనుకఁ జదివియున్నాము. భాష్యవ్యాఖ్య లిపుడు కనరాకపోవుటచే వానియందు భర్తృహరి స్వవిషయ మేమైనఁ దెల్పెనో లేదో తెలియదుగాని, వాక్యపదీయమునందు గాని భట్టికావ్యాదులందు గాని యితఁడు నిజవిషయ మేమియుఁ జెప్పియుండలేదు. ఇపు డితనిగ్రంథములఁ గనవచ్చెడిగద్యలు లేఖకులును వ్యాఖ్యాతలును జేర్చినవి గాని, యితనివి గా వని వానివైవిధ్యమే చెప్పుచున్నది. అయినను, వారు తమ నాఁటికిఁ దెలియవచ్చిన కృతికర్తృత్వవిషయకసంప్రదాయము ననుసరించియే యట్లు గద్యలు వ్రాసి రని మనమంగీకరింపవలసియున్నది గాని, మూలగ్రంథకాలమునకును వ్యాఖ్యానకాలమునకును, అంతరము మిక్కిలి హెచ్చుటచేఁ గొంత కింవదంతి యందు చేరకపో దని మాత్రము నమ్మవలసి యున్నది. ఇందు కితనిఁ గూర్చి లోకమున విస్తరించిన పుక్కిటిపురాణగాథలే నిదర్శనము.

భర్తృహరిని భట్టి విక్రమార్కులతోఁ జేర్చియు, విక్రమార్కునిసోదరుని గావించియు, ఒకానొకదేశమునకు రాజుఁ గావించియు, భార్య దుశ్శీలము కారణముగా నితని సంసారవిరక్తుని జేసియు, ఏవేవో కొన్నికథలు వ్యాపించిన వని మన మెఱుఁగుదుము. అందు, తనచెవిని బడినయొకకథ నమ్మియే సుభాషితత్రిశతికి వ్యాఖ్య రచియించిన ఆవంచరామచంద్రపండితుఁడు సహృదయానందినీవ్యాఖ్యావతారికలో "విప్రే ణాభూతపూర్వం ఫల మధితప సాలమ్భ్య సూర్యప్రసాదాత్" ఇత్యాదిశ్లోకమున భర్తృహరివైరాగ్యమును వర్ణించియున్నాఁడు. కథ లిట్లుండ, వ్యాఖ్యాతలును, లేఖకులును వ్రాసిన యవతారికలు గద్యలు నెట్లున్నవో చూతము.

౧. త్రిపదీ—దీపికా—వ్యాఖ్యలు (భర్తృ) హరినిర్మితము లని కైయటుఁడు.
౨. వాక్యపదీయమును, త్రిపదీదీపికావ్యాఖ్యలును (భర్తృ) హరిప్రణీతము లని, కాశ్మీరరాజగుముక్తాపీడునిమంత్రియైనలక్ష్మణునివంశములోనివాఁడును

1. ఈవిషయము నీతికావ్యసందర్భమున విచారింపఁబడినది.

భూపతిరాజపుత్త్రుఁడు నగు హేలరాజు వాక్యపదీయవ్యాఖ్య యగు హేల రాజీయమునఁ జెప్పియున్నాఁడు[1].

3. క్రీ. ౧౭౮౦ లోని పుణ్యరాజు తనవాక్యపదీయటీకాంతమునందు, గురు ప్రశంసయు, మూలవ్యాఖ్యానప్రశంసయుఁ గావించుచు నిట్లు చెప్పి యున్నాఁడు.

"శశాఙ్కశిష్యా చ్ఛృత్వైత ద్వాక్యకాణ్డం, సమాసతః,
పుణ్యరాజేన తస్యోక్తా సఙ్గతిః కారికాశ్రితా.
గురవే భర్తృహరయే శబ్దబ్రహ్మవిదే నమః,
సర్వసిద్ధాన్తసన్దోహసారామృతమయాయ చ"

౪. సుభాషితత్రిశతీవ్యాఖ్య యగుసహృదయానందినితుద, "ఇతి... శ్రీభర్తృ హరియోగీన్ద్రవిరచితా సుభాషితత్రిశతీ సంపూర్ణా"

౫. పురుషార్థదశకము తుద—"ఇత్యాచార్యభర్తృహరి ప్రణీతం పురుషార్థ దశకం సంపూర్ణమ్"

౬. భట్టికావ్యమునకు మనోహరాఖ్యవ్యాఖ్య వ్రాసిన శ్రీధరపండితుఁడు సర్గాం తములం దిట్లు వ్రాసెను.
"వ్యాఖ్యానే భట్టికావ్యస్య శ్రీధరీయే మనోహరే"

౭. ఒకవ్రాఁతప్రతిలో "శ్రీమద్గోవిందదీక్షితసూనువిక్రమావరజభట్టిమహాకవి విరచితే మహాకావ్యే" ఇత్యాది—[2].

౮. ముగ్ధబోధినీకర్త యగుభరతపండితుని మాట లిట్లున్నవి—
"భర్తృహరి ర్నామ కవిః శ్రీరామకథాశ్రయం మహాకావ్యం చకార—ముగ్ధబోధిన్యాం భట్టిటీకాయామ్."
"భట్టిటీకాం ప్రకురుతే భరతో ముగ్ధబోధినీమ్" ఇత్యాది—[3]

౯. ఇంకొకవ్రాఁతపుస్తకములో "ఇతి భర్తృకావ్యటీకాయాం జయమంగళాయామ్"[4]

౧౦. ఇంకొకప్రతిలో జయమఙ్గళాన్తగద్యమున "వలభీవాస్తవ్యస్య శ్రీస్వామి సూనో ర్భట్టిమహాబ్రాహ్మణస్య మహావైయాకరణస్య—"ఇత్యాది—[5].

---

1. కైయటహేలరాజులశ్లోకములు పాణినీయసందర్భమున నుదాహరింపఁబడినవి.
2. తంజావూరులైబ్రరీకేటలాగు. సంపు. VI నంబరు—3712.
3. తం. లై. కే. సం. VI
4. తం. లై. కే. సం. VI నంబరు—3715.
5. ఈప్రతి నేను సంస్కృతకవిజీవితము వ్రాసినకాలమున 1909 లోఁ జూచితిని

౧౧. ఇండ్యాకలిఖితమూలమాత్రపుస్తకముతుద నున్నశ్లోకము, దానితరువాతి గద్య, ఇట్లున్నవి.[1]
"ప్రవిధాయ ధృతిం పరాం జనానాం,
యువరాజం భరతం తతో ఽభిషిచ్య,
జఘుటే తురగాధ్వరేణ యష్టుం
కృతసమ్భారవిధిః పతిః ప్రజానామ్. ౩౧.
ఇతి భట్టి కావ్యే తిఙన్తకాణ్డే లుఙ్విలసితం నామాదితః ద్వావింశ స్సర్గః."

౧౨. జటీశ్వర—జయదేవ—నామాంతరుఁడగు జయమంగళుఁడు, వ్యాఖ్యారంభమున నిట్లు వ్రాసెను.

"శ్రీస్వామిసూనుః కవి ర్భట్టినామా రామకథాశ్రయం మహాకావ్యం చకార—"

ఇతనివ్యాఖ్యతోఁడి గ్రంథముతుద నీక్రిందిశ్లోకము లున్నవి.

1. ఇద మధిగతముక్తిమార్గచిత్రం, వివదిషతాం వదతాం చ సన్నిబంధాత్,
జనయతి విజయం సదా జనానాం, యుధి సుసమాహిత మైశ్వరం యథా స్త్రమ్.
2. దీపతుల్యః ప్రబన్ధో ఽయం, శబ్దలక్షణచక్షుషామ్,
హస్తామర్ష ఇ వాన్ధానాం, భవే ద్వ్యాకరణా దృతే.
3. వ్యాఖ్యాగమ్య మిదం కావ్య, ముత్సవ స్సుధియా మలమ్,
హతా దుర్మేధస శ్చాస్మిన్, విద్వత్ప్రియతయా మయా.
4. కావ్య మిదం విహితం మయా వలభ్యామ్,
శ్రీధరసేననరేన్ద్రపాలితాయామ్,
కీర్తి రతో భవతా న్నృపస్య తస్య,
ప్రేమకరః క్షితిపో యతః ప్రజానామ్.
ఇతి భట్టికావ్యే ద్వావింశతితమ స్సర్గః.

కావ్య మిత్యాది—మ యేదం కావ్యం విహితం కృతమ్. శ్రీధరసూనునా నరేన్ద్రనామ్నా నృపేణ పాలితాయామ్... వలభీనామకపుర్యామ్. అత ఏవ కావ్యవిధానాయ యా కీర్తిః సా తస్యైవ రాజ్ఞో భవతాత్ ...—[2].

---

1. తంజావూరులైబ్రరీ. నం. రు_3707.
2. ఇది, బొంబాయి నిర్ణయసాగరప్రెస్సులో_1928_అచ్చుపడినది.

ఇంకను గలవు కాని, ఈపండ్రెండువిధముల నున్నవానికి సామరస్యము కుదురునో కుదురదో చూతము. ఇందు మొదటిరెండును జెప్పినవారి భర్తృహరియే యని నామైకదేశన్యాయము స్మరింపఁజేయుచు మూఁడవది స్థిరపఱుచుచున్నది. ఇది చెప్పినశబ్దబ్రహ్మవేత్త యగుమహావైయాకరణుఁడును, నాల్గవది చెప్పినపాతంజలయోగవేత్త యగుయోగీంద్రుఁడును, ఐదవది చెప్పినయాచార్యుఁడును భర్తృహరియే యని తప్పకవిశ్వసింపఁదగియున్నది. ఒకకావ్యమునే, ఆఱు, పదునొకండ్లు భట్టికావ్య మన్నవి. తొమ్మిదవది భర్తృకావ్య మన్నది. ఈరెంటికి నాధారము నామైకదేశన్యాయ మని తెలియఁగలదు. ఏడు, పది, పండ్రెండులు భట్టి కవి యన్నవి. ఎనిమిదవది భర్తృహరి కవియనియు భట్టికావ్య మనియుఁ జెప్పినది. పదునొకండవదానిలో లేనట్లే, మూలమాత్ర మున్న వేఱువ్రాఁతపుస్తకములలోను ముగ్ధబోధిన్యాదిటీకలతోడిలిఖితపుస్తకములలోను గూడ, పండ్రెండవదానితుదఁ గనవచ్చుగ్రంథాంతశ్లోకములు లేవు సరిగదా! అట్టివ్రాఁతప్రతులలోఁ గొన్నిటి యందు భట్టికావ్యకర్త భర్తృహరి యని కనఁబడుచున్నది. తంజావూరులిఖిత పుస్తకపట్టిక ప్రకటించినవారీవిషయ మిట్లే తెలుపుచున్నారు [1]. ఒకజయమంగళావ్యాఖ్యతోడిపుస్తకములలోఁ బెక్కింట నీశ్లోకము లున్నవి. అట్టిపుస్తకమే నిర్ణయసాగరముద్రణమునకు లభించినది. అందలిశ్లోకము లాధారముగా నాధునికవిమర్శకులు కొందఱు 'భట్టికావ్యము భర్తృహరి రచించినది కాదు.' అనువాదము లేవ నెత్తిరి [2]. అంతే కాని, యీశ్లోకములు భట్టికావ్యమూలకర్తవా? వ్యాఖ్యాతవా? అనువిషయ మాలోచింప రైరి. మఱియు, మూలములో 'శ్రీధరసేన' యనియు, వ్యాఖ్యలో 'శ్రీధరసూను' అనియు, గద్యలో 'శ్రీస్వామిసూను' అనియు మూఁడువిధముల నున్నపాఠములకు గతి యేమో యూహింప రైరి. మూలపాఠమును వలభీపురపాలకు లగుధరసేనులకు సరిపుచ్చుచు భట్టికావ్యకాల నిర్ణయమునకు మాత్రము గడంగిరి. కావున వివాదకారణ మైనయీశ్లోకచతుష్టయ మెవరిదో ముందు కనుఁగొందము.

గ్రంథప్రశంసాపరము లైనప్రథమద్వితీయశ్లోకములను గూర్చి యంతగా విచారింపఁ బనిలేదు. ఇఁక మూఁడవశ్లోకము—"ఈకావ్యము వ్యాఖ్యానము లేకుండఁ దెలియరాదు. దీనిని జదివి గొప్పవిద్వాంసులు సంతోషించినఁ జాలును. నేను గొప్పపండితులకుఁ బ్రియుఁడనై శబ్దశాస్త్రజ్ఞానము లేనిదుర్మేధసుల నిం

1. తంజావూరు కేటలాగు. 3707 నంబరు. The name of the author apppears in some Mss. as Bhartrhari.

2. చూ. పి, వి, కాణేపండితుని సాహిత్యదర్పణాంగ్లపీఠిక.

దణఁచి వైచితిని* అనుభావము వెల్లడించుచున్నది. ఆహా! ఏమిభావము! కవి యెవఁడైనఁ గానిండు. ఈయాలోచన మెంతయుదార మైనదో చూడుఁడు. తాను రచియించినకావ్యమున కిట్టిప్రయోజనము ప్రకటించినకవి లోకములో నుండునా? నిజముగా దురాశయగర్భిత మైనయీశ్లోకము మూలకర్తది కాదనుటకుఁ బ్రబల మైనహేతు వొకటి కలదు చిత్తగింపుఁడు.

భామహుఁడు తనకావ్యాలంకారద్వితీయపరిచ్ఛేదములో, కావ్యప్రసంగము కావించుచు, నానాధాత్వర్థగంభీరయు యమకవ్యపదేశినియు నగుప్రహేళిక సుఖబోధ్యము గా దనుతలంపుతో, ఇట్టికావ్యములు కూడా శాస్త్రములవలె వ్యాఖ్యాగమ్యము లైతే, వీనివల్ల మంచివిద్వాంసులు సంతోషింతురు కాని, ప్రజ్ఞ చాలనివా రణఁగిపోవుదురుగదా, అయ్యో! అనుభావము వెల్లడించుచు—

"కావ్యా న్యపి య దీమాని వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్,
ఉత్సవ స్సుధియా మేవ హన్త దుర్మేధసో హతాః"

అనుశ్లోకము చెప్పెను. ప్రహేళికాసందర్భ మవకాశముగా నుదయించిన యీశ్లోకము శాబ్దికజ్ఞానప్రయోజనమును, క్లిష్టార్థము నైనభట్టికావ్యమున కన్నివిధముల సరిపడుట యెఱింగినజయమంగళుఁడు తా నట్టికావ్యమునకు వ్యాఖ్య వ్రాసి వన్నె తెచ్చితి నన్నయుత్కర్ష ప్రకటించుకొనుటకై దీనియర్థమే వచ్చునట్లు 'వ్యాఖ్యాగమ్య మిదంకావ్య'మిత్యాదిగాఁ బూర్వోదాహృత మైనమూఁడవ శ్లోకము కల్పించె ననుట విస్పష్టముగా గోచరించుచుండ నది మూలకర్తది కాదనుట కింకను సందేహ మేల? ఆతృతీయశ్లోకము మూలకర్త దనియెఱిఁగియే భామహుఁడు భట్టికావ్యనిరసనపరముగా నిట్లుచెప్పిన ట్లెల భావింప రాదని కొంద ఱడుగవచ్చును గాని, ప్రాచీనగ్రంథకర్త లెవరు నట్లు తమకృతులఁ బ్రయోజనమును వర్ణించినజాడయే కనఁబడదు. ఇఁక నాల్గవశ్లోకము చూతము.మూలమును బట్టి శ్రీధరసేనరాజుపాలించు—వ్యాఖ్యనుబట్టి, శ్రీధరునిపుత్త్రుఁ డైననరేంద్రుఁడను పేరుగలరాజుపాలించు—వలభీపురమున నే నీకావ్యము రచియించితిని.—నే ననఁగా భట్టియే యందము—అందుచే నీకావ్యరచనమువలనికీర్తి యీరాజున కగుఁగాక—అనుభావము తెలుపుచున్నది. ఇది చరిత్రవిషయకము గావున శ్రద్ధగాఁ బరిశోధింపఁదగియున్నది. 'శ్రీధరునిపుత్త్రుఁ డైననరేంద్రుఁ డనురాజు'అనెడియర్థము వ్యాఖ్యానమున విస్పష్టముగా నున్నది గావున మూలములో 'సేన'పదమునకు బదులుగా 'సూను'పదమే యుండవలె నని విదిత మగుచున్నది. ఆపక్షమున విమర్శకు లాలోచించినట్లు శ్రీధరసేను లనెడివారు రారు. నరేంద్రుఁ డనెడిరాజు వచ్చును. వలభీశాసనములలో శ్రీధరసేను లున్నారు కాని, నరేంద్రాహ్వయుఁడు లేఁడు.

సేన—భట్టు—అనుపదములు వలభీరాజుల పేళ్ల తుద గౌరవార్థకములై చేరుట కల్లదు. కావున శ్రీధరుఁ డనువాఁడు శ్రీధరసేనుఁ డనఁ దగును గాని, అతఁడు నరేంద్ర సంజ్ఞుఁడు కాఁజాలఁడు. వలభీరాజవంశమునం దాపేరు గలరాజొకఁ డుండు నేమో కాని, మొదటిధరసేనుఁడు మొదలుగా నాల్గవధరసేనునివఱకుఁ గలమధ్యకాలమందు—క్రీ.౫౦౦—౬౫౦ నడుమ—భట్టియనువాఁ డతని కంకితముగా భట్టికావ్యము రచియించి యుండు ననెడి విమర్శకులయాశయము మాత్రము సరికా దని దీనివల్లఁ దేలుచున్నది. ఇంక—

“శ్రీధరపుత్రుఁ డైన నరేంద్రుఁడు పాలించు వలభీపురమున నే నీకావ్యము నిర్మించితిని. ఈకావ్యరచనకర్తి యా నరేంద్రరాజున కగుఁగాక” యనెడి కవియాశయము విమర్శింతము. నరేంద్రునికి యశ స్సెట్లు వచ్చును? గ్రంథమున కతని పేరు పెట్టుటచేతనో, అవతారికలో నతనిగుణములు వర్ణించుటచేతనో. అట్టియవతారిక లేదు. పేరు కనఁబడదు. కవి భట్టి, కావ్యము భట్టికావ్యము. ఇఁక నరేంద్రునిపే రేది? ‘కీర్తి రతో భవతా న్నృపస్య తస్య’ అనుపాదము, నరేంద్రునికిఁ గావ్యకర్తృత్వ మారోపించి యతనికిఁ గీర్తి తెచ్చునట్లు చెప్పుచున్నది గాని, క్రియ కనఁబడదు. అతనికిఁ గీర్తి తెచ్చుట కవియాశయ మైనచో నిది నరేంద్రకావ్యము కావలెను గాని భట్టికావ్యము కాఁగూడదు. అందుచే భట్టి యనెడియొకకవి నరేంద్రుఁ డనెడివలభీరాజున కీకావ్యమునఁ గీర్తి తెచ్చె ననెడి యర్థము పొసఁగదు. కావున నీనాలుగుశ్లోకములును మూలకర్తవి కావనియు, వ్యాఖ్యాత యగుజయమంగళుఁడు కల్పించిన వనియు స్పష్ట మగుచున్నది. ఇందుకుఁ గొన్ని కారణములు పైని జూపఁబడినవి. వానినే యొక్కచో సంగ్రహింతము.

౧. ముగ్ధబోధిన్యాదివ్యాఖ్యానకర్త లీశ్లోకము లెఱుఁగరు.
౨. మూలముమాత్ర మున్నపుస్తకములలో నివి కనరావు.
3. కావ్యకర్త యెవఁడును మూఁడవశ్లోకములో నున్నరీతిని గర్వముతోడి యనుచితోక్తులు పలుకఁడు.
౪. చతుర్థశ్లోకభావమునుబట్టి యీకావ్యము నరేంద్రునిపేర లేదు.
౫. ఆనరేంద్రునికి భట్టియనువ్యవహార మున్నదని యూహింత మన్న గద్యలో ‘శ్రీస్వామిసూనో ర్భట్టిమహాబ్రాహ్మణస్య’ అను విశేషణము లుండుటం బట్టి కవిభట్టి వే అనవలెను. ఇంతకును వలభీశాసనములలో శ్రీధరపుత్రుఁ డైన నరేంద్రనామకరాజు కనరాఁడు[1].

---

1. చూ. ఇండియన్ ఏంటిక్వేరీ_సం. 10.

౬. భట్టి యనుకవి వలభీపురమున నీకావ్యము రచియించి యొకరాజునకుఁ గీర్తియే యభిలషించెనేని, వలభీశాసనములలోని రాజవర్ణనములం దీవిషయము తప్పక యుండును. కాని, అట్లులేదు.

ఈహేతువులనుబట్టి, ఈశ్లోకములలో మొదటి మూఁడింటిని, కావ్యమహత్త్వముతోడి తనవ్యాఖ్యానమహిమ ప్రకటించుకొనుటకును, కడపటిశ్లోకమును దా నేదోవిన్న చరిత్రాంశము చేర్చుటకును మిక్కిలి యర్వాచీనుఁ డైనజయమంగళుఁడు కల్పించిన వని తప్పక చెప్పవచ్చును; నమ్మవచ్చును. పూర్వోదాహృతము లైనయెనిమిది, పండ్రెండుసంఖ్యలు గలయవతారికలలోని గ్రంథారంభవచనములు పోలి యుండుట చూడఁగా, ముగ్ధబోధినీవ్యాఖ్యను జూచియే జయమంగళావ్యాఖ్య పుట్టిన దనవచ్చును. దీనినే యది చూచి పుట్టినచో నీశ్లోకముల నది గ్రహించియుండును. ముగ్ధబోధిని క్రీ. ౧౪౬౫ లో జనియించినది. దాని తరువాతి దైనజయమంగళ చేర్చినపుక్కిటి పురాణ మెట్లువిశ్వాసనీయ మగును? అయితే భట్టికావ్యకర్త యెవఁడు ? భట్టియే. భర్తృ భట్టిశబ్దములసంబంధముపై దృష్టి పెట్టక తొలుత జయమంగళుఁడును, అతనినిబట్టి యిప్పటివిమర్శకులును, పొరపడిరిగాని, భర్తృహరియు భట్టియు నొకఁడే.

కాత్యాయనునికృతికి, 'కాతీయ'మనియు, కుమారిలభట్టుమతమునకు 'భట్టమత' మనియు వాడుక వచ్చినట్లే భర్తృహరికావ్యమునకుఁ దొలుత 'భర్తృకావ్య' మనువాడుక కలిగినది. నిజముగా నీవాడుక యున్న దనుటకు ముగ్ధబోధినిమాటలే ప్రమాణము. అది, 'భర్తృహరి ర్నామకవిః శ్రీరామకథాశ్రయం మహాకావ్యం చకార' అని మొదటఁ జెప్పి, తుదను, కావ్యమును భట్టికావ్య మన్నది. తొమ్మిదవసంఖ్యవ్రాఁతపుస్తకము నిజ మైనవ్యవహారమునుబట్టి 'భర్తృకావ్యటీకాయామ్' అన్నది. నామైకదేశన్యాయమునుబట్టి కైయటాదులు భర్తృహరిని 'హరి'యని వ్యవహరించినట్లే, అతనియీకావ్యమును 'భర్తృకావ్య'మని తొలుతఁ బాఠకులు వ్యవహరించినట్లు విశ్వసింపవచ్చునుగదా! ఈకావ్యముమొదటిపేరు రావణవధ యని జయమంగళాంతగద్యములోని 'భట్టిమహాబ్రాహ్మణస్య...కృతౌ రావణవధే...' అనుమాటలే చెప్పుచున్నవి. నిజ మైనపే రిది యైనను, కవినిబట్టి పాఠకలోకము దీనినిభర్తృహరికావ్య మని వాడుచుండ, దానిసంగ్రహరూప మైన భర్తృకావ్య మనుసంజ్ఞ స్థిరపడినది. ఆదేశమునం దాకాలమునఁ బ్రాకృత మెక్కువగా వాడుకలో నున్నందున నిందలిభర్తృశబ్దమునకుఁ బ్రాకృతరూప మైనభట్టిశబ్ద మాదేశ మైనది. దానితో భట్టికావ్యసంజ్ఞ లోక మావరించినది. ఇది నిజ మైనభట్టికావ్యసంజ్ఞాస్వరూపము. ఇట్లు మాఱుచు వచ్చినదీనిస్వరూపము తెలిసిన కొంద ఱర్వాచీనులు దీనిని భర్తృకావ్య మనుట కూడఁ గలదనియభిప్రాయమును సమ

ర్థించుచున్నది. ఇంక, ఇందలిభర్తృ'భట్టి'యగుటకుఁ బ్రాకృతవ్యాకరణములే కాదు, పూర్వకవిప్రయోగములును బ్రమాణము లగుచున్నవి [1]. ఇట్లుసిద్ధ మైనయీభట్టిపదము భట్టియనెడియొకవేఱుకవి కలఁ డనెడిభ్రాంతికి మూల మయినది. ఈ భ్రాంతికి భర్తృహరి భట్టివిక్రమార్కులఫుక్కిటిగాథలు సాధకము లైనవి. భట్టియనుమఱియొకపురుషుఁడు డున్నాఁడో లేఁడో, ఆవిషయ మిపుడు విచారింపఁ బనిలేదు. గాని, భట్టికావ్యములోనిభట్టిశబ్దముభర్తృహరిపరమే యని మాత్రము చెప్పవచ్చును. సర్ మోనియర్ విలియమ్సుపండితుఁడుగూడ నిట్లే యభిప్రాయపడుచు భట్టిశబ్దమున కర్థము వ్రాయుసందర్భమున "భట్టి, భర్తృస్వామి—హరి—భట్టిసామి—స్వామిభట్ట—అను పేళ్ల వ్యవహరింపఁబడెను. ఇతఁడు, మహావైయాకరణుఁడు. వాక్యపదీయము మొదలగువ్యాకరణగ్రంథములు భట్టికావ్యము సుభాషితత్రిశతి, అనువానిని రచియించెను" అని విశదీకరించెను, కావున భర్తృహరియే భట్టికావ్యకర్త యనెడిప్రాచీనపాఠకమతమే నిజ మగుచున్నది. ఇఁక నేఁడు పండ్రెండుగద్యలలోనియితనితండ్రిమాట. గోవిందశ్రీస్వామిశబ్దములు సమానార్థకములు పర్యాయపదములు నగుట నిం దేదో యొకటి యితనితండ్రిపే రగునేమో ! కాని, ఇందుకితరప్రమాణము లభింపలేదు. ఇట్లే, ఇతనిభ్రాత విక్రముఁ డనుటకును, ఇతనినివాసము వలభీపుర మనుటకును గూడ నితరాధారములు లేవు. కావున నివి సందిగ్ధములు. ఇఁకఁ బ్రస్తుతవిషయ మైనయితనికాలము.

భట్టికావ్యాంతశ్లోకము జయమంగళకల్పిత మని యింతకు మున్నే విదిత మైనదిగావున, అది యాధారముగా, త్రివేదీపండితుఁడును, కాణేపండితుఁడును మొద లగువారు, వలభీపురరాజు లగుధరసేనులకాలమునందు క్రీ. ౫౦౦—౬౫౦ నడుమ భట్టికావ్యము పుట్టియుండు ననుచుఁ బ్రకటించినయూహయు; మూఁడవ ధ్రువసేనునిశాసనమునుబట్టి భట్టికావ్యకర్త బప్పఁ డనువానిపుత్త్రుఁడు భట్టిభటుఁ డనియు నతఁడాకాలమువాఁడనియుఁ గొందఱు చేసినయూహయుఁ బరాస్తములగుచున్నవి. ఇఁక, మందసారసూర్యదేవాలయశాసనములోనిశ్లోకములు భట్టికావ్యద్వితీయసర్గలోనిశరదృతువర్ణనశ్లోకములకు సరిపడుచున్న వని చెప్పుచు, క్రీ. ౪౭౩ సంవత్సరమునం దాశాసనమందలిశ్లోకములు రచియించినవత్సభట్టియే భట్టికావ్యకర్త యని తలంచిన బి. సి. ముజుందారుపండితునియూహ సమంజసముగా దని ఏ. బి. కీతుపండితుఁడు పరామర్శించియున్నాఁడు. వత్సభట్టి భట్టికావ్యకర్త యనుట నిరాధారము గావున దానితోఁ దన్నిర్ణీతకాలమును బ్రమాణబద్ధము గా దనుట తెల్లము. ఏ. బి. కీతుపండితుఁడు పూర్వవాదము లంగీకరింప

1. భర్తృదారకః=భట్టిదారఓ, భర్తుః=భట్టిణో, ఇత్యాదులు.

కున్నను, భట్టికావ్యము వాక్యపదీయకర్తయగుభర్తృహరి వ్రాసినది గాదనుచు, అది దండిభారవికవులకంటెఁ బూర్వ ముదయించిన దని చెప్పెను[1]. ఇది యైనను, ఊహయే కాని సిద్ధాంతము కాదు. అందుచే నితనికాలము సందిగ్ధముగా నున్న మాట సత్యమేకాని, నేను సంస్కృతకవిజీవితము రచియించిననాఁటియభిప్రాయము మార్చుకొనఁ దగినప్రమాణము లభింపమిచే, క్రీ. ౫౨౦ ప్రాంతములోనిభారవి కితఁడు పూర్వుఁ డనియే యభిప్రాయపడుచున్నాను. భట్టికావ్య మితనిది కా దనెడి వాదము ప్రబలముగా నున్నది గాని, అది భారవికిఁ బూర్వ మనువిషయమున వివాదము లేదు గావున, అందలికావ్యాలంకారవిషయక మైనప్రసన్నకాండము దండికావ్యాదర్శమునకుఁ బూర్వ మనుట విశ్వసనీయమే యగుచున్నది. ఇఁక దీని నిట్లుంచి దండిభామహులపౌర్వాపర్యము నించుక పరిశీలింతము.

దండికావ్యాదర్శమందును భామహునికావ్యాలంకారమందును సుమారు పదిశ్లోకముల కొన్నికొన్ని భాగములు "సర్గబంధో మహాకావ్యమ్—తద్భావికమితి ప్రాహుః ప్రబంధవిషయంగుణమ్—ఆక్షేపోఽర్థాన్తరన్యాసో వ్యతిరేకో విభావనా-" ఇత్యాదులు సమానముగాఁ గనవచ్చుటంజేసి, వీరిపౌర్వాపర్యనిర్ణయము విమర్శక లోకమును గలఁతపెట్టుచున్నది. ఈశ్లోకసామ్యమున కేవో కొన్ని హేతువులు తోడుచేసి కొందఱుపాశ్చాత్యులు భారతీయులు గూడ భామహుఁడు పూర్వుఁ డని నిర్ణయింప, మఱికొందఱట్టివారే తద్భిన్నము లైనకొన్నియుపపత్తులు తోడు చేసి దండి పూర్వుఁ డని నిర్ణయించిరి. అక్కడక్కడ నున్నయుభయపక్షీయవాద ములను సంగ్రహించి యొక్కచోఁ జేర్చి పి. వి. కాణేపండితులు చక్కనిచర్చ యొనర్చి తుదకు దండియే పూర్వుఁ డని యభిప్రాయము తేల్చిరి కావున గ్రంథ విస్తరము కాకుండ, వారివిమర్శనమునుండి ముఖ్య మైనకొన్నియుపపత్తు లిందు సంగ్రహింతము[2].

ఉద్భటాదులు కొందఱు భామహుని బ్రాచీనునిగా గణింప లోచనకారా దులు కొందఱు దండిమతము ప్రాచీనముగా గణించిరి. అర్వాచీనలాక్షణికులు తమ కిష్ట మైనపూర్వమతము గ్రహించినంతమాత్రమున, ఆపూర్వులలో నతఁడు గాని యితఁడు గాని పూర్వుఁ డని నిర్ణయించుట సముచితము కాదు.

ఉపమాలంకారశబ్దాలంకారయమకభేదములను భామహునికంటె దండి యెక్కువసూక్ష్మదృష్టితో నిరూపించియున్నాఁడు కావున నతనికంటె నితఁడు

---

1. చూ. కమలాశంకరప్రాణశంకరత్రివేదీగారి భట్టికావ్యపీఠిక. పి. వి. కాణేగారి సాహిత్యదర్పణపీఠిక.
2. చూ—పి. వి. కాణేపండితుని సాహిత్యదర్పణాంగ్లపీఠిక.

పరుఁ డనెడియభిప్రాయ మొకటి కలదుగాని, అదియును సముచితము గాదు. భామహుఁడు ద్వైదుయమకభేదములు మాత్రమే చూపెను. భరతాచార్యుఁడు పది యమకభేదములు చెప్పియున్నాఁడు. ఎక్కువసూక్ష్మదృష్టితో యమకభేదములు నిరూపించిన భరతుఁడు భామహునికిఁ బరుఁడనఁ గలమా? కావున లక్షణనిర్వ చనములయందలి హెచ్చుతగ్గులు కూడ వీరిపౌర్వాపర్యనిర్ణయమున కుపకరింపవు.

కావ్యాదర్శవ్యాఖ్యాత యగుతరుణవాచస్పతి కొన్నిచోట్ల[1] దండి భామ హునిమతమును విమర్శించినట్లు చెప్పుటనుబట్టి, దండి యతనికిఁ దరువాతివాఁ డనుట కవకాశము కలిగినది గాని, మిక్కిలి యర్వాచీనుఁ డైనతరుణవాచస్పతి వారిపౌర్వాపర్య మెఱిఁగి యట్లు చెప్పె ననుటకుఁ బ్రమాణ మేదియు లేదు. 'సర్గబంధో మహాకావ్య' మిత్యాదిగాఁ బద్యగద్యకావ్యలక్షణములు నిరూపించు సందర్భమున దండిమతము భామహమతముకంటె సవిమర్శముగా నుండుట చూచి తరుణవాచస్పతి, అది భామహమతఖండనపరముగా నుండె ననెను గాని వేఱుగాదు. కావున మిక్కిలి తరువాతివా రయిన వ్యాఖ్యాతలు సందర్భమునుబట్టి, ఆమతమున కీమతము విరుద్ధముగా నున్న దని గాని, దాని నిది ఖండించుచున్న దని గాని చెప్పినంతమాత్రమున, వారిమాటలు కాలనిర్ణయమున కాధారము లని తలంపరాదు.

భామహుఁడు, కథకును—ఆఖ్యాయికకును భేదము పాటించి లక్షణములు వ్రాసెను. దండి, పేళ్లు వేఱయినను, కథాఖ్యాయికలు రెండు నొకజాతివే యనెను. దీనినిబట్టి భామహమతమును దండిఖండించె ననవచ్చునా? ఈపేళ్లు గలయీకావ్య ములు వీరికాలములో నే పుట్టినవై నచో నట్లు చెప్పవచ్చును గాని, కథాఖ్యాయికా సంజ్ఞలు పతంజలికాలమునఁ గూడఁ గలవు. కథానాయకుఁడే కథ చెప్పువాఁడు గాను, అన్యుఁడు కథ చెప్పువాఁడుగాను వారికిఁ గనవచ్చినయట్టికావ్యములను బట్టియు, వారియభిరుచినిబట్టియు, ఈకావ్యముల లక్షణములు వారు చెప్పియుం దురు గాని, ఒకరిలక్షణ మొకరు ఖండింప నిట్లు చెప్పియుండరు. కావున వీరి ముందువెనుకల కిది యొకహేతువు కాఁజాలదు. ఇట్లే, ఉభయపక్షములవారును, భామహుఁడు పూర్వుఁ డనుటకును దండిపూర్వుఁ డనుటకు నేవో హేతువులు చూపిరి గాని, అవి యంత ప్రబలములు కావు. కాని, వీ రిద్దఱిలో దండిపూర్వుఁ డనుటకు నుభయుల గ్రంథములలోని కొన్నిలక్షణనిర్వచనములు తోడ్పడకపోవు. అట్టి వానికిఁ గొన్ని యుదాహరణములు.

---

1. కావ్యాదర్శములో—1-23;—1-29;—2-235:—శ్లోకవ్యాఖ్యలు.

"న లిఙ్గవచనే భిన్నే నహీనాధిక తాపి వా
ఉపమాదూషణా యాలం యత్రోద్వేగో న ధీమతామ్...
స్త్రీవ గచ్ఛతి షణ్డో ఽయం వక్త్యేషా స్త్రీ పుమా నివ...
ఇత్యేవ మాదిసౌభాగ్యం న జహా త్యేవ జాతుచిత్.
అస్తి చ క్వచి దుద్వేగః ప్రయోగే వాగ్విదాం యథా
హంసీవ ధవళ శ్చన్ద్రః సరాం సీ వామలం నభః......"[1].

అనుచు, దండ్యాచార్యుఁ డుపమానోపమేయముల లింగభేదవచనభేదములును హీనత్వాధికత్వములు ననునాల్గును, సరసుల కుద్వేగము కలిగింపవేని యుపమాదోషములు కావనియు, ఉద్వేగము కలిగించెనేని యుపమాదోషము లగుననియు సోదాహరణముగా లక్షణములు నిర్మించియున్నాఁడు. మేధావి యను లాక్షణికుఁడు పైనాల్గింటికి మఱిమూఁటిని జేర్చి, ఉపమాదోషము లేడని చెప్పెను. అతనిమాటనుబట్టి భామహుఁడు—

"హీనతా సంభవో లిఙ్గవచోభేదో విపర్యయః
తపత ఉపమాదోషాః సప్త మేధావి నోదితాః...
యదుప్రవీరః ప్రగృహీతశార్ఙ్గః సేన్ద్రాయుధో మేఘ ఇ వాబభాసే."[2].

అనుచు దండివలెనే, ఉద్వేగముకలిగించువాని నుదాహరించియున్నాఁడు. ఇతనితరువాతివాఁడైనవామనుఁడాఱుదోషములనే పేర్కొనెను గాని, ఎట్లయిన నుపమాదోషపరిగణనమున మార్గదర్శి దండి యని తోఁచకపోదు. అందుచే మేధావిభామహులిద్దఱికిని గూడ దండి పూర్వుఁ డనవలసియున్నది. అయితే, మేధావిని రామశర్మను బేర్కొన్నభామహుఁడు, వారికిఁ బూర్వుఁడైనదండి నెందుకుఁ బేర్కొనఁడు? ఇందుకు సరియైనకారణము చెప్పఁజాలము గాని, దండి మతమును ఖండించుట భామహుని కిష్టమని మాత్రము చెప్పఁగలము. ఎట్లనఁగా?

'గతో ఽస్త మర్కో భా తీన్దు ర్యా న్తి వాసాయ పక్షిణః'

అనెడియొక ప్రాచీనశ్లోకముపూర్వార్ధ మెత్తుకొని దండి 'కాలావస్థానివేదనమం దిది కూడ సాధువే'యగు నని చెప్పియుండ, భామహుఁడును బైపూర్వార్ధమే యెత్తుకొని ఇది యేమికావ్యము? దీనిని వార్తయందు'రనుచునిరసించెను[3]. వార్తకూడ నొకయలంకార మని భట్టికావ్యము నిరూపించినది[4]. కాన్త మనెడి

---

1. కావ్యాద—2-51—54
2. కావ్యాలం—2-39, 40—.
3. కావ్యాద. 2-244—కావ్యాలం. 2-87—
4. భట్టి. 10-46—

కావ్యగుణము వార్తాదులందు గనవచ్చునని దండి మఱియొకచోటఁ జెప్పియున్నాఁడు[1] అయిన నేమి? భామహునికిఁ బైకవిత్వము సమ్మతము కాలేదు. "అగుఁగాక. దీనినిబట్టి, దండి యౌ నన్నదానిని భామహుఁడు కా దనె నని యెట్లుచెప్పనగును? భామహుఁడు కా దన్నదానినే దండి యౌ ననిచెప్పెనేమో!" అని కొంద ఱడుగవచ్చును. సత్యమే. కాని, ఉపమాదోష కావ్యదోష పరిగణనమున దండిమార్గదర్శకుఁ డయ్యె ననుట విశ్వాస్య మగుచున్నది గావున నిచ్చట దండిమతమునే భామహుఁడు విమర్శించె ననుటయు విశ్వాసపాత్రము కాఁగలదు.

నాట్యశాస్త్రకర్త గణించినరీతినే దండి "అపార్థం వ్యర్థ మేకార్థ'మిత్యాదిగా దశవిధకావ్యదోషములను గణించి, ప్రతిజ్ఞా హేతు దృష్టాన్త హాని, దోష మగునా కాదా యని విమర్శించుట నిష్ప్రయోజన మని చెప్పియున్నాఁడు[2]. భామహుఁడు కావ్యదోషనిర్ణయమున సరిగా దండిచెప్పినశ్లోకములే[3] చెప్పుచు, దండి కావ్యదోషముగాఁ బరిశీలింపరా దన్నప్రజ్ఞాతిహేతుదృష్టాన్తహాని కావ్యదోషమే యని సాధించుటకై —

"అథ ప్రతిజ్ఞాహేత్వాదిహీనం దుష్టంచ వర్ణ్యతే"

అనుచుఁ బంచమపరిచ్ఛేద మారంభించి పట్టుదలతో దానిని సమర్థించియున్నాఁడు. ఈసందర్భమందలియితనిపూనిక తప్పక దండిమతఖండనమునకే యని పాఠకులకుఁ దోఁచకపోదు. మఱియు, దండి హేతుసూక్ష్మలేశములుమూఁడు నలంకారము లని చెప్పియుండ, భామహుఁ డివి యలంకారములు కా వని చెప్పెను[4]. ఇట్లే, ఉపమాలంకారకావ్యగుణాదినిరూపణమున దండిమతమునకు విరుద్ధముగా భామహుఁడు గావించినచర్చ యగపడుచున్నది. ఇదియిట్లుండ—

"విజితాత్మభవద్వేషిగురుపాదహతో జనః
హిమాపహామిత్రధరై ర్వ్యాప్తం వ్యో మాభినందతి"

అనుశ్లోకమును[5] దండి ప్రహేళికాభేదమున కుదాహరించియున్నాఁడు. భామహుఁ డిందలియుత్తరార్ధభాగ మెత్తుకొని 'హిమాపహామిత్రధరైర్వ్యాప్తం వ్యోమేత్యవాచకమ్'

అనుచు దానిని, అవాచక మనెడిదోషముఁ గా గణించెను[6]. పైశ్లోకము దండికృత మని శార్ఙ్గధరుఁడు చెప్పుచున్నాఁడు. అందుచేఁ బైశ్లోకముగాని దాని భాగముగాని దండిభామహు లితరకృతినుండి గ్రహించియుందు రనుటకు వీలు లేదనియు, దండిశ్లోకమునుండియే భామహుఁడు పైభాగము గ్రహించి యువా

1. కావ్యాద. 1-85.
2. కావ్యాద. 3-125,126,127—
3. కావ్యాలం. 4-1,2.
4. కావ్యాద. 2-235—కావ్యాలం. 2-86.
5. కావ్యాద. 3-120—
6. కావ్యాలం. 1-41.

చకమున కుదాహరించె ననియు విదిత మగుచున్నది. మఱియు భామహుఁడు గౌడీ వైదర్భీ రీతులకు భేదము పాటించుటను దూషించి యున్నాఁడు[1]. వైదర్భీ రీతి మంచి దన్నవారిలో నగ్రిముఁడు దండి యనవచ్చును. "అస్త్యనేకో గిరాం మార్గః' ఇత్యాదిగా రీతులు పెక్కు కల వనిచెప్పుచు, అందు గౌడీ వైదర్భీ రీతులను ముఖ్యముగా వివరించి వైదర్భి ప్రాశస్త్యమును దండివర్ణించియుండ[2] దానిని గా దనుచు భామహుఁడు విమర్శించుటయే దండిమతము భామహుని కిష్టము గాదనుటకుఁ బ్రమాణము గాఁగలదు. ఇంక నిట్టి వెన్నే నిదృష్టాంతములు కలవు కాని దండికి భామహుఁ డర్వాచీనుఁ డని యూహించుట కివి చాలును. త్రివేదీ జాకోబీ మొద లగుపండితులు వీనిని, ఇట్టివానిని బ్రమాణములనుగా గ్రహించి భామహుఁడే పూర్వుఁ డని సమర్థింపఁ జూచిరి గాని, ఆసమర్థన మంత యుచిత ముగా లే దని, పేథక్ నరసింహయ్యంగారు కాణే మొద లగుపండితులవిమర్శన పద్ధతులే చెప్పుచున్నవి. దండికాలమును గూర్చి యీామ ద్భేదములు కలవు గాని, ఎట్లయిన నతఁడు క్రీ. ౭అవశతాబ్దిలోనివాఁ డనుట యందఱకిని సమ్మతమే. కావున క్రీ. ౫౫౦–౬౫౦ నడుమ దండిభామహులుండిరనియు, వీరిలో దండి పూర్వుఁ డనియు మనము విశ్వసింతము.

ఇంతదనుకఁ గావించిన ప్రసంగమునుబట్టి నాట్యశాస్త్రమునకును భట్టి కావ్యమందలి ప్రసన్న కాండమునకును దరువాత గోచర మగునాలంకారిక గ్రంథము దండికావ్యాదర్శమే యని తేలినది. ఇఁక నిది మొదలుగాఁ గావ్యాలంకారలక్షణము లెట్లు వికసించినవో చూతము.

దండి రచియించిన కావ్యాదర్శము ౬౬౨ శ్లోకములతోడి మూఁడుపరిచ్ఛేదముల గ్రంథము[3]. ఇందలి 'పూర్వశాస్త్రాణి సంహృత్య—దర్శితాః పూర్వసూరిభిః' ఇత్యాదివాక్యములనుబట్టి యితఁడు భరతనాట్యశాస్త్రాదుల ననుసరించి యీకృతి నిర్మించె నని విదిత మగును. ఇందు నాటకాదులలక్షణములు తప్పఁ దక్కినకావ్యాలంకారభేదములలక్షణము లన్నియు నిరూపింపఁబడినవి. "కావ్యము, పద్యము—గద్యము—మిశ్రము—అని త్రివిధము. సర్గబంధము మహాకావ్యము. కథ—ఆఖ్యాయిక—అని గద్యము ద్వివిధము కాని రెండు నొకటే జాతి. గద్యపద్యమయి చంపువు. వాఙ్మయ మంతయు సంస్కృతము ప్రాకృతము అపభ్రంశము మిశ్రము

1. కావ్యాలం. 1, 30-32.
2. కావ్యాద. 1. 40-46.
3. శ్లోకసంఖ్య—బొంబాయిప్రతి 662—కలకత్తా ప్రతి 660—మదరాసుప్రతి 663.

నని చతుర్విధము. కావ్యమార్గ మనేకవిధము—మార్గ మనఁగా నిచ్చట రీతి యని యర్థము—అందు వైదర్భిగౌడి యనునవి ముఖ్యములు. శ్లేష ప్రసాద సమతాది ప్రాణప్రాయము లైనపదిగుణములతోఁ గూడినది వైదర్భి. గౌడి తఱచుగా దీనికి విపరీతముగా నుండును. ఈరెండుమార్గములలో వైదర్భమునే పెక్కండ్రాదరింతురు. నిర్మల మైనవైదుష్యమును సహజసిద్ధ మైనప్రతిభయు దృఢ మైనపూనికయుఁ గావ్యసంపదకు హేతువులు" ఇత్యాదిబహువిషయములు ప్రథమపరిచ్ఛేదమున వర్ణింపఁబడినవి. కావ్యశోభాకరము లైనధర్మము లలంకారము లనెడి సామాన్యలక్షణమున కనుగుణముగా, ఉపమాదిభావికాంతము లైనముప్పదియైదలంకారములు లక్ష్యలక్షణసమన్వయరూపమున ద్వితీయపరిచ్ఛేదమందును; యమకభేదములు ప్రహేళికాభేదములు కావ్యదోషములు చిత్రకవిత్వమార్గములు మొదలయినవి తృతీయపరిచ్ఛేదమందును జూపఁబడినవి.

ఇతఁడు గ్రంథారంభమందు 'పూర్వవిద్వాంసులు కావ్యమున కలంకారములు శరీర మని' రని చెప్పుచు, 'శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ' యనుచు, ఇష్టార్థసహిత మైనశబ్దావళి కావ్యశరీర మని స్వాభిప్రాయము తెలిపెను. దీనినిబట్టి ప్రాచీనులకంటె మఱికొంత ముందుకు వచ్చినయితనిమతమే శబ్దార్థములు కావ్య మనెడితరువాతిలాక్షణికులకుఁ జేయూఁత యిచ్చినదని తెలియుచున్నది. మఱియు, కావ్యమున కాత్మ యేది యనెడిసాహిత్యమీమాంసావిషయక మైన సూక్ష్మపరిశీలనమునకు దారి చూపినవాఁడు నితఁడే. "పరస్పరసూక్ష్మభేదములు గలవాఙ్మార్గము లనేకములుకలవు కాని, వానిలో వైదర్భగౌడీయమార్గములు ప్రస్ఫుటాన్తరము" లనుచు వాని నెక్కువగాఁ జర్చించి, అందు వైదర్భమార్గమున కెక్కువ ప్రాశస్త్యప్రాముఖ్యములను నిర్దేశించెను[1]. ఇతఁడు దేనిని మార్గసంజ్ఞతో వ్యవహరించెనో దానినే వామనుఁడు రీతి యని పేర్కొని 'రీతి రాత్మా కావ్యస్య' ఇత్యాదిసూత్రముల వైదర్భీగౌడీయాపాంచాలీరూపరీతిభేదములను నిరూపించుచు, ఓజఃకాంతియుత మగుగౌడికంటెను మాధుర్యసౌకుమార్యయుత మగుపాంచాలికంటెను, ఓజఃప్రసాదాదిసర్వగుణసంపూర్ణ మగువైదర్భి గ్రాహ్య మని నిర్దేశించెను. దండి, మార్గసంజ్ఞతో వైదర్భగౌడీయభేదములను, ఆయాదేశీయులకవిత్వములనుబట్టియుఁ బూర్వసంప్రదాయమునుబట్టియుఁ జెప్పియుండును. కాని, కావ్యగుణములు నిరూపించినభరతాచార్యుఁ డీభేదములను గాని మార్గరీతిసంజ్ఞలను గాని యెత్తలేదు. భామహుఁడు—

---

1. అస్త్యనేకో గిరాంమార్గః, ఇత్యాది. కావ్యాద. 1. 40–101.

"వైదర్భ మన్య దస్తీతి మన్యన్తే సుధియో ఒపరే
తదేవచ కిల జ్యాయః సదర్థ మపి నాపరమ్,
గౌడీయ మిద, మేతత్తు వైదర్భ మితి కిం పృథక్
గతానుగతికన్యాయా న్నానాఖ్యేయ మమేధసామ్...
అలంకారవ దగ్రామ్య మర్థ్యం న్యాయ్య మనాకులమ్,
గౌడీయ మపి సాధీయో వైదర్భ మితి నాన్యథా" [1].

అనుచుఁ 'మార్గము—రీతి' యనుమాటలు లేకుండఁగా వైదర్భగౌడీయసంజ్ఞలు రెండుమాత్రమే యెత్తి, ఈరెండును వే ఱనుట యుచితముకా దని నిరసించుచు, సాలంకార మగ్రామ్య మర్థయుక్త మనాకులము నైనది గౌడీయ మైనను సాధువే యని వైదర్భగౌడీయభేద మెత్తినపూర్వులమతము విమర్శించెనే కాని యివి దేశీయభేదమున వచ్చినకావ్యభేదసంజ్ఞ లనుభావ మైనను సూచింపలేదు. వామనుఁడు మాత్రము "వైదర్భాదిషు దృష్టత్వా త్తత్సమాఖ్యా" [2] అనుసూత్రమునర్థము వివరించుచు, "విదర్భగౌడపాంచాలదేశములం దున్నకవులకావ్యరచనలనుబట్టి వైదర్భిత్యాదిసంజ్ఞలు నిర్దేశింపఁబడినవి కాని, కావ్యములకు దేశముల వలనిప్రయోజన మేమియు లేదు" అని చెప్పెను. బాణభట్టుకూడ,

"శ్లేషప్రాయ ముదీచ్యేషు ప్రతీచ్యే ష్వర్థమాత్రకమ్,
ఉత్ప్రేక్షా దాక్షిణాత్యేషు గౌడే ష్వక్షరడమ్బరః" [3].

అనుచు నాయాదేశీయుల యభిమతకవిత్వమార్గము లావిష్కరించియు ...ను, దీనినిబట్టి మవదండి, ఆయాదేశముల నుదయించినకవిత్వపద్ధతు లెటేఁగియే వైదర్భగౌడీయాదినామములతోఁ గావ్యరచనకు మార్గ మనెడిపేరు పెట్టి వామనాదులకు మార్గదర్శకుఁ డయ్యె నని చెప్పనగును.తరువాతివారు ధ్వన్యలంకారరసములలో నొక్కొకటి కావ్యాత్మ యనెడిలక్షణములు నిర్వచించుటకు, మార్గము కావ్యాత్మ యనుభావము ప్రకటించినదండియే మార్గదర్శి యనుట భావ్యము. ఇతనిమార్గమతమును రీతియనుపేర రుద్రటాదులుకూడఁ బ్రశంసించుటనుబట్టి పేళ్లు వేఱైనను మార్గరీతులు రెండు నొకటే యనుటయు నిరాక్షేపము.

---

1. కావ్యాలం. 1, 31-35—
2. కా. సూ. 1, 2-10.
3. హర్ష. అవతా. శ్లో. 7.

శ్లేషము ప్రసాదము సమత మాధుర్యము సుకుమారత అర్థవ్యక్తి ఉదారత ఓజస్సు కాన్తి సమాధి[1] అనుపదిగుణములును ప్రాణము లైనకావ్యమునకు శోభ కలిగించున వలంకారము లని చెప్పుచు దండి, "బహువిధముగా నున్న యలంకారవిభాగముల నన్నిటిని జెప్పుట శక్యము కాదు. అలంకారవికల్పబీజమును బూర్వాచార్యులు ప్రదర్శించియున్నారు. దానినే నేను బ్రతిసంస్కారపూర్వకముగా విశదీకరింప యత్నించెదను" అని ప్రతిజ్ఞ గావించి ముప్పదియైదలంకారములను మాత్రమే చూపినను,

"న పర్యన్తో వికల్పానాం రూపకోపమయో రతః
దిఙ్మాత్రం దర్శితం ధీరై రనుక్త మనుమీయతామ్"

ఇత్యాదిగా, ఉపమారూపకదీపకాదిచక్రములతుదలఁ జెప్పినమాటలనుబట్టి, ఇతనినాఁటికే యలంకారభేదము లసంఖ్యముగా విద్వల్లోకవ్యవహారమునఁ గల వని తెలియును. ఇతఁడు కావ్యగుణ దోషసంజ్ఞలయెడఁ జాలావఱకు భరతాచార్యు ననుసరించెను గాని, అలంకారభేదములందును, తత్సంజ్ఞలయందును స్వతంత్రించి తననాఁడు గనవచ్చినయుదాహరణములనుబట్టి వాని నేర్పఱిచె నని తెలియవచ్చును. ఇందు కొకయుదాహరణము :—

భరతుఁడు, ప్రశంసోపమ—నిన్దోపమ—కల్పితోపమ—సదృశ్యుపమ—అసదృశ్యుపమ—అని యైదుపమాభేదములు పేర్కొనియుండ నితఁడు,

"యథాకథం చి త్సాదృశ్యం య త్రోద్భూతం ప్రతీయతే,
ఉపమా నామ సా తస్యాః ప్రపఞ్చో౽యం ప్రదర్శ్యతే"

అనుచు, ధర్మోపమ—వస్తూపమ—విపర్యాసోపమ—ఇత్యాదిగా ముప్పదినాలుగుపమాభేదములను పేర్కొనెను. ఇట్లే రూపకాదిభేదములును గలవు. ఇతఁడు పేర్కొనినయలంకారభేదములనే తరువాతియాలంకారికులు గ్రహించుచువచ్చి రనుట విదితము. మఱియు నితఁడు కావ్యదోషవివరణసందర్భమున సత్కావ్యస్వరూపము చక్కఁగఁ దెలియఁజేయుచు—

"జాతే జగతి వాల్మీకౌ కవి రిత్యభిధా౽భవత్
కవీ ఇతి తతో వ్యాసే కవయ స్త్వయి దండిని"

1. స్వభావస్పష్టం విచారగహనం వచః శ్లేషమ్, విభక్తవాచ్యవాచకయోగా దనుక్తయోరపి శబ్దార్థయోః ప్రతిపత్తిః ప్రసాదః, ఇత్యాదిభరతాచార్యలక్షణములు చూడఁదగును.

అనెడియార్యోక్తిని సార్థకము గావించెను. ఇతఁడు నర్మదానదీదక్షిణతీర వాసి యనియు, చోళకళింగావన్తికావేర్యాదిసంజ్ఞ లుచ్చరించుటంబట్టి దక్షిణ దేశీయుఁ డనియు, భారవికవికి మునిమనుమఁ డనియు, నేవో కొన్ని హేతువులు కొందఱు చెప్పుదురు గాని, అవి యంతవిశ్వసనీయములు గావు. ఇతనినిజ మైన నివాసాదికము తెలియరాదు. ఈకవి తనగ్రంథమందు పూర్వమతము లావిష్క రించెనే కాని వారిపే ళ్లెత్త లేదు. కవులను పేర్కొనకపోయినను—ఛందోవిచితి బృహత్కథ సేతుబంధము కలాపరిచ్ఛేదము అనుగ్రంథములనువక్కాణించెను [1]. ఇందు కడపటిది దండికృత మని కొందఱు భావింతురు గాని యాగ్రంథము మృగ్య మగుటచే నిద మిత్థ మన వీలులేదు—పూర్వసూరిభిః పూర్వాచార్యైః కేషాం చిత్—ఇత్యాదిపదములచేఁ బూర్వగ్రంథకర్తలమతము లెత్తి యాయావిషయ ములు వివరించినసందర్భములందలిశ్లోకము లితనివే కాని యన్యులవి కా వనుట సత్యమే యైనను, చర్చకై యితరులశ్లోకములు గూడ నొకటిరెం డితఁడు గ్రహిం పకపోలేదు.

"లిమ్పతీవ తమోఽఙ్గాని వర్షతీ వాఞ్జనం నభః
అసత్పురుషసే వేవ దృష్టి ర్విఫలతాం గతా" [2].

ఈశ్లోకము భాసునిచారుదత్తమందును బాలచరితమునందును గూడఁ గలదు. చారుదత్తములోనికథను పెంపుచేసినమృచ్ఛకటిక మందున్నది. అందుచే నిది భాసుని దనక తప్పదు. ఇందలిపూర్వార్థము మాత్ర మెత్తుకొని దండి, ఇది యుత్ప్రేక్షాలక్షణముకల దైనను, ఇవశబ్దమునుబట్టి యుపమాభ్రాంతి కొందఱికిఁ గలిగించుచున్నది. అనుచు దీనిపైఁ గావించినచర్చనుబట్టి కూడ నిది యితనిది గా దనుట కవకాశము కలదు.

"త్రయోఽగ్నయ స్త్రయో వేదా స్త్రయో దేవా స్త్రయోగుణాః
త్రయో దండిప్రబంధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః"

అనెడియభియుక్తోక్తినిబట్టి దండి మూఁడుగ్రంథములు నిర్మించె ననుట విశ్వా స్యమే కాని దశకుమారచరితకావ్యాదర్శములవలె మూఁడవది గోచరించుట లేదు. త్రివేదీ ఆగాషీ మొదలగుపండితులుకొందఱు, దశకుమారచరితము కావ్యాదర్శ

1. కావ్యాద-1. 12; 38; 34;—3. 171.

2. కావ్యాద. 2. 226—ఈశ్లోకము మూఁడవపరిచ్ఛేదమున 362 శ్లోకముగా, కుండలీకృతమై పూనాప్రతిలోఁ గనఁబడును.

కర్తయగు దండి వ్రాసినది కాదను భావము ప్రకటించిరి. ఈ రెండును గాక దండివే యనెడి కొందఱు విమర్శకుల మతములలో మూఁడవది గా నేను నే ననుచు ఛందోవిచితి మృచ్ఛకటికము కలాపరిచ్ఛేదము కవిహృదయము ననెడి కృతులు తలలెత్తినవి. ఈతృతీయ గ్రంథవిషయకము లైనవాదము లన్నియు నిస్సారములుగాఁ గనవచ్చుటం జేసి వానిని జర్చింపఁ బనిలేదు. కావున దండిమూఁడవకృతి మృగ్య మనియు దశకుమారచరిత కావ్యాదర్శము లితనివే యనియు నొక్కమాట చెప్పి, అలంకార శాస్త్రముపై రత్తినంతనే విద్వాంసుల హృదయపీఠమందు కావ్యాదర్శము ముందు ప్రత్యక్షమగు ననెడి ప్రశంసతో నిప్పటి కీప్రసంగము చాలింతము. తరుణవాచస్పతి మల్లినాథుఁడు మొద లగుపదముగ్గురు దీనికి వ్యాఖ్యలు నిర్మించి రనుటయే దీని ఘనతకు నిదర్శనము.

భామహుని కావ్యాలంకారము—పరిమాణమునఁ గావ్యాదర్శముకంటెఁ జిన్న దైనయీగ్రంథమునందు, ఒకానొక లేఖకుఁడు కడపటఁ జేర్చిన ట్లున్న రెండు శ్లోకములనుబట్టి ४०० శ్లోకము లుండవలసియుండఁగా[1] ముద్రితపుస్తకమున ३८८ శ్లోకములు కనఁబడుచున్నవి. ఈగ్రంథమందలి కొన్నిలక్షణములు చిరకాలమునుండి యాలంకారికుల హృదయ మాకర్షించుచు వచ్చినను, పెక్కండ్రు పూర్వవ్యాఖ్యాత లీతనిమతమును బ్రశంసించుచు వచ్చినను, ఈకృతిమాత్రము చాలా కాల మెందో యణఁగియుండి, మొన్న మొన్న బెంగుళూరునివాసులగు ఆర్. నరసింహాచార్యులుగారి ప్రయత్నమునకు ఫలముగా విద్వల్లోకముకంటఁ బడినది. ఇది బయటఁ బడినపిదప దీనిప్రాచీనతను దీనికవిని గూర్చి వచ్చినచర్చ లసంఖ్యాకములు[2]. అం దనేకము లకాండతాండవములు. వాని నెల్ల నిందు గ్రహించుట నిరుపయోగము కావున ముఖ్య మైనవిషయములు ముచ్చటింతము. వారిచర్చ లన్నియుఁ జూచినపిదపనే భామహుఁడు దండి కించుక పరుఁడు కాని పూర్వుఁడు కాఁడని యింతకు మున్నే తెలిసికొంటిమి గావున నీతనికాలమును గూర్చి చర్చింపఁ బనిలేదు.

---

1. షష్ట్యా శరీరం నిర్ణీతం శతషష్ట్యా త్వలంకృతిః,
పఞ్చాశతా దోషదృష్టిః సప్తత్యా న్యాయనిర్ణయః,
షష్ట్యా శబ్దస్య శుద్ధిః స్యా దిత్యేవం వస్తుపఞ్చకమ్,
ఉక్తం షడ్భిః పరిచ్ఛేదై ర్భామహేన క్రమేణ వః.

2. చూ. కే. పి. త్రివేదిపండితుని ప్రతాపరుద్రీయపీఠిక ; పి. వి. కాణేపండితుని సాహిత్యదర్పణపీఠిక ; యస్. కే. డేపండితుని **Sanskrit Poetics Vols. I and II, M. T.** నరసింహయ్యంగారు, **Dr. Barnet, Prof.** రంగాచార్య; **K. B. Pathak** మొదలగువారి వ్యాసములు ;

భామహుఁడు బౌద్ధుఁ డని 'ప్రణమ్య సార్వం సర్వజ్ఞమ్' అనెడిమంగళాచరణశ్లోకములోనివాక్య మాధారముగా నిర్ణయించుచు నతఁడు దండితరువాతివాఁ డని వ్రాసిన నరసింహాయ్యంగారి యభిప్రాయ మంగీకరించుచు బర్నెట్ పండితుఁ డొకవ్యాసము వ్రాసెను. భామహుఁడు దండి కర్వాచీనుఁ డనుట కంగీకరించుచు, అతఁడు బౌద్ధుఁడు గాఁ డని కాణేపండితుఁడు నిర్ణయించెను. అతఁడు దండికిఁ బూర్వుఁడే యని వాదించిన త్రివేదీపండితుఁడు గూడ నతఁడు బౌద్ధుఁ డనుట కంగీకరింపలేదు. పరమేశ్వరునికిని బుద్ధునికిని గూడ సమన్వయించెడి యీసార్వసర్వజ్ఞశబ్దములను విడిచినచో, గ్రంథమం దెల్లెడ వేదశాస్త్రాదుల ప్రశంసయు బ్రాహ్మణయాగాదులస్తుతియుఁ గనవచ్చునుగాని[1] బౌద్ధమతబుద్ధదేవప్రశంసావాక్య మొకటియుఁ గనఁబడదు సరిగదా, ఒకచో బౌద్ధులయన్యాపోహవాదఖండనమే కనుపట్టుచున్నది[2]. ఇంతకును, భామహుఁడే సార్వశబ్దమును సర్వప్రపంచహితకరపరముగా సమన్వయించి యుండ సర్వజ్ఞశబ్దము పరమశివపర మనుట కాటంక మేమి?[3]. కావున భామహుఁడు పరిశుద్ధుఁడైనవైదికబ్రాహ్మణుఁ డనుట నిజము. ఇతఁడు రక్రిలగోమి యనుపండితునితనయుఁ డని గ్రంథాంతశ్లోకమువల్లఁ దెలియుచున్నది. గోమిన్‌శబ్దము పూజ్యార్థక మని చాంద్రవ్యాకరణమునఁ దెలియుచున్నది[4]. అయినను రక్రిలసంజ్ఞ రాహులపోతలాదిబౌద్ధాభిధానములను బోలి యుండుటచే నితఁడు బౌద్ధుఁ డనెడివాదము నరసింహాయ్యంగారు లేవనెత్తిరి[5]. నిజముగా నిది యిట్టిదే యైనను, చిరకాలము సహవాసము చేసినబౌద్ధులును హిందువులు నొకరిపే ళ్లొకరు పెట్టుకొనుచుండెడి వా రనుట యాశ్చర్యకరము కాదు కావునఁ బేరునుబట్టి యితఁడు బౌద్ధుఁ డని భ్రాంతిపడుట సరికాదు. భామహుఁడు తనగ్రంథమం దెచ్చటను బౌద్ధమతప్రశంసావాక్య మైన నుడువలేదు సరిగదా, ఆస్తికులవేదశాస్త్రపురాణాదులను శ్రీరామయుధిష్ఠిరాదిప్రసిద్ధపాత్రములను సగౌరవముగాఁ బ్రశంసించియున్నాఁడు. కావునఁ బ్రబలప్రమాణము లభించువఱకు నితఁ డాస్తిక హైందవుఁ డనియే విశ్వసింతము. స్వవిషయ మిసుమం తేని

1. కావ్యాలం—2-55; 3-36-4. 21, 27, 48, 49-5. 37, 41, ఇత్యాదులు.
2. కావ్యాలం. 6-16, 17,
3. కావ్యాలం. హితప్రకరణే ఽణంచ సర్వశబ్దాత్ప్రియుజ్యతే,—6-53.
ఇది 'సర్వపురుషాభ్యాం ణఢఞౌ' (5-1-10) అనుపాణినిసూత్రమునకును, సర్వాణ్ణో వేతి వక్తవ్యమ్, అనుకాత్యాయనవార్త్తికమునకును సరిపడుచున్నది.
4. గోమిన్ పూజ్యే, గోమా నన్యః చాం. వ్యా. 4. 2-144
5. J. R. A. S. 1905. PP. 535—545.

చెప్పనిదండివలెఁ గాక యితఁడు తండ్రిపేరును దనపేరును దుదిపద్యమునఁ జేర్చెనే కాని తక్కినవివాసాదికవిషయము లేవియుఁ దెలుపలేదు. ఇతఁడు కావ్యశరీరము[1] అలంకారములు కావ్యదోషములు న్యాయనిర్ణయము శబ్దశుద్ధి యనెడియైదు ప్రధానవిషయములను లక్ష్యలక్షణసమన్వయపూర్వకముగాఁ బరిశీలించుచు నాఱు పరిచ్ఛేదములుగా నీగ్రంథము నిర్మించెను.

ఇందు, పాణిని కణభక్ష న్యాసకారమతములేకాక, అశ్మకవంశము—రామశర్మకృతాచ్యుతోత్తరము— మేధావికృతరత్నాహరణము— రాజమిత్రము— అను గ్రంథములు పేర్కొనఁబడినవి. గ్రంథముపేరులేదు గాని, శాఖవర్ధనకృత మైన శ్లోక మొకటి యుదాహరింపఁబడినది. అచ్యుతోత్తరరత్నాహరణరాజమిత్రముల నుండి కొన్నిశ్లోకము లుదాహరింపఁబడినవి. దీనినిబట్టి యీగ్రంథములను భామహుఁడెఱిఁగియున్నట్లు చెప్పవలెనుగాని, యివి యిపు డెందును గనరావు. మఱియు భరతాదిప్రాచీనలాక్షణికులమతము లిం దెన్నో సరిదర్భములందు "అన్యైః—కేషాంచిత్" ఇత్యాదిపదముల సూచింపఁబడినవిగాని వారిపేళ్లు లేవు. భామహుఁడు, దండనీతి న్యాయశాస్త్రాదుల నందందు స్మరించుచు, 'శ్రద్ధేయం జగతి మతం హి పాణినీయమ్' అనుచుఁ బాణినీయవ్యాకరణము నెక్కువగా గౌరవించి,

"శపథైరపి చాదేయం వచో న స్ఫోటవాదినామ్,
నభః కుసుమ మస్తీతి శ్రద్దధ్యాత్క స్సచేతనః"

అనుచు స్ఫోటవాదము నెక్కువగా నిరసించియున్నాఁడు. ఇట్లు సకలశాస్త్రనిష్ణాతుఁడును సాహిత్యవిమర్శకుఁడు నైనయీమహాపండితుని దరువాతి యాలంకారికు లెంతో గౌరవమునఁ బ్రశంసించుట యబ్బురమా? కావ్యాలంకారవిషయమున వ్యాప్తికి వచ్చుచున్నయితనిమతమునకు మిగుల వన్నె తెచ్చినవాఁడు భట్టోద్భటుఁడు.

కాశ్మీరదేశీయుఁ డైనయుద్భటుఁడు భామహునికావ్యాలంకారమునకు భామహవివరణ మనుపేర వ్యాఖ్య వ్రాయుటయే కాక, కావ్యాలంకారసారసంగ్రహ మనుపేర స్వతంత్రలక్షణ మొకటి రచియించి యలంకారశాస్త్రమున నుత్తమస్థానము గడించెను.

"విద్వాన్ దీనారలక్షేణ ప్రత్యహం కృతవేతనః
భట్టో ఽభూ దుద్భట స్తస్య భూమిభర్తు స్సభాపతిః"[2]

---

1. శబ్దార్థౌ సహితౌ కావ్యం గద్యం పద్యంచ తద్ద్విధా. 1-16.
2. రాజత. 4-495.

అనురాజతరంగిణీశ్లోకమునుబట్టి, ఉద్భటుఁడు క్రీ. ౭౭౯—౮౧౩ నడుమఁ గాశ్మీర మేలినజయాపీడునియాస్థానమున దినమునకు లక్షదీనారముల వేతనము గ్రహించుచు సభాపతియై యుండె నని తెలియుచున్నది. ప్రతిదినము లక్షవరహాల జీతముమాట యతిశయోక్తి యైనను, ఇతఁ డతనివిద్వత్సభ కధ్యక్షుఁడై యుత్తమ సత్కార మందుచుండెడివాఁ డన్నచరిత్రాంశము మాత్రము సత్యమే. ఈయుద్భటుని సగౌరవముగాఁ బేర్కొన్న యానందవర్ధనుఁడు[1] క్రీ. ౮౫౫—౮౮౪ నడుమఁ గాశ్మీరము పరిపాలించినయవంతివర్మభూపాలునిసంస్థానము నలంకరించినపండితోత్తముఁ డని రాజతరంగిణియే చెప్పుచున్నది[2]. కావున నుద్భటుఁ డతని కించుక పూర్వుఁడై క్రీ. ౮౦౦ ప్రాంతమున నుండె ననుట యసంశయము.

ఇతఁడు భామహాలంకారవివరణము రచియించినట్లుగా నితనికావ్యాలంకారసారసంగ్రహమునకు లఘువృత్తి నిర్మించినప్రతీహారేందురాజు, ధ్వన్యాలోకలోచనకారుఁడు మొదలుగాఁ గలలాక్షణికులు చెప్పుచున్నారు గాని, ఆగ్రంథ మిపుడు లభ్యము గాకున్నది. మఱియు నితఁడు కుమారసంభవ మనెడియొక కావ్యము రచించినట్లుగా, నితనియలంకారగ్రంథమం దుదాహరింపఁబడినశ్లోకములనుబట్టి యు, ప్రతీహారేందురాజుమాటనుబట్టియు విదిత మగుచున్నది[3]. కాని, ఈకుమారసంభవము కాళిదాసుకుమారసంభవము నెదుట నిలవలేక పోయిన దనుట స్పష్టము. ఇతనికావ్యాలంకారసారసంగ్రహము కేవలము శబ్దార్థాలంకారముల నిర్వచించి లక్ష్యసమన్వయము చేయుటతోనే గతార్థ మైనది గాని యితర విషయములను బ్రసంగించలేదు. అయినను, అలంకారశాస్త్రమందు దీని కర్హస్థానము గల దని యర్వాచీనలాక్షణికులప్రశంసయే చాటుచున్నది.

ఇది యాఱువర్గములుగా విభజింపఁబడినది. ప్రథమవర్గమం దనుప్రాసరూపకదీపకోపమాభేదములును, రెండవదానిలో ఆక్షేపార్థాన్తరన్యాసవ్యతిరేకవిభావనాసమాసోక్త్యతిశయోక్తిభేదములును, మూఁడవదానిలో యథాసంఖ్యోత్ప్రేక్షా స్వభావోక్తులును, నాల్గవదానిలో ప్రేయో రసవదూర్జస్వి పర్యాయోక్తసమాహితోదాత్త శ్లేషాలంకారములును, అయిదవదానిలో అపహ్నుతి విశేషోక్తి విరోధ తుల్యయోగి తాప్రస్తుతప్రశంసా వ్యాజస్తుతి నిదర్శ నోపమే యోపమా సమాసోక్తి సంకరపరివృత్తులును, కడపటిదానిలో అనన్వయ సందేహ సంసృష్టి భావిక

1. ధ్వన్యా. 2-27 శ్లోకము క్రింద—ప్రదర్శిత స్తత్రభవద్భి ర్భట్టోద్భటాదిభిః—
2. రాజత. 5-34.
3. అనేక గ్రంథకృతా స్వోపరచితకుమారసంభవైకదేశో ఽత్ర, ఉదాహరణత్వే నోపన్యస్తః.

కావ్యలింగ దృష్టాంతములును లక్ష్యలక్షణసమన్వయము గావింపఁబడినవి. ఇంతయు మొత్తము నలువదియొక్కయలంకారములు ప్రతిపాదింపఁబడినవి. ఉదాహరణ శ్లోకములు గాక యిందు డెబ్బదియైదు కారికలు కలవు.

ఉద్భటుఁడు భామహునియెడ గౌరవము కలవాఁడైనను, అలంకారలక్షణ నిర్వచనమునఁ బెక్కుచోట్ల నతనిమతమునకు విరుద్ధముగా వర్తించెను. అనుప్రాస భేదములు నిరూపించుపట్టునఁ బరుషానుప్రాసాదుల నితఁ డెక్కువగాఁ జూపియున్నాఁడు. అతఁడు ప్రేయోఽలంకారము గురుదేవపుత్రాదివిషయక మని యుండ నితఁ డది భావాలంకారమే యనెను. విశేషించి శ్లేషాలంకారసందర్భము నందు, అర్థభేదమునుబట్టి శబ్దములు భేదించు ననెడినూతనసిద్ధాంతము నెలకొల్పి దాని నర్థాలంకారమునఁ జేర్చెను. ఈమత మర్వాచీనులకు నచ్చలేదు. కావుననే మమ్మటభట్టు, శబ్దశ్లేష యని చెప్పుచు దానినర్థాలంకారములలోఁ జేర్చుట యెట్టిన్యాయ మని ఖండించెను. ఇట్టిభేదములు కొన్ని యున్నను, చాలావఱ కితఁడు భామహాదిపూర్వులనే యనుసరించి తనయభిప్రాయముగూడ నిస్సంశయముగాఁ జూపినట్టి స్వతంత్రుఁడు. కావుననే, అలంకారసర్వస్వకారవ్యక్తివివేకటీకాకారాదు లలంకారచర్చయం దుద్భటునిమతమును సగౌరవముగా నెత్తుచువచ్చిరి. ఇతనిగ్రంథము పండితహృదయాకర్షక మగుటకుఁ బ్రతీహారేందురాజులఘువృత్తి కూడఁ బ్రధానకారణ మని తప్పక చెప్పవలసియున్నది. ఈటీక పేరుచే లఘువైనను విషయవివరణమున గురువే. మూలము నభిప్రాయమును గూలంకషముగా నితరాలంకారికులమతములతోఁ బోల్చి చర్చించి యావిష్కరించిన యీలఘువృత్తి మూలమునకు మెఱుఁగు పెట్టిన దనుట మఱవరానిది.

దండి భామహ వామన రుద్రటాదులను లఘువృత్తిలోఁ బేర్కొన్నయీ ప్రతీహారేందురాజు ముకులకపండితునిశిష్యుఁడు. అభిధావృత్తిమాతృకాకర్తయైన ముకులకుఁడు కల్లటునిపుత్రుఁడు. కల్లటుఁడు కాశ్మీరరాజైనయవంతివర్మకాలము లోనివాఁ డని రాజతరంగిణి చెప్పుచున్నది[1]. కావునఁ బ్రతీహారేందురాజు క్రీ. శ. ౯౫౦ ప్రాంతమున లఘువృత్తి రచియించి యుండు నని చెప్పవచ్చును. ఇది గాక యుద్భటునియలంకారగ్రంథమున కు రాజానకతిలకుఁ డనుకాశ్మీరపండితుఁ డుద్భటవివేక మనుపేర మఱియొకటీక రచియించినట్లుగా, రాజానకరుయ్యకునియలంకారసర్వస్వమునకు విమర్శినీవ్యాఖ్య నిర్మించినజయరథుఁ డుద్ఘాటించినవాక్యమువల్లఁ దెలియుచున్నది. కాని యది యలభ్యము. ఉద్భటాలంకారవివృతి యనుపేర మఱి

1. అనుగ్రహాయ లోకానాం భట్టాః శ్రీకల్లటాదయః
అవన్తివర్మణః కాలే సిద్ధా భువ మవాతరన్, రాజత. 5-66.

యొకటి యర్వాచీన మైనది కలదు కాని దానికర్త యెవరో తెలియరాదు. ఏతాదృశ మైనయుద్భటాలంకారముకన్న నలంకారశాస్త్రమం దాకాలమునందే యుత్తమఖ్యాతి కెక్కినది కావ్యాలంకారసూత్రవృత్తి.

కావ్యాలంకారసూత్రము లనుపేర నొకలక్షణగ్రంథమును వామనాచార్యుఁడు రచియించి దానికి స్వయముగా వృత్తి రచియించినట్లు—

'కావ్యాలంకారసూత్రాణాం స్వేషాం వృత్తి ర్విధీయతే'

అనెడిమొదటిశ్లోకమువనే తెలియుచున్నది. దండిమార్గమతమును రీతిమతముపేర వన్నెకుఁ దెచ్చినయీమహావిమర్శకుఁ డర్వాచీనాలంకారికశిరోమణులపోగడ్త గాంచినసాహిత్యనిధి. ఇతనిగ్రంథ మొక్కొక్కయధికరణము రెండేసి మూఁడేసి యధ్యాయములుగా నైదధికరణముల వెలయుచున్నది. వృత్తిలో నితఁడు తనకుఁ బూర్వులు రచియించినపెక్కుగ్రంథములనుండి శ్లోకము లుదాహరించియున్నాఁడు. ఇందు కామందకము కామశాస్త్రము ఛందోవిచితి నామమాల హరిప్రబోధము అమరుకము ఉత్తరరామచరితము మహావీరచరితము కుమారసంభవము మేఘదూత రఘువంశము శాకుంతలము మృచ్ఛకటికము వేణీసంహారము శిశుపాలవధ కాదంబరి మొదలగుమహాగ్రంథములు పేర్కొనఁబడలేదు గాని, ఏకే—కేచిత్—కేషాంచిత్—అనుచుఁ బూర్వులమతము లుద్ఘాటించుట కలదు. ఇది, శారీరము దోషదర్శనము గుణవివేచనము ఆలంకారికము ప్రాయోగికము అనెడియైదధికరణముల గ్రంథము. ఇందు ౩౧౯ సూత్రములతోడిపన్నెండధ్యాయములు కలవు. అన్నిటిలోను మొదటిది మిక్కిలి చిన్నది, కడపటిది మిక్కిలి పెద్దది. వీనిలోఁ బ్రథమాధ్యాయమునందు కావ్యప్రయోజనమును వర్ణించుచు, 'అత్ర శ్లోకాః' అని సత్కవిత్వము స్వర్గఫలదాయక మైనసత్కీర్తికి హేతువు గావునఁ గవిపుంగవులు కావ్యాలంకారశాస్త్రార్థము ప్రసాదింపఁ దగు ననెడిభావము గలమూఁడుశ్లోకము లుదాహరించియున్నాఁడు. ఇవి వామనునివో పూర్వులవో నిర్ణయింప శక్యముకాదు. ద్వితీయాధ్యాయమునం దరోచకి సతృణాభ్యవహారి భేదమున నధికారివిచారమును, వైదర్భి గౌడీ పాంచాలీ భేదమున రీతినిశ్చయమును గావింపఁబడినవి. తృతీయమునఁ గావ్యాంగములు కావ్యభేదములు నిరూపింపఁబడినవి. ఇందు, వృత్తగంధి చూర్ణము ఉత్కలికాప్రాయము ననుభేదముల గద్యము త్రివిధముగా నుండు ననుచు లక్షణములు నిర్వచించి, దండి భామహాదులు చెప్పిన కథాఖ్యాయికాలక్షణములు సమ్మతములు గామింజేసి కాఁబోలు, వామనుఁడు "యదుత కథాఖ్యాయికే మహాకావ్య మితి, తల్లక్షణంచ నాతీవహృదయంగమ మిత్యుపేక్షిత మస్మాభిః, త దన్యతో గ్రాహ్యమ్' అనుచు వానిలక్షణముల నుపేక్షచేసియున్నాఁడు. చతుర్థమున, పదపదార్థదోషవివేచనమును; పంచమమున

వాక్యవాక్యార్థదోషవివేచనమును; షష్ఠమున శబ్దగుణవిచారమును; సప్తమమున నర్థగుణవిచారమును; అష్టమమున శబ్దాలంకారవివేకమును; నవమమున నుపమాప్రస్తావమును; దశమమున నుపమాప్రపంచమును; ఏకాదశమునఁ గావ్యసమయములును; ద్వాదశమున శబ్దశుద్ధియు నిరూపింపఁబడినవి.

వామనునిసాహిత్యపరిశోధనము సవిమర్శము స్వతంత్రము. ఇతనిసిద్ధాంతములు కొన్నిటిని మమ్మట జగన్నాథపండితరాజాదు లాక్షేపించినను, మొత్తము మీఁద నాలంకారికలోకమున నితనిమాటకుఁ జెల్లుబడి కల దనుట నిరాక్షేపము. అర్థాలంకారము లన్నిటికి నుపమాలంకారము మూల మనుచు నితఁడు గావించిన చర్చయు, ఉపమాలంకారషడ్దోషనిరూపణమును, ఉపమాలంకారాంతర్భూతములుగా సమాసోక్తిరూపకాద్యలంకారములసమన్వయమును మొద లగువిశేషవిషయములం దితనిప్రతిభయు సాహిత్యవిమర్శకశక్తియు గోచరించుచుండును. అట్టి యితని యీకృతి కాలకర్మవశమున నొకప్పుడు మఱుఁగుపడిపోఁగా ముకుళపండితుఁడు మరల దీని నుద్ధరించినట్లు దీనికిఁ దొలుత వ్యాఖ్య రచియించిన సహదేవ పండితుని యీక్రిందిమాటలవల్లఁ దెలియుచున్నది.

"వేదితా సర్వశాస్త్రాణాం భట్టో உభూ న్ముకుళాభిధః,
లబ్ధ్వా కుత శ్చిదాదర్శం భ్రష్టామ్నాయం సముద్ధృతమ్,
కావ్యాలంకారశాస్త్రం య త్తే నైత ద్వామనోదితమ్,
అసూయయా త న్న కర్తవ్యా విశేషాలోకిభిః క్వచిత్,
ఆకర్ణ్య భవత స్తస్మా ద్దయితస్య విధియ తే,
వివృతి స్సహదేవేన వామనీయస్య సంప్రతి"

దీనికి, క్రీ. ౧౫౦౦ ప్రాంతమున గోపేంద్రత్రిపురహరభూపాలుఁడు రచియించినకామధేను వనెడివ్యాఖ్య ముద్రితమై యున్నది[1]. మూలమునకు సముచితమైనవ్యాఖ్యగాఁ బరిగణింపఁదగినయీకామధేనువులో భామహునివిగా నుదాహరింపఁబడినకొన్నిశ్లోకము లిపుడు ముద్రితమైనభామహాలంకారములోఁ గనరావు. అందలిగ్రంథము సంపూర్ణముగా ముద్రణమునకు లభింపలే దంద మన్న గ్రంథాంతశ్లోకము చెప్పినసంఖ్యలకు గ్రంథములోనిశ్లోకసంఖ్య సరిపడుచున్నది. దానంజేసి కామధేనువు భామహోక్తములు గా నుదాహరించిన వన్నియు నతనివి కా వని చెప్పవలసివచ్చినది.

1. శ్రీరంగము. వాణీవిలాసముద్రణము.

వామనసంజ్ఞ గలగ్రంథకర్తలిద్దఱు ముగ్గు రుండుటచేఁ గావ్యాలంకార సూత్రకర్త యగువామనుఁడెవఁ డెప్పటివాఁ డనువిషయమున విమర్శకులు సందేహించుట కలదు. అయినా, ఇతనికాల మజ్ఞేయము కాదు. క్రీ. ౬౫౦ ప్రాంతమున వామనజయాదిత్యులు పాణినిసూత్రములకుఁ గాశికావృత్తి రచియించి రని పాణినీయసందర్భమునఁ జదివియున్నాము. ఆవృత్తికి, క్రీ. ౭౦౦ ప్రాంతమున జినేంద్రబుద్ధి యనుపండితుఁడు న్యాస మనుపేరు గలపంచికావ్యాఖ్య నిర్మించి యున్నాఁడు.ఆన్యాసమును శిశుపాలవధ నిర్మించినమాఘుఁడు స్మరించియున్నాఁడు[1]. ఆమాఘునిశ్లోకములు కావ్యాలంకారసూత్రవృత్తిలో నుదాహరింపఁబడినవి[2]. దీనినిబట్టి కాశికావృత్తికారుఁ డైనవామనుఁడు కావ్యాలంకారసూత్రకారవామనుఁడు కాఁ డని స్పష్టమైనది. ఇఁక—రాజతరంగిణిలో జయాపీడనరపాలునిచరిత్ర సందర్భమం దున్న—

"మనోరథః శంఖదత్త శ్చటకః సంధిమాం స్తథా
బభూవుః కవయ స్తస్య వామనాద్యా శ్చ మంత్రిణః"[3]

అనుశ్లోకమునుబట్టి వామనపండితుఁడు కవియును మంత్రియునై జయాపీడునియాస్థానమున నున్నవాఁ డనెడివిషయ మున్నది. బుహ్లరుపండితుఁడు మొదలగుకొందఱు రాజతరంగిణీశ్లోకమును విశ్వసించి కావ్యాలంకారసూత్రకారవామనుఁడు జయాపీడునిసమకాలికుఁ డని భావించిరి కాని, ఉద్భటవామను లిద్దఱు నొకరి నొకరు తమగ్రంథముల స్మరింపకపోవుటనుబట్టి మంత్రివామనుఁడు కావ్యాలంకారసూత్రకర్త కాఁ డనుభావమును పి. వి. కాణేపండితుఁడు తెలిపియుండెను. కాని, ఈభావ మంత సముచితము గాలేదు. సూత్రవృత్తికర్త యుద్భటునకుఁ బరుఁడే యందము. అపుడు మాత్ర ముద్భటుని సూత్రవృత్తికారుఁడు స్మరింప లే దనెడియాక్షేప ముండదా ? సమకాలికులు పరస్పరమును, పూర్వుని బరుఁడును స్మరింపకపోవుట కూడ నొకయాక్షేప మేనా ? నిజము చెప్పవలసివచ్చినచో సహవాసు లగువారు పరస్పరము గ్రంథములలో స్మరింపకపోవుటయే హెచ్చుగా సమర్థనీయ మగు నని చెప్పవచ్చును. పైశ్లోకములో మనోరథాదులు కవు లనియు వామనాదులు మంత్రు లనియుఁ గనఁబడుటచే వామనుఁడు మంత్రియే కాని కవి గాఁ డని వ్యాఖ్యానము చేయవచ్చును గాని, చకారసముచ్చయమునుబట్టి వామనాదులు కవులును మంత్రులు నని యర్థము రాకపోదు. కావునఁ గావ్యాలంకార

---

1. శిశుపా. 2-112 అనుత్సూత్రపదన్యాసా సద్వృత్తిః సన్నిబన్ధనా.
2. ఉభౌ యది వ్యోమ్ని—శిశుపా. 3-8. కావ్యాద.—4. 3-10 ఇత్యాది.
3. రాజత. 4-497.

సూత్రకారవామనుఁడు జయాపీడుని మంత్రియై క్రీ. ౭౭౯—౮౧౩ నడుమ నుండెనని వాఁడనుటకు ముఖ్యకారణ మితఁడు భవభూత్యానందవర్ధనులమధ్యకాలమువాఁడగుటయే. ఉజ్జయినీరాజయినయశోవర్మయాస్థానములోనివాఁడై క్రీ. ౭౦౦—౭౪౦ నడుమ నున్నభవభూతినాటకములోనిశ్లోకములు కొన్ని కావ్యాలంకారసూత్రవృత్తిలో నుదాహరింపఁబడినవి[1]. క్రీ. ౮౫౫—౮౮౪ నడుమఁ గాశ్మీర మేలిన యవంతివర్మసంస్థానములోని యానందవర్ధనుఁడు తనధ్వనికారికలలో వామనుని రీతిమతమును బ్రశంసించియున్నాఁడు[2]. కావున వామనుఁడు క్రీ. ౮౦౦ ప్రాంతమువాఁ డనుట నిరాక్షేపము. ఇతనిసూత్రవృత్తి తరువాత గణింపఁదగినది రుద్రటునికావ్యాలంకారము.

పేరునుబట్టి రుద్రటుఁడు కాశ్మీరదేశీయుఁ డని యూహింపఁబడుచున్నది. ఇతఁడు తనగ్రంథము నైదవయధ్యాయమున ఖడ్గ ముసల ధనుశ్శర శూల శక్తి హాల బంధములతోడి యెనిమిదిశ్లోకములయష్టారచక్రము కూర్చుచు[3] నందు స్వవిషయ మంతర్భావిత మగున ట్లీక్రిందిశ్లోక మిమిడ్చియున్నాఁడు.

"శతానన్దాపరాఖ్యేన భట్టవాముకసూనునా,
సాధితం రుద్రటే నేదం సామాజా ధీమతాం హి తమ్"

దీనినిబట్టి శతానందుఁ డనుమాఱుపేరు గలయితఁడు వాముకభట్టు పుత్త్రుఁ డనియు సామవేదీయుఁ డనియుఁ దెలియుచున్నది. ఇతనికావ్యాలంకారమునకుఁ డిప్పణము రచియించినవాఁడును, శ్వేతాంబరజైనుఁ డగుశాలిభద్రసూరిశిష్యుఁడు నగునమిసాధువు తనటిప్పణముతుదను—

"పఞ్చవింశతిసంయుక్తై రేకాదశసమాశతైః,
విక్రమాత్సమతిక్రాన్తైః ప్రావృషీదం సమర్థితమ్"

అనిచెప్పినశ్లోకమునుబట్టి, అతఁడు క్రీ. ౧౦౬౯ లోనివాఁ డని విదిత మగుచున్నది. క్రీ. తొమ్మిదవశతాబ్దియుత్తరభాగములోనివాఁ డయినయానందవర్ధనునిధ్వనిమతమును రుద్రటుఁ డెఱిఁగినట్లుగాఁ గనరాదు. మఱియు ద్వితీయాధ్యాయమున రుద్రటుఁడు, పాంచాలీ లాటీయా గౌడీయా వైదర్భ రీతులను

1. డాక్టరు భాండారుకారుమాలతీమాధవపీఠిక.
స్మిత్ పండితునివ్యాసము. J. R. A. S. 1908. పేజి 793.
2. ధ్వన్యా. 3-52.
3. రుద్ర. కా. 5. 6—13. మారారిశక్రరామేభ—ఇత్యాది-

గూర్చి యించుక ప్రసంగించుటనుబట్టి, యితఁడు వామనునిరీతిమతము నెఱిఁగి నట్లు కనఁబడుచున్నది. కావున నితఁడు, వామనాచార్యునికి సమకాలికుఁడు నించుక తరువాతివాఁడు గూడ నగుచు, క్రీ. ౮౦౦—౮౫౦ నడుమ నున్నవాఁడని చెప్పవచ్చును.

రుద్రటాలంకారము పదునాఱధ్యాయముల గ్రంథము. ఇందు మొత్తము ౭౩౪ శ్లోకములు కలవు. రెండుమూఁడధ్యాయాంతశ్లోకములు తప్పఁ దక్కిన వన్నియు నార్యావృత్తములే. లక్ష్యలక్షణరూపమున నున్న యివి యన్నియు రుద్రట కృతములే. ఇందితరులశ్లోక మొకటియు లేదు. రుద్రటుఁడు, దండిభామహాదుల లక్షణములు పూర్తిగా నెఱిఁగినవాఁడగుటచే వానికంటెఁ దనలక్షణమునఁ గొంతవిశేషము చూపించియున్నాఁడు. మొదటియధ్యాయమున నలంకారశాస్త్ర మునకును, కావ్యరచనమునకును బ్రయోజనము నిరూపించి రెండవదానిలోఁ గావ్యలక్షణము రీతిలక్షణము షడ్భాషాస్వరూపము మొదలగువానిని సంగ్ర హించి వక్రోక్త్యనుప్రాసయమకాదులను నిర్వచించి, మూఁడవదానిలోఁ బూర్తిగా యమకభేదములను వక్కాణించెను. నాలుగైదాఱధ్యాయములలో, శ్లేషవర్ణపద లింగాదులభేదములు చక్రబంధప్రహేళికాదులు పదవాక్యదోషాదులు నిరూపింపఁ బడినవి. ఏడవది మొదలుగా నైదధ్యాయములలో నర్థాలంకారభేదములు శ్లేష భేదములు అర్థదోషములు ఉపమాదోషములు మొదలైనవి వర్ణింపఁబడినవి. పండ్రెండవది మొదలుగా నాలుగధ్యాయములలో దశవిధరసములు నాయికా నాయకలక్షణములు సంభోగవిప్రలంభశృంగారస్వరూపములు వీరాదులవిశేష ములు విశదీకరింపఁబడినవి. కడపటిదానిలో, కథాఖ్యాయికాదికావ్యభేదలక్షణ ములు చెప్పఁబడినవి. ఇందు—

"అర్థస్యాలంకారా వాస్తవ మౌపమ్య మతిశయః శ్లేషః
ఏషా మేవ విశేషా అన్యేతు భవన్తి నిశ్శేషాః"

అనులక్షణమునుబట్టి రూపకాద్యలంకారము లన్నియు, వాస్తవౌపమ్యాతి శయశ్లేషాలంకారములభేదములుగా నిరూపింపఁబడుట యొకనూతనవిశేషము. వ్యాఖ్యాత యగునమిసాధువుగూడ నీమతమును సమర్థించుచుఁ బ్రాచీనగ్రంథ ములనుండి యనేకశ్లోకముల నుదాహరించి లక్షణసమన్వయము గావించుచు వచ్చెను. ఇతనివ్యాఖ్యానమున, పాణిని పింగళ భరత భర్తృహరి దండి భామ హోద్భట మేధావిరుద్ర వామనాదులు పేర్కొనఁబడిరి. పాతాళవిజయ నామ మాలా బృహత్కథా, కిరాతార్జునీయ శిశుపాలవధ రత్నావళీ కాదంబ హర్షచరిత మేఘదూత మృచ్ఛకటిక మాలతీమాధవ వేణీసంహారాదులు పేర్కొనఁబడి

నవి. రుద్రటాలంకారమున కాశాధరుఁడు వ్రాసినవ్యాఖ్య యొకటియు, వసతరంగిణి యనుమతియొకవ్యాఖ్యయుఁ గల వని తెలియుచున్నది. ఈసందర్భమున రుద్రభట్ట కృతముగాఁ గావ్యమాలలోఁ బ్రకటింపఁబడినశృంగారతిలకము నించుక పరి లింతము.

కావ్యరసాలంకార మనునామాంతరము గలశృంగారతిలకము రచియించిన నాఁడు రుద్రుఁడనియు, ఇతఁడు త్రిపురవధ యనుమతియొక కావ్యము గూడ రచి యించె ననియు, ఈక్రింది గ్రంథాంతశ్లోకము చెప్పుచున్నది.

> "త్రిపురవధా దేవ గతా ముల్లాస ముమాం సమస్తదేవనుతామ్,
> శృంగారతిలకవిధినా పునరపి రుద్రః ప్రసాదయతి"

రసతరంగిణి యనుపేర దీనికి వ్యాఖ్య నిర్మించినగోపాలభట్టు 'ఆశీరూపం మఙ్గళం నిబధ్నాతి రుద్రకవిః'అని యాదిని వ్రాసియున్నాఁడు. ఈరెంటినిబట్టి శృంగారతిలకకర్త రుద్రుఁడే కాని రుద్రటుఁడు కాఁ డని విదిత మగుచున్నది. ఒకటిరెండుశృంగారతిలకమువ్రాతప్రతులలోఁ బైగ్రంథాంతశ్లోకము లేకపోవు టయు, లేఖకులు పొరపాటున 'రుద్రటకృతే' యనుటయుఁ గారణములుగా వీబరు మొద లగుకొందఱు, రుద్రరుద్రటు లిరువురు నొకరే యనివ్రాసిరి కాని, అది భ్రాంతిమూలకము ప్రామాదిక మని యిప్పు డందఱును జెప్పుచున్నారు.

ఇది సంభోగశృంగారము విప్రలంభశృంగారము హాస్యాదిరసనిరూపణము ననుమూఁడుపరిచ్ఛేదముల గ్రంథము. దీని రచించుటయుద్దేశమును రుద్ర భట్టీక్రింది విధమునఁ దెలిపెను.

> ప్రాయో నాట్యం ప్రతి ప్రోక్తా భరతాద్యై రసస్థితిః
> యథామతి మయాప్యేషా కావ్యం ప్రతినిగద్యతే"

దీనినిబట్టి యిది కావ్యరసప్రతిపాదక మని స్పష్టపడుచున్నది. ఇందు మొదటిపరిచ్ఛేదమున శృంగారాదినవరసములు రత్యాదిస్థాయిభావములు నిర్వే దాదివ్యభిచారిభావములు స్తంభాదిసాత్త్వికభావములు కైశిక్యాదివృత్తులు అను కూలాదినాయకులు పీఠమర్దాదినర్మసచివులు స్వీయాదినాయికలు ముగ్ధాదిభేద ములు ధీరాధీరాదిభేదములు మొదలుగాబహువిషయములు వర్ణింపఁబడినవి. రెండవ దానిలో విప్రలంభ శృంగారభేదములు మదనావస్థలు మొదలైనవియు, మూఁడవ దానిలో హాస్యాదిరసములు రసములసంబంధములు ఆయారసములభావవిశేష ములు మొదలైనవియు నిరూపింపఁబడినవి. ఇందలిలక్షణశ్లోకములు ౨౨౩. ఉదా హరణశ్లోకము లన్నియు గ్రంథకర్తవే కాని యన్యులవి కావు. అవి కొన్ని వంద

లుండును. కవిత్వము మిక్కిలిమృదుమధురముగా నున్నది. గ్రంథ మిట్టి దైనను, తరువాతియాలంకారికులదృష్టి నాకర్షించినట్లు మాత్రము కనఁబడదు. ప్రధాన ముగాఁ గావ్యలక్షణము నలంకారలక్షణమును నిర్వచించువారికి దీనిప్రసక్తి లేక పోవుట యందుకుఁ గారణ మనవచ్చును గాని, రసప్రసంగము గావించుపట్టునం దైనను శృంగారతిలకమును బ్రమాణముఁగా నర్వాచీనలాక్షణికు లాదరింప లేదనక తప్పదు.

రుద్రభట్టు దేశకాలములను దెలుపుప్రత్యక్షప్రమాణములు లేవు కాని, విష్ణుశర్మపంచతంత్రములో నితనిశృంగారతిలకములోనియొకశ్లోకమును [1] దామోదరగుప్తునికుట్టనీమతములోని యొకశ్లోకమును [2] కనఁబడుచున్నవి. దీనినిబట్టి వీరిద్దఱు విష్ణుశర్మకుఁ బూర్వు లనుట కవకాశ మేర్పడుచున్నది. విష్ణుశర్మ, ఆఱవ శతాబ్దిలోనివాఁ డనెడినిర్ణయ మొకటి లోకవ్యాప్తమైయుండుటచేఁ దైయవకాశమున కవరోధము సిద్ధ మగుచున్నది. ఇది యిటులుండ, రుద్రటాలంకారము చూచియే శృంగారతిలకము క్రీ. ౯—౧౧ శతాబ్దులనడుమఁ బుట్టియుండు నని కాణేపండితాదులు కొంద ఱూహించుచున్నారు. పదియవ శతాబ్దిలోనిలక్షణకర్త లెవరును శృంగారతిలకముమాటయెత్త లేదనుట వారు చెప్పినకారణములలో నొకటి. ఇది యంతగాఁ బరిగణనీయము కాదుకాని, విష్ణుశర్మపంచతంత్రమున దామోదరరుద్రభట్టులశ్లోకములు ప్రక్షిప్తము లగుట విశ్వసనీయ మగుటంబట్టి, రుద్రభట్టు రుద్రటునికిఁ బరు డగు నసుమతమే యిప్పటికి సముచిత మగుచున్నది. రుద్రటుని కించుక తరువాతివాఁడై యాలంకారికులలో నెక్కువ ప్రసిద్ధి కాంచిన వాఁ డానందవర్ధనుఁడు.

అవంతివర్మభూపాలునికాలములోనివాఁడై కాశ్మీరదేశీయుఁడైనయానంద వర్ధనుఁడు క్రీ. ౮౫౫-౮౮౪ నడుమ నున్నవాఁ డనుట ప్రసిద్ధము. కావ్యమున కాత్మ ధ్వని యనెడిమతము నావిష్కరించినధ్వన్యాలోక మితనికృతి. ఇది నాలు గుద్ద్యోతములగ్రంథము. ఇందు ౧౨౯ కారికలును, తదర్థవివరణపర మయిన వృత్తియును మధురశైలీనిబద్ధములై యున్నవి. కారికామాత్రగ్రంథము ధ్వని, లేక ధ్వనికారిక యనియు, వృత్తి యవలోక మనియు, ఈరెండును గలిసి ధ్వన్యాలోక మయిన దనియు, కారికాకర్త యెవరో తెలియ దనియు, అవలోకకర్త మాత్ర మానందవర్ధనుఁ డనియుఁ గొంద ఱూహించుచున్నారు. ఇందుకు, ధ్వన్యాలోకమునకు లోచనాఖ్యవ్యాఖ్య నిర్మించినయభినవగుప్తాచార్యుఁడు పెక్కుచోట్ల

---

1. సార్థంమనోరథశతైరిత్యాది-పంచతం-4 ప్రక–
2. పర్యఙ్కః స్వాస్తరణః పతిరనుకూలఇత్యాది-పంచతం-1 ప్రక–

ధ్వనికారికాకారుఁడు వృత్తికారుఁ డైనయానందవర్ధనునికంటె వే ఱనెడిభావము ప్రకటించుటయే ముఖ్యకారణము [1]. కాని, ఈభావము ప్రకటించుటలో నతఁడు వహించినశ్రద్ధ చూడఁగా, కారికలను వృత్తిని గూడ రచియించినవాఁ డానందవర్ధనుఁడే యన్నప్రతీతి యతఁ డెఱిఁగినట్లును, అది యతని కిష్టము కానట్లును దెలియుచున్నది [2]. కాని, కారికాకర్త యితఁ డని యతనిపే రెండైనఁ దెల్పెనా? లేదు. పోనిండు. "కేచి ద్వాచాం స్థిత" మిత్యాదిప్రథమకారికక్రిందివృత్తిలోని "సహృదయానా మానన్దో మనసి లభతాం ప్రతిష్ఠా మితిప్రకాశ్యతే" అను వాక్యమందలి 'ఆనంద' శబ్దము నానందవర్ధనపరముగాఁ గూడ సమన్వయించిన లోచనకారుఁ డందే యున్నసహృదయశబ్దమును మూలగ్రంథకారపరముఁగా నూహింప నైన నూహించెనా? లేదు. వృత్తిలోనే కాదు, రెండవకారికలో నున్న సహృదయశబ్దమును గారికాకర్తృపరముగా సమన్వయింపఁ జూచెనా? లేదు. దీనినిబట్టి యభినవగుప్తుఁడు ధ్వనికారికాకర్త పే రెఱుఁగనివాఁ డని స్పష్టపడుచుండఁగా, లోచనావతారికలోనిరెండవశ్లోకమందలి 'సరస్వత్యా స్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతామ్' అనుపాదమం దున్నసహృదయశబ్దము ధ్వనికారికాకర్తృపర మనుచు, మూలగ్రంథకర్త సహృదయుఁ డని సోవనీపండితుఁడు (Prof. Sovani) చెప్పినమాట యెట్లు విశ్వసనీయమో తెలియకున్నది [3]. పి. వి. కాణేపండితుఁడు, సహృదయశబ్దప్రయోగములయౌచిత్యమును జర్చించి, ఇది మూలగ్రంథకర్తృసంజ్ఞగా సమన్వయించుట యంత తృప్తికరముగా లే దని సంశయించుచును, ఆనందవర్ధనుఁడే ధ్వనికారికలుగూడ రచియించె ననుటకుఁ గలయితరాధారములు చూపుచునుగూడ, సహృదయుఁడు ధ్వనికారికాకారుఁ డైనచో బా గుండు నన్నట్లుగా సూచించి, యానందవర్ధనుఁడుమాత్రము కారికాకర్త కాఁజాలఁ డనుమతమునే యవలంబించెను [4]. సుశీలకుమారదేపండితుఁ డీవిషయమును మొదటిసంపుటమునఁ జర్చించియు, సోవనీపండితునిసహృదయవాదమును సమ్మతింపక, ధ్వనికారికాకర్తృత్వ మింకను విచారణీయ మని విడిచెను [5]. ఉత్తమపరిశోధకు లిట్లు నిర్ణయింపక విడుచుటచేతనే యీవిషయము దురవగాహముగా

---

1. ధ్వన్యా. నిర్ణయసాగరముద్రణము. పుటలు. 59. 60. 122. 123. 130. మొద-
2. తత శ్చేదం కృత మిదం క్రియత ఇతికర్తృభేదే కా సఙ్గతిః. పు. 123.
దర్శిత మే వేతి కారికాకారేణ నేతి భూతప్రత్యయః. పు. 138.
ప్రతిపాదిత మే వేతి, అస్మన్మూలగ్రంథకృ దిత్యర్థః. పు. 135.
3. J. R. A. S. 1910. P. P. 164-167.
4. సాహిత్యదర్పణపీఠిక. P. P. LX-LXIV.
5. See Sanskrit Poetics Vol II. P. 175. Vol I. P. P. 114-115.

నున్న దని స్పష్టపడుచున్నది. కావలసినవారు పూర్వోక్తవిమర్శకులగ్రంథములు చూడవచ్చును గావున నిందు వారు గావించినచర్చలు సంగ్రహించి వ్రాయుట కూడ ననావశ్యకము. అందుచే ధ్వనికారికలును, అవలోక మనువృత్తియుఁ గూడ నిర్మించినవాఁ డానందవర్ధనుఁడే యనుటకుఁ గలహేతువులు కొన్ని ముందు చూతము.

౧. వామనరుద్రటులు గ్రంథరూపము దాల్చినధ్వనిమత మెఱిఁగినట్లు కనరాదు. 'రీతి రాత్మా కావ్యస్య' అనెడివామనునిసూత్రము చూచియే 'కావ్య స్యాత్మా ధ్వని రితి బుధై' రిత్యాదిప్రథమధ్వనికారిక పుట్టినట్లు కనఁబడుచున్నది. కావున నిది, క్రీ. ౮౫౦ పూర్వము లే దనవచ్చును. ఆనందవర్ధనుఁడు ప్రథమకారికావృత్తిసందర్భమున "తథా చాన్యేన కృత ఏవాత్ర శ్లోకః" అని యుదాహరించిన శ్లోకము[1] గ్రంథకృత్సమానకాలభావి యగుమనోరథకవి రచియించిన దని యభినవగుప్తుఁ డన్నమాటను బట్టి ధ్వనికారిక క్రీ. ౮౦౦—౮౧౫ నడుమఁ బుట్టియుండు నని కాణేపండితుఁడు సందేహించుచుఁ జెప్పెనుగాని, ప్రమాణాంతరబద్ధము గానియట్టి మాట విశ్వసనీయము కాఁజాలదు. ఈమనోరథుఁడు క్రీ. ౭౮౦ ప్రాంతమందలి జయాపీడుని సమకాలికుఁ డైనమనోరథుఁ డనుటకుఁ బ్రమాణము కనరాదు.

౨. క్రీ. ౮౫౦ తరువాతఁ బుట్టినధ్వనికారికలకర్త పేరు క్రీ. ౯౦౦ ప్రాంతమున నున్నయానందవర్ధనునికిఁ దెలియకపోయె ననుట యసంగతము.

3. అట్లు గాక, నిజముగా ధ్వనికారిక తనకు మిక్కిలి ప్రాచీనమై తత్కర్త పేరు తనకుఁ దెలియరాకున్నచో, వృత్త్యారంభమునఁ గావ్యాత్మవిచారము గావించుచు ధ్వనిప్రశంస చేయుసందర్భమునఁ గృతజ్ఞతతో నీకారికలు పూర్వాచార్యప్రణీతము లని చెప్పియుండును, అట్లు గాక, కొంద ఱూహించినట్లు ధ్వనికర్త గురువే యైనచో నాచార్యపూజ్యపాదప్రయోగమున నతని స్మరించియుండును. అతఁడు సమకాలికుఁడు మిత్త్రుఁడు నైనచో నతనిపేరు చెప్పియుండును. సహృదయచక్రవర్తి యైనయానందవర్ధనుఁ డివి యేవియుఁ జేయలేదు.

౪. ఆనందవర్ధనుఁడు కారికల కవతారికలు వ్రాయుపట్టుల గ్రంథముసర్వత్ర—ఇద ముచ్యతే—దర్శయిష్యతే—తత్ప్రతిసమాధీయతే—ఇత్యాదిగాఁ గర్త్రర్థక

1. కావ్యం తద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యా ప్రశంసన్ జడో
నో విద్మో౽భిదధాతి కిం సుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః. ధ్వన్యా. పే 9.

క్రియలే ప్రయోగించెనుగాని, ఆహ—దర్శయతి—ఇత్యాదిగా నన్యాశంకా నివారణార్థకము లైనకర్త్రర్థక క్రియలు ప్రయోగించలేదు. తానే మూల కర్తయుఁ దానే వ్యాఖ్యాతయునైనపుడే యీవిధానము సముచితమగును. అన్యుఁడు మూలకర్త యైనచో నొకచోట నైనను, "ఇదం కారికాకార ఆహ" అనక పోయినను, ఇదంకారికాకారేణోక్త' మని యైనను జెప్ప కుండునా? అన్యులయశస్సును మఱుఁగుపఱుచునట్టి వంచకుఁడా, ఆనంద వర్ధనుఁడు?

౫. కావ్యధ్వనికారికలకు, కావ్యధ్వని, లేక ధ్వని యనెడినామము లభినవ గుప్తాద్యాలంకారికు లందఱు నుపయోగించియున్నారు. ఇందు ధ్వని సంజ్ఞ యెత్తి క్రీ. ౯౦౦ ప్రాంత మందున్న రాజశేఖరుఁడు—

"ధ్వని నాతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా
ఆనన్దవర్ధనః కస్య నాసీ దానన్దవర్ధనః"

అనుచు ధ్వనికర్త యానందవర్ధనుఁ డైనట్లు ప్రశంసించియున్నాఁడు [1]. వక్రోక్తిజీవితకర్త యగుకుంతకుఁడు ధ్వనికారుఁ డానందవర్ధనుఁ డని యతనిమాట లెత్తియున్నాఁడు. క్రీ. ౧౦౦౦–౧౦౫౦ లోనివ్యక్తివివేకకర్త యగుమహిమ భట్టును [2] క్రీ. ౧౦౩౦–౧౦౭౦ లోనియౌచిత్యవిచారకర్త యైనక్షేమేంద్రుఁ డును [3] ధ్వనికారికలును వృత్తియుఁ గూడ నానందవర్ధనకృతము లనియే పెక్కు చోట్ల నతనిమాటలు గ్రహించియున్నారు. క్రీ. ౧౧౫౦ ప్రాంతములోనికావ్యాను శాసనకర్త యగుహేమచంద్రుఁడు ధ్వనికారికలు రెం డానందవర్ధనునివిగా గ్రహిం చియున్నాఁడు [4]. ప్రతీహారేన్దురాజు, ఉద్భటాలంకారవృత్తిలో, ఆనందవర్ధనుని వృత్తిలోనిమాట లుద్ఘాటించుచు, సహృదయుఁ డానందవర్ధనుఁ డైనట్లు తెలిపి యున్నాఁడు [5]. ఇది సహృదయుఁ డనువాఁడు వేఱు, అతఁడు కారికాకర్త యనెడి వాదమునకు భంజకము. ఇంక నిట్టిప్రమాణవచనములు కలవు కాని, పూర్వోక్త ప్రమాణములనుబట్టి, ఆనందవర్ధనుఁడే కారికలు రచియించి, అతఁడే వానికి వృత్తి

---

1. ఈశ్లోకము రాజశేఖరకృతముగా సూక్తిముక్తావళిలో నున్నది.
2. వ్యక్తివి. పుట 29, 34.
3. ఔచిత్య. శ్లో 18. క్రిందివ్యాఖ్యలో. తదుక్త మానందవర్ధనేన-విరోధి వా విరోధీవా రసోఽఙ్గిని రసాన్తరే-ఇది, ధ్వన్యా-3-24. అవిరోధీ విరోధీవా-ఇత్యాదిగా నున్నది.
4. ధ్వన్యా. 3-30, 39-కావ్యాను. పుట 113, 235.
5. ఉ. వృ. పుట. 79-85. తైః (సహృదయైః) సహృదయైః ర్వ్యఞ్జకత్వముక్తమ్...

రచియించె ననెడిపూర్వప్రతీతి విశ్వసనీయ మనుట కివి చాలకపోవు. ఈరెంటిని రచియించినవారు వే ఱనుటకుఁ బ్రబల మైనప్రమాణము లభించునంతవఱకు నీ రెంటికర్త యానందవర్ధనుఁడే యని విశ్వసింతము.

అసాధారణప్రతిభాశాలి యైనయీవిద్వన్మణి, యివి గాక దేవీశతకము అర్జునచరితమహాకావ్యము విషమబాణలీల యనెడిప్రాకృతగ్రంథము ధర్మోత్తమ యనెడివినిశ్చయటీకకు వివరణము రచియించినట్లు కనఁబడును గాని; దేవీశతకము తప్పఁ దక్కినవి యిపుడు గోచరింపకున్నవి. అర్జునచరితవిషమబాణలీలల నుండి యుదాహరింపఁబడినకొన్ని శ్లోకములు ధ్వన్యాలోకమునఁ గలవు [1]. ఇతఁడు పూర్వలక్షణకర్తలలో భరతభామహోద్భటులను పేర్కొనెను. పూర్వకవులలోఁ గాళిదాస శ్రీహర్షభవభూతి భట్టబాణాదులకృతులనుండి కొన్నిశ్లోకము లుదాహరించెను. ఇతనిధ్వన్యాలోకమునకుఁ జంద్రిక యనుమఱియొకవ్యాఖ్య యున్నట్లు తెలియును గాని, అది లభింప కున్నది. మహిమభట్టు భట్టనాయకుఁడు మొద లగుకొందఱు ధ్వనిమతమును మిక్కిలి నిరసించి విమర్శించినను [2] ఇది యుదయించినది మొదలుగాఁ బెక్కండ్రయాదరణమునకుఁ బాత్ర మైనట్లు రాజానకరుయ్యకాదులు గావించినధ్వనిప్రశంసయే చెప్పుచున్నది. ఇది యిట్టిఖ్యాతిగడించుటకు శ్రీమదభినవగుప్తాచార్యునిలోచనముగూడఁ దోడ్పడిన దనుట సత్యేతరము కాఁజాలదు. అభినవగుప్తుఁడు సర్వతంత్రస్వతంత్రుఁడు, బహుగ్రంథకర్త, విమర్శకాగ్రణి. ఇతఁడు, క్రీ. ౯౯౧ లో, క్రమస్తోత్రమును ౧౦౧౫ లోఁ బ్రత్యభిజ్ఞావిమర్శినియు [3] రచియించినట్లు వానికడపటిశ్లోకములవల్లఁ దెలియుటంబట్టి, యితఁడు క్రీ. ౯౫౦—౧౦౩౦ నడుమ నున్నవాఁ డని విదిత మగుచున్నది. ఈమహావిద్వాంసుఁడు, భరతనాట్యశాస్త్రటీక కావ్యకౌతుకవివరణము తంత్రసారము తంత్రాలోకము నాట్యాలోచనము పరమార్థసారము మొదలుగా నిరువదియైదుకృతులు నిర్మించినట్లు తెలియుచున్నది. అట్టియీపండితుఁడు చేపట్టినధ్వని జయధ్వని యన్న నాశ్చర్యమేమి? కాని, కడపటియుద్ద్యోతమున కితనిలోచనవ్యాఖ్య లభింపక పోవుట విచారకరము. చంద్రికావ్యాఖ్య నితఁడు చూచియే, అది సముచితముగా లే దనుభావమునఁ దా నీలోచనము రచియించినట్లుగా మూఁడవయుద్ద్యోతము కడపట నిట్లు చెప్పియున్నాఁడు.

---

1. మదీయే-మహైవ. అనుచు_62-152-148. మొద. పుటలలో నున్నవి.
2. వ్యక్తివివేకము, హృదయదర్పణము, మొదలగువానిలో—
3. ఇతి నవతితమే ఽస్మి న్వత్సరాన్త్యే యుగాంశే తిథిశశిజలధిస్థే-కలి-4115-లౌకికాబ్దములు 90_క్రీ. 1015.

"కిం లోచనం వినా లోకో భాతి చంద్రికయాపి హి
తే నాభినవగుప్తోఽత్ర లోచనోన్మీలనం వ్యధాత్"

మఱియు, "ఇత్యలం పూర్వవంశ్యైస్సహ వివాదేన "ఇత్యాదిగా, చంద్రికాకారమతమును పెక్కుచోట్ల ఖండించియున్నాఁడు.

"కావ్యస్యాత్మా ధ్వని రితి బుధై ర్యస్సమామ్నాతపూర్వః" ఇత్యాది మొదటికారికయు, దానివృత్తియు లోచనమునుగూడ ధ్వనిమతము పూర్వమునుండి వచ్చుచున్న దనుభావము తెలిపినవి గాని, గుణాలంకార రీతి రస మతములవలె నిది వాక్యబద్ధము కా దని లోచనకారునిమాటలవల్లనే తెలియుచున్నది.[1]. కావుననే వామనరుద్రటులకాలమందు గూడ ధ్వనిమతము లే దని యింతకు మున్ను మనము తెలిసికొనియున్నాము. గ్రంథాదియం దానందవర్ధనుఁడు, ధ్వనిని సమర్థించుటకు ముందుగా ధ్వన్యభావవాదులమతము లాశంకించుటలో "తద్వ్యతిరిక్తః కోఽయం ధ్వని ర్నామ—నాస్త్యేవ ధ్వనిః—న సంభవ త్యేవ ధ్వనిర్నామాపూర్వః కశ్చిత్" అని చెప్పినమాటలవల్లఁ గూడ నిది యంతకుఁ బూర్వము సిద్ధమై గ్రంథస్థమైనది కా దని సూచిత మగుచున్నది. "తత్పరావేవ శబ్దార్థౌ" అనుకారికక్రిందివృత్తివల్ల[2] ప్రాచీనతమమైనవైయాకరణ (స్ఫోట) ధ్వనివాదము ననుకరించి యుదయించినట్లు గోచరించుచున్నయీధ్వనిమతము నవీనమైన దని, ఆనందవర్ధనునకు వెనువెంటనే క్రీ. ౯౨౫ ప్రాంత మందున్న ముకుళపండితుఁడు తనయభిధావృత్తిమాతృకలోఁ జెప్పియున్నాఁడు[3]. కాశ్మీరరాజైనయనంతభూవరుని కాలములోని క్షేమేంద్రుఁడు (క్రీ. ౧౦౨౦—౧౦౮౦) తనయౌచిత్యవిచారచర్చలో 'తదుక్త మానన్దవర్ధనేన' అనుచు, అవిరోధీ విరోధీ వేత్యాదికారిక నుదాహరించి యున్నాఁడు[4]. క్రీ. ౧౦౮౮—౧౧౭౨ లోని హేమచంద్రుఁడు తనకావ్యానుశాస

1. పరమ్పరయా య స్సమామ్నాతః—వినాపి విశిష్టపుస్తకేషు వివేచనా దిత్యభిప్రాయః. ధ్వన్యా.
2. ప్రథమేహి.. వైయాకరణాః.. శ్రూయమాణేషు వర్ణేషు ధ్వని రితి వ్యవహరన్తి. త థైవాన్యై స్తన్మతానుసారిభిః కావ్యతత్త్వార్థదర్శిభి ర్వాచ్యవాచకమిశ్రః శబ్దాత్మా కావ్య మితి వ్యపదేశ్యో వ్యంజకత్వసామ్యా ద్ధ్వని రిత్యుక్తః——శబ్దబ్రహ్మణాం విపశ్చితాం మత మాశ్రిత్యైవ ప్రవృత్తోఽయం ధ్వనివ్యవహారః—పు. 47–199 ధ్వన్యాలోకము.
3. లక్షణా మార్గావగాహిత్వంతు ధ్వనేఃసహృదయై ర్నూతనత యోపవర్ణితస్య విద్యత ఇతి—అభి. పుట. 21—
4. ధ్వన్యా. 3–24—ఔచి–18 శ్లో. క్రిందివృత్తిలో—

నముव్యాఖ్య యగునలంకారచూడామణివివేకములో "ప్రతీయమానం పున రన్య దేవ" వేత్యాదికారిక యానన్దవర్ధనునిది గా గ్రహించియున్నాఁడు[1]. ఇట్లే యింకను బెక్కండ్రు పూర్వులు ధ్వనికారికలును వృత్తియుఁ గూడ నానందవర్ధనుఁడే రచియించినట్లు చెప్పుచుండ ధ్వనిమతము నవీన మనుట కాక్షేప మేమి? ఇది యిట్లైనను, ధ్వన్యాలోకలోచనముల కలంకారశాస్త్రమున నుత్తమస్థానము గల దనుట నిర్వివాదము. తరువాత వెడలినవానిలోఁ గేవల మాలంకారికములు కాకున్నను, కొన్ని గుణములనుబట్టి యీసందర్భమున గ్రహింపఁదగినవి కావ్యమీమాంసా దశరూపకములు. అందు—

కావ్యమీమాంస, అపూర్వ మైనస్వతంత్రగ్రంథ మని దానిప్రథమాధ్యాయమువల్లనే తెలియును. "శివుఁడు పరమేష్ఠివైకుంఠాదు లగునఱువదినలుగురుశిష్యుల కుపదేశించినరీతిని, స్వయంభువు శిష్యులకుఁ గావ్యవిద్య నుపదేశించి, వారిలో సారస్వతేయుఁ డగుకావ్యపురుషు నీవిద్యను ముల్లోకములఁ బ్రవర్తింపఁ జేయుటకై నియమించెను. అతఁడు పదునెనిమిదియధికరణములకావ్యవిద్యను దివ్యులకుఁ జెప్పెను. వారిలో సహస్రాక్షుఁడు కవిరహస్యమును, ఉక్తిగర్భుఁ డౌక్తికమును, సువర్ణనాభుఁడు రీతినిర్ణయమును, ప్రచేతనాయనుఁ డానుప్రాసికమును, చిత్రాంగదుఁడు చిత్రయమకములను, శేషుఁడు శబ్దశ్లేషను, పులస్త్యుఁడు వాస్తవమును, ఔపకాయనుఁ డౌపమ్యమును, పారాశరుఁ డతిశయమును, ఉతథ్యుఁ డర్థశ్లేషను, కుబేరుఁ డుభయాలంకారికమును, కామదేవుఁడు వైనోదికమును, భరతుఁడు రూపకనిరూపణీయమును, నందికేశ్వరుఁడు రసాధికారికమును, ధిషణుఁడు దోషాధికరణమును, ఉపమన్యువు గుణౌపాదానికమును, కుచుమారుఁ డౌపనిషదికమును, పఠించి, యాయావిషయములను విశదీకరించుచు శాస్త్రములు నిర్మించిరి. ఏతాదృశ మైనయీవిద్య ప్రకీర్ణ మగుటచేతను, ఆయాశాస్త్రములందు కొంత కొంత యుచ్ఛిన్న మగుటచేతను, అందలియెల్లవిషయములకు సంగ్రహముగాఁ బదునెనిమిదియధికరణముల యీకావ్యమీమాంసాగ్రంథము రచియింపఁబడినది[2]." ఇత్యాదిగా మొదటియధ్యాయము చెప్పినదానినిబట్టి రాజశేఖరుఁడు పదునెనిమిదియధికరణములు నిర్మించె నని తెలియవచ్చుఁ గాని, అందు కవిరహస్య మనెడి ప్రథమాధికరణముమాత్రమే ముద్రణమునకు లభించినది. శాస్త్రసంగ్రహ మనెడియీప్రథమాధ్యాయ మెల్లవిధముల వాత్స్యాయనకామసూత్రప్రథమా

1. ధ్వన్యా. 1-4 అ. వివే. పు. 113.
2. ఇతీయం ప్రయోజకాఙ్గవతీ సంక్షిప్య సర్వ మర్థ మల్పగ్రన్థేన, అష్టాదశాధికరణీ ప్రణీతా—

ధ్యాయ మైనశాస్త్రసంగ్రహము ననుకరించినది. ఇందలికుచుమారుఁ డం దానిని మదికకర్తగాఁ జేర్కొనఁబడినవాఁడే. ఇందలిసువర్ణనాభుఁ డందు సాంప్రయోగిక కర్త. ఇందలిభరతుఁడే నాట్యశాస్త్రకర్త. ఇంతకు మించి పూర్వోక్తమునులు నిర్మించినగ్రంథములజాడ యెందును గనరాదు వినరాదు. అందుచే రాజశేఖరుఁడు కావ్యమీమాంసాప్రాచీనతను దానిఘనతను బ్రశంసించుటకై యిందలియాయా భాగముల నయ్యామునుల కంటఁగట్టినట్లు భావింపవచ్చును గాని, యితఁడు ప్రతిజ్ఞ చేసినట్లుగాఁ బదునెనిమిదియధికరణములను రచియించె నని మాత్రము చెప్పక తప్పకున్నది. ఇందుకు, చతుర్థాధ్యాయమున నితఁడు "యది సారస్వతో ఽనుభావః ప్రసాదయతి త మౌపనిషదికే వక్ష్యామః" అని చెప్పుటయు, అలంకారశేఖరమునులక్షణము పదునొకండవమరీచిలో నుపమాలంకారప్రశంసాసందర్భమున రాజశేఖరునిదిగా—

"అలంకారశిరోరత్నం సర్వస్వం కావ్యసమ్పదామ్,
ఉపమా కవివంశస్య మాతై వేతి మతి ర్మమ"[1].

అనుశ్లోకము నుద్ఘాటించుటయు నిదర్శనము లగుచున్నవి. అయిన నేమి! శాస్త్రసంగ్రహము మొదలుగాఁ గాలవిభాగము వఱకుఁగల పదునెనిమిదిచిన్న యధ్యాయములతోడి మొదటియధికరణముమాత్రమే లభించుచున్నది. బహువిషయవిమర్శక మైనయిది సాహిత్యమునకు భూషణ మనఁదగి యున్నది. ఇట్టి యుత్తమశాస్త్రగ్రంథము నిర్మించిన రాజశేఖరుఁడు యాయావరవంశోత్పన్నుఁడు. ఇతఁడు తన పేరుకు బదులుగా నీగ్రంథమందు యాయావరీయసంజ్ఞనే వాడుకొని యున్నాఁడు. ఉదయసుందరీతిలకమంజర్యాదికర్త లితని యాయావరకవినామముననే ప్రశంసించిరి. ఇతఁడు తనబాలభారతాదినాటకములలో, కాన్యకుబ్జము పాలించిన మహేంద్రపాలుని నతనిసుతుఁ డగుమహీపాలుని వర్ణించుటనుబట్టి ౯౦౩, ౯౧౭ సంవత్సరములలో[2] పరిపాలకులుగా నుండినవారికి సమకాలికుఁ డగు రాజశేఖరుఁడు క్రీ. ౮౭౫–౯౨౫ నడుమ నున్నవాఁ డని తెలియుచున్నది. ఇతని కించుక తరువాతివాఁ డై క్రీ. ౯౮౦ ప్రాంతమువాఁ డైనముకుళభట్టు రచియించిన—

అభిధావృత్తిమాతృకయనులక్షణము పదియేనుశ్లోకములతోడిదై యతని వృత్తితోనే ముద్రిత మైనది. ఇది శబ్దముఖ్యార్థలాక్షణికార్థముల వివరించుచుఁ

1. ఇది, ఔపమ్యాధికరణములో నుండి యుండును.
2. ఇండియన్ ఏంటిక్వరీ. సంపు. 16, 34 ఎపిగ్రాఫియాఇండికా. సంపు. 1–171.

ప్రాధాన్యము వహించినది. ప్రతీహారేందురాజునకు గురు వయిన యితఁడు భట్ట కల్లటుని పుత్రుఁడు. అతఁ డవంతివర్మకాలములోనివాఁ డని—

"అనుగ్రహాయ లోకానాం భట్టాః శ్రీకల్లటాదయః,
అవన్తివర్మణః కాలే సిద్ధా భువ మవాతరన్."

అనురాజతరంగిణీశ్లోకమునఁ దెలియుచున్నది[1]. కావున ముకులునిపూర్వోక్త కాలము సరి యగును. ఇతని కించుకపరుఁ డైన భట్టతౌతుఁడు నిర్మించిన—

కావ్యకౌతుకము లభింపకున్నది గాని, అది యుత్తమలక్షణ మైనట్లుగా నర్వాచీనులు గావించిన ప్రశంసలవల్లఁ గనఁబడుచున్నది. 'యదుక్త మస్మదుపాధ్యాయభట్టతౌతేన'[2]. అనెడియభినవగుప్తవచనమునుబట్టి యతనిగురు వైనట్లు తెలియఁబడుచున్న యితఁడు క్రీ. ౯౬౦ ప్రాంతమువాఁ డనుట విదితము. అభినవగుప్తుఁడు శాంతరసమునుగూర్చి ప్రసంగించుచు "మోక్షహేతు వైనశాంతము సర్వరసములకంటెఁ బ్రధానతమ" మని తమయుపాధ్యాయులు కావ్యకౌతుకమునఁ జెప్పినట్లును, ఆగ్రంథమునకుఁ దాను వివరణము వ్రాసినట్లును, తెలిపియున్నాఁడు[3] హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనములో భట్టతౌతునివని యీక్రింది మూఁడు శ్లోకము లుదాహరించియున్నాఁడు[4].

"నానృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్,
విచిత్రభావధర్మాంశతత్త్వప్రఖ్యా చ దర్శనమ్.
స తత్త్వదర్శనా దేవ శాస్త్రేషు పఠితః కవిః,
దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః.
తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యే ప్యాదికవే ర్మునేః
నోదితా కవితా లోకే యావ జ్జాతా న వర్ణనా."

ఈశ్లోకములను సోమేశ్వరుఁడు కావ్యప్రకాశటీకలోఁ గూడ నుదాహరించియున్నాఁడు. మాణిక్యచంద్రుఁడు సంకేతవ్యాఖ్యలో భట్టతౌతకృతముగా నీక్రింది శ్లోకము గ్రహించెను[5].

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా,
తదనుప్రాణనాజీవద్వర్ణనానిపుణః కవిః, తస్య కర్మ స్మృతం కావ్యమ్...

1. రాజత. 5-66— 2. ధ్వ. లోచ. పుట 29— 3. ధ్వ. లోచ. పుట 178.
4. హేమ. కావ్యా-పు. 316.—5. కావ్యప్ర. సంకే—మైసూరుముద్రణము. పుట 7.

ఈపైప్రమాణములనుబట్టి యుత్తమసాహిత్యలక్షణముగా నిరూపింపఁబడిన కావ్యకౌతుకము మృగ్య మయ్యెఁగదా యని విచారింపక తప్పదు. ఇతని కంటెను పరుఁడై రసవిచారమున భుక్తివాదము లేవనెత్తిన భట్టనాయకుఁడు నిర్మించిన—

హృదయదర్పణముగూడ నదృశ్య మగుట సాహిత్యవిద్యకుఁ దీఱనిలోప మనవచ్చును. ఇది భరతనాట్యశాస్త్రమునకు వ్యాఖ్య యని కొందఱియభిప్రాయము[1]. కాని గ్రంథము కనరాకపోవుటచే నిద మిత్థ మన వీలు లేకున్నది. అభినవగుప్తాచార్యుఁడు లోచనములో హృదయదర్పణముపే రెత్తియు భట్టనాయకునిపే రెత్తియుఁ గొన్నిమాటలను గొన్నిశ్లోకములను గూడ స్వీకరించి యున్నాఁడు[2]. ఆశ్లోకములనే హేమచంద్రుఁడు కావ్యానుశాసనమున నుదాహరించియున్నాఁడు[3]. ఆశ్లోకము లివి—

> "శబ్దప్రాధాన్య మాశ్రిత్య తత్ర శాస్త్రం పృథ గ్విదుః,
> అర్థతత్త్వేన యుక్తంతు వద న్త్యాఖ్యాన మేతయోః.
> ద్వయో ర్గుణత్వే వ్యాపారప్రాధాన్యే కావ్యధీ ర్భవేత్"

రుయ్యకుఁ డలంకారసర్వస్వమున భట్టనాయకుని పేర్కొని వ్యంగ్యవ్యాపారవిచారణ కావించెను. జయరథుఁడు దానివ్యాఖ్యలో భట్టనాయకుని హృదయదర్పణకారునిగాఁ బేర్కొనియున్నాఁడు[4]. ధ్వనిమత మణఁగింప వ్యక్తివివేకము నిర్మింపఁ బ్రతిన పూనినమహిమభట్టు నీక్రిందిశ్లోకమునకు—

> "సహసా యశో ఽభిసర్తుం సముద్యతా దృష్టదర్పణా మమ ధీః
> స్వాలఙ్కారవికల్పప్రకల్పనే వేత్తి కథ మివావద్యమ్"[5].

రుయ్యకుఁ డర్థమువ్రాయుచు, "దర్పణో హృదయదర్పణాఖ్యో ధ్వనిధ్వంసగ్రన్థోఽపి" అనుచు నిందలిదర్పణశబ్దమున కద్ద మనియు హృదయదర్పణగ్రంథ మనియు రెండర్థములు తెల్పెను. దీనికి ధ్వనిధ్వంసవ్యవహార మున్నట్లుగా,

"కించ వస్తుధ్వనిం దూషయతా రసధ్వని స్తదనుగ్రాహకః సమర్థ్యత ఇతి సుష్ఠుతరాం ధ్వనిధ్వంసో ఽయమ్"[6] అనెడియభినవగుప్తునిమాటవల్లఁ గూడ స్పష్టపడుచున్నది. ఇత్యాదిబహుప్రమాణములనుబట్టి, ఆనందవర్ధనునికిని, అభినవ

---

1. చూ. S. K. De పండితుని Sanskrit Poetics. Part. II P. 24.
2. ధ్వన్యా. లోచ. పుట 27.—
3. హే. కా. పు. 3.
4. అలం—కా. 9; 12,—
5. వ్య. వి—పుట. 1.
6. ధ్వ. లో—పుట. 20.

గుప్తునికిని నడుమ నున్నట్లు తెలియవచ్చెడి భట్టనాయకుఁడు క్రీ. ౯౧౦—౧౦౦౦ నడుమవాఁడై ధ్వనివాదమును ఖండించుచు, కావ్యాత్మ రస మనెడివాదమును సమర్థించుచు సాహిత్యలక్షణ మైనహృదయదర్పణము రచియించినట్లు విదితమగు చున్నది. ఇతని భుక్తివాదమునకు మూలమైన యీ క్రిందిలక్షణశ్లోకములను జయ రథుఁ డలంకారసర్వస్వవ్యాఖ్యలో నుదాహరించెను[1].

"అభిధా భావనా చాన్యా తద్భోగీకృతి రేవచ,
అభిధా ధామతాం యాతే శబ్దార్థాలఙ్కృతీ తతః.
భావనాభావ్య ఏషోఽపి శృఙ్గారాదిగణో మతః
తద్భోగీకృతిరూపేణ వ్యాప్యతే సిద్ధిమా న్నరః"

వీనిభావమునే రసనిర్వచనమున మమ్మటభట్టు "నతాటస్థ్యే'నేతివచన మునఁ జూపి యున్నాఁడు[2]. ధ్వనిమతముతో లోల్లటశంకుకులరసనిర్వచనముల నిరాకరించినయీనాయకుని మాణిక్యచంద్రుఁ డిట్లు ప్రశంసించియున్నాఁడు.

"న వేత్తి యస్య గామ్భీర్యం గిరి తుఙ్గోఽపి లోల్లటః,
త త్తస్య రసపాథోధేః కథం జానాతు శంకుకః ?
భోగే రత్యాదిభావానాం భోగం స్వ స్యోచితం బ్రువన్,
సర్వథా రససర్వస్వ మభాంక్షీ ద్భట్టనాయకః"[3]

దీనినిబట్టి యతనికాలమున హృదయదర్పణము వ్యాప్తిలో నున్నట్లును, రసనిర్వచనమున భట్టనాయకమతమున కాదరణ మున్నట్లును గనఁబడుచున్నది. ఈభట్టనాయకుఁ డభినవగుప్తుని కించుకపూర్వుఁడో లేక సమకాలికుఁడో యై యుండు ననుట నిశ్చయము గావున, రాజతరంగిణిలోఁ బేర్కొనఁబడిన శంకర వర్మకాలము (క్రీ. ౮౮౩—౯౦౨) లోని భట్టనాయకుఁడు కాఁ డనువిషయమున[4] పి. వి. కాణేపండితుఁడు సంశయించెనుగాని యితఁ డతఁడు కాఁ డనుటయే యుచి తము. ఇంక దీని కించుకతరువాతిదై—

క్రీ. ౧౦౨౦ ప్రాంతమున నుదయించినవక్రోక్తిజీవితముమాట యొకింత. దీనికర్త యగుకుంతకుఁడు ప్రాచీనాలంకారికులలో గణన కెక్కి యర్వాచీనులచేఁ బెక్కుసందర్భముల స్మరింపఁబడినవాఁడు. కారికావృత్త్యాత్మకమై పూర్వకవుల యుదాహరణశ్లోకములతో వెలయుచున్నయిది నాలు గున్మేషముల గ్రంథము.

---

1. అలం. స. విమ. పుట. 9.
2. కావ్యప్రకా. పుట. 110.
3. కావ్య. సంకే. పుట. 147.
4. రాజత. 5-59 సాహిత్యదర్పణటీక 79.

మొదటియున్మేషము నారంభించుచు, కావ్యలక్షణము చెప్పి, శబ్దార్థరూప మైన కావ్యమునకు, కవీశ్వరునివైదగ్ధ్యభంగీఫణితిరూప మైనవక్రోక్తియే యలంకృతి యని కవి యిట్లు చెప్పియున్నాఁడు.

"శబ్దో వివక్షితార్థైకవాచకో ఽన్యేషు సత్స్వపి,
అర్థ స్సహృదయాహ్లాదకారీ స్వస్పన్దసున్దరః,
ఉభా వేతా వలఙ్కార్యౌ తయోః పున రలఙ్కృతిః,
వక్రోక్తి రేవ వైదగ్ధ్యభఙ్గీ ఫణితి రుచ్యతే,

దీనినిబట్టి యీలక్షణము వక్రోక్తిజీవిత మైనది. వక్రోక్తివైచిత్ర్యమే కావ్యజీవిత మని యితనిమతము. సహృదయుల కాహ్లాదము కలిగించునది చమత్కారకారి యైనవక్రోక్తియే యని యితనిసిద్ధాంతము. దీనికి వైచిత్ర్యమార్గము సుకుమారమార్గము మధ్యమమార్గ మని మూఁడుమార్గములు చూపఁబడెను. ఇందు మధ్యమమార్గము వైచిత్ర్యసౌకుమార్యములతోఁ గూడి మనోహర మగు నని యిట్లు వర్ణింపఁబడినది.

"మార్గో ఽసౌ మధ్యమో నామ నానారుచిమనోహరః,
స్పర్ధయా యత్ర వర్తన్తే మార్గద్వితయసమ్పదః"

ఇందు మొదటియున్మేషమునఁ గవిత్వవైచిత్ర్యము లావణ్యాదులలక్షణములు మొదలైనవియు, ద్వితీయమున వర్ణవిన్యాసవక్రత్వాదులు, తృతీయమున వాక్యవైచిత్ర్యవక్రతాదులు, చతుర్థమునఁ బ్రకరణవక్రతా ప్రబంధవక్రతాదులు వర్ణింపఁబడినవి. ప్రకరణవక్రతకు శాకుంతలాదులలోని దుర్వాసోమునిప్రవేశాదు లుదాహరింపఁబడినవి. కుంతకుఁడు స్వభావోక్తి నలంకారముగా నిరూపించుట యనర్హ మనుచు ని ట్లాక్షేపించియున్నాఁడు.

"అలఙ్కారకృతాం యేషాం స్వభావోక్తి రలఙ్కృతిః,
అలఙ్కారతయా తేషాం కి మన్య దవతిష్ఠతే"

మఱియు దండిభామహాదులు పేర్కొన్నరసవదూర్జస్విప్రేయోఽలంకారము లలంకారములు కావని నిరూపించియున్నాఁడు. ఈవిధముగాఁ గావ్య మెట్లు సహృదయరంజక మగు ననువిషయమున నితఁడు కావించినచర్చలును విమర్శనములును నిర్వచనములు నితనిప్రతిభాచాతుర్యమును దెలుపుచు నితనియీకృతికి సాహిత్యమున నుత్తమస్థాన మొసఁగుచున్నవి. ఇందలి పెక్కులక్షణము లర్వాచీను లైన సోమేశ్వరుఁడు కుమారస్వామి మొదలగువారు సగౌరవముగా స్వీకరించియున్నారు. అట్టియీకృతి చెన్నపురిరాజకీయపుస్తకాలయమున సజీవమై యున్నది. దీనికి ముద్రణభాగ్య మెప్పుడు గల్గునో! దీనితరువాత గణింపఁదగినది దశరూపకము.

దశరూపకకర్త యగుధనంజయుఁడు ధారానగరపాలకుఁడును వాక్పతిరాజసామాంతరుఁడు నగుముంజమహీపాలునియాస్థానములోనివాఁడై యతనికి సమకాలికుఁ డని దశరూపకాంతిమశ్లోకము చెప్పుచున్నది. అందుచే నితఁడు క్రీ. ౯౯౦ ప్రాంతమం దీకృతి రచియించె ననవచ్చును. ఇందలినాలుగుప్రకాశములలో రెండవది నాయికానాయకలక్షణములను నాల్గవది యష్టవిధరసలక్షణములను దెల్పుచున్నవి. దానంజేసి యిది యలంకారశాస్త్రగణనీయ మైనది. ఇది భరతనాట్యశాస్త్ర మాధారముగా జనియించిన దయ్యు రూపకలక్షణవివరణమునఁ గొంత స్వాతంత్ర్యమును నవీనతను జూపి ప్రామాణ్యము గడించినది. దీనివ్యాఖ్యాత యగు ధనికుఁడు మూలకర్తవలెనే విష్ణుసుతుఁడ నని వ్రాసికొన్నాఁడు. దీనినిబట్టి ధనంజయుఁడే తనగ్రంథమునకుఁ దాను వ్యాఖ్యవ్రాయుచు ధనికనామ ముపయోగించుకొనెనో, లేకధనికుఁ డనువాఁడు ధనంజయునిసోదరుఁడో నిర్ణయింప నలవి గాకున్నది[1]. ఈకృతికి వెనువెంటనే యుదయించినయుత్తమలక్షణము,

సరస్వతీకంఠాభరణము. అయిదుపరిచ్ఛేదములయీగ్రంథము నిర్మించిన భోజదేవుఁడు సుప్రసిద్ధుఁడైనధారానగరాధీశ్వరుఁ డగుభోజమహారాజు. అలంకారశాస్త్రమందు గొప్పఖ్యాతి గడించినవారిలో నిది లెక్కకు రాకపోవుటకుఁ గారణ మిద మిత్థ మనఁ జాలము గాని, యిది చాలావఱకు సంకలనగ్రంథ మగుట యొకకారణ మనవచ్చును. ఇందు, పద వాక్య వాక్యార్థదోషములు, శబ్దవాక్యార్థగుణములు, శబ్దార్థాలంకారములు, రసభావములు మొదలగుబహువిషయములు వివరింపఁబడినవి. ఇందు విశేషముగా దండికావ్యాదర్శములోనికారికలు కనవచ్చును. వామనాదీతరాలంకారికులలక్షణము లందందు గ్రహింపఁబడినవి. కాళిదాసభవభూత్యాదిపూర్వమహాకవులశ్లోకము లసంఖ్యముగా నిం దుదాహృతము లైనవి. ఇతనితరువాతియాలంకారికు లగుహేమచంద్రజయరథాదు లనేకు లితని మతమును దమకృతుల స్వీకరించుటనుబట్టి యీగ్రంథ మాకాలమున విద్వల్లోకమునుతి గాంచిన దని విదిత మగును.

భోజుఁడు, వామనుఁడు కావ్యాత్మగాఁ బేర్కొన్నరీతులకు అవన్తికా లాటీయా మాగధీ రీతులను జేర్చియీయాఱింటిని శబ్దాలంకారములలోఁ జేర్చెను[2]. మఱియు, జైమినిమునీంద్రుఁడు పేర్కొన్నప్రత్యక్షాదిషట్ప్రమాణముల నర్థాలంకారములలోఁ జేర్చెను[3]. ఇట్టివిశేషవిషయము లిం దనేకములు కనవచ్చును.

---

1. చూ. మదీయాంధ్ర దశరూపక పీఠిక.
2. షోఢా రీతి ర్నిగద్యతే. సర. 2. 27, 28.
3. [illegible] ప్రత్యక్షాద్యాని ప్రమాణానిచ జైమి. సూ. 1. 3.

ఇట్టివానిని మాణిక్యచంద్ర హేమచంద్రాదులు తమగ్రంథముల గ్రహించియుం డిరి[1]

భోజుఁడు శృంగారప్రకాశ మనురసలక్షణగ్రంథముకూడ రచియించినట్లుగా, టీకావళియు, దానివ్యాఖ్యాన మగుమల్లినాథకృతతరళయు, కుమారస్వామికృత రత్నాపణమును మొదలగువానివల్లఁ దెలియుచున్నది. అందలిశ్లోకములును గొన్ని లభించుచున్నవి. కాని, ఆగ్రంథము ముద్రితమై వ్యాప్తికి వచ్చినట్లు కనఁబడదు. అందలివిగాఁ దెలియవచ్చినశ్లోకములు—

"వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధి స్సిద్ధాకుతోఽపి వటయక్షవ దావిభాతి,
లోకే గతానుగతికత్వవశా దుపేతా మేతాం నివర్తయితు మేష పరిశ్రమోనః,
శృంగారవీరకరుణాద్భుతహాస్యరౌద్రభీభత్సవత్సలభయానకశాన్తనామ్నః
ఆమ్నాసిషు ర్దశరసా నప రేవయంతు శృంగార మేవ రసనా ద్రస మామనామః"
"శృంగార ఏక ఏవ రసః"

వీటినిబట్టి, వీరాదిరసములకు రసత్వము గతానుగతికన్యాయమున వచ్చి నదేకాని సహజము కాదనియు, ఎంద తేవేవి రసము లన్నను మామతమున శృంగార మొక్కటియే రస మనియు భోజుఁడు కంఠోక్తిగాఁ జెప్పినట్లు తెలియఁ గలదు. ఇట్లు పెక్కుసందర్భముల స్వాతంత్ర్యము వహించి లక్షణములం నిర్వ చించినయీమహారాజు గావించినసాహిత్యసేవ పండితప్రకాండుల ప్రశంసకుఁ బాత్ర మై వెలయుచున్న దనుట ప్రసిద్ధము. ఇతనిగ్రంథములకు సమకాలికమై యాకాల మందే ఘనత గాంచినది—

వ్యక్తివివేకము. దీనికర్త యైనమహిమభట్టు రాజానకవంశమునకుఁ జేరిన కాశ్మీరదేశీయుఁడు క్రీ. ౧౦౨౧—౧౦౬౦ నడుమ నీకృతి రచియించియుండు నని కాణేపండితుఁడు మొద లగువారభిప్రాయపడిరి. ౧౦౮౦ ప్రాంతమందలిమమ్మటభ ట్టితనిమతముస్వీకరించుటనుబట్టి యితఁడు తత్పూర్వుఁ డగును గావునఁ బైకా లము సరియగు ననవచ్చును. ఇతఁడు ముఖ్యముగా ధ్వన్యాలోకమతమును ఖం డించుటకు మూఁడు విమర్శము లనుప్రకరణములు గల యీకృతిని నిర్మించినట్లుగా,

"అనుమానాంతర్భావం సర్వస్యైవ ధ్వనేః ప్రకాశయితుమ్,
వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య మహిమా పరాం వాచమ్"

---

1. శ్రీభోజేన జైమిన్యుక్తప్రమాణాని సంభవ శ్చాలంకారత యోక్తాని. కా. సం. పు. 469.
సంభవప్రత్యక్షాగమోపమానార్థాపత్త్యభావలక్షణా శ్చార్థాలంకారా ఏతేభోజరాజేన ప్రతిపాదితాః. కావ్యా. వివే. పు. 225.

అను మొదటిశ్లోకమే చెప్పుచున్నది. మొదటి విమర్శమంతయు ధ్వనికార మతము విమర్శించుటకే వినియోగపడినది. ధ్వనిలక్షణమందు, అర్థవిశిష్టత్వాదికము లైనపదిదోషములు చూపినది. 'మతిమంతుఁడైనధ్వనికారుఁడు కావ్యలక్షణమును సామాన్యముగాఁ జెప్పకయే ధ్వని యనియు గుణీభూతవ్యంగ్య మనియుఁ బ్రకారద్వయమును జెప్పుట యప్రయోజక' మనుచు ధ్వనికారు నాక్షేపించినది[1]. ద్వితీయవిమర్శము, శబ్దార్థములయనౌచిత్యములు, విభావాదిభావములతోడి తద్భేదములు, పౌనరుక్త్యాదులు మొద లగువానిని జూపుచు శబ్దశక్తిమూలధ్వని మతమును నిరాకరించుచున్నది. తృతీయవిమర్శనము, ధ్వన్యాలోకము చూపిన యనేకధ్వన్యుదాహరణములను విమర్శించుచు వాని ననుమానపక్షమున సమన్వయించుచు, విభావానుభావవ్యభిచారిభావప్రతీతి రసాదిప్రతీతికి సాధన మనియు, తాదృశరసప్రతీతి యనుమానమున నంతర్భూత మగుచున్న దనియు నిరూపించుచున్నది. దీనినిబట్టి యిది యనుమానమతము నుద్ధరింప నమకట్టి ధ్వనిమతమును నిరసించినట్లు విశద మగును. కాని, దీనికి వ్యక్తివివేకవిచార మనుపేర వ్యాఖ్య నిర్మించినరాజానకరుయ్యకుఁడు[2]. మూలకర్తమతమునెడ ననాదరము చూపుచు ధ్వనిమతమునే యాదరించియున్నాఁడు. దీనినిబట్టి ధ్వన్యనుమానవాదములు పరస్పరవిరుద్ధములై యాకాలమున విజృంభించె నని తెలియఁగలదు. దీని తరువాత—

క్షేమేంద్రుఁడు (క్రీ ౧౦౨౦—౧౦౮౦) అలంకారశాస్త్రమునకు సంబంధించిన యౌచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము, అనెడి రెండుగ్రంథములు నిర్మించెను గాని, అవి విశేషవ్యాప్తిని గాంచలేదు. అట్లని యవి యనాదరణీయములు కావు. కావ్యమున కౌచిత్యమే జీవిత మనెడి నూతనమతము లేవనెత్తి[3] గుణాలంకారరసాద్యౌచిత్యముల లక్షణములు నిర్వచించి వానికిఁ బూర్వమహాకవుల గ్రంథములనుండి యుదాహరణములు చూపుచు నితఁడు రచియించిన యౌచిత్యవిచారచర్చ మృదుమధురభాషానిబద్ధమై సహృదయరంజకముగా నున్న దని, యిది కావ్యమాలలోఁ బ్రకటిత మైనపిదప విద్వాంసు లందఱును దీనిని బ్రశం

1. కిఞ్చ, కావ్యస్య స్వరూపం వ్యుత్పాదయితుకామేన మతిమతా.. తదనాఖ్యాయైవ తయోః ప్రధానేతరభావకల్పనేన ప్రకారద్వయ ముక్తం తదప్రయోజక మేవ—వ్యక్తి. పుట. 32.
2. వ్యాఖ్యాతపేరు లేకుండ ననంతశయనమున నసమగ్రముగా ముద్రితమైన యిది రుయ్యకకృతమే యని కాణేపండితుఁడు సమర్థించెను. చూ. సా. ద. పీఠిక.
3. అలఙ్కారా స్త్వలఙ్కారా గుణా ఏవ గుణాః సదా, ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్. ఔచి. ౯ శ్లో.

సించుట మన మెఱుఁగుదుము. కాశ్మీరదేశీయుఁ డగునీమహాకవి సుమారు నలువది గ్రంథములు రచియించి, అవంతివర్మయాస్థానము నలంకరించినవాఁ డని యిందలి కడపటిశ్లోకమువల్లఁ దెలియుచున్నది[1]. ఇందలిలక్షణశ్లోకము లన్నియుఁ గలసి ముప్పదియైదే కాని, ఇవి చక్కనియౌచిత్యవిచారము గావించిన వనుటస్పష్టము. ఇందలియొకయవతారికాశ్లోకములోని "కృత్వాపి కావ్యాలంకారాం క్షేమేంద్రః కవికర్ణికామ్" అనుమాటనుబట్టి యితఁడు కవికర్ణిక యనుమఱియొకయాలంకారిక గ్రంథముగూడ రచియించె నని తెలియుచున్నది గాని, అది కనఁబడదు. కవికంఠాభరణముగూడ నేఁబదియైదుశ్లోకముల చిన్నగ్రంథమే కాని, అందలి—

"అ త్రాకవేః కవిత్వాప్తిః, శిక్షా ప్రాప్తగిరః కవేః,
చమత్కృతిశ్చ శిక్షాప్తౌ, గుణదోషోద్గతి స్తతః,
పశ్చా త్పరిచయప్రాప్తి, రిత్యేతే పఞ్చసన్ధయః"

అనుశ్లోకమునుబట్టి పైయైదువిధములైనసంధులు విశదీకరింపఁబడిన వని తెలియనగును. తరువాత నప్పటికి నిప్పటికిఁ గూడ గణింపఁదగిన మహాగ్రంథము—

కావ్యప్రకాశము. దీనికర్త యగుమమ్మటుఁడు కాశ్మీరదేశీయుఁడు జైయటపుత్రుఁడు. క్రీ. ౧౦౨౦—౧౧౮౦ నడుమవాఁడు. ఇతఁడు దశమోల్లాసమునం దుదాత్తాలంకారమునకు భోజరాజవర్ణనము గల "ముక్తాః కేళివిహారసూత్రగళితాః" ఇత్యాదిశ్లోక ముదాహరించుటచేతను, క్రీ. ౧౧౬౦ లో, మాణిక్యచంద్రుఁ డితనియాకృతికి వ్యాఖ్య వ్రాయుటచేతను పైకాలము విశ్వసనీయ మగుచున్నది.

అలంకారశాస్త్రమున కీకృతి యుత్తమాలంకారమై వేదమునకు సాయణభాష్యమువలెను, వ్యాకరణమునకు మహాభాష్యమువలెను, బ్రహ్మసూత్రములకు శంకరభాష్యమువలెను జగత్ప్రసిద్ధి గాంచినది. ఈప్రకాశ మాకాలమున సాహిత్యజిజ్ఞాసువులసందేహాంధకార మణఁచుటయే గాక, సాహితీచణు లగువిద్వాంసుల హృదయముల నాకర్షించి వ్యాఖ్యానములను గాంచినట్లుగా—

"కావ్యప్రకాశస్య కృతా గృహే గృహే, టీకా తథాప్యేష తథైవ దుర్గమః"

అనెడియొకవ్యాఖ్యాతమాటవల్లనే తెలియుచున్నది. దీనికిఁ బూర్వ మింతకు మున్ను మనము పరిశీలించిన గ్రంథము లనేకము లుత్పన్నములైనను, ఇది వాని

---

1. ...తస్య శ్రీమదవన్తిరాజనృపతేః కాలే కిలాయం కృతః,

నన్నిటిని జూచియే యుదయించినను, ఇది తల మొత్తినపిదప నవి యన్నియు వివటీదగ్గఱ దీక్షము లైనవి. ఇందు, 'కావ్యం యశసే ఽర్థకృతే' ఇత్యాదిగాఁ గావ్యప్రయోజనములతోడి యుత్తమమధ్యమాధమకావ్యములు, వాచ్యలక్ష్య వ్యంగ్యాదులు, విభావాదిభావములు, శబ్దార్థచిత్రములు, పదవాక్యార్థములు, రసము, మాధుర్యాదిగుణములు, శబ్దార్థాలంకారములు, ఇవి యవి యననేల? రూపకలక్షణములు దక్కఁ దక్కినయెల్లసాహిత్యవిషయముల లక్షణములును సరస ముగాఁ బరిష్కరింపఁబడినవి. ఇందలిపదియుల్లాసములలోను గడపటిది పెద్దది. అర్థాలంకారములను నిరూపించుదానిలోఁ బరికరాలంకారమువఱకే మమ్మటా చార్యుఁడు రచియించె ననియుఁ దక్కిన వ్యాజోక్త్యలంకారాదిగ్రంథశేష మల్లట సూరి పూరించె ననియు, దీనివ్యాఖ్యలలో నిదర్శనాఖ్యవ్యాఖ్య నిర్మించినయానంద కవి చెప్పిన యీక్రిందిశ్లోకమువల్లఁ దెలియనయ్యెడి.

"కృతః శ్రీమమ్మటాచార్యవర్యైః పరికరావధిః,
ప్రబన్ధః పూరితః శేషో విధా యాల్లటసూరిణా"

కాని, ముద్రితము లైనసాహిత్యచూడామణి సంప్రదాయప్రకాశిన్యాదు లలోఁ బై విషయము కనరాదు. ఈమాట యావ్యాఖ్యాతలకుఁ దెలియద్దో, కాక, ఈస్వల్పగ్రంథ మల్లటసూరికృత మనకపోయిన నేమి యని యూరకుండిరో! ఏమైనను, ఆనందకవి యసత్యము చెప్పె ననుట సముచితము కాదు కావున మమ్మటాచార్యులు కావ్యప్రకాశము సమాప్తి నొందుచున్నకాలమున స్వర్గ మలంకరించియుందు రని మాత్ర మూహింపనగును.

ఈమహాపురుషుఁడు తనగ్రంథమున లక్ష్యములుగా నుదాహరించినశ్లోక ములు సుమా రాఱువంద లుండును. ఇవి యన్నియుఁగాళిదాసాదిపూర్వమహా కవులకావ్యములలోనివి. ఇతఁడు పూర్వాలంకారికులమతములను నిష్పక్షపాత బుద్ధితో విమర్శించినస్వతంత్రుఁడు. పూర్వాలంకారగ్రంథముల నెల్లఁ గూలంకష ముగా సవిమర్శముగాఁ జదివినమనీషి. మహాకవులకావ్యములలోనిదోషముల నెల్ల లేర్పఱిచినకవిరాజహంస. అట్టియితనికృతి లోకోత్తరమై పఠనపాఠవ్యవహారమునఁ బ్రపంచమంతట వ్యాపించిన దన్న నాశ్చర్యమేమి? దీనికి క్రీ. ౧౧౫౦ ప్రాంత మందలిమాణిక్యచంద్రుఁడు మొదలుగా, క్రీ. ౧౮౦౦ ప్రాంతమందలి శ్రీనివాస పండితునివఱకును, అలంకారశాస్త్రనిష్ణాతు లగుసుమారు డెబ్బదిమంది విద్వాం సులు వ్యాఖ్యలు నిర్మించినా రనుటకంటె దీనిమహిమను దీనివ్యాప్తిని వేఱుగా వర్ణింపవలసినపనిలేదు. ఇఁక దీనితరువాత గణింపఁదగినది—

అలంకారసర్వస్వము. ఏతత్కర్తయగు కాశ్మీరదేశపండితుఁడు,రాజానకరుయ్యకుఁడు[1] ౧౧౨౦-౧౧౫౦ నడుమ సారస్వతసేవ సలిపినయుత్తమాలంకారికుఁడు. ఇతఁడు, కావ్యప్రకాశసంకేతవ్యాఖ్య- వ్యక్తివివేకవ్యాఖ్య- అలంకారానుసారిణి- సాహిత్యమీమాంస- నాటకమీమాంస- బృహతి- అలంకారమంజరి- అలంకారవార్తికము-సహృదయలీల- మఱితొమ్మిదిసాహిత్యవిషయకగ్రంథములు నిర్మించెను. వీనిలో సర్వస్వతంత్రమై సహృదయహృదయంగమమై వన్నె గాంచినదలంకారసర్వస్వ మనుట పునరుక్తము. ఈపేర నలంకారశేఖరకర్తయైన కేశవమిశ్రుఁడును, పేళ్లు తెలియనిమఱియిద్దఱును గ్రంథములు రచియించిరని తెలియుచున్నది గాని[2] లోకమున వ్యాపించినయలంకారసర్వస్వ మిదియే. ఇందు భామహరుద్రటాదులమతము లుద్ఘాటింపఁబడినవి. ఇది ధ్వనిమతమును సమర్థించినది. పునరుక్తవదాభాసాదిశబ్దాలంకారములకును, ఉపమాద్యర్థాలంకారములకును లక్షణములు నిర్వచించుచు, పరిణామాదు లగుకొన్నియలంకారములకుఁ గావ్యప్రకాశమును మించి చక్కనివివరణము చూపుచు, అందు లేనివిచిత్రవికల్పాలంకారములను క్రొత్తగాఁ జేర్చుచు, అలంకారసర్వస్వ మనునామమును సార్థకము గావించుకొన్నది. దీనికి, జయరథుఁడు సముద్రబంధుఁడు విద్యాచక్రవర్తి యనువారు క్రమముగా విమర్శిని శబ్దనిబంధనము సంజీవని యనువ్యాఖ్యలు నిర్మించి దీనిమహిమ నింకను విస్తరింపఁ జేసియున్నారు.

ఇది సూత్రము వృత్తి ఉదాహరణము, అని త్రివిధముగా నున్నది. ఇందు, అలంకారసూత్రములు మాత్రమే రుయ్యకుఁడు నిర్మించె ననియు, ఉదాహరణసహిత మైనవృత్తి నలంకారసర్వస్వ మనుపేర రుయ్యకశిష్యుఁ డగుమంఖుకపండితుఁడు నిర్మించె ననియు, అనంతశయనముద్రితగ్రంథాద్యశ్లోకముల నిట్లు తెలియుచున్నది.

నమస్కృత్య పరాం వాచం దేవీం త్రివిధవిగ్రహామ్,
గుర్వలఙ్కారసూత్రాణాం వృత్త్యా తాత్పర్య ముచ్యతే,[3].
ఇతి మఙ్ఖుకో వితేనే కాశ్మీరక్షితిపసాన్ధివిగ్రహికః,
సుకవిముఖాలఙ్కారం త దిద మలఙ్కారసర్వస్వమ్"

---

1. రత్నాపణకారాదు లితనిని 'రుచక' నామమున వ్యవహరించిరి.
2 చూ. పి. వి. కాణేగారి సా. ద. పీఠిక.
3. కొన్నివ్రాతప్రతులలో 'నిజాలఙ్కారసూత్రాణా' మని యున్న టీకాగ్రంథమే చెప్పుచున్నది.

మఱియు నీయనంతశయనప్రతి యందే ముద్రిత మైనశబ్దనిబంధనవ్యాఖ్యావతారికలో సముద్రబంధుఁడు, మంఖుకోపజ్ఞ మైనయలంకారసర్వస్వమునకుఁ దాను నిబంధనవ్యాఖ్య నిర్మించినట్లు చెప్పియున్నాఁడు[1]. కాని, "గుర్వలంకారసూత్రాణా" మనుపదమునకు వ్యాఖ్య వ్రాయునపుడు మంఖుకగురు వైనరుయ్యకుఁ డనెడి యర్థము వ్రాయలేదు. నిజముగాఁ బై పాఠము మంఖుకునిదే యైనచో, అతఁడు గురుశబ్దమును రుయ్యకపరముఁగానే ప్రయోగించి యుండు ననుట నిరాక్షేపము. క్రీ. ౧౩౦౦ ప్రాంతమువాఁ డైనయీసముద్రబంధుఁడు రుయ్యకునికి సుమారు నూటయేఁబదియేండ్లతరువాతివాఁడు. క్రీ. ౧౨౨౦ ప్రాంతమువాఁ డైనజయరథుఁడు, అలంకారసర్వస్వవిమర్శినీవ్యాఖ్యలో సూత్రములు వృత్తియుఁ గూడ రుయ్యకునివనియే తెలిపియున్నాఁడు. రత్నాపణకర్త యగుకుమారస్వామి రెండుమూఁడుచోట్ల "తదుక్తం రుచకేన" అనుచు సర్వస్వవృత్తిలోనిమాటలు గ్రహించియున్నాఁడు. అట్లు జయరథుఁడును ఇట్లర్వాచీనులుగూడ సూత్రవృత్తులు రెండును రుయ్యకుని వని చెప్పుచుండ, సముద్రబంధునివ్యాఖ్యతోడి ప్రతులలో మాత్రము కనవచ్చెడిగుర్వలంకారేతిపాఠ మర్వాచీనలేఖకకల్పిత మనియు, పెక్కువ్రాతప్రతులం దున్నట్లు కావ్యమాలాముద్రితప్రతిలో నున్న 'నిజాలఙ్కారసూత్రాణా'మనుపాఠమే సరి యైన దనియుఁ బాఠకలోకమునకుఁ దోఁచక పోదు. అయినను, రెండుపక్షములకుఁ గూడ గ్రంథస్థవాక్యములు ప్రమాణ మగుటంజేసి యీవిషయము విమర్శకులకు సందిగ్ధముగానే యున్నది. కాశ్మీరరాజగుజయసింహునియాస్థానమున సంధివిగ్రహామంత్రి యైనమంఖుకుఁడు నిర్మించినశ్రీకంఠచరితములోనికొన్నిశ్లోకములు వృత్తిలో నుదాహరింపఁబడి కనవచ్చుట సముద్రబంధునిమాటకుఁ గొంతయూఁత యిచ్చి యీసందేహమునకుఁ గారణ మైనను, నిజాలంకారేతిపాఠ మున్నపెక్కువ్రాతప్రతులును జయరథాదులును జెప్పెడుమాటలనుబట్టి వృత్తికూడ రుయ్యకుఁడే నిర్మించె ననఁదగి యున్నది. ఇట్లే మంఖుకపక్షమును గొందఱు సమర్థింపఁజూచినను, వృత్తిలోనిప్రతివాక్యము గూడ గురుముఖమున వచ్చినట్లే శిష్యుఁడు వ్రాసె నని యంగీకరింపక తప్పదు కావున, ఆపక్షమునఁ గూడ రుయ్యకుఁడే వృత్తి నిర్మించె నన వచ్చును. లేకున్న సూత్రముల గూఢార్థము గురువు చెప్పకుండ శిష్యుని కెట్లు తెలియును? ఇంతకును అల్పసంఖ్యాకములు బహ్వర్థభూయిష్ఠములు సాహిత్యసర్వంకషములు నైన ౨౨౮ సూత్రములకు, వామనాచార్యుఁడు తనసూత్రములకు వృత్తి రచియించినట్లే రుయ్యకు

1. కదాచి న్మంఖుకోపజ్ఞం కావ్యాలఙ్కారలక్షణమ్,...
గంభీరం న ప్రతీక్షూణాం మంఖుకగ్రన్థసాగరమ్...
బుధపరిషదలఙ్కారో వ్యాఖ్యా దలఙ్కారసర్వస్వమ్...

కుఁడు గూడ రచియించె ననియు, అట్లతఁడే రచింపకున్న నిట్టివృత్తి పుట్టియుండ దనియు గోచరించుచుండ వృత్తికర్తృత్వమున కాశంక యేల? తరువాత క్రీ. ౧౧౨౩–౧౧౫౬ లోని జైనపండితుఁ డగువాగ్భటునివాగ్భటాలంకార మైదుపరిచ్ఛేదముల విలసిల్లుచు, కవిత్వమూల మైనప్రతిభ, సంస్కృతప్రాకృతాప భ్రంశభూతభాషామయకావ్యశరీరములు, కావ్యగుణములు, అలంకారములు, రస ములుమొద లగువిషయములను జక్కఁగా విశదీకరించినది. క్రీ. పదుమూఁడవ శతాబ్దిలో, సూత్రవృత్త్యాత్మక మైనకావ్యానుశాసన మనెడియైదధ్యాయముల కావ్యాలంకారరసాదిలక్షణము నిర్మించినవాగ్భటుఁడు నేమికుమారపుత్త్రుఁడు. అతఁడు వేఱు. మనవాగ్భటాలంకారకర్త సోమపుత్త్రుఁడు. ఇతనికృతికి, ఆదినా థుఁడు జినవర్ధనుఁడు మొదలుగా నెనమండుగురు వ్యాఖ్యానములు నిర్మించి రను టయే దీనివ్యాప్తిని దెలుపును. క్రీ. ౧౦౮౮–౧౧౭౨ లోని హేమచంద్రుఁ డెనిమి దధ్యాయములసూత్రాత్మక మైనకావ్యానుశాసనము నిర్మించెను. కాని, ఇది, రాజ శేఖరమమ్మటానందవర్ధనాదులకృతులనుండి పెక్కువిషయములు సేకరించుకొన్నది. క్రీ. ౧౩౦౦ ప్రాంతమందలిజయదేవునిచంద్రాలోకము లోకమున మిక్కిలివ్యాప్తి కెక్కినచక్కనిగ్రంథము. శ్లోకాత్మక మైనయిందలిలక్షణములు లక్ష్యములుగూడ సుగమములై పాఠకలోకరంజకము లైనవనుట విదితము. క్రీ. ౧౫౫౦–౧౬౨౦ లోని యాలంకారికశేఖరు డైనయప్పయదీక్షితు లితనిశ్లోకముల నెక్కువగా స్వీకరించి కువలయానందము రచియించిన ట్లీక్రిందిశ్లోకము చెప్పుచున్నది.

"యేషాం చంద్రాలోకే దృశ్యన్తే లక్ష్యలక్షణశ్లోకాః,
ప్రాయ స్త ఏవ తేషా మితరేషా మభినవా విరచ్యన్తే"

క్రీ. ౧౩౧౫ ప్రాంతమందలివిద్యాధరపండితుఁ డెనిమిదియున్మేషములగ్రంథ మగునేకావళి నిర్మించెను. కారికాత్మక మైనయీకృతికి వృత్తియు నుదాహరణ శ్లోకములు గూడ నితఁడే నిర్మించియున్నాఁడు. ఉత్కలదేశీయుఁ డైనయితఁడు, కేసరినరసింహుఁడు లేక ప్రతాపనరసింహుఁడు పోషకుఁడుగా నీకృతి నిర్మించె నని యీక్రిందిశ్లోకమునుబట్టి త్రివేదిపండితుఁ డూహించెను.

"ఏష విద్యాధర స్తేషు కాంతాసమ్మితలక్షణమ్,
కరోమి నరసింహస్య చాటుశ్లోకా నుదాహరన్"

దీనికి జగద్విఖ్యాతుఁ డగుమల్లినాథుఁడు తరల యనుపేర వ్యాఖ్య నిర్మించి వన్నె దెచ్చెను.

క్రీ. ౧౩౨౦ ప్రాంతమువాఁడును విదేహదేశీయుఁడును గణేశ్వరపుత్త్రుఁడు నగుభానుదత్తుఁడు లోలుతి నాయికానాయకభేదలక్షణ మగురసమంజరి నిర్మించి

పిదప నైనిమిదితరంగములతోడిరసతరంగిణి రచియించెను. వివిధరసవిషయములను గరతలామలకము గావించు నిది మనోహర మైనశైలి నొప్పుచున్నది. క్రీ. ౧౩౨౩ లో, ఏకశిలానగరపాలకుఁడు గా నున్న కాకతిప్రభు వైనప్రతాపరుద్రభూపాలుని కంకితముగా నిర్మింపఁబడినప్రతాపరుద్రయశోభూషణము, లేక ప్రతాపరుద్రీయ మనెడిమహాలక్షణగ్రంథ మర్వాచీనకృతు లన్నిటిలో మేటియై జగద్వ్యాప్త మైనది. దీనికర్త విద్యానాథపండితుఁడు. ఇతనియశఃకాయము శాశ్వతముగావించుట కిది చాలును. ఇది సర్వవిధములఁ గావ్యప్రకాశము ననుకరించినను, నాటకప్రకరణ మధికముగా వెలసినయీగ్రంథము పాఠకుల కుత్సాహము పుట్టించుచు హృదయరంజక మైనశైలి విరాజిల్లుచు సర్వాంగసౌష్ఠవముతో వెలయుచున్నది. తొమ్మిదిప్రకరణములతోడియీలక్షణమునఁ గావ్యనాటకదోషగుణశబ్దార్థాలంకారనాయకాదిలక్షణములు సలక్ష్యములుగా నితరగ్రంథములందువలెనే నిరూపింపఁబడినవి గాని, పద్ధతి మిక్కిలి సుగమ మగుటయే యిందలివిశేషము. దీనికి జగత్ప్రసిద్ధమల్లినాథసూరిపుత్త్రుఁడును, పెద్దయార్యునితమ్ముఁడును విఖ్యాతపండితుఁడు నగు కుమారస్వామియజ్వ తరల యనువ్యాఖ్యను క్రీ. పదియేనవశతాబ్దిలో రచియించెను. దీనితోడిమూలము భరతఖండమంతట నేటికిఁ గూడఁ గ్రీడించుచుండ నీశకృతులయోగ్యత వేఱుగా వర్ణింపనేల? కాని విద్యానాథునియుద్దేశముం దెల్పునవతారికలోని రెండుశ్లోకములు మాత్ర మిం దుదాహరింతును.

"రసప్రధానా శ్శబ్దార్థా గుణాలఙ్కారవృత్తయః,
రీతయ శ్చేయతీ శాస్త్ర ప్రమేయం కావ్యపద్ధతిః
యద్య ప్యసౌ ప్రబన్ధేషు ప్రాచాం సాధు నిరూపితా,
తథా ప్యస్యా స్సమం నేతు ర్నోదాహరణ మాదృతమ్,

ఇట్టియుత్తమము లైనమూలవ్యాఖ్యానములకర్త లిద్దఱుగూడ నాంధ్రులగుట యొకవిశేషము. ఇఁక దక్షిణహిందూదేశమున కలంకార మయినయీకృతి కీడగుచుఁ గొంచెము తరువాత ననఁగా, క్రీ. ౧౩౫౦ ప్రాంతమున నుత్తరహిందూదేశమునం దుదయించినసాహిత్యదర్పణము ప్రశంసనీయము. దీనికర్త విశ్వనాథకవిరాజు. ఉత్కలదేశీయుఁ డనియుఁ బ్రాగ్వంగదేశీయుఁ డనియుఁ దలంపఁబడు నీకవిరాజు పదునెనిమిదిభాష లెఱిఁగినట్లును (ఒకానొకకలింగభూపాలునిమంత్రియై) సాంధివిగ్రహికమహాపాత్రబిరుదాంకితుఁ డైనట్లును, పరిచ్ఛేదాంతగద్యములు చెప్పుచున్నవి. పదిపరిచ్ఛేదములయీమహాగ్రంథమునఁ గావ్య శబ్ద శక్తి ధ్వని వ్యంగ్య రస భావ ద్వివిధాలంకారాది సకలసాహిత్యవిషయములు ప్రసంగింపఁబడినవి. దేశమునఁ జక్కఁగా వ్యాపించినయదియు నలంకారశాస్త్రమునఁ బ్రామాణ్యము గాంచినది.

వేంకటగిరిసంస్థానరాజులమూలపురుషుఁడును రేచర్లగోత్రసంజాతుఁడును, అన్నమాంబానంతులపుత్త్రుఁడును, రాజాచలము రాజధానిగా వింధ్యశ్రీశైల మధ్యభాగ మేలినవాఁడు నగుసింగభూపాలుఁడు క్రీ. ౧౩౩౦-౫౦ నడుమ రసార్ణవసుధాకర మనెడిమూఁడువిలాసముల గ్రంథము నిర్మించెను. భరతకోహలదత్తి లాదులు నిర్మించిననాట్యశాస్త్రము లతిగభీరము లగుటచేతను, వాని నెఱింగినవారు తక్కు వగుటచేతను నాట్యసంప్రదాయము విచ్ఛిన్న మగుటచేతను, అపరిస్ఫుటముగా నున్ననాట్యపద్ధతిని జక్కఁబఱుచుటకై తా నీగ్రంథము రచియించినట్లు రాజకవి యవతారికలోఁ జెప్పియున్నాఁడు. కాని, ఈగ్రంథము పెక్కువిధముల దశరూపకము ననుకరించి యనుసరించి విస్తరిల్లిన దని యీరెంటిని బోల్చి చదివిన వారికిఁ దెలియక పోదు. అయినను, సరసముగా లేక పోలేదు కాని, దీనికి విశేష వ్యాప్తిమాత్రము రాలేదు. దీనివలెనే మహారాజాధిరాజధర్మారాత్మజశ్రీమదల్ల రాజప్రణీత మైనరసరత్నదీపిక భీమేశ్వరభట్టవిరచిత మైనరససర్వస్వము మొదలుగా నేఁబదిగ్రంథములు రసవిషయమున నుద్భవించినట్లు తెలియుచున్నది గాని, అవి ముద్రితములు గాక మూలలఁ బడియున్నవి. ఇట్లు శాఖోపశాఖలుగా వెలసినరసగ్రంథములలో నర్వాచీన మయ్యు నగ్రగణ్య మైనది—

రసగంగాధరము. కాశీనవద్వీపాదివిద్యాస్థానములందు శబ్దతర్కమీమాంసాదిశాస్త్రములు పఠించి మనదేశమునకుఁ బేరు తెచ్చినవిద్వాంసు లనేకులు కలరు కాని వారిలోఁ దమయభిమానశాస్త్రముల గ్రంథములు నిర్మించి యాంధ్రదేశమునకు విఖ్యాతి తెచ్చినవారు కొందఱు మాత్రమే. అందును, సకలశాస్త్రపారదృశ్వయై సాహితీసార్వభౌముఁడై కవిశేఖరుఁడై విమర్శకాగ్రణియై పండితరాజబిరుదమే పేరుగా జగద్విఖ్యాతి గాంచినజగన్నాథపండితునివంటివిద్వత్కవీంద్రుఁ డాంధ్రులలోనే కాదు, ఇతరదేశీయులలోఁ గూడ లేఁ డనుట యతిశయోక్తి కాదు. అటు వైయాకరణశిరోమణి యగుభట్టోజీదీక్షితులమనోరమను, ఇటు సకలశాస్త్రనిధి యగునప్పయదీక్షితుల చిత్రమీమాంసను విమర్శించి సమకాలిక పండితోత్తములమెప్పు గడించిన యీవిద్వల్లోకవంద్యునిరసగంగాధరమణి సాహిత్యసారస్వతమును దివ్యతేజస్సులఁ బ్రకాశింపఁజేయుచు 'నభూతో న భవిష్యతి' యనునార్యోక్తి నన్వర్థముఁ జేయుచున్నది.

జ్ఞానేంద్రభిక్షు మహేంద్ర ఖండదేవ వీరేశ్వర పండితులశిష్యుఁడును దండ్రియు నయిన ఉపద్రష్టపేరుభట్టునొద్ద సకలవిద్య లభ్యసించిన యీకవీంద్రుఁడు క్రీ. ౧౫౮౦-౧౬౬౦ నడుమవాఁడై ఢిల్లీపాదుషాలయాస్థానకవియై శహాజాను పాదుషావల్లఁ బండితరాజబిరుద మందినవాఁడై భామినీవిలాసాదిబహుగ్రంథములు రచియించి, చరమవయస్సులో దీనిని రచియింప నారంభించుటచేఁ గాఁబోలు

నిది రెండవయాననము సమాప్తినొందుసమయమున నాఁగిపోయినది. ఇది పంచాననగ్రంథ మనియుఁ దక్షిణగ్రంథము నష్టమైన దనియు నొకకింవదంతి కలదు గాని నేఁటికిని దక్షిణగ్రంథము లభింపలేదు. పండితరాజుశిష్యుఁడైన నాగేశభట్టు దీనికి రచియించిన గురుమర్మప్రకాశవ్యాఖ్య గూడ నింతే లభించుటచేతను, వ్రాఁతప్రతులలోఁ గేవలము మూలము, మూలముతోడివ్యాఖ్యయుఁ గూడ నింతవఱకే కనవచ్చుటచేతను, దీనిని బ్రకటించినవారిలో నొకరగు మహామహోపాధ్యాయగంగాధరశాస్త్రిగారుకూడఁ గొంచెము తక్కువగా ద్వితీయాననమువఱకే పండితరాజీగ్రంథము రచియించె నని భావించియున్నారు. ఇతఁడు తరువాతి గ్రంథము నిర్మింప కున్న నంతగా విచారింపఁ బనిలేదు గాని, నిజముగా నిర్మించియున్నచో నది నష్ట మగుట యలంకారశాస్త్రమునకుఁ దీఱనిలోపమే యని పరితపింపక తప్పదు.

ఇది రసగంగాధర మైనను, ఇందు రస మొక్కటే ప్రధానవిషయము కాదు. ముద్రిత మైనసుమారేడువందలపుటలలోఁ బ్రథమాననము నూటడెబ్బది పుటలలోను గనవచ్చుకావ్యశబ్దగుణధ్వనివిభావాదులలో రసవిషయ మెక్కువగాఁ జర్చింపఁబడినది. ద్వితీయాననమున వ్యంజనాలక్షణాభిధాస్వరూపములు తద్భేదములు ఉపమాద్యర్థాలంకారములు నిర్వచింపఁబడినవి. పూర్వోక్తవిషయములు పరిశీలించుసందర్భములందు పూర్వాచార్యులైనయానందవర్ధనమమ్మటరుయ్యకాదులమతములు నిర్దాక్షిణ్యముగా విమర్శింపఁబడినవి. "అదోషౌ సగుణౌ సాలఙ్కారౌ శబ్దార్థౌ కావ్య" మ్మనెడిప్రాచీనులకావ్యలక్షణ మెత్తుకొని విమర్శించుచు, కావ్యము పైకిఁ బఠింపఁబడునది. అర్థము దానినుండి తెలిసికొనఁబడునది. కావున శబ్దార్థములు రెండును గావ్య మనుట పొసఁగ దని యాక్షేపించుచు, పెద్దచర్చ యొనర్చి 'రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్య' మ్మనెడిస్వలక్షణము సిద్ధాంతీకరించు నీపండితరాజుగ్రంథారంభమే యితనిప్రతిభావిశేషముతోడి శాస్త్రరచనాప్రాగల్భ్యమును జాటుచున్నది. మఱియు, 'విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అనుభరతమునిసూత్రము మూలముగాఁ బ్రాచీనాలంకారికులు గావించినయెనిమిదివిధములగురసనిర్వచనముల నాశంకించి పరామర్శించి, విభావాదులలో నొక్కొకటి నియతరసవ్యంజకము కాదని యాక్షేపించి, పరమాహ్లాదమున కవినాభావియై ప్రతీయమాన మగురసము రమణీయత నావహించు ననుట నిర్వివాద మనుసిద్ధాంతమును బురస్కరించుకొని "రసో వై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి" అనుశ్రుతిని బ్రమాణము గావించుకొని, భగ్నావరణచిద్రూప మైనరత్యాదిస్థాయియే రస మను స్వమత మావిష్కరించుపట్టున నితఁడు గావించిన పరిశీలన మద్భుతానందదాయక మగుచున్నది.

రసమును, అందు విశేషించి నాట్యరసమును గూర్చి విశేషచర్చ గావించిన వారిలో నగ్రిముఁడు భరతముని. తరువాతివారిలో గణింపఁదగినవారు, అభినవగుప్తుఁడు, తదనుయాయి లైనభట్టలోల్లటాదులును, ధనంజయుఁడు శంకుకుఁడు మమ్మటుఁడు మొదలగువారును. శారదాతనయుఁడు భావప్రకాశనమున రసవిచారమత్యంతము గావించినవాఁడైనను, దాని కెందుచేతనో లోకమున వ్యాప్తి తక్కువ యైనది. అందు సామాన్యముగా నన్నియధికారములును, విశేషించి మొదటియాఁడధికారములును భావరసస్వరూపనిరూపణపరములై వృద్ధభరత భరతమునివాసుక్యాదిపూర్వాచార్యులమతము లావిష్కరించుచు రసజ్ఞానమున కాధారములై వెలయుచున్నమాట సత్యము. ప్రాచీనమతము లెల్ల నుదాహరించుచుఁ దాను భరతమునిమతము ననుసరించుచున్నానని చెప్పుచు భావరస తాదాత్మ్య మంగీకరించిన యతనిమతమును సంగ్రహించి మనరసగంగాధరకర్త చర్చించినట్లు కనరాదు గాని యితనిచర్చయందతని మతముగూడ గోచరించుచునే యున్నది. అయిన నేమి? భరతమునిరససూత్రవిచారణయందు పండితరాజు పైచేయి యయ్యె ననక తప్పదు. ఇందు భావప్రకాశనమునుబట్టి యుఁ దక్కిన గొన్నిగ్రంథములనుబట్టియుఁ బ్రాచీనప్రామాణికలాక్షణికు లొనర్చినరసనిర్వచనముల నొక్కచోఁ జేర్చిచూతము.

భరతవృద్ధుఁడు—“యథా నానాప్రకారౌషధై ర్వ్యఞ్జనౌషధైః పాకవిశేషైశ్చ సంస్కృతాని వ్యఞ్జనాని మధురాదిరసానా మన్యతమే నాత్మనా పరిణమన్తి తద్భోక్తౄణాం మనోభి స్తాదృశాత్మతయా స్వాద్యన్తే, తథా నానాప్రకారై ర్విభావాదిభావై రభినయై స్సహ యథార్హ్వ మభివర్ధితాః స్థాయినో భావాః సామాజికానాం మనసి రసాత్మనా పరిణమన్త స్తేషాం తాదాత్వికమనోవృత్తిభేదభిన్నా స్తత్తద్రూపేణ తై రస్యన్తే”[1].

వాసుకి :—

“నానాద్రవ్యౌషధైః పాకై ర్వ్యఞ్జనం భావ్యతే యథా,
ఏవం భావా భావయన్తి రసా నభినయై స్సహ,
ఇతి వాసుకినా ప్యుక్తో భావేభ్యో రససమ్భవః”[2].

భరతముని :—“విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః” “యథా నానావ్యఞ్జనౌషధిద్రవ్యసంయోగా ద్రసనిష్పత్తిః, తథానానాభావోపగమా ద్రసనిష్పత్తిః” యథాహి నానావ్యఞ్జనసంస్కృత మన్నం భుఞ్జానా రసా నాస్వాదయన్తి సుమనసః పురుషా హర్షాదీం శ్చాప్యధిగచ్ఛన్తి తథా నానాభావాభి

1, 2, భావప్ర—అధ్యా. 2. పు. 36, 37,

వయవ్యఙ్జితాన్ వాగఙ్గసత్త్వోపేతాన్ స్థాయిభావా నాస్వాదయన్తి సుమనసః ప్రేక్షకాః, తస్మా న్నాట్యరసాః—"

"యథా బీజా ద్భవే ద్వృక్షః, వృక్షా త్పుష్పం ఫలం యథా,
తథా మూలం రసా స్సర్వే తేషు భావా వ్యవస్థితాః,
న భావహీనో ఽ స్తి రసః, నభావో భావవర్జితః" [1].

ఆనందవర్ధనుఁడు :—నహి విభానుభావవ్యభిచారిణ ఏవ రసా ఇతి కస్య చిదవగమః, అత ఏవచ విభావాదిప్రతీత్యవినాభావినీ రసాదీనాం ప్రతీతి రితి తత్ప్రతీత్యోః కార్యకారణభావేన వ్యవస్థానా త్క్రమో ఽవశ్యం భావీ స తు లాఘవా న్నప్రకాశ్యతే ఇ త్యలక్ష్యక్రమా ఏవ సన్తో వ్యఙ్గ్యా రసాదయః" [2].

ధనంజయుఁడు :—
"విభావై రనుభావై శ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
ఆనీయమాన స్స్వాద్యత్వం స్థాయీ భావో రసః స్మృతః" [3].

మమ్మటుఁడు :—
"వ్యక్తః సతై ర్విభావాద్యైః స్థాయీ భావో రసః స్మృతః" [4].

భోజరాజు :—
"చిరం చిత్తే ఽవతిష్ఠన్తే సంబధ్యన్తే ఽనుబన్ధిభిః,
రసత్వం ప్రతిపద్యన్తే ప్రవృద్ధాః స్థాయినో ఽత్రతే" [5].

రుద్రటుఁడు :—"విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావై రుపనీయమానః పరిపూర్ణః స్థాయిభావో రస్యమానో రసః" [6]

రాజానకరుయ్యకుఁడు :—"విభావానుభావవ్యభిచారిభిః ప్రకాశితో రత్యాది శ్చిత్తవృత్తివిశేషో రసః" [7].

వాగ్భటుఁడు :—
"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆరోప్యమాణ ఉత్కర్షం స్థాయీ భావః స్మృతో రసః" [8]

---

1. నాట్యశా—6-71, 72, పుటలు
2. ధ్వన్యా—పుట. 183.
3. దశరూ. 4. 1—, ప్రతాపరు—రసప్ర—రసార్ణవ.1-59
4. కావ్యప్ర—4. 5—కావ్యప్రదీ—4. 5
5. సర. కం. 5. 13-19.
6. రుద్రటా. 12-4
7. అలంకారసర్వస్వము. పుట. 208.
8. వాగ్భ. 5. 2

వాగ్భటుఁడు నేమికుమారుఁడు :—

"విభావానుభావై ర్వ్యభిచారిభి శ్చాభివ్యక్తా రతిహాస...శమాః స్థాయినో భావాః, క్రమేణ శృఙ్గారహాస...శాన్తా నవ రసా భవన్తి"[1].

భట్టలోల్లటాదిపండితుల ఉత్పత్తిపక్షమును, శంకుకమతానుసారియైనయను మితిపక్షమును, నిరాకరించి, భరతధనంజయమమ్మటపక్షము నాదరించినధర్మ సూరి :—

"విభావానుభావవ్యభిచారిసామగ్రీసముల్లసిత స్థాయీ భావో రసః"[2].

దండిభామహోద్భటులు—"రస వద్రసపేశలమ్, రసవద్దర్శితస్పష్టశృంగారాదిరసం యథా" అనుచు శృంగారాదిరసవదలంకారములను బేర్కొనిరి గాని, రసనిర్వచనము గావింపలేదు. వా రలంకారప్రధానులు[3]. కాని, వారు కావ్యము రసభావ సమన్వితము కావలె ననువారే.

వామనుఁడు—'దీప్తరసత్వం కాన్తిః' అనుచు శృంగారాదిరసములు కలది కాంతిగుణ మనెను గాని[4] రసమును నిర్వచింపలేదు. అతఁడు గుణప్రధానుఁడు. కావున వారికి భరతమునిసూత్రములోఁ బ్రసక్తియే లేక పోయినది. ప్రతీహారేందురా జుద్భటునిరసవదాదిశ్లోకములకు వ్యాఖ్య వ్రాయుసందర్భమున, శృంగారాది నవరసములు రత్యాదినవస్థాయిభావపరిపోషాత్మకము లగుటఁ దద్రూపమున నాస్వాద్యము లగుచు,ఆస్వాదభేదనిబంధన మగు తాంత్రిక మైనరసశబ్దమునఁ జెప్పఁ బడుచున్న వనెను గాని స్థాయిభావము రస మనెడి యభిప్రాయము తెలుపలేదు. ఇంక—

పూర్వోదాహృతలక్షణములలో, వ్యంగ్యము రస మనెడిధ్వనిలక్షణము తప్పఁ దక్కిన వన్నియు భరతమునిసూత్రము నాశ్రయించిన వనుట విదితము. కాని, ఆసూత్రమందలిసంయోగనిష్పత్తిశబ్దములయర్థములను బూర్వాలాక్షణికు లిష్టము వచ్చినట్లు విఱిచి రసస్వరూపమును బహువిధముగా నిర్వచించియున్నారు. అందు నాలుగుభేదములను మమ్మటుఁడు పరిశీలించెను. అతని 'వ్యక్త స్సతై' రిత్యాదిలక్షణము విమర్శించుటతో మఱినాలుగు భేదములు చూపి పండితరాయలు పరిశీలించియున్నారు. ఇట్లు రసనిర్వచనములు మొత్త మెనిమి దైనవి.[5] కావ్యప్రకాశరస

1. కావ్యా. 5.
2. సా. ర. 10
3. కా. ద. 2. 275—భా. కా. 3. 6—ఉ. కా. 4. 3, 4,
4. కా. సూ. 3. 15.
5. చూ. రసగం. పు. 48, 49,

గంగాధరాదులందు సంగ్రహముగాఁ గ్రోడీకరింపఁబడినయవి శాస్త్రపక్కిని బ్రాథ ములు పారిభాషికపదభూయిష్ఠములు నగుట మక్కికిమక్కిగాఁ దెలిఁగించుట ప్రయోజనకారి కాదని యందలి కొన్నిటిముఖ్యభావము తెలుపుచున్నాను. అందుకు ముందుగా, కథానాయికానాయకాదులును, ఉద్యానమలయానిలచంద్రి కాదులును, ఆలంబనోద్దీపనభేదమున విభావము లనియు, చూపు చిఱునవ్వు మొద లయిన వనుభావము లనియు, తలఁపు మోహము మొదలయినవి వ్యభిచారిభావము లనియు, రత్యుత్సాహాదులు స్థాయిభావము లనియు, ఈవిభావాదులు శృంగార వీరాదిరసములనుబట్టి వేఱువేఱుగా నుండు ననియుఁ దెలియనగును.

విభావములు కారణముగాఁ బుట్టి, అనుభావములమూలముగాఁ దెలియఁ బడి వ్యభిచారిభావములవల్లఁ బెరిఁగి కథానాయకు లైనరామాదులందును వారి వేషములుధరించిననటులయందును, తెలియఁబడుచున్న రత్యాదికస్థాయిభావము రస మని భట్టలోల్లటాదు లనిరి. ఇట్టివా రుత్పత్తివాదులు.

రంగస్థలమందలిసటుని జూచి, "రాముఁడే వీఁడు, రాముఁడు కాఁడు వీఁడు, రాముఁడా కాఁడా ? రామునివంటివాఁడు" అని పలువిధములఁ దలంచుచు, చిత్ర రువులోనిగుఱ్ఱమును గుఱ్ఱ మనుకొనునట్లు రాముఁ డనుకొన్న నటునియందు నిజ ముగా లేకున్నను, వానియం దున్నట్లుగా ననుమానింపఁబడెడిరత్యాదికస్థాయి భావము ద్రష్ట లైనసామాజికులచే ననుభవింపఁబడుచు రస మగుచున్న దని శంకుకుఁ డనెను. ఈమతము ననుసరించిన వా రనుమితివాదులు.

కావ్యపాఠకులకును నాట్యద్రష్టలకును, భావనావ్యాపారమునఁ దమ్ముఁ దాము మఱచునట్లుగా విభావాదులను బ్రత్యక్షము గావించుచు, భోగాఖ్యవ్యా పారమున నిశ్చలసమాధియం దనుభవింపఁబడెడిబ్రహ్మానందముమాడ్కి వారిచే ననుభవింపఁబడునట్టిరత్యాదికస్థాయి రస మగు నని భట్టనాయకమతము. దీని నను సరించినవారు భుక్తివాదులు.

పైమూఁడుమతములను జర్చించి వానియందలిలోపములను జూచి వాని కంటె నుత్తమముగా, అభివ్యక్తివాదము ప్రతిపాదించినవాఁ డభినవగుప్తుఁడు. ఇతఁడు ధ్వన్యాలోకలోచనమందును, నాట్యశాస్త్రవ్యాఖ్య యైనయభినవభారతి యందును గూడ రసస్వరూపనిరూపణము గావించి మమ్మటాదులకు మార్గదర్శి యయ్యెను. సాహిత్యరత్నాకరకారాదు లితనిమతమే యవలంబించిరి. పండితరాజు తనచర్చలో మొదట గైకొనిన దితనిమతమే. అందుచే నభివ్యక్తివాదము బహు సమ్మత మైన దని తెలియఁ గలదు. ఇతనిమతమున—

సహృదయులచిత్తముల నంటి యణఁగియున్న రత్యాదికస్థాయి, కావ్యనాట్య శ్రవణదర్శనసమయములందు విభావాదులవల్ల నుద్రిక్తమై యభివ్యక్త మగుచు, నెదుట నున్నట్లు హృదయమునఁ బ్రవేశించినట్లు సర్వాంగములఁ గౌఁగిలించినట్లు తన్మయత్వము గలిగించి తక్కినసర్వప్రపంచము మఱపునకుఁ దెచ్చుచు, వారిచే బ్రహ్మానందముమాడ్కి నాస్వాదింపఁబడెడి యలౌకికచమత్కారకారి యైనశృంగారాదికరస మగుచున్న దని ముఖ్యభావము. దీని ననుసరించినవా రభివ్యక్తివాదులు. ధ్వనివాదము బీజముగా విస్తరించినయీవాద మెత్తుకొని పండితరాయలు, రసచర్చలో "భగ్నావరణచిద్విశిష్ట మైనరత్యాదిస్థాయిభావము రసమని యభినవగుప్తమమ్మటభట్టాదులమాటలవల్లఁ దెలియుచున్నది. కాని, రసో వై స ఇత్యాదిశ్రుతిస్వారస్యమునుబట్టి రత్యాదిస్థాయివిశిష్ట మగు భగ్నావరణచిదానందమే రస మగు"నని స్వమత మావిష్కరించెను. కడపటికిఁ దేలినయీ రెంటిలో నేది యుచితతర మనువిషయ మిప్పటికి నట్లే నిర్ణీతముగాక విమర్శకుల చర్చలఁ గనిపించుచున్నది గాని, రస మానందస్వరూప మనుశ్రుతిప్రమాణమును బట్టి రత్యాతిస్థాయితోఁ గూడినచిదానందమే రస మనుట యుచిత మని నాయభిప్రాయము.

ఇట్లు 'రసో వై స' ఇత్యాదిశ్రుతియం దజ్ఞాతరూపమై భరతనాట్యశాస్త్రమున రూపము దాల్చిన రసము నడుమ, వెడలినయలంకారము రీతి ధ్వని మొదలగువాని నణఁగఁద్రొక్కి కావ్యమున కాత్మ లేక జీవితమై సాహిత్యవిద్యాంబుధియం దమృతముమాడ్కి నాస్వాద్య మగుచున్నది. అట్టిరసమును గూర్చియు, అలంకారములనుగూర్చియు, కావ్యనాట్యస్వరూపమునుగూర్చియు, క్రీ. ఆఱవ శతాబ్దిమొదలుగాఁ బందొమ్మిదవశతాబ్దివఱకును గొప్పవిద్వాంసులు రచియించిన సాహిత్యవిద్యావిషయకగ్రంథములును వానివ్యాఖ్యలును గలసి సుమారైదాఱు వంద లైన నుండు నని, అముద్రితగ్రంథపట్టికలను బట్టి పి. వి. కాణేపండితుఁడు సమకూర్చిన గ్రంథపట్టికవల్లఁ దెలియుచుండ[1] నెన్ని యని మన మిందు పరిశీలింపఁ గలము? ఇం దచ్చుపడనివానిమాట య టుండ నచ్చుపడినవి సుమారొక వంద యుండును. వీనిలోఁ బఠనపాఠవ్యవహారము గాంచినవి నలువది యైన నుండవు. వీనిలోఁ బూర్వోదాహృతములవలె హృదయంగమము లైనవి మఱి కొన్ని లేక పోలేదు. కాని గ్రంథవిస్తరభీతిచే నీప్రకరణమునకు స్వస్తిచెప్పుచు సాహిత్యరత్నాకరమును గూర్చి మాత్ర మించుక ప్రసంగింతము.

---

1. చూ. 1923 బొంబాయిముద్రణము. సాహిత్యదర్పణాంగ్లపీఠిక.

క్రీ. ౧౨౦౦ ప్రాంతమందు కాశీనగరమున బహుశాస్త్రములు అభ్యసించి విద్వత్కవియై పేరుగాంచినయాంధ్రుఁ డైనవారణాసిధర్మసూరి యనుమహాపండితుఁడు స్వీయము లైనయుదాహరణములతో నిర్మించినపదితరంగములసాహిత్య రత్నాకరము విద్వద్విదితము. ఇందు, అభిధా లక్షణా వ్యంజనా గుణ శబ్దార్థాలంకార దోష ధ్వని రసము లనువిషయములు సవిమర్శముగా నిరూపింపఁబడినవి. మొదటిగ్రంథారంభసమర్థనతరంగము గ్రంథారంభపద్ధతిని శాస్త్రీయముగాఁ దెలుపుచున్నది. ఆంధ్రదేశమం దుదయించిన దాదిగాఁ బరనపారవ్యవహారమున వ్యాప్త మగుచువచ్చుచున్నదీనిం గూర్చి విశేషించి వ్రాయుట యనావశ్యకము. ఈధర్మసూరియే సన్యసించి గోవిందానందభగవత్పాదుఁడై శంకరాచార్యులశారీరకమీమాంసాభాష్యమునకు రత్నప్రభ యనుపేర దివ్య మైన వ్యాఖ్య రచియించుటయు, అది సకలదేశములఁ బ్రశంస కెక్కుటయు విదితము.

సాహిత్యరత్నాకరమునకు మందర నౌక యనెడు రెండువ్యాఖ్య లుదయించినవి. ఇందు వేంకటార్యునినౌకకంటె మల్లాది లక్ష్మణసూరిమందరావ్యాఖ్య ముందుగా ముద్రితమై దేశమున వ్యాప్తి గాంచినది.

ఇది, ఆంధ్రభవిష్యపర్వ ప్రేమతత్త్వ భవభూతి భాస నాటక
వచనాదికర్తయైన మల్లాది సూర్యనారాయణశాస్త్రి
రచియించిన సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయ
భాగలౌకికవాఙ్మయచరిత్రయందు
షష్ఠాధ్యాయము



# సప్తమాధ్యాయము



## కావ్యములు

కవిశబ్దము మిక్కిలి సనాతనము. వేదములందు మంత్రద్రష్టలు లేక మంత్రకృత్తు లనెడియర్థమును దెల్పుఋషి సూరి కవి ధీర శబ్దములు సమానార్థకములుగాఁ గనఁబడుచున్నవి. దీనినిబట్టి కవిశబ్ద మానాఁడే కల దని తెలియనయ్యెడి. 'నా నృషిః కురుతే కావ్య ' మ్మనునభియుక్తోక్తియు ఋషి కానివాఁడు కావ్యకర్త (కవి) కాఁజాలఁ డనుచు ఋషికవిశబ్దములు సమానార్థకము లని బోధించుచున్నది.

విచిత్రభావములతోడి ధర్మాంశములతత్త్వమును జ్ఞాననేత్రమునఁ జూచుట దర్శనము. అట్లు సందర్శించినవాఁడు ఋషి. అతఁడే శాస్త్రములఁ గవి యనఁబడెను. అనఁగా, అతీంద్రియ మైనధర్మతత్త్వమును జ్ఞానదృష్టిచేఁ గనుఁగొని దాని నట్లే చెప్పినవాఁడు ఋషి లేక కవి యని మంత్రకృత్పర మైనయర్థము. దానిని బట్టి, అసాధారణ మైన యొకవిచిత్రవిషయమును గనిపెట్టి దానిని జక్కఁగా వర్ణించినవాఁడు కవి యనెడిప్రతీతి లోకమున వ్యాపించినది. అట్టిప్రతీతి కాద్యోదాహరణము వాల్మీకి యని భవభూతి భట్టతౌత రాజశేఖరాదులు ప్రశంసించి యున్నారు. తరువాతివారు భారతసంహితాదికర్తలు. ఇట్లు, వారు లౌకికకవులలోఁ జేరఁదగినవా రైనను, వారికి ఋషు లనియు వారికృతుల కార్షము లనియు నాఁటి నుండి నేఁటిదనుకఁ బ్రసిద్ధి.

కవృవర్ణే—కవతే చాతుర్యే ణేతి కవిః—కవేః కర్మ కావ్యమ్—జీవద్వర్ణనానిపుణః కవిః—ఇత్యాదినిర్వచనములనుబట్టి చమత్కారకారి యైనవిషయము నేర్పుతో వర్ణించినవాఁడు కవి యనియు, సహృదయహృదయాహ్లాదకారి యైన యతని పద్యమో గద్యమో లేక మిశ్రమో యగుకృతి కావ్య మనియుఁ దెలియనగును. లోకప్రసిద్ధము లైనరఘువంశాదిమహాకావ్యములకుఁ బూర్వము లౌకిక భాషలో నట్టికావ్యము లుదయింపలేక పోలేదు గాని యవి యిపుడు మృగ్యము లైనవి. రుద్రటాలంకారవ్యాఖ్యాత యగునమిసాధువు, పాణిని పాతాళవిజయ కావ్యము నిర్మించినట్లును, అందు కొన్నియపప్రయోగము లున్నట్లును చెప్పి యున్నాఁడు[1]. పాణిని కుపజాతిచ్ఛందస్సునం దభిరుచి యెక్కువ యని క్షేమేంద్రుఁ

1. తథాహి పాణినేః పాతాళవిజయే—సన్ధ్యావధూం గృహ్య కరేణ—అపశ్యతి కత్వ ను శేషు విమ్బన్—రుద్రటా. 2-8.

డన్నాఁడు[1]. సుభాషితరత్నావళి కూర్చినవల్లభదేవుఁడు పాణినికృతము లని కొన్ని శ్లోకములు చూపియున్నాఁడు[2]. అమరకోశవ్యాఖ్యాత యగురాయముకుటుఁడు పాణినిజాంబవతీపరిణయములోని దని యొకశ్లోక ముదాహరించియున్నాఁడు[3]. సదుక్తికర్ణామృతకర్త యగురాజశేఖరుఁడు, పాణిని జాంబవతీపరిణయము రచియించినట్లు ప్రశంసించియున్నాఁడు[4]. వీటినిబట్టి పాణిని పై రెండుకావ్యములు నిర్మించె నన వచ్చునుగాని, వ్యాకరణమూర్తి యైనయతఁడు స్వసూత్రములకు విరుద్ధముగా—గృహ్యా—అపశ్యతీ—అని ప్రయోగించియుండఁడు కావునఁ బాతాళ విజయకర్త యైనపాణిని మఱియొకఁడై యుండు నని కొంద ఱభిప్రాయపడు చున్నారు. అయితే, జాంబవతీపరిణయకర్త వైయాకరణపాణిని యే యన్న రాజశేఖరునిసాక్ష్యము మాట యే మని మఱికొంద ఱడుగుచున్నారు. ఎందుకును మఱియితరప్రమాణములు కనరావు. ఇది యిట్లుండ, పాణిన్యాచార్యులు శిశుక్రన్దీయ యమసభీయాదికావ్యసంజ్ఞారూపములు సాధించుటయు[5], కాత్యాయనుఁ డాఖ్యాయికాశబ్దము పేర్కొనుటయు[6], భగవత్పతంజలి, మహాభాష్యమున 'వారరుచంకావ్య' మనుచు వరరుచికృతకావ్యమును స్మరించి, వాసవదత్తా భైమరథీ సుమనోత్తరాద్యాఖ్యాయికల నుచ్చరించుటయు[7], అందందు శ్లోకము లుదాహరించుటయు, నటులను నాట్యరంగమందలిస్త్రీలను బేర్కొనుటయు[8], చూడఁగా మునిత్రయకాలములందు పద్యగద్యకావ్యములే కాక, విశేషించి పతంజలినాఁడు దృశ్యకావ్యములు గూడ నున్నట్లు విశదము కాఁగలదు. అయిన నేమి? అవి యన్నియు నడుగంటినవి. క్రీ. పూ. ప్రథమశతాబ్దినుండిమాత్రమే మన మిపుడు వివక్షించుచున్న కావ్యములు దృగ్గోచర మగుచున్నవి.

---

1. స్పృహణీయత్వ చరితం పాణినే రుపజాతిభిః. సువృత్తతిలకే. 3-30.
2. శుద్ధస్వభావా న్యపి సంహతాని—ఉపోఢరాగేణ విలోలతారకమ్—ఐన్ద్రం ధనుః పాణ్డుపయోధరేణ—ఇత్యాదులు.
3. పయః పృషన్తిభిః స్పృష్టా వాన్తి వాతాః శనైః శ్శనైః. ఇత్యాది.
4. "స్వస్తి పాణినయే తస్మై యస్య రుద్రప్రసాదతః,
   ఆదౌ వ్యాకరణం కావ్య మనుజామ్బవతీజయమ్"
5. అధికృత్య కృతే గ్రన్థే—శిశుక్రన్దయమసభేన్ద్రజననాదిభ్యశ్ఛః. 4-3-87, 88.
6. లుబాఖ్యాయికాభ్యో బహులమ్—వార్తికము.
7. యత్తేన కృతం నచ తేన ప్రోక్తం వారరుచం కావ్యమ్. మ. భా. సంపు. 2. పుట. 315
8. నటానాం స్త్రియో రఙ్గంగతా యో యః పృచ్ఛతి కస్య యూయం
   కస్య యూయ మితి తం తం తవ త వే త్యాహుః. మ. భా. సంపు. 3. పుట. 7.

## కావ్యప్రశంస

"కావ్యం యశసే ఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితత యోపదేశయుజే"

అనుచు లాక్షణికులు కావ్యమును బ్రశంసించిరి. ఇందు, కీర్తి అర్థము అనర్థప్రతీకారము వ్యవహారజ్ఞానము పరసుఖము ఉపదేశము అనెడియాఱుప్రయోజనములు చూపఁబడినవి. కవికిని సహృదయునికిని గావ్య మీప్రయోజనములను యథాయోగముగా సమకూర్చు ననికావ్యప్రకాశకారమతము. వీనిలో మొదటి మూఁడును బరసుఖమును గవిపాఠకులకు సమానము లనియుఁ దక్కిన రెండును గ్రంథరచనకుఁ బూర్వము కవికిని, తరువాతఁ బాఠకునికిని గలుగు ననియు నొక వ్యాఖ్యాతవిద్యాచక్రవర్తిమతము. ఇందు మొదటిమూఁడును గవికిని దరువాతి మూఁడును సహృదయునికిని సమన్వయించు నని మఱియొక వ్యాఖ్యాత భట్టగోపాలునిమతము. ఇట్టియీపద్భేదముల కేమి? వీటినిబట్టి సాధుకావ్యరచనసత్కావ్యనిషేవణములు ధనార్జనవ్యవహారజ్ఞానపరమార్థజ్ఞానాదిసాధనములై యైహికాముష్మికానంద హేతువు లగుచున్న వనుట నిజము. మఱియు, ప్రభుసమ్మితములై శబ్దప్రధానము లైనవేదములకంటెను మిత్రసమ్మితములై యర్థతాత్పర్యవంతము లైన యితిహాసపురాణాదుల కంటెను రసమున కంగ మైనవ్యంజనవ్యాపారము ప్రధానముగాఁ గలది యగుట వానికంటె విలక్షణమై రమణీయవస్తువర్ణనమున సరసతాపాదక మైనకావ్యము కాంతాసమ్మితమై రామాదులవలెఁ బ్రవర్తింపఁదగును రావణాదులవలెఁ బ్రవర్తింపరా దనుచుఁ గవిసహృదయుల కుపదేశించునది కావున సాధుకావ్యనిషేవణ మవశ్యాచరణీయ మగుటయు విదితము. ఇట్లుభయతారకము లైనకావ్యములలో—

పాఠ్యములు—వీనిని, పద్య గద్య మిశ్రభేదమునఁ ద్రివిధముగాఁ బూర్వులు విభజించిరి. కాని, ఒక్కొక్కవిభాగమందును విషయాదిభేదములనుబట్టి యవాంతరవిభాగము లెన్నేని కనుపట్టును. రామాయణభారతభాగవతాదులలోనికథలు గల రఘువంశ కుమారసంభవకిరాతార్జునీయ శిశుపాలవధ నైషధాదికావ్యములు పౌరాణికము లనఁ దగియున్నవి. బృహత్కథాదులలోనికథలు గలకాదంబరీవాసవదత్తాదులు కథాకావ్యములు. రాజావళీరాజతరంగిణ్యాదులుచారిత్రకములు. పంచతంత్రహితోపదేశాదులు నైతికములు. రసికరంజనశృంగారశతకామరుశతకాదులు వైనోదికములు. మేఘసందేశదశకుమారచరితవిశ్వగుణాదర్శాదులు కల్పితములు. ఆర్యాసప్తశతీగీతగోవిందాదులు దైవతములు. భట్టికావ్యప్రసభారతాదులు లాక్షణికములు. ఇట్లు శాఖోపశాఖలుగాఁ బెరిఁగినవానిలో ముందు—

## పద్యకావ్యములు.

లోకప్రఖ్యాతినిబట్టి వీనిలో ముందు గ్రహింపఁ దగినవి పంచకావ్యములు. ఆధునికవిమర్శకు లనేకు లనేకవిధములఁ గావించిన నిర్ణయములనుబట్టి కాళిదాస కాలము క్రీ. పూ. ఎనిమిదవశతాబ్ది మొదలుగా, క్రీ. పన్నెండవశతాబ్దివఱకుఁ గలమధ్యకాలమున నూఁగులాడుచున్నమాట సత్యమే కాని, చక్కనిపరిశీలనము నొనర్చిన నలుగురైదుగు రేకీభవించుట కారణముగా నది క్రీ. పూ. ౫౭ అని విశ్వసింపవలసియున్నది. లభించినంతవఱకుఁ గవులకాలము సప్రమాణముగా నాసంస్కృతకవిజీవితమునఁ దెలిపియున్నాను. కావున నిం దాచర్చ విడిచి కాలము మాత్రము సూచించుచుందును. నాయభిప్రాయముగూడఁ గాళిదాసు క్రీ. పూ. ౫౭ లోనివాఁడనియే. అందుచే నతనికావ్యత్రయమే యీప్రకరణమునకు శ్రీకార మగుచున్నది. భరతఖండమందే కాదు, ఖండాంతరములందును, కాళిదాసకావ్య త్రయముపే ళ్లెఱుఁగనివా రుండరు. సంస్కృతభాష నభ్యసించువా రందఱును, పంచకావ్యము లని ప్రసిద్ధి కెక్కినవానిలోఁ గ్రమముగాఁ జేతఁ బట్టునవి రఘువంశ కుమారసంభవమేఘసందేశములే. వీనిలో నేది ముం దేది వెనుక యని కొందఱు చర్చింతురుగాని, వాగర్థరూపపార్వతీపరమేశ్వరస్తుతియు, అహంకారనిరాసయుఁ గారణములుగా వీనిలో మొదటిది రఘువంశ మనియే నమ్మవచ్చును. ఇందుకు మఱియొక కారణము. కాళిదాసునకు వాల్మీకిమహాముని యెడఁ గలభక్తితాత్పర్య ములు మెండు. ఇతని సత్కవిత్వమునకు మార్గదర్శక మతనిరామాయణమే. ప్రసాదము మాధుర్యము వైదర్భీరీతి పాత్రపోషణవిధానము ఉపమాచిత్యము మొద లగుసత్కవిత్వవిశేషముల యభ్యాసమునందు కాళిదాసు వాల్మీకిరామా యణశిష్యుఁడు. ఇందు కీతనిరఘువంశమం దెన్నే నియుదాహరణములు కనవచ్చును. కావున రామాయణపారాయణమందలి తనివిదీఱ నితఁడు ముందు రఘువంశము నిర్మించె ననుట యసంగతము కానేరదు. ఒకయుదాహరణము.

రామాయణమున సీతావివాహఘట్టమందలి "పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా" అనుశ్లోకమందలియుపమానము గ్రహించి "ఛాయేవ తాం భూపతి రన్వగచ్ఛత్" అనుచుఁ గాళిదాసు నందినీధేనువు ననుసరించినదిలీ పుని వర్ణించియున్నాఁడు. ఈయుపమానము రామాయణమున సముచితము గాని, రఘువంశమున లింగభేదముచే ననుచిత మగుచున్న దనెడిమత మపుడు బయలు దేఱుటచేఁ గాఁబోలు వామనాచార్యుఁడు కావ్యాలంకారసూత్రవృత్తియం దుపమావిచారసందర్భమున లౌకిక్యుపమాదులందు లింగభేదము దోషావహము కా దని సమర్థించెను[1]. రఘువంశవ్యాఖ్యాతలలో నొకఁ డగుచారిత్రవర్ధనుఁ

---

1. లౌకిక్యాం సమాసాభిహితాయా ముపమాప్రపఞ్చే చ. 4.-2-24.

డా సమర్థన మాధారముగాఁ గాళిదాసును సమర్థించి యున్నాఁడు. ఇట్టిదానిని లింగభేద మైన గణింపక యానాఁడు కాళిదాసు గ్రహించుటకుఁ గారణము రామాయణమందలియభిరుచి గాక వే తేమగును. ఇట్టిసందర్భము లింకను గలవు. అయినను, రఘువంశము వాల్మీకిరామాయణమునకు సంగ్రహరూపము గాని దానినే యనుసరించినది గాని కాదు. ఇది కొన్ని సర్గలందు రామాయణకథ ననుసరించియు, మఱికొన్నిట నుత్తరరామాయణమును బరిశీలించియు; ఇఁకఁ గొన్నిట వితర పౌరాణికకథాంశము లవలోకించియు, రఘువంశపురుషులను నాయకులనుగా గ్రహించి, వివిధకావ్యధర్మముల లోకహిత మగుస్వాతంత్ర్య మలవఱుచుకొని సత్కావ్యరచనకు రాచబాట చూపినమహాకావ్యము. సహృదయరంజకము లగు పాత్రౌచిత్యరసౌచిత్యములకుఁ బుట్టినిల్లు. గీర్వాణభాషాపిపాసువుల కమృతము. పందొమ్మిదిసర్గలయీప్రబంధము దిలీపుఁడు మొదలుగా నగ్నివర్ణునివఱకుఁ గల యిరువదితొమ్మండుగురు సూర్యవంశరాజులచరిత్రములు దెలుపుచున్నది. కాళిదాసు కన్నులారఁ గాంచి వర్ణించెనో లేక చూచినవారివల్ల విని వర్ణించెనో కాని, యిందలినాల్గవసర్గలోనిరఘుమహారాజుదిగ్విజయయాత్రావర్ణనము నాఁటిభరతఖండమును మనకన్నులఁ గట్టుచు ముద్దు లొలుకుచున్నది. పదునాల్గవసర్గలోనిసీతాపరిత్యాగవర్ణనము కటికవాని నైనఁ గంట నీరు పెట్టించుచున్నది. నందినీధేనువునకు బదులుగా సింహమునకు దిలీపుఁడు తనదేహ మర్పింపఁబూనుట, ఇంద్రునితోఁ బోరాడి రఘువు తనతండ్రి కశ్వమేధఫల మార్జించుట మొద లగు పెక్కుసందర్భములందు పాత్రౌచితీసుధారసమును బాఠకులకుఁ బంచిపెట్టుచున్నది. ఇట్టినవరసనిధాన మైనయీకావ్య మాస్వాదించినఁ గాని యిట్లు వర్ణించినంతమాత్రమునఁ దనివి తీఱునా ?

దీనికి భరతసేనుఁడు బృహస్పతిమిశ్రుఁడు చారిత్రవర్ధనుఁడు మొదలగువారు రచియించినవ్యాఖ్యలు సుమారు నలువది యని సంఖ్యామాత్రము తెలియుచున్నది. అందు కొన్ని యముద్రితగ్రంథాలయముల నున్నట్లు కనఁబడుచున్నది. అరుణగిరినాథునిప్రకాశికయు, నారాయణపండితునివివరణమును, ఈమధ్య, అనంతపురమున ముద్రింపఁబడినవి. కాని, మహోపాధ్యాయుఁ డైనమల్లినాథసూరిసంజీవిని పుట్టినపిదప నవి యన్నియు మఱుమాయ మైనవి. కాళిదా సెక్కడివాఁడు? ఎప్పటివాఁడు?—మల్లినాథుఁ డెక్కడివాఁడు? ఎప్పటివాఁడు? కాళిదాసకావ్యసంజీవినీవ్యాఖ్యానములసంయోగ మేమి? ఈరెండును గలసి జగ మెల్ల నావరించి భాషాభిమానులహృదయమున నిల్లుగట్టుకొనుట యేమి? సెబాసు! మల్లినాథా! నిజముగా నీవ్యాఖ్య కావ్యములపాలిటిసంజీవినియే. నిజముగా నీవే యాంధ్రదేశమునకు దివ్యజ్యోతియే. ఆకవికిఁ దగినవ్యాఖ్యాతను గన్న భాషాదేవిభాగ్యమే భాగ్యము.

పార్వతీజననము పార్వతీపరమేశ్వరపరిణయము కుమారస్వామియుదయము తారకాసురసంహారము మొదలగుకథాంశములను శివపద్మపురాణములనుండి గ్రహించినకుమారసంభవము పదునేడుసర్గలమహాకావ్యము. ఇందు, కాళిదాసు ప్రకృతిసౌందర్యవర్ణనమందలిచాతుర్యమును బూర్తిగాఁ జూపుటయే కాక, శృంగారరసపరమావధిని జాలావఱకు మృదువుగా వ్యంగ్యప్రధానముగానే చూపించియున్నాఁడు. కాని, శృంగారప్రియుఁడైనయితఁడు, నవనవోన్మేషయౌవనమున వ్రాయుటచేతనో, కావ్యమునఁ బార్వతీపరమేశ్వరులు కల్పితాలంబనవిభావములనుబుద్ధితో లౌకికశృంగారము మొదలంటఁ జూపుయత్నముచేతనో కాని, యిం దష్టమసర్గలో సంభోగశృంగారమును మిక్కిలి పచ్చిగా వర్ణించియున్నాఁడు. అందలి యొకటిరెండుశ్లోకములు—

"ఊరుమూలనఖమార్గరాజిభి స్తత్క్షణే హృతవిలోచనో హరః,
వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమా మవారయత్"

ఇందలిశ్లోకములను బెక్కుచోట్ల రసౌచిత్యాదుల కుదాహరించిన క్షేమేంద్రుఁ డీశ్లోకమును, ప్రబంధార్థానౌచిత్యమున కుదాహరించుచు, అంబికాసంభోగవర్ణనమున, పామరస్త్రీసముచితనిర్లజ్జసజ్జనఖక్షతరాజివిరాజితోరుమూలమునఁ ద్రిజగద్గురుఁ డగుత్రిలోచనునిదృష్టి యాకర్షింపఁబడిన దని వ్రాయుట యనుచితమనెను. మఱియు, దివ్యులయెడ రతిహాసాదులు వర్ణింపవచ్చును గాని సంభోగరూపరతిమాత్రము వర్ణింపరాదు. అదిజననీజనకులసంభోగవర్ణనమువలె ననుచితమని మమ్మటాదులు వ్రాసియున్నారు. భట్టవామనుఁ డిందుకు, ఆసర్గలోని—

"దష్టముక్త మధరోష్ఠ మంబికా వేదనావిధుతపాణిపల్లవా,
శీతలేన నిరవాప తత్క్షణం మౌళిచంద్రశకలేన శూలినః"

అనుమఱియొకశ్లోక ముదాహరించియున్నాఁడు. ఆలంకారికు లిట్టివర్ణనము త్తమదేవతావిషయక మగుటచే ననుచిత మన్నారు గాని, ఇది మానుషవిషయక మయినచో వారికి నిష్టమే. మననాఁ డిది పామరస్త్రీపురుషవిషయక మైనను ననుచితమే యగుచున్నది. దీనినిబట్టి యీవర్ణనమందలిప్రీతి క్రమక్రమముగా మాఱుచు వచ్చె ననుట విదితము గావున, నాఁటియభిరుచినిబట్టి కావించినకాళిదాసు శృంగారవర్ణనమును మనము విమర్శింప నర్హులము కాఁజాలము.

మేఘసందేశము. ఇది యొకయపూర్వ మమూల్యము నైనకావ్యరత్నము. సీతనుగూర్చి రాముఁడు పంపినహనుమత్సందేశమును మనస్సునఁ దలఁచి కాళిదాసీసందేశము గూర్చినట్లు పెద్ద లందురు. అది నిజ మైనను, ఇది కేవలకల్పితకవితాకల్పలతకాద్యఫల మనవచ్చును. ఇందలివిషయము శాపహతుఁడై గిరి

కాననములఁ దిరుగుచున్నయక్షుఁడు తనప్రియకు మేఘునిచే సందేశ మంపుట. ఆసందేశము. "ప్రేయసీ! నీవు ప్రణయకుపిత వైనట్లు రాగద్రవ్యములతో నీరూపము రాతిపలకమీఁదఁ జిత్రించి, నీపాదములమీఁదఁ బడినట్లు నారూపము చిత్రించు నంతలోఁ బొంగివచ్చుకన్నీళ్లచే నాదృష్టి యావరింపఁబడినది. అకటా! పాడు దైవము చిత్తరువులోఁ గూడ మనసమాగమము సహింపకుండెను గదా!" అనెడి 'త్వామాలిఖ్య ప్రణయకుపితా' మిత్యాదిశ్లోకార్థము. ఇందలిరసము విప్రలంభము. అందు నున్మాదావస్థ. అయిన నేమి? వర్ణనము జగదేకహృద్యము. ఇందు, పూర్వ మేఘమునఁ గాళిదాసు, చిత్రకూటమునుండి యలకాపురికి మేఘుఁడు పోవు మార్గము వర్ణించుపట్టున నుత్తరహిందూదేశమందలిముఖ్యము లైననదీగిరిదేశ క్షేత్రవిశేషములను జక్కఁగాఁ బ్రత్యక్షము గావించెను. ఇది ౧౧౫ శ్లోకముల చిన్నగ్రంథ మైనను గుణమునందు కావ్యప్రపంచమున నగ్రస్థాన మలంకరించు చున్నది. ఇందలివృత్తము గూడఁ దీఁగ సాగినట్లు పఠనసులభమై మనోహర మైన మందాక్రాంత. ఈకావ్యమునుగూడ సుమారేఁబదివ్యాఖ్యలు కామించినవి గాని, ఇది సంజీవినిఁ బ్రేమించియే లోకవిఖ్యాతి గాంచినది. దీనివిమర్శనము సందేశ కావ్యసందర్భమునఁ గననగును.

ఇఁక, వక్ష్యమాణ మైనరూపకత్రయము గాక, ఋతుసంహారము శ్రుత బోధ శృంగారతిలకము శృంగారరసాష్టకము సేతుబంధము జ్యోతిర్విదాభరణము కర్పూరమంజరి శ్యామలాదండకము పుష్పబాణవిలాసము కాళిదాసప్రహసనము ప్రశ్నోత్తరమాల కుంతేశ్వరదౌత్యము రాక్షసకావ్యము నవరత్నమాల మొదల గుననేకకృతులు కాళిదాసు పేరఁగనవచ్చునుగాని, యిందొకటియు నిజముగా రఘువంశాదికర్తది కాదు. ఋతుసంహార మితనిదని కొంద ఱందురు. నేను దొలుత సంస్కృతకవిజీవితమున నట్టియభిప్రాయమే చూపితిని. కాని, పునఃపరిశీల నము గావింపఁగా నదియు నితనిది కాదని తోఁచినది.

కాళిదాసత్రయమునకుఁ దరువాతఁ బంచకావ్యముల గణనకెక్కినమహా కావ్యము కిరాతార్జునీయము. ఇది క్రీ. ౫౦౦ ప్రాంతమున భారవిమహాకవి రచి యించినది. అరణ్యవాసకాలమం దర్జునుఁడు మహాస్త్రసంపాదనమునకు వెడలి కిరాతవేషధారి యైనశివునితోఁ బోరాడి పాశుపతము సంపాదించుట యనుభారత కథాభాగ మిందలివృత్తము. లోకజ్ఞశిరోరత్న మైనభారవి యీకథాంశము నతి మనోహరముగాఁ బెంచి పదునెనిమిదిసర్గల వర్ణించెను. ఇందు దుర్యోధనునిరాజ్య పద్ధతిని వర్ణించుసందర్భమునఁ దెలుపఁబడినరాజనీతి కౌటిల్యార్థశాస్త్రాదులను విస్త రింపఁ జేయునంతటిప్రౌఢమై సుగమమై హృదయంగమ మగుచున్నది. ఇందలి మొదటిమూఁడుసర్గలకుఁ బాషాణత్రయ మనుపేరు వాడుక కెక్కినది. కవిత్వము

నారికేళపాకము నర్థగంభీరము నని మల్లినాథసూరివంటిపండితశేఖరుఁడే భావించి యుండ నిఁక దీనినిగూర్చి యితరు లెట్లు భావింతురో చెప్ప నక్కఱలేదు. అయి నను, రసగర్భనిర్భర మైనయిది పుట్టినది మొదలుగా నేఁటిదనుకఁ బాఠకలోక మున కమృతమువలెఁ నాకర్షక మగుచునే యున్నది.

దీనికి, ఏకనాథుఁడు జోనరాజు నరహరి మొద లగువారు వ్యాఖ్యలు రచి యించి రని యందందు గనవచ్చును గాని మల్లినాథునిఘంటాపథ మేర్పడినపిదపనే యిది పాఠకలోకమునకు సుఖగమ్య మయినది. ఈకావ్యమునకుఁ గవి పెట్టినపేరు కిరాతార్జునీయ మైనను, ఇది లోకమునఁ గవిపేర భారవి గానే వ్యాపించినది. ఈమహాకవి, ప్రతిసర్గతుద నుండుశ్లోకమునను 'లక్ష్మీ'పదము తప్పక కూర్చుటం బట్టి దీనికి లక్ష్మీపదలాంఛన మనెడిమఱియొక పేరు వచ్చినది. సర్వశాస్త్రజ్ఞుఁడైన భారవి యీకావ్యమున శాస్త్రవిజ్ఞానమును సర్వత్ర చూపుటయే కాక, చిత్ర యమకబంధకవిత్వప్రియుఁడై పదియేనవసర్గయం దధికముగా నట్టికలను జూపి యున్నాఁడు.

పేరునుబట్టి యీకావ్యమునఁ గిరాతార్జును లిరువురునాయకు లనితోఁచ వచ్చును గాని, ఇం దర్జునుఁ డొకఁడే ప్రధాననాయకుఁడు. అతనియుత్కర్షము వెల్ల డింప వర్ణింపఁబడినకిరాతుఁడు ప్రతిభటనాయకుఁడు. దండ్యాచార్యుఁడు దీనిని జదివియే—

"వంశవీర్యప్రతాపాదీన్ వర్ణయిత్వా రిపో రపి,
తజ్జయా న్నాయకో త్కర్షకథనం చ ధినోతి యః"

అనులక్షణము చెప్పియున్నాఁడు. ఇం దితరరసములు గూడ సందర్భోచిత ముగా వర్ణింపఁబడినను, వీరము ప్రధానము. అర్జునునిదివ్యాస్త్రలాభమే కావ్య ఫలము. ఇందలిఋతుగిరికాననాదిరూపప్రకృతివర్ణనములును సురాంగనలజలక్రీడా పుష్పాపచయాదివర్ణనలును గ్రమముగాఁ గొంచెముగాను గొప్పగాను శృంగార రసము చిలుకుచు మనోహరము లగుచున్నవి. కాళిదాసుకుమారసంభవారంభ మునఁ గావించినట్లే భారవి పంచమసర్గారంభమునఁ బదియేనుశ్లోకముల హిమా లయవర్ణనము గావించియున్నాఁడు. వర్ణితవిషయములు రెంటియందును జాలవఱ కేకీభవించును గాని వర్ణనరీతులు వేఱు. అర్థాలంకారములు రెంటను గలవు కాని, ఇందు యమకానుప్రాసలు గూడఁగలవు. వేఱువేఱుగాఁ జదివినపుడు దానివలె నిదియును హృద్య మగును గాని పోల్చి చదివినపుడుమాత్రము దానిరుచికిని దీని రుచికిని పోలిక యుండదు. ఇందుకుఁ బ్రసాదగుణభేద మొకకారణము. రెండవది శబ్దాలంకారమును. మల్లినాథసూరి, యిందలిప్రథమశ్లోక మైన "దధత మాకరిభిః

కరిభిః రిత్యాదిశ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు "యమకస్య వృత్త్యనుప్రాస భేదత్వాత్స్వయ మేవాలంకారః. అర్థాలంకార స్త్వభ్యుచ్చయః. తస్యాతిచమత్కారత్వా ద్రసపోషోఽపి నాద్రియతే. తదుక్తమ్. ప్రాయ శో యమకే చిత్రే రసపుష్టి ర్న మృగ్యతే." అని యిచ్చినయభిప్రాయము గూడఁ బైయభిప్రాయమును బలపఱుచుచున్నది. మొత్తముమీఁదఁ గావ్యమంతట యమకాదు లెక్కువగాఁ గనవచ్చుటంబట్టి భారవినాఁడు శబ్దాలంకారప్రీతి హెచ్చని తోఁచుచున్నది. అట్లని కావ్యము నీరసము కాదు. మల్లినాథుఁడు చెప్పినట్లు రసగర్భ నిర్భరమే. పైగా నర్థగంభీరము. "ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవ'మ్మని లోకోక్తి. అందుచేతనే మల్లినాథుఁడు దీనిని నారికేళఫలముతోఁ బోల్చియున్నాఁడు. దీనివలెనే యర్థగంభీరమై కావ్యపంచకమునఁ జేరిన—

శిశుపాలవధకావ్యము గూడఁ జిత్రయమకప్రియమై క్రీ. ఐదాఱుశతాబ్దులలోనిశబ్దాలంకారప్రీతిని ధ్రువపఱుచుచున్నది. మాఘకవికృత మైనయిది యతనిపేర మాఘ మని ప్రసిద్ధి గాంచినది. మాఘుఁడు క్రీ. ౫౫౦ ప్రాంతమువాఁడు. గూర్జరదేశీయుఁడు. శ్రీవర్మలరాజునాస్థానమున సర్వాధికారి యగు సుప్రభదేవునిపౌత్రుఁడు విఖ్యాతగుణుఁ డైనదత్తకుని పుత్రుఁడు. ఈవిషయము గ్రంథాంతశ్లోకములఁ దెలియుచున్నది. శబ్దతర్కవేదాన్తశాస్త్రనిష్ణాతుఁ డైనయితఁడు, శ్రీకృష్ణుఁడు శిశుపాలుని జంపుట యనుపురాణగాథను గైకొని యిరువదిసర్గలమహాకావ్యము రచియించెను. ఇందు నాయకుఁడు కృష్ణుఁడు, శిశుపాలుఁడు ప్రతినాయకుఁడు. వీరము ప్రధానరసము. శృంగారాదు లంగములు. ఇందు, గుణాలంకారరసభావధ్వనిప్రముఖము లైనకావ్యధర్మములు మూర్తీభవించియున్న వని మల్లినాథసూరి తెలిపియున్నాఁడు. దీనికిని, ఏకనాథ రంగరాజ వల్లభదేవ చారిత్రవర్ధ నాదులు పెక్కండ్రు వ్యాఖ్యలు వ్రాసిరి గాని మహోపాధ్యాయునిసర్వంకషముందర నవి ప్రకాశింపలేక పోయినవి. "ధన్యో మాఘకవి ర్వయం చ కృతిన స్తత్సూక్తి సంశీలనా" త్తని ప్రశంసించిన సూరి 'మాఘే మేఘే గతం వయః' అని పలికినట్లు పెద్దలు చెప్పుదురు. '<u>నవసర్గ గతే మాఘే నవ శబ్దో న విద్యతే</u>' అనుకీర్తికిఁ బాత్ర మైనయిందు శబ్దజాలము పూర్ణముగా నుపయోగింపఁబడియున్నది. ఒకానొకపండితుఁడు చెప్పిన—

"ఉపమా కాళిదాసస్య, భారవే రర్థగౌరవం
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః.

అనుసూక్తికిఁ బాత్ర మైనయిం దన్నిసర్గలలో నొక్కొకవిశేషవర్ణనము కనవచ్చును. అందును రాజనీతివర్ణనముతోఁడి రెండవసర్గ విశేషించి పండితుల నెక్కువగా నాకర్షించినది. ఇందలియుపమానములును దృష్టాంతములును లోకజ్ఞాన

నాయకములై మనోహరముగా నున్నవి. బౌద్ధులకు స్కంధపంచకముకంటె వే
ఱయినయాత్మ లేనట్లే రాజుల కంగపంచకముకంటె వే ఱయినమంత్రము లేదు.
రసభావవేత్త యగుకవికి, ఓజోగుణ మనియు—ప్రసాదగుణ మనియు నియమ
మెట్లు లేదో, అట్లే రాజునకు క్షాత్ర మనియు క్షాంతి యనియు నియమము లేదు.
సందర్భమునుబట్టి రెండును గావలసినవే—ఇత్యాదిగా నిది యనేకవిషయములను
బోధించును.

నైషధము—జగ మెఱింగినపై కావ్యపంచకముతరువాతఁ బఠనపాఠవ్యవ
హారమున జగమునందు వ్యాపించినది నైషధము. ఇది, ఇరువదిరెండుసర్గలమహా
కావ్యము. దీనికర్త చింతామణిమంత్రోపాసకుఁడును మామల్లదేవీశ్రీహీర
పుత్త్రుఁడు నైనశ్రీహర్షుఁడు. ఇతఁడు క్రీ. ౧౧౬౯—౧౧౯౫ నడుమఁ గాన్యకుబ్జ
మేలినజయచంద్రభూపాలునికి సమకాలికుఁడు. ఈకవిసార్వభౌముఁడు స్థైర్యవిచార
ప్రకరణము శ్రీవిజయప్రశస్తి నవసాహసాంకచరితము ఖండనఖండము మొదలగు
ననేకకృతులు నిర్మించిన ట్లిందలి చతుర్థాదిసర్గాంతిమశ్లోకములఁ గనవచ్చును. కాని
నైషధీయచరితమువలె మతేదియు దేశ మాక్రమింపలేదు. నలదమయంతుల
చరిత మైనయిది 'నైషధం విద్వదౌషధ' మ్మన్నఖ్యాతి గాంచినది. ఇతరరసము
లంగములుగా శృంగార మంగియైనయీకావ్యమున, రాజహంస నలదమయంతుల
కనురాగము కలిగించుట మొదలుగా వారిదాంపత్యసుఖమువఱకుఁ గలయనేక
విషయములు తత్తద్రసోచితములు గా వర్ణింపఁబడినవి. కాళిదాసుకుమారసంభవ
మందువలెనే యిందును శృంగారము కొంత మితిమీఱుట యనున దాకాలమున
కారోపింపఁ దగినవిషయము. ఇందలిశృంగార మాధారముగా వెలసిన దగుటచేతనే
శ్రీనాథునిదీనియాంధ్రీకరణము శృంగారనైషధ మైనది. పదియేడవసర్గలో నైయా
యిక మీమాంసక పౌరాణిక స్మృతి ప్రామాణికాది బహుమతఖండన మొనరిం
చినయీమహాకవి తనసర్వశాస్త్రపారంగతత్వ మావిష్కరించుకొనుచు, ఇరువది
యొకటవసర్గలోఁ దాను శ్రీరామభక్తుఁ డైనయద్వైతుఁ డయినట్లు సూచించి
యున్నాఁడు. నైషధకవిత్వశైలి కఠినమైనను మనోజ్ఞము లై నవర్ణనలతో నిండిన
దగుటచే రసభావధ్వన్యలంకారగుణవిజ్ఞానదాయక మగుచున్న దని మల్లినాథ
సూరియే చెప్పియున్నాఁడు. దీనికి నారాయణ శేష రామచంద్ర విశ్వేశ్వరభట్టాదు
లనేకులు వ్యాఖ్యలు రచియించిరి గాని, వాని నెల్ల మించిమన సూరిజీవాతువే
జీవాతు వైనది. ఇఁక నీకావ్యషట్కము విడిచి చరిత్రకావ్యము లవలోకింతము.

చరిత్రకావ్యములు—తొల్లి వెలసినచారిత్రకము లైనపద్యకావ్యములలో,
అశ్వఘోషునిబుద్ధచరితమును సౌందరనందమును గొంతవ్యాప్తి గాంచినవి. ఇందు

మొదటిది బుద్ధజీవితమును బౌద్ధమతతత్త్వమును దెలుపుపదియేడుసర్గలకావ్యము. రెండవది బుద్ధునిపితృవ్యపుత్త్రుఁ డగునందుని వృత్తాంతము తెలుపు నిరువదిసర్గల కావ్యము. ఇందు గౌతమబుద్ధునియుపదేశమునకుఁ గట్టుపడి నందుఁడు సన్యాసియై తనభార్య నెడఁబాసినందుకు దుఃఖించుట, అతనిపత్ని యగుసుందరి పతివియోగ మునకుఁ బరితపించుట మొదలగువిషయములు వర్ణింపఁబడినవి. అందుచే నిది బుద్ధచరిత్రకంటె నెక్కువగా లౌకికకావ్యలక్షణమునకు దగ్గఱ యైనది.

క్రీ. ౭౦—౧౫౦ నడుమఁ గొంతకాలము పురుషపురమును (పెషావర్) పాలించినకనిష్కమహారాజునకు బౌద్ధమత గురువుగా నున్నట్లూహింపఁబడెడి యశ్వఘోషుఁ డాకాలముననే పైకావ్యములు రచియించియుండును. కాని, కొందఱు కాళిదాసును, క్రీస్తుశకము నాల్గవశతాబ్దిలోఁ జేర్చుటకు సేకరించినకారణాభాసములలో బుద్ధచరిత్రలోనికొన్నిమాటలు వర్ణనలు నట్లే సరిగా రఘువంశ మేఘసందేశములలోఁ గనవచ్చుచున్న వనుట యొకటి. దీనినిబట్టి యశ్వఘోషుఁడు పూర్వుఁ డనియుఁ గాళిదా సతనికిఁ బరుఁ డనియు వారిసిద్ధాంతము [1]. కవితా ప్రపంచమునఁ గాళిదా సెక్కడ? అశ్వఘోషుఁ డెక్కడ? జగదేకవిఖ్యాతస్వతంత్రకవితామూర్తి యైనకాళిదాసు ప్రయత్నపూర్వకముగా నెట్లో బయటఁ బడిన బుద్ధచరిత్రలోనిమాటలు గ్రహించె ననుటకంటె హాస్యాస్పద మైనమాట వేఱుండునా? కాళిదాసత్రయమునుండి కొన్నివర్ణనలను బుద్ధచరిత్ర గ్రహించినమాట సత్యమై యుండఁ గొందఱు విమర్శకులు దానిని దలక్రిందుకావించి యున్నారని పైకావ్యములు పరామర్శించినవారికిఁ దెలియకపోదు. రఘువంశ మేడవసర్గలోనిపురంధ్రీవర్ణనము బుద్ధచరితమూఁడవసర్గలోను, కుమారసంభవముమూఁడవ సర్గలోనికామవర్ణనము బుద్ధచరితపదుమూఁడవసర్గలోను బ్రతిఫలించినట్లు కనఁబడుచున్నమాట నిజము. ఈసత్యమును మఱుఁగుపుచ్చి కాళిదాసు క్రీ. చతుర్థ శతాబ్దిప్రాంతమువాఁ డనెడి తమయభిప్రాయము బలపఱుచుకొనుటకు ముడిపెట్టిన పైమాట యెట్లు విశ్వసనీయ మగును? కావున బుద్ధచరిత్ర రఘువంశాదులతర్వాతిదే యనుట సమంజసము.

బుద్ధచరిత్ర మొదటిపదమూఁడుసర్గలుమాత్రమే, అశ్వఘోషుఁడు రచియించిన వనియు, తక్కిననాలుగుసర్గలు నేపాలదేశీయుఁ డైనయమృతానందుఁడు తరువాత నిర్మించిన వనియుఁ దెలియుచున్నది. అశ్వఘోషునికవిత్వము కాళిదాస కవిత్వమునకు సాటి గాకున్నను దక్కినకొందఱికవిత్వమునకుఁ దీసిపోదు. శైలియు—

1. చూ. కీతుపండితుని C. S. Lit. Ch. II.

"జరా వ్యాధిశ్చ మృత్యుశ్చ యది న స్యా దిదం త్రయమ్,
మమా పి హి మనోజ్ఞేషు విషయేషు రతి ర్భవేత్"

అనురీతిని మృదువుగానే యుండును. అయిన నేమి? బౌద్ధమతగ్రంథ మగుటచే గాంభీర్యము నిది యెక్కువవ్యాప్తి గాంచినది కాదు.

బుద్ధఘోషనిర్మిత మైనపద్యచూడామణి యనుపదిసర్గలకావ్య మొకటి పైదానివలెనే మృదుమధురశైలి వెలసినదిగాని, అదియును దేశమున బఠనపాఠవ్యవహారము గాంచక యట్లే యుండియుండి మొన్న మొన్న రంగాచార్యపండితులచే నుద్ధరింపఁబడి ముద్రిత మైనది. కాళిదాసాదిపూర్వమహాకవికృతులలోఁ గవివిషయ మేదియుఁ గనరాదు. సర్గాంతములందు "కాళిదాసకృతౌ" ఇత్యాదిగా గద్యము మాత్రము కనవచ్చును. అట్లే దీనియందును 'బుద్ధఘోషవిరచితే పద్యచూడామణౌ' అనుగద్యము మాత్రమే యున్నది. అయిన నిది యితఁడు నిర్మించిన దను విషయమున నెవరును సందేహించుటలేదు.

బుద్ధఘోషునికాలమునుగూర్చి రెండుమూఁడుమతములు కలవు. గ్రే పండితుఁ, డితఁడు క్రీ. 332 లో బౌద్ధమతగ్రంథములు తెచ్చుటకు సిలోను వెళ్లెనను చున్నాఁడు. 413 లో వెళ్లె నని జాన్ సె నవరత్నే పండితుఁ డనుచున్నాఁడు. మఱి కొందఱు 400 ప్రాంతమువాఁ డనుచున్నారు [1]. పద్యచూడామణిలోనినవమసర్గ బహువిధముల శిశుపాలవధలోని రెండవసర్గను బోలియుండుట చూడ 400 ప్రాంత మందలిమాఘునికంటె నితఁడు పరుఁడై క్రీ. 600 ప్రాంతమున నున్నవాఁ డని తోఁచుచున్నది.

పద్యచూడామణి నిర్దుష్టమై ధారాళ మైనశైలిచే వెలయుచు మనోహర ముగా నున్నది. ఇందు గౌతమబుద్ధునిజననాదివృత్తాంత మంతయు విశదీకరింపఁ బడినది.

క్షేమేంద్రుఁడు రాజావళి యనుపేర నొకకాశ్మీరరాజచరిత్ర రచియించెను గాని,

"అంశోఽపి నాస్తి నిర్దోషః క్షేమేంద్రస్య నృపావళౌ"

అని కల్హణపండితుఁడు దానిని నిరాకరించియున్నాఁడు. క్రీ. 1148 లో నున్నయీపండితుఁడు రచియించినరాజతరంగిణి యనుమహాగ్రంథము సంస్కృత భాషలోఁ జరిత్రగ్రంథములు లే వనెడియాక్షేపము నణఁచుచు నిప్పటికిని దేశచరిత్రకారుల కత్యంతోపకారక మై వెలయుచున్నది. ఇందలి కడపటిశ్లోకమును

---

1. చూ. మ. మ. కుప్పుస్వామిశాస్త్రిగారి పద్యచూడామణి పీఠిక.

బట్టి సుసలభూపాలునికుమారుఁ డగుజయసింహునికాలమందు రాజతరంగిణి రచి యించినట్లు తెలియఁగలదు [1]. ఇది యెనిమిదితరంగములమహాకావ్యము. ఇది పేరుకుఁ గాశ్మీరరాజచరిత మైనను, ఇం దనేకము లైనయితరదేశరాజులచరిత్ర ములు గూడ సందర్భోచితముగా వర్ణింపఁబడినవి.

తనకుఁ బూర్వము, సువ్రతుఁడు హేలరాజు పద్మమిహిరుఁడు నీలముని క్షేమేంద్రుఁడు మొద లగుకొందఱు కాశ్మీరరాజచరిత్రలు నిర్మించినను, అందు కొన్ని జీర్ణము లగుటచేతను గొన్ని దోషభూయిష్ఠము లగుటచేతను, పూర్వశాస నాదులు పరిశోధించి సుబోధకముగా నిర్దుష్టముగాఁ దా నీగ్రంథము నిర్మించినట్లు కల్హణుఁ డవతారికలోఁ దెలిపియున్నాఁడు. తరువాత జైనోల్లాబదీనురాజుకాల మున జోనరాజకవి ద్వితీయరాజతరంగిణిని దీని కనుబంధముగా రచియించెను [2]. అందు జయసింహుఁడు మొదలుగా జైనోల్లాబదీనువఱకుఁ గలకాశ్మీరరాజులచరి తము వర్ణింపఁబడినది. పిదప జోనరాజుశిష్యుఁడు శ్రీవరపండితుఁడు ఫతిహాశాహ రాజపర్యంతము గలరాజులచరితములు తృతీయరాజతరంగిణిగా నిర్మించెను [3]. అనంతరము ప్రాజ్యభట్టు ఫాతిశాహిఅక్బరుజల్లాలదీనురాజపర్యంతము గలకాశ్మీర పాలకులచరితమును జతుర్థరాజతరంగిణిగా రచియించెను [4]. అటుపిదప మఱెవరును రాజతరంగిణిని బూరించినట్లు కనఁబడదు. పై నాలుగువిధము లైనగ్రంథమును ముద్రితమైనది. కల్హణగ్రంథమున నాలుగైదుచోట్లఁ గొన్నిమాటలు పోయినవి. అది కొంత యనర్థహేతు వైనను, రాజతరంగిణి సజీవ మగుటయే యిప్పటిపరి శోధకులకును విమర్శకులకును మహోపకారక మైన దనుట తెల్లము. పెక్కండ్రు కవులను రాజులను, పెక్కుగ్రంథములను స్మరించినయీకృతిరాజము సంస్కృత వాఙ్మయపరిశోధకులకుఁ బట్టుఁగొమ్మ యగుచున్న దనుటకంటెఁ జరిత్రవిషయ మున దీనిని వేఱుగానుతింపఁ బనిలేదు. ఇది నిజ మైనను గొందఱు పాశ్చాత్య విమర్శకులుమాత్రము దీనిఘనత నంగీకరింపలేదు. ఇందలికాలనిర్ణయము శాస్త్ర వము కా దని వారియభిప్రాయము . ఈగ్రంథ మర్థము చేసికొనుటలోఁ బచ్చెడి పొరపాటునుబట్టి దీని నంత చులకనగాఁ జూచుట భావ్యముకాదు. విమర్శకులు.

---

1. సుత స్సుసలభూభర్తుః సంప్ర త్య ప్రతిమత్కమః
నన్దయన్ మేదినీ మాస్తే జయసింహో మహీపతిః.
2. శ్రీజైనోల్లాభదీనే క్ష్మాం సంప్ర త్యక్షతి రక్షతి—
3. ఫతిహాశాహరాజ్యప్రాప్తి ర్నామ చతుర్థ స్తరంగః_
4. ఇతిఫాతిశాహిఆక్బరజల్లా లదీనస్య కాశ్మీరప్రాప్తివర్ణనమ్_
5. చూ. శేతుపండితుని సంస్కృతవాఙ్మయచరిత్ర. పుటలు. 66-69.

తమయూహాల కనుగుణముగా నిందలిశ్లోకములను సమన్వయించుకొనుటలో భేద భావ ముదయించుచున్నమాట సత్యము. ఇందు శ్లోకయుదాహరణము.

"శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే,
కలే ర్గతేషు వర్షాణా మభూవన్ కురుపాణ్డవాః,
లౌకికే ఽబ్దేచతుర్వింశే శకకాలస్య సాంప్రతమ్,
సప్తత్యాభ్యధికం యాతం సహస్రం పరివత్సరాః" [1].

అనుకల్హణునిశ్లోకముల కిద్దఱు ముగ్గురు వేఱువేఱు విధముగా నర్థము చేసికొనుట మన మాయావిమర్శనములలోఁ జూచుచున్నాము. మొదటిశ్లోకము లోనిగీతమీఁదిమాటలకు, కలిగతవత్సరములు ౬౫౩ అని కొందఱును, ౯౦౩ అని మఱికొందఱు నర్థమువ్రాసిరి [2]. రెండవశ్లోకములోనిలౌకికాబ్దము కాశ్మీరములో వాడుకలో నున్న దని కొందఱివాదము. కా దని కొందఱివాదము. వివాదాస్పదము లైనయిట్టిఘట్టము లిం దింకను గలవు. అవి తమవాదముల కనుకూలము లైనపుడు సముచితము లనుటయు, కానపు డనుచితము లనుటయు విమర్శకలోకమునఁ గనవచ్చును. ఇతరచరిత్రగ్రంథములందును వాయుపురాణాదులందును గనవచ్చెడిచారిత్రకాంశములను బోల్చి పరీక్షించి లోకమందలివివిధశకములను బోల్చి పరిశీలించి నిగ్గుతేల్చఁ గలచరిత్రపండితు లీరాజతరంగిణి నోపికతోఁ బఠించి పరిశీలించినచో దీనియౌచిత్యము వెల్లడియగును. కాని, ఆపనికిఁ బూనుకొన్నవారు కనరారు. ఆపని జరిగినపిదప రాజతరంగిణిలోనికాలనిర్ణయము సరి యనియో కాదనియో చెప్పవలెను గాని, అంతవఱకును దీనిని నిరసించుట మాత్రము తగదని చెప్పక తప్పదు.

చరిత్రకథనము గీర్వాణవాఙ్మయమునఁ గ్రొత్తకాదు. సంహితాబ్రాహ్మణములం దట్టి వెన్నో కలవు. చరిత్రదృష్టితోఁ జూచిన రామాయణమహాభారతములు చరిత్రలే యగును. రఘువంశ కిరాతార్జునీయ శిశుపాలవధ హర్షనైషధాది మహాకావ్యములును జరిత్ర లగును. రామాయణమందలిసూర్యవంశరాజక్రమవర్ణనమును భారతమందలిచంద్రవంశరాజక్రమమును వాయుపురాణాదులలోని వివిధరాజవంశక్రమవర్ణనమును జరిత్ర లగును. కాని, వానిని మనము చరిత్రదృష్టితోఁ జూచుటలేదు. ప్రకృత మైనరాజతరంగిణి కావ్య మైనను జరిత్ర మనియే భావించుచున్నాము. కల్హణుఁడును, కాశ్మీరరాజ్యపాలకులనిజచరిత్రమునే వర్ణించి

---

1. చూ. కల్హణరాజతరంగిణి. ప్రథమరంగము. 51, 52, శ్లో.
2. చూ. 1917 ముద్రణము. మహాభాష్యప్రథమసంపుటములోని పీఠిక.

నట్లు చెప్పియున్నాఁడు. తనపూర్వులీచరిత్రవిషయమునఁ గావించినదోషములను దాను సవరించి కావలసినసాధనసామగ్రి సమకూర్చుకొని కాశ్మీరరాజులసత్య వృత్తాంతము బయటఁ బెట్టినట్లు పలికి యున్నాఁడు. అట్టియెడ నందలితత్త్వము నెఱుంగుటలోఁ గలిగినమనదోషమును దాని కారోపించుట తగ దని నాయభిప్రాయము. ఇఁక—

రాజతరంగిణివంటివి కాకున్నను, దానికి ముందును వెనుకను గూడ నెన్నో చరిత్రకావ్యములు పుట్టినవి. ప్రసిద్ధములైనయట్టివానిలో హర్షచరిత్ర యొకటి. క్రీ. ౬౦౬—౬౪౭ నడుమఁ గాన్యకుబ్జము రాజధానిగా నుత్తరహిందూదేశమేలిన ద్వితీయశిలాదిత్యుఁ డనఁబడుహర్షవర్ధనునియుదంతమే యిది [1]. దీనికర్త లోకప్రసిద్ధుఁడు కాదంబరీకర్తయు నగుబాణభట్టు. ఎనిమిదియుచ్ఛ్వాసములయీగ్రంథమున మొదటిమూఁడింటను బాణకవి యుదంతమును, తక్కినయైదింటను, యశోవతీప్రభాకరవర్ధనులపుత్త్రు లగురాజ్యవర్ధనహర్షవర్ధనులకును, వారిపుత్త్రిక యగురాజ్యశ్రీకిని సంబంధించినవృత్తాంతమును సమగ్రముగా వర్ణింపఁబడినవి. అందుచే నిది బాణహర్షులసత్యచరిత్ర మనఁ దగియున్నది. అయినను, దీనికి మహాగద్యకావ్య మనెడియశస్సే యెక్కువగా వచ్చినది. ఇది కవిత్వమునుబట్టి యట్లుత్తమకావ్యఖ్యాతి గడించినను, విషయమునుబట్టియథార్థచరిత్రము కాకపోదు. ఇందలిరాజ్యవర్ధనునిశౌర్యమును శాంతియు హర్షవర్ధనునిపరాక్రమాదిగుణసంపదయు వారిసోదరీప్రేమయు మాలవరాజునిర్మూలనమును రాజ్యశ్రీకష్టములును, ఈగ్రంథము చదివినవారికిఁ గన్నులఁ గట్టిన ట్లుండును. కావుననే దీని కట్టిఖ్యాతి వచ్చినది.

రెండవది నవసాహసాంకచరితము—ఇది పదునెనిమిదిసర్గలమహాకావ్యము. దీనికర్త పద్మగుప్తుఁడు పరిమళకాళిదాసబిరుదాంకితుఁడు. మృగాంకదత్తునిపుత్త్రుఁడు. ఇతఁ డుజ్జయిని రాజధానిగా నవంతీదేశము పాలించినవాక్పతిరాజదేవునియాస్థానకవియై యుండి, ఆరాజు స్వర్గ మలంకరించినపిదప, నుజ్జయినీరాజయినయతని తమ్ముఁ డగు విక్రమార్కునాదరము గాంచి నవసాహసాంకబిరుదవిరాజితుఁడైన యతనిచరితము నీకావ్యముగా రచియించిన ట్లీక్రిందిశ్లోకములవల్లఁ దెలియును.

"దివం యియాసుర్మమ వాచి ముద్రా మదత్త యాం వాక్పతిరాజదేవః,
తస్యానుజన్మా కవిబాన్ధవస్య భినత్తి తాం సంప్రతి విక్రమార్కః॥"
నిహ్నూయ నానాద్భుతసాహసం చ రణే వృతం చ స్వయమేవ లక్ష్మ్యా,
నామ్నా య మేకే నవసాహసాఙ్కం కుమారనారాయణ మాహు రన్యే॥"

---

1. ఈప్రకరణమునఁ గొన్ని గద్యకావ్యములు చంపువులుసందర్భమును బట్టి వచ్చుచుండును.

[redacted] చున్నది.

"తత్త్వ స్పృశ స్తే కవయః పురాణాః శ్రీభర్తృ మేంఠ ప్రముఖా జయన్తి నిస్త్రింశధారాసదృశేన యేషాం వైదర్భమార్గేణ గిరః ప్రవృత్తాః"

అనుదానినిబట్టి, ఈకవికిఁ బూర్వము భర్తృమేంఠుఁడు మొద లగుమహాకవులు కొందఱు వైదర్భీరీతి నాశ్రయించి కావ్యములు రచియించి రనియు, ఇతని కాలమందును వారివాక్కులే మార్గకవుల కాశ్రయ మయ్యె ననియుఁ దెలియుచున్నది. విషయముచేతను గవిత్వసంపదచేతను గూడ నీచరిత్ర మాకాలమందే విద్వల్లోకమునాదరము గాంచిన దని యితనిబిరుదమే చెప్పుచున్నది.

విక్రమార్కశబ్దము పూర్వరాజులలోఁ గొందఱికి బిరుదముగాను మఱి కొందఱికి సంజ్ఞగాను గూడ నున్నట్లు విదితము. విక్రమార్క విక్రమాదిత్యశబ్దములు పర్యాయములుగా నయ్యాకవు లాయారాజులకు వాడియున్నారు. కాని, నవసాహసాంకబిరుదము గలవిక్రమార్కుఁ డితఁడు గాక మఱియొకఁడు కానరాఁడు. ఇతనికి మఱియొకపేరు కనఁబడదు. అందుచే నితఁ డొనరించినశౌర్యసాహసకృత్యములే తరువాతఁ దరువాత లోకమున నత్యద్భుతములుగాఁ బరిణమించి వెల్లివిరియుట కారణముగాఁ గేవలపద్యాత్మకము పద్యగద్యాత్మకము నైన రెండువిక్రమార్కచరిత్ర లర్వాచీనకాలమున వెలసినవి. విక్రమార్కనామము తప్ప, వానిలోనివిషయమునకును మనసవసాహసాంకచరితములోనివిషయమునకును సంబంధమేమియులేదు. వానిలోనివిక్రమార్కునిసాహసకృత్యము లత్యద్భుతములు మహిమాస్పదములు. ఇందలివి సహజములు. వానిలోనివిక్రమార్కునిసోదరులు వేఱు ఇందలి విక్రమార్కునిసోదరుఁడు వేఱు. ఇందు కాగ్రంథములలోనియీక్రిందిమాటలే ప్రమాణము.

"అనుజే విక్రమాదిత్యే యువరాజే ఽనువర్తిని,
రాజా భర్తృహరి ర్నామ కాన్తాజనమనోరమః"

"అస్తి... ఉజ్జయినీ నామనగరీ. తత్ర చంద్రగుప్తో నామబ్రాహ్మణో రాజాభూత్. స రాజా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రకులానాం కన్యాకావివాహా మనుగృహ్యాస్థితః... తాసాం పుత్రాః క్రమేణ వరరుచిభట్టః విక్రమార్కః భట్టిః భర్తృహరిః"

ఇట్టియసందర్భోక్తులతోడికల్పితకథలు చరిత్ర లగునా? ఇట్టివానినిబట్టి పద్యచరిత్రలు గూడ నిట్టివే యనుభ్రాంతి కలుగకుండుటకై వీనిప్రసంగ మెత్తవలసివచ్చినది. ఇఁక—

[illegible]

[illegible] చరిత్రము [illegible] లియున్నది. [illegible]

కాశ్మీరదేశీయుఁ డైనమహావిద్వాంసుఁడు. ఇతఁడు కలశభూపతి కాశ్మీర [illegible]

కాలమున దక్షిణదేశమునకు వచ్చి చాళుక్యరాజులరాజధాని యగుకల్యాణపురము

చొచ్చి పార్మాడిభూపతియుఁ ద్రిభువనమల్లాపరనామధేయుఁడు నై నయాహవమల్లు

నాస్థానమున విద్వత్కవియై విద్యాపతిబిరుదము నందినవాఁ డని రాజతరంగిణివల్లఁ

దెలియుచున్నది.

"కాశ్మీరేభ్యో వినిర్యాన్తం రాజ్యే కలశభూపతేః,
విద్యాపతిం యం కర్ణాట శ్చక్రే పార్మాడిభూపతిః"

ఈయాహవమల్లునికుమారుఁడగు విక్రమాంకదేవుఁడే యీచరిత్రకు నాయకుఁడు. బిల్హణుఁడు చాళుక్యవంశరాజులవర్ణనముతో విక్రమాంకునిచరితము సవిస్తరముగా వర్ణించి కడపటిసర్గలో స్వీయచరిత్ర వర్ణించుకొనియున్నాఁడు. ఇతఁడు కల్యాణపురము చేరక ముందు దాహలపురరాజగుకర్ణభూపాలునియాస్థానమునఁ గొంతకాల ముండి, అతఁడు నాయకుఁడుగాఁ గర్ణసుందరీనాటికను రచియించెను. విక్రమాంకదేవుఁడు కడపట ననాదరము చూపినకాలమునందు చోరపంచాశిక[1] నిర్మించెను. ఈవిషయ మందలియీక్రిందిశ్లోకమున విదిత మగును.

"సర్వస్వం గృహవర్తి కుంతలపతి ర్గృహ్ణాతు తన్మే పునః,
భాండాగార మఖండ మేవ హృదయే జాగర్తి సారస్వతమ్,
రే క్షుద్రా స్త్యజత ప్రమోద మచిరా దేష్యన్తి మ న్మందిరమ్,
హేలాందోళితకర్ణతాలకరటిస్కన్ధాధిరూఢ శ్రియః"

రాజతరంగిణినిబట్టి చూచినను, ఈచరిత్రనుబట్టి చూచినను, బిల్హణుఁడు క్రీ. ౧౦౬౦—౧౧౩౦ నడుమ నుండి చిరకాలము జీవించినవాఁ డని తెలియఁగలదు. చోళచాళుక్యరాజులసంగ్రామవర్ణన మీచరిత్రలో నుండుటంబట్టి యిది క్రీ. ౧౦౮౫ ౧౧౦౦ నడుమ నుదయించిన దని విదిత మగును. ఈచరిత్రమున మధురా బృందావన కాన్యకుబ్జ కాశీప్రయాగాయోధ్యా దాహల గూర్జర సోమనాథాదిపురములవృత్తాంతము వర్ణిత మైనది. బిల్హణుఁడు భోజరాజుసభకుఁ బోకున్నను, అతనిసమకాలికుఁడై యానరేంద్రు నిందు సందర్భోచితముగా

---

1. క్రీ. ౧౭౯౮ లో, రామతర్కవాగీశభట్టాచార్యుఁడు రచియించినది చోరపంచాశిక. అందొకరాజపుత్రుఁడు సుందరుఁ డనువాఁడు కాళీపూజకు డొకరాజకన్యను వరించిన కథ యందు వర్ణింపఁబడినది.

వర్ణించియున్నాఁడు. చక్కఁగాఁ బరిశీలించినవారి కీగ్రంథము క్రీ. పదునొకండవ శతాబ్దినాఁటిసత్యచరిత్ర మని తోఁచకపోదు. కవిత్వవిషయమునఁ గూడ నిది యీనాఁటియుత్తమకవితకుఁ దీసిపోక సహృదయరంజక మగును.

సంస్థానప్రభువులచరిత్రము లింక ననేకములు కలవు. వానిలో, కంపణాభ్యుదయ మొకటి. దీనికర్త భట్టశివస్వామి. ఇది యిరువదిసర్గలమహాకావ్యము.

రెండవది యైనయచ్యుతరాయాభ్యుదయము రచియించినవాఁడు రాజనాథకవి. యితఁ డరుణగిరినాథునిపుత్త్రుఁడు. ఈకృతినాయకుఁ డైనయచ్యుతరాయఁడు (అచ్యుతరామ) విజయనగరసామ్రాజ్యపాలకవంశమునకుఁ జెందినవాఁడు. తిమ్మభూపతిమునిమనుమఁడు. చిక్కమాంబేశ్వరరాజులపౌత్త్రుఁడు. నరసరాజుపుత్త్రుఁడు. కృష్ణరాయలయనంతరము విజయనగరప్రభు వైనవాఁడు. పండ్రెండుసర్గలయీకావ్యమునం దచ్యుతరాయలప్రాభవమే హెచ్చుగా వర్ణింపఁబడినది.

పై రాజనాథకవియే సాలువాభ్యుదయ మనెడినరసింహదేవరాయాభ్యుదయ మనుపదమూఁడుసర్గలమహాకావ్యము మఱియొకటి రచియించెను. సాలువవంశములోనివాఁడును, కల్యాణపురీనాథుఁడును, సురత్రాణుని (సుల్తాను) జయించినవాఁడు నగుగుండదేవునిమునిమనుమఁ డగుగుండదేవునికిని మల్లమాంబకును బుట్టిన నరసింహదేవరాయఁ డీకావ్యమున నాయకుఁడు. ఇతనికి మేదినీమీసరగండగుర్జండయ-కటారిసాలువ — సాహిత్యమల్ల — ఘుర్జరీసట్టవిభాట — చంబురాయస్థాపనాచార్య—మండలీకమల్లవరగండ—ధరణీవరాహ—భువనైకవీర—ఇత్యాది బిరుదములు పెక్కు కలవు. రాజనాథకవికి దశరూపనారాయణ—డిండిమకవి—చతుర్వ్రత్తిసార్వభౌమ—చేర-చోళపాండ్యప్రథమారాధ్య-సరసకవితాసార్వభౌమ—ఇత్యాదిబిరుదము లిందు కనఁబడుచున్నవి.

చంద్రగిరిపాలకుఁ డైనయీనరసింహదేవుని ప్రతాపవితరణాదిసుగుణములును, ఇతనిపూర్వపురుషులకృత్యవిశేషములు నిందు వర్ణింపఁబడినవి. ఈరెండుగ్రంథము లేకకవికృతము లగుటచే నీరాజు లిద్దఱు నేకకాలమువా రని తెలియవచ్చును గాని, వీరిలో నరసింహరాజ ర్వాచీనుఁడు. రాజనాథునికవితాధార నిరర్గళము సరళము మృదుమధురము. ఈరెండును గేవలము రాజచరిత్ర లగుటచేఁ బఠనపాఠవ్యవహారమున విస్తరిల్లినవి కావు గాని, భాషనుబట్టియు రసోచితవర్ణనములనుబట్టియు నివి ప్రాచీనకావ్యముల కీ డగుచున్నవి.

తంజాపూరుపాలకు లైననాయకరాజులలో ఖ్యాతిగన్నరఘునాథనాయకుని చరిత మతనిభార్య యైనరామభద్రాంబ రఘునాథాభ్యుదయ మను పేరఁ బన్నెండు సర్గల మహాకావ్యముగా నిర్మించినది. ౯౦౦ శ్లోకములతో వెలయునీకృతి మహాప్రబం

ధమువలె హృదయంగమ మగుచున్నది—అష్టభాషాకల్పితచతుర్విధకవితాను ప్రాణితసాహిత్యసామ్రాజ్యభద్రపీఠారూఢ రామభద్రామ్బావిరచితే—ఇత్యాదిగద్యను బట్టి యీయామెపాండిత్యకవిత్వసంపదలు తెలియవచ్చును. రఘునాథనాయకునిజీవిత మిందు ప్రతిఫలించి శాశ్వత మైన దనవచ్చును. కవిత్వమురుచి చూచుటకొకటి—

"అధికశ్రియ మచ్యుతేన్ద్రసూనుం, రఘునాథం రఘునాథ మేవ సాక్షాత్,
హృదయే కలయన్తి యే మహాన్తః, పరమానన్దభరాత్త ఏవ ధన్యాః"

ఈమెవలెనే గంగాదేవి మధురావిజయము రచియించి ఖ్యాతిగాంచినది.

క్రీ. పదియేనవశతాబ్ది మొదటిభాగములోని వామనభట్టబాణుఁడు నిర్మించిన వేమభూపాలచరితము గద్యము. కాని, అది చరిత్రగ్రంథములలో నుత్తమ స్థానమున కర్హమై యున్నది. బాణునిగద్యతోఁ దులఁ దూఁగునట్లు తా నీగద్యము రచియించినట్లు గా నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

"బాణకవీంద్రా దన్యే కాణాః ఖలు సరసగద్యసరణీషు,
ఇతి జగతి రూఢ మయశో వామనబాణో ఉపమార్ష్టి వత్సకులః"

ఇందుకుఁ దగినట్లే, యీవామనుని కభినవభట్టబాణబిరుదము వచ్చియున్నదని యీక్రిందిశ్లోకమునఁ దెలియును.

"కవి రభినవబాణః కావ్య మత్యద్భుతార్థం
భువనమహిమభూమా నాయకో వేమభూపః"

ఈచరితమునందు, అద్దంకి రాజధానిగాఁ ద్రిలింగదేశ మేలిన ప్రోలయవేమ భూపతి మొదలుగా వీరనారాయణాపరనామధేయుఁడును, పెదకోమటేంద్రునిపుత్త్రుఁడు నయిన వేమభూపాలునివఱకుఁ గలరాజులయుదంతము వర్ణింపఁబడినది. అమరుక శతకమునకు శృంగారదీపికావ్యాఖ్య రచియించినయీవేమభూపుఁ డందలియవ తారికలోఁ దనవంశమును వర్ణించికొనియున్నాఁడు. అందు, తనపితామహుని వర్ణనముతో నారంభించుచు,—

"ఆసీ చ్చతుర్థాన్వయచక్రవర్తీ వేమక్షితీశో జగదేకవీరః,
ఏకాద శైతి ప్రథయన్తి శఙ్కాం యే నావతారాః ప్రథమస్య పుంసః"

అని వేముని, పదపడి, తదగ్రజుఁ డగుమాచరాజును, తత్పుత్త్రుఁడగు (పెద) కోమటేంద్రుని, అనఁగాఁ దండ్రిని, తమ్ముఁ డగుమాచభూపుని వర్ణించెను. కవులతోఁ గలసి తాను గావ్యామృతాస్వాదనపరుఁడై యమరుకశతకప్రసంగమున దాని నత్యంతము ప్రేమించినట్లు గూడ నితఁడు వ్రాసికొనెను గాని వామనభట్టబాణా దులలో నొకకవిపేరుగూడఁ దెలుపలేదు.

ఆంధ్ర దేశీయుఁ డైనయీవామనభట్టబాణుఁడు వేమభూపాలచరితములోఁ దన్నెక్కువగాఁ బ్రశంసించుకొని యహంకారము చూపినమాట సత్యము. అంతగా నాత్మస్తుతి యొనర్చుకొనుట మంచి దనఁ జాలము గాని, ఆయుత్ప్రేక్షకుఁ దగినవైదుష్యము మాత్ర మితనికి లే దనఁజాలము.

సుప్రసిద్ధశివాజీమహారాజపుత్త్రుఁ డైనరాజారామ భూపాలునిచరితమును 'రాజారామచరిత' మనుపేర నతనియాస్థానకవి యగు కేశవపండితుఁడు రచియించి యున్నాఁడు. ఇది పద్యకావ్యమే. ఇం దైదుసర్గలు కలవు. ఈక్రిందిశ్లోక మతని ముఖ్యచరిత్ర తెల్పును.

"ఏవం శ్రీ భవశాలవంశతిలకః శ్రీరామరాజప్రభుః,
ఢిల్లీశేన మహాబలైః పథి కృతాన్ ప్రత్యూహశైలా నివ,
సర్వాన్ మ్లేచ్ఛగణా న్విమథ్య మహసా శ్రీవైష్ణవే నాధునా,
తేషా మేవ పరాభవాయ విజయీ వర్వర్తి కర్ణాటకే"

తంజాపూరుపాలకుఁడును భోసలవంశవిఖ్యాతుఁడు నగుశహాజీమహారాజు నలువదియార్వురకు వసతు లేర్పఱచి శహాజీరాజపురము కట్టించియున్నాడు. అట్లు సత్కరింపఁబడినపండితులలోఁ గొందఱు శహాజీచరిత్రమును వర్ణించియున్నారు. అందు, అయ్యావా లనఁబడుశ్రీధరవేంకటేశపండితునిశాహేంద్రవిలాస మను నైదుసర్గలకావ్యమును, నల్లదీక్షితులు నిర్మించిననాలుగుస్తబకములధర్మవిజయ చంపువును, గంగాధరపండితునిభోసలవంశావళియు, శేషాచలపతికృతకోసలభోసలీయమును, శ్రీనివాసకవిశాహరాజాష్టపదియు, లక్ష్మణకవిశాహరాజసభాసరోవర్ణినియు, సుమతీంద్రకవికృతజయఘోషణయుఁ గనవచ్చుచున్నవి. ఈశహాజీరాజు క్రీ. ౧౬౮౪—౧౭౧౦ నడుమ రాజ్యముచేసినవాఁడు. ప్రజానురంజకుఁ డైనయితని వలెఁ గవులస్తుతికిఁ బాత్ర మైనరాజు కాలమున లేఁడు.

సర్వదేశవృత్తాన్తసంగ్రహము—ఈపేర నొకచరిత్రము కలదు. ఇది, అక్బరుచక్రవర్తి రాజ్యము చేయుకాలమున మహామహోపాధ్యాయమహేశఠాకూరు రచియించినట్లు కనఁబడుచున్నది. కవి—

"అథ వంశావళీ లిఖ్యతే. ఏతస్య హజరతిశాహనశాహికస్య పూర్వజా స్సర్వేఽపి సమ్రాజో బభూవుః" అని యారంభించి పెక్కండ్రు మహమ్మదీయప్రభువులను పేర్కొనియున్నాఁడు. ఆయారాజులకాలములకు సంబంధించినదేశవృత్తాంతము లిందు సంగ్రహముగా వర్ణింపఁబడినవి. అయిన నిది నిజమైనదేశచరిత్రము కాకపోవుటచేతనే యణఁగియున్న దనవచ్చును. ఇది యముద్రితము.

విజయపురకథ—అను పేర బీజపూర్ వృత్తాంత మొకచరితముగాఁ బొండు రంగకవి కూర్చియున్నాఁడు. ఇందు—

"...శాకే ౧౮౦౨ ప్లవనామసంవత్సరే ఆషాఢవద్యసప్తమ్యాం రవివాసరే చోత్తరాభాద్రపదానక్షత్రం తస్మిన్దినే యవనమతే జకీముహూర్తే అమృతవేలాయాం విలక్షణ శాహారాంతర్దుర్గమధ్యే ఇసూఫపాదశాహానాం సింహాసనే ప్రతిష్ఠాపనం జాతం" అనుగద్య మున్నది. ఇది విజయపుర మేలినమహమ్మదీయులచరితము ప్రధానముగా వర్ణించినది.

రత్నసేనవంశముక్తావళి—ఇది సేనకులమునకుఁ జేరినసామంతరాజులచరితము. ఇందు రత్నసేనుఁడు మొదలుగా రణవిహారసేనునివఱకుఁ గలసేనులు వర్ణింపఁబడిరి. కడపటివానితండ్రి రణబహదూర్సేను. దీనిని రచియించిన భవదత్తపండితుఁడు దీనికాలము నిట్లు తెలిపియున్నాఁడు.

"శాకే చతుర్భుజ ధరాధర భూమియుక్తే—"
ముక్తావళీం గ్రథితవాన్ భవదత్తధీమాన్"

శా. శ. ౧౭౭౪ అగునది క్రీ. ౧౮౫౨ అగుచున్నది.

వంశలత—అను పేర నుదయనాచార్యుఁ డొకచరిత్ర రచియించెను. పురాణముల నుండి సూర్యచంద్రవంశరాజులపట్టికలను సంగ్రహించి యొకచోఁ గూర్చిన ట్లున్నయిది యుగయుగాంతరరాజులక్రమ మెఱుఁగుట కుపయోగించును.

పై రాజచరిత్రలవలెనే మహాపురుషులజీవితములు గూడఁ జరిత్రలుగా నిర్మింపఁబడినవి. అందు పెక్కింట మహత్త్వాపాదకము లైనకల్పనలు గనవచ్చును గాని, వానిలోఁ గూడఁ గొంతసత్యము గోచరింపకపోదు. మహామహేశ్వరజగద్ధరపండితుఁడు నిర్మించినహరచింతామణి మహిమాపాదకమే కాని, అందు, పాణిని వరరుచి పతంజలుల చరిత్రములు కలవు. అందే కాక, పాణినిచరితము పతంజలిచరితమును వేఱుగాఁ గూడ నున్నవి. రామభద్రదీక్షితవిరచిత మైనపతంజలిచరిత మెనిమిదిసర్గలకావ్యము. దీనికిఁ గవిశిష్యుఁ డైన వేంకటేశ్వరపండితుఁడు వ్యాఖ్య నిర్మించెను. కాని, మూలముమాత్రమే ముద్రిత మైనది.

సంక్షేపశంకరవిజయము. ఇది వ్యాసాచలమహాపండితుఁడు సంతరించిన గురుశంకరవిజయమునకు సంగ్రహరూప మని దీనికర్త యగువిద్యారణ్యులు గ్రంథాదిని దెలిపి యున్నారు. ఈవిద్యారణ్యుఁడు సాయణాచార్యులసోదరుఁ డగు మాధవాచార్యుఁడు కాఁ డని కొంద ఱందురుగాని, యిందలి—

"ఇతి శ్రీమాధవీయే తదుపోద్ఘాతకథాపరః
సంక్షేపశఙ్కరజయే సర్గో ఽయం ప్రథమోఽభవత్"

ఇత్యాదిసర్గాంతశ్లోకములనుబట్టి మాధవుఁడే విద్యారణ్యుఁ డని విదిత మగును. ఇందు పదునాఱుసర్గలు కలవు. లోకప్రసిద్ధ మైనయీకావ్యమున శంకరాచార్యుల జననవిద్యాభ్యాసస్వమతప్రచారమతాంతరవిజయాది బహువిషయములు రసోచితముగా వర్ణింపఁబడినవి. ఇది గాక, శంకరాచార్యచరితము శంకరవిజయవిలాసము ననెడి మఱిరెండుగ్రంథములు గూడ శంకరాచార్యచరిత్రము దెల్పునవి కలవు గాని, వానికి వ్యాప్తి కలుగలేదు. ఇందు రెండవది ముప్పదియధ్యాయములమహాకావ్యము. ఇది చిద్విలాసయతి విజ్ఞానకందతపోధనులసంవాదరూపమున నున్నది. ఇందలి—

"కృత్వా బౌద్ధనిబర్హణం మృడపురే గోకర్ణ మాసేదివాన్"

ఇత్యాదివాక్యముల శంకరునిదిగ్విజయయాత్ర తెలియవచ్చును. ౭౪ ప్రకరణములతోడి శంకరవిజయ మనుగద్యప్రబంధ మొకటి కలదు. అది, అనంతానందగిరి రచియించినది. ఇతఁడు శంకరభాష్యమునకు వ్యాఖ్య రచియించినయానందజ్ఞానునికంటె వేఱేమో యనితోఁచుచున్నది. ఇం దాచార్యులవిజయయాత్ర పరమతదమనము అద్వైతప్రతిష్ఠ మొద లగుబహువిషయములు వర్ణింపఁబడినవి. ఈగ్రంథ మచ్చుపడినట్లు కనఁబడదు. ఇది తప్పక వ్యాపింపఁ దగినగ్రంథము.

"అనంతానందగిరిణా గురో ర్విజయ ముత్తమమ్,
రచితం యే ఽనుగృహ్ణన్తి తే ముక్తా స్స్యు ర్న సంశయః"

ద్వైతమతగురువులచరిత్రములను దెల్పెడిమధ్వవిజయము అణుమధ్వవిజయము జయతీర్థవిజయము తీర్థప్రబంధము మొద లైనవియు, విశిష్టాద్వైతమతప్రవర్తకులగురామానుజవేదాన్తదేశికాదిగురువులచరిత్రలు దెలుపుదివ్యసూరిచరితము నిగమాంతాచార్యచరిత్ర వల్లభాచార్యచరిత్ర—మొద లైనవి లోకమునఁ గొంత వ్యాప్తి గాంచినవి. వీనిలో ద్వైతావలంబన మైనమధ్వవిజయము పదార్థదీపికా వ్యాఖ్యతో వెలయుచున్నయుత్తమకావ్యము. నిగమాన్తాచార్యచరితమునఁ గవితార్కికసింహబిరుదాంకితుఁ డగువేంకటనాథవేదాన్తదేశికాచార్యుఁడు ప్రధాననాయకుఁడు. పేరు చంపు వైనను, నాథమునివిజయచంపు వొకటి ప్రశంసనీయము. ఇందు, విశిష్టాద్వైతమును బ్రవర్తింపఁ జేసిననాథముని మొదలుగా రామానుజాచార్యులవఱకుఁ గలశ్రీవైష్ణవాచార్యులజీవితములు వర్ణింపఁబడినవి. దీనికర్త రామానుజదాసుఁడు.

కౌటిల్యార్థశాస్త్రకర్త యగుచాణక్యునివృత్తాంతము కౌటిల్యకథాసార మనుపేర వెలసినది. దీనికర్త యగురవినర్తకుఁడు, గద్యరూపముగా నున్నయీ కథను దాను పద్యముగా నిర్మించిన ట్లీవిధముగాఁ జెప్పెను.

"చాణక్యస్య కథా సేయం విద్యతే గద్యరూపిణీ,
అద్య తాం పద్యతాం నేతు ముద్యతో రవినర్తకః"

ఇతనికాలము తెలియరాదు గాని గ్రంథస్థితినిబట్టి యర్వాచీనుఁ డనియుఁ బేరునుబట్టి యుత్తరాహుఁ డనియు నూహింపవచ్చును. కవిత్వము సరళమై చదువ నింపుగా నున్నది. ఇందు కొకయుదాహరణము.

"బుద్ధి రేవ జయ త్యేకా పుంస స్సర్వార్థసాధనీ.
యద్బలా దేవ కిం కిం న చక్రే చాణక్యభూసురః"

వర్ధమానచరితము యశోధరచరితము ధన్యకుమారచరితము మొదలగు కొన్నిజైనపురుషచరిత్రకావ్యములు కనవచ్చుచున్నవి. ఇందు, పదునెనిమిదిసర్గల మొదటిదానిలో జైనమతస్థాపకుఁ డగువర్ధమానునిచరిత్ర వర్ణింపఁబడినది. దీనికర్త అసగుఁడు. చరిత్రము ప్రాచీనమే కాని, యితఁ డర్వాచీనుఁడు. మతాభిమానమును బట్టి దేశమున వ్యాపించినవర్ధమానునిమానవాతీతమైనమహాత్త్వాతిశయముతోడి చర్యలను వర్ణించుటయే యిందుకు నిదర్శనము. కాని, కవిత్వముమాత్రము రసవంతమై ప్రౌఢముగా నున్నది. కవి యగువాఁడు వేశ్యాలోలునివలెనే యేమియుఁ జూడఁబోఁ డని యిద్దఱిని బోల్చి యిట్లు వర్ణించియున్నాఁడు.

"నాపేక్షతే ఽర్థాపచయం న కష్టం నవృత్తభఙ్గం భువి నాపశబ్దమ్,
మూఢీకృత స్సన్ రసికత్వవృత్త్యా కవి శ్చ వేశ్యార్పితమానస శ్చ"

రెండవదానిని రచియించినవాఁడు వాదిరాజసూరి యనఁబడుషణ్ముఖుఁడు. ఉజ్జయినీనివాసియు, చంద్రమతీయశోర్ఘులపుత్త్రుఁడు నగుయశోధరుఁ డనుజైనరాజు నాయకుఁడు. నాలుగుసర్గలయీకావ్యమున యశోధరునిబాల్యయౌవనరాజ్యలాభ శత్రువిజయాదులు వర్ణింపఁబడినవి. ఈక్రిందిశ్లోకము నాయకునిగుణసంపద కుదాహరణము.

"గురుషు వినయవృత్తిం బన్ధుషు ప్రేమబన్ధం,రిపుషు కరకృపాణందర్శయన్నాహవేషు,
అధిగతనయసిన్ధుః సత్యసన్ధః స రాజా, రణముఖజయసింహో రాజ్యలక్ష్మీంబభార"

మూఁడవది యేడధికారములమహాకావ్యము, భట్టారకశ్రీసకలకీర్తివిరచితము. ఇందలినాయకుఁడు శైవమతావలంబి, వైశ్యులైనప్రభావతీధనపాలురయు

ష్ఠమపుత్రుఁడు, ఉజ్జయినీనివాసి, పరతత్త్వజిజ్ఞాసు వైనజైనయోగి, ధన్యకుమారాహ్వయుఁడు.

పైసకలకీర్తియే యిరువదినలుగురు తీర్థంకరులలో మొదటివాఁ డగువృషభనాధుఁడు నాయకుఁడు గా వృషభనాధచరిత మనుమఱియొక కావ్యము నిర్మించి యున్నాఁడు. పదునైదవతీర్థంకరుఁ డగుధర్మశర్మవృత్తాంత మంతయు గ్రహించి హరిచంద్రకవి ధర్మశర్మాభ్యుదయ మనుపేర ౨౧ సర్గలమహాకావ్యము నిర్మించెను.

ప్రభంజనగురుచరిత మనుపేర యశోధరవిరచిత మైన జైనచరిత్రము మఱియొకటి కనఁబడుచున్నది. కాని, ఈయశోధరుఁడు పూర్వోక్తయశోధరుఁడు కాఁడని తోఁచుచున్నది. ఇది యైదుసర్గల కావ్యము. ఇందు, జయావతీదేవసేనుల పుత్రుఁ డగుప్రభంజనగురు వనుజైనరాజుజీవితము వర్ణింపఁబడినది. దేవసేనుఁడు తనజ్యేష్ఠపుత్రుఁ డైనప్రవరసేనుని వేణ్ణాతటీపురాధీశుని గావించియు, ద్వితీయపుత్రుఁ డైనప్రభంజనుని బమ్మాభపురాధీశుని గావించియు గృహము విడిచి తపోవనమునకు వెడలినట్లు మొదటిసర్గలోఁ గనఁబడుచున్నది. ఈపురము లిపు డేపేళ్లఁ బిలువఁబడుచున్నవో తెలియకున్నది గాని, ప్రభంజనునికొడు కైనసరళుఁడు విశాలానగరమున రాజ్యలాభము గాంచె నని మఱియొకచోట నున్నదానినిబట్టి యవి విశాలాప్రాంతములోని వని మాత్ర మూహింప నయ్యెడి.

భద్రబాహుచరిత మనెడిమఱియొక జైనచరితకావ్యము కలదు. దీనికర్త ఆచార్యశ్రీరత్ననంది. మతల్లికా పద్మధరులపుత్రుఁడును, కోడీపురపాలకుఁడు నగు భద్రబాహు వనుజైనరాజువృత్తాంత మిందు వర్ణింపఁబడినది. ఇతఁడు జైనులలో శ్వేతాంబరమతము ప్రతిష్ఠించినవాఁడు. నాలుగుపరిచ్ఛేదముల యీగ్రంథము, మగధదేశములోని రాజగృహము నివాసముగాఁ గలచీలిని శ్రేణికరాజులకు వీరసేన ముని చెప్పిన ట్లున్నది. దీనినిబట్టి రత్ననంది తననాఁటికిఁ గర్ణాకర్ణికగా వినవచ్చిన శ్వేతాంబరమతోద్ధారకభద్రబాహుచరితము తరువాత గ్రంథముగా నిర్మించె నని విదిత మగును.

ఇట్లే మల్లిసేనవిరచిత మగునాగకుమారచరితము మొద లగుమఱికొన్ని జైనచరిత్రలు కనవచ్చును గాని, యిందలిపాత్రములు సత్యము లైనట్లుగా వృత్తాంత మంతసత్య మైన దనుటకు వీలు లేకుండ నద్భుతములు మహిమోపేతములు నై కనఁబడుచున్నవి. అందుచే నివి పూర్వోక్తము లైనహర్షచరిత్రాదుల వంటివి కాఁజాలవు.

అయోధ్యాపాలకుఁడును లోడీవంశములోనివాఁడు నగులోడీఖానునవాబు సంతోషమునకై కల్యాణమల్లకవి రచియించిన నాలుగుపటలములసుమైమచ్చరిత

(సులైమాన్) మనుపద్యకావ్యమును, పండితరాజజగన్నాధకవి రచియించిన అసఫ విలాస మనెడిఅసఫ్‌ఖాన్‌చరిత్రమును, శహజహాన్‌దారాశాహాలవర్ణనములతో నిండి యున్నజగదాభరణకావ్యము ననుమూఁడును మహమ్మదీయప్రభువులచరిత్రలను దెల్పుచునున్నవి. స్వాశ్రయులైన ప్రభువులవర్ణనము లగుటచే వీనియం దించుక యతి శయోక్తులు కనిపించినను, ప్రధానవిషయము సత్యదూరము కా దని యితర చరిత్రగ్రంథములలోనివిషయమునుబట్టి తెలియ నగును. అసఫవిలాస మాఖ్యా యిక. దీనిచివర నున్నగద్యమున శహజానుసార్వభౌముఁడు తనకుఁ బండితరాజ బిరుదము ప్రసాదించినట్లు జగన్నాధకవి చెప్పికొనియున్నాఁడు. ఇఁక లోకమునఁ జక్కఁగా వ్యాపించిన భోజచరిత్రమును గూర్చి యించుక—

భోజచరిత్రము. ధారానగరాధీశ్వరునినాయకునిగావించియుదయించిన దను విషయము మాత్రము సత్యము. దీనికర్త పండితవల్లభదేవుఁడు. ముద్రితపుస్తక ములం దీపేరు 'బల్లాల' యైనది. ఇతఁడు మిక్కిలి యర్వాచీనుఁడు. కాళిదాసాది మహాకవులనుగూర్చియు విక్రమార్కాదిమహారాజులనుగూర్చియు లోకమున నద్భుతము లైనకొన్నికథలు కర్ణాకర్ణికగా వ్యాపించినట్లే భోజునిగూర్చియుఁ గొన్ని వ్యాపించినమాట సత్యము. అట్టివానిని జేర్చియుఁ గొన్ని కల్పించియుఁ జమత్కారకారిగా వల్లభుఁడు రచియించినయిది పుక్కిటిపురాణగాథగాఁ జదివి యానందింపఁదగినదే కాని సత్యమైనచరిత్ర యని నమ్మఁదగినది కా దనుట కొక యుదాహరణము.

భోజునియాస్థానమందలి ధనపాలకవి తిలకమంజరియవతారికలో ముంజుఁ డనెడివాక్పతిరాజు భోజునిపెత్తండ్రి యనియు, అతఁడు పుత్రసంతానహీనుఁడై తమ్ముఁడైనసింధురాజుపుత్త్రుఁడగుభోజుని సింహాసన మెక్కించె ననియు వర్ణించి యుండఁగా, వల్లభపండితుఁడు, ముంజుఁడు భోజునిపినతండ్రి యైనట్లును, అన్న యనంతరము రాజ్య మపహరింపఁ దలఁచి భోజుని జంప నంపినట్లును వర్ణించి యున్నాఁడు. క్రీ. పూ. ౫౭ లో నున్నకాళిదాసును, క్రీ. ౭౩౦ ప్రాంతములోని భవభూతిని, అట్లే వివిధకాలములలోని మఱికొందఱు కవులను క్రీ. ౧౦౩౦ ప్రాంతము లోని భోజునిసభకుఁ జేర్చి వర్ణించియున్నాఁడు. దీనినిబట్టి యిది సత్యచరిత్రము కా దని తెలిసికొని యిఁకఁ గథాకావ్యములు కొన్ని చూతము.

కథాకావ్యములు— ఈ పేరు విన్నంతనే ముందు బృహత్కథ స్మృతికి వచ్చుట నైజము. అది సంస్కృతము గాకపోయినను, సంస్కృతములోని పెక్కు కథాకావ్యములకుఁ దల్లి. కావున ముందు దానిం గూర్చి తెలిసికొందము.

బృహత్కథ. ఇది పైశాచీప్రాకృతభాషలో నుదయించినకథాకల్పతరువు. దీనికర్త గుణాఢ్యుఁడు. ఈమహాకవికాల మిది యనుటకుఁ దగినయాధారములు లభింపకున్నను, ఎవరికిఁ దోఁచినట్లు వారితనికాలము నిర్ణయించుచు వచ్చిరి. కాళిదాసును క్రీ. నాల్గవశతాబ్ది కీవలఁ బెట్టినకొందఱు పాశ్చాత్యులు. గుణాఢ్యుని, క్రీ. మూఁడవశతాబ్దిలోఁ జేర్చిరి [1]. వారియూహలనుగూర్చి యంత విచారింపఁ బనిలేదు గాని, భాసమహాకవిని క్రీ. పూ. రెండుమూఁడుశతాబ్దులలోఁ జేర్చుట కుద్యమించినగణపతిశాస్త్రిగారు, భామహుని క్రీ. పూ. మొదటిశతాబ్దిలోఁబెట్టి అతనియలంకారమున బృహత్కథపేరు కనఁబడ లే దని గుణాఢ్యుఁ డతని తరువాతివాఁ డనుటయు, భాసునిస్వప్నవాసవదత్తాదులనుండియు లోకమునుండియుఁ గొన్నికథలు గ్రహించి వానికిఁ దోడు కొన్నికథలు కల్పించి గుణాఢ్యుఁడు బృహత్కథ యల్లె ననుటయు [2] ప్రాచీనసంప్రదాయవిరుద్ధములై యనుచితము లగుచున్న వని మాత్రము చెప్పకతప్పదు. పురాణేతిహాసాదులలోనికథలకుఁ గాక తక్కినయెల్లకథలకును దల్లి బృహత్కథ యనెడివిశ్వాసము నేఁటిది కాదు. రత్నావళీకాదంబర్యాదులలోనియట్టికథలు గాంచినధనంజయాదిపూర్వులు రామాయణాదులమాడ్కి బృహత్కథయుఁ గావ్యరచన కుపయోగించువస్తు విచ్చుమహాగ్రంథమని పొగడియున్నారు. దండివంటిమహాకవి—

"భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథామ్"

అనుచు బృహత్కథ నెక్కువగాఁ బ్రశంసించియున్నాఁడు. కాళిదాసువంటిమహాకవి—

"ప్రాప్యావన్తీ ముదయనకథాకోవిదగ్రామవృద్ధాన్,
పూర్వోద్దిష్టా మనుసర పురీం శ్రీవిశాలాం విశాలామ్"

అనుచు బృహత్కథలోనివాసవదత్తావత్సరాజులకథ లవంతీదేశములోని పెద్దలు ప్రాచీనములైనయితిహాసములమాడ్కిఁ జెప్పుకొనుచుండెడివా రని సూచించియున్నాఁడు. ప్రాచీను లిట్లు బృహత్కథ యపూర్వతను బ్రాచీనతను ఘోషించుచుండ, తొలుత నేఁడులక్షగ్రంథముగా నుదయించినబృహత్కథ కేడువందలగ్రంథ మైనఁగాని స్వప్నవాసవదత్తాకథాలేశము దిక్కయ్యె ననుట సాహసము కాదా?

---

1. చూ. కీతుపండితుని సంస్కృతనాటకచరిత్రము. పుట 52.
2. చూ. స్వప్నవాసవదత్తపీఠిక. అనంతశయనముద్రణము.

మహామహేశ్వరజయద్రథుఁడు రచియించినహరచరితచింతామణి యను మహాకావ్యమునఁ గొన్ని యద్భుతోక్తులు నతిశయోక్తులు నున్నమాట సత్యమే కాని, హరమహాత్మ్యప్రశంసాపరము లైనవానిని బరిశోధించినచో నందు సత్యము లైనచరిత్రాంశములు కొన్ని బయటఁ బడకపోవు. అందలియిరువదియేడవప్రకాశము శబ్దశాస్త్రావతారము దెల్పునది. అందు గుణాఢ్యునికి సంబంధించినకథ యిట్లున్నది.

"పార్వతి యొకప్పు డపూర్వ మైనకథ చెప్పవలసిన దని పరమేశ్వరుని గోరఁగా నతఁ డామెకు సప్తవిద్యాధరులకు సంబంధించినకథలు చెప్పెను. వారి భక్తుఁ డగుపుష్పదంతుఁడు తుమ్మెద యై వారున్నచోటఁ బ్రవేశించి, ఆకథలు విని, పిదప నిజరూపముతో నింటికి వచ్చి, అద్భుత మైనవానిని దనభార్య యగు జయకుఁ జెప్పెను. తరువాత నొకనాఁడు పార్వతి చెలికత్తెల కాకథలు వినిపించు సమయమునఁ జయ యంతకుమున్నే యాకథలు విని యున్నట్లు తెలిసికొని పుష్పదంతుని రావించి నిజము చెప్పించి, యతనిని మర్త్యుఁడవై పుట్టు మనిశపించి, అతనియెడఁ బక్షపాతము గలమాల్యవంతుఁ డనువానిని గూడ నట్లే శపించెను. అపుడు జయ పార్వతీదేవిని బతిమాలుకొనఁగా, కుబేరశాపహతుఁ డైనసుప్రతీకుఁడు వింధ్యాటవిలోఁ గాణభూతి యనుపేరఁ దిరుగుచున్నాఁడు. వానికి నీభర్త యీకథలు చెప్పి శాపవిముక్తుఁ డగు ననియు, వానివలన నీకథలు విని మాల్యవంతుఁడు శాపవిముక్తుఁ డగు ననియు ననుగ్రహించెను.

పుష్పదంతుఁడు కౌశాంబీనగరమున వసుదత్తాసోమదత్తులకు వరరుచి యనుపేరఁ బుట్టి, నందరాజపాలిత మగుపాటలీపుత్రమున వర్షోపాధ్యాయునివద్ద సకలవిద్యలును, ముఖ్యముగా వ్యాకరణశాస్త్రమును బఠించి పరమేశ్వరశిష్యుఁ డై శబ్దశాస్త్రము పఠించి వచ్చినపాణిని నోడించెను. ఇది తెలిసి భగవంతుఁ డైన శంకరుఁడు హుంకరించినంతనే పాణిని వరరుచి నోడించెను. అంత వరరుచి మూర్ఖుఁడై వింధ్యాటవి కేగి కాణభూతి యనువానిని జూచి స్వజాతిస్మృతి గలుగ నతనికిఁ బూర్వోక్తము లైనకథలు చెప్పి శాపవిముక్తుఁ డయ్యెను. ఇదియిట్లుండ—

మర్త్యలోకమున గుణాఢ్యుఁ డనుపేరఁ బుట్టినమాల్యవంతుఁడు సకలవిద్యాపారంగతుఁడై సుప్రతిష్ఠితదేశమును బాలించుసాతవాహనభూపాలునిమంత్రియై కొంతకాల ముండి, తరువాత సంస్కృతప్రాకృతదేశభాషలుమూఁడును బరిత్యజించి మౌన మవలంబించి వింధ్యాటవికి వచ్చి, మూఁడుభాషలకు వేఱై యక్కడిపిశాచములు మాటలాడుకొనుచున్నక్రొత్తభాష విని దాని నభ్యసించుచున్నతఁడు గాణభూతి కనఁబడి యతనికిఁ బుష్పదంతుఁడు చెప్పినకథలు చెప్పెను. గుణాఢ్యు

డత్యాశ్చర్యకరము లైనయాకథ లానందముతో విని పరవశుఁడై యడవిలో ప్రాతిసాధనములు లభింపమిచే భూర్జపత్రములమీఁదఁ దననెత్తుటితోఁ బిశాచ భాషలోనే, ఆయేడువిద్యాధరకథల నేడులక్షలగ్రంథ మగునట్లుగా రచియించి లిఖించి బృహత్కథ యనుపేరు పెట్టి దానిని వ్యాపింపఁజేయుననుతలంపుతో నొక భృత్యునిచేతి కిచ్చి సాతవాహనభూపాలునికిఁ బంపించెను. మదమత్తుఁ డైనయారా జాపత్రసంపుటము లందుకొని చూచి ఛీ యని విసరివేసెను. ఆభృత్యుఁడు నాపత్రము లన్నియుఁ జేర్చి మూటగట్టుకొని వచ్చిగుణాఢ్యుని కిచ్చిజరిగినసంగతి విన్నవించెను. అంత గుణాఢ్యుఁడు విచారించి యొకయగ్నికుండ మేర్పఱచి యొక్కొకపత్రములోని గ్రంథము నాయడవిలోనిపశుపక్షులు గూడ వినునట్లు బిగ్గరగాఁ జదువుచు దాని నగ్నిలో హోమము చేయుచుండెను. ఇట్లీహోమము జరుగుకాలమున నయ్యడవి లోనిజంతువు లెల్ల నిరాహారములై యాకథలు వినుచు నట్లే యుండి శుష్కించు టచే సాతవాహానునికి మంచిమాంసము లభింపలేదు. అందుచే నతనికి జబ్బు వచ్చి నది. మృగఖగములు శుష్కించిపోవుటకు గుణాఢ్యుఁడు చేయుగ్రంథహోమము కారణ మని తెలిసినది. అంత నతఁడు పశ్చాత్తప్తుఁడై వెంటనే యాయడవికి వచ్చి గుణాఢ్యునికి నమస్కరించి గ్రంథహోమము మానవలసిన దని ప్రార్థింపఁగా నతఁడయ్యా! ఇప్పటి కాఱుకథలుగలయాఱులక్షలగ్రంథ మగ్నిపా లయినది. ఇక లక్షగ్రంథ మగునరవాహనదత్తునికథ యొకటియు మిగిలియున్నది. దీనిఁ గొని పోయి లోకమునఁ బ్రవర్తింపఁజేయు మని యతని కిచ్చెను. సాతవాహనుఁడు సంతోషముతో దానిఁ గొనిపోయెను. గుణాఢ్యుఁ డైనమాల్యవంతుఁడు శాపవి ముక్తుఁడై శివసన్నిధి కేగెను. ఆకథలు విన్నపిశాచగణములు దివ్యత్వము చెందెను.*

ఈకథలోనిమహత్త్వపర మైనశివసంబంధకల్పన మటుంచి చూచినచో గుణాఢ్యుఁ డనెడిమహాకవి తనకాలమునఁ దనదేశమందు వాడుకలో లేని పైశాచీ ప్రాకృతభాషలో నపూర్వ మైనబృహత్కథ రచియించినాఁ డనుట యసంగతము కాదుగదా! ఇఁకఁ దక్కినవిషయములను ద్రోసి పుచ్చి గుణాఢ్యసాతవాహనసంబంధముమాత్రము గ్రహించి, ఆసాతవాహనుఁడే శకకర్త యైనశాలివాహనుఁ డను నిశ్చయమునకు వచ్చి, గుణాఢ్యుఁడు క్రీ. ౭౮ ప్రాంతమందలివాఁ డని యిప్పటి విమర్శకులు కొందఱు చెప్పుట యెట్లుచితమో చూడుఁడు. ఇందు మూఁ డక్షేపములు గలవు.

ఒకరాజునకే సాతవాహనశాలివాహనసంజ్ఞలు స్థిరపడినవా? గుణాఢ్య వర్ణితసాతవాహనుఁడేనా శకకర్త యైనశాలివాహనుఁడు? పైకథవల్లఁ బాటలీ పుత్రరా జగునందుఁడును సుప్రతిష్ఠితదేశపాలకుఁ డైనసాతవాహనుఁడును సమ

శాలివాహనుఁడని చెప్పఁబడు చుండ, ఆ సాతవాహనుఁడే క్రీ. ౭౮ లో శకము స్థాపించిన శాలివాహనుఁడనవచ్చునా? వీనికి సమాధానములు సులభసాధ్యములు కావు. కావున నపమార్గము విడిచి సరియైన త్రోవకు వత్తము. క్రీ. పూ. ౫౬ ప్రాంత మందలి కాళిదాసు వత్సరాజకథను బేర్కొనుటచేతను, అంతకుఁ గొంచెము పూర్వుఁడైన భాసుఁడు బృహత్కథలోని వాసవదత్తావత్సరాజులకథను దనరూపకముల వర్ణించుటచేతను, వారిద్దఱికిని బృహత్కథ రచియించినగుణాఢ్యుఁడు పూర్వుఁడై క్రీ. పూ. రెండవశతాబ్దికడపటనో మూఁడవశతాబ్దిమొదటనో యుండియుండు నని భావించుటయే యిప్పటికి సముచితము.

"సముద్దీపితకందర్పా కృతగౌరీప్రసాధనా,
హరలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా"

అనురీతిని భట్టబాణాదిమహాకవుల ప్రశంసకుఁ బాత్రమైనయీబృహత్కథ క్రీ. పన్నెండవశతాబ్దివఱకును గూడ సజీవమై యున్నట్లు తెలియవచ్చును గాని, ప్రాకృతభాషలు, దేశమునందు మిక్కిలి మాఱురూపము చెందిపోవుట కారణముగా నిది వ్యవహారభ్రష్టమై యంతట నంతరించియుండును. ఐనను దీనిసంగ్రహానువాదములమూలముగా నిది దేశదేశాంతరముల స్మరింపఁబడుచుఁ దనయునికిని జాటుచునే యున్నది. ఈయనువాదములో మొదటి దగుబృహత్కథాశ్లోకసంగ్రహము ౪౫౩౯ శ్లోకములతోఁ డియిరువదియెనిమిదిలంబకముల గ్రంథము. దీనికర్త యగు బుధస్వామి క్రీ. ఎనిమిది లేక తొమ్మిదవశతాబ్దిలోనివాఁ డయినట్లును నేపాలదేశీయుఁ డైనట్లును, ఈగ్రంథము సజీవమై యున్నట్లును, ఏ. బి. కీతుపండితుఁడు తెలుపుచున్నాఁడు[1]. ఇది నాకు లభింపనందున దీనినిగూర్చి యింతకంటె వ్రాయఁజాలను. రెండవది యగుబృహత్కథామంజరి ముద్రితమై యున్నది. ఇది మొదటిదానికంటెఁ జిన్నది. విషయ మంతకంటెను సంగ్రహము. దీనికర్త ప్రసిద్ధుఁ డగు క్షేమేంద్రుఁడు. ఇతఁడు కాశ్మీరరాజైనయనంతవర్మ యాస్థానకవి. క్రీ. ౧౦౬౦ ప్రాంతమువాఁడు. మూఁడవ దగు కథాసరిత్సాగరమును ముద్రితమై బహుదేశముల వ్యాపించినది. పదునెనిమిదిలంబకములయీగ్రంథమున ౧౨౪ తరంగములు కలవు. దీనికర్త యగుసోమదేవభట్టు కూడఁ గాశ్మీరరాజయినయనంతవర్మ యాస్థానములోనివాఁడై ఆనరేంద్రునిభార్య యైనసూర్యవతీదేవికోరికపై నీగ్రంథము నిర్మించినట్లు గ్రంథాంతశ్లోకమునఁ దెలియుచున్నది. దీనినిబట్టి క్షేమేంద్రుఁడు బృహత్కథామంజరి రచియించినపిదపనే యీగ్రంథ ముదయించినట్లును దీనికాలము క్రీ. ౧౦౭౦ ప్రాంత మైనట్లును, ఊహింపఁబడుచున్నది.

---

1. See. A. B. Keith's classical Sanskrit Literature P. 91.

ఈమూఁడింటిలో గొప్పఖ్యాతి గడించినది కథాసరిత్సాగరమే. బృహత్కథావృత్తాంతమును గ్రంథారంభణసమర్థనమును దెల్పెడియందలి మొదటికథాపీఠలంబకములోని—

యథామూలం తథైవైత న్నమనాగప్యతిక్రమః
గ్రన్థవిస్తరసంక్షేపమాత్రం భాషా చ భిద్యతే॥

అనుశ్లోకమునుబట్టి, సోమదేవభట్టు మూలమైనబృహత్కథను జూచుచునే, అందందు విపులమైనవర్ణనాదికమును సంగ్రహించుచు, మూలము నెంతమాత్ర మతిక్రమింపక యీభాషాంతరీకరణము కావించినవాఁ డని విదితమగును. సంస్కృతభాషనుండి యితరభాషల కెన్నో గ్రంథము లనువదింపఁబడినవి. అనువదింపఁబడుచున్నవి. కాని, పూర్వకాలమున దేశభాషయైనయొకప్రాకృతమునుండి సంస్కృతమున కనువదింపఁబడిన యేకవిషయకములైనగ్రంథములు మాత్ర మీమూఁడే యనియు, వీనిలోఁ గథాసరిత్సాగర మిపుడెల్లభాషలకుఁ జేయుచున్నయుపకార మపార మనియుఁ జెప్పవచ్చును.

సోమదేవునిమతియొకకృతి కనఁబడదుగాని, క్షేమేంద్రునివి మాత్రము సుమారు ముప్పది యున్నవి. అందు మునిమతమీమాంస నీతికల్పతరువు మొదలైనవి కొన్ని నామమాత్రావశేషములు. ఇతనియౌచిత్యవిచారచర్చనుగూర్చి యలంకారప్రకరణమునఁ గలదు. ఇతఁడు బృహత్కథను సంగ్రహించినట్లే రామాయణభారతకాదంబరీవాత్స్యాయనసూత్రాదులనుగూడ సంగ్రహించి పద్యకావ్యములుగా రచియించియున్నాఁడు. వ్యాసదాసుఁ డనఁబడునితనిముద్రితకృతులలో, కలావిలాస మనుపదిసర్గలచిన్నకావ్యము మిక్కిలిమనోహరముగానుండును. కామమోహదంభాదులదుర్లక్షణములను విశదీకరించునది లోకానుభవమునకు దర్పణముగా నున్నది. అతనిదర్పదళనము గూడఁ జదువ నింపై వ్యాప్తి గాంచినది.

పంచతంత్రము—సకలజగ మెఱిఁగినమహాగ్రంథ మిది. దక్షిణదేశమందలి మహిళాపురము పాలించినయమరశక్తిరాజునానతిచే నతనిపుత్రులకు నీతి గఱపవిష్ణుశర్మ యనుమహాపండితుఁ డీగ్రంథమును నిర్మించినట్లు తెలియుచున్నది. భర్తృహరినీతిశతకములోనిపద్య మిం దుండుటనుబట్టియు, ఆఱవశతాబ్దిమధ్యకాలమందో మరువా నసూపారసీకరాజు రాజ్యము చేయుచుండ నీకావ్యము పారసీకభాషలోనికి మార్చఁబడినట్లు తెలియుటనుబట్టియు నితఁడు క్రీ. ఆఱవశతాబ్దిమొదటివాఁ డనితోఁచుచున్నదిగాని,ఎనిమిదవశతాబ్దిలోనిదామోదరగుప్తాదులకొన్నిశ్లోకము లిందుకవవచ్చుటంజేసి యిది యాశతాబ్దికడపటిదేమో యని కొందఱనుమానించుచున్నారు. సీ. ఫిల్ బ్రౌనుపండితుఁడు, జర్మనీలోను ఇంగ్లండులోను ముద్రిత

మూలపంచతంత్రమునకును నేఁటిభరతఖండమందలిపంచతంత్రమునకును గొప్పచొప్పె భేదము కనవచ్చుచున్న దని తెలుపుటంబట్టియు, దామోదరగుప్తాదుల శ్లోకములు తరువాత నిందు ప్రక్షిప్తములై యుండు ననుట కవకాశ ముండుటంబట్టియు, నిది యాఱవశతాబ్ది మొదటి దనుటయే సముచిత మని భావించుచున్నాను.

విష్ణుశర్మ గ్రంథాదిని వ్రాసినశ్లోకములనుబట్టి మను బృహస్పతి శుక్ర పరాశర చాణక్యాదిపూర్వుల గ్రంథములందలియైహలౌకికపారలౌకిక రాజకీయనీతుల సారము ముద్ద గావించి బృహత్కథలోనిచక్కనికథలలో విమిడ్చి పాఠకలోకమున కమృతపాయసముమాడ్కి నాస్వాదింప నతఁ డొసఁగినాఁ డని తెలియఁ గలదు. ముద్దు లొలుకుచక్కనివాక్యములతోను మృదు వైనశైలితోను మనోహారము లైనసందర్భోచితపద్యములతోను విలసిల్లునీగ్రంథము సంస్కృతాక్షరాభ్యాసము గావించినంత బాలుర కైనను సులభముగాఁ దెలియును ట్లున్న దనుట కంటె సారస్వతమున దీనికిఁ గలయున్నతస్థానమును వేఱుగా వర్ణింప నక్కఱలేదు. మిత్రభేదము మిత్రలాభము కాకోలూకీయము లబ్ధనాశనము అపరీక్షితకారకము, అనెడియైదుతంత్రముల విరాజిల్లు నిది పాఠకలోకమునకు గురువై ప్రభువై మిత్రమై కళత్రమై వేదశాస్త్రపురాణాదికల్పమై ప్రాపంచికజ్ఞానమును గరతలామలకము గావింపఁ జాలియున్నది.

"సకలార్థశాస్త్రసారం జగతి సమాలోక్య విష్ణుశర్మేదమ్,
తన్త్రైః పఞ్చభి రేత చ్చకార సుమనోహరం శాస్త్రమ్"

అనుచు నిది సకలశాస్త్రసార మని కవీంద్రుఁడు చెప్పినమాట యెంతయు సత్యము.

హితోపదేశము—పంచతంత్రమువలె లోకప్రసిద్ధ మైనయాపద్యకావ్య మెల్లవిధముల దాని ననుకరించియు ననుసరించియుఁ బుట్టినది. ఇదియు విష్ణుశర్మ రాజపుత్త్రులకుఁ జెప్పిన దని యవతారిక చెప్పును గాని యిది విష్ణుశర్మప్రణీతము కాదు. అర్వాచీనుఁ డొకఁడు విష్ణుశర్మయందలి గౌరవముచే నతనిపేర దీనిని నిర్మించె ననుట నిజము. దీనిప్రయోజనమును గ్రంథకర్త యిట్లు చెప్పియున్నాఁడు.

"శ్రుతో హితోపదేశో ఽయం పాటవం సంస్కృతోక్తిషు,
వాచాం సర్వత్ర వైచిత్ర్యం నీతివిద్యాం దదాతి చ"

మిత్రలాభాదిప్రకరణములతోడియిది పాఠకలోకవిదితము. దీని ననుసరించి ధవళచంద్రరాజునాదరముగాంచిన నారాయణపండితుఁడు హితోపదేశము రచియించినట్లు తెలియుచున్నది. రచన భేదించును గాని విషయభేదము లేదు.

"తావన్నారాయణేన ప్రచరతు రచిత స్సంగ్రహో ఽయం కథానాం
శ్రీమా న్ధవళచంద్రో ఽసౌ జీయా న్మాండలికో రిపూన్
యే నాయం సంగ్రహో యత్నా ల్లేఖయిత్వా ప్రచారితః"

హితోపదేశ మనెడియర్వాచీననీతికావ్యము మఱియొకటి కలదు [1]. కర్త పేరు తెలియదు. ౩౧ అధ్యాయములదానియవతారికలో —

ఇస్రాయేల్‌రాజదాయూదతనయేన సులేమనా,
అయం హితోపదేశానా మభిప్రాయః ప్రదర్శ్యతే"

అనుదానినిబట్టి సులేమనే దీనిని రచియించె ననియు, లేక సులేమనుహితోపదేశములయభిప్రాయ మిట్లు ప్రదర్శింపఁబడె ననుచు మఱియొకఁ డీగ్రంథము నిర్మించె ననియుఁ గూడ భావింపనగుచున్నది. ఇందలిహితోపదేశములు బైబిలులోనికొంతగ్రంథము ననుసరించిన దని యొకరనిరి. ఎట్లయిన నిది నవీన మైననీతికావ్యము గాని కథాకావ్యము కాదు.

వేతాలపంచవింశతి—ఇది వేతాలుఁ డనుపిశాచరాజు విక్రమార్కునకుఁ జెప్పినట్లు కల్పింపఁబడిన యిరువదియైదుకథలకావ్యము. దీనికర్త శివదాసుఁ డని యొకవ్రాతప్రతిలోను వల్లభదాసుఁ డని యింకొకవ్రాతప్రతిలోను గద్యలవల్లఁ దెలియుచున్నది. శివదాసుఁడు కర్త యని తెలిపెడిప్రతులలోఁ గూడ గ్రంథారంభాదికము కొంచెము భిన్నముగాఁ గనఁబడుచున్నది. వల్లభదాసనిర్మిత మని చెప్పెడి ప్రతిలోఁగూడఁ బైప్రతులలో నున్నట్లే 'ప్రణమ్య శిరసా దేవ' మిత్యాదిమంగళాచరణాదిక మింపద్భేదముతో నట్లే యున్నది. పరిశీలించి చూడఁగాఁ దరువాతఁ దరువాత గ్రంథలేఖకులు చేసినమార్పులు ప్రక్షిప్తములు పైభేదములకుఁ గారణ మనియు, వల్లభదాసుఁడే శివభక్తుఁ డగుట శివదా సనఁబడె ననియుఁ దెలియుచున్నది.

"శివదాసవిరచితాయాం వేతాలపఞ్చవింశతికథాయామ్"
"శ్రీయాన్వయప్రసూతేన కాయస్థకులశూలినా,
కృతా వల్లభదాసేన జగదానన్దకారిణీ"

పైశ్లోకములోనిశూలిశబ్దము శివవాచకమై వల్లభదాసు శివదా సనఁబడె ననెడిపై యూహను బలపఱుచుచున్నది. ఇది యిటులుండ—జంభదత్తవిరచిత మైన వేతాలపంచవింశతి మఱియొకటి కనఁబడుచున్నది. దీనియారంభ మే వేఱు. "సన్ధి

1. మదరాసు ప్రాచ్యపుస్తకాగారము—ముద్రితగ్రంథపట్టిక 21—(1918).

శ్రీవర దేవవక్త్రకమలా దాకర్ణ్య" యనియు, "సన్నిశ్రీజమ్మ్భదత్తవరచిత్రకథా పీఠే" యనియుఁ గనవచ్చుమాటలనుబట్టి సంధిశ్రీవర దేవునిశిష్యుఁడో పుత్త్రుఁడో యైనయతఁ డీకృతి పూర్వవేతాలపంచవింశతి చూచి తరువాత రచియించె నని తెలియుచున్నది.

ఈరెంటియందును శృంగారవీరాద్భుతాదిరసములతో డిజీమూతవాహనాది మహాపురుషులగాథలు కనవచ్చుచున్నవి. వీనిలో మొదటిది బృహత్కథామంజరి ననుసరించిన దనుట కొకప్రతిలోఁ గనవచ్చెడి "ఇతిబృహత్కథామంజర్యాం పంచవింశో వేతాళః" ఇత్యాదివాక్యములే ప్రమాణము. దీని ననుసరించిన దే—

(2) విక్రమార్కచరితము—ఇదియే ద్వాత్రింశత్సాలభంజిక యనఁబడుచున్నది. ఇది ముప్పదిరెండుకథలగ్రంథ మని యీపేరే చెప్పును. ఈపేరఁ బద్యకావ్య మొకటియు గద్యకావ్య మొకటియుఁ గననగును. పద్యకావ్యకర్త నందికేశ్వరుఁడు, నందీశ్వరయోగి, యని వ్రాఁతప్రతుల రెండువిధములఁ గనవచ్చుచున్నాఁడు. గద్యకావ్యకర్తపేరు కనఁబడదు. ఈరెంటియందలివిషయము మాత్రము సమానమే. కాలయాపనార్థము పార్వతికిఁ బరమేశ్వరుఁ డీకథలు చెప్పె ననుమాట రెంటియందును గలదు. దీనినిబట్టి పద్యకావ్యమును జూచి తరువాత గద్యకావ్య మొదయించె ననవచ్చును.

భోజమహారాజు తనకు లభించినవిక్రమార్కునిసింహాసన మెక్కుట కుద్యమించినపుడు, విక్రమార్కునిశౌర్యసాహసౌదార్యాదిసుగుణములు లేకయే యతనిసింహాసన మెక్కఁ దలఁచితివా? నిలు'మని యాయందలిముప్పదిరెండు బొమ్మలు క్రమముగా నొక్కొక్కకథ చెప్పినట్లున్నదీనికిఁ బై రెండుపేళ్లు సముచితము లగుచున్నవి. ఈకథలు దేశప్రసిద్ధములు. దీనికి సింహాసనద్వాత్రింశిక యనునట్టి యొకపేరు గూడఁగలదు.

శాలివాహనకథ—ఈపేర ౧౮ సర్గలగొప్పకావ్య మొకటికలదు. ఇందు మొదటిసర్గలోఁగొంతవచన మున్నది. అది యిట్లు చెప్పుచున్నది.

దేవేంద్రునిపుత్త్రుఁడు గంధర్వసేని యనువాఁడు శాపవశమున భూలోకమునకు వచ్చి మదయంతి యనుపామరజాతిరాజకన్యను పెండ్లాడి యవంతీరాజ్యపాలకుఁడై యుండెను. అతనికి విక్రమాదిత్యుఁ డనుకొడుకు పుట్టెను. యుక్తవయస్సు రాఁగానే యాతనికి రాజ్య మిచ్చి గంధర్వసేని తపస్సునకుఁ బోయెను. విక్రమార్కుఁడు దిగ్విజయ మొనర్చుచు నొకనాఁడు సకలసైన్యసమేతుఁడై నర్మదాతీరమందలితపోవనమునకు వచ్చెను. అక్కడ సుధీనామకుఁ డగుబ్రాహ్మణుఁడు తపోనిష్ఠుఁడై యుండెను.

రాజ్యమత్తుఁడైన విక్రముఁ డతనికి నమస్కారమైనఁ జేయలేదు. విక్రమునకుఁ గోపము వచ్చినది. అంతలో దైవవశమున నర్మదేశ్వరుని బూజించుటకై నాగలోకమునుండి వాసుకికూఁతురు భానుమతి యచ్చటికి వచ్చెను. ఆముని యా కన్యను జూచి మనసులో 'ఈమెకు మహావీరుఁడైనపుత్త్రుఁ డెపుడు పుట్టునో యపుడు విక్రమార్కునికి మరణము సంభవించును" అని తలఁచుకొనెను. వెంటనే యా కన్యకు గర్భమైనది. ఆమెకుఁ బుట్టినవాఁడే శాలివాహనుఁడు. అతఁడే విక్రమార్కాంతకుఁడు"

ఈకథ సత్యమా యసత్యమా యనువిచారణ యనావశ్యక మని కథాసరణియే చెప్పుచున్నది. కాని, శ్రీహర్షవిక్రమాదిత్యుఁడు శకకర్త యైనశాలివాహనునికిఁ బూర్వుఁ డనెడియొక సత్యలేశము మాత్రము దీని నుండి గ్రహింపవచ్చును. దీనికర్తగూడ వేతాలపంచవింశతి నిర్మించినశివదాసే యని సర్గాంతగద్యలవల్లఁ దెలియును. మిక్కిలి యర్వాచీనుఁడైనయతఁ డిట్టియద్భుతకథలు వ్రాయుట కలవాటు పడినవాఁడే.

విక్రమసేనచరితము—ఇందు ప్రతిష్ఠానపురరాజగువిక్రమసేనునకు వేతాలుఁడు కథలు చెప్పుట కనవచ్చును. విక్రమసేనుఁడు సకలజనరంజకముగా దేశము పాలించుకాలమున క్షాంతిశీలుఁ డనునొకశ్రమణసన్యాసి యతనివద్దకు వచ్చియచ్చటికి దగ్గఱగా నున్నయొకశింశుపావృక్షము చెంతకుఁబొమ్మని చెప్పెను. ఆరాజట్లు వెడలఁగా నందు వేతాళుఁడు కనఁబడుట మొదలగువిషయముతోఁ గథాకథన మారంభ మగును. అందుకు మూల మేమో తెలియఁజాలము గాని, విక్రమ—విక్రమార్క—విక్రమసేనాదినామములతోడి యొకరాజునకు సంబంధించినకథలు మాత్ర మనేకము లనేకవిధముగా దేశమున వ్యాపించి గ్రంథరూపము దాల్చినవి.

శుకసప్తతి—ఇది యొకచిత్ర మైనకథాకావ్యము. ఇందు నీతిమార్గ ముపదేశించుడెబ్బదికథలు కలవు. నందభూపాలునిపుత్త్రుఁ డగువినయకందర్పుఁడు, తనసేవకుఁడైన దేవదాసును జంద్రికాగిరికిఁ గార్యార్థము పంపించి, అందకత్తె యగునతనిభార్యతోఁ గ్రీడింప యత్నించి ప్రభావతి యనుపేరుగలయాతన్వియింటికి నిరంతరము రాత్రికాలమున వెళ్లుచుండ, దేవదాసు పెంచినచిలుక ప్రతిదిన మొక్కొక్కనీతికథ చెప్పుచు నతని నింటికిఁ బంపివేయుచుండును. ఇట్లు డెబ్బది దినములు చెప్పినకథలే శుకసప్తతి యనుపేర వెలయుచున్నవి. ఆకథలు—ముని దౌర్భాగ్యము స్త్రీసాహసము శ్రీశైలమాహాత్మ్యము రజకీగాథ విప్రకథ పితాపుత్రసంవాదము శూద్రమాహాత్మ్యము మొదలగునవి. ఇందలిప్రతికథయుఁ జీవనమునకు నీతిబోధక మగును. ఇందలిజ్ఞానోపదేశ బ్రహ్మోపదేశ యతిధర్మమార్గ

మార్గాదు [illegible]డపటికథలు విజ్ఞానదాయకములై యెట్టిదుర్మతి నైన సన్మార్గము నకుఁ ద్రిప్పఁ జాలియున్నవి. తుదకు రాజు ప్రభావతిని జెఱచకుండ శుకమామె శీలము కాపాడి, రాజునకు హితము గలుపుటయే యిందలిపరమార్థము. ఒక నాఁడు రాజు వచ్చి ప్రభావతి యర్పించినయున్నతాసనముపైఁ గూర్చుండి యుండ, ఒకపిల్లి తన్నుఁ దినవచ్చి యాపని సాధ్యము గాక క్రింద మూలుగుచుండుట తెలిసి దాని నుద్దేశించి యన్యాపదేశముగాఁ జిలుక యిట్లు పలికెను.

"కిం త్వం రోదిషి మార్జార! న చారి ర్నచ తస్కరః
"నన్దభూపకుమారో ఽయం పరనారీసహోదరః"

ఈమాటలు విని వినయకందర్పుఁడు మౌనముతోఁ దనయింటికిఁ బోయెను. ఇట్టినీతిచేతనే కాక భాషచేఁ గూడ నిది హృద్యముగా నున్నది.

పౌరాణికకావ్యములు—ఇవి లెక్క కెంతయెక్కువగా నున్నవో, ప్రచారమున నంత తక్కువగా నున్నవి. అట్లని యివి యన్నియు నిర్గుణములు కావు. వీనిలో రఘువంశాదులను బోలినవి గొన్ని లేకపోలేదు. క్రీ. పదియేనవశతాబ్ది మొదట నున్నవామనభట్టబాణుఁడు నలాభ్యుదయ మనుపదిసర్గలకావ్యమును రఘునాథచరిత మనుముప్పదిసర్గలకావ్యమును నిర్మించెను. రెండవదానిలో రామాయణకథ యంతయు సంగ్రహముగా నున్నది. కవిత్వము పేశలమై మనోహరముగా నున్నది. దీనివలెనే శరభోజీరాజు పన్నెండుసర్గలరాఘవచరితమును, ౧౬౩౫ లోని వేంకటేశపండితునిముప్పదిసర్గలరామచంద్రోదయమును, విష్వక్సేనవిరచిత మైనపందొమ్మిదిసర్గలరామచరితమును, జినవల్లి వీరమాంబా యిమ్మడి వేంకటాద్రిరాజులపుత్త్రుఁడైనగోపాలరాజు నిర్మించినయమకప్రధాన మైనయిరువదియాశ్వాసములరామచంద్రోదయమును, ఉత్తమకావ్యము లైనను వీథికి రాలేదు. ఇట్టి బహువిధరామాయణకథాకావ్యములలో ననేకము లముద్రితములు.

పైవానిలో రాఘవచరితమును, తంజావూరుపాలకు లైనమహారాష్ట్రరాజులలో మూఁడవవాఁ డగుశరభోజీ రచియించిన ట్లవతారికాదులవల్లఁ దెలియుచుండ, నొక వ్రాఁతప్రతి ద్వితీయసర్గతుదను—పంచరత్నకవికృతౌ రాఘవచరితే— అను మాటలు కనఁబడుచున్నవి. దీనినిబట్టి పంచరత్నకవియే దీనిని నిర్మించి శరభోజీ పేరు పెట్టెనేమో యని తోఁచుచున్నది. డాక్టరు ఆఫ్రెట్ పండితుఁడు గూడ నిట్లే యభిప్రాయపడియున్నాఁడు.

రాఘవపాండవీయము—రాజశేఖరునికవివిమర్శనములో నిది గా సూక్తిముక్తావళిలోఁ గనఁబడుచున్న—

"ద్విసంధానే నిపుణతాం సతాం చక్రే ధనంజయః,
యయా జాతం ఫలం తస్య సతాం చక్రే ధనంజయః"

అనుశ్లోకములోని ద్విసంధానకావ్యము నామాంతరము రాఘవపాండవీయ మనియు, దానికర్త ధనంజయుఁ డనియుఁ దెలియుచున్నది గాని, ఆగ్రంథము ముద్రితము కాదు. లభింప లేదు. ఆధనంజయుఁడు రాజశేఖరునికిఁ బూర్వుఁ డగుటచే దశరూపకకర్త కాఁ డనవచ్చును—అది గాక, కదంబవంశరాజులలోని వీరకామదేవరాజుప్రోత్సాహమున[1] కవిరాజపండితుఁడు రచియించిన రాఘవపాండవీయము మఱియొకటి ముద్రితమై యున్నది. ఇది పదమూఁడుసర్గలద్వ్యర్థి కావ్యము. గ్రంథకర్తపే రిందు కవిరాజని యున్నది గాని, ఇది బిరుదనామమై వాడుకలో స్థిరపడినట్లు కనఁబడుచున్నది. కవి యీనామమునే గ్రంథమున వాడుకొనియున్నాఁడు.

"సుబన్ధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః,
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా"

ఇందు వక్రోక్తిమార్గమునఁ దాను మూఁడవవాఁడ నని చెప్పుకొనుటయు, ఇతనికవిరాజసంజ్ఞయే తరువాత రాజశేఖరాదులకవిరాజబిరుదమునకు మూలమైనట్లు కనఁబడుటయు, జూడఁగా నితఁడు రాజశేఖరునికిఁ బూర్వుఁ డనియు, క్రీ. నవమశతాబ్దికడపట నుండియుండు ననియుఁ దోఁచుచున్నది. గ్రేపండితుఁడితనిని ౧౨౦౦ ప్రాంతమునఁ జేర్చెను గాని, అందుకుఁ దగినప్రమాణములు చూపలేదు.

రామధర్మరాజులు ప్రధాననాయకులుగాను, రావణదుర్యోధనులు ప్రతినాయకులుగాను రామాయణభారతార్థములు రెండు నిందు చక్కఁగా వర్ణింపఁబడినవి. రామయుధిష్ఠిరులమూర్ధాభిషేకములతోఁ బదమూఁడవసర్గ సమాప్తమైనది. దీనికి గోజాదత్తసూరిపుత్రుఁ డగులక్ష్మణపండితుఁ డుత్తమమైనవ్యాఖ్య రచియించి రెండర్థములను జక్కఁగా విశదీకరించెను. ఈవ్యాఖ్యతోడియీగ్రంథము ముద్రితమైనది. ఇది గాక సారమంజరి స్థూలతాత్పర్యార్థము ననుమఱి రెండు టీకలు కలవు.

---

1. కదంబరాజ్యములోని జయన్తీపురము నేలినమయూరవర్మచరిత మొకగ్రంథముగా నున్నది. చూ. ఇండియాలైబ్రరీ—Vol. VII. P. 1580.
2. చూ. L. H. Gray పండితుని యాంగ్లవాసవదత్త పీఠిక.

రాఘవపాండవయాదవీయము—పై కృతి ననుకరించినయాకావ్యము రచి యించినయతఁ డనంతనారాయణపుత్త్రుఁ డగుచిదంబరసుమతి. మూఁ డర్థముల యాకావ్యమున కితనిపుత్త్రుఁ డైనయనంతనారాయణసుమతి దివ్య మైనవ్యాఖ్యా నిర్మించెను. చిదంబరసుమతి, సర్గాంతములందు నైషధకర్త యగుశ్రీహర్షు ననుక రించి పద్యములు రచియించియున్నాఁడు.

"ఆద్యః స్వాద్య రసో ఽగమ త్సకలతా ముద్దామరామాయణ
శ్రీమద్భారతసారకృష్ణచరితే సర్గో నిసర్గోజ్జ్వలః"

ఈయనుకరణమునుబట్టి యీకవి క్రీ. ౧౭ శతాబ్ది కీవలివాఁ డగుట తెల్లము—నలయాదవరాఘవపాండవీయ మనునాలుగర్థములకావ్య మొకటి యున్నట్లు వినవచ్చును గాని, అది నాకు లభింపలేదు.

పై కావ్యమును బోలినది కథాత్రయి యనుకావ్య మొకటి. దీనికర్త శ్లేష చింతామణి శబ్దార్థచింతామణి మహాకావ్యచిదంబరవిలాసకర్తయైన చిదంబరకవి. ఇది మూఁడుసర్గలకావ్యము. ఇందురామాయణభారతభాగవతసారము వర్ణితము. కవిపుత్త్రుఁ డైనయనంతనారాయణుఁడు దీనికి మంచిటీక రచియించెను. ఇతఁడు సూర్యనారాయణదీక్షితులవంశములోనివాఁడు. ఈవంశమువా రందఱును మహా పండితులే.

ఆలంకారికప్రకరణమునఁ బ్రశంసింపఁబడినయానన్దవర్ధనుఁడు, అర్జునచరిత పంచబాణలీలాదికావ్యములను, కావ్యతత్త్వ మనువిమర్శగ్రంథమును గాక, దేవీ శతక మొకటిరచియించెను. ఇది చిత్ర యమక శ్లేషాదులతో నిండినది. ఇదికైయట వ్యాఖ్యతో ముద్రితమైనది. ఇతనికి సమకాలికుఁ డైనరత్నాకరపండితుఁడు హార విజయ మనెడియేఁబదిసర్గలమహాకావ్యమును గాక, కుంతకునివక్రోక్తిజీవితముపకు మార్గదర్శక మైనవక్రోక్తిపంచాశిక యొకటి నిర్మించెను. ఏఁబదిశ్లోకములయీకా వ్యము భవానీభవులసపరిహాసవక్రోక్తుల హృదయాహ్లాదకారి యగుచున్నది. శిశు పాలవధాదివ్యాఖ్యాత యగువల్లభదేవుఁడు దీనికి వ్యాఖ్య నిర్మించెను. ఇతనిపౌ త్త్రుఁడే పై దేవీశతకవ్యాఖ్యాత కయ్యటుఁ డని దేవీశతకటీక చెప్పుచున్నది.

"వల్లభదేవాయనిత శ్చంద్రాదిత్యా దవాప్య జ న్మేమామ్,
కైయటనా మారచయ ద్వివృతిం దేవీశతకస్తోత్రే
వసు ముని గగ నోదధి సమకాలే యాతే కలే స్తథా లోకే
ద్వాపంచాశే వర్షే రచి తేయం భీమగుప్తనృపే"

క్షేమగుప్తరాజు క్రీ. ౯౫౦ మొదలుగ నాలుగేండ్లు కాశ్మీర మేలినవాఁడు. దేవీశతకవ్యాఖ్య క్రీ. ౯౭౭ లో నిర్మింపఁబడినది. కాని, ఈకైయటుఁడు మహాభాష్యకైయటునికంటె వేఱనియు, ఈవల్లభదేవుఁడు, సుభాషితావళి సంగ్రహించినపదియేనవశతాబ్దిలోనివల్లభదేవుఁడు కాఁడనియు, మల్లినాథునికంటెఁ బ్రాచీనుఁ డైనయితఁడు క్రీ. ౧౪౦౦ ప్రాంతమువాఁ డనియుఁ దెలియువది.

పార్వతీరుక్మిణీయము—ఇది యొకయుత్తమకావ్యము. చాళుక్యవంశరాజులలోనిసోమదేవునియాస్థానమున విద్వత్కవి యైనవిద్యామాధవుఁడు దీనిని రచియించెను. ఈకవి యవతారికలో—

"బాణ స్సుబన్ధుః కవిరాజసంజ్ఞః, విద్యామహామాధవపణ్డితశ్చ,
వక్రోక్తిదక్షాః కవయః పృథివ్యాం, చత్వార ఏతే నహి పఞ్చమోఽస్తి"

అనుచు, రాఘవపాండవీయకర్త కవిరాజు తనతో వక్రోక్తినిపుణులు ముగ్గురనఁగా, వారు తనతో నలుగు రని యాత్మస్తుతి గావించికొనియున్నాఁడు. అయినను, అతనికృతివలెనే యితనిదియు సర్వ్వముగా నుండుటంబట్టి యీస్తుతి యంత యాక్షేపణీయము కాఁజాలదు. ఒకయముద్రితపుస్తకమునఁ దొమ్మిదిసర్గలు మాత్రమే కనఁబడుచున్నవి. ఇఁక నెన్ని యున్నవో తెలియదు. ఇందలివిషయము విదితము. కవియు నిట్లు చెప్పియున్నాఁడు.

"హిమాద్రికన్యాసహితం మహేశం, లక్ష్మీసమేతం మధుసూదనంచ,
స్తోతుం తదుద్వాహకథైక్యచిత్రప్రబన్ధలక్ష్మ్యా దహ ముత్సహిష్యే"

రాఘవయాదవీయ మనుశ్లిష్టవిలోమకావ్య మొకటి వేంకటాధ్వరి నిర్మించినది కలదు. ఇందు మూఁడువందలశ్లోకము లున్నవి. పైనుండి క్రిందికిఁ గ్రిందినుండి పైకిని జదివిన నొకటే పాఠము వచ్చును. రామకృష్ణకథలు రెండును సంగ్రహముగా నిందు వర్ణింపఁబడినవి. విశ్వగుణాదర్శకర్తయై ఖ్యాతి గన్న వేంకటాధ్వరియే యితఁడు. సీతాంబాశ్రీనివాసదీక్షితులపౌత్రుఁ డైనయితఁడు కాంచీపురనివాసి. వీరియింటిపే రరిశాణపాలమువారు. ఆత్రేయగోత్రుఁడు. చంద్రగిరిరాజైనవేంకటపతిరాయలగురు వగుతిరుమలతాతాచార్యునిమేనల్లుఁ డైనరఘునాథదీక్షితునిపుత్త్రుఁడు. వ్యాఖ్యావిశిష్ట మైనయిది ముద్రిత మైనట్లు కనఁబడదు. దీనివంటిదే—

రామకృష్ణవిలోమకావ్యము. దీనికర్త దైవజ్ఞసూర్యపండితుఁడు. ఇదియు శ్లిష్టచిత్రకవిత్వప్రాయము. ఇందు రామకృష్ణులయిద్దఱిచరితములు సంగ్రహముగాఁ దెలుపఁబడినవి. శ్లోకము మొదటినుండి చివరకును, చివరనుండి మొదటికిని, ఒక్కరీతిని నడచును. రమారమి నలువదిశ్లోకములవెలయునిది ముద్రిత మైనది. ఇందలి దొక్కపద్యము—

"తం భూసుతా ముక్తిముదారహాసం,
వన్దే యతో లవ్యభవం దయాశ్రీః,
శ్రీయా దవం భవ్య లతో య దేవం,
సంహారదా ముక్తి ముతా సుభూతమ్"

ఈశ్లోకము తలక్రిందుగాఁ జదివిన నిట్లే నడచును. ఇట్టికవిత్వము చూచుటకు రమ్యమే కాని, చదువుటకుఁ గాని యర్థము చేసికొనుటకుఁగాని క్లేశకరము. పైగా నిట్టికవితలో రసము మృగ్యము. ఇది కేవలము పాండిత్యప్రకర్ష చూపుటకు మాత్రమే యుపయోగించును. గణకానందకర్త యైనయీసూర్యపండితుఁడు క్రీ. పదునాల్గవశతాబ్దికడపటివాఁడు.

ఘటకర్పరీయము—ఇది యొకచిన్నయమకకావ్యము. మేఘావృతకాల మిందు ప్రధానముగాఁ వర్ణింపఁబడినది. ఇది భాసుఁడు రచియించిన దనియు, ఘటకర్పరుఁ డనువాఁడే నిర్మించిన దనియు, కాళిదాసు వ్రాసిన దనియు మూఁడు మార్గములు కలవు. ఇందే మార్గమునకును దగినయాధార మంతగాఁ గనరాదు. అయిన నొకింతవిచారణ.

"భాషాసు రమ్యా గైర్వాణీ, తస్యాం కావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం, తత్ర భాసకవేః కృతిః. ౧
భావకాపరనామాయం భాసో భాసయతే జగత్,
తత్త్వైః రివాదిపురుష, శ్చతుర్వింశతిరూపకైః" ౨
"జీయేత యేన కవినా యమకైః పరేణ,
తస్మై వహేయ ముదకం ఘటకర్పరేణ"
శ్రుత్వేతి భాసకవి నోక్త మమృష్యమాణాః
ప్రాహు స్త మన్యకవయో ఘటకర్పరాఖ్యమ్" ౩
"భావా నురక్తవనితాసురతై శ్శపేయ
మాలంబ్య చామ్బు తృషితః కరకోశపేయం,
జీయేత, యేన కవినా యమకైః పరేణ,
తస్మై వహేయ ముదకం ఘటకర్పరేణ" ౪
"భావకేన కృతం రమ్యం యమకాద్యై రలంకృతమ్,
ఘటకర్పరకావ్యం హి సన్తోషాయ న కస్య చిత్." ౫

ఇందు మొదటిమూఁడుశ్లోకములును గడపటిదియుఁ గవిపండితసంప్రదాయసిద్ధము లైనచాటువులు, నాల్గవది యీఘటకర్పరకావ్యము చివర నున్నది. వీటిని

బట్టి భానుఁడే భావకఘటకర్పరసంజ్ఞల వ్యవహరింపఁబడినట్లు తెలియును గాని, భానునినాటకములలో యమకప్రధానపద్యములు కనరామింజేసి యీచాటుశ్లోక వర్గము పుక్కిటిపురాణ మన వలసియున్నది. ఒకటిరెండుచోట్ల నేదో యొకటి యున్నను, అది యతనియమకప్రియత్వమునకు నిదర్శనముకాదు. అదిగాక, ఆకాలమున నిట్టిచిత్రకవితాభిలాషయే కనరాదు. ఈకారణములనుబట్టియే కాళిదాసు గూడ నేత్కర్త కాఁడనియు, ఘటకర్పరుఁ డనుకవి యొకఁడు వేఱుగా నుండె ననియు భావించుట సముచితము. మఱియు, పేరు మఱియొకటియై యుండఁ బ్రతిజ్ఞాశ్లోకములోని ఘటకర్పరశబ్ద మితనికి వేళాకోళపుఁ బేరై స్థిరపడి యుండు ననియు నూహింపనగును.

దీనికి శంకరుఁడు తారాచంద్రుఁడు ననువారు టీకలు నిర్మించిరి. ఇది యిరువదిరెండుశ్లోకముల చిన్నకావ్య మైనను రమ్యముగా నుండును. దేశమం దున్న పెక్కువ్రాఁతప్రతులలో నిది కాళిదాసకృత మని యున్నమాట సత్యము. ఇట్టికింవదంతులు మనవాఙ్మయమున నెన్నో యున్నవి.

యమకరత్నాకరము—ఇది పదునాఱాశ్వాసములకావ్యము. ఇందలివిష యము వాసుదేవుఁడు కంసుని సంహరించుట. అపరపరాశరబిరుదాంకితుఁ డగు శ్రీవత్సాంకుఁడు దీనికర్త. తొలుత యామున రామానుజాచార్యులకు నమస్క రించిన యితఁడు శ్రీవైష్ణవుఁడు. కురుత్తాళ్వా రనఁబడు శ్రీవత్సాంకునిపౌత్రుఁడు. ఇతఁడు స్వయముగానే దీనికి వ్యాఖ్య నిర్మించెను. ఆర్యాఛందోబద్ధ మయిన యీకావ్యము గూఢార్థ మైనను జదువ నింపుగా నుండును—ఒకపద్యము.

"పరమో ఽక్షరో మహీయా న్నాగాధ్యాసీ సమేతు నరకాన్తః
పరమోక్షరో మహీయాన్ నాగాధ్యాసీ సమేతు నరకాన్తః"

యమకభారతము—అనుభారతకథతోడియమకకావ్యము చిన్న దొకటి కలదు. ఇది, ఆనందతీర్థకృతము. ఇతఁడు సన్యాసి. దీని కితఁడే వ్యాఖ్యానము గూడ నిర్మించెను. ఒకయుదాహరణము—

"యస్య కరాలోలం చక్రం కాలః పరస్య హి కరాలో ఽలం చక్రమ్"

చిత్రబంధరామాయణము—ఇదిచెరుకూరి వేంకటేశ్వరపండితుఁడు నిర్మించిన యేఁబదిసర్గలకావ్యము. ఇతఁ డాంధ్రుఁడు. స్తోత్రరత్నాకరము చూడామణి మొద లగుకృతులు నిర్మించినయజ్ఞనారాయణపండితునిపుత్రుఁడు. నూటయేఁబదిసంవత్స రములక్రిందటివాఁడు. ఈగ్రంథము పెద్దది కాదు గాని యం దాఱుకాండలలోని కథయు సంగ్రహముగా నున్నది. చిత్రబంధయమకకవిత్వప్రీతి యాంధ్రదేశీయుల

కాలమున మిక్కిలి హెచ్చెను. అలంకారికగ్రంథములు రచియించి కృతు లిచ్చినవా రందఱును బంధచిత్రకవిత్వములు చెప్పినవారే. ఇతనినాగబంధ మొకటి యుదాహరణము—

"అయ కాయ చయ ధ్యేయ భయహేయ వరశ్చయ
వ్యయ క్షయ నయ శ్రేయ జయ మాయ ద మన్న య"

ఇత్యాదిగా బహుబంధములతోను యమకముతోను జిత్రముగా నున్న దీనికిఁ గవితండ్రి యజ్ఞనారాయణపండితుఁడే వ్యాఖ్య నిర్మించెను.

"స్వపుత్రరచితం చిత్రబంధరామాయణాహ్వయమ్,
వ్యాకరోతి మహాకావ్యం యజ్ఞనారాయణ స్సుధీః"

క్రీ. ౧౮౦౦—౧౮౨౦ నడుమవాఁ డైనయాంధ్రదేశవిద్వత్కవి శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి కంకణబంధ మనుపేర నొక యానుష్టుభశ్లోకము రచియించెను. అది యెక్కడ ప్రారంభించిననుముప్పదిరెండక్షరము లగునట్లు ముందుకో వెనుకకో చదువుచుఁ బోయిన నొకశ్లోక మేర్పడును. అట్లేర్పడినయఱువదినాలుగుశ్లోకముల లోను రామాయణకథ యిమిడి యున్నది. ఈశ్లోక మొకమాఱు నా బాల్యములో నెక్కడనో చూచితిని. మరల నది నాకు లభింపలేదు.

కవికర్పటిక—అనునొకచిత్రకావ్యము కలదు. దీనికర్త వాదీంద్రకవి. దీని దేశకాలములు తెలియవు కాని, ఇది యర్వాచీనమే. దీనిప్రయోజనము కవి యిట్లు తెలిపి యున్నాఁడు.

"యత్నా దిమాం కంఠగతాం విధాయ
శ్రుతోపదేశా ద్విదితోపదేశః,
అజ్ఞాతశబ్దార్థవినిశ్చయో ఽపి
శ్లోకం కరో త్యేవ సభాసు శీఘ్రమ్."

ఈగ్రంథములోఁ జూపినపదవాక్యములను వల్లించి యున్నచో, ఆయాఛందస్సులలో శ్లోకము చెప్పవచ్చును. ఆపదవాక్యములక్రమము జ్ఞప్తియం దుంచుకొన్నఁ జాలును. ఇందుకుఁ జంద్రోదయవర్ణనకు వల్లించవలసినవి—ఐదక్షరముల పదములు—కర్పూరపూర—డిండీరపిండ — రజనీకర — ఇత్యాదులు — వీనితరువాతఁ జేర్పఁదగినట్లు వల్లించవలసినమూఁడక్షరములపదములు—నీకాశమ్—సంకాశమ్ — ఇత్యాదులు—ఇపుడు, కర్పూరపూరనీకాశమ్—అనియనుష్టుప్ఛందస్సులో నొకపాదమువచ్చినది. ఇట్లే నాలుగుపాదములకుఁ దగినపదములపట్టిక లిందు గలవు. ఈవిధముగా శార్దూలవిక్రీడితాదివృత్తములకును గలవు. విఖ్యాతో గుణశాలినాం—విద్యా నయుం రాజతే—ఇత్యాదులు.

ఇట్లే వేంకటేశపండితుఁడు రచియించినయాఱుసర్గలరామకథాశ్రయమైన యమకార్ణవమును, వాసుదేవకవి నిర్మించినయెనిమిదాశ్వాసములయుధిష్ఠిరవిజయమును జటిలముగా నున్నవి. ఇందు రెండవది కేరళదేశరాజు కులశేఖరుని కాలమున నుదయించినది. దీనికవి భారతగురుశిష్యుఁడు విప్రసత్తమ (బాపనల్లూరు) గ్రామనివాసి. ఇతనికావ్యము నముద్రితమే. ఇందలి శ్లోకములు పదవిభాగపద్ధతిని వ్రాయఁబడుట యనునొకవిశేషము కనఁబడుచున్నది. దీనివలన నర్థము సులభముగా స్ఫురించును. ఇందు కొకయుదాహరణము.

"తరవః భూరిచ్ఛాయాః సమానఫలదాయినీ చ భూః ఇచ్ఛాయాః"

దీనికి, అచ్చియాంబాసుదర్శనభట్టులపుత్రుఁ డైనసాక్షనాథుఁడు బాలవ్యుత్పత్తికారిణి యనుపేర వ్యాఖ్య వ్రాసెను. ఇతఁడు చోళరాజ్యములోనికావేరీప్రాంతమందలిసాత్తనూరుగ్రామనివాసి.

నలోదయ మనెడినాలుగాశ్వాసములకావ్య మొకటి దేశప్రసిద్ధము. ఇది కాళిదాసకృత మని యిందలిగద్యలు చెప్పుచున్నవి. దీనికి మల్లినాథుఁడు మైథిల శ్రీప్రజ్ఞాకరమిశ్రుఁడుకృష్ణపండితుఁడు తిరువేంగళసూరి మొద లగుపెక్కండ్రు విద్వాంసులు రచియించినవ్యాఖ్యలు కలవు. ఏ రందఱు గూడ వ్యాఖ్యాగద్యలలో, "ఇతి శ్రీకాళిదాసకృతౌ నలోదయే—" అనుమాటలు వ్రాయుటచే, కాళిదా సను నొకకవి దీనిని నిర్మించియుండు నని విశ్వసింపవచ్చును గాని, ఈకాళిదాసు రఘువంశాదికర్త కాళిదాసు గాక, ఈపేరుగల తరువాతికవులలో నొకఁడై యుండు నని యూహింపవలసియున్నది. శాకుంతలకారకాళిదాసు నలోదయకావ్యము రచియించె ననుటకు విశ్వసింపఁదగినప్రమాణములు కనరాకపోవుటయే పైయూహకు మూలము. ఈకృతి యమకానుప్రాసభూయిష్ఠ మగుట మఱియొకహేతువు. రఘువంశాదు లందీయలంకారములు లేవనియే చెప్పవచ్చును. విక్రమోర్వశీయములో నొకచో—'సర్వక్షితిభృతాంనాథ' ఇత్యాదిపూర్వార్థము పునరావృత్తమైనదిగాని, అది యక్కడ మిక్కిలి సందర్భోచితము. ఇందలిమొదటిమంగళాచరణశ్లోకము కృష్ణపర మగుట కూడ నింకొకహేతువు. ప్రసిద్ధకాళిదాసు కృతులలో నున్నంతవఱకు మంగళాచరణశ్లోకములు శివపరములు. ఈకారణములను బట్టి యమకప్రధాన మగుటచే నంత రసజనకము గాకయున్న యీకావ్యము విఖ్యాతకాళిదాసు రచియించినది కా దని చెప్పవలసివచ్చుచున్నది. ఇది యతని కవిత్వము కా దనుటకు మొదటిశ్లోక మొకటే చాలును.

"హృదయ సదా యాదవతః, పాపాటవ్యా దురాసదా యాదవతః
అరిషముదా యాదవతః, త్రిజగ న్త్రాగాః స్తరేణ దాయాదవతః"

ఇట్లు శ్లేషయమకవైచిత్ర్యములతోడి కావ్యములు మఱికొన్ని కలవు. కాని, యెట్లయిన వీనిసంఖ్య మిక్కిలి తక్కువ. వీనిప్రచారమంతకంటెను దక్కువ. కావ్య మంతయుఁ దన్మయమగుటయే యందుకుఁ గారణము. భరతాచార్యుఁడు తొలుత యమకము నొకయలంకారముగాఁ బేర్కొని యున్నమాట యుఁ దరువాత దండ్యాచార్యాదులు శ్లేషానుప్రాసాదులను బేర్కొనుటయు సత్యమే. కాని, అవి తక్కినయలంకారములతోఁ బాటు కావ్యమున నుండఁ దగునని వారి యాశయము కాని, కావ్య మంతయుఁ దన్మయముగానే యుండఁదగు నని కాదు. అంతకు మున్ను శ్లేషయమకచిత్రకవిత్వ ముండియుండనట్లు బీజరూపమున నున్నది గాని పైకి బాగా యంకురించలేదు. భారవినాఁ డిది చక్కఁగా మొలకెత్తినది. మాఘుఁడు దానిని బోషించి యున్నాఁడు. బాణసుబంధుకవిరాజాదులు పెంచి పెద్దదానిని జేసినారు. అయినను వారికావ్యములు కేవలము తన్మయములు కావు.

శబ్దాలంకారము పైమెఱుఁగే కాని, అది యర్థాలంకారమువలె మనస్సు నాకర్షింపఁజాల దని యాలంకారికు లందఱియభిప్రాయములనుబట్టి యుఁ దెలియ వచ్చును. కవిత్వమునకు జీవ మైనరసముఁ బోషింపఁ గొన్నియర్థాలంకారములు తోడ్పడు నసవచ్చును గాని శబ్దాలంకార మెన్నఁటికి నట్టిది కాఁజాలదు. అట్టి యెడఁ గావ్య మంతయు రెండుమూఁడునాలు గర్థములు వచ్చునట్లు రచియించుట క్లేశావహ మైనను గవిపాండిత్యమును బ్రకటించునే కాని, సహృదయులమనసు రంజింప రస మెట్లు పుట్టించును? రసోత్పాదకముగాని యట్టికవిత్వము 'హేయా శబ్దార్థగుంఫనా' అనురాజశేఖరునిమాటకు గుఱియగును గాని పాఠకులయాదరమున కెట్లు పాత్ర మగును? అదియే యీకావ్యములయరుచికి మూలము.

హర్షనైషధము తరువాత మొన్నమొన్నటివఱకుఁ బుట్టుచు వచ్చిన వానిలోఁ బౌరాణికకావ్యములు వే యుండు ననుట యతిశయోక్తి కాదు. అముద్రితగ్రంథపట్టికలలోనివానిపేళ్లు వ్రాయుట కైన నిందు చోటు చాలదు. అం దెన్నఁ దగినవానిలోఁ గొన్ని—

యాదవాభ్యుదయము—ఇరువదినాలుగుసర్గలయీమహాకావ్యమును సర్వతంత్రస్వతంత్రకవితార్కికసింహాద్యాదిబిరుదములు గలవేదాంతదేశికుఁ డను వేంకటనాథపండితుఁడు రచియించెను. తర్కవిశిష్టాద్వైతమతగ్రంథము లెన్నో రచియించి కీర్తి గాంచిన యీవిద్వన్మణి క్రీ. ౧౩ వ శతాబ్ది యుత్తరభాగములోని వాఁడు. ఇతనిగ్రంథములు సుమారు నూఱు. హరివంశము ననుసరించి శ్రీకృష్ణుని జననాదివృత్తాంత మంతయుఁ బూర్తిగా నిందు వర్ణించియున్నాఁడు. ఇది నిజముగా నెన్నివిధముల రఘువంశమును బోలి యున్న దన వచ్చును. అప్పయదీక్షితులవంటి

మహావిద్వాంసుని కాఁగాఁ బుట్టించి యతనివల్ల వ్యాఖ్య గన్న యీకావ్య మిట్టి దని వేఱే ప్రశంసింపఁబనిలేదు.

అపరశంకరాచార్యుఁ డన్న ఖ్యాతి గన్నవాఁడును, కాంచీమండలములోని యడెపోలగ్రామమున నివసించినవాఁడును, విశ్వజిద్యాజిరంగరాజమఖిపుత్త్రుఁడును, క్రీ. ౧౫౧౫–౧౬౧౪ నడుమఁ జంద్రగిరి నేలిన వేంకటపతిరాయలమన్నన లందినవాఁడు నయినయీయప్పయదీక్షితులు, అద్వైతశైవమతగ్రంథములును మధ్వమతఖండనగ్రంథములును, వృత్తివార్త్తికసిద్ధాంతలేశసంగ్రహాద్యుత్తమగ్రంథములును సుమారు నూఱురచియించినవిద్వత్కవిరత్నము. ఇతనియలంకారగ్రంథములలోఁ గువలయానందము సకలదేశముల వ్యాపించినది. భారతతాత్పర్యసంగ్రహము రామాయణసారస్తవము మొదలగునితనిమహాకావ్యము లెన్నో కలవు. కాని, అవి ప్రఖ్యాతికి రాక యణఁగి పోయినవి. ఇతఁడు నిర్మించినవ్యాఖ్యలలో గోవిందమంత్రికృతహరివంశసారచరితవ్యాఖ్య సర్వంకషముగా నున్నది.

యదునాథచరితము— భాగవతసంగ్రహ మనునామాంతరము గలయిది పదిసర్గలకావ్యము. దీనికర్త్త పేరు కనఁబడదుగాని, యిది మలయాలదేశములోని కూపకరాజవంశమునకుఁ జెందినరాణి యైనయన్నపూర్ణేశ్వరియాదరణమున నుదయించిన ట్లవతారిక తెలుపుచున్నది. ఇందు శ్రీకృష్ణచరితము చక్కఁగా వర్ణింపఁబడినది. ఇట్టిదే—

గోవిందచరిత్ర—ఇది మలయాలదేశములోని యొకరాజగురవివర్త్మ యాదరమున వాసుదేవుఁ డనుకవి రచియించిన పదిసర్గలకావ్యము. ఇది పైయాదవాభ్యుదయము ననుకరించిన ట్లున్నది. ప్రద్యుమ్నోత్తరచరిత మను ౧౧ సర్గల యొకకావ్య మముద్రితమై యున్నది. దానికర్త్త యగుమృత్యుంజయకవి సుప్రసిద్ధుఁ డగురత్నఖేటశ్రీనివాసదీక్షితునిసంతతివాఁడు. ఘటికాశతగ్రంథకర్త్త యైనయయ్యాదీక్షితునిపుత్త్రుఁడు. ఈకవి శబ్దార్థచిత్రముల నిట్లు పొగడియున్నాఁడు.

"కాన్తేవ సూక్తిః కుసుమప్రవాళైః, శ్శబ్దార్థచిత్రై రపి యాతి శోభామ్"

బాలభారతము—అనుపన్నెండుసర్గలకావ్య మొకటియముద్రితమైనది తంజావూరుపుస్తకభాండాగారమున నున్నది. ఇది రచియించినవాఁ డగస్త్యపండితుఁ డనిమాత్రము సర్గాంతగద్యలు చెప్పును. రుద్రమదేవీగణపతిదేవులదౌహిత్రుఁడును, క్రీ. ౧౨౯౬–౧౩౨౩ నడుమ నోరుగల్లు రాజధానిగా నాంధ్రదేశ మేలినవాఁడు నగు ప్రతాపరుద్రునియాస్థానకవియై విద్యానాథబిరుద మందిన యగస్త్యుఁడే యీయగస్త్యపండితుఁ డనితోఁచుచున్నది. ఈవిషయ [illegible]

వ్యాఖ్యానములేదు కాని, దీనికి మనోహర యనుపేరఁగొప్పవ్యాఖ్య నిర్మించిన సాలువతిమ్మయదండనాథుఁడు శ్రీకృష్ణదేవరాయలయాస్థానములోనివాఁడ నని చెప్పుకొనుటచేతను, అతనినాఁటికే యిది పాఠకుల నాకర్షించినపూర్వకావ్యముగా గణన కెక్కుటచేతను, అప్పటి కొకశతాబ్దివెనుక నిది పుట్టి యుండు ననుట యసంభావ్యము కాదు. అది గాక, ఆకాలమునందు అగస్త్యుఁ డనుపేరు గలమఱియొక కవి ప్రసిద్ధుఁ డైనట్లు ను గనఁబడదు. కావున నీయగస్త్యుఁడు ప్రతాపరుద్రీయ కర్త యగువిద్యానాథుఁడే యనుప్రతీతిని విశ్వసింతము. గ్రంథము మహాభారత సంగ్రహము. కవిత్వము రసవంతము. వ్యాఖ్యానము కూలంకషము. విద్వద్రంజకము లైనయీయుభయముల వ్యాఖ్య లముద్రితము లగుట విచార్యము.

దీనివలెనే రామాయణకథ యంతయు సంగ్రహింపఁబడినవిశేషణరామాయణ మనుకావ్య మేడుకాండల వెలసినది. కవి వీరరాఘవుఁడు. కాలము సరిగాఁ దెలియరాదు గాని పదునాఱవశతాబ్ది కీవలివాఁడు కావచ్చును. ఇతఁడు నెల్లూరి రంగమంత్రిపౌత్రుఁడు. వీణ వేంకటపతిపుత్రుఁడు శ్రీమచ్చాటుకథాశుకావ్య రచనాచాతుర్యవాగ్వైఖరీ శ్రీవైచిత్ర్య ధురంధరుఁడు. ఈవిషయము గ్రంథాద్యశ్లోకములఁ దెలియవచ్చినది.

అప్పయదీక్షితులసోదరునిపౌత్త్రుఁడును భూమిదేవీనారాయణదీక్షితులపౌత్త్రుఁడు నగునీలకంఠదీక్షితు లనేకకృతులు రచియించెను. ౧౬౩౬ లో నితఁడు నీలకంఠవిజయము రచించినట్లు వ్రాసికొనియున్నాఁడు. ఇతనిశివలీలార్ణవ మిరువదిరెండుసర్గలమహాకావ్యము. శివకథాకావ్యములలో నిది యత్యుత్తమ మనఁదగిన ట్లున్నది.

కృష్ణవిజయము—ఇది పన్నెండుసర్గలకావ్యము. కేరళదేశమందు విహారాచల మనుక్షేత్రము కలదు. అం దంబికారాధనతత్పరుఁ డైనరాఘవపండితుఁ డను సర్వవిద్యావేత్త యుండెను. అతఁడు కేరలవర్మ యనెడికోలాధిపునకుఁ గులగురువైనవాఁడు. ఆపండితునిశిష్యుఁడు శంకరుఁడు. కోలభూపాలుఁ డొకప్పుడుకృష్ణచరిత్రము కావ్యముగా రచియింపు మని కోరఁగా శంకరుఁ డీకావ్యము రచియించెను. ఈవిషయ మిందలియవతారికవల్లఁ దెలియుచున్నది. ఈశంకరుఁడు గూడ యమకానుప్రాసాలంకారప్రియుఁ డైనట్లు కావ్యవర్ణనవల్ల విదిత మగుచున్నది. కవిత్వము రసవంతముగానే యున్నది.

కృష్ణాభ్యుదయ మనెడిమఱియొకకావ్య మిట్టిదే కలదు. దీనికర్త యగు వరదదేశికుఁడు వాదిహంసాంబుదవంశావతంసుఁ డైనకారికాదర్పణకర్త యగు [illegible]యార్యునిపుత్రుఁడు. ఇతఁడును, ఇతనితండ్రియుఁ గూడ ననేకకృతులు నిర్మిం

చినాట్లవతారికవల్లఁ దెలియును గాని యువి కనరావు. ఈకృతి యైన నచ్చుపడినట్లు కనఁబడదు.

కృష్ణాయన మనుపేర నొకపెద్దకావ్య ముదయించినది. ఇపు డిందలికొంత భాగముమాత్రమే సజీవమైయున్నది గాని, దీనియెత్తుగడ చూడ నిది వాల్మీకి రామాయణము నన్నివిధముల ననుకరించినట్లు కనఁబడుచున్నది. కర్త భరద్వాజుఁడు. కావ్య మార్షము తదనంతరకావ్యము (అనఁగా నాదికావ్య మైనరామాయణము తరువాతఁ బుట్టిన దని భావము) ముఖ్యభాగములు కాండలు. అవాంతర భాగములు సర్గలు. ఇందుకు—"ఇత్యార్షే శ్రీమత్కృష్ణాయనే తదనన్తరకావ్యే భగవదనుగ్రహాలబ్ధే భరద్వాజప్రోక్తే ద్వితీయకాణ్డే లక్ష్మణాకుమారోదయో నామ షష్ఠః సర్గః"

ఇత్యాదిగద్యలే ప్రమాణము. కాని,

"సమస్తాన్ వేదాన్తా నతినిపుణ మాలోచ్య వివిధైః,
పురాణై ర్గీతాభిః స్మృతిభి రితరాభి శ్చ బహుధా,
వినిర్ణీతాం రామానుజమునిభి రాలమ్బ్య సరణిం
జగత్రావదుర్భావం వివిధ మహ మిచ్ఛామి భణితుమ్"

అనెడి యవతారికలోనిశ్లోకమునుబట్టి రామానుజాచార్యుల శిష్యప్రశిష్య సన్తతిలోనియొకభక్తుఁడు రామాయణమువంటికావ్యము నిర్మింపఁ గుతూహలపడి, అది పురాతన మనిపించుకొనుటకు భరద్వాజునిపేరుపెట్టి దీనిని రచియించె నని తెలియవచ్చును. లేక, కవిపేరు భరద్వాజుఁ డైనను గావచ్చును. ఎట్లయిన నిది యర్వాచీనమే.

ప్రసన్నరామాయణ మనునిరువదిరెండుసర్గలకావ్యము సరిగా రామాయణము ననుసరించియున్నది. దీనికర్త, ఆంధ్రుఁడు. శ్రీపతిపుత్త్రుఁడు దేవయార్యుఁడు హారితసగోత్త్రుఁడు. ఈకావ్యము పూర్వోక్త మైనవామనభట్టబాణునిరఘునాథ చరితముతో సాటి యగుచున్నది. ఇట్లు పౌరాణికపురుషులు నాయకులుగాఁ గల కావ్యములలోఁ గీర్తింపఁ దగిన వెన్నేని కలవు. మఱియుఁ బురాణప్రసిద్ధ లైన పార్వతీ సీతా రుక్మిణీ జాంబవతీ త్యాదిమహానాయికలను శివ రామ కృష్ణాదినాయకులు పరిణయ మగుట యనువిషయముతో వెలసిన, పరిణయకావ్యములు నసంఖ్యముగా నున్నవి. అందు జాంబవతీపరిణయ మనుమహాకావ్యము నేకామ్రనాథుఁడు వర్ణించియున్నాఁడు. ఇతఁడు రాణావంశరాజులలో జగదేకరాయులద్వితీయ పుత్త్రుఁ డైనయంకుశరాజు రెండవకుమారుఁ డిమ్మడియంకుశరాజునాశ్రితుఁడు. ఇం దలి మొదటిసర్గలో రాణారాజులక్రమము చూపఁబడినది. శిథిలావస్థలో నున్న

యీకావ్యమునఁగొంతభాగము మాత్రమే పంచమసర్గవఱకుఁ గనఁబడుచున్నది
ఇట్టిదే సీతాపరిణయ మనునైదుసర్గలకావ్య మొకటి సూర్యనారాయణకవికృతము
నముద్రితమై యున్నది. ఇందు బంధకవిత్వముకూడఁ గొంతకలదు. ఈశ్వర
సుమతి రచియించినపార్వతీపరిణయ మెనిమిదిసర్గలకావ్యముగాఁ గనవచ్చును.
అదియుఁ బైవానివలెఁ గవిత్వరమ్యమై యున్నది.

రాజచూడామణిదీక్షితుఁ డనునొకదాక్షిణాత్యకవి రుక్మిణీకల్యాణ మను
పదిసర్గలయుత్తమకావ్యము నిర్మించియున్నాఁడు. ఈదీక్షితుఁడు తంజావూరు
పాలకుఁడైనరఘునాథభూపాలునియాస్థానమున విద్వత్కవియై బహుకృతులు
రచియించినవాఁడు. ముర్త్యంబికాచ్యుతేంద్రులపుత్రుఁడైనరఘునాథుఁడును, పారి
జాతహరణవాల్మీకిచరితనలాభ్యుదయాదికృతులు రచియించినవాఁ డనియతనికృతు
లయవతారికలలోను, ఆనందరాఘవప్రస్తావనలోను గనఁబడుచున్నది. గ్రంథకర్త
యైనదీక్షితుఁడు కామాక్షీసత్యమంగళరత్నఖేటశ్రీనివాసదీక్షితులపుత్రుఁడు. అర్ధ
నారీశ్వరగురునిశిష్యుఁడు.

ఈకవి యవతారికలో వాల్మీకిప్రభృతికవులను బ్రశంసించుచుఁ బదునాల్గవ
శతాబ్దిలోనివామనభట్టబాణుని అగస్త్యుని (విద్యానాథుఁడు) వర్ణించియున్నాఁడు.
ఇతనికవిత తీఁగసాగినట్లు సరసశైలీవిలసితమై మధురముగా నుండును.

రుక్మిణీపరిణయము మఱియొకటి చక్రకవి రచియించెను. అమ్మాలోకనా
థులతృతీయపుత్రుఁడైనయితఁడు తనయన్న లగుపతంజలి రామచంద్ర పండితుల
వద్దనే విద్య నభ్యసించినవాఁడు. సర్గాంతశ్లోకరచనమున నితఁడు గూడశ్రీహర్షు
ననుకరించినవాఁడు. కవిత్వము రసవంతముగానే యుండును. కాని, యిట్టివానిని
లోక మెఱుఁగదు గదా!

అముద్రితగ్రంథపట్టికలోఁ గనవచ్చుపైగ్రంథములవంటికావ్యము లపార
ముగా నున్నవి. వానిలో నేది చూచినను విడువఁదగినది గాఁ గనఁబడదు.
ఒక్కొక్కశాస్త్రమందు పరిపూర్ణ పాండిత్య మార్జించినశాస్త్రపండితులవలెనే
సాహిత్యవిద్యలో నిపుణు లైనపండితు లందఱు గూడ నేదో యొకకావ్యమో
రూపకమో అలంకారగ్రంథమో రచియించుచునే వచ్చి రనుట సత్యము. అందును
దక్షిణదేశమందును, ఆంధ్రదేశమందును గూడ వందలకొలఁదిగ్రంథము లుద
యించినవి. కడచినయేడువందలసంవత్సరములలో నందును బదియేడవశతాబ్ది

1. చూ. మద్రాసుప్రాచ్యపుస్తకాగారమందలి లిఖితపుస్తకపట్టిక 20-(1918)

కడపటివఱకు సంస్కృతమున బహువిధకృతు లుదయించి కొంతకాలము దేశమున సంచరించి సుమారు నూఱుసంవత్సరములుగా వాడుక లేక యణఁగియున్నవి.[1].

క్రీ. ౧౨వ శతాబ్దిలోని కాశ్మీరదేశీయుఁడు గాశ్మీరచరితతంత్రపతియు నైన కవిరాజరాజానకమంఖుకుఁడు నిర్మించినయిరువదియైదుసర్గల శ్రీకంఠచరితము భట్టనోనరాజపుత్త్రుఁ డగుజోనరాజు వ్యాఖ్యానమున విలసిల్లుచున్నది. కవిశేఖరునియొనిమిదిసర్గలహరవిలాసమును, లోలంబరాజు నైదుసర్గలహరివిలాసమును గూడ సవ్యాఖ్యములై మనోహరము లగుచున్నవి. లోలంబరాజు హరిహరమహారాజునాశ్రితుఁ డఁట. ఈరా జెక్కడివాఁడో తెలియదు.[2]. త్రివిక్రమపండితునియుషాహరణమును, శివానందునిదేవావతరణమును, మాధవార్యునినరకాసురవిజయకావ్యమును, కృష్ణకవిభారతవంశకావ్యమును భాషయందు గాని శైలియందు గాని ప్రసిద్ధకావ్యములకుఁ దీసిపోవు. ఉత్ప్రేక్షావల్లభుని భిక్షాటనకావ్యము కొంతకాలము దేశాటనము చేసి యున్నది. శృంగారప్రధాన సుందరీశతకకర్తయైన యితని మొదటిపేరు గోకులుఁ డని యాశతకము తుద నున్నది.

"శ్రీగోకులస్య సుకవే రుత్ప్రేక్షా వల్ల భేత్యభిధా"

భిక్షాటనమున విచిత్రవిషయకము లైనయిరువదిపద్ధతులు కలవు, అందలి యవతారికలోని రెండుశ్లోకములు—

"వృత్తం వసన్తతిలకం విషయ శ్శివస్య
భిక్షాటనం కవి రహో శివభక్తదాసః,
శృంగార ఏవహి రస స్త దిహ ప్రబన్ధే,
శ్రద్ధా న కస్య యది సూక్తివినోద శీలః"

వాణై శ్శివార్చనవిధౌ మమ వాణవాచం
కాదంబరీకృతి చమత్కృతి మప్యుదారామ్,
ఉత్ప్రేక్షయా జగతి వల్లభకీర్తి మస్మిన్
భిక్షాటనే తిలకయన్తు కవీంద్రచంద్రాః"

---

1. చూ. మద్రాసు-తంజాపూరు-బొంబాయి-కలకత్తా-లండన్ లైబ్రరీలలోని లిఖితసంస్కృతగ్రంథపట్టికలు.
2. నానాగుణై రవనిమండలమండనస్య, శ్రీసూర్యసూనుహరిభూమిభుజో నియోగాత్, త్రైలోక్యకౌతుకకరం క్రియతేస్మ కావ్యం, లోలంబరాజకవినా కవినాయకేన— [illegible]—

భిక్షాటనేన పురుహూతపురాంగనానా
మాకస్మికోత్సవవిధాయిని చంద్రమౌళౌ,
తాసా మనంగశరజర్జరమానసానాం
నానావిధాని చరితాని వయం వదామః"

వీటినిబట్టి యీగ్రంథవిషయ మంతయు విదితము. త్రివిక్రమపండితుని పుత్రుఁ డగునారాయణపండితుఁడు పారిజాతాపహరణ మనుమూఁడుసర్గలకృతి రచించెను. దీనికి, క్రీ. ౧౬౩౫ లో, చింతామణిపండితుఁడు వ్యాఖ్య రచియించెను. ఇంక నిట్టి వెన్నేని కలవు. ఆపుస్తకములయు, తత్కర్తలయు, తత్పోషకులయుఁ బేళ్ల యినఁదెలుపుద మన్న గ్రంథవిస్తరభీతి పీడించుచున్నది. అందుచే నికఁగావ్యముల యితరవిభాగము లొకింత చూతము.

సందేశకావ్యములు—ఇవియును సారస్వతమున హెచ్చు కలవు. వీనిని గూర్చి కొందఱిదివఱకు విపులముగా వ్రాసియున్నారు [1]. కావున నీవిషయ మిందు సంగ్రహముగా ముగింతము.

సందేశకావ్యములకుఁ దొలుత దారిచూపినది వాల్మీకిరామాయణములోని హనుమత్సందేశము. ఆదారి ననుసరించి మొదట నడచినది మహాకవికాళిదాసు మేఘసందేశము. తరువాతి వన్నియు దీని ననుకరించి యనుగమించిన వనుట నిర్వివాదము. ఇప్పటికిఁ గనవచ్చినవైతే నేమి వినవచ్చిన వైతేనేమి, సుమారు డెబ్బదిసందేశ—దూత—కావ్యములు కలవు గాని వానిలో నెల్ల సహృదయుల హృదయమున నిల్లుకట్టుకొన్న దీమేఘసందేశ మొకటియే. వానిలో ముప్పాతిక మువ్వీసముకావ్యములు దీనితో సరివత్త మని కాఁబోలు మందాక్రాంతనే వరించినవి కాని, ఆవేషము వేసినంతమాత్రమున నవి మేఘసందేశము లైనవా! అందుచే సందేశకావ్యము కాళిదాసోపజ్ఞ మనక తప్పదు. ఇదే కాదు, పాశ్చ్య కావ్యములలో స్వకపోలకల్పనము కాళిదాసోపజ్ఞ మన్నను సాహసము కాదు.

ఇందలివస్తు వందుమా, అత్యల్పము. కుబేరశప్తుఁ డైనయక్షుఁడు భార్య నెడఁబాసి చిత్రకూటరామగిర్యాశ్రమమునఁ బరితపించుచుఁ దనప్రియురాలికిఁ దనయవస్థ తెలుపు మని మేఘునితోఁ జెప్పుట. ఈచిన్నవిషయము భావప్రపంచ

---

1. చూ. శ్రీచింతాహరణచక్రవర్తిపండితులు కలకత్తాభారతీయోపాసన త్రైమాసికపత్రికలో (1927 సంచికలు) వ్రాసియున్నారు. వారివ్యాసములనుబట్టి శ్రీయాయుణ్ణి వీరరాఘవాచార్యులుగారు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో (1930-31- సంచికలు) తెలుఁగున వ్యాసములు వ్రాసియున్నారు.

మునఁ బడి కాళిదాసప్రతిభచే బహుభంగుల విస్తరించి ౧౧౫, శ్లోకములకావ్య మైనది.[1]. ఇందు పూర్వమేఘమునఁ జిత్రకూటశిఖరమునుండి యలకాపురము నకుఁ బోవుమార్గమును, ఉత్తరమేఘమున నలకాపురయక్షగృహములును వర్ణింపఁ బడినవి. ఇందలిప్రతివర్ణనము కథతోఁ జక్కఁగా నతుకుచు రసోచిత మగు నను టయే యిందలివిశేషము—ప్రధానవిషయ మభూత మపూర్వము. తద్వర్ణనము లోకానుభవసిద్ధము. రసము రసికజనరంజనము. ఈకావ్యరంగమునఁ బ్రత్యక్ష మైనవి సచేతనయక్షుఁడు, అచేతనమేఘుఁడు నను రెండుపాత్రములు. ఇందు మాట లాడున దొకఁడే. కాని, యీకావ్యము చదువునపుడు మన మున్నచోట మన ముండము. ఎన్నో పుణ్యనదులు కన్నులారఁ గాంచియందలిజలము త్రాగుదుము. ప్రకృతిరమ్యము లైనయెన్నో గిరు లెక్కి విహరింతుము పుణ్యక్షేత్రములలోని దేవ తల నెందఱినో దర్శింతుము. మహానగరములు జనపదములు నెన్నో కనువిందుగాఁ గాంతుము. ఎన్నో ప్రకృతిలీలల నుల్లము రంజిల్ల నోలలాడుదుము. ఇంతయేల ? ఉత్తరహిందూదేశ మంతయుఁ గలయఁ దిరుగుదుము. మనమే యక్షుల మగు దుము మనమే మేఘుల మగుదుము. ఆహా! ఇది గదా కవితాశక్తి! అట్టియనిర్వచ నీయ మైనశక్తి కాలవాల మీమేఘసందేశము.

ఇది సుమారేఁబదిమందివ్యాఖ్యాతల నాకర్షించిన దనుటయే దీనిమహి మకు నిదర్శనము. వారిలో వ్యాఖ్యాతృచక్రవర్తి యైనమల్లినాథసూరికి వ్యాఖ్యా రచనము నల్లేరుమీఁద బండి. అట్టిమహనీయుఁడు "మాఘే మేఘే గతం వయః" అన్నాఁ డనుటకంటెదీనిభావగాంభీర్యమును సారస్యమును వర్ణింపఁగలమా ? ఉపా ధ్యాయులు దీనిసారస్యమునకు మఱఁగి దీనిని బంచకావ్యములలోఁ జేర్చిబాల్యము నందే విద్యార్థులకుఁ బాఠము చెప్పుచు వచ్చుట యొకవిధముగా మేలే యైనది గాని, నిజమున కిది కావ్యజ్ఞానముతోఁ బ్రాపంచికజ్ఞానముగూడఁ గొంత యలవడిన పిదపనే పాఠము చెప్పవలసినగ్రంథ మని మాత్రము చెప్పక తప్పదు.

సందేశకావ్య మైనయిందలిసందేశ మేమి యనువిషయమునువ్యాఖ్యాతలు చర్చింపలేదు నిర్ణయింపలేదు. చెప్పవలసినసందేశము నాయకునిచేఁజెప్పింపకయే కవి విడిచియుండునా యని యాలోచించి, యుత్తరమేఘములోనినలువదిరెండవ శ్లోకమందలివిషయమే సందేశమై యుండు నని నాసంస్కృతకవిజీవితమున మున్ను వ్రాసియున్నాను. అది యిది—"ప్రేయసీ! ప్రణయకుపిత వైననీరూపమును శిలా ఫలకమున ధాతురాగములతోఁ జిత్రించి నీపాదములమీఁదఁ బడినట్లు నారూప

1. మేఘదూతశ్లోకసంఖ్య 110 మొదలుగా 121 వరకు వివిధపుస్తకములలో వివిధముగా నున్నది.

మును జిత్రింపఁ దలఁచునంతలోఁ బొరలి వచ్చుకన్నీళ్లచే నాదృష్టి జడమై పోయినది. అకటా! పాడుదైవముచిత్తరువులోఁ గూడ మనసమాగమము సహింపక పోయెను గదా![1]."

"వాగింద్రియము లేనివి, అవ్యక్తవాగింద్రియములు నగు మేఘశుకాదులను దూత్యకర్తకుఁ బ్రయోగించుట యయుక్తిమద్దోషము. విరహావశవశు లగువారున్మత్తులవలె నట్లు సంభాషించుట కల దని సుమేధసు లగుకవు లట్టిదూత్యమును వర్ణించుట యుక్తియుక్తము కాదు" అనుచు మేఘదూత శుకదూతాదిసందేశకావ్యములను భామహుఁ డుదాహరించియున్నాఁడు [2]. అతనిమతమున నిట్టిదూత్యవర్ణన మయుక్తిమద్దోష మైనను, కవులు దీనిని వర్ణించుట యనుచితము కాదు. మేఘము మాటలాడునా? హంస మనుష్యవాక్కుతో సందేశము చెప్పఁ గలుగునా? అనునది విచారణీయ మైన ప్రస్తుతవిషయమే కాదు. యుక్తాయుక్తవివేకశూన్యు లగుకామార్తులవిరహావస్థను వర్ణించునెడ వారిమాటలకు వారిపనులకుఁ దగినకల్పనము గావించి తదవస్థను సహృదయహృదయాహ్లాదకారిగా వర్ణించుటయే కవులపని. అంతే కాని, యట్టికల్పనము గావించినారు గదా యని కవులుగూడ వివేకశూన్యులు గారు. ఇట్టియాక్షేపము వచ్చు నని శంకించుకొనియే కాళిదాస మహాకవి యిట్లు గ్రంథాదియందు సమాధానము చెప్పియున్నాఁడు.

> "ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః,
> సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
> ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యక స్తం యయాచే
> కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు"[3]

అచేతన మైనమేఘ మెక్కడ? మనుష్యుఁడు గొంపోఁదగినసందేశ మెక్కడ? అయినా, యీవిషయ మాలోచింపకయే యక్షుఁడు మేఘుని యాచించెను. కామాంధులు యుక్తాయుక్తవివేక శూన్యులు గదా! అనెడియీయాక్షేప సమాధానము లెఱిఁగియు విమర్శకుఁ డైనభామహుఁ డిట్లాక్షేపించుటకుఁ గారణ మేమో యూహ్యము. ఇతఁ డిట్లనెను గాని, కాళిదాసునాక్షేపసమాధానములను, ఇతనియాక్షేపమును జూచినమహాకవిభవభూతి మేఘదూతయౌచిత్యము మనసార ననుభవించి యందలితనివి దీఱక కాళిదాసపద్యచ్ఛాయ ననుసరించి యీక్రింది

---

1. త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగై శ్శిలాయామిత్యాది—
2. భామహునికావ్యాలంకారము. పరి. 1. శ్లో 42_43_44—
3. మే. పం, 1-5,

విధముగా మాలతీమాధవములో మాధవునిచేఁ దనవార్త మాలతికిఁ దెలుపు మని మేఘునితోఁ జెప్పించెను.

"దైవా త్పశ్యే ర్జగతి విచరన్ మత్ప్రియాం మాలతీం చే
దాశ్వా స్యాదౌ తదను కథయే ర్మాధవీయా మవస్థామ్,
ఆశాతన్తు ర్నచ కథయ తాత్యన్త ముచ్ఛేదనీయః
ప్రాణత్రాణం కథ మపి కరో త్యాయతాక్ష్యా స్స ఏకః"

ఇందలియుత్తరార్ధము సరిగా మేఘదూతలోనియీక్రిందియుత్తరార్ధము ననుకరించి యున్నది.

"ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయశో హ్యఙ్గనానాం
సద్యఃపాతిప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి"

ఇఁక వ్యాఖ్యాతలును పాఠకులును మేఘదూత ననుకరించినకవులును దీని యౌచిత్యము నెంత పొగడిరో లోకమునకుఁ దెలియనిది కాదు. ఇది యిటులుండ, దేవశుని యైనసరమ శత్రువులస్థితిగతులు తెలిసికొని వచ్చి దేవతలకుఁ జెప్పుట ఋగ్వేదమునఁ గలదు. సీతకు శ్రీరామవార్త గొనిపోయినహనుమంతుఁడు సంస్కృతభాషాపరిపూర్ణుఁ డని కవివర్ణించినను, అతఁడు వానరుఁడే. భారతములో నలదమయంతులకు దౌత్యము నిర్వహించినది హంస. వీటినిబట్టి కాళిదాసుకుఁ బూర్వమే యిట్టికల్పన ముండె ననియుఁ దెలియుచున్నది. అయితే, అవి ప్రాణులు; మేఘుఁ డప్రాణి యనవచ్చును. అవి చేతనము లైనను దౌత్యము నిర్వహింపఁ దగినమనుష్యవాక్కు వానికిఁ దెచ్చి పెట్టవలసినదే కదా! ఆ తెచ్చిపెట్టుట చైతన్యముతోఁ గూడ మేఘునికిని దెచ్చి పెట్టవచ్చును. కావున, తేజో వాయు సలిల రూపమహాభూతమయుఁడును సంచరణశక్తియుక్తుఁడును సకలభువనశ్రేయస్కరుఁడును సర్వప్రాణిహితుఁడు నగుమేఘుని గామార్తుఁ డగుయక్షునిదూతఁ గావించిన కాళిదాసుకల్పనము పాఠకాహ్లాదకరమే యని చెప్పవచ్చును. ఈశ్వరునికి హిమాలయునిమామఁ గావించినపౌరాణికకల్పన మాహ్లాదకరము కాలేదా? అట్టి వెన్ని గలవు? వానివంటిదే మేఘదూత్యకల్పనము——

మేఘసందేశ ముపజీవ్యముగా వెలసినవానిలో ముందు గణింపఁదగినది పవనదూత—ఇది ధోయీకవిరాజు నిర్మించినది. ఇతఁడు వంగదేశాధీశ్వరుఁ డగు బల్లాలసేనునికుమారుఁడులక్ష్మణసేనునిసభయందలి పంచరత్నములలో నొకఁ డని, లక్ష్మణసేనునిసభామందిరద్వారముమీఁది శిలాఫలకమున వ్రాయఁబడినయీక్రింది శ్లోకము చెప్పుచున్నది.

"గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః,
కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్య చ"

ఇందలికవిరాజు ధోయీకవిరా జని పవనదూతగద్యమునుబట్టియు, ధోయీకిఁ గవిరాజబిరుద మున్నట్లుదీనికడపటిశ్లోకములలోనికవిక్ష్మాభృతాం చక్రవర్తీ—కవినరపతిః—ఇత్యాదివిశేషణములనుబట్టియుఁ దెలియుచున్నది. ఈ గ్రంథమును బ్రకటించినచింతాహరణచక్రవర్తిగారు నిట్లే వ్రాసియున్నారు. చరిత్రకారులమతమునుబట్టి లక్ష్మణసేనుఁడు క్రీ. ౧౧౭౦—౧౧౮౦ నడిమివాఁడు. కావున గీతగోవిందకారజయదేవగోవర్ధనాచార్యాదులకు సమకాలికుఁ డైనయితఁడును నైకాలమం దారాజసభలోనుండె ననుట విదితము.

లక్ష్మణసేనుఁడు భువనవిజయము గావించినతఱిని, మలయాద్రిమీఁదికనకనగరిలో నివసించుకువలయవతి యనుగంధర్వకన్య యతనిఁ జూచి ప్రేమించి తదేకమనస్కయై కొన్నివాసరము లట్లే కడపి విరహవేదన సహింప లేక మలయపవను నాతనియొద్దకు దూతగాఁ బంపుట యిందలివిషయము. మేఘసందేశములోనిది నాయకవిప్రలంభము, ఇందలిదినాయికావిప్రలంభము. అంతే భేదము. పవనునికి మార్గము చెప్పుట మొద లగుతరువాతివిషయ మంతయు దానియనుకరణమే.

క్రీ. పదియేడవశతాబ్దిలోనిసూరివాదిచంద్రుఁడు రచియించినపవనదూతకావ్యము మఱొకటి కలదు. ఇదియుఁ బరిమాణమందును వృత్తమునందును విషయమందును నైవాని ననుకరించినదే. ఉజ్జయినీరా జగువిద్యాధీశుఁడు ఖగపతి యపహరించినతనభార్య యగుతారాదేవిచెంతకుఁ బవనుని దూతఁగాఁ బంపుట యిందలియితివృత్తము.

హంససందేశము హంసదూత యనునామములు గలవి యైదాఱు కనఁబడుచున్నవి. అందు పూర్వోక్తు లైనవేదాంతదేశికవేంకటనాథాచార్యుల దొకటి. లంకలో నున్నసీతవద్దకు శ్రీరాముఁడు హంసను బంపుట యిందలికథ. ఈకవి కాళిదాసమేఘసందేశములోనిశ్లోకములఁ జక్కఁగా ననుకరించి దానికంటె నెక్కువ రుచిగా నుండవలె నన్నతలంపుతో దీనిని రచియించినట్లు కనఁబడును. ఒకరిద్దఱు దీనిలోనికొన్నిశ్లోకము లందలిశ్లోకములకంటె రసవంతములుగా నున్న వనిరి. కాని, అది వేదాంతదేశికులయందలిగౌరవముతో నన్నది గాని రసపరీక్షణమూలకము కాదు. ఇందు కొకటి—

"శాన్తోద న్త స్సుహృదుపనతః సంగమా త్కించి దూనః"—కాళిదాసు.
"కిం వ స్త్రీణాం జనయతి ముదం కా న్తవార్తాగమో ఽపి" } వేదాంత
"కాన్తాశ్లేషా దధికసులభః కామినాం దూతలాభః" } దేశికులు

ఇందుమూఁడవదాని నటుంచి మొదటిరెంటిని బోల్చిచూతము. "మిత్రుని వల్లఁ దెలియవచ్చినప్రియునివార్త ప్రియసమాగమముకంటెఁ గొంచెముతక్కువ"- అనఁగా, అట్టివార్త సాక్షాత్ప్రియసమాగమానందము కలిగింపదు గాని, తత్తుల్యమైనయానందము కలిగించు నని భావము. ఇది మొదటిపాదమందలిసారస్యము— "మిత్రునివల్ల— తెలియవచ్చినప్రియునివార్తయు స్త్రీలకు సంతోషము కలిగింపదా? అనఁగా సమస్తసంతోషము కలిగించు నని భావము. ఇదిరెండవపాదమందలిసారస్యము. ఈరెంటిలో నేది యుచితతరమో, ఏది లోకానుభవసిద్ధమో విద్వల్లోకము నిర్ణయించుఁగాక.

భట్టవామనకృతహంససందేశమున, శాపహతుఁ డగునొకయక్షుఁడు తన ప్రియురాలికి హంసచే వార్త నంపుట విషయము. మేఘునిస్థానమున హంసను బ్రవేశపెట్టినయిది సర్వవిధములఁ గాళిదాసుసందేశమును బోలిన దనవచ్చును. ఈభట్టవామనుఁడు నలాభ్యుదయాదికర్త యగువామనభట్టబాణుఁ డని యొకరనిరి గాని, అందుకుఁ దగినయాధారములు లేవు. అతనికృతులలోనిగద్యలలో సర్వత్ర వామనభట్టబాణసంజ్ఞ కనవచ్చును. ఇందు భట్టవామనసంజ్ఞ కనఁబడుచున్నది. కావున సరియైనప్రమాణము లభించువఱకు నితఁ డతనికంటె వే అని భావించుటయే యుచితము.

క్రీ. పదునాఱవశతాబ్దిలో గోరూపస్వామి రచియించిన హంసదూతయందు శ్రీకృష్ణుఁడు రాధకు వార్త నంపుట విషయము. ఇది కాళిదాసకృతిబిడ్డయే కాని, యిందలివృత్తము శిఖరిణి. ఇట్లే కవీంద్రాచార్యసరస్వతినిర్మించినమేఘదూతయు, రఘునాథదాసు రచియించినమేఘసందేశమును వినవచ్చును. మఱియొకహంససందేశము వేదాన్తవిషయకమైన దున్నది. దానికర్త యెవరో తెలియరాదు. వారణాసిధర్మసూరి యనుప్రసిద్ధపండితకవి కూడ హంససందేశ మొకటి నిర్మించెను గాని, అది ప్రాకృతభాషలో నున్నది. నవీనపతంజలిబిరుద మందినశ్రీధరపేరు భట్టుచకోరసందేశము శృంగారప్రధానమై సరసముగా నున్నది.

శుకసందేశములు నాలుగైదున్నవి. అందు లక్ష్మీదాసు రచియించిన దొకటి. ఇది పన్నెండుప్రకరణములగ్రంథ మనియు దీనికి, కాలికట్టుప్రభు వని యూహింపఁబడెడిమానవేదరాజు విలాసిని యనువ్యాఖ్య రచియించె ననియుఁ దెలియుచున్నది [1]. ఇందు విరహావస్థలోనియొకపురుషుఁడు భార్యకుఁ దనవార్త నంపుట విషయము. క్రీ. ౧౭ వ శతాబ్దిలోనివాఁడును, అద్భుతదర్పణ మనునాట

---

1. చూ. ప్రాచ్యపుస్తకభాండాగారము—అముద్రితగ్రంథపట్టిక-20-మద్రాసు 1918—

కము రచియించినవాఁడును దక్షిణదేశీయుఁడు నగుమహాదేవకవియు; క్రీ. ౧౭౦౦ లోనివాఁ డగుయాదవచంద్రవిద్యారత్నకవియు; రంగాచార్యకవియు నిర్మించిన శుకసందేశములు సజీవములై యున్నట్లు తెలియవచ్చును. దేవులపల్లి నరసింహశాస్త్రినిర్మిత మైన దాధునిక మొకటి కలదు. అందు, సింహాచలనివాసిని యగు నొకరాజపత్ని జూదములో రాజ్యము పోఁగొట్టుకొన్న తనప్రియునిగూర్చి విచారించుచుఁ జెన్నపురిలోనియొకన్యాయవాదికడకు శుకమును బంపుట యనువిషయము వర్ణితము. కీరదూత మనునొకటి రామగోపాలుఁడు నిర్మించిన దున్నది. నవద్వీపరాజును వివాదార్ణవసేతుకర్తయు నగుకృష్ణచంద్రునియాస్థానములోనివాఁడీకవి యని తెలియుచున్నది. ఇందు గోపికలు మధురలో నున్న కృష్ణునియొద్దకుఁ గీరమును బంపుట వర్ణింపఁబడినది.

చంద్రదూత మనుపేరఁ గృష్ణచంద్రతర్కాలంకారుఁడు, జంబూకవి, వినయప్రభువు, ననుముగ్గురు రచియించినకావ్యములు కలవు. మొదటిదానిలో సీత రామునికడకుఁ జంద్రుని బంపుట విషయము. వినయవిజయగణి యనుజైనకవి రచియించినయిందుదూతమున యోధపురప్రాంతములందలి జైనక్షేత్రములు వర్ణింపఁబడినవి.

కృష్ణుఁడు గోపికలకడ కుద్ధవుని బంపుట యనువిషయముతో శ్రీరూపగోస్వామి రచియించిన శ్లోకయుద్ధవదూతమును, ఈవిషయముతోనే మాధవశర్మ నిర్మించినయుద్ధవదూతము మఱియొకటి యుఁ గలవు. కడపటిది వ్రాఁతప్రతిలోని సమయమునుబట్టి క్రీ. ౧౭౦౦ ప్రాంతమునఁ బుట్టిన దని తెలియుచున్నది. కుక్కుటక్రోడ (కాలికట్టు) ప్రభువు లైనరవివర్మ గోదవర్మలయాశ్రితుఁడై పేరుపొందిన వాసుదేవకవి యనునతఁడు భృంగసందేశము నిర్మించి తనకుఁ బంపఁగా దానిని జూచి యుద్దండకవికుంజరుఁడు కోకిలసందేశము రచియించి యాతనికిఁ బంపె ననియొకకింవదంతి కలదు. ఇం దొకకాముకుఁడు కేరళదేశములో నున్నతనకాంతకు గోకిలచే సందేశ మంపుట వర్ణితము. ఈయుద్దండకవియే మల్లికామారుత మను ప్రకరణము రచియించినవాఁ డనునభిప్రాయమును వీరరాఘవాచార్యులుగారు సమర్థించియున్నారు. అందుచే నితఁడు క్రీ. ౧౪౦౦ ప్రాంతమున నున్నవాఁ డని తోఁచుచున్నది. నృసింహకవియు, తాతయకుమారుఁ డగువేంకటాచార్యుఁడు ననువారు, గూడఁ గోకిలసందేశములు రచియించి రని తెలియుచున్నది.

కాళిదాసు మేఘసందేశములోనిశ్లోకములనాల్గవపాదములు గ్రహించి తక్కిన మూఁడేసిపాదములు పూరించి కొందఱు సందేశకావ్యములు రచియించిరి. అందు మేఘదూత సమస్యాలేఖ యొకటి. దీనికర్త మేఘవిజయకవి. "క్రీ. ౧౬౬౯ లో సమాప్తి గాంచినహైమకౌముది యనునితనివ్యాకరణగ్రంథమే భట్టోజీదీక్షితుల

సిద్ధాంతకౌముది కాదర్శ* మని కొందఱనిరి గాని, యది భ్రాంతిమూలకము. ఇతఁడు హైమకౌముది రచియించెనా లేదా యనువిచారణీయవిషయ మటుండ క్రీ. ౧౬౪౦ ప్రాంతమందలి భట్టోజీదీక్షితులకు, క్రీ. ౧౬౭౧ లో మేఘదూతసమస్యాలేఖ పూర్తి గావించినయితఁడు పూర్వుఁ డనుట పొసఁగదుగదా! కావున నితఁడు దీక్షితుల కించుకసమకాలికుఁడై యతనితరువాతఁ గూడ నున్నవాఁ డని చెప్పవచ్చును. ౧౨౯ శ్లోకములతోడిచేతోదూతయు, విక్రమకవి నిర్మించిన నేమిదూతయు, చారిత్ర సుందరగణిరచియించినశీలదూతము నిట్టివే. ఇట్టివానిలో—

క్రీ. ఎనిమిదవశతాబ్దిలోనిజినసేనుఁడు రచియించినపార్శ్వాభ్యుదయము మొదటిది. ఇది సందేశకావ్యము కాదు. ఇందు పార్శ్వనాథుఁ డనుజైనాచార్యుని చరిత్రము వర్ణింపఁబడినది. పైగ్రంథములు దీని ననుకరించి కాళిదాసశ్లోకతురీయ పాదములను స్వీకరించుట యారంభించినవి.

ప్రబంధచింతామణికర్తకంటె వేఱైనమేరుతుంగకవి జైనమేఘదూతము నిర్మించెను. ఇందు సంసారవిముఖుఁడై లేచిపోయిన నేమినాధునికడ కతనిసతి మేఘుని దూతఁగాఁ బంపుట విషయము. క్రీ. ౧౭౦౬ లో వైద్యనాథభట్టు శ్రీకృష్ణునిచెంతకు గోపికలు తులసిదళమును బంపుట యనువిషయముతోఁ దులసీ దూతము నిర్మించెను. ౧౭౨౩ లో, నవద్వీపరాజయినరఘురామరాయమహో దయునియాస్థానకవి యైనమహోపాధ్యాయకృష్ణకవిసార్వభౌముఁడు పదాంగ దూత నిర్మించెను. ఇందు గోపికలు శ్రీకృష్ణపదచిహ్నము నర్థించుట విషయము. శ్రీకృష్ణునకు దూత నంపుట యనువిషయముతో, పాంథదూత పికదూత మొదలైన వింకను గలవు. నైయాయికశిఖామణియు వార్తికాకారుఁడును విద్యావాచస్పతిపౌత్రుఁడును విద్యానివాసపుత్రుఁడు నగురుద్రన్యాయవాచస్పతి భ్రమర దూతము రచియించెను. ఇందు జానకీరాముల వృత్తమే వర్ణింపఁబడినది.

మనోదూతకావ్యములు నాలుగు కనఁబడుచున్నవి. ఇవి భక్తిరసప్రధాన ములు. ఇం దొకటి వంగదేశీయుఁడైనవిష్ణుదాసుఁడు నిర్మించినది. మఱొకటి యితనివంశములోనివాఁ డయినరామకవి కల్పించినది. తక్కిన రెంటికర్తలనామ ములు తెలియరావు. ఇట్లే వింజమూరివీరరాఘవాచార్యుఁ డొకమానససందేశ మును మహామహోపాధ్యాయలక్ష్మణసూరి యొకమానససందేశమును రచియిం చిరి. ఈసూరిమహాశయుఁడు విప్రసందేశముగూడ నిర్మించెను. ఇట్లాధునికులు రచియించినవియుఁ గొన్ని గలవు. వానిలో—

యక్షసందేశము లేక యక్షోల్లాసము— కాళిదాసమేఘసందేశపూరణపర జైనమీకావ్యమును నిర్మించిన యతఁ డభినవకాళిదా సనఁబడు శ్రీకృష్ణమూర్తి

మహాకవి. ఆంధ్రగీర్వాణములందును సంగీతశాస్త్రమందును, అందెవేసినచేయి యగుసీవిద్వత్కవి పీఠికాపురసంస్థానాధీశ్వరు లగుశ్రీ రాజా రావుగంగాధరరామా రావుబహద్దరువారిసత్కృతి నందినవాఁడు. హరికారికాసర్వకామదాపరిణయాది బహుగ్రంథకర్త యగునితఁడు క్రీ. ౧౮౭౦ ప్రాంతమున స్వర్గస్థుఁడయ్యెను. కోన లేయవైదికుఁడు సర్వశాస్త్రిపుత్రుఁడు నైనయీమహావిద్వాంసుఁడు లంకావిజయ కర్త యైనపిండిప్రోలులక్ష్మణకవికి సమకాలికుఁడు. యక్షునిప్రార్థనము విన్న మేఘుఁడు దయతో మారుతప్రేరితుఁడై యలకాపురము వెళ్లివచ్చుట మొదలుగా యక్షుఁడు శాపావసానమున స్వపురమున కేగి భార్యతో సుఖముగా నుండుట యనునంతవఱకుఁ గలకథ యీయక్షోల్లాసమున వర్ణింపఁబడినది. ఇందు కుదాహరణములు—

"సానుక్రోశ స్సపది స ఘన స్సమ్య గాలోచ్య కార్యమ్,
నిర్యా యాగా న్నిజపథగతో మారుతప్రేరితో ఽగాత్"
"క్రీడ త్ఖేటం పునరపి కృతీ ప్రాప తం చిత్రకూటమ్"
"వధ్వా సాకం చిర మనుభవన్ వాసవ శ్రీనిధానం,
ప్రాసాదం స్వం సురగిరిసదృ గ్భాస మాసాద్య రేజే"

దూతగా వచ్చినమేఘునితో యక్షకాంత తనస్థితిగతులు చెప్పుట యను విషయముతో మేఘప్రతిసందేశ మనుపేర మండికల్లు రామశాస్త్రి నిర్మించినదియు, యక్షునిభార్య తనభర్త విధించినశాపము తొలఁగింపు మని కుబేరుని బ్రార్థించుట, అతఁ డట్లుచేయుట భార్యాభర్తలసమాగమము ననెడివిషయములతో మేఘదౌత్య మనుపేరఁ ద్రైలోక్యమోహనగుహనియోగికవికీర్తి రచియించినదియుఁ గలవు. వీటిని బోలినదే—

ఘనవృత్తము—ఇది రచియించినమహాపండితుఁడు సుప్రసిద్ధనామధేయుఁడగుకోరాడ రామచంద్రశాస్త్రి. ఆంధ్రగీర్వాణసాహిత్యనిధి యైనయీవిద్వత్కవి యుభయభాషలందును బెక్కుగ్రంథములు నిర్మించెను. ఏఁబదిసంవత్సరముల క్రిందటియీవిద్వన్మణి యక్షయాచితుఁ డైనమేఘుఁ డలకాపురము వెళ్లి వార్త చెప్పుట యక్షకాంతస్థితి తెలిసికొనివచ్చుట యక్షీయక్షులసమాగమము ననువిషయములతో నీకావ్యము నిర్మించెను. ఈక్రిందియారంభశ్లోకమువల్ల దీనిశైలియుఁ గవిత్వరుచియుఁ దెలియఁగలవు.

"ఇత్యుక్తో ఽసౌ సపది జలద స్తేన దీనాత్మ నాలం
శ్రుత్వా కామం సరసహృదయ ప్రాగ్రణీత్వా త్ప్రహృష్టః
లోకే దీనావన మనుపమం పుణ్య మాద త్త ఏవం
సంతః ప్రోచు స్తదిహ హి మయా లోషణీయ స్సఖా మే,"

ఇంతకు మున్ను పేర్కొన్నసందేశకావ్యములలోఁ జాలావఱకుఁ గల్పిత ములే. వీనివలెనే కల్పితములు నీతిదాయకములు నైనమఱికొన్నిటిని జూతము—

కల్పితకావ్యములు—క్రీ. ౭౮౦ ప్రాంతమునఁ గాశ్మీర మేలినజయాపీడుని యాస్థానమున ముఖ్యమంత్రియు విద్వత్కవియు నైనదామోదరగుప్తుఁడు రచియించిన ౯౩౭ ఆర్యాశ్లోకములతోడి కుట్టనీమత మనెడికావ్యము లోకజ్ఞానదాయకమై వెలయుచున్నది. కాశీనివాసిని యగుమాలతి యనువారాంగన యొకనాఁడు మేడపై నుండి వీథిని బోవునొకగాయకుఁడు పఠించిన—

యౌవనసౌందర్యమదం దూరే ణాపాస్య వారవనితాభిః,
యత్నేన వేదితవ్యాః కాముకహృదయార్జనోపాయాః.

అనుశ్లోకము విని మేడ దిగి యాపురమున దూతీకృత్యము నిర్వహించు వికరాల యనుకుంటెనకత్తెయింటి కేగి విటుల వశపఱుచుకొనునుపాయములు తెలుపు మని వేఁడఁగా, అది సోదాహరణముగా వాని నుపదేశించుట యిందలి వస్తువు. ఈగ్రంథము చదివినవారు వారకాంతలమాయ లెఱిఁగి వానికి లోఁబడకుండుట కవియభిప్రాయము. సరసశైలితోడియీకావ్యము చిరకాలము మఱుఁగు పడియుండ, పేటర్సనుపండితుఁడు ౧౮౮౭ లో దీని నుద్ధరించి కావ్యమాలవారి కిచ్చి ప్రకటింపఁజేసెను.

క్రీ. ఎనిమిదవశతాబ్దిలో నుదయించిన 'అమరుశతకము' దీనివలె నీతి గఱపునది గాకున్నను, శృంగారప్రధానమై రసికరంజక మగుచున్నది. శంకరాచార్యుఁడు కార్యవశమున, అమరుకరాజుదేహమునఁ బ్రవేశించి దీనిని రచించె నని కింవదంతి. కాని, దీనివ్యాఖ్యాతలలో, పెదకోమటివేమభూపాలుఁడును, అర్జునదేవవర్మయుఁ గూడ నమరుకుఁడే దీనికర్త యని తెలిపియున్నారు. ధనికాదిలాక్షణికులు పెక్కుసందర్భముల నిందలిశ్లోకము లుదాహరించుటయే దీనియుత్తమత్వమును దెలుపఁగలదు. మమ్మటాదిమహాలాక్షణికులు వ్యంగ్యమున కుదాహరించినయీక్రిందిశ్లోక మిందలిదే—

"నిశ్శేషచ్యుతచన్దనం స్తనతటం నిర్మృష్టరాగో ఽధరో
నేత్రే దూర మనఞ్జనే పులకితా తన్వీ తవేయం తనుః,
మిథ్యావాదిని దూతి! బాన్ధవజన స్యాజ్ఞాతపీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమ స్యాన్తికమ్."

ఇందలి ౧౦౨ శ్లోకములలోను బ్రతిశ్లోక మిట్లురస మొలుకుచు మనోహర మగును. లోకప్రసిద్ధ మైనవేమభూపాలవ్యాఖ్య దీని ఖ్యాతిని మఱింత విస్తరింపఁ జేసినది.

సంగీతచింతామణి యనుమతియొకకృతి నిర్మించినవీరనారాయణుఁ డనఁబడునీ వేమభూపాలుఁడు వ్యాఖ్యావతారికలో స్వీయవంశవర్ణన కొంతగావించియున్నాఁడు. తదనుగుణముగానే యితనికనిష్ఠపితామహుఁ డైనవేమభూపునిద్వితీయపుత్రుఁ డన వేమభూపతి, లోహితగోత్రుఁ డైనయిమ్మడీంద్రున కిమ్మడిలంకగ్రామ మగ్రహారముగా నిచ్చుచు వ్రాయించినతామ్రశాసనమందును వేమవంశవర్ణన కలదు [1]. ఆశాసనములోనికాలబోధక శ్లోక మిది—

"శాకాబ్దే గగనాభ్రవిశ్వగణితే సిద్ధార్థిసంవత్సరే,
మాఘే కృష్ణచతుర్దశీశివతిథౌ వీరాన్న వేమప్రభుః"

ఇందలి 'గగనాభ్రవిశ్వ' శబ్దములకు శా. శ. ౧౩౨౦ అర్థమని, త. గణపతిశాస్త్రిగారు నలాభ్యుదయ (అనంతశయనముద్రణము) పీఠికలో నిర్ణయించిరి. వా రెట్లు నిర్ణయించిరో తెలియదు గాని, ఇది సిద్ధార్థిసంవత్సరమునకు సరిపడదు. అనవేమభూపాలునిజీవితకాలమునకును సరిపడదు. ౧౩౬౧, ౧౩౦౧, ఇవి సిద్ధార్థికి సరిపడును. కాని ౧౩౬౧ లో నీ రాజున్నట్లు ప్రమాణము కనఁబడదు. శా. శ. ౧౨౯౮ అగునలసంవత్సరమాఘపూర్ణిమాదినమందు, అనవేమభూపాలుఁడు తమకులదేవత యగుమూలగూరమ్మకు మూఁడుగ్రామము లిచ్చినట్లు అమీనుబాదాశిలాశాసనములోనిసీసము చెప్పుచున్నది [2].

"శాకాబ్దములు సహస్రమును నిన్నూటతొంబదియెనిమిది యగుభవ్యసంఖ్య,
కలిగి యొప్పారెడి నలవత్సరంబున మాఘమాసముపూర్ణిమాదినమున,
విశ్వోత్తరుం డనవేమభూపాలుండు—" ఇత్యాది—

ఈరెండుశాసనములలోని యనవేమభూపాలుఁ డొకడేకాని, యిద్దఱును వేఱుగారు. కావున, శా. ౧౩౦౦ ప్రాంతమున రాజ్యముచేసిన యనవేమభూపాలుఁడు శా. ౧౩౨౦ లోఁ బై తామ్రశాసనమువ్రాయించె ననుట పొసఁగదు. అందుచే శాసనములోనియక్షరములు పఠించునపుడు గలిగినప్రమాదమువల్ల 'గగనాభ్రవిశ్వ' పాఠము వచ్చెనేమో యనియు, ఇది సరియైనపాఠమే యైనచో నర్థము సందిగ్ధమనియు సిద్ధార్థికి సరిపడ దనియుఁ జెప్పవలసియున్నది. అనవేముఁడు తప్పక, శా. ౧౩౦౦ ప్రాంతమువాఁ డనుటకు, అతనిపెత్తండ్రిమనుమఁడైన మనగ్రంథకర్త యగువీరనారాయణుఁ డనఁబడు వేమభూపాలునికాలమందలి యొకధర్మశాసనము

1. చూ. శృంగారదీపికావతారిక. మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకపట్టిక. నం. 20
చూ. కావ్యమాలాప్రకటితప్రాచీనలేఖమాల. నం. 143 శాసనము
2. చూ. ఆంధ్రసాహిత్యపరిషత్తుశాసనపద్యమంజరి, శాసనము 68.

ప్రమాణ మగుచున్నది.[1] ఫిరంగిపురశాసన మనఁబడెడియాక్రింది ధర్మశాసన కావ్యము సంస్కృతాంధ్రముల రచియించినవాఁడు శ్రీనాథకవిసార్వభౌముఁడు. వీరశ్రీవేమభూపతిసభలోవిద్యాధికారి, తటాకప్రతిష్ఠారూపధర్మకర్త్రి వీరనారాయణవేమభూపతిధర్మపత్ని సూరమాంబ. శాసనభాగము కొంత—

"శాకాబ్దములు సహస్రమును మున్నూటముప్పదియొక్కఁడును నైనభవ్యసంఖ్యా, వళులు విరోధిసంవత్సరంబున ఫాల్గునంబున బహుళపక్షంబు విదియ...,
వీరనారాయణుఁడు వేమవిభునిదేవి "భూరిసద్గుణనికురంబసూరమాంబ—"

ఈశాసనకాల మైన, శా. ౧౩౩౧ విరోధిసంవత్సరము, సరియగును. కావున, అన వేముఁడు క్రీ. ౧౩౭౦ ప్రాంతమున రాజనియు, మనవ్యాఖ్యాత వేమభూపాలుఁడు క్రీ. ౧౪౧౦ ప్రాంతమున రా జనియు విశ్వసింపనగును. శా. శ. ౧౩౩౭ లో, సముదారిరాయవేశ్యాభుజంగాదిబిరుదవిభాసితుఁ డైనవ్యాఖ్యాతృవేమభూపాలుని పుత్త్రుఁ డగురాచవేమభూపుఁడు తల్లి త్రవ్వించినసంతానసాగరమనుతటాకమునకు, కాలువ త్రవ్వించె ననెడిశ్రీనాథనిర్మిత మైనమఱియొకశాసనము గూడఁ బైవిషయమును బలపఱుచుచున్నది. ఈసమయము క్రీ. ౧౪౧౫ ఇఁక నిది యిట్లుండ నిండు—

పూర్వోక్తుఁ డైనగోవర్ధనాచార్యుఁడు ౭౦౦ ఆర్యాశ్లోకములు గలయార్యాసప్తశతిని సహృదయరంజకముగాఁ గల్పించియున్నాఁడు. చదువ నింపైనయీగ్రంథము ముద్రిత మైనది. విద్వద్వినోదార్థము తా నీకృతి సృజియించినట్లును దీనిని దనశిష్యుఁ డైనయుదయనుఁడును సోదరుఁ డైనబలభద్రుఁడును జక్కఁబఱిచి వ్యాప్తికిఁ దెచ్చినట్లును, ఈక్రిందివిధముగాఁ గవి చెప్పియున్నాఁడు.

"కవిసమరసింహనాదస్స్వరానువాదః ? సుధైకసంవాదః
విద్వద్వినోదకన్దః సందర్భో ఽయం మయా సృష్టః,
ఉదయనబలభద్రాభ్యాం సప్తశతీ శిష్యసోదరాభ్యాం మే
ద్యౌ రివ రవిచంద్రాభ్యాం ప్రకాశితా నిర్మలీకృత్య,...
అకృ తార్యాసప్తశతీ మేతాం గోవర్ధనాచార్యః"

కాశ్మీరదేశరా జైనశ్రీహర్ష దేవుని వర్ణించుచు ౨౫ పద్యముల రాజేంద్రకర్ణపూర మనుచిన్నకావ్యము నిర్మించినశంభుకవి, అన్యోక్తిముక్తాలత యనునొకశతకము నిర్మించియున్నాఁడు. హర్షదేవునికాలమునుబట్టి యితఁడు క్రీ. ౧౦౮౦—౧౧౦౦ నడుమ నీకావ్యము నిర్మించినట్లు తెలియుచున్నది. రసభావగర్భనిర్భర మైనయిది

1. చూ. సై. శాసనము 73.

చదువ నింపుగానున్నది. పక్షులమీఁదను, చెట్లమీఁదను, పువ్వులమీఁదను బెట్టి వర్ణించినయిందలివిషయము లోకజ్ఞానదాయకము. వీరేశ్వరభట్టునన్యోక్తిశతకమును, మిథిలావాసి యైనమధుసూదనకవియన్యాపదేశశతకమును బైదానివలెనే హృద్యములై యున్నవి. ఇవి యన్నియు కావ్యమాలలో ముద్రితములు.

ఈసందర్భమున నెన్నఁదగినది పండితరాయలభామినీ విలాసము. ప్రాస్తావిక శృంగార కరుణా శాంతము లనుభాగముల విలసిల్లునిది కల్పితము లైన వైనోదికకావ్యములకు శిరోభూషణ మనఁదగును. ఇతనిచాటువులు వందలు వేలు గలవు. భామినీవిలాసములో లేనివి వంద లన్యాపదేశపరము లైనశ్లోకములు వినవచ్చును. కీర్తిశేషు లైనశ్రీతునిరాజావారు పండితరాయలశ్లోకము లన్నియు సమకూర్చి ప్రకటింపఁజేసిరి. అందలివిభాగము సముచితము గాలేదు. ఇతరులశ్లోకములు గూడ నందు కనఁబడుచున్నవి. అట్టివానిని దీసివేసినను జగన్నాథపండితరాజు శ్లోకములు సహస్రమునకుఁ దక్కువ కా వనవచ్చును.

"దిగన్తే శ్రూయన్తే మదమలినగణ్డాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలు మృగాః
ఇదానీం లోకే ఽస్మి న్ననుపమశిఖానాం పున రయం
నఖానాం పాణ్డిత్యం ప్రకటయతు కస్మిన్ మృగపతిః"

ఈశ్లోకము రాజావారికూర్పులోని 'సింహః' అనుశీర్షిక క్రింద నున్నయిరువదిశ్లోకములలో నొకటి. ఇది ముద్రిత మైనభామినీవిలాసమున గ్రంథారంభమున నున్నది.

అప్పయదీక్షితులు చిత్రమీమాంస రచియించుటయు, ఆకాలముననే పండితరాజు దానిని ఖండించుటయుఁ బ్రసిద్ధముకదా! ఆసందర్భములోఁ బండితరాజు, శాస్త్రవాద మొనరింప నప్పయదీక్షితులయింటికి వచ్చెనఁట. అతఁడు జాతిభ్రష్టుఁ డన్న హేతువున నప్పయదీక్షితు లతనికిఁ గనఁబడకుండెనఁట. విదుషి యైనదీక్షితులకూఁతురును శిష్యులును గనవచ్చినను వారు సంభాషింపఁ దగ రని యెంచి పండితరాయలు తిరిగిపోవుచుఁ బై శ్లోకము చెప్పెనఁట. ఈకింవదంతి యెంత నిజమో! అతని ప్రాణాభరణకావ్యము గూడ నవ్వు పుట్టించుచు నీతిగఱపుచు మనోహర మగుట ప్రసిద్ధము. ఇది కామరూపదేశాధీశ్వరప్రాణనారాయణరాజ స్తుతిపరము.

పండితరాయలయన్యాపదేశపద్ధతి ననుకరించినవారు మఱికొందఱు గలరు. వారిలో వాంఛేశ్వరుఁ డొకఁడు. ఇతఁడు తంజావూరుపాలకు లైనభోసలవంశ

రాజులయమాత్యులలోనివాఁడు ప్రతాపసింహునియాస్థానమున నమాత్యుఁడు విద్వత్కవి. ఇతనికృతి మహిషశతకము [1]. దీని కితనిమునిమనుమఁ డైనవాంఛేశ్వరుఁడు క్రీ. ౧౮౧౩ లో, వ్యాఖ్యనిర్మించెను. ఆరెంటినుండి యీక్రిందివిషయము తెలియుచున్నది.

"శ్రీమద్భోసలవంశదుగ్ధజలధేః సమ్పూర్ణచంద్రోపమో,
యః శాస్తి క్షితి మక్షతి క్షితిపతి ర్మూర్తః ప్రతాపః స్వయమ్,
దీర్ఘాయు ర్జితశత్రు రాత్మజయుతో ధర్మే ప్రజారాగవా
నుల్లాఘో ఽస్తు స చిన్తితై ర్నిజసభాస్తారైః క్రమా దాగతైః"
"నానాజిప్రభుశాహజీంద్రశరభేంద్రానందరాయాదయో
విద్వాంసః ప్రభవో గతాః శ్రితసుధీసందోహజీవాతవః,
విద్యాయాం విషబుద్ధయో హి వృషలాః సభ్యా స్త్విదానీ న్తనాః,
కింకుర్వే ఽమ్బ! కృపే వ్రజామి శరణం త్వా మేవ విశ్వావనీమ్"...
"తత్ర తంజాపురం నామ రాజస్థాన మనుత్తమమ్,
రాజానః ప్రథితా స్తత్ర భోసలీయాన్వవాయజాః,
తదమాత్యకులోత్పన్నః శ్రీమాన్ వాంఛేశ్వర స్సుధీః,
శిష్టః కర్ణాటజాతీయో వేదవేదాఙ్గపారగః...
మహిషవ్యాజతో రాజబుద్ధిం చక్రే సునిర్మలమ్,
తస్య నప్తా మాధవార్యపౌత్రః శ్రీనరసింహతః,
వాంఛేశ్వరో లబ్ధజన్మా పితృప్రోక్తేన వర్త్మనా,
వ్యాఖ్యాస్యే తం ప్రణ మ్యైత న్మాహిషం శతకం ముదా,
కాశ్యాం రచితా మాహిషశతకవ్యాఖ్యా సుధీముదే భూయాత్,
బాణాగ్న్యద్రీందుమితే శకకాలే—"

దీనినిబట్టి ప్రతాపసింహవాంఛేశ్వరులు క్రీ. ౧౭౫౦ ప్రాంతమునఁ దంజావూరుపురమున నుండి రని తెలియఁ గలదు. నానాజీమొద లగురాజులకును, ఆనందరాయఁడు మొదలగువిద్వన్మంత్రులకును సదన మైనతంజాపురసంస్థానము నేఁటికి దురాత్ము లగుసభ్యుల కాకర మైన దన్నమూలక ర్తమాటలనుబట్టి, ప్రతాపసింహుఁడు సభలో దుష్టులకుఁ జో టిచ్చుట కనిపెట్టి యతనిబుద్ధి మార్ప నన్యాపదేశముగా నీశతకము కూర్చె నని విదిత మగును. వ్యాఖ్యాత, అవతారికలో,

1. ఘనశ్యాముఁ డనుకవి యొకఁ డాకాలమున వాంఛేశ్వరుని ప్రత్యర్థియై యుండెను. అతఁడు డమరుక మను పేర నిట్టికృతియే నిర్మించెను. దానికి రాజశేఖరుఁడు వ్యాఖ్య నిర్మించెను. కాని, ఆమూలవ్యాఖ్యలు రెండు నణఁగి యున్నవి. చూ. తంజా. లైబ్రరీ.—

"రాజు చిన్నవాఁడై ఖలులను జేరఁదీసి వారితో నాటలాడుచు మంత్రిహితవచనములు వినకుండనుండ, అతనిని సన్మార్గమునకుఁ ద్రిప్పుట కీశతకము కవి నిర్మించెను"అని వ్రాసినదియుఁ బైయభిప్రాయమును బలపఱుచుచున్నది.

ఈవ్యాఖ్యాత వాంచేశ్వరుఁడే హిరణ్యకేశిశ్రౌతసూత్రమునకు వ్యాఖ్య వ్రాయుచు దానియవతారికలో, తాను శరభమహారాజనికటవర్తి ననియు, సాంబసదాశివగురుశిష్యుఁడ ననియు, షడ్దర్శనీపారగుఁడ ననియు, కాశీయాత్రచేయఁ బోవుచు దారిలోఁ గృష్ణాతీరమునందు పట్టవర్ధనవంశరాజు లగురామచంద్రహరిమహాదేవగణపతు లనురాజసోదరులయాదరము గాంచితి ననియు వ్రాసికొనెను.

లోకవిమర్శనరూపము లోకజ్ఞానదాయకము నైననీలకంఠదీక్షితునికలివిడంబనమును, అన్యాపదేశమును జిన్నకావ్యము లైనను, చదువ నింపుగానుండును [1]. ఈదీక్షితుఁడు గాక, వాంచి (తిరువాన్కూరు) పురనాథుఁ డగురామవర్మయాస్థానములోనివాఁ డగుమఱియొకనీలకంఠదీక్షితుఁడు వర్ణనాసారసంగ్రహ మనుపెద్ద గ్రంథ మొకటి సమకూర్చియున్నాఁడు. ఇది సుభాషితరత్నావళివంటిసంకలన గ్రంథము. ఇందు చంద్రశతకము కీర్తిశతకము ప్రతాపశతకము రాజవర్ణనశతకము అన్యాపదేశశతకము కవీశ్వరవర్ణనశతకము రాజనిందాకవినిందాశతకము—ఇత్యాదిగాఁ బదునెనిమిదిప్రకరణములు కలవు. ఇందు లేనివర్ణన లే దనుటయతిశయోక్తి కాదు. ఈగ్రంథ మముద్రితము [2]. చాటువులును, ఇతరగ్రంథస్థములును, కల్పితములు నైనశ్లోకము లిందు ౧౮ వంద లున్నవి. రామవర్మరా జీగ్రంథనిర్మాతకు బ్రబంధసాగరుఁ డనుబిరుద మిచ్చియున్నాఁడు. ఇందలితక్కినవర్ణన లెటు లున్నను మొదటిపదునెనిమిదిశతకములు లోకజ్ఞానాకరము లనవచ్చును.

ధర్మదాసుఁ డనుకవీంద్రుఁడు స్వయముగా నిర్మించినవిదగ్ధముఖమండన మనుకావ్యము నిక్క మైనోదికమై నాలుగుపరిచ్ఛేదముల వెలయుచున్నది. కాని, పొడుపుడుకథలవంటిశ్లోకములతోడియిది చదివినంతనే యర్థస్ఫోరకము కాదు. ఇందలివి రెండుశ్లోకములు.

"అనేకసుషిరం వాద్యం కాన్తం స్త్రీముఖపఙ్కజమ్,
విద్ధి తత్ త్ర్యక్షరం రాజన్ చక్షుశ్శ్రోత్ర సుఖావహామ్"
"బాణశ్చ పఞ్చబాణశ్చ ద్వా విమౌ హృదయంగమౌ,
యాభ్యాం కాదంబరీహర్షచరితార్థః కృతో జనః"

---

1. ఇందు, కలివిడంబనము నే నాంధ్రీకరించి ప్రకటించితిని.
2. మదరాసుప్రాచ్యపుస్తకభాండాగారమున నున్నది.

అప్పయదీక్షితులవంశములోని 'ఆచ్చాన్' అనుకవి రచియించినయన్యోక్తిమాల యొకటి కలదు. అదియుఁ బైవానివలె హాస్యకరమై నీతిదాయక మగుచున్నది. ఈకవి రచియించినవి, అద్వైతరసమంజరి నరాభరణము ననుమఱిరెండు గ్రంథములు కలవు. ఇతఁడు తన్నుఁ గూర్చి యిట్లు చెప్పుకొనెను.

"గోపాలార్ణవనామ్ని గ్రామే మృదుసూక్తిమల్లికారామే
ఆకలితవసతి రాచ్చా నకరో దన్యోక్తిమాలికా మేతామ్"

ఈగోపాలసముద్రము తంజావూరుజిల్లాలోనిమన్నారుగుడికి సంబంధించినట్లు తెలియుచున్నది. ఇది గాక, అహోబలసుధీపుత్రుఁ డైనలక్ష్మీనరసింహకవి నిర్మించినయన్యోక్తిమాల మఱియొకటి యున్నది. అందు, కోకిల ఘూక గరుడ సింహాదు లయినయన్యోక్తు లనేకములు కలవు. అది పండితరాయలయన్యోక్తి కనుకరణ మనుట స్పష్టము. కవితామృతకూప మనునది పైవానివంటిదే గారమోహనుఁడు కల్పించిన దున్నది. ఇది సుమారు రెండువందలశ్లోకములకావ్యము. ఇందు చక్కనినీతి ముపదేశింపఁబడినది. కవిరాక్షసీయ మనుశతశ్లోకకావ్యము నిట్టిదే. ఇతఁడు త న్నిట్లు తెలుపుకొనెను.

"సాక్షరేషు భవ తీహ జగత్యాం సర్వ ఏవ హృది మత్సరయుక్తః,
సాక్షరం కవిజనేషు త మేతం లోక ఏష కవిరాక్షస మాహ"

ఈకృతికి శిష్టపదార్థదీపిక యనువ్యాఖ్య నాగణార్యుఁడు నిర్మించియున్నాఁడు. ఇట్లే శ్రీనివాసకవినిర్మితకవిసంజీవినియు, కవులపేళ్లు తెలియనికావ్యసంగ్రహము కురంగీపంచకము మొదలైనవియు వంద లున్నవి. ఆశ కంతము లే దన్నసామెత కుదాహరణముగాఁ గావ్యసంగ్రహమున నీక్రిందిశ్లోక మున్నది.

"నిస్స్వో వష్టి శతం శతీ దశశతం లక్షం సహస్రాధిపో,
లక్షేశః క్షితిపాలతాం క్షితిపతి శ్చక్రేశతాం వాంఛతి,
చక్రేశః పున రింద్రతాం సురపతి ర్బ్రాహ్మం పదం వాంఛతి
బ్రహ్మా శైవపదం శివో హరిపదం హ్యాశావధిం కో గతః ?"

పూర్వోక్తకావ్యములన్నిటిలోఁ బెద్దది చాటుధార యనుగ్రంథము. ఇందు నానాపద్ధతి నీతిపద్ధతి ప్రభుపద్ధతి విద్వత్పద్ధతి అన్యాపదేశపద్ధతి శృంగారపద్ధతి యనుభాగములు గలవు. ఇందు రమారమి వేయిశ్లోకము లున్నవి. ఇందు ప్రాచీనగ్రంథములలోనినీతిదాయకము లైనశ్లోకము లపరిమితముగా నున్నవి. ఇది యొకసంకలనగ్రంథము. చాతురత్నాకరము, చాటుశ్లోకములు. మొదలగున విట్టివే యింకను గనవచ్చును. రమాలోకనాథులపుత్రుఁ డైనచక్రకవి రచియించిన

చిత్రరత్నాకర మనుకృతి పేరుకుఁ దగినది. ఉబుసుపోకకుఁ జదువఁదగిన గ్రంథములలో నిది యొకటి. పొడుపుడుకథలపుట్ట. ఇఁక, శృంగారప్రధానములు హాస్యజనకములు నగుకావ్యములలో గణింపఁ దగినకొన్ని—

విటవృత్త మనుచిన్నకావ్య మొకటి భర్తృహరి కంటఁ గట్టఁబడియున్నది. ఇది హితోపదేశపరముగాఁ బరిణమించినను, శృంగారపూర్ణమే. శృంగారశతకము నిర్మించినభర్తృహరి మరల దీనిని వ్రాయుట యసంగత మగుట యటుండ, శైలి గాని భావము గాని యతని కారోపింపఁ దగి లేవు. ఇందుకు మొదటిశ్లోకమే చాలును.

"నితమ్బాలసగామిన్యః పీనోన్నతపయోధరాః
మన్మథాయ నమ స్తస్మై య స్యాయ తన మఙ్గనాః"

ఇది యిట్లుండ, 'భర్తృహరి విటవృత్తము రచియించినాఁడు. నేను జడవృత్తము రచియించుచున్నా' ననుచు మాధవుఁ డనునొకకవి యైదుపరిచ్ఛేదముల కావ్యము రచించెను. ఇందు స్త్రీలోలు రైనమూర్ఖుల నడవడి వర్ణింపఁబడినది. విటవృత్తవ్యాఖ్యాత విపరీతముగా వర్ణించినవిషయమే యీజడవృత్త మనుచు దీని నిట్లుకవి తెలిపియున్నాఁడు.

"విటవృత్తవ్యాఖ్యాత్రా విపరీతత యోక్త మేవ జడవృత్తమ్,
ఇద మీదృశ మితి తస్య వ్యక్తీకరణే ప్రయాసో నః"
యది గుణకణికాభూషిత మేత ద్దోషాయుతేన సహిత మపి,
ఆస్వాదయన్తి రసికా జడవృత్తం సాక్షిచూత మివ"
దీనినిబట్టి యిందు స్త్రీలోలమూర్ఖనింద యధిక మని స్పష్టపడుచున్నది.

కాళిదాసున కంటఁగట్టినపుష్పబాణవిలాస మనుశృంగారకావ్య మొకటి యున్నది. లోకములో వ్యాప్తి చెందియున్న 'కాంతే దృష్టిపథం గతే నయనయో' రిత్యాదిశ్లోక మిందలిదే. దీనికి వేంకటపండితరాయఁ డనునాంధ్రుఁడు వ్యాఖ్య నిర్మించియున్నాఁడు. ఇది కాళిదాసనిర్మితము గాకున్నను మృదుమధురశైలి నలరుసరసకావ్య మనవచ్చును.

చోరకవినిర్మితముగాఁ గనవచ్చుబిల్హణచరిత మాంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధము. ఇది ౧౮౫, ౫౦, చొప్పున శ్లోకములు గలరెండుసర్గలకావ్యము. ఇందు బిల్హణుఁ డనుమహాకవి నాయకుఁడు, యామినీపూర్ణతిలక నాయిక. చమత్కృతికై కల్పింపఁబడినయిందలికథ సత్యము గాకున్నను, కవిత్వముమాత్రము రసవంతము. లోకప్రసిద్ధ మైన 'కి మిందుః కిం పద్మం కిము ముకురబింబం కిము ముఖ' మిత్యాది శ్లోక మిందలిదే.

కామరాజదీక్షితునిపుత్త్రుఁడు వ్రజరాజు రచించినరసికరంజనమును, విశ్వేశ్వరవండితునియార్యాశతకమును, కేవలశృంగారరసద్యోతకములు. ఇవి కాళిదాసున కారోపింపఁబడినశృంగారతిలకమువంటివి. ఇట్టిశృంగారకావ్యములు లెక్కింపఁదరముకాదు. వీనిలో మిక్కిలి పెద్దదై గుణమునఁ గూడ నుత్తమ మైనశృంగారసప్తశతిమాత్రము విడువఁదగినది కాదు.

ఏడువందలశ్లోకములతోఁడియీకృతియందు నాయికానాయకులవివిధావస్థలు వర్ణింపఁబడినవి. ఇందుకు రెం డుదాహరణములు.

"ప్రణయాపరాధ నిర్భరకోపోదయ సాన్త్వవాద కోపశమైః,
శృంగారసప్తశత్యాం గ్రథితం శతకం తృతీయ మభూత్"
"చంద్రోదయ మదిరారస సంభోగ తదన్తవాసరారంభైః
శృంగారసప్తశత్యాం షష్ఠం శతకం సమగ్రాహి"

ఏడుపద్ధతులతోఁడిశృంగారసారసారిణి యనుకావ్యము కామవైభవకామినీవైభవభూషావయవాదివర్ణనలతో నిండి నూఱుశ్లోకముల వెలయుచున్నది. ఇట్టి వెన్నో! కాని, అర్వాచీనసంస్కృతకవులు శృంగార మన్న నెంత చెవికోసికొనెడివారో తెలుపుటకు 'స్తనపఞ్చక' మనునైదుశ్లోకముల కావ్యముగూడ నుదయించిన దని చెప్పకతప్పదు. ఈపంచకమునకు మకుటము—

"కుచద్వయ ముపాస్మహే కుముదబాన్ధవ స్యోదయే"

అనునది, అయిదుపద్యములకు నిదియే చతుర్థపాదము. దీనినిజూచి యది పుట్టెనో, దానిని జూచి యిది పుట్టెనో కాని,

'జలోదన ముపాస్మహే జలజబాన్ధవ స్యోదయే'

అనుపాదము మకుటముగాఁ గలజలోదనపంచక మొకటికూడమన దేశమున వాడుకలోనున్నది. అందలిదొకటి—

"వసంతనవమల్లికాకుసుమపుంజవ న్మంజులం,
ససర్షపరసాలకం లికుచనీరమగ్నార్ద్రకం,
వరాంగ్యుపరికేళిజశ్రమనివారణే కారణం,
జలోదన ముపాస్మహే జలజబాంధవ స్యోదయే"

పెక్కుపోలికలనుబట్టి యీ రెండుపంచకముల నర్వాచీనుఁడైన యాంధ్రుఁడు రచియించె నని తోఁచుచున్నది.

నీతికావ్యములు—వీని కాద్యము భర్తృహరినీతిశతకము. దీని ననుసరించినవి వేలు. వానిలో ౭౫ పరిచ్ఛేదముల శార్ఙ్గధరపద్ధతి పెద్దది. దీనికర్తయైన శార్ఙ్గధరుఁడు, శాకంభరీదేశరాజైనహమ్మీరభూపతియాస్థానకవి యగు రాఘవపండితుని పౌత్రుఁడు, దామోదరపండితునిపుత్రుఁడు. పైరాఘవుఁడే సన్యసించి రాఘవచైతన్యుఁడై మహాగణపతిస్తోత్రము నిర్మించినట్లు కనఁబడుచున్నది. పైహమ్మీరభూపతి క్రీ. ౧౨౯౫ లో మృతి నందినట్లు తెలియవచ్చును. కావున శార్ఙ్గధరుఁడు క్రీ. ౧౩౦౦ ప్రాంతమున నున్నవాఁ డనవచ్చును. ఇతనిపద్ధతిలో వివిధములైననీతిబోధకభాగములు గలవు. ఈక్రిందిశ్లోకములవల్ల దీనివిషయము తెలియఁగలదు. ఇది ముద్రితము.

"ఆనన్దాయ సతాం భూయా త్సుభాషిత మిదం మమ,
ఆద్యై ర్యదుద్ధృతైః పద్యైః కియద్భి రపరై రపి,
న శార్ఙ్గధరపద్ధతిః ఖలజనస్య యోగ్యా భవేత్,
సుభాషితమహార్థయ స్సుకృతలోకపేయా యతః"

సూక్తిముక్తావళి యనుగొప్పగ్రంథ మొకటి జల్హణునిపేర నున్నది. అందలికడపటిశ్లోకములనుబట్టి, యాదవరాజగుకృష్ణభూపతి రాజ్యము చేయుసమయమున వైద్యభానుపండితుఁడు జల్హణునిపేర దీనిని రచియించినట్లు తెలియవచ్చును. ఆసమయము క్రీ. ౧౨౫౭. ఈజల్హణుఁడు యాదవరాజ్యమును వృద్ధికిఁ దెచ్చిన జనార్దనమంత్రిపౌత్రుఁడు. అద్భుతవిక్రమశాలియుఁ గృష్ణభూపతిరాజ్యము రక్షించినవాఁడు నగులక్ష్మీదేవునిపుత్రుఁడు. తండ్రివలెనే యతనిరాజ్యకార్యములు దక్షతతో నిర్వహించినవాఁడు. పూర్తిపేరుభగదత్తజల్హణుఁడు. ఈతనిపేర నీకృతి వెలసినది. గ్రంథావతారికలో జల్హణుఁడు రచించినట్లును గ్రంథాన్తశ్లోకముల భానుదత్తుఁడు నిర్మించినట్లును గనఁబడునట్టిశ్లోకము లివి—

"సారాసారవిచారణాసు చతురః శ్రీజల్హణాఖ్య స్సుధీః"
"మత్పిత్రా దత్త మస్మై ప్రతిహతబలవద్ద్వేషి వర్గోపసర్గం,
రాజ్యం ప్రాజ్యప్రభావప్రథిత గుణభృతా కృష్ణరాజాయ భక్త్యా,
సాహిత్యవిద్యాహృదయం జ్ఞాతు మిచ్ఛసి చే త్సుఖమ్,
తత్పశ్య జల్హణకృతాం సూక్తిముక్తావలీ మిమామ్,
"శాకేఙ్కాద్రీశ్వరపరిమితే—౧౧౭౯—వత్సరే పింగలాఖ్యే,
చైత్రే మాసే ప్రతిపది తిథౌ వాసరే సప్తసప్తేః,
పృథ్వీం శాస త్యతుల మహసా యాదవే కృష్ణరాజే,
జల్హ స్యార్థే వ్యరచి భిషజా భానునా సేయ మిష్టా"

ఇందు ౮౬ పద్ధతులు కలవు. లోకజ్ఞానమున కాదర్శమైనయిది ముద్రితము—కాశ్మీరదేశీయుఁడును శ్రీకంఠచరితకర్తయగుమంఖునిసుతి గన్నవాఁడును సోమపాలవిలాస మనుమహాకావ్యము నిర్మించినట్లు చెప్పఁబడువాఁడు నగుజల్హణ వండితుఁడొకఁడు ముగ్ధోపదేశము నిర్మించియున్నాఁడు. అది కాముకులజారవృత్తి మాన్పుట కుద్దేశింపఁబడినసీతిగ్రంథము. ముద్రిత మైనది. ఆకవి ౧౨ వ, శతాబ్దినడిమివాఁడు.

తరువాత వెడలినయుత్తమనీతికావ్యములలో గణింపఁదగినది సుప్రసిద్ధవేదాన్తదేశికాచార్యునిసుభాషితనీవి. ఇది సర్వజ్ఞసింగభూపాలునికొఱకు నిర్మిత మైనదవి వైష్ణవసంప్రదాయము. క్రీ. ౧౩౫౦ ప్రాంతమందలివాఁడు సింగభూపతి. వేదాన్త దేశికుఁడును ౧౩౦౦ ప్రాంతమువాఁ డని యొకమతము. అందుచే వార్ధకదశలో నీదేశికుఁ డాసింగమహీపతి నెఱిఁగియుండి యట్లు రచియించె నన్నను, అది యసంగతము కాఁగూడదు. ఇందు బహువిధము లైనపద్ధతులు కలవు. దీనితరువాతఁ జెప్పదగినమహాగ్రంథము సుభాషితసుధానిధి. దీనికర్త సకలజగతీప్రసిద్ధుఁ డగు సాయణాచార్యులు. ఇందు ౮౮ పద్ధతులు గలవు. ఉపోద్ఘాతపద్ధతిలో, కంపరాజునకు మాయణుఁడు మంత్రి యనియు, ఆతనిపుత్రులు మాధవసాయణు లనువారనియుఁ దెలియఁగలదు. అందలిరెండుశ్లోకములు—

"భారద్వాజాన్వయభువా తేన సాయణమంత్రిణా,
వ్యరచ్యత విశిష్టార్థః సుభాషితసుధానిధిః,...
స కదా చిత్సమాజే ఽథ కంపభూపం కలానిధిః
అశ్రావయ దనూనశ్రీః నిశ్శ్రేయసకరం పరమ్"

జైనపండితుఁ డగుశ్రీమదాచార్యసకలకీర్తి రచియించినసుభాషితావలియు, సోమప్రభాచార్యుఁడు నిర్మించినసిందూరప్రకర మనుసూక్తిముక్తావలియుఁ జైవాని వలెనే మనోహరము లగుచున్నవి. విశ్వగుణాదర్శకర్త యైనవేంకటాధ్వరిసుభాషితకౌస్తుభ మర్వాచీనకృతులలోఁ బ్రశస్తి గాంచిన యైదుపద్ధతులకావ్యము. ఇందు వివేక సజ్జన దుర్జన వదాన్య పిశున పద్ధతులు గలవు. ఇంకను, సూక్తి సుభాషిత శబ్దములు పూర్వ మందుగల వనేకము లున్నవి. ఆంధ్రదేశీయుఁడును, ఏలేశ్వరపురవరమహోపాధ్యాయవంశములోనివాఁడు నైనపెద్దిభట్టు రచియించిన సూక్తివారిధి వానిలో నుత్తమము. ఇది పదమూఁ డధ్యాయములగ్రంథము. ఇతఁడు భర్తృహరినీతిశతకములోని మొదటిశ్లోకము మొదటను రెండవశ్లోకము కడపటను దనగ్రంథమునఁ జేర్చుకొనుటయే యతవి ననుకరించి యితఁ డీగ్రంథము నిర్మించె ననుటకు నిదర్శనము. కవిత్వము సరసముగానుండు ననుట కొకపద్యము—

"ఆశాయా దాసా యే దాసా స్తే సర్వలోకస్య,
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః"

ఇట్లు భర్తృహరిసుభాషితత్రిశతి ననుసరించినశృంగార భక్తిజ్ఞాన వైరాగ్య బోధకము లైనకావ్యము లసంఖ్యముగాఁ గలవు. తత్తద్దేవతాస్తుతిపరము లైన యష్టకములు శతకములు లెక్కింపలేము. అయినను గొన్నిటిని గ్రహింతము.

దైవతకావ్యములు—త్రిమతములవారును నిర్మించినయివి వందలు వేలు నున్నవి. అద్వైతబోధక మైనపుష్పదంతునిమహిమ్నస్తోత్రము జగద్విదితము. శంకరరామానుజమధ్వాచార్యులభక్తిరసకావ్యములు లోకప్రసిద్ధములు. వీని కన్నిటికిఁ బ్రాచీనము సూర్యశతకము. ఏతత్కర్త మయూరకవి బాణునితో శ్రీహర్షవర్ధనునియాస్థానములో నున్నవాఁ డని రాజశేఖరునియీమాటవల్లఁ దెలియును.

"అహో ప్రభావో వాగ్దేవ్యా యన్మాతంగదివాకరః,
శ్రీహర్ష స్యాభవ త్సభ్య స్సమో బాణమయూరయోః"

సూక్తిముక్తావళిలో, రాజశేఖరుఁ డితనిని బ్రశంసించినపద్య మొకటి యిట్లు కనఁబడుచున్నది.

"దర్పం కవిభుజంగానాం గతా శ్రవణగోచరం
విషవిద్యేవ మాయూరీ మాయూరీ వా జ్నికృన్తతి"

ఇది బాణుఁడు హర్షచరిత్రలోఁ జెప్పిన 'కవీనా మగల ద్దర్ప' ఇత్యాది శ్లోకమున కనుకరణము—మయూరశతకమునకు వల్లభదేవాదు లైదుగురు టీకలు వ్రాయుటయే దీనిఘనతకు నిదర్శనము. దీనిఫల మిట్లు కడపటఁ గనవచ్చును.

"ఆరోగ్యం సత్కవిత్వం మతి మతులబలం కాన్తి మాయుః ప్రకర్షం,
విద్యా మైశ్వర్య మర్థం సుత మపి లభతే సో ఽత్ర సూర్యప్రసాదాత్"

శంకరాచార్యులవారు, భజగోవిందశ్లోకములు విష్ణుపాదాదికేశాంతవర్ణన స్తోత్రము మొద లగువిష్ణుస్తవములే కాక, త్రిపురసుందరీ మానసికోపచారపూజాస్తోత్రము, చతుష్షష్ట్యుపచారమానసపూజాస్తోత్రము సౌందర్యలహరి మొద లగుపరదేవతాస్తుతికావ్యములును, శివానందలహర్యాదిశివస్తోత్రములు గూడఁ బెక్కు నిర్మించియున్నారు. ఆయన విష్ణుపాదాదిస్తుతి ననుకరించి, అద్వైతసిద్ధి, భగవద్గీతా మహిమ్నస్తోత్రాదివ్యాఖ్యలును రచియించినమధుసూదనసరస్వతి, ఆనందమందాకిని యనుస్తుతికావ్యము నిర్మించెను. ఇందు శ్రీకృష్ణుని కేశాదిపాదాంతావయవములు వర్ణింపఁబడినవి—మహామహోపాధ్యాయ గోకులనాథుఁడు నిర్మించిన శివశతకము

నవీన మైనను ప్రాచీనకావ్యమువలె పరసముగా నున్నది. ఇతఁడు మిథిలాదేశమం దలిమగరౌనీగ్రామమున వసించినవాఁడు. నూటయేఁబదియేండ్ల క్రిందటివాఁడు— పంచస్తవి యనునూటయేఁబదిశ్లోకములకావ్య మొకటి ప్రాచీన మైనది కలదు. కవిపేరు తెలియదు. ఇందలి 'లక్ష్మీవశీకరణచూర్ణసహోదరాణి' ఇత్యాదిశ్లోకము సరస్వతీకంఠాభరణమున నుదాహృత మగుటంబట్టి యిది క్రీ. పదియవశతాబ్ది కీవలిది కాదని తెలియుచున్నది. ఇందు లఘు చర్చా ఘటాంబా సకలజననీ సంజ్ఞలు గలయైదు స్తవము లున్నవి.

దాక్షిణాత్యద్రవిడకవి యైనమూకపండితుఁడు పంచశతి యనుపేర, కంచి కామాక్షీదేవిని స్తుతించుచు నైదువందలశ్లోకములకావ్యము నిర్మించెను. ఇందు, కటాక్షమందస్మితపాదారవిందార్యాస్తుతిసంజ్ఞల శతకము లైదు కలవు. వీనిలో, తత్తద్వర్ణన లతిరమ్యముగాఁ గావింపఁబడినవి. ఈకవి మూఁగవాఁ డని ప్రతీతి. శ్రీవేదాంతదేశికులత్రింశదధికస్తుతిగ్రంథములలో, పాదుకాసహస్ర మతిప్రశస్తము వేంకటాధ్వరికృతులలో లక్ష్మీసహస్ర ముత్తమ మైనది.

వెనుకఁ బేర్కొనఁబడినగోవర్ధనాచార్యాదులకు సమకాలికుఁడును రాధా దేవీభోజదేవులతనయుఁడును ఉత్కలదేశీయుఁడు నైనజయదేవుఁడు ప్రహ్లాదునివంటి భక్తుడు. క్రీ. పదియేనవశతాబ్దిలోనిచంద్రదత్తుని భక్తమాలలో ౩౯—౪౧ సర్గల నడుమ నితనియుదంతము వర్ణింపఁబడుటయే యిందుకు నిదర్శనము. పన్నెండు సర్గలయితనిగీతగోవిందము రాగలయతాలములకు సరిపడుచు భక్తలోకమును వశపఱుచుకొన్నది. దీనికి బాలబోధినీభావార్థదీపికాదిబహువ్యాఖ్యలు పుట్టినవి. వానిలో రసమంజరి యుత్తమముగా నున్నది. ఏతత్కర్త వ్యాఖ్యావతారికలోఁ దెలిపినమాటలనుబట్టి యీక్రిందివిషయములు తెలియుచున్నవి.

"[1]. కశివారదేశమున గౌతమగోత్రబ్రాహ్మణజాతియందు బ్రహ్మవేత్త యగు కృష్ణమిశ్రుఁ డుదయించెను. అతఁడు ప్రబోధచంద్రోదయనాటకకర్త. అతనివంశ మందు పతేజుఁ డనువీరపండితుఁ డుదయించి బ్రాహ్మ్యక్షాత్రములు రెండును వెలయ భార్గవకృపద్రోణులకు సాటియై దుష్టుల నణఁచి ఢిల్లీపతిని సంతోషపెట్టి కాశివారమునకు రాజయ్యెను. అతనికొడుకు కమలాపతియు నట్టివాఁడే. అతని కొడుకు హరసింహదేవుఁడు నట్లే ప్రజారంజకుఁడై కాశివార మేలుచు ఢిల్లీశ్వరుని సభలోఁ బ్రాగల్భ్య గాంచెను. అతనికుమారుఁడు (జగతి విదిత కీర్తితమ ఇతి—అను

1. శ్రీగర్గస్థల[illegible]కాశీపత్తనమధి[illegible]భూషణం, దేశ శ్రీకశివార ఇత్యభిహితః క్షేత్రో [illegible]

పాఠము కననగుచున్నది) శ్రీతముఁడు బ్రాహ్మణారాధనతత్పరుఁడై సత్పుణ్యమూర్తి. అతనితనయుఁడు హరిశంకరుఁడు. సర్వగుణసంపన్నుఁడై నయాతనియొక్క గ్రామమున శాలినాథుఁడు వన్నె కెక్కెను (శాలినాథునియుదంతము చెప్పలేదు) సర్వమహీసుపర్వముకుటుఁడు నృపకీర్తనీయుఁడు వదాన్యుఁడు నైనయాశాలినాథుని యాజ్ఞచే శంకరుఁడు గీతగోవిందటీక రచియించెను"

మహామహోపాధ్యాయ దినేశ్వరమిశ్రతనయుఁడైనయాశంకరమిశ్రుఁడు ఢిల్లీపతులనామములు తెలుపలేదు గాని, శాలినాథునితో నితఁడు క్రీ. ౧౭ వ శతాబ్దియుత్తరభాగమున నుండె నని తోఁచుచున్నది.

ఇట్లు ౧౭–౧౮ శతాబ్దులలో, కృష్ణభవనామృతము వాసుదేవకథాకావ్యము కృష్ణలీలాకావ్యము గోవిందలీలామృతము మొదలైనభక్తిరసగ్రంథము లెన్నో యుదయించినవి. రాధావినోద రాధాసుధానిధి చమత్కారచంద్రికా రాధాప్రసాద నాదిసంజ్ఞల రాధా మాధవులచరితమును వర్ణించినకావ్యము లనేకములు.

కృష్ణలీలాతరంగిణి—ఇది పన్నెండుతరంగములకావ్యము. శివరామానంద తీర్థునిశిష్యుఁడైననారాయణతీర్థుఁడు నిర్మించినది.

"కామదా కామినా మేషా ముముక్షూణాఞ్చ మోక్షదా,
శృణ్వతాం గాయతాం భక్త్యా కృష్ణలీలాతరఙ్గిణీ"

అనుకడపటిశ్లోకము దీనిప్రయోజనమును దెలుపును. దీనిని మించి దేశమున వ్యాపించినది కృష్ణకర్ణామృతము. లీలాశుకనిర్మితమైనయీకావ్యము భక్తులపాలిటిపారిజాతమై రస మొలుకుచు మనోహరముగా నుండును. ఇది త్రిశతకమనఁబడును గాని యిందు ౧౧౨ శ్లోకము లున్నవి. ఈకవి మొదటిపేరు బిల్వమంగళుఁడు. ఇతఁడు పండితుఁడయ్యుఁ దొలుత వేశ్యాలంపటుఁడై తుద కావేశ్యవల్లనే విరక్తి చెంది కృష్ణభక్తుఁడై లీలాశుకుఁ డయ్యె నని ప్రతీతి. ఈకృతిమొదటిశ్లోకమి ట్లున్నది.

"చింతామణి ర్జయతి సోమగిరి ర్గురు ర్మే, శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు, లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః"

దీని కాంధ్రుఁడును, వసుమతి యనునింటిపేరు గలకొండమాంబాతిరుమల భట్టోపాధ్యాయులతనయుఁడు నగుపాపయల్లయసూరి వ్యాఖ్య రచియించుచుఁ బై శ్లోకమందలిచింతామణిపదమున కీ ట్లర్థము వ్రాసియున్నాఁడు. "చింతామణి

యనునది లీలాశుకుఁడు జపించినమంత్ర మగును. లేదా, ఇతనికి మంత్రోపదేశము చేసినయోగీంద్రుఁడు కావచ్చును. లేదా, చింతామణివలె దానగుణము గలసోమగిరి యనువేశ్య కావచ్చును. లేదా, చింతామణివంటిసోమగిరి యనుయోగి కావచ్చును* ఈవికల్పములనుబట్టి యితనినాఁటికే పైశ్లోకమునర్థ మవిదిత మని తెలియఁగలదు. రూపగోస్వామిశిష్యుఁడైనకృష్ణదాసుఁడు సారంగరంగద యనుపేరఁ గృష్ణకర్ణామృతవ్యాఖ్య వ్రాయుచు నవతారికలో నిట్లు చెప్పెను. (దాని తెలుఁగు)

“దాక్షిణాత్యుఁడు కృష్ణవేణ్ణాపశ్చిమతీరవాసి పండితకవీంద్రుఁడు నగుబిల్వమంగళుఁ డనుబ్రాహ్మణుఁడు కలఁడు. అతఁడు పూర్వకర్మవాసనచే, చింతామణి యనుపేరు గలవేశ్యయం దాసక్తుఁ డయ్యెను. దానియిల్లు నది కవతల నున్నది. ఒకనాఁటిరాత్రి మేఘావృతమై కన్నుకనఁబడనిస్థితిలో నుండఁగా నతఁ డేటీఁది వెళ్లి దానియింటిప్రాకారము దాఁటుటకుఁ దడవుకొనుచుండఁగా గోడకన్నములో దూఱియున్నయొకత్రాఁచుతోఁక చేతికిఁ దగిలినది. అది పట్టుకొని గోడ యెక్కి ముంగిలివాకిట నుఱికి మూర్ఛిల్లెను. ఆచప్పుడు విని వచ్చినవేశ్య యతని సేద తేర్చి తరువాతఁ జేసినపనికి నిందించెను. దానిచే నతఁడు విరక్తుఁ డయ్యెను* గోడ యెక్కి క్రింది కుఱికినపుడు త్రాఁచునెత్తిమీఁదఁ గాలు పడె ననియు, ఆదెబ్బ కది చచ్చె ననియుఁ విరక్తి చెందినపిదపఁ గృష్ణసర్పమును జంపినందుకు గృష్ణభక్తుఁ డయ్యె ననియు, ఆంధ్రదేశప్రతీతి.

ఈవ్యాఖ్యాతగూడఁ బైకథ వ్రాయుచు, ‘లేదా—చింతామణివంటిసోమగిరి లీలాశుకునిగురు వగును’ అనియు నర్థము చెప్పెను. ఎట్లయిన నేమి? చింతామణి సోమగిరిశబ్దములయర్థము సందిగ్ధమే. కాని, లీలాశుకుఁ డాంధ్రదేశీయుఁడు కృష్ణాతీరవాసి యనుప్రతీతిమాత్రము సార్వలౌకికము. ఇతనికృతి కైదువ్యాఖ్యలు కలవు.

లీలాశుకుఁ డనెడియీబిల్వమంగళునిపేర సుమంగలస్తోత్ర మొకటి కనఁబడుచున్నది [1]. కృష్ణునికౌమారకైశోరతారుణ్యాదులవర్ణనలతో నిండినయిందు 303 శ్లోకము లున్నవి. వీనిలోఁ గృష్ణకర్ణామృతములోనిశ్లోకములు గూడఁ గొన్ని కలవు గాని, దీనికి భక్తవల్లభావ్యాఖ్య రచియించినభట్టవనమాలి—

“కృష్ణకర్ణామృతస్యైషా టీకా శ్రీభక్తవల్లభా,
భూనిర్జరేణ భట్టేన క్రియతే వనమాలినా*

1. చూ. లండన్‌లైబ్రరీ. సంస్కృతాముద్రితగ్రంథపట్టిక. Vol. VII.

అని వ్యాఖ్యాది నని యున్నాఁడు. అయినను రెండు గ్రంథములు పరిశీలించిన—H. T. Colebrooke—మాటనుబట్టి యిది వేఱనియే నమ్మవలసియున్నది. ముద్రిత మైన ౧౮౯ శ్లోకములతోఁడిబిల్వమంగళకృష్ణస్తోత్రము మొదలఁ గనవచ్చెడి పై వ్యాఖ్యాతమాటకంటె, ఈమూఁడింటిని సరిచూచినపై పరిశీలకునిమాట విశ్వాస్యము కదా! సుమంగలస్తోత్రముకడపటిశ్లోకములలో నిది యొకటి—

"యే శైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో,
బౌద్ధా బుద్ధఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః,
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః,
సోఽయం నో విదధాతు వాంఛితఫలం శ్రీదేవకీనన్దనః"

జయదేవునిగీతగోవిందము ననుకరించినగీతగౌరీశ మొకటి కలదు. దీనికర్త కవిచక్రవర్తిభానుదత్తుఁడు. పదిసర్గలతోఁడియీకావ్యము శార్దూలవిక్రీడితాది వృత్తములతోను, త్రిపాదగీతములతోను వెలయుచు సరసముగా నున్నది. ఇతఁడు గ్రంథాంతమున నిట్లు చెప్పియున్నాఁడు.

"భవానీ వర్తతే యావ దంగలగ్నా పురద్విషః,
విద్వత్కాంతస్థితా తావ ద్భానో ర్వాణీ విరాజతామ్"

## గ ద్య కా వ్య ము లు.

ఛందోబద్ధ మైనవాక్యము పద్యము, అట్లు కానిది గద్యము. కాని, లోకములోఁ బద్యసంజ్ఞకంటె గద్యసంజ్ఞయే ప్రాచీనము. దానికంటె శ్లోకసంజ్ఞ పురాతన మనుటకు వేదమే ప్రమాణము[1]. పాదబద్ధము ఋక్కు, అట్లుకానిది యజుస్సు, అని లాక్షణికులు. దానినిబట్టి ఋక్కు శ్లోక మనియు యజుస్సు గద్య మనియు మన మూహింపవచ్చును. కావున యజుర్వేదముతోనే గద్యము పుట్టిన దనుట విదితము. ఆదికావ్య మైనరామాయణమును భారతాదులును శ్లోకమయములే కాని, ఆనాఁడును గద్యము లేకపోలేదు. లౌకికభాష యైనసంస్కృతము వాడుకలో నున్నయాకాలమున సంభాషణప్రతిసంభాషణములకు గద్యము గాక పద్యము సాధన మయ్యెనా? అది రచనలో లే దనవచ్చును గాని, అందును గొంచెము కనఁబడుచున్నది. భారతాదిని పౌష్యపర్వములో—

"సౌతి రువాచ—గద్యమ్. జనమేజయః పారిక్షిత స్సహ భ్రాతృభిః కురుక్షేత్రే దీర్ఘ సత్ర ముపాస్తే"—ఇత్యాదిగా మూఁడుపుటలగ్రంథమును, సంభవపర్వమున—

1. మిమీహి శ్లోకమాస్యే పర్జన్యఇవ తతనః. ఋ. మం. 1. సూ. 38 ఋక్కు. 14.

"శంతనుః ఖలు గఙ్గాం భాగీరథీ ముపయేమే. తస్యా మస్యా జజ్ఞే దేవవ్రతో నామ—యమాహు ర్భీష్మ మితి—" ఇత్యాదిగా రెండుపుటలకథయుఁ గనఁబడుచున్నవి [1]. ఈభాగములు చదివినవారికిఁ జక్కనిచిన్నచిన్నవాక్యములతోఁడి వీనిశైలి యానాఁటిగద్యరుచిని దెలుపఁగలదు. భరతాచార్యుఁడు మొదలగువారు నాట్యశాస్త్రాదులం దింతకంటె నించుక ప్రౌఢముగా గద్యభాగములు చేర్చియున్నారు. భాసకాళిదాసాదిమహాకవులు తమరూపకముల మనోహరవచనము వ్రాయుట విదితము గదా! అయినను, మహాకవిదండికిఁ బూర్వ మంతయు గద్యమైనకావ్యము లే దనుట నిజము. దీనికి మార్గదర్శి యతఁడే. "పాదబద్ధము కాని పదసముదాయము గద్యము. అది, ఆఖ్యాయిక—కథ—అని ద్వివిధము—నాయకుఁడే స్వయముగాఁ జెప్పిన దాఖ్యాయిక. నాయకుఁడు గాని, అన్యుఁడు గాని చెప్పినది కథ" అనుచు గద్యలక్షణము తెల్పి, కథాఖ్యాయికలకు భేదము లేదు, అది రెండుసంజ్ఞలతోఁడి యేకజాతి యని నిర్ణయించినాఁడు. భామహుఁ డతనిమతము ఖండించుచు, "నాయకుఁడు చెప్పునిజవృత్తాంత మాఖ్యాయిక యగును. అందుచ్ఛ్వాసము లనుభాగము లుండును. అన్యులు చెప్పునాయకునిచరితము కథ. అం దుచ్ఛ్వాసము లుండవు" అని నిర్ణయించెను. ఇట్లు నిర్ణయభేద మించుక కనవచ్చినను, అది యంత గణనీయముగా లేదు. దశకుమారచరితములో రెండుపద్ధతులును గనవచ్చును.

రాజవాహనాదిదశకుమారులచిత్రచరిత్రలు కలది యగుటచే దీని కీపేరు వచ్చినది. కథలు పదిమంది వైనను, అన్నిటికి నైక్యము చక్కఁగా నున్నది. మగధదేశరాజగు రాజహంసుఁడు మాలవరాజుచే నోడింపఁబడి యడవిపాలగుటతోఁ గథ ప్రారంభ మగును. రాజవాహనాపహారవర్మాదులు పడినకష్టములు, వారందఱు కలియుట, రాజ్యము మరల సంపాదించుట, రాజహంసుఁడు వానప్రస్థుఁడై యుండుట, యనునవి యిందలిప్రధానవిషయములు. ఈకథలో ముఖ్యముగా వామదేవుఁ డనుఋషి కెక్కువ సంబంధము కల్పింపఁబడినది. శైలి మృదుమధురము. కొన్నిచోట్ల దీర్ఘసమాసము లున్నను, చిన్నచిన్నవాక్యములే యెక్కువగా నున్నవి. కుమారోత్పత్తి ద్విజోపకృతి సోమదత్తచరితము పుష్పోద్భవచరిత్ర అవన్తిసుందరీపరిణయము, అనునైదువిషయములు కలదిపూర్వపీఠిక. రాజవాహనాదు లెనమండుగురు కుమారులతోఁడియెనిమి దుచ్ఛ్వాసములు ప్రధానగ్రంథము. రాజ్యప్రాప్తి యుత్తరపీఠిక. అనువిధమున నిది మూఁడుభాగముల నున్నది. ముద్రితము లైనదీనివ్యాఖ్యలలో, పదదీపిక పూర్వపీఠికకును, తక్కిన

1. ఇట్టివింకను భారతాదులఁ గలవు.

గ్రంథమునకు, పదచంద్రికా భూషణా లఘుదీపికలును గనఁబడుచున్నవి. ఇవి గాక భోసలరాజాస్థానములో నిఘనశ్యాముఁడు రచియించినటిప్పణ మొకటి వేఱుగా నున్నది. దీనిపేరు సంజీవనము. ఇందలియవతారికలోని—

"అథ భోజసభాయాం కాళిదాస భవభూతిప్రముఖవ దఖిలమానసీరో బాణ ఇవ కాదంబరీసంజ్ఞాం, దశకుమారచరితాఖ్యాం ప్రహేళికాం రచయి ష్యన్..." అనువాక్యమునుబట్టి యీవ్యాఖ్య భోజప్రబంధములోనికథలు నమ్మి తరువాతఁ బుట్టిన దని స్పష్ట మగుచున్నది. మూలములోనిమంగళాచరణ మైన 'బ్రహ్మాండచ్ఛత్రదండ' ఇత్యాదిశ్లోకము నుత్తరార్ధమున, ప్రాసప్రక్రమభంగము వచ్చిన దని యిది యాక్షేపించి, ఇట్టిదోషములు సాయణ మాయణ భాస మల్ల కాళిదాసాదులకుఁ గూడఁ గల వనుచు సమర్థించినది.

ఆరంభమునుండియు దండికవిత్వము పండితలోకము నాకర్షించుచునే వచ్చినది. రాజశేఖరుఁడు దండికావ్యత్రయము త్రిలోకవిశ్రుత మని ప్రశంసించెను. ఇదియుఁ గావ్యాదర్శము గాక మూఁడవది యిద మిత్థ మని యిప్పటికిని దేల లేదు. అం దందు శ్లేష యున్నను వాక్యములు ప్రసాదగుణభాసురములై ప్రవాహ గతి నడచు ననుట యిందలివిశేషగుణము. దీనిని, అప్పయామాత్యుఁ డనునొక కవి దశకుమారకథాసార మనుపేరఁ బద్యకావ్యముగా మార్చెను. అందు పూర్వ పీఠికమాత్రమే కలదు. అప్పయదీక్షితులు దశకుమారచరితసంక్షేపముగా మార్చి యున్నాఁడు. దీక్షితచక్రపాణికవి దశకుమారశేష మనుపేర దీనికుత్తరకథను బెంచి యొకపద్యకావ్యము నిర్మించెను. రాజాధిరాజగోపినాథుఁడు గద్యముగానే దశకుమారకథ యనుపేరఁ బెంచి వ్రాసెను.

"గోపీనాథో ద్విజాధీశః పతాం కౌతుకహేతవే
దశానాం చ కుమారాణాం సంశోధయతి సత్కథామ్"

బాణుఁడు ముందా సుబంధుఁడు ముందా యనువిషయము విమర్శకలోక మును గలఁచి వైచినది. ఈచర్చ కొట్టినపిండి. తమకు ముం దెందఱో వ్రాసిన విమర్శలు పరిశీలించి ఆర్. వి. కృష్ణమాచార్యులుగారు తాము ప్రకటించిన వాసవ దత్తపీఠికలోను[1] L. H. గ్రేదొరగారు తా మాంగ్లీకరించినవాసవదత్తపీఠిక లోను[2] విపులముగాఁజర్చించి తమకుఁ దోఁచినట్లు సిద్ధాంతీకరించిరి. వీరిలో మొదటివారు సుబంధుని బాణునికిఁ దరువాతను వామనాచార్యునికి ముందును

1. చూ. శ్రీరంగము ముద్రణము 1906-1908.

2. చూ. L. H. Gray's వాసవదత్త 1924.

జేర్చిరి. రెండవవారు బాణుని కిఁచుక పూర్వము ౫౫౦—౬౦౬ నడుమఁ జేర్చిరి. నే నీవిషయము నాకు లభించినప్రమాణములనుబట్టి నాసంస్కృతకవిజీవితము తొలిముద్రణములోనే నిర్ణయించితిని[1]. ఇపు డందలి చర్చయంతయు నిందు గ్రహించుట చర్వితచర్వణము. శ్రీకృష్ణమాచార్యులుగారియభిప్రాయమే నేను ౧౯౧౧ లోఁ దెలిపి యున్నాను.

'కవీనా మగళ ద్దర్పో నూనం వాసవదత్తయా'[2]

అనుచు బాణునిహర్షచరిత్రలోఁ గనఁబడుప్రశంసకుఁ బాత్రమైనది సుబంధువాసవదత్త కా దనియు, పతంజల్యాదులనుతి గన్నయావాసవదత్త తరువాత మృగ్యమైన దనియు విశ్వసించినవారి కిందు వాదమే కనఁబడదు. కావున బాణుని హర్షచరిత్రయే ముం దనునిశ్చయమునకు వర్తము.

బాణుఁడు కాన్యకుబ్జరాజహర్షవర్ధనునియాస్థానకవి. క్రీ. ౬౦౬—౬౪౫ నడుమ నున్నవాఁడు. హర్షచరిత్ర నింతకు మున్నే పరిశీలించియున్నాము. ఇఁక నితనికాదంబరి. 'బాణోచ్ఛిష్టం జగత్సర్వ' మ్మనుసూక్తికి నిదానమైనయీకావ్యము లోకవిశ్రుతము. ఇందలికథ బృహత్కథలోనిది. దానిని బాణుఁడు మెఱుఁగుపెట్టి ప్రకాశింపఁజేసెను. "అస్తి కవిసార్వభౌమో వాత్స్యాయనవంశసంభవో బాణః" అని నిజస్తుతి గావించుకొనఁ దగినవిద్వత్త్వకవిత్వముల వెలయునితఁడు కాదంబరీ రసజ్ఞానా మాహారోఽపి నరోచతే' యనుసూక్తికి నిదాన మైనయీమహాకృతి రచియించి యశఃకాయుఁడై వెలయుచున్నాఁడు. కాదంబరీకవిత్వము కఠినమే కాని, కష్టపడి చదివినవారికి సకలశబ్దార్థవిజ్ఞానముతో రసజ్ఞత కూడ సిద్ధించును. చదివినకొలఁదిని, కథయే పాఠకుని ముందుకుఁ ద్రోయుచుండును.

ఇం దవాంతరకథ లెన్నేని కలవు గాని ప్రధానకథ కాదంబరీచంద్రాపీడులకు సంబంధించినది. ఇందలిప్రధానరసము శృంగారము. తక్కినరసములు కొన్ని యంగములుగా వర్ణింపఁబడినవి. ఈకావ్యములోనికల్పనాచమత్కృతియు వర్ణనాచమత్కారము ననన్యాదృశములు. చంద్రాపీడునికి శుకనాసుఁడు గావించినయుపదేశ మెన్నిసారులు చదివినను విసుగు పుట్టదు. అచ్ఛోదసరోవర్ణనమువంటివర్ణనము మరలఁ గనఁబడదు. ఇట్టిమహాకృతి సమాప్తము గాకుండఁగానే బాణుఁడు దివంగతుఁడు కాఁగా, ఇతనికుమారుఁడు భూషణభట్టు తండ్రిమార్గ మనుసరించి దీనిని

1. చూ. మదీయసంస్కృతకవిజీవితము ప్రథమముద్రణము 1911
2. ఈశ్లోకము బాణుని దగునా కాదా యను విషయము విచారణీయము.

బూరించెను. ఆది కారణముగా బాణునిరచన పూర్వభాగము కుమారునిరచన యుత్తరభాగము నని చెప్పఁబడుచున్నవి. విరహపీడిత యగుకాదంబరిమాటలు పత్రలేఖ వచ్చి చంద్రాపీడునికి విన్పించుటతో నుత్తరభాగ మారంభ మగును. ఇందు కాదంబరీచంద్రాపీడులు మృతి నొంది మరల జీవించుట, వారివివాహము మహాశ్వేతాపుండరీకులసమాగమము, వారిమహిమానువర్ణనము, మొదల లగు విషయములు కలవు. తండ్రివల్ల రచింపఁదలఁచినకథ వినియున్నవాఁడు గావున నే యాకథ యిట్లు పూర్తిచేయఁగలిగెను గాని, మఱొకఁడైనచో నిది యిట్లు సమాప్తి గాంచియుండదు. ఇతనికవిత్వము తండ్రికవిత్వమువలె నుండదు గాని దానిచాయ కొంత లేకపోలేదు.

ఈకృతికి సంగ్రహముగా, పద్మోర్జరాజునానతిని, కాశ్మీరీయుఁడైనకాశీనాథ కవి సంక్షిప్తకాదంబరి రచియించెను.

"కాశ్మీరాభిజనో ద్విజ స్సుమతిమాన్ దృష్ట్వాతు కాదమ్బరీం
బాణాఖ్యేన కవీశ్వరేణ రచితాం దీర్ఘాం సుగూఢార్థకామ్,
కాశీనాథసమాఖ్యయా సువిదితః పద్మోర్జనాథప్రభో
రాదేశా దకరో దిమాం సులలితాం సంక్షిప్తకాదమ్బరీమ్"

మణిరామకవి యనునింకొకఁడు కాదంబర్యర్థసార మనుపేర నొకపద్యకావ్యము రచియించెను. నవీనులును దీనిని సంగ్రహించి వ్రాసియున్నా రనుట విదితము.

బాణుఁడు, భాసకాళిదాసులను, ఆఢ్యరాజహరిచంద్రప్రవరసేనులను బృహత్కథాప్రాచీనవాసవదత్తాదులను బ్రశంసించి, దండినిగాని దశకుమారచరిత్రను గాని పేర్కొనలేదు. ఇందుకుఁ గారణము దండి యితనికి నలువదియేఁబదియేండ్లలోపలిపూర్వుఁ డగుట గాక మఱేమియుఁ గనఁబడదు. తదర్వాచీనమహాకవుల యందఱిమెప్పు గాంచినదండినే స్మరింపనివాఁడు, కొందఱువిమర్శకులమాట నిజమని నమ్మినను, తనకుఁ బూర్వము ముప్పదినలువదియేండ్లలోపలివాఁ డయినసుబంధునివాసవదత్తను గొండంతచేసి స్తుతించునా? ఎక్కడిమాట!

వామనునికావ్యాలంకారసూత్రవృత్తిలో నుత్కలికాప్రాయమున కుదాహరణముగా[1] వాసవదత్తలోనియొకవాక్య ముదాహరింపఁబడుటయు, భవభూతి నాటకములలోనికొన్ని వాక్యములు చిన్నచిన్నమార్పులతో వాసవదత్తలోఁ గనఁబడుటయును గారణములుగా, వారియిద్దఱికి నడుమను సుబంధుఁడు క్రీ. ౭౫౦

---

[1] [illegible] ప్రచయచ [illegible]

ప్రాంతమున నుండియుండు ననవచ్చును. ఎట్లయినను వామనునికిఁ బూర్వుఁడు. ఇంతకంటె నితనిఁగూర్చి యేమియుఁ దెలియరాదు. ఇతఁ డద్వైతుఁ డగుబ్రాహ్మణుఁ డనిమాత్రము మంగళాచరణశ్లోకము తెలుపఁగలదు.

వాసవదత్తాకథ బృహత్కథనుండి తీసికోనఁబడి కొన్నిమార్పులతోఁ జక్కఁగాఁ బెరిఁగినది. వాసవదత్తతండ్రి యుజ్జయినీరా జగుప్రద్యోతుఁ డని మేఘసందేశరత్నావళ్యాదులు చెప్పుచున్నవి. బృహత్కథామంజరీకథాసరిత్సాగరములు చండమహాసేనుఁ డనుచున్నవి. ఇది కుసుమపురరా జగుశృంగారశేఖరుఁ డనుచున్నది. వాసవదత్త యుదయనుని బెండ్లియాడె నని తక్కినయన్నిటఁ గలదు. ఇందు, తండ్రి పుష్పకేతున కీయఁదలఁచి యుండ వాసవదత్త కందర్పకేతుని వరించి యతనిచేఁ గొనిపోఁబడె నని యున్నది. ఇట్టిమార్పు లున్నను, సుబంధుఁడు బృహత్కథ నెఱిఁగినవాఁ డనుటకుఁ గథామధ్యమున నున్న—అపూర్వా బృహత్కథా మయా శ్రుతా ప్రత్యక్షీకృతా చ—అనువాక్యము నిదర్శన మగును.

ఇందు, కథానాయకుఁ డైనచింతామణిపుత్త్రుఁ డగుకందర్పకేతువు చక్కని యువతిని గలలోఁ గాంచుట మిత్త్రునితోనడవి కేగుట, అచ్చటిజంబూవృక్షము మీఁదిపక్షులు చెప్పుకొనుకథలో, వాసవదత్త కందర్పకేతుని గలలోఁ జూచి యతని వరించి యున్న దనుమాటలు వినుట, ఆమె తమాలిక యనుశారికను రాజపుత్త్రునివద్దకుఁ బంపుట, అదియు నచ్చటికే వచ్చి యుండుట మొద లగువిషయము లతిమనోహరముగా శృంగారరసప్రధానముగా వర్ణింపఁబడినవి.

ఈకావ్యము క్లిష్ట మనుట కితనిమాటలే ప్రమాణము.
“ప్రత్యక్షరశ్లేషమయప్రపఞ్చవిన్యాసవైదగ్ధ్యనిధిం ప్రబన్ధమ్,
సరస్వతీదత్తవరప్రసాద శ్చక్రే సుబన్ధు స్సుజనైకబన్ధుః”

పూర్వోక్తగద్యప్రబంధములవలె నిదియు దేశీయులను విదేశీయులనుగూడ నాకర్షించినది. దీనికి జగద్ధరుఁడు తత్త్వదీపినియు, మేధావికులజాతుఁ డగుత్రివిక్రముఁ డొకవ్యాఖ్యయు మఱియొకఁడు కవిసింధుసుధాంశుబిందువును, సర్వచంద్రుఁడు టిప్పణమును, కాశీరామవాచస్పతి యొకటీకయు, నిర్మించిరి. ఆకాలమున వెలసినపైమూఁడాఖ్యాయికలును పఠనపాఠవ్యవహారమున వ్యాప్తి కెక్కి శ్రావ్యమైనకథలచేతను జక్కనికల్పనచేతను రసముచేతను గూడ విద్వల్లోక మాకర్షించిన వనుట సత్యము.

క్రీ. ౧౦౦౦–౧౦౫౦ నడుమ భోజునిపెత్తండ్రి యగువాక్పతిరాజువల్ల 'సరస్వతి' యని పిలువఁబడినవాఁడును, భోజదేవునిమన్నన గాంచినవాఁడు నగుధనపాలుఁ డనుజైనకవీంద్రుఁడు నిర్మించినతిలకమంజరి చాలావఱకుఁ గాదంబరిని

బోలినప్రౌఢగద్యకావ్యము. ఇందయోధ్యాపురరాజైనమేఘవాహనునికి మదిరావతి యనుధర్మపత్నియం దుదయించినహరివాహనుఁడు తిలకమంజరి యను విద్యాధరకన్యను మోహించుట వారిపరిణయము మొదలగువిషయములు శృంగారభరితములై వర్ణింపఁబడినవి. ఇది భోజమహారాజువినోదమునకు నిర్మింపఁబడిన ట్లీక్రిందిశ్లోకము చెప్పుచున్నది.

"నిశ్శేషవాఙ్మయవిదోఽపి జినాగమోక్తాః,
శ్రోతుం కథా స్సముపజాతకుతూహలస్య,
త స్యావదాతచరితస్య వినోదహేతో
రాజ్ఞః స్ఫుటాద్భుతరసా రచితా కథేయమ్"

భారతకథాశ్రయ మైనద్రౌపదీచరిత మనుచిన్నగద్యకావ్య మొకటి యున్నది. అందు ద్యూత మాదిగా ద్రౌపది పడినపాట్లు వర్ణింపఁబడినవి. కవిపేరు తెలియదు—రామాయణకథాశ్రయ మైనరామకథ యనుగద్యకావ్యము, ఆదిత్యవర్మయాజ్ఞచే వాసుదేవకవి రచియించెను. వీ రిద్దఱినివాసాదులుగూడఁ దెలియరావు. వచనశైలి సరసముగానే యున్నది.

వీరనారాయణచరితాదిగద్యకావ్యములు కొన్ని ప్రసంగవశమునఁ బూర్వప్రకరణములఁ బేర్కొనఁబడినవి. అవిగాక, అగస్త్యకవికృతమై కృష్ణచరిత మనునది యొకటి యముద్రితమైన దున్నది. ఇందలివిషయము భాగవతము ననుసరించిన శ్రీకృష్ణకథ. ఈయగస్త్యుఁడు మనము పూర్వము తెలిసికొన్నవిద్యానాథుఁడేమో! కవిత్వము రసవంతము ప్రౌఢమునై యొప్పుచున్నది. లిఖితపుస్తకములకడపటఁ గొన్నిశ్లోకములు కలవు. వానిశైలియు మనోహరముగా నున్నది. వీటినిబట్టి ప్రతాపరుద్రీయకర్తయే యీయగస్త్యుఁ డనుభావము దృఢపడుచున్నది. ఈగ్రంథము ప్రసిద్ధభాగవతకథ నాశ్రయించుటచే వ్యాప్తికి రాక మఱుఁగుపడి పోయినది. దీనితుదిశ్లోకములు వ్రాతప్రతిలో నిట్లున్నవి.

"శ్రవశ్యాలస్థూలంకరణభణితిగ్రన్థినిపుణైః
కవింమన్యై రన్యైః కిమిహ బహుభిరోమన్థహారిణైః,
విమర్శాదర్శాన్తః ప్రతిఫలదలఙ్కారరచనై
రగస్త్యః పౌరస్త్యా ననుసరతి సూక్తై స్సుమనసః"
"అనాదృత్య శ్లాఘ్యాన్ భువి కవినిబన్ధా నభిరతిం
కృతో వైయాసిక్యాం రచయితు రగస్త్యస్య విదుషః,
వసన్తీ వాగ్దేవీ కృతిని రసనాగ్రే వితనుతే
న పర్యఙ్కే పఙ్కేరుహి మహతి శఙ్కే విహరణమ్"

జైనకవి యగువాదీభసింహునిగద్యచింతామణియు వ్యాప్తికి రాలేదు. దీనిని మొన్న మొన్న వాణీవిలాసముద్రాలయమువా రుద్ధరించిరి. ఈకవికి ఓడయదేవు డనినామాంతరము.

"స్థేయా దోడయదేవేన వాదీభహరిణా కృతః
గద్యచిన్తామణి ర్లోకే చిన్తామణి రివాపరః"

జినశాసనముగా ఖ్యాతి గన్నయిది జైనమతకథాశ్రయమై నిర్దుష్టభాషా భాసురమై వెలయుచున్నది. ఇందు పదునొకండులంబకము లనుప్రకరణములు గలవు. ఈకవి క్రీ. పదునొకండవశతాబ్దిప్రాంతమువాఁడు—మాధవానలకామ కందలానామమున నొకకల్పితకథాగద్యకావ్య మున్నది. కవిపేరు తెలియదు. దీనికి మాధవానలకథ యనునది సంగ్రహనామము. ఇది కొంతకాలము ప్రచార ములో నున్నట్లు భట్టవిద్యాధరునిశిష్యుఁ డైనయానందకవి దీనిని సంగ్రహించి రచియించినమాధవానలశృంగారకావ్యమువల్లఁ దెలియుచున్నది. ఇదియును గద్యమే—విష్ణుశర్మపంచతంత్రమును సంగ్రహించి పంచోపాఖ్యానసంగ్రహ మను పేర ననంతభట్టు గద్యకావ్య మొకటిని ర్మించెను.

"పదవాక్యప్రమాణజ్ఞో ఽన న్తభట్ట ఇతిశ్రుతః
భట్టశ్రీనాగదేవస్య తనూజః కాణ్వశాఖినః,
కౌతుకా త్తన్యతే తేన పంచోపాఖ్యానసంగ్రహః"

## చంపుకావ్యములు.

రఘువంశాదికపద్యమునకును దశకుమారచరితాదిక గద్యమునకును విల క్షణమై తరువాతఁ దదుభయాత్మక మైనకావ్య ముదయించినది. అదే చంపువు. దీనిని కొక్కండ్రు పెక్కువిధములవర్ణించిరి గాని భోజవేంకటాధ్వరులచంపూప్రశంస యెంతయు సమర్థమగుచున్నది.

"గద్యానుబంధరసమిశ్రితపద్యసూక్తి,
ర్హృద్యాహి వాద్యకలయా కలితేవ గీతిః"
"అధత్తే హి తయోః ప్రయోగ ఉభయో రామోదభూమోదయం,
సఙ్గః కస్యహి న స్వదేత మనసే మాధ్వీకమృద్వీకయోః"

మన కిపుడు తెలియవచ్చినంతలో నీకావ్యముల మొదటిది త్రివిక్రమభట్టు నలచంపువు. ఈకవి క్రీ. 900 ప్రాంతమువాఁడు, ఇతఁ డవతారికలో సారస్వత కవివాక్కుల నిట్లు స్తుతించియున్నాఁడు.

కాలగాధావ్తః పరిస్పన్దం విబుధానన్ద మన్దిరమ్,
వన్దే రసాన్తరప్రాథం స్రోతఃసారస్వతం మహత్॥
ప్రసన్నాః కాన్తిహారిణ్యో నానాశ్లేషవిచక్షణాః,
భవన్తి కస్య చిత్పుణ్యై ర్ముఖే వాచో గృహే స్త్రియః॥

ఏడుచ్ఛ్వాసములయీగ్రంథమున నలదమయంతులచరితము వర్ణింపఁబడినది. దీనికి మూలము భారతములోనినలకథ. దమయంతీచంపూకథ యని దీనినామాంతరము. దీనికి జైనపండితుఁడగుగుణవినయగణి వివృతి నిర్మించెను. అందలి యవతారికలోని —

"శ్రీచణ్డపాలో ఽత్ర కియత్పదానాం, యద్యప్యనిన్ద్యాం వివృతి ఞ్చకార,
తథాపి తచ్ఛేషపదార్థసార్థ, ప్రకాశనార్థాం వివృణోమి చమ్పూమ్॥

అనుదానినిబట్టి చండపాలునిగచ్ఛద్వ్యాఖ్య నితఁడు మఱికొంత వివరించెనని తెలియుచున్నది. ఈటీకతోడిమూలము ముద్రితమై వ్యాప్తిలో నున్నది.

క్రీ. ౯౫౮ లో, జైనసోమదేవుఁడు రచియించినయశస్తిలక చంపువుగూడఁ బ్రసిద్ధమైనదే. ఇది యజ్ఞకర్మనిరాసములో జైనమతమును వ్యాపింపఁజేయునుద్దేశమున జనించినది. దీని కించుకపూర్వమో లేకపరమో తెలియ నవకాశములేదుగాని, జీవంధరచంపువు గూడ, ఆకాలమందలి దనవచ్చును. దీనికర్త హరిచంద్రుఁడను జైనకవి. ఇతఁడు, బాణభట్టుహర్ష చరితావతారికలో స్మరించినభట్టారహరిచంద్రుఁడు కాఁజాలఁడు. పదునొకండులంబకములయీకృతిలో విజయాసత్యంధరుల పుత్త్రుఁ జైనజీవంధరరాజుచరిత్ర వర్ణింపఁబడినది. ఇదియుఁ బైదానివలె జైనమత వ్యాప్తి నుద్దేశించినదే.

దీనితరువాత గణనకు వచ్చునది, ఉదయసుందరీకథ. దీనికర్త సోడ్ఢలుఁడు. కాయస్థకులమునఁ బుట్టినయీకవి తమవంశమునకు మూలపురుషుఁడు శిలాదిత్యునిభ్రాత యైనకలాదిత్యుఁ డనియు; అతఁడు శివునిసన్నిధి నుండుకాయస్థుఁ డనుపేరు గలగణపురుషునియవతార మనియు; గ్రంథాదిని దెలుపుచుఁ గాయస్థవంశమహాత్త్వమును వర్ణించుకొనియున్నాఁడు. కోంకణమునకుఁ గ్రమముగా రాజులైనఛిత్తరాజు నాగార్జునుఁడు ముమ్మణిరాజు, అనురాజసోదరులసత్కారములనందినవాఁడ ననియు, లాటదేశరాజైనచాళుక్యవత్సరాజునాస్థానమునఁ దాను గౌరవింపఁబడినవాఁడ ననియుఁ దెలుపుకొనియున్నాఁడు. క్రీ. ౧౦౨౬ లోనిఛిత్తరాజుశాసనమును, ౧౦౬౦ లోనిముమ్మణిరాజుశాసనమును, ౧౧౦౧ లోని (చాళుక్య)

వత్సరాజపుత్త్రుఁడై నత్రిలోచనపాలునిశాసనమును గనవచ్చుటంబట్టి[1] యీరాజుల నెఱిఁగినసోడ్ఢలుఁడు క్రీ. ౧౦౦౦—౧౦౭౦ నడుమ జీవించియున్నవాఁ డని తెలియ వచ్చును.

ఉదయసుందరీకథ యెనిమిదుచ్ఛ్వాసముల గ్రంథము. తక్కినకొన్ని చంపువులందువలెఁ గాక యిందు గద్యభాగ మెక్కువ. ఈకవి యవతారికలో బాణ భట్టును అతనిహర్షచరితమును మిక్కిలి ప్రశంసించుటకుఁ దగినట్లుగా నిందలిరచ నము చాలావఱకు హర్షచరిత్రగద్యరచనను బోలి జిగిగా నుండును. ఇందలికథ కల్పితము. ప్రతిష్ఠాననగరరాజగుమలయవాహనుఁడు నాగలోకనాథుఁ డైన శిఖండితిలకునికూఁతు రగునుదయసుందరిని, శ్రీవిష్ణువు సాగరకన్య యైనలక్ష్మిని వలెనే పరిణయ మయ్యె ననువిషయము సరసముగా వర్ణింపఁబడినది. ఈగ్రంథము చిరకాలము ముద్రితము గాక పడియుండుటవల్లఁ బాఠకలోకమున కిది యపరిచిత మైనది గాని ప్రసిద్ధము లైనచంపువుల కిది యేవిషయమందును దీసిపోదు. బరోడాసంస్థానమువారు దీని నుద్ధరించి ప్రకటించుట భాషాభాగ్యమే.

తరువాత గ్రహింపఁదగినది చంపూరామాయణము. దీనికవి ధారానగరాధీశుఁ డగుభోజమహారాజని చిరకాలప్రసిద్ధి. బహుకవులను బోషించినవాఁడును స్వయముగాఁ బెక్కుకృతులునిర్మించినవాఁడు నగు నితనిసరస్వతీకంఠాభరణాదికృతు లను బహూకరించినతరువాతిలాక్షణికు లెవరును గూడ నితనికవిత్వమును శంకించి యుండలేదు. దీనికి భోజచంపు వనుపేరే లోకప్రసిద్ధము. ఇందలియుద్ధకాండమును పూరించినలక్ష్మణకవ్యాదులుగూడ నిది యితని దగునా కాదా యని సంశయింప లేదు. అట్టియెడ నెట్టికారణమును జూపకయే ఏ. బి. కీతుపండితుఁడు "భోజరాజున కారోపింపఁబడినరామాయణచంపువు మిక్కిలి యరుచికరము గా నున్నది. నిస్సందేహముగా నది యీరాజుకంటెఁ దరువాతను, అనేకచంపువులతరువాతను బుట్టినది" అనుచు నెట్లు వ్రాసెనో తెలియకున్నది[2].

ఆంధ్రదేశమందు సంస్కృతవిద్యార్థి చంపువులు చదువ నారంభించునప్పుడు ముందు చేతఁ బట్టునది రామాయణచంపు వనుట సువిదితము. ద్రవిడదేశమందును గర్ణాటదేశమందును గూడ నెక్కువగా నిది ప్రచారములో నున్నట్లు తెలియు చున్నది. ఉత్తరహిందూదేశమున నిది మిక్కిలివ్యాపించిన దనుటకు దీనియము ద్రితపుస్తకములబాహుళ్యమే సాక్షి. అట్టియెడ నిది రుచిహీన మెట్లయినదో! అట్లయినచో లోక మింతగా దీని నేల యాదరించెనో! కావున, కీతుపండితుఁ డిది

1. ఉదయసుందరీకథ, బరోడాముద్రణము—ఇండియన్ఏంటిక్వరీభాగము 5. పు. 277.
2. చూ. A. B. Keith's Classical Sanskrit Literature P. 87.

భోజరాజకృతము గా దనుటయు రుచిహీన మనుటయుఁ గూడ నసంగత మని చెప్పవలసియున్నది.

చంపూరామాయణ మాయుకాండము లైనను భోజునికవిత సుందరకాండాంతమే. ఇతనికవిత్వ ముదాత్తమై రాచఠీవి చూపుచుండును. ఇందుకు ధర్మబోధకము ధర్మశాసనము నైననమస్క్రియారూపమంగళాచరణమే నిదర్శనము.

"ఉచ్చైర్గతి ర్జగతి సిధ్యతి ధర్మత శ్చే,
త్తస్య ప్రమాచ వచనైః కృతకేతరై శ్చేత్,
తేషాం ప్రకాశనదశాపి మహీసురై శ్చే,
త్తా నంతరేణ నిపతే త్క్వను మత్ప్రణామః"

ఇది రామాయణమున కెక్కువ దగ్గఱగా నున్నను, ఇందలిసరసకల్పనములు రసోచితవర్ణనములు మృదుపదలాలిత్యము మొదలైనసుగుణములు దీనిస్వాతంత్ర్యమును జాటుచునే యున్నవి. సత్కథతో సరస మైనవైదుష్యము నేర్పనిది గురు వగు ననుటకంటె దీనిఘనతను వర్ణింపఁ బనిలేదు. ఇందలియుద్ధకాండము నిర్మించిన లక్ష్మణకవి—

"భోజేన తేన రచితా మపి పూరయిష్య
న్నల్పీయసాపి వచసా కృతి మభ్యుదారామ్
న వ్రీడితో ఽహ మధునా నవరత్నహార
సంగేన కిం తు హృది ధార్యత ఏవ తన్తుః"

అని చెప్పినమాటలే యిందుకుఁ జాలును. ఈకవి యెప్పటివాఁడో తెలియకున్నది. కాని, క్రీ. ౧౭౦౦ ప్రాంతమువాఁడును, తంజావూరుభోసలరాజులయాస్థానములోనివాఁడును, ఇంతకు మున్ను పేర్కొనఁబడినవాఁడు నగుఘనశ్యామునికిఁ బూర్వుఁ డనిమాత్రము తెలియుచున్నది. ఈఘనశ్యాముఁడు లక్ష్మణకవివలెనే తానును యుద్ధకాండము రచియించి, లక్ష్మణకవియుద్ధకాండముతోఁ గూడ దీనికంతకును వ్యాఖ్య నిర్మించియున్నాఁడు. ఇతనియాకాండము గాని, ఆవ్యాఖ్య గాని ముద్రితములు కాలేదు. లక్ష్మణునియుద్ధకాండముకడపటిశ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు, 'నాగాంబికాగంగాధరపండితులపుత్రుఁ డైనలక్ష్మణకవి మహారాష్ట్రదేశమందలి భాగానగర మనఁబడెడియంశనగరమునకుఁ జేరినయగ్రహారమున నివసించినవాఁ డని తెలిపియున్నాఁడు.

ఘనశ్యాముఁడు తనయుద్ధకాండమునవతారికలోఁ దాను బదునెనిమిదియేండ్ల వయస్సున యుద్ధకాండము నిర్మించినట్లును, తనపేరు చౌండాజీవంతుఁ డయినట్లును—

"తే నాష్టాదశవత్సరేణ కవినా చౌణ్డాజిపంతేన చ
శ్రీమా నారచిత శ్చిరాయ జయతు శ్రీయుద్ధకాండో మహా"
అని వ్రాసికొని, వ్యాఖ్యావతారికలో నిట్లు తన్ను వర్ణించికొని యున్నాఁడు.
"శ్వాసా యస్య నిబద్ధనా న్యనుపమః కంఠీరవో ఽయం కవిః
క్రీడాచంద్రతి బాణతి ప్రబలతి క్షేమేంద్రతి ప్రౌఢతి.
శ్రీకంఠ త్యపి భర్తృమేంఠతి పునః శ్రీసార్వభౌమ త్యహో
నైకో వా నవఖండభూమిషు గుణం గృహ్ణాన్ విభు ర్భోజతి"
"పంచాశత్కృతయశ్చ నట్టయముఖాభాః కాళిదాసాధిక
స్యాస్యై తస్య మహాకవే ర్ఘమ ఘనశ్యామస్య వాచే నమః"

దీనినిబట్టి యుద్ధకాండరచనకాలమునందు చౌండాజిపంతనఁబడునితఁడు చంపూవ్యాఖ్యాకాలమున ఘనశ్యాముఁ డనఁబడె ననియు, బాణాదికవులతోఁ దన్నుఁ బోల్చుకొనుటయే కాక కాళిదాసుకంటె నధికుఁడ నని వ్రాసికొన్న యితఁడు మహాగర్వపరిపూర్ణుఁ డనియు, ఇదే కారణముగా మహిమశతకకర్తయగువాంఛేశ్వరుఁ డితని నన్యాపదేశముగా దూఱె ననియుఁ దెలియ నయ్యెడి.

కామాక్షీరత్నఖేటదీక్షితులపుత్త్రుఁ డైనరాజచూడామణిదీక్షితులు భోజచంపువుఁ బూరించుచు మఱియొకయుద్ధకాండము నిర్మించెను. కవి పేరు తెలియని యింకొకయుద్ధకాండ మున్నది. ఇవియు నముద్రితములే. ఎట్లయిన నన్నిటికి ముందు లక్ష్మణకవిదే పుట్టిన దనుట సత్యము.

భోజచంపునకు సాహిత్యమంజూషిక పదయోజన యనుమఱి రెండువ్యాఖ్యలాంధ్రదేశమునఁ బుట్టినవి. ఇందు, మొదటి దన్ని దేశముల మూలముతో ముద్రితమైనది. దానికర్త పంచాన్వయసంజాతుఁడు శాండిల్యగోత్రుఁడు త్రైలింగదేశీయుఁడు ధన్వంతర్యవతారనిఖిలవిద్యాసార్వభౌమకొండుభట్టునకును గంగాంబికకును బుత్త్రుఁడు రామచంద్రపండితుఁడు. పదయోజనావ్యాఖ్య పుట్టినపిదపనే యితని మంజూషిక పుట్టి యుండు నని యవతారికలోనిమాటలను బట్టి తెలియవచ్చును. ఇది యుత్తమవ్యాఖ్య యగుట విదితము.

పదయోజన ముద్రితము కాలేదు గాని, అచ్చుపడఁ దగినదని చెప్పఁగలను. దానికర్త మల్లినాథునివంశములోనినారాయణపండితుఁడు. ఇతఁ డవతారికలో మల్లినాథవంశక్రమము వర్ణించియున్నాఁడు. జగద్విఖ్యాతవ్యాఖ్యాత యగుమల్లినాథమహాదివంశపురుషులవిషయమై చరిత్రకర్తలు కొంతభేదము చూపుచుం కలరు. ఆవంశములోనికవి యిచ్చినయీపురుషక్రమము చరిత్రవిషయమునందు సత్యమును తెలుపఁగల దని యిందు చూపుచున్నాను.

కోలచలమల్లినాథుఁడు శతావధాని వీరరుద్రపూజితుఁడు—అతనికొడుకు కపర్ది శ్రౌతకల్పకారికావృత్తికర్త మంత్రవేత్త—అతనిపెద్దకొడుకు మల్లినాథుఁడు. రెండవకొడుకు పెద్దిభట్టు మహోపాధ్యాయుఁడు మాతులేయునిక్రతువునందు సర్వజ్ఞునిచే సత్కరింపఁబడినవాఁడు, నైషధము జ్యోతిషము మొదలగువానివ్యాఖ్యాత—అతనికుమారుఁడు కుమారస్వామి ప్రతాపరుద్రీయవ్యాఖ్యాత—అతనిపుత్త్రులు మహాదేవుఁడు మొద లగునలుగురు—మహాదేవునితనయుఁడుశంభుఁడు విశ్వజిద్యాగకర్త—అతనికొడుకు భాస్కరుఁడు—అతనితనూజుఁడు నాగేశ్వరయజ్వ సర్వతోముఖయాజి—అతనిరెండవకుమారుఁడు వేదవేత్త కవి యగుకొండుభట్టు—అతనికొడుకు నాగేశ్వరయజ్వ, అతనిభార్య నరసక్క—వారియిద్దఱిపుత్త్రుఁడు నారాయణుఁడు. అతఁడు చంపూరామాయణవ్యాఖ్యాత—దీనినిబట్టి కపర్దిపుత్త్రుఁడైన పెద్దిభట్టు తనయన్నపేరఁ బ్రసిద్ధవ్యాఖ్యలు నిర్మించినట్లు తెలియవచ్చును, ఆంధ్రలోకమున నట్టివాఁడుక యుఁ గలదు. కొన్ని శిశుపాలాదికావ్యములవ్రాఁతప్రతులలో వ్యాఖ్యాంతములందు పెద్దిభట్టుపేరు గూడఁ గనఁబడుచున్నది.

భోజలక్ష్మణకవులను స్మరించుచు, ఉత్తరరామాయణకథ నుత్తరచంపువుగాఁ బెక్కండ్రు రచియించినట్లు కనఁబడుచున్నది. వానిలో, తంజావూరుపాలకుఁడైన యేకోజీరాజుమంత్రి యైనగంగాధరామాత్యునికొడు కగుభగవంతరాయఁడును, ప్రసిద్ధవేంకటాధ్వరకవియు, శ్రీశైలాంబావేంకటార్యపుత్త్రుఁడు రాఘవుఁడును, మంగాంబావేంకటాద్రితనయుఁడు వేంకటకృష్ణకవియు, రచియించినవి చెక్కుచెద రక యముద్రితగ్రంథాలయములఁ దపస్సు చేయుచున్నవి.

చంపుభారతము. అనంతభట్టకృత మైనపన్నెండు స్తబకములయాకృతి పఠనపాఠవ్యవహారప్రసిద్ధము. దీనికి, కురవిరామకవి నిర్మించినవివరణమును, నరసింహాచార్యుఁడు రచియించినసరస్వతీవిలాసమును సంపూర్ణవ్యాఖ్యలుగాఁ గనఁబడుచున్నవి. రెండవదానిలోఁ దాత్పర్యార్థముమాత్రమే వ్రాయఁబడినది. అలంకారములు గాని శబ్దప్రక్రియ గాని నిరూపింపఁబడలేదు. ఈనరసింహాచార్యుఁడు వేదాంతదేశికాచార్యునిపుత్త్రుఁడు కౌశికగోత్రుఁడు. ఈదేశికాచార్యుఁడు, కవితార్కికసింహ వేంకటనాథవేదాంతదేశికునికంటె నన్యుఁడు—భోజచంపువులోనియుద్ధకాండము రచియించినలక్ష్మణసూరి నాలుగాశ్వాసములభారతచంపుతిలకము రచియించియున్నాఁడు. అది యముద్రితము. మానవేదరాజు తనపేర నొకచంపుభారతము రచించెను. అది సగము జీర్ణమై యున్నది. భారతచంపువు లింతకంటెఁ గనరావు—

భాగవతచంపువు లిప్పటి కైదు గోచర మగుచున్నవి. వానిలో, అభినవ కాళిదాసకృత మైనది విశేషవ్యాప్తి గాంచినది. ఇది యాఱుల్లాసములకావ్యము. ఉల్లాసములతుద నితఁ డిట్లు వ్రాసికొనియున్నాఁడు.

"తస్యాసౌ నవకాళిదాసవిదుష ష్షష్ఠోఽపి కావ్యామృతే
చంపూనామని ధీమతాం కృతసముల్లాసో విలాసో ఽగమత్"

దీనికి యల్లయార్యునివంశములోనివాఁడైనమోక్షగుండం అక్కయసూరి రత్నావళి యనుసరసమైనవ్యాఖ్య నిర్మించెను. అతఁ డవతారికలో వ్రాసినదానిని బట్టి కవియింటిపేరు వెల్లాలవా రని తెలియుచున్నది. నివాసకాలాదులను దెలుపు మాట లందును లేవు. ఎట్లయినఁ గవియు వ్యాఖ్యాతయుఁ గూడ నాంధ్రులనుట స్పష్టము. దేశప్రసిద్ధ మైనయీచంపువు పాఠకలోకమునాకర్షించినమహాకావ్యములలో నొకటి—ఇంతకు మున్ను ప్రశంసకు వచ్చినసూర్యనారాయణాధ్వరి పౌత్రుఁడైనచిదంబరకవి నిర్మించినదియు, అచ్యుతరాయాభ్యుదయకర్త రాజనాథ కవి రచియించినదియు, రామభద్రుఁ డనునింకొకకవి రచించినదియు నగుభాగవత చంపువులు హృద్యము లైనను లోకమున వ్యాపించలేదు. ఇట్లే యముద్రితము లైనయీపేరు గలచంపువు లింకను గల వని తెలియుచున్నది. వానిమాట యటుండ, ఆంధ్రుఁడు నిర్మించినమఱియొకచంపునుగూర్చి యించుక ప్రశంస—

అవసరాలపద్మరా జనునొకబ్రాహ్మణకవి బాలభాగవత మనఁబడు భాగవత చంపువు నిర్మించెను. దీని కాంధ్రదేశమున, పద్మరాజచంపు వని యే వాడుక. మఱియు, నితనినామములోనిపద్మశబ్దమున కంభోజశబ్దము నాదేశముచేసి, యిత నిని వర్ణాధికభోజరా జని (అంభోజరాజు=పద్మరాజు) యాంధ్రదేశీయులు వ్యవహరించియున్నారు. ఈకృతివ్రాఁతప్రతు లాధారముగానే చిరకాలము పఠనపాఠవ్యవహారమున నుండఁగా, మన్మిత్రులు, అమలాపురనివాసులు కర్రావిశ్వనాథశాస్త్రిగారు (బి. ఏ. బి. యల్) ౧౯౦౭ లోఁ దెలుఁగులిపిలోఁ బ్రకటించిరి. దీనికి దేవులపల్లి రామసూరి రచియించినసుధీచంద్రికయు రాఘవాచార్యుఁడు నిర్మించినకవిరంజనియు నముద్రితములు. ఇందు, సుధీచంద్రిక యవతారికవల్ల, పిఠాపురప్రభు వైనశ్రీరావు నీలాద్రిరాయలసచివుఁడు, అవసరాలపద్మరా జనుద్విజశ్రేష్ఠుఁడు పండితుఁడు భాగవతసారమును బాలభాగవత మనుపేరఁ గావ్యముగా నిర్మించె నని తెలియు చున్నది. ఇది యైదుసర్గలకావ్యము. ప్రతిసర్గతుద నొకశ్లోక మిట్లున్నది.

"మహాత్యముష్మిన్, సరసీవ పద్మ, రాజద్విజోదంచితసూక్తిహృద్యే
కావ్యే నవే భాగవతే ఽయ మగ్ర్య, స్సర్గ స్తరంగ స్తబకోపమో ఽగాత్"

ఈకావ్యము నూఱేండ్లక్రిందటి దైనను, పూర్వకావ్యమువలె నెల్లవిషయముల రంజకముగానే యుండునుగాని, కృష్ణునిబాల్యచేష్టలు వర్ణించునెడ శృంగారము మితిమీఱి మిక్కిలి పచ్చిగా నున్నది—అద్వైతవిద్యాగురుషడ్భాషాచతురాది బిరుదుఁ డైనరత్నఖేటశ్రీనివాసదీక్షితుఁడు భైష్మీపరిణయచంపువు రచియించెను. శాస్త్రదీపికాకర్తయై ఖ్యాతి కెక్కి-నయితనికవిత్వము రమ్యమై యొప్పుచున్నదిగాని యీకృతి ప్రచ్ఛన్నమై యున్నది—హాలాస్యాభ్యుదయశైవపురాణతామసత్వనిరాకరణాదులు నిర్మించిననీలకంఠదీక్షితునినీలకంఠవిజయచంపువు ప్రసిద్ధము. దీనికిఁ బూర్వోక్తుఁ డైనఘనశ్యాముఁడు, కథావిషయము సులభముగాఁ దెలియుటకు రచియించినయనుక్రమణికయు, వేంకటేశపండితునివ్యాఖ్యయు, పతాక యనెడి యింకొకటీకయుఁ గలవు గాని, అవి యముద్రితములు.

కామాక్షీదాసుఁ డనుకాళహస్తికవి వసుచరిత్రచంపు వొకటి రచియించెను. ఇతఁడు, చంద్రగిరా జయినవేంకటపతిరాయలసత్కారమంది లోకప్రసిద్ధుఁ డైన అప్పయదీక్షితునిశిష్యుఁడు. ఈవేంకటపతిరాయలయన్న యైనతిరుమలదేవరాయలు కృతిపతిగా రామరాజభూషణుఁ డాంధ్రమున వసుచరిత్ర నిర్మించినవిషయము విదితము. కావున నాంధ్రవసుచరిత్రను జూచి యీకవి సంస్కృతమున వసుచరిత్ర నిర్మించె ననుట సంగత మగుచున్నది. రామరాజభూషణుఁడు క్రీ. ౧౫౬౦—౭౦ నడుమ వసుచరిత్ర నిర్మించియుండును. అప్పయదీక్షితులు ౧౫౫౦—౧౬౨౦ మధ్య నున్నవాఁడు. అందుచే ౧౬౦౦ ప్రాంతమున నిది పుట్టియుండు నని తెలియుచున్నది.

ఈకవి యీక్రిందిశ్లోకమునఁ దెల్పినకథావిషయము గూడ నిది యాంధ్ర వసుచరిత్ర యాధారముగా వెలసిన దని తెలుపును.

"వసుప్రభు ర్వాసవధాతరీత్యా, కోలాహలాద్రీశకుమారికాయాః,
గీతోజ్జ్వలాయా గిరిజాభిధాయాః, కల్యాణశాలీతి కథాస్తు పుణ్యా"

దానివలెనే యిదియు నాఱాశ్వాసములకావ్యము. సమకాలికుఁ డిట్లు వసుచరిత్రను సంస్కృతీకరించుట వసుచరిత్ర కాకాల మందున్న గౌరవమునకు విదర్శన మగును—కాళిదాసుకుమారసంభవము ననుకరించి, క్రీ. ౧౭౦౦ ప్రాంతమువాఁడును, తంజావూరుభోసలవంశమువాఁడును, అగురెండవశరభోజీరాజు సుబ్రహ్మణ్యజననవృత్తాంతమును కుమారసంభవచంపు వనుపేర వర్ణించెను. నాలుగాశ్వాసముల యీకృతి నతనియాశ్రితుఁ డైనగుండునామకుఁడు శా. శ. ౧౭౩౪ లో లిఖియించి నట్లు వ్రాతప్రతిలోఁ గనఁబడుచున్నది. కావున నిది ౧౭౧౨ లో సమాప్తి నొందిన దనుట నిజము—రామచంద్రదీక్షితుఁడు కేరళాభరణము నిర్మించెను. ఇతఁడు సుప్రసిద్ధరత్నఖేటశ్రీనివాసదీక్షితునివంశములోనివాఁ డని యిందలియవతారిక తెలుపుచున్నది. రత్నఖేటదీక్షితుఁడు పదియేనవశతాబ్ది మొదటిభాగములోని

వాఁడుకావున నతని కైదుతరములతరువాతివాఁడైనయితఁడు పదియేడవశతాబ్ది యుత్తరభాగములోనివాఁడై యుండును. ఈకృతిలోనివిషయము భరతఖండ మున నేదేశము రమ్యమైనది? ఎక్కడియాచార ముత్తమమైనది? అనువానిని వసిష్ఠవిశ్వామిత్రులు చర్చించి కేరళదేశ మన్నివిధముల మంచి దని నిర్ణయించుట. ఇందు క్రిందిశ్లోకము—

"కతమో దేశో రమ్యః క స్యాచారో మనోహరో మహతామ్,
ఇతి వాదిని దేవపతౌ, సంఘర్షో ఽభూ ద్వసిష్ఠగాధిజయోః"

దీనినిబట్టి యిది స్వతంత్రరచన మనియు, కవి కేరళవాసియై తదభిమానము చూపె ననియుఁ దెలియును—ఇతనివలెనే మాయావరప్రాంతమందలికిలయూరు గ్రామమువాఁడును, పదియేడవశతాబ్దికడపటివాఁడు నగు అప్పాధ్వరి, గౌరీమాయూరమహాత్మ్య మనుపేర, తంజావూరుమండలములోనిమాయవరగ్రామము గొప్పతనము వర్ణించుచు నొకచంపువు రచియించెను—తంజావూరుపాలకుఁడైన ఏకోజీమహారాజుమంత్రియైననృసింహామాత్యుఁడు త్రిపురాసురసంహారకథను, త్రిపురవిజయచంపువుగా రచియించెను. ఇతఁడు పదియేడవశతాబ్దికడపటివాఁడు— నిత్యామృతమతి యనుకవీంద్రుఁ డొకఁడు పైకథనే త్రిపురదహనచంపువుగా రచియించియున్నాఁడు. ఈరెంటిలో నేది ముందో తెలియకున్నది.

భాస్కరాచార్యబీజగణితవ్యాఖ్యాతలలో నొకఁడును గణకానందాదిబహుగ్రంథకర్తయు, మున్ను పేర్కొనఁబడినవాఁడు నగుదైవజ్ఞసూర్యపండితుఁడు నాలుగుల్లాసముల నృసింహచంపువు సరసముగా నిర్మించియున్నాఁడు. ఇందు భాగవతములోనిప్రహ్లాదచరిత్ర వర్ణింపఁబడినది. ఈక్రిందిపద్యములు కవివిషయము తెలుపును.

"అస్తి త్ర్యస్తసమస్తదోషనివహం గోదావిదర్భాయుతే,
క్రోశే నోత్తరత స్తదుత్తరతటే పార్థాభిధానం పురమ్,
త త్రాసీ ద్గణకాగ్రణీః పృథుయశాః శ్రీనాగనాథద్విజో
భారద్వాజకులే ఽథ తస్య తనయః శ్రీజ్ఞానరాజాభిధః"
"యద్గ్రన్థా న్సమధీత్య శిష్యనివహో ఽప్యాచార్యచర్యా మగాత్,
తత్సూను ర్గణితాగమప్రతరణే యత్కర్ణధార స్సుధీః
సంగీతాగమకావ్యనాటకపటు స్సూర్యాభిధానః కవిః,
చమ్పూకావ్య మిదం చకార చతురం లక్ష్మీపతిప్రీతయే"

సకలకలాకులతిలకుఁడైనశివదాససూరిపుత్త్రుఁడు సంకర్షణపండితుఁ డింకొక నృసింహచంపువు నిర్మించెను. ఇతఁ డవతారికలోఁ జెప్పుకొన్న స్వవిషయ మతిగంభీరముగా నున్నది. అందలి దొకశ్లోకము.

"మీమాంసాజ స్థభూమిః ఖని రపి నిఖిలన్యాయసాంఖ్యాగమానాం,
వేదాన్తానాఞ్చ వక్తా కవికులతిలకః సర్వసామ న్తపూజ్యః,
శ్రోతాక్షే త్రండరాద్రి ప్రతినిధి రతులః శ్రీనృసింహ ప్రసాదా
చ్చమ్పూకావ్యం రసాలం రసయతి విబుధానన్దసన్దోహ హేతుః"

కేశవభ ట్టనునింకొకకవి మఱియొకనృసింహచంపువు ని ర్మించెను. అతఁ డిట్లు నిజవిషయ మెఱిఁగించెను.

"శ్రీలౌగాక్షికులారవిన్దతరణి ర్మాధ్యం దినామ్నాయవి,
న్మీమాంసాయుగతర్కతంత్రచతురః సాహిత్యరత్నాకరః,
కావ్యం శ్రీనృహరేః కరోతి సుకృతీ గోదాతరప్రోల్లస,
త్పుణ్యాస్తమ్భనివాసి కేశవసుతానంతా త్మజః కేశవః"

క్రీ. పదియేడవశతాబ్దిలోనిధర్మరాజపండితుఁడు, తిరుపతివేంకటేశ్వర స్వామి నాయకుఁడుగా, పద్మినీపరిణయాదికథలు వర్ణించుచు వేంకటేశచంపువును, కవివాదిశేఖరుఁడు శివునియనుగ్రహమున మార్కండేయుఁడు చావు తప్పించుకొనుట యనుకథతో శివచంపువును, విరూపాక్షకవి శివమహిమవర్ణనతో శివవిలాస చంపువును రచియించిరి. తంజావూరులోనిగంగాధరామాత్యునితనయుఁ డగునారాయణరాయఁడు ప్రతిష్ఠానపురరాజగువిక్రమసేనరాజుచరితము నొకచంపువుగాను, సుధర్ముని కొడు కైనయాకాశవర్మ కథానాయకుఁడుగా నొకకథ కల్పించి శ్రీనివాసపండితుఁడు శ్రీనివాసచంపువుగాను రచియించిరి. ఇవి యెల్ల హృద్యములే యైనను గ్రంథబాహుళ్యము కారణముగా వ్యాపించలేదు. ఇట్లే—

శ్రీకృష్ణునిచరిత మాధారముగా నరసింహకవి కృష్ణభూషణము, నరసింహసూరి కృష్ణవిలాసము, పేరు తెలియనియొకకవి కాళిందీముకుందము, విష్ణుచిత్తపుత్రి యగుగోదాదేవికథతో వేదాధినాథమహాచార్యుఁడు గోదాపరిణయము, పేరు తెలియనియింకొకకవి యుషాపరిణయము, లోకనాథపుత్రుఁడు చక్రకవి ద్రౌపదీపరిణయము, గంగాధరకవి మద్రకన్యాపరిణయము, కందుకూరినాగనాథసూరి మీనాక్షీకల్యాణము, అనుచంపువులు వ్రాసిరి. ఇట్టి పరిణయచంపువులు పాంచాలీస్వయంవరాదు లింకను గలవు. నాథముని రామానుజ వేదాంతదేశికాదిమహాపురుషులచరితములు చంపువులై పెక్కు కనఁబడును. తీర్థయాత్రలచరితములు కొన్ని తీర్థప్రబంధాదినామములఁ జంపువు లైనవి. ఒక్కొకయూరిలోనిస్వామి నధికరించి వ్రాసినచంపువు లనేకములు. ఇఁక వీని నిటుంచి, విశ్వరంజక మైనవిశ్వగుణాదర్శము ను గూర్చి యించుక ప్రసంగింతము.

స్వకపోలకల్పితచంపుకావ్యములు లెక్కకు నాలుగైదు కనవచ్చినను విశ్వగుణాదర్శమువలె సహృదయరంజకమై కీర్తి గాంచినది వేఱొకటి లేదు. మహా

పండితుఁడు మహాకవియునై పదియేడవశతాబ్దినడుమఁ గాంచీమండల మలంక రించిన వేంకటాధ్వరి వరదరాజాభ్యుదయము (కరిగిరిచంపువు) మొదలైనకృతు లనేకములు రచియించెను గాని, ఇతనియుత్తమయశస్సునకు విశ్వగుణాదర్శమే నిదాన మనవచ్చును. ఇందలిపద్యగద్యసంఖ్య ౧౦౦౨. కృశానువిశ్వావసునామక గంధర్వులసంభాషణమునఁ బ్రపంచమందలిప్రధానవస్తువులగుణదోషములు విమ ర్శింపఁబడినవి. ప్రతిపదార్థమందును జివరకు గుణము సిద్ధాంతీకరింపఁబడును. దీనికి మధురసుబ్బాశాస్త్రి భావదర్పణ మనువ్యాఖ్య నిర్మించెను. ఇది యొకవిమర్శ కావ్యము.

దీని ననుకరించి శ్రీశైలం అన్నయార్యుఁడు తత్త్వగుణాదర్శ మనుచంపు వొకటి వ్రాసెను. ఇతఁడు జిజ్ఞాసాదర్పణతత్త్వమార్తాండములు నిర్మించినశ్రీని వాసాచార్యునిసోదరుఁడు, కోసల వేంకటరాజునాస్థానపండితుఁడు. పదియేడవశతాబ్ది కడపటివాఁ డని తోఁచుచున్నది. శాంభవుఁడు తామసగుణముచేఁ దత్త్వము తెలియఁజాలఁడు. వైష్ణవుఁడు సత్త్వగుణముచేఁ దెలియుచున్నాఁడు. అనునది యిందలివిషయము.

వల్లీసహాయకవి యనునర్వాచీనుఁడు గురుశంకర లఘుశంకర విజయాది గ్రంథము లవలోకించి శ్రీజగద్గురుశంకరాచార్యులదిగ్విజయమును, ఆచార్యదిగ్వి జయ మనుపేర నొకచంపువుగా నిర్మించెను. ఇందు, శివావతారపురుషుఁడై నశంకర భగవత్పాదుఁడు దుర్మతనిరాకరణము సద్వైతమతస్థాపనము గావించి భక్తలో కము రక్షింపఁ బూని, ఆనందగిరి పద్మగుప్త హస్తామలక చిద్విలాసశుద్ధానంద జ్ఞానకంద విష్ణుదర్శన బుద్ధి విష్ణుగుప్త సమిత్పాణిశుద్ధాకృతి వృద్ధవిరించి నామ ములు గలతొమ్మండుగురుశిష్యులను వెంటఁబెట్టుకొని దిగ్విజయయాత్ర బయలువెడలి మధ్యార్జునక్షేత్రము మొదలుగా, కాంచీనగరమువఱకుఁ గలయిరువదియైదు క్షేత్రములు తిరిగి పాంచరాత్ర వైఖానస భాగవత వైష్ణవ కాపాలిక బౌద్ధ జైనాది మతగురువుల నోడించి యాయాస్థలముల స్వమతము ప్రతిష్ఠించె ననువిష యము హెచ్చుగా వర్ణింపఁబడినది.

ఇది, కావ్యనాటకాలంకారచ్ఛందోవ్యాకరణాదిబహు
విధవిషయకపంచాశద్గ్రంథకర్తయైన మల్లాది
సూర్యనారాయణశాస్త్రి నిర్మించిన
లౌకికవాఙ్మయచరిత్రయందు
సప్తమాధ్యాయము.

---

# అష్టమాధ్యాయము



## రూపకములు

సంస్కృతసారస్వతమునకు సారభూతమైనదృశ్యకావ్యము రూపక మనఁబడును. విని యానందింపఁ దగినపురాణములకంటెను, చదివి సంతోషింపఁదగిన తక్కినకావ్యములకంటెను, పండితపామరసాధారణముగా సామాజికు లందఱును నాట్యరంగమున నటు లభినయించు నాయికానాయకులయుదంతము చూచి యానందింపఁ దగిన దగుటచే రూపక ముత్తమోత్తమ మని పూర్వులు ప్రశంసించిరి. అది యట్టిద—

చ. కవిచతురాననప్రతిభఁ గల్పిత మైనవిచిత్రసృష్టికిం
దవిలినదేశకాలసురదానవమానవవృత్త మెల్ల ని
క్కువ మనునట్లుగా నెదుటఁ గూరిచి చూపఁ జిత్తమున్ సుఖా
ర్ణవమున నోలలార్చుకృతిరాజము రూపకమే తలంపఁగన్.

దీనిని, నాటకము ప్రకరణము భాణము ప్రహసనము డిమము వ్యాయోగము సమవాకారము వీథి అంకము ఈహామృగము, అని ప్రధానముగాఁ బది విధములుగాను, నాటిక త్రోటకము గోష్ఠి సట్టకము నాట్యరాసకము ప్రస్థానము ఉల్లాప్యము కావ్యము ప్రేంఖణము రాసకము సల్లాపకము శ్రీగదితము శిల్పకము విలాసిక దుర్మల్లిక ప్రకరణిక హల్లీశము భాణిక, అని యప్రధానముగా నుపరూపకసంజ్ఞలఁ బదునెనిమిదివిధములుగాను బూర్వులు విభజించిరి. డోంబి మొదలుగా నుపరూపకభేదము లింకను గొన్ని కనవచ్చునుగాని, వీనిలో నాటికను మాత్రము దశరూపకములతో సమానముగా నాదరించిరి. భరతముని ధనంజయాదు లెల్ల రూపకములలో దశవిధరూపకము లెక్కు డనుభావము ప్రకటించినను, వీనిలోఁ గొన్నిమాత్రమే యుత్తమకవులవాక్కుల కెక్కినవి. అందును, నాటకము సర్వవిధముల సకలసహృదయరంజకమై 'నాటకాన్తంహి సాహిత్యమ్—నాటకాన్తం కవిత్వమ్', అనురీతిని ఒకనరచనములకుఁ బరమావధియై తక్కినయన్నిటిని దిగఁ ద్రొక్కి తాను పైకి వచ్చినది. దానంజేసి ప్రదర్శింపఁబడున దేరూపక మైనను, నాటక మనియే వాడుక వచ్చినది.

ప్రపంచ మొకపెద్దనాట్యరంగమై కనవచ్చుచుండ నాట్యధర్మములు వాఙ్మయమున నెపు డుదయించిన వని యన్వేషింపఁ బనిలేదు. ఋగ్వేదమునందు,

ఊర్వశీపురూరవులు అపాల వృశుఁడు గోతముఁడు మొదలగువారికథ లనేకములు శృంగారవీరకరుణాదిరసోదంచితములై రూపకధర్మముల విలసిల్లుచున్న వనుట వాస్తవము. ఐతరేయబ్రాహ్మణములోని కవషునికథవంటికథ లేకాంకరూపకములుగాఁ బ్రయోగింపఁ దగియున్నవి. చిన్నచిన్నమార్పులు గావించి యభినయింపఁ దగినఘట్టము లనేకములు రామాయణమహాభారతములందు గలవు. పాణిన్యాచార్యులు పేర్కొన్ననటసూత్రమునుబట్టి నాఁడు నటులు రూపకము లభినయించెడియాచారము కల దని తెలియుచున్నది. ఇంత యేల? నాలుగువేదముల సారమే నాట్యవేద మన్న భరతమునికిఁ బూర్వమే నటులు నాట్యరంగమున రూపకములఁ బ్రదర్శించుట కల దనుట కతనినాట్యశాస్త్రమే సాక్షి యగుచున్నది. అయితే నేమి? ఆనాఁటిదృశ్యకావ్య మొకటియు నేఁడు లభింపకున్నది. కనిపించినంతలో భాసనాటకములే యీప్రకరణమునకు శ్రీకార మగుచున్నవి.

రూపకసారస్వతమున భాసునికృతు లెంతమొదటివో నేటిపాఠకలోకమున కంత కడపటి వైనవి. భాసుఁ డిరువదినాలుగురూపకములు నిర్మించినవాఁ డని పూర్వకవిపండితసంప్రదాయ మొకటి వచ్చుచున్నది. రాజశేఖరునివిగా నందందు కనవచ్చుప్రాచీనకవిప్రశంసాశ్లోకములు కొన్ని యతనికవివిమర్శనములోని వని కొంద ఱూహించుచున్నారు. ఆగ్రంథము కనఁబడదు గాని, ఈక్రిందిశ్లోక మతనిదిగా సుభాషితావళిలో నున్నది.

"భాసనాటకచక్రేఽపి చ్ఛేకైః క్షిప్తే పరీక్షితుమ్,
స్వప్నవాసవదత్తస్య దాహకో ఽభూ న్న పావకః"

భాసుఁడే ధావకుఁ డని విశ్వసించినయొకపూర్వకవీశ్వరుని చాటుశ్లోకములు రెండు పండితసంప్రదాయమున నిట్లున్నవి.

"భాషాసు రమ్యా గైర్వాణీ, తస్యాం కావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం తత్ర భాసకవేః కృతిః,
ధావకాపరనా మాయం, భాసో భాసయతే జగత్,
తత్త్వైరి వాదిపురుష శ్చతుర్వింశతిరూపకైః"

వీటినిబట్టి భాసుఁ డిరువదినాలుగురూపకములు రచియించి యుండె నన వచ్చునుగాని, అనంతశయనమహారాజులసమాదరణమున ముద్రితములైనయితని రూపకము లిప్పటికిఁ బదుమూఁడుమాత్రమే కనఁబడుచున్నవి. ఉదాత్తరాఘవ కిరణావళీనాటకము లితని వనెడిచాటు వొకటి కలదు గాని, ఆగ్రంథములు కన రాకుండం జేసి యుండవలెనను సత్యము నిగూఢ మగుచున్నది. శ్రీహర్షునిపేరఁ బ్రకటితము

లైనరత్నావళీప్రియదర్శికానాగానందములకర్త భాసుఁడే యని రాజశేఖరుఁడు కవివిమర్శనములోఁ జెప్పినట్లు కొన్నిచాటుశ్లోకములు వ్యాపించినవి గాని[1] ఆశ్రీ హర్షుఁడు క్రీ. పూ. ౫౭ లోని శ్రీహర్షవిక్రమాదిత్యుఁ డన్నను, భాసుఁ డతనికి సమకాలికుఁడై యతనిసభలో నుండి యతనిపేరఁ బైరూపకములు మూఁడును రచియించి యుండు ననుట కవకాశ మెంతమాత్రము కనఁబడదు గావున నట్టి చాటువులు విశ్వసనీయములు కాఁజాలవు. అందుచే నితనిరూపకము లిప్పటికిఁ బదమూఁడే యంద మన్న నిందును గొంత మతభేదము కలదు.

ప్రతిమ స్వప్నవాసవదత్త అవిమారకము చారుదత్తము ప్రతిజ్ఞాయౌగంధ రాయణము అభిషేకము, అనునాఱు నితనివి, బాలచరితము మధ్యమవ్యాయో గము పంచరాత్రము దూతవాక్యము దూతఘటోత్కచము కర్ణభారము ఊరు భంగము ననునేడు నితనివి కా వని కొందఱును, ఇవి యన్నియు నితనివే యని కొందఱు నందురు. ఈ రెండుపక్షములయుక్తులు పరామర్శింపఁగా, ఒక దానిలోని శ్లోకమో వాక్యమో భావమో మఱియొకదానిలోఁ గనవచ్చుట యనెడియాంతరప్రమాణమునుబట్టి, ఈనాటకము లన్నియుఁ బ్రకటించినశ్రీగణ పతిశాస్త్రిగారును, ప్రతిమానాటకము ప్రకటించినశ్రీపరంజపేగారును జెప్పిన ట్లీపదుమూఁడురూపకము లితని వని విశ్వసించుటయే యిప్పటికి సముచిత మని తోఁచుచున్నది. ఈరూపకము లన్నిటిని దెలుఁగువచనమున రచియించిననాఁటి నాయభిప్రాయముఁగూడ నిదియే. ఇది యిప్పటి కొకవిధముగా సిద్ధాంత మైనను "ఈరూపకములు భాసుఁ డనుప్రాచీనకవి రచియించినవి కావు. లభించినవ్రాత పుస్తకము లం దెందును భాసునిపేరు కనఁబడలేదు. అందుచే వీనిని భాసుని కారోపించుట యుక్తియుక్తము కాదు" అనెడియేకదేశిమతమును గూడ నీసందర్భ మున స్మరింపవలసియున్నది.

కాళిదాసాదిమహాకవులు కొందఱు తమకావ్యముల మొదటఁగాని తుదను గాని తమకర్తృత్వమును దెల్పుశ్లోక మొకటియుఁ జేర్చుకొని యుండలేదు. 'ఇతి శ్రీకాళిదాసకృతౌ' ఇత్యాదిగా వారివారికృతులఁ గనవచ్చుగద్యములు పాఠక

1. ఆదౌ భాసేన రచితా నాటికా ప్రియదర్శికా,
నిరీక్ష్యస్య రసజ్ఞస్య కస్య న ప్రియదర్శనా,
తస్య రత్నావళీ నూనం రత్నమా లేవ రాజతే,
దశరూపకకామిన్యా వక్ష స్యత్యన్తశోభనా,
నాగానన్దం సమాలోక్య యస్య శ్రీహర్షవిక్రమః,
అమందానందభరిత స్స్వసభ్య మకరోత్కవిమ్,

సంప్రదాయమును బట్టి లేఖకులు చేర్చిన వని వానివైవిధ్యమే చెప్పుచున్నది. నేను జూచినశాకుంతలనాటకమువ్రాఁతప్రతులుగొన్నిట 'ఇతిశ్రీకాళిదాసకృతౌ' అను మాటయే లేదు. ఇట్లే మఱికొందఱికావ్యములలిఖితపుస్తకములందును గద్యలలోఁ గవిపేరు కనఁబడదు. అంతమాత్రమున శాకుంతలాదులు కాళిదాసాదికృతములు కా వనఁదగునా? ఇంతకును, భాసుఁడా, రెండు వేలయేండ్లక్రిందటివాఁడు, ఉత్తర హిందూ దేశమువాఁడు. శ్రీగణపతిశాస్త్రిగారిప్రథమముద్రణమునకు దొరకిన స్వప్నవాసవదత్తాదిరూపకములవ్రాఁతప్రతులా, మూఁడువందలయేండ్లనాఁటివి, దక్షిణతిరువాన్కూరుదేశములోనివి. కాలమునఁ గాని దేశమునఁ గాని యెంత యంతర మున్నదో చూడుఁడు. ఈవ్రాఁతపుస్తకములకు మాతృక లైనలిఖిత గ్రంథము లేదేశములోనివో యెప్పటివో యెన్నవసారి వ్రాయఁబడినవో! గద్యలలో భాసుని పే రెప్పుడు జాఱిపోయినదో! కావున వ్రాఁతపుస్తకములలోనిగద్యలలో భాసునిపేరు కనఁబడలే దన్నకారణమునుబట్టి యీరూపకములు భాసునివి కావనుట సముచితముకాదు. అది గాక, ఇవి యితని వనుట కితరము లైనప్రబల ప్రమాణములు లభించుచుండ నీయాక్షేప మెట్లు గ్రాహ్య మగును?

బాణభట్టు హర్షచరితావతారికలో—

"సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ"

అనుచు భాసకవిని, అతనికృతులను బొగడియున్నాఁడు. పేళ్లు చెప్పక పోయినను, సూత్రధారకృతారంభాదిలక్షణములతోడి యానాటకములు స్వప్న వాసవదత్తాదు లనుట విదితము. రాజశేఖరకవిభాసనాటకచక్రమును స్వప్నవాసవదత్తను బేర్కొన్నవాఁ డని యింతకుమున్నే చదివియున్నాము. క్రీ. పన్నెండవ శతాబ్దిలోనిహేమచంద్రునిశిష్యు లగురామచంద్రగుణచంద్రులు తమనాట్యదర్పణమున—

"యథా భాసకృతే స్వప్నవాసవదత్తే శేఫాలికాశిలాతల మవలోక్య వత్సరాజః" అనువాక్యమెత్తి—

"పాదాక్రాన్తాని పుష్పాణి సోష్మ చేదం శిలాతలమ్
నూనం కాచి దిహాసీనా మాం దృష్ట్వా సహసా గతా"

అనుశ్లోక ముదాహరించియున్నారు. ఈశ్లోకము ముద్రిత మైనస్వప్న వాసవదత్తలోఁ గనరానిమాట నిజ మైనను, రామచంద్రగుణచంద్రులు చూచిన ప్రతిలో నిది యున్న దని వారిమాటనుబట్టి నమ్మక తప్పదు. భోజదేవుఁడు శృం

గారప్రకాశమందును, శారదాతనయుఁడు భావప్రకాశమందును, అభినవగుప్తుఁడు నాట్యశాస్త్రధ్వన్యాలోకవ్యాఖ్యలందును, సర్వానందుఁ డమరకోశవ్యాఖ్యయందును, సాగరనంది నాట్యలక్షణరత్నకోశమందును, స్వప్నవాసవదత్తను పేర్కొనియున్నారు. కాళిదాసవాక్పతిజయదేవాదులు భాసకవిని పేర్కొనియున్నారు. దండిభామహవామనులు తమయాలంకారికకృతులందు భాసునిపేరును, కావ్యముపేరును, చెప్పకయే కొన్నిశ్లోకము లుదాహరించియున్నారు. ఆశ్లోకములు భాసకృతులలో గనవచ్చుచున్నవి.

దండి కావ్యాదర్శములో నుదాహరించిన—లిమ్పతీవతమోఽఙ్గాని వర్షతీవాఞ్జనం నభః—అనుమాటలు బాలచరితచారుదత్తములు రెంట నున్నవి.

భామహుఁడు తనకావ్యాలంకారమున న్యాయవిరోధమున కుదాహరించిన వత్సరాజవృత్తాంతమును సాలంకాయననేతృక మైనకపటగజవృత్తాంతమును సరిగాఁ బ్రతిజ్ఞాయౌగంధరాయణమునఁ గనఁబడుచున్నవి.

వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిలో నుదాహరించిన—

"యోభర్తృపిణ్డస్యకృతే న యుధ్యేత్"

అనునది ప్రతిజ్ఞాయౌగంధరాయణములోని 'నవంశరావ' మిత్యాదిశ్లోకము చతుర్థపాదముగా నున్నది [1]. మఱియు—

యాసాం బలి ర్భవతి మద్గృహదేహళీనాం,
హంసైశ్చ సారసగణైశ్చ విలుప్తపూర్వః,
తా స్వేవ పూర్వబలిరూఢయవాఙ్కురాసు
బీజాఞ్జలిః పతతి కీటముఖావలీఢః"

అనుశ్లోకము చారుదత్తములో నున్నది. ఈశ్లోకమే దరిద్రచారుదత్తములోనిదిగా నభినవగుప్తునినాట్యశాస్త్రవ్యాఖ్యలో నుదాహరింపఁబడినది. మఱియు, స్వప్నవాసవదత్తచతుర్థాంకములోని—

"శరచ్ఛశాఙ్కగౌరేణ వాతావిద్ధేన భామిని!
కుశపుష్పలవే నేదం సాశ్రుపాతం ముఖం మమ"

అనుశ్లోకము రెండుపదములమార్పుతో వామనునికావ్యాలంకారసూత్రవృత్తిచతుర్థాధికరణమున వ్యాజోక్తి కుదాహరింపఁబడినది. ఇంక నిట్టి వెన్నేని యుదాహరణములు కలవు [2]. పైని జూపినవానినిబట్టి బాలచరిత చారుదత్త ప్రతి

---

1. ఈశ్లోకము కౌటిల్యార్థశాస్త్రము దశమాధికరణమునఁగూడ నున్నది.
2. చూ. శివరామమహాదేవపరంజపేగారి ప్రతిమానాటక పీఠిక.

జ్ఞాయౌగంధరాయణ స్వప్నవాసవదత్త రూపకములు నాలుగును దప్పక భాసకృతము లనుట విశ్వసనీయము కాకపోదు కావున, అన్యోన్యాంతరసంబంధమునుబట్టి తక్కినతొమ్మిదిగూడ వీనివలెనే భాసనిర్మితము లని నిరాక్షేపముగా భావింపవచ్చును. ఇది, స్వప్నవాసవదత్తాదులకర్తృత్వమునుగూర్చి ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకు లనేకులు చర్చించి యావిష్కరించినయభిప్రాయములసారాంశమే కావున నిందు వారివారిచర్చ లెత్తి విమర్శించుట యనావశ్యకము. "ప్రథితయశసాం భాససౌమిల్లకవిపుత్రాదీనాం ప్రబన్ధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య కృతౌ కథం పరిషదో బహుమానః" అనుమాలవికాగ్నిమిత్రప్రస్తావనావాక్యమును బట్టి కాళిదాసుకంటె భాసుఁ డధమపక్ష మేఁబదియేండ్లయినఁ బూర్వుఁడై యుండు ననుట స్పష్టమేకాని, ప్రాచీనసంప్రదాయమువారు కాళిదాసును గ్రీస్తుశకారంభమున కవతలను నవీనసంప్రదాయమువా రివతలను జేర్చుటచే నితనికాలము గూడ నటునిటుఁ గదలుచున్నది. కాళిదాసుకాలమునుగూర్చి యెందఱో యెన్ని విధములనో చర్చించి తమతమయాశయములను బ్రకటించియున్నారు. ఇపుడా బెడఁద యంతయుఁ ద్రవ్వుట యనావశ్యకము. కాళిదాసకాలవిషయకమతముల నన్నిటిని బరామర్శించిన నేఁటివిమర్శకు లనేకులు కాళిదాసు క్రీస్తుశకారంభమునకుఁ బూర్వుఁడన్ననిశ్చయమునకు వచ్చుచున్నారు. కీతుపండితునివంటిపాశ్చాత్యు లొకరిద్ద ఱింకను గాళిదాసుని బరుని గావింప, 'అశ్వఘోషునిబుద్ధచరిత్రలోనివర్ణనలను గాళిదాసు రఘువంశమున ననుకరించె' ననుటవంటినిస్సారహేతువులను గూడఁజూపుచున్నారు గాని యిఁక నట్టివాదమునకు స్వస్తి చెప్పవచ్చును. ఉభయపక్షవాదములు [1] పరిశీలించినవారికిఁ గాళిదాసు క్రీ. పూ. ౫౭ లోనివాఁడు, లేక మొదటి శతాబ్దిలోనివాఁడు, అనెడివిశ్వాసము కలుగకపోదు. దీని నీక్రిందివిషయముగూడ మిక్కిలి బలపఱుచుచున్నది.

అల్లాహాబాదునగరమునకు దగ్గఱగా నున్నభీతనామకగ్రామమున మార్షలు పండితుఁడు గుండ్రనిలోహపురేకులు కొన్ని సంపాదించెను. అందు, దుష్యంతుఁడు సారంగమును దఱుముట దానిని జంప వద్దని యిద్దఱుమునులు నివారించుట శకుంతల మొక్కలకు నీళ్లు పోయుచుండుట, అనెడిశాకుంతలప్రథమాంకకథ చెక్కఁబడియున్న దఁట. ఆ రేకులు క్రీ. పూ. ౧౮౫—౭౩ నడుమఁ బాలకులుగా నున్న సంగరాజులకాలమునకు సంబంధించిన వని పరిశోధకు లూహించుచున్నారు [2]. మఱియు, మాలవికాగ్నిమిత్రము తుద నున్న—

1. 2. చూ. రమేశమోహన్ ఘోసుగారి శాకుంతలపీఠిక.

"ఆశాస్య మీతివిగమప్రభృతి ప్రజానాం
సంపత్స్యతే నఖలు గోప్తరి నాగ్నిమిత్రే"

అనెడిభరతవాక్యమునుబట్టి యగ్నిమిత్రునికి సమకాలికుఁడై కాళిదాసతని వినోదమునిమిత్త మీనాటకము రచియించినట్లు తెలియుచున్నది. దానివ్యాఖ్యాతయైనకాటయవేమభూపాలుఁడు గూడ "సర్వనాటకప్రయోగాన్తే భరతేన సర్వకాలసాధారణే, ఆశీర్వచనే కర్తవ్యే సతి, అత్ర ప్రజానా మాశాస్యసిద్ధిం ప్రతి గోప్తు రగ్నిమిత్రస్య కథనం తత్కాలరాజోపలక్షణ మితి మన్తవ్యమ్" అనుచు, ఆకాలమందలిరాజైన యగ్నిమిత్రుని బ్రశంసించుటకే కాళిదాసు పైభరతవాక్యము గూర్చినట్లు చెప్పియున్నాఁడు. పుష్య (ష్ప) మిత్రునికొడుకైనయీయగ్నిమిత్రుఁడు తండ్రికిఁ బ్రతినిధియై దశార్ణదేశరాజధానియైనవిదిశాపురమునఁ గొంతకాలమున్నవాఁడు. మౌర్యరాజైనజయద్రథుని జంపి యతనిసింహాసన మాక్రమించిన మహాసేనాని యగుపుష్యమిత్రుఁడు సంగరాజ్యస్థాపకుఁ డనియు[1] అతఁ డశ్వమేధము చేయుచు గుఱ్ఱమును రక్షింపఁ దనపౌత్రుఁడైన వసుమిత్రుని నియమించె ననియు దేశచరిత్రము చెప్పుచున్నది. దీనినిబట్టి, అగ్నిమిత్రసమకాలికుఁడైన కాళిదాసు, ప్రాచీనసంప్రదాయమువారు నిర్ణయించినట్లు క్రీ. పూ. ౧౭౮, లేక ప్రథమశతాబ్దిలోనుండె నన్నవిషయము స్థిరపడుచున్నది గావున, అతనికిఁ బూర్వుఁడైనభాసుఁడు క్రీ. పూ. రెండవశతాబ్దిమొదటివాఁడై యుండు ననెడిమతము విశ్వసనీయము కాఁగలదు. ఇఁక నీసందర్భమున నవీనసంప్రదాయమువారి యొక హేతువును మాత్రము పరామర్శింపవలసియున్నది.

భాసునిరూపకములలో, ప్రతిజ్ఞాయౌగంధరాయణాదులు కొన్నిట—రాజసింహః ప్రశాస్తు నః—అనియు, ప్రతిమాదులు కొన్నిట—రాజా భూమిం ప్రశాస్తు నః, గాం పాతునో నరపతిః—అనియు, మధ్యమవ్యాయోగాదులు కొన్నిట—తథా ప్రభు ర్నో భగవా నుపేన్ద్రః—అనియు, భరతవాక్యములు వివిధముగా నున్నవి. ఇందు కడపటిది శ్రీకృష్ణపరము. తక్కినరాజాదిశబ్దములు భూపాలపరములు. ఈవాక్యములు "స్వస్తిప్రజాభ్యః పరిపాలయన్తాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః" అనుదానివంటి స్వస్తివచనము లనియు, రాజనరపతిశబ్దములవంటి రాజసింహశబ్దములోని సింహపదము శ్లేషవాచక మనియు స్పష్టమగుచుండ రాజసింహశబ్దమును, క్రీ. రెండవశతాబ్దితుదనున్న క్షత్రపరుద్రసింహునికి సమన్వ

1. పుష్యమిత్రస్తు సేనానీ రుద్ధృత్యవై జయద్రథం, కారయిష్యతి వై రాజ్యం సమాషష్టిం సదైవతు. వాయుపు. ఉత్త. 37 అధ్యా.

యింపఁజూచుట సాహసమనక తప్పదు[1]. అందుచే నేవిధమునఁ జూచినను భాసుఁడు పూర్వోక్తకాలమున నుండె ననుటయే యిప్పటికి యుక్త మగుచున్నది.

ఇతఁడు లోకజ్ఞుఁ డైన మహాకవి ప్రతిభామూర్తి స్వతంత్రుఁడు. ఇతనిరూపక రచనవిధాన మపూర్వము. లోకములోని యితరరూపకములందు మంగళాచరణ రూపనాంది యొనరించి యొకసూత్రధారుఁడు వెడలినపిదప మఱియొకసూత్రధారుఁడు ప్రవేశించి ప్రస్తావన జరుపుట కనవచ్చును. ఇతనిరూపకములలో నట్టి నాంది కనఁబడదు. "నాన్ద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః" అనువాక్యముతో రూపక మారంభమగును. దీనినే బాణుఁడు సూత్రధారకృతారంభ మని ప్రశంసించినాఁడు. మఱియు వీనిలోఁ బ్రస్తావనకు బదులు స్థాపన యను మాట యున్నది. అదియైన నేబెడఁద లేకుండ రెండుమాటలతో ముగియును. ఇది రూపకారంభ విశేషము. ఇఁక నంకము లందుమా దీర్ఘములు గావు. పాత్రసంభాషణము గాని వర్ణనలు గాని విసుగు పుట్టించునవి కాకుండుటచేఁ గథ రంగస్థలమునఁ బరుగెత్తుచున్న ట్లుండును. ఇది యిట్లుండ, కథాపాత్రములనుబట్టి యితనిరామాయణ భారతరూపకములు ప్రఖ్యాతవృత్తము లని తోఁచునుగాని, నిజముగా నవి మిశ్రవృత్తములే. అందు, ప్రతిమానాటకములోని దశరథాదిప్రతిమాకల్పన మీకవి కల్పనాచాతుర్యమునకు నిరుపమాన మైనయుదాహరణము. నిజముగా దీనిని జూచియే యుత్తరరామచరిత్రనాటకమునఁ జిత్రప్రదర్శనకల్పనము వెలసిన దనుట సాహసము కాదు. ప్రతిమలోనితరువాతికథ యైనను గ్రుడ్డిగా రామాయణము వెంటఁ బడక యితనిస్వాతంత్ర్యమునకు నిదర్శన మగుచున్నది. ఇతనిభారతరూపకములలోఁ బెద్దది పంచరాత్రము. అందలియితివృత్తము భారతకథ కడ్డము తిరిగి యుద్ధ మక్కఱ లేకుండ దుర్యోధనునిచేఁ బాండవుల కర్ధరాజ్య మిప్పించినది. మధ్యమవ్యాయోగము చూచుటకుఁ జిన్నదైనను గుణమునఁ బెద్దది. అందలి వృత్తమంతయుఁ గల్పితమే. అందలియెల్లపాత్రములు నౌచిత్యమునఁ దీర్చి దిద్దిన ట్లున్నవి. అవియే యననేల? ఇతనిరూపకములలోనిపాత్రములలో నొకటియైన నెట్టియవస్థయం దైన నౌచిత్యము నతిక్రమించినట్లు కనఁబడదు. హరివంశకథను గ్రహించినబాలచరితము శ్రీకృష్ణునితత్త్వము చక్కఁగ నుపదేశించుచు నందబాలచరితము గాక నిజమైనదివ్యబాలచరిత మైనది. ఇఁక బృహత్కథ ననుసరించిన ప్రతిజ్ఞాయౌగంధరాయణస్వప్నవాసవదత్తలు రెండును సర్వవిధముల రసవంతములు. అందును, పూర్వమహాకవిలాక్షణికు లందఱిమెప్పు గాంచినవాసవదత్త సకలనాటకశిరోభూషణ మనుట కెవరును వెనుదీయరు. లక్షణగ్రంథములు రస

---

1. చూ. **Keith's Sanskrit Drama. P. 94.**

స్వరూపమును వినిపించినవి గాని చూపించలేదు, స్వప్నవాసవదత్తయో రస మిట్టి దని ప్రత్యక్షముగాఁ జూపించి చెప్పినది. ఇదే యిందలిమహావిశేషము. ఇది యిట్టిది గనుకనే "స్వప్నవాసవదత్తస్య దాహకో ఽభూ న్నపావకః" అని రాజశేఖరుఁడు దీనిమహిమ నావిష్కరించియున్నాఁడు.

నిద్రించుచున్న వత్సరాజు స్వప్నములో వాసవదత్తను జూచి పలుకరించుట, సత్యవాసవదత్త యతనిప్రశ్నలకు బదు లిచ్చుట, రాజు మెలఁకువ వచ్చి లేచి చూచునంతలో వాసవదత్త యదృశ్యురా లగుట, యనుచిన్న కథాభాగమునుబట్టి దీనికి స్వప్నవాసవదత్త మనుపేరు వచ్చినది. ఈకల్పనమునకు రెండు ప్రయోజనములు. ఒకటి, వాసవదత్త దగ్ధురాలు కాలేదు, జీవించియున్న దనెడియాశ వత్సరాజుమనసునందు కనఁబడీకనఁబడ నట్లంకురించుట. రెండవది, తాను మృతిచెంది నట్లు తెలిసినపిదపఁ గూడఁ దనమీఁద భర్తకు యథాపూర్వముగా ననురాగ మున్న దని వాసవదత్త తెలిసికొనుట. ఇఁక నీచిన్నభాగమును బెద్దప్రయోజనముతోఁ బ్రధానకథామధ్యమున నతుకుట యందుమూ, అది భాసునిప్రతిభాచాతుర్యమున కాద్యనిదర్శన మనఁదగియున్నది. ఇఁకనో, వత్సరా జేయవస్థయం దైన నొకనిమిష మేని వాసవదత్తను మఱచిపోలేదు. అట్లని పద్మావతిని మనసారఁ బ్రేమింపకపోలేదు. వాసవదత్త, తనభర్త పద్మావతిని బెండ్లాడినందు కీర్ష్యపడలేదు. అట్లని తనమగనికిఁ దనమీఁదిప్రేమ సన్నగిల్లుచుండెనేమో యని యెడనెడ ననుమానించుచు నందలినిజము తెలిసికొనుచుండక పోలేదు. పద్మావతి, వాసవదత్త సుగుణసంపద తెలిసి యామెను సగౌరవముగా స్మరింపకపోలేదు. అట్లని తనభర్త వాసవదత్తమీఁదనే దృష్టిపెట్టుకొని యున్నాఁడేమో యని నడుమనడుమ సందేహించుచుండక పోలేదు. ఈరీతిగా నీమూఁడుపాత్రముల నెట్టివిరోధము లేకుండ నాద్యంత మొక్కరీతి నత్యుచితముగా రసానుగుణము గాఁ బోషించుట యనునేర్పు భాసునికే చెల్లు నన్న ననవచ్చును. సెబాసు! భాసా! నీజన్మము ధన్యము. నీయీ నాటకము భాష కెపుడును నూతనాలంకారము.

ఇతనికల్పితరూపకములు రెండు, అం దవిమారకములోనియద్భుతరసము ప్రధానమైనశృంగారముతోఁ జక్కఁగాఁ గలియుట యెంతయు హృద్యము. అది నాటకముగాఁ గాక, ఆఖ్యాయికగాఁ గూడఁ జదువఁ జవు లొలుకుచుండును. దాని వలెనే హృదయంగమ మైనచారుదత్తము సాంఘికరూపకముల కాద్యోదాహరణ మనఁదగియున్నది. భాసుఁ డిందలిసామాన్యనాయిక యైనవసంతసేన నుత్తమరాజకన్య నట్లు సౌశీల్యమునఁ బోషించి భావప్రపంచమునకు వన్నె దెచ్చెననుట సత్యము. 'సతి కుడ్యే-చిత్ర' మనునట్లు శూద్రకుఁడు దీనినే యలంకరించి మృచ్ఛకటికముఁ జేసెను గాని, అం దతనియుపజ్ఞ యేమియు లేదు. ఐనను, దానివద్ద నిది యంత

మనోహరము కాని మాట వాస్తవము. అది సహజమేకదా! పెరిఁగి పెద్దదైన కన్నకూఁతురిదగ్గఱఁ దల్లి యంత యందముగాఁ గనఁబడునా?

భాషచేతను శైలిచేతను గూడ భాసునికవిత్వము మృదుమధురము. ఇతని భావములే కాదు, వర్ణనలుగూడ మహాకవికాళిదాసంతటివాఁ డనుకరింపఁ గుతూహలము పుట్టించునంతటిమనోజ్ఞములు. ఇతనియభిషేక బాలచరిత స్వప్నవాసవదత్తావిమారకాదులలోనికొన్నిశ్లోకములవంటిశ్లోకములు కాళిదాసుశాకుంతల మాలవికాగ్నిమిత్రములందును, ఇతనిచారుదత్తములోనిపెక్కుమాటలు శ్లోకములు కొంచె మెచ్చుతక్కువగా నట్లే మృచ్ఛకటికములోను, గనవచ్చుచున్నవి[1]. అభిషేకములోని—

"యస్యాం న ప్రియమండనాపి మహిషీ దేవస్య మన్దోదరీ,
స్నేహా ల్లుమ్పతి పల్లవా న్నచ పున ర్వీజన్తి యస్యాం భయాత్" అనునది
"నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యాపల్లవమ్"

అనురీతిని శాకుంతలనాటకమునఁ జతుర్థాంకమునం దున్నది. చారుదత్తములోని "యాసాం బలి ర్భవతి—మార్జారః ప్లవనే—విషాదస్రస్తసర్వాఙ్గీ—" ఇత్యాది శ్లోకములు కొన్నిపదములమార్పుతో నిట్లే మృచ్ఛకటికమునఁ గనవచ్చును. కౌటిల్యార్థశాస్త్రదశమాధికారమునఁ బ్రక్షిప్తము లైనసైనికప్రోత్సాహపరము లగునీక్రింది రెండుశ్లోకములు భాసుని వగుట సత్యమే కాని, వీనిలో రెండవది మాత్రము ప్రతిజ్ఞాచతుర్థాంకమున నున్నది. మొదటి దితనిరూపకములలో నెందును గనరాకున్నది. ఎపుడు జాఱిపోయినదో!

"యాన్ యజ్ఞసంఘై స్తపసాచ విప్రాః, స్వర్గైషిణః పాత్రచయైశ్చ యాన్తి,
క్షణేన తా నప్యతియాన్తి శూరాః, ప్రాణాన్ సుయుద్ధేషు పరిత్యజన్తః"
"నవం శరావం సలిలస్య పూర్ణం, సుసంస్కృతం దర్భకృతోత్తరీయమ్,
తత్తస్య మాభూ న్నరకం చ గచ్ఛేత్, యోభర్తృపిణ్డస్య కృతే నయుధ్యేత్"

కాళిదాసుముందుగుణాఢ్యుని, అతనిముందుభామహుని, అతనిముందుకౌటిల్యుని, అతనిముందుభాసుని, పెట్టినగణపతిశాస్త్రిగారు, పైవానిలోరెండవశ్లోకము భాసునిదనుటయుక్తమే కాని, దీనిని గౌటిల్యుఁడేప్రతిజ్ఞనుండి సంగ్రహించుకొనె ననుటమాత్రము సముచితము కాదు. దీనివలెసందర్భోచితమైన మొదటిశ్లోకము

1. చూ. స్వప్నవాసవదత్తపీఠిక. చూ. అరూపకములు.

కూడ భాసునిదేయగుట సత్యమైనను, అది యితనిరూపకములలో నిపుడుగన రాకపోవుట విచార్యము. నిజముగానిది ప్రతిజ్ఞాయౌగంధరాయణములో రెండవ దానిముందే యుండియుండును[1]. తరువాత—

జగ మెఱిఁగినబ్రాహ్మణుఁ డగుకాళిదాసురూపకములు. సంస్కృతమునందే కాదు, సకలభాషలందును బ్రశస్తి గాంచినకాళిదాసురూపకములలో నగ్రస్థాన మధిష్ఠించినదియు నాటక మన్నంతనే నోటికి వచ్చునదియు నితనిశాకుంతలము. కథా పాత్రరసములు మూఁడును సమముగా నౌచిత్యపారము గాంచుట యనువిశేషము చూడవలెనంటే యది యిందు గనఁదగును. తనకు ముందున్న భాససౌమిల్లాదుల రూపకముల నతిక్రమించి చక్కఁగా నుండవలె నన్నజిగీషతో రచియించినయితని జగదేకపూజ్యమైనప్రతిభ కిది యాకరము. పాశ్చాత్యపండితలోకమునఁ గూడ పేరు గనిపించుకొన్నకవితాభద్రపీఠము. దీనిని వర్ణించుట కాఁగడాతో సూర్యుని జూపుట. ఇది విఖ్యాతవృత్తమైనను, అంగుళీయకాభిజ్ఞాన మునిశాపాదికల్పనమున మిశ్రమై యభిజ్ఞానశాకుంతలమైనది. ఈకల్పనము పాత్రశీలము పోషింప సాధనమై కథకు మెఱుఁగు తెచ్చినది. ఈనాటక మాకాలమునఁ బ్రదర్శనరమ్యమై లోకము నాకర్షించిన దనుట కిందలికథ ప్రతిమారూపమున వెలయుటయే నిదర్శనము.

ఇతనిమూఁడురూపకములందును బ్రధానరసము శృంగారము. ముగ్గురును దక్షిణనాయకులు. ఐనను, రసనాయకపోషణవిధానము వేఱు. మాలవిక నాయకునిపట్టమహిషి కధీనమైనవిదర్భరాజకన్య. ఊర్వశి దేవర్షిసంజాతమైనయప్సరస. శకుంతల యప్సరస్సంజాతమైనరాజర్షికన్య; బ్రహ్మర్షిపోషిత. అందుచే నాయికాసంవిధానమును వేఱు. మాలవికాగ్నిమిత్రములోనిశృంగారము ప్రచ్ఛన్నమై, అయోగరూపమునఁ దహతహలాడి సంభోగమైనది. విక్రమోర్వశీయశృంగార మభిలాషాద్యున్మాదాంతములైనయవస్థలఁ బరిణమించి సంభోగమైనది. శాకుంతలశృంగారమో, ప్రసన్నమై సంభోగరూపమున వెలసి పిదపవియోగమై తరువాత సంయోగమైనది. వీనిలోనిమూఁడువిధములైనయనురాగము స్వాభావికమైనను మొదటిది తామసము, రెండవది రాజసము, మూఁడవది సాత్త్వికము. ఇదిధమే యీమూఁడింటిలో శాకుంతలము కడపట రచియింపఁబడిన దని తెల్పఁగలదు.

1. [illegible]యమున 167, 168 పుటలు చూడవలెను.

ఆనాఁడు భరతనాట్యశాస్త్రము వ్యాపించుచున్నను భాసుఁడు దాని ననుస రింపక యథేచ్ఛముగా యుద్ధమును మరణమునుగూడ రంగస్థలమునఁ జూపియు న్నాఁడు. ఇందుకు బాలచరితములోని మల్లయుద్ధము చాణూరముష్టికకంసుల మృతియు, ఊరుభంగములోనిగదాయుద్ధము దుర్యోధనపతనమరణములు నుదా హరణములు. మఱియుఁ బ్రతిమానాటకములోని సీతాపాత్రము నారచీర ధరించు టయు రంగస్థలమున జరిగినదే. ఇట్టిరూపకలక్షణాతిక్రమణము భాసునిరూపక ముల సర్వత్ర కనఁబడును. కాళిదా సంతగా లక్షణము నతిక్రమింపకున్నను స్వాతంత్ర్యము చూపకపోలేదు. ఇతనిరూపకములలో సంగ్రామసంహారముల ప్ర సక్తి లేకపోయినది గాని, ఉండిన నెట్లు చూపియుండునో! ఇతఁడు నాందిని బాటిం చెను గాని నాందీపద నియమమును బాటించలేదు. ఎట్లయిన సర్దుకొనుట కను కూలముగానున్న "అర్థత శ్శబ్దత శ్చాపి మనా క్కావ్యార్థసూచనమ్" అనులక్ష ణమునుబట్టి వాఖ్యాత లెట్లోకష్టపడి యెక్కలాగిరి కాని, యితఁడు కావ్యార్థసూచ నము నుద్దేశించి నాందీశ్లోకములు నిర్మించినట్లు సూచన యెట్టిదియుఁ గనరాదు. పుష్యమిత్రవంశవర్ణనము వాయుపురాణమునఁ దరువాతఁ జేరిన దగుటచేఁ గాళి దాసునాఁటి కిది ప్రఖ్యాతము కాదు. మాలవికావృత్తాంతమం దేదయినఁ గొంత కల్పన ముండు నేమోకాని, నాయకుఁ డైనయగ్నిమిత్రుఁడు కవినాఁటిపాలకుఁడు కావున నిది యుత్పాద్యమును గాదు. అందుచే నాటకము ప్రఖ్యాత వృత్తమో మిశ్రవృత్తమో కావలె నన్ననియమమును మాలవికాగ్నిమిత్ర మతిక్రమించె ననుట స్పష్టము. విక్రమోర్వశీయములోనియితివృత్తము ఋగ్వేదాదిప్రఖ్యాతమే కాని యిదినాటకము కాదు త్రోటకము. కథ దివ్యమానుషసంశ్రయ మగుటయు, చెప్పిన ట్లంకము లుండుటయు లక్షణమునకు సరిపడుచున్నవి కాని, ప్రత్యఙ్కం సవిదూషక' మ్మనులక్షణమునకు మాత్ర మిది సరిపడదు. "ఇది ప్రాయోఽభిప్రా యము, ఏదోయొకయంకమున విదూషకుఁడు లేకపోయినను దప్పుకాదు" అనుచు వ్యాఖ్యాతలు సవరించినను, ఇదిలక్షణాతిక్రమణమే. పాణినీయవిరుద్ధప్రయోగము లను భాసునివలె నితఁ డెక్కువగా నుపయోగించకపోయినను, కొలఁదిగా వాడక పోలేదు. ఇట్టివాటినిబట్టి నిరంకుశు లైనమహాకవులు వస్తుపాత్రరసపోషణముననే శ్రద్ధ వహింతురు గాని, తూ చా తప్పకుండ లక్షణముల మీఁదనే దృష్టి పెట్టరని తెలియనయ్యెడి.

ప్రకృతిసౌందర్యవర్ణనము భాసునిరూపకములలోఁ గూడఁ బెక్కుచోట్లఁ గనవచ్చునుగాని, అది కాళిదాసుసొమ్మని లోకమున వాడుక వచ్చినది. ప్రతిమా నాటకమున—సీత, నే నీనారచీరకట్టుకొన్న బాగుండునా యని యడుగ, 'సర్వ శోభనీయం సురూపం నామ'అని చేటిక యైనయవదాతిక బదులు చెప్పినది.

అనఁగా, చక్కనిరూపమున కేది యైనను శోభ కలిగించునని భావము. ఇట్లే, నారచీర దాల్చినశకుంతలను జూచి మెచ్చుకొన్నదుష్యంతుఁ డనియున్నాఁడు. ఈ క్రిందిశ్లోకమునాల్గవపాదమున నీభావ మర్థాంతరన్యాసములోఁ జక్కఁగా నిమిడి యున్నది.

> "సరసిజ మనువిద్ధం శైవలే నాపి రమ్యం,
> మలిన మపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి,
> ఇయ మధికమనోజ్ఞా వల్కలే నాపి తన్వీ,
> కి మివహి మధురాణాం మణ్డనం నాకృతీనామ్."

పైనాల్గవపాదమందలి 'రమ్యము లగునట్టిరూపములకారయభూషణమేది కాదనుకాళిదాసుభావమునకుఁ బూర్వోక్త మైనభాసునిభావమే యన్నివిధముల మూల మనుట విదితమైనను, ఈభావము భాసోపజ్ఞ మైనను, పైశ్లోకమునుబట్టి దీనిఖ్యాతి యంతయుఁ గాళిదాసునకే వచ్చినది. స్త్రీవర్ణనము లెంద ఱెన్నివిధ ములఁ గావించిరో లెక్కలేదు. అయినను, అస్యా స్సర్గవిధా—చిత్రే నివేశ్య— ఇత్యాదికము లైనయూర్వశీశకుంతలాసౌందర్యవర్ణనములవంటివి మాత్రము కన రావు. వాని కవే సాటి. ఇఁక నితనియుపమానచాతుర్య మందుమా, అందుకు "ఉపమాకా ళిదాసస్య" అనెడియార్యోక్తియే చాలును. అయిన నీసందర్భమున భాసకాళిదాసులభావైక్యమున కొకయుదాహరణము. ఈ క్రిందివానిలో మొదటిది బాలచరితములోనిది. వసుదేవుఁడు కృష్ణుని నందునింటికిఁ గొనిపోవునపుడు పిల్ల వానిని విడువ లేక గది దాఁటి వచ్చి భర్తమాటచే మరల గదిలోనికిఁ బోవు దేవకివర్ణనము. రెండవది శాకుంతలములోనిది. శకుంతలనువిడిచి సేన యున్న చోటి కేగుచున్నదుష్యంతునివర్ణనము.

> "హృదయే నేహ తత్రాజ్ఞై ర్ద్విధా భూతేవ గచ్ఛతి,
> యథా నభసి తోయే చ చంద్రలేఖా ద్విధా కృతా"
> "గచ్ఛతి పురశ్శరీరం ధావతి పశ్చా దసంస్తుతం చేతః,
> చీనాంశుక మివ కేతోః ప్రతివాతం నీయమానస్య"

దేవకీదేవిమనస్సు ముందుకు దేహము వెనుకకు. దుష్యంతుని దేహము ముందుకు మనస్సు వెనుకకు. అక్కడ, ఆకాశమందలినిజచంద్రకల నీటిలోనిప్రతి బింబచంద్రకల యుపమానములు. ఇక్కడ గాలి కెదురుగాఁ గొనిపోవుజెండాకఱ్ఱ, దానికిఁ గట్టినపట్టుగుడ్డ యుపమానములు. ఈశ్లోకములు వేఱువేఱుగాఁ బరిశీ లించునపుడు దేని కదే రత్న మని తోఁచక పోదు. ఇఁక నీరెంటిలోని ద్వివిధము

లైన రెండేసియుపమానములను బోల్చి పరీక్షించి యుండేది రసవత్తరవాసన్న యించుకొనుట సహృదయులపని.

శకుంతలాదుష్యంతులగాంధర్వవివాహమును భరతునిజననమును దెల్పు ప్రధానకథాభాగము భారతములోనున్నది గాని, ఈషద్వైషమ్యముగా శాకుంతలనాటకములో నున్నయితివృత్తమంతయు, పద్మపురాణస్వర్గఖండమునఁ గనవచ్చుచున్నది. అనసూయ సానుమతి విదూషకుఁడు మొదలగుకొన్ని పాత్రములు లేవుగాని తక్కినప్రియంవదా శారద్వతాదిపాత్రము లన్నియుఁ గనఁబడుచున్నవి. దీనినిబట్టి, పద్మపురాణమునుండి యీకథను గాళిదాసు యథాస్థితముగా గ్రహించె నని కొందఱు తలంపకపోరు. అందుకుఁ గారణ మీపురాణము వ్యాసప్రోక్త మనెడివిశ్వాసమే. కాని, ఇది సరిగాదు. ఇది రచియించినవ్యాసుఁడే కదా భారతము గూడ నిర్మించినవాఁ డని యూహింపఁ బడుచున్నది! అట్లయిన నతఁడు శకుంతలాకథ భారతములో నొకవిధముగాఁ గల్పించి దానినే పద్మపురాణము న నింకొకవిధముగా మార్చి నిర్మించె ననుటవిశ్వాస్య మగునా? అందులేని యంగుళీయకాభిజ్ఞానవృత్తాంతము నిందు చేర్చె ననుట పొసఁగునా? ఇంత యేల? ప్రదర్శనోచితక్రమమున నతఁ డీకథ మాత్ర మిందే రచియించె ననుట సంభావ్యమా? కావునఁ బద్మపురాణమందలిశాకుంతలోదంతము ప్రక్షిప్త మనియు, కాళిదాసునాటకమును మెచ్చుకొన్నయర్వాచీనకవి యొకఁ డిందలియితివృత్తము నట్లే యనుష్టుప్ఛందోబద్ధము గావించి పద్మపురాణమునఁ జేర్చె ననియు నమ్మవలసియున్నది. దీనినిబట్టి శాకుంతలనాటకము పుట్టినయచిరకాలముననే శ్రవ్యకావ్యరూపముగూడఁ దాల్చిన దని సంతసింపవలసియున్నది. ఈరెంటిని బోల్చి చదివినవారి కీవిషయమున ననుమానము కలుగఁబోదు.

భట్టపాద గోవర్ధనాచార్య మల్లినాథాదులవంటి మహామహులు కవితాప్రపంచమున సార్వభౌముఁ డనునట్లు మనసార స్తుతించినయిట్టికాళిదాసు, భాసమహాకవి యందలిగౌరవము ప్రకటించుట కతనిభావములు రెండుమూఁడు గ్రహించినంత మాత్రమున, నితనితోఁ బోల్చినచో నెంతక్రిందివాఁడో యనఁదగినయశ్వఘోషుని గూడ నితఁ డనుకరించె నన్నపాశ్చాత్త్యులమాటలు పాటింపవచ్చునా? కాళిదాసు నెట్లయినఁ గ్రీ. నాలుగైదు శతాబ్దులలోనికి లాగుటకు వా రట్లు భావించినను, కాళిదాసతత్త్వ మెఱిఁగినవా రట్టిమాటలు చెవిని బెట్టరు. తక్కినయతనికావ్యముల వంటికావ్యములు లేక పోలే దని యెట్లయిన సమర్థింపవచ్చునుగాని, రఘువంశ మేఘసందేశశాకుంతలములవంటివి మాత్రము కల వని సాధింపఁ జాలము. ఎవరివో యేల? ఇతనివే పోలవు. మూఁడురూపకములలోని నాయకులు ధీరోదాత్తులే. ఐతే

నేమి? విదర్భరాజు వ్రాసినజాబు చదివి వినిపించినంతనే మండిపడి, వానినీ నిర్మూలింప వెంటనే సేనను బంపుమని మంత్రి కాజ్ఞాపించిన యగ్నిమిత్రుఁ డెక్కడ? విరహవేదన వెడలఁబోసికొనుచు వెఱ్ఱియెత్తి కొండలఁ దిరిగి పలవరించినపురూరవుఁ డెక్కడ?—శకుంతల నభిలషించునపుడును, ఆమెను వరించునపుడును, మునిశిష్యులామెను దీసికొనివచ్చియర్పించునెడ శాపవశమునఁ బూర్వవృత్తాంతము మఱచిపోయి వారితో సంభాషించునపుడును, "ఈమె నీభార్య. ఉంచుకో లేక విడిచిపెట్టుకో" అనుచు దివ్యసుందరవిగ్రహ మైనశకుంతలను విడిచి మునిశిష్యులు వెళ్లినపుడును, అట్టిశకుంతలను జూచియుఁ గర్తవ్యము పురోహితునితో నాలోచించునపుడును, అంగుళీయకము లభించినపిదప శకుంతలనుగూర్చి చింతించునపుడును, రాజధర్మములు నిర్వహించునపుడును, నిండుకుండవలెఁ దొణఁకక ధైర్యౌదార్యధర్మమూర్తియై యున్న దుష్యంతుఁ డెక్కడ? ఇట్లాద్యంత మొక్కరీతిగాఁ బోషింపఁబడిన రూపనాయకులు లెక్కకు మిక్కిలి తక్కువగా నుందురు. కాళిదాసు తన రూపకముల నెల్ల భాసునివలెనే స్త్రీపాత్రములను సముచితముగాఁ బోషించె ననుట విదితము. అందును శకుంతలాపాత్రపోషణ మెంతయు నసదృశము. ఇట్లితని కవిత్వము సర్వవిధముల సహృదయరంజక మైనది కావుననే పూర్వవిద్వాంసులెల్లరు నితని బహువిధములఁ బ్రశంసించియున్నారు. అందు మీమాంసకభట్టపాదుని మాట లిట్లున్నవి.

"కవయః కాళిదాసాద్యాః, కవయో వయ మప్యమీ,
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్"

పాశ్చాత్యుఁ డగులూడెర్సుపండితుఁడు తుర్ఫనుపురమున సంగ్రహించిన లిఖితతాళపత్రగ్రంథములలో మూఁడుబౌద్ధనాటకము లున్నట్లును, అం దొకటి శారద్వతీపుత్రప్రకరణ మనెడితొమ్మి దంకములరూపక మైనట్లును, అందలి యొకగద్యదానికర్త సువర్ణాక్షిపుత్రుఁ డైనయశ్వఘోషుఁ డని చెప్పుచున్నట్లును, కీతుపండితుఁడు చెప్పుచు, మౌద్గల్యాయనుఁడు శారిపుత్రుఁడు ననువారికిని బుద్ధునికిని సంబంధించిన బౌద్ధమతవిషయక మైనయందలియితివృత్తమునుసంగ్రహించి వ్రాసెను. తక్కిన రెండునాటకములఁ గర్త పేరు తెలుపుగద్యభాగములు లేవనియు, అవికూడ నశ్వఘోషుఁడే రచియుంచి యుండునేమో యనియు వా రూహించుచున్నారు. ఆనాటకములు మన కింకను లభింపలేదు గాని, దీనినిబట్టి క్రీ. ౭౫—౧౫౦ నడుమ సంస్కృతమున బౌద్ధనాటకము లుదయించె ననిమాత్రము విశ్వసింపవచ్చును.

కాశ్మీరరా జైనతుంజీనకుని కాలమునందు చంద్రకుఁ డనుమహాకవి నాట్యగ్రంథమొ నిర్మించినట్లు రాజతరంగిణి చెప్పుచున్నది.

"నాట్యం సర్వజనప్రేక్ష్యం య శ్చక్రే సమహాకవిః,
ద్వైపాయనమునే రంశ స్తత్కాలే చంద్రకో ఽభవత్"

ఈతుంజీనకుఁడు క్రీ. ౧౦3 లో, సింహాసన మెక్కినట్లు చరిత్రకారుల మతము కావున, ఈకవి క్రీ. ౧౨౦ ప్రాంతమున నున్నట్లు తెలియవచ్చును గాని, యితనిగ్రంథములు మాత్రము కనరావు. చంద్రకునిపే రెత్తి క్షేమేంద్రుఁ డౌచిత్య విచారచర్చలో నాలుగుశ్లోకము లుదాహరించియున్నాఁడు. ధనికుఁడు దశరూపక వ్యాఖ్యలో నొకటి యుదాహరించియున్నాఁడు. సుభాషితావళ్యాదులలో నొకటి రెండుశ్లోకము లున్నవి. కాని గ్రంథముపేరు తెలియరాదు. క్షేమేంద్రుఁడు గుణౌ చిత్యమునకు వ్యతిరేకోదాహరణముగా నిచ్చిన—

"యుద్ధేషు భాగ్యచపలేషు న మే ప్రతిజ్ఞా,
దైవం నియచ్ఛతి జయం చ పరాజయం చ,
ఏషైవ మే రణగతస్య సదా ప్రతిజ్ఞా,
పశ్యన్తి యత్ర రిపవో జఘనం హయానామ్"

అనుశ్లోకము వర్ణితవిషయమునుబట్టి పూర్వోక్తనాట్యములోనిదేమో యని తోఁచుచున్నది. ఇతఁడే, అద్భుతరసమున కుదాహరణముగాఁ జంద్రకుని దని చూపిన—

"కృష్ణే నామ్బ గతేన రన్తు మధునా మృ ద్భక్షితా స్వేచ్ఛయా,
సత్యం కృష్ణ క ఏవ మాహ ముసలీ మిథ్యా మ్బ ప శ్యాననమ్,
వ్యాదే హీతి విదారితే ఽథ వదనే దృష్ట్వా సమస్తం జగ,
న్మాతా యస్య జగామ విస్మయపదం పాయా త్స వః కేశవః"

అనుశ్లోకము 'కృష్ణ స్స పుష్ణాతు నః' అనుపాఠభేదముతోఁ గృష్ణకర్ణామృతములోని దని ప్రతీతి. ఇది చంద్రకునినాట్యములో ని దైనచో నాందీశ్లోకము కావచ్చును. సుభాషితావళిలో సంగ్రహింపఁబడిన—

"ప్రసాదే వర్తస్వ ప్రకటయ ముదం సంత్యజ రుషం,
ప్రియే! శుష్యం త్యఙ్గా న్యమృత మివ తే సిఞ్చతు వచః,
నిధానం సౌఖ్యానాం క్షణ మభిముఖం స్థాపయ ముఖం
న ముగ్ధే! ప్రత్యేతుం ప్రభవతి గతః కాలహరిణః"

అనుశ్లోకము నాయకుఁడు నాయికను గూర్చి పల్కినయనురాగోక్తిగాఁ గనఁబడుచున్నది. ఇట్టిశ్లోకము లింకను గలవు. ఇవి యున్నియు నొకదానిలోనివో,

వేఱుకావ్యములలోనివో, తెలియరాదు. ఏమైనను, ఉదాత్తరాఘవాదులవలెఁ జంద్రకునిరూపక మొకటికూడఁ గాలగర్భమున నణఁగిపోయిన దనవచ్చును. తరువాత—

మృచ్ఛకటికము. ఇది పదియంకముల ప్రకరణము. ఇందలి యితివృత్త మభినవము కా దనియు, ఇది భాసునిచారుదత్తమునకుఁ బెరిఁగినరూప మనియు మున్ను చదివియున్నాము. దీనికర్త శూద్రకరాజు. ఇతనికాల మిది యనుటకుఁ దగిన ప్రమాణములు లేవు. కొంద ఱితనికాలమును గూర్చి చర్చించిరి గాని, ఆచర్చలును నిశ్చయజ్ఞానము కలిగించునవి కావు. అందుచే నితఁడు క్రీ. ౨—౬ శతాబ్దుల నడిమివాఁ డనుటకంటె వేఱుగాఁ జెప్పుట కవకాశము చాలదు.

ప్రత్యక్షప్రమాణము విడిచి యనుమానప్రమాణ మంగీకరించుట తగదు. ఇందలిప్రస్తావన శూద్రకుఁడు దీనిని నిర్మించినట్లు కంఠోక్తిగాఁ జెప్పుచుండ నెవరో దీనిని రచించి యితనిపేరు పెట్టి యుండు ననెడియూహ గ్రాహ్యము కాఁజాలదు. వామనాచార్యుఁడు, 'శూద్రకాదిరచితేషు ప్రబంధేషు' అనుచు శూద్రకునిగ్రంథకర్తఁ గాఁ దెలిపియున్నాఁడు[1]. అతఁడు మృచ్ఛకటికము పేరెత్తక పోయినను, దీనినిబట్టి యిది యితని దనవచ్చును.

"ద్విరదేన్ద్రగతి శ్చకోరనేత్రః పరిపూర్ణేన్దుముఖ స్సువిగ్రహశ్చ,
ద్విజముఖ్యతమః కవి ర్బభూవ, ప్రథిత శ్శూద్రక ఇత్యగాధసత్త్వః"
"...రాజానం వీక్ష్య పుత్రం పరమసముదయే నాశ్వమేధేన చేష్ట్వా,
లబ్ధ్వా చాయు శ్శతాబ్దం దశదిన మధికం శూద్రకో౽గ్నిం ప్రవిష్టః"

ఇత్యాదిక మైనప్రస్తావనాప్రసంగమునుబట్టి శూద్రకుఁ డనుభూపాలుఁడు జాతకాదిగణితమునుబట్టి తనయాయువు తెలిసికొని, శరభంగమహర్షివలెఁ దాను సర్వస్వారయజ్ఞమున నగ్నిప్రవేశము చేయఁబోవుసమయమును ముందుగా భూతార్థక మైన 'ప్రవిష్టః' అనుపదముచేఁ దెలిపె ననియు, కావున వేదములను జ్యోతిశ్శాస్త్రాదులను జక్కఁగా నెఱింగినయీరాజకవియే దీని నిర్మించె ననుట సత్యమనియు విశ్వసింపఁదగును.

రూపకసారస్వతమునఁ బ్రసిద్ధి గాంచినవానిలో మృచ్ఛకటిక మొకటి యని యెల్లరు విశ్వసింతురు. ఇది భాసచారుదత్తము నెల్ల విధముల ననుసరించిన దైనను, దానికంటె మనోహర మగురూపమున వెలయుచున్న దనుట నిర్వివా

1. కా. సూ. 3_2-4

దము. ఇందుకుఁ దగినట్లుగా నిందలికథాసన్నివేశమునఁ గొంతమార్పుఁ జూపట్టును. చారుదత్తునికొడుకగురోహసేనునికి రదనిక యనుదాసి క్రీడార్థముగా మట్టితో నొకబండి చేసి యిచ్చుట యనుకథాభాగము కల్పించి కవి దీనికి మృచ్ఛకటిక మను క్రొత్తపేరు పెట్టెను. ఈచిన్నవిషయము, చారుదత్తునిసంపూర్ణదారిద్ర్యమును సూచించుచు, తరువాత నది పనికి రా దనియేడ్చుచుండుబాలునికి సువర్ణశకటము చేయించు నిమిత్తము వసంతసేన తనయాభరణము లిచ్చుట యను విషయమునకు బీజ మైనది. అది, నాయికాసౌశీల్యము పోషింపఁ గారణ మైనది. కథాపాత్రరసములకు మెఱుఁగు దెచ్చెడియిట్టిచిన్నకల్పన లింక నున్నను, చారుదత్తకథ కిది వేఱుకాదు. ఇందలినాయకుఁడు లక్షణమునుబట్టి ధీరశాంతుఁ డనఁ దగియున్నను, ఉత్తమలక్షణములనుబట్టి ధీరోదాత్తుఁడు గాఁ గనవచ్చును. అట్లే జాతిచే నాయిక సామాన్య యైనను, పావన మైనసుగుణసందచే నుత్తమకులకన్య యైనది. ఇందలితక్కినపాత్రము లిరువదియే యున్నవి. ఇవి యన్నియుఁ దత్తత్కార్యనిర్వహణమున సమర్థములై ప్రధానకథాసంవిధానమునఁ జక్కఁగా నతుకుకొన్నవి. ఇం దేపాత్రము లేకున్నను, కథ కొఱంతవడు నను నంతగా మిక్కిలి మెలఁకువతో నిన్నిపాత్రములకుఁ గథైక్యము కలిగించి పోషించుట యను శూద్రకునిప్రతిభాచాతుర్య మసాధారణము. ఇందు కొకయుదాహరణము.

వసంతసేన కులవృత్తిని నిరసించినధనవిరక్త. సుగుణానురక్త. దరిద్రుఁ డైనచారుదత్తునిసౌశీల్యమును వరించినది. దానికిఁ దగినది మదనిక. అది నీచజాతి దైనను శర్విలకుని గామించినది. వాఁడు జాతిచే విప్రుఁడయ్యుఁ జౌర్యవృత్తి నాశ్రయించినవాఁడు. కాని, లోకసామాన్యుఁ డైనచోరునివలె దుర్జనుఁడు కాఁడు. భీతసుప్తులను జంపువాఁడు కాఁడు. చేసినతప్పు తెలిసినవాఁడు. చారుదత్తునింట నగ దొంగిలించి తెచ్చినవానికిని మదనికకును జరిగినసంభాషణము భినన్నింపై నీతిదాయక మగుటయే కాక, నాయకునిసుగుణములందు నాయికకు మఱింతగౌరవమును హెచ్చింపఁ జేసి ప్రధానపాత్రపోషణమున కవలంబన మైనది. ఈసందర్భమున శర్విలకుఁడు గావించినస్త్రీవిషయకోపన్యాసమును, మదనికయతనికిఁ గావించినహితోపదేశమును, తక్కినతప్పు లావలఁ బెట్టెనిశ్చల మైనవారిద్దఱునురాగమును వసంతసేన మెచ్చుకొనుటయు ననునవియాపాత్రములయౌచితికిఁ దార్కాణము లగుచున్నవి. ఇట్లే యన్నిపాత్రములు నముచితము లగుట కారణముగా నీరూపకము ప్రదర్శనరమ్య మైననత్కావ్యముగా గణన కెక్కినది.

శార్ఙ్గధరపద్ధతిలో రాజశేఖరునిదిగాఁ గనవచ్చు "భాసో రామిల సోమిలౌ వరరుచి శ్శ్రీసాహసాఙ్కః కవి" రిత్యాదిశ్లోకములోని రామిలసోమిలులు శూద్రకుని

చరితమును శూద్రకకథ యనుపేర వర్ణించి రనియు, వైక్రాన్తశూద్రక మనునొక నాటకము నొకానొకకవి యితని నాయకుని జేసి నిర్మించె ననియు, పంచశిఖుఁ డను కవి ప్రాకృతమున శూద్రకచరితకావ్యము నిర్మించె ననియుఁ దెలియుచున్నది [1].

ఇట్లు కృతికర్తయై కృతిపతియై కృతినాయకుఁడై ఖ్యాతి గన్న యీశూద్రకుఁడు వత్సరాజచరితము పద్మప్రాభృతకము, అనుమటిరెండుకావ్యములు నిర్మించి నట్లు తెలియుచున్నది. ఇందు రెండవది యచ్చుపడినచతుర్భాణిలో నొకటి.

"వరరుచి రీశ్వరదత్త శ్శ్యామిలక శ్శూద్రక శ్చ చత్వారః,
ఏతే భాణాన్ బభణుః కా శక్తిః కాళిదాసస్య"

అనుచాటుశ్లోకమును బట్టి వరరుచ్యాదులు నలుగురు భాణకర్తలైనట్లును, భాణాంతగద్యలనుబట్టి వీరిలో వరరుచి యుభయాభిసారిక, ఈశ్వరదత్తు ధూర్తవిట సంవాదము, శ్యామిలకుఁడు పాదతాడితకము, శూద్రకుఁడు పద్మప్రాభృతకము, రచియించినట్లును దెలియుచున్నది. ఇవి వీరు రచియించినట్లు సమర్థించుచు, వీరిదేశ కాలాదులు తెలుపుచుఁ బ్రకాశకు లొకచిన్నపీఠిక వ్రాసియున్నారు. ఈనలుగురును వాఙ్మయప్రసిద్ధులు ప్రాచీనులు. ఐనను, వీరియీకృతులలోని రెండుమూఁడుశ్లోకములు భోజరాజున కీవలిలాక్షణికులు గ్రహించినట్లు కనఁబడుచున్నది గాని, అతని కావలిలాక్షణికులలో నొకఁడును గ్రహించినట్లు కనఁబడదు. ఇది యిట్లుండఁ బైచాటుశ్లోకము, కాళిదాసుపేర నర్వాచీను లెవరో నిర్మించినపుష్పబాణవిలాస శృంగారతిలకాదులు వ్యాపించినపిదపఁ బుట్టినది గాని ప్రాచీన మైనది గాదని దాని ధోరణియే చెప్పుచున్నది. పైగా, పద్మప్రాభృతకాదులందలివస్తువు ప్రాచీన మైనను, లోకములోని తక్కినభాణములను మించి రచనమున వీనిలోఁ గనవచ్చినమహాగుణమును లేదు. అందుచే నివి వీరు రచియించిన వని ప్రబల మైనప్రత్యక్షప్రమాణము కనఁబడువఱకును వీనికర్తృత్వము సందిగ్ధముగానే యుండును. విమర్శకపాఠకలోక మీవిషయము పరిశీలించుఁగాక.

చోరవేషము వేసినయవిమారకుఁడు కాత్యాయనీబలిశంబరమహాకాలపురుషులను స్మరించెను. చారుదత్తములోనిసజ్జలకుఁడు ఖరపటుని ధ్యానించెను. మృచ్ఛకటికములోనిశర్విలకుఁడు, నాలుగువిధము లైనకన్నము లుపదేశించినపూజ్యుఁడగుకనకశక్తిని, కుమారకార్తికేయునికిని, దేవవ్రతభాస్కరనందులకును, తన గురువైనయోగాచార్యునికిని మ్రొక్కెను. దీనినిబట్టి భాసునికాలమందు చౌర్యోపాయవక్త ఖరపటుఁ డనియు, శూద్రకునినాఁటికి కుమారకార్తికేయునిసంప్రదా

1. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి చతుర్భాణీ పీఠిక. 1922 ముద్రణము.

యమునుబట్టి కనకశక్తిమొదలగు వారిచౌర్యశాస్త్రసూత్రము లుదయించిన వని యుం దెలియఁగలదు. కాని, ఆఖరపటాదుల గ్రంథము లిపుడు కనరావు. తరువాత —

రత్నావళీ ప్రియదర్శికానాగానందములు—ఇందు మొదటి రెండును నాటికలు. మూఁడవది నాటకము. ఈమూఁడింటిలోని యితివృత్తముల కాధారము బృహత్కథ యగుటచే నివి కల్పితములు గాకపోయినను, మొదటి రెండును నాటిక లైనవి. ఇవి బృహత్కథలోని వైనను, ప్రఖ్యాతములు పురాణప్రసిద్ధములు గాక పోవుటచే నట్లగుట యుచితమంద మన్న, నాగానందము నాటక మైనది. అందుచే నివి యితివృత్తవిషయమున రూపకలక్షణము ననుసరించినవి కావన వచ్చును. కల్పితేతివృత్తరూపప్రకరణధర్మమును, ప్రఖ్యాతనృపనాయకాదికమగునాటకధర్మమును గ్రహించి సంకీర్ణ మగునది నాటిక యని లక్షణము. కాని, బృహత్కథేతివృత్త మొకవిధముగాఁ బ్రఖ్యాతము నింకొకవిధముగాఁ గల్పితము ననుట కవకాశ మున్నది గావునఁ బైవిధాన మర్హ మగు నని సర్దుకోవచ్చును. తక్కినరూపకలక్షణము లన్నియు మూఁడింటియందును సరిగాఁ బట్టినవి.

కౌశాంబీపాలకుఁ డైనసహస్రానీకుఁడు పాండురాజువంశమునం దర్జునునకాఱవపురుషుఁ డని విష్ణుపురాణముగూడఁ జెప్పుచున్నది. అతనికి మృగావతి యనుదేవియం దుదయించినయుదయనుఁడే వంశనామమున వత్సరాజనఁబడెను. అతనివృత్తిమే బృహత్కథలో వర్ణింపఁబడినది. అతఁడు, ఉజ్జయినీరాజైనచండమహాసేనునిపుత్త్రి యగువాసవదత్తను బరిణయ మయ్యెను. అతఁడే బంధుమతి యను మఱియొకరాజకన్యను, పద్మావతి యనునింకొకక్షత్రియకన్యను బెండ్లాడెను. ఈ వివాహములవృత్తము, ప్రతిజ్ఞాయౌగంధరాయణము—స్వప్నవాసవదత్తము—తాపసవత్సరాజము—ఉదయనచరితము — రత్నావళి — ప్రియదర్శిక — యనురూపకముల నయ్యాకవులు వర్ణించియున్నారు. భాసుఁడు స్వప్నవాసవదత్తలోఁ జేర్కొన్న పద్మావతియే రత్నావళీనాటికలో రత్నావళి యనుపేర నాయిక యైనది. బృహత్కథలో బంధుమతి యన్నది ప్రియదర్శికానాటికలోఁ బ్రియదర్శిక యైనది. ఇట్లాయాకవులు నాయికలపేళ్లు మార్చినను, విషయ మంతయు బృహత్కథకు సంబంధించినదే. కాని, రూపకకవులు బృహత్కథ ననుసరించినను, నాయికాదిసంబంధకల్పనమునఁ గొంతకొంత మార్పు కలిగించి రని మాత్రము చెప్పకతప్పదు. వారే యట్లు చేసి రననేల? బృహత్కథకుఁ బరివర్తనము లనఁబడుబృహత్కథామంజరీ కథాసరిత్సాగరములలోఁ గూడ నట్టిమార్పులు కనఁబడుచున్నవి. అది యిపుడు లేకపోవుటచే నిం దేది దాని నెంతవఱకు సరిగా ననుసరించినదో తెలియకున్నది.

భాసునిస్వప్నవాసవదత్త, వాసవదత్త మృతి చెందినట్లు ప్రవాదము కల్పించి యామెను బద్మావతి మఱుఁగున నుంచి పద్మావతీవత్సరాజులకుఁ బరిణయము కావించినది. హర్షునిరత్నావళి దేవియైనవాసవదత్తచాటునఁ బద్మావతిని రత్నావళి యనుపేర నుంచి, దేవీసమ్మతిని రత్నావళీవత్సరాజులకుఁ బెండ్లిచేసినది. ఇందు పాత్రము లొకటియైన నితివృత్తకల్పనమునఁ బోలిక యున్నదా? అక్కడి వత్సరాజునకు నిక్కడివత్సరాజునకుఁ బోలిక యున్నదా? అట్లే, మాలవికాగ్నిమిత్రమందును రత్నావళీప్రియదర్శికలందును స్థూలదృష్టి కితివృత్తముల ననుకరణ మించుక గోచరించుచున్నను, సూక్ష్మదృష్టి కవి భిన్నము లని పాఠకులు గ్రహింపక పోరు. ఐనను, ఇవి రెండును బూర్తిగా దాని ననుకరించిన వనెడిప్రవాదము మాత్రము విమర్శకలోకమునఁ బుట్టినది. దేవిచాటున నున్ననాయికలను నాయకులు దేవి సమ్మతిని జేపట్టుట యనువిషయము మూఁటియందు నేకము. అంతే. తక్కినయితివృత్తములమార్గములు వేఱు. మాలవికాగ్నిమిత్రములో నగ్నిమిత్రుఁడు మాలవికను జేపట్టుటకుఁ గావించినయుపాయములు వేఱు. రత్నావళిలో వత్సరాజు రత్నావళిని బరిగ్రహించుటకుఁ బన్నినసాధనములు వేఱు. అక్కడిపాత్రముల కృత్యములకు నిక్కడిపాత్రములపనులకుఁ బోలిక లేదు. ప్రధానరస మన్నిట శృంగారమే కాని, తత్పోషణవిధానము విభిన్నము.

మాలవికాగ్నిమిత్రములో నాయికానాయకులయనురాగము వారిహృదయముల గాఢమైనను, క్రమక్రమముగాఁ బైకుబికినది. ప్రియదర్శికలోనినాయకునియనురాగ మాకస్మికనాయికావీక్షణమున మొదటనే పైకుబికినది. అక్కడి నాయికస్థితికంటె నిక్కడినాయికయవస్థ భిన్నము. అందుచే రసపోషణక్రమమును భిన్నమైనది. ఇది నిజమైనను, వీనిని రచియించుపట్టున మాలవికాగ్నిమిత్రము కవిహృదయమున స్ఫురించుచున్న దని యది పూర్వ మగుటచేతనే కాక బాహ్యసామ్యమునుబట్టియు నంగీకరింపవలసియున్నది.

నాగానందములోనియితివృత్తము ప్రేక్షకులహృదయము కరఁగించునంతటి సమర్థము. విద్యాధరచక్రవర్తి యగుజీమూతవాహనుఁడు రాజ్యము విడిచి పితృసేవ కరణ్యమున కేగినవితరాగుఁడు. నాగజాతిని రక్షింప గరుత్మంతునికి నిజదేహ మర్పించిన ధీరుఁడు, ఉదారుఁడు, కరుణామయుఁడు, దయాదానవీరుఁడు. సత్కులప్రసూతయు సుగుణశాలినియు నైనమలయవతిని వరించినసరసుఁ డనుకూలుఁడు. ఇందలిప్రధానరసము వీరము. శృంగారకరుణము లంగములు. ఏతదర్వాచీనాలంకారికు లందఱును, పైరూపకత్రయములోనిశ్లోకములు వాక్యములు పెక్కుసందర్భముల నుదాహరించుటచే వీనియుత్తమత్వము గోచరించుట యటుండ, ధనికుఁడు దశరూపావలోకమున జీమూతవాహనునిధీరోదాత్తత్వమును జక్కఁగఁ జర్చించి

సిద్ధాంతీకరించుట యీపాత్రము నౌచిత్యమును వేనోళ్లఁ జాటుచున్నది. ముఖ్యముగా మూఁడువిధములైనయవస్థలు కల్పించి నాయకునిశీలమున కించుకయేని భంగము రాకుండ నిట్లు పాత్రమును బోషించుట యరిది యనవచ్చును. ధీరోదాత్తలక్షణమునకును దానమునకుఁ గూడ ధనికుఁ డుదాహరించినయీక్రింది శ్లోకము నాయకుని కుండవలసినసుగుణము లన్నియు జీమూతవాహనునియందు మూర్తీభవించినట్లు తెలుపఁగలదు.

"శిరాముఖైః స్యందత ఏవ రక్త, మద్యాపి దేహే మమ మాంస మస్తి,
తృప్తిం న పశ్యామి చ తే మహాత్మన్, కిం భక్షణా త్త్వం విరతో గరుత్మన్."
గీ. రక్త మిదె కాఱుచుండె శిరాముఖముల, మిగిలియున్నది కండ నామేన నింకఁ,
గనఁబడదు నీకు సంతృప్తి గలిగినట్టు, లోవిహగరాజ! తిన కూరకుంటి వేల?

సుఖావస్థలో నున్ననాయకుని బోషించుట సులభమే కాని, కష్టావస్థలోనున్నవానిని బోషించుటయే కష్టాతికష్టము. అట్లైనను, భాసశూద్రకులచారుదత్తుఁడును శ్రీహర్షునిజీమూతవాహనుఁడును భవభూతిశ్రీరాముఁడును, ఏవికారము లేకుండ నొక్కవిధమునఁ బోషింపఁబడి రనుట గొప్పవిశేషము.

క్షేమేంద్రుఁడు మొదలుగా నప్పయదీక్షితులవఱకుఁ గలమహావిద్వాంసు లందఱును స్వభావోక్తిరూపకోత్ప్రేక్షాద్యలంకారములకును, శృంగారకరుణభయానకాదిరసములకును, ఔదార్యాదిసుగుణములకును, పైరూపకత్రయమునుండి శ్లోకముల నుదాహరించియున్నారు. భాషావిషయమున నివి కాళిదాసురూపకములవలె మిక్కిలిమృదులములు. వర్ణనములు స్వభావమధురములు. అన్వయకాఠిన్యము మందు కైనఁ గనరాదు. ఏశ్లోకము చదివిన నాపాతమధురమై హాయి గొలుపుచుండును. ఇందుకు ముగ్ధా నవోఢాసమాగమవర్ణనలు—

"హ్రియా సర్వస్యాగ్రే నయతి విదితా స్తీతి వదనం,
ద్వయో ర్దృష్ట్వా లాపం కలయతి కథా మాత్మవిషయాం,
సఖీషు స్మేరాసు ప్రకటయతి వైలక్ష్య మధికం,
ప్రియా ప్రాయే ణాస్తే హృదయ నిహితాశంకవిధురా"
"దృష్టా దృష్టి మధో దధాతి కురుతే నాలాప మాభాషితా,
శయ్యాయాం పరివృత్య తిష్ఠతి బలా దాలింగితా వేపతే,
నిర్యాంతీషు సఖీషు వాసభవనా న్నిర్గన్తు మే వేహతే,
జాతా వామత యైవ మే ఒద్య సుతరాం ప్రీత్యై నవోఢా ప్రియా"

ఇట్లు భాషచేతను శైలిచేతను, ఇవి మూఁడును సమముగా మనోహరములే యైనను, సర్వవిధములఁ దారతమ్యపరీక్ష గావించినపుడు వీనిలో నాగానందము త్తమ మనవలసి వచ్చును. ఇట్టివిద్వజ్జనరంజనము లైనరూపకములను రచియించినకవి శ్రీహర్షదేవుఁ డని—

"రాజ్ఞ శ్శ్రీహర్షదేవస్య పాదపద్మోపజీవినా రాజసమూహే నోక్తః. యథా, అస్మత్స్వామినా శ్రీహర్షదేవే నాపూర్వవస్తురచనాలంకృతా రత్నావళీ నామనాటికా కృతా—శ్రీహర్షో నిపుణః కవిః"—

ఇత్యాదిప్రస్తావనలలోనివాక్యములవల్లఁ దెలియుచున్నది. కాని, యితఁడే దేశము నేలినవాఁడు? ఎప్పటివాఁడు? ఇతఁడే వీనిని నిర్మించెనా? లేక, ఇతని యాస్థానములోని యొకకవి రచియించి యితనిపేరు పెట్టెనా? అనుప్రశ్నము లిపుడు విమర్శకలోకమున వివాదాస్పదములై యున్నవి. అందుచే వీనిం గూర్చి సంగ్రహముగాఁ జర్చించి సత్యము తెలిసికొన యత్నింతము.

కవి, పై రూపకములప్రస్తావనలలోఁ దాను శ్రీహర్షుఁడు శ్రీహర్షదేవుఁడు నైనట్లు తెల్పుకొనెను గాని, తాను బాలించుదేశమునుగాని తనరాజధానిని గాని పేర్కొనలేదు. ఈపేరు గలరాజులు ముగ్గురు నలుగురు కనవచ్చుటచే నితఁ డెవఁడను విషయమున విమర్శకులు భ్రాంతిపడుట నైజము[1]. విల్సనుపండితుఁడు, రాజతంరగిణిలోను కథాసరిత్సాగరములోను వర్ణింపఁబడినసూర్యవత్యనంతరాజులమునిమనుమఁడును కలశభూపతిపుత్త్రుఁడు నగుశ్రీహర్షదేవుఁడు రత్నావళీనాటిక రచియింపఁజేసె నని[2] వ్రాసెనుగాని, అది ప్రామాదికము. అతనియభిప్రాయమునుబట్టి క్రీ. ౧౧౨౫ ప్రాంతమున రత్నావళి పుట్టును. ఇందలిశ్లోకములు క్రీ. ౯౯౬ ప్రాంతమం దుదయించినదశరూపకావలోకములో నుదాహరింపఁబడెను. దశరూపకకారయితయు ధారానగరాధీశుఁడు నైనముంజమహీపాలునితండ్రి హర్షవర్ధనుఁడే కాని, అతఁడు గ్రంథకర్త యైనట్లు ధనంజయధనికులుగాని, అతనిపౌత్త్రుఁ డైన భోజమహారాజు గాని యెక్కడను సూచించి యుండలేదు. నిజముగా నీరూపకములతనివే యైన నిందలిశ్లోకము లుదాహరించెడిధనికుఁడుగాని భోజుఁడు గాని, యతనివే రెత్తకుందురా? ఇంతకును, దామోదరగుప్తునికుట్టనీమతమందు—వత్సేశ్వరభూమికయో ర్ద్వయ మనుకురుతే నరేశ్వరవయస్యః—అనుపద్యము మొదలుగా,—నిపుణపరీక్షకదృష్టం రాజతి రత్నావళీ రత్నమ్—అనుపద్యమువఱకు ౧౮౫

1. ఈవిషయమును నేను సంస్కృతకవిజీవితమునఁ జర్చించియున్నాను.
2. చూ. H. H. Wilson's the Hindu Theatre. ఆంగ్లరత్నావళిపీఠిక.

పద్యములలో రత్నావళీ నాటికావృత్తము వర్ణింపఁబడినట్లు స్పష్టముగాఁ గన వచ్చుచుండ, దానినాఁటికిఁ బ్రసిద్ధి గాంచినరత్నావళి క్రీ. ౭౫౫ పూర్వ మనుట కాక్షేప మేమి? అట్టియెడ దాని కీవలిశ్రీహర్షులు దీనికర్తలు కా రనుట కాటంక మేమి? అయితే, అంతకుఁ బూర్వుఁ డైనయేశ్రీహర్షుఁ డితఁడు? ఏకాలమువాఁడు? ఈవిషయమున ననేకమతము లుప్పతిల్లినవి. అందు గొన్ని—

"రత్నావళ్యాదులలోఁ గనవచ్చుశ్రీహర్షుఁడు కాన్యకుబ్జరాజు కాఁడు. శకులను జయించినయతఁడు క్రీ. పూ. ఆఱవశతాబ్దిలోనివాఁడు. ధావకుఁ డనఁ బడెడిభాసుఁ డతనియాస్థానకవి. రాజశేఖరకవివిమర్శములోనిశ్లోకములనుబట్టి యాభాసుఁడు రత్నావళ్యాదులు నిర్మించినట్లును శ్రీహర్షుఁడు వానిని జూచి యానందించినట్లును దెలియవచ్చుచున్నది. కావున నాశ్రీహర్షవిక్రమాదిత్యుని పేర వెలసినరత్నావళ్యాదులు క్రీస్తుపూర్వ మాఱవశతాబ్దిలోని"వని శ్రీయుత నారాయణశాస్త్రిగారు తెలిపియున్నారు.[1]

శ్రీహర్షవిక్రమాదిత్యుఁ డుజ్జయినీపాలకుఁడై క్రీ. పూ. ౫౭ లో సంవతు, లేక, మాలవశక మేర్పఱిచె ననియు, అదియే విక్రమార్కశక మనుపేర నేఁటికిని వ్యవహారమునఁ గనవచ్చుచున్న" దనియు నొకమతము ప్రసిద్ధమై యున్నది. కాని, "క్రీ. ౫౪౪ లో, విక్రమాదిత్యుఁడు కోరూరుయుద్ధమున శకుల నోడించి యేర్పఱిచినయాశకమే, ఆఱువందలసంవత్సరములవెనుకనుండి యారంభింపఁబడినది. అదే క్రీ. పూ. ౫౭ నుండి గణింపఁబడుచున్నశక" మని కొందఱిమతము. "ఈయాఱవ శతాబ్దిలోనివిక్రమాదిత్యుఁడే కాళిదాసాదినవరత్నముల కాశ్రయభూతుఁ" డని యింకొకమతము. ఇట్లుశ్రీహర్షవిక్రమాదిత్యసంజ్ఞలు కలరాజుకాల మేది యైనను, రత్నావళ్యాదికర్త యైనశ్రీహర్షవర్ధనుఁడు రెండవశిలాదిత్యుఁడే యని మఱియొక మతము[2]. ఇ ట్లెన్నెని మతము లున్న వనుట పాఠకలోకమునకు విదితము. కాని, యిం దొకటియు స్థిరపడలేదు. ప్రతిమతమును విమర్శనీయ మగుచునే యున్నది. స్థిరపఱుచుటకుఁ దగినయాధారములును లేవు. కావున నెవ రెట్లు చెప్పిన నది యూహయే కాని వేఱు కా దనుట నిజము. అందుచే నింతకు ముందుభాసకాళిదాసులకృతుల సందర్భమునఁ జదివినమాటలనుబట్టి యొకదారికి వత్తము.

శ్రీహర్షవిక్రమాదిత్యుఁ డని ప్రసిద్ధి కెక్కినయొకమహారాజు క్రీ. పూ. ౫౭ లో, ఉజ్జయిని నేలినట్లు చెప్పెడిప్రాచీనమత మసంగతము కాదు. అతఁడు పెక్కండ్రు

1. 2. చూ. మదీయసంస్కృతకవిజీవితము—నారాయణశాస్త్రిగారి విక్రమార్క-జీవితకాలనిర్ణయము—శ్రీకృష్ణమాచార్యులుగారి ప్రియదర్శికాపీఠిక—రమేశమోహన్ బోసుగారి శాకుంతలపీఠిక. ఏ. బి. కీతుగారి The Sanskrit Drama.

కవుల నాదరించినవిద్వాంసుఁ డనుటయు సుసంగతమే. కాని, అతని పేర భానుఁడు రత్నావళీప్రియదర్శికానాగానందములు రచియించియుండు ననెడియూహ మాత్రము విశ్వసనీయము కాదు. కాళిదా సతనినాఁటివాఁ డనుట విశ్వసనీయ మగునట్లుగా, భాసుఁ డతనికి సమకాలికుఁ డనుట సాధ్యము కాదు. జ్యోతిర్విదాభరణము కాళిదాసకృత మనుట నమ్మరాదు[1]. క్రీ. పూ. జీవించియున్న వరరుచిని, క్రీ. మొదటిరెండుశతాబ్దులలోనియమరసింహుని, క్రీ. ౫౦౫ లోని వరాహమిహిరుని, ఇట్లే భిన్నకాలములలోనియితరుల నొక్కచోఁ జేర్చిన—

"ధన్వంతరి క్షపణ కామరసింహ శంకు,
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః,
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం,
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య"

అనెడినవరత్నశ్లోకమే, యాగ్రంథము మిక్కిలి యర్వాచీన మనుటకుఁ బ్రబలప్రమాణము[2]. ఘటకర్పరునిగూర్చి యెన్నేని చాటువులు కలవు. అవి కొన్ని రాజశేఖరునికవివిమర్శములోని వని కొందఱు విశ్వసించుచున్నారు. భాసధావకఘటకర్పరసంజ్ఞ లోకనికిఁ జెల్లినవే యనెడికింవదంతి యాధారముగా నట్టి శ్లోకములు పుట్టినట్లే, శ్రీహర్షవిక్రమాదిత్యునిసభలో నవరత్నము లుండెడివా రనుకింవదంతి మూలముగా జ్యోతిర్విదాభరణములోనిపైశ్లోకము పుట్టియుండును. కొందఱు విమర్శకు లీశ్లోకము పూర్తిగా నమ్మకున్నను, వరాహమిహిరునితోఁ గాళిదాసు నాఱవశతాబ్దిలోఁ జేర్చుటకు మాత్రము దీనిభాగమును స్మరించుట చిత్రము. ఇది యిటుండనిండు—నిజముగా రత్నావళ్యాదులు క్రీ. పూ. ౫౭ లోని శ్రీహర్షుఁడు రచించినవో లేక యతనిపేర వెలసినవో యైనయెడ, నాఁటినుండి దామోదరగుప్తుని వఱకుఁ గలమధ్యకాలమునఁ గలయాలంకారికులలో నొకఁడైన వీనిలో నొకదాని నైన స్మరింపకుండునా ? కాని, అట్టిది కనఁబడదు. కావున నివి యతనివి కావనవచ్చును. ఇఁక, కాన్యకుబ్జపాలకుఁ డైనహర్షవర్ధనుఁ డున్నాఁడు. రత్నావళ్యాదులలోని శ్రీహర్షుఁ డితఁడే యని పెక్కండ్రభిప్రాయపడుచున్నారు. కాని, వారిలోఁ గొంద ఱీరూపకములు ధావకుని వనియు, కొందఱు భట్టబాణుని వనియు, మఱికొందఱు హర్షవర్ధనునివే యనియుఁ ద్రివిధముగా వ్రాయుచున్నారు[3].

---

1. చూ. జ్యోతిశ్శాస్త్రప్రకరణము.
2. సంస్కృతకవిజీవితము రచియించినపు డీశ్లోకము విశ్వసించి నేనును భ్రాంతిపడి యున్నాను.
3. ఈవిషయము నాసంస్కృతకవిజీవితమున మున్నే చర్చింపఁబడినది.

"కావ్యం యశసే ఽర్థకృతే" ఇత్యాదికావ్యప్రయోజనవివరణావసరమున మమ్మటభట్టు "కాళిదాసాదీనా మివ యశః, శ్రీహర్షాదే ర్ధావకాదీనా మివ ధనమ్" అనియశోధనములప్రాప్తి కుదాహరణముగా నొకవాక్యము వ్రాసియున్నాఁడు. కావ్యప్రకాశవ్యాఖ్యాత యగుమహేశ్వరుఁడు దీని కర్థమువ్రాయుచు, శ్రీహర్షుఁ డనురాజుపేర ధావకుఁడు రత్నావళి రచియించి ధనము సంపాదించె ననివ్రాసెను. ఇట్లే కావ్యప్రదీపప్రభాకరాద్యభిప్రాయము నున్నది. ఈవాక్యమును గూడ నాధారముఁగా గ్రహించి, ఈధావకుఁడే భాసుఁడు, ఈశ్రీహర్షుఁడే శ్రీహర్షవిక్రమాదిత్యుఁడు, అని చెప్పుచు, వీరి నిద్దఱిని, క్రీస్తుపూర్వము చేర్చినవారు వాదించుచున్నారు. ఈశ్రీహర్షుఁడు ద్వితీయశిలాదిత్యుఁడే, ఈధావకుఁ డితనియాశ్రితుఁడై ధనమార్జించినవాఁ డని, వీరి నిద్దఱిని, క్రీస్తుపరముచేర్చినవారనుచున్నారు. ఈవివాద మిటులుండ నిం దంతర్వివాదము మఱియొకటి.

నాగానందము ప్రకటించినహాలుపండితుఁడు దానిపీఠికలో, తాను సంపాదించినకావ్యప్రకాశపుస్తకమునందు, ధావకాదీనా మివ ధన మ్మనుచోట, 'బాణాదీనా మివ ధన' మ్మనువాక్య మున్న దని వ్రాసియున్నాఁడు. అతనివ్రాత నూఁతగాఁ గొని, రమేశదత్త దుర్గాప్రసాద మేగ్డోనలుపండితులు బాణుఁడే రత్నావళీకర్త యనునభిప్రాయమునకు వచ్చిరి. ఎన్నోవ్రాతప్రతులందు 'ధావకాదీనా' మను పాఠము కనఁబడుచుండ హాలుపండితుఁడు చూచినయొకప్రతిలోని 'బాణాదీనా' మనుపాఠము విశ్వసనీయమా యని కొందఱును, ఆప్రతి, కాశ్మీర దేశములోనిది గావున నందలిపాఠము విశ్వాస్యమే యని మఱికొందఱును భావించుచున్నారు. ఇది యిటులుండ, 'బాణాదీనా' మనుపాఠమే సముచితము గాని, బాణుఁడు రత్నావళిని శ్రీహర్షుని కమ్ముకొని ధన మార్జించె ననెడియభిప్రాయము సముచితము కా దని యిఁకఁ గొంద ఱనుచున్నారు. ఇట్లున్నబహువిధాభిప్రాయములలో నేది సత్యమో నిర్ణయించుట యశక్యమే కాని, రత్నావళికిని, ధావకునికి లేక బాణునికిని ముడిపెట్టినకావ్యప్రకాశవ్యాఖ్యాతలమాట మాత్రము సత్యము కా దనుట కింతకు మున్ను చెప్పినకారణములే చాలును. ధావకుఁ డనునొకకవి యేదోకావ్యము నిర్మించి యేశ్రీహర్షునివల్లనో ధన మార్జించినమాట విని మమ్మటుఁడు వాక్యము వ్రాసియుండ, తమనాఁటికి వినవచ్చినకింవదంతినిబట్టి రత్నావళి నతనికి వ్యాఖ్యాత లంటఁగట్టిరి. ఒకరాజుపేర నొకకావ్యము కనఁబడినచో దానిని, తదాశ్రితు[illegible] యొకానొకఁడు రచియించె ననుట మనవారి కాచారమై యున్నదే కదా! [illegible] వచ్చినకింవదంతినే వ్యాఖ్యాతలు నమ్మిరి. పోనీ! బాణుఁడే రచియించి హర్షవర్ధనుని పేరు [illegible]యుండు నందుమా, అంతకంటె దివ్యమైనకాదంబరి యుండఁగా దానిని విడిచి రత్నావళినే యతని కేల యిచ్చును? ఇచ్చుఁ గాక, ఆగర్భశ్రీమంతుఁ

దైవయుతనికిఁ గావ్యకన్యను విక్రయించి ధనము పుచ్చుకొనుదుర్గతి పట్టినదా? సగౌరవముగాఁ బిలిపించి తనయాస్థానమున నిలుపుకొన్నరాజతని కన్నవస్త్రములు గడపకుండె నని రత్నావళి యమ్ముకొనెనా ? కావున రత్నావళికర్తృత్వము బాణునికిఁ గట్టిపెట్టుటయు విశ్వసనీయము కాదు. అందుచే హర్షవర్ధనుఁడే యీమూఁడురూపకములకర్త యనుట సముచితము. ఈపక్షమున నొకటే యాక్షేపమున్నది. ఇతఁడు వీనిని రచియించినచో బాణుఁడు హర్షచరితమున నితని వర్ణించునెడ రత్నావళ్యాదికర్త యని యెందుకు వ్రాయఁడు ?—అప్పటికి రా జీరూపకములు రచింపలేదేమో! కాదంబరిలో నెందుకు స్తుతింపలేదు. తమనాఁటికృతులను ధమకృతులఁ బ్రశంసించునాచార మానాఁడు లేదు సరిగదా ! తమమొదటికావ్యములనే తమతరువాతికావ్యములోఁ గూడ స్మరించునాచార మాకాలము నందలి కవులలో నెక్కువగాఁ గనరాదు. కాళిదాసేకావ్యమున నైనఁ దనయితరకావ్యము మాట యెత్తెనా? భవభూతి యెత్తెనా? భోజరాజుకృతుల నతనియాస్థానములోని కవులు స్మరించిరా ?—అందుచేఁ బెక్కుకారణములనుబట్టి క్రీ. ౬౦౬—౬౪౭ నడుమఁ గాన్యకుబ్జ మేలినవిద్వత్ప్రభు వగుహర్షవర్ధనుఁడే పైరూపకత్రయము నిర్మించె నని యిప్పటికి విశ్వసింతము.

శ్రీహర్షుని కించుకసమకాలికుఁడును, కాంచీమండలపాలకుఁడును, పల్లవరాజగుసింహవిష్ణువర్మపుత్త్రుఁడు నైనమహేంద్రవిక్రమవర్మ మత్తవిలాస మనుప్రహసనము రచియించెను. క్రీ. సప్తమశతకములోఁబుట్టిన యీరూపకము మొన్నమొన్న, అనంతశయనమున ముద్రితమై ప్రజలకంటఁ బడినది. భాసునిరూపకములం దున్నట్లిందును, ప్రస్తావనకు బదులుగా స్థాపన యనుమాట కనఁబడును. చారుదత్తములోనిచౌర్యసూత్రకర్త యైన ఖరపటుఁ డిందును స్మరింపఁబడెను. దీనినిబట్టి యిది భాసునిచారుదత్తము నెఱుఁగు ననుట స్పష్టము. ఇది క్రీ. సప్తమశతకములోని దగుటఁ బ్రాచీన మని ప్రశంసింపఁదగినది గాని యితరప్రహసనములలో లేనివిశేషగుణ మిం దేదియు లేదు.

"ప్రభావతీముకుటతాడితకాద్యాని భూరిశః
రూపకాణి విచిత్రాణి భాసేన రచితాని వై"

అనుశ్లోక ముదాహరించుచు నొకరు, భాసుఁడు ముకుటతాడితక మనుప్రహసనము నిర్మించె నందురు. చండపాలుఁడు నలచంపూవ్యాఖ్యలో నిది భట్టబాణవిరచిత మని చెప్పినట్లు ఏ. బి. కీతుపండితుఁడు చెప్పుచుండెను. ఈమాట నిజమైనను, బాణుఁ డీప్రహసనము రచియించె ననుట విశ్వసనీయము కాదు. చండపాలుఁడు కూడఁ గింవదంతినిబట్టి యట్లు వ్రాసియుండును. ఇంతకు, చండపా

లునినలచంపూవ్యాఖ్యయు ముకుటతాడితకమును గూడ దుర్లభము లగుటచే నిదమిత్థ మని నిర్ణయింప వీలులేదు. సర్వచరిత మనుప్రహసనము బాణుఁడు రచియించినట్లు రాజారామశాస్త్రిగారు గ్రంథసూచీపత్రమున సూచించిరిగాని, అదియు నట్లే విశ్వసనీయము కాఁజాలదు. మత్తవిలాసమం దున్న—

"పేయా సురా ప్రియతమాముఖ మీక్షితవ్యం,
గ్రాహ్య స్స్వభావలలితో వికృతశ్చ వేషః,
యే నేద మీదృశ మదృశ్యత మోక్షవర్త్మ,
దీర్ఘాయు రస్తు భగవాన్ స పినాకపాణిః"

అనుశ్లోకము భాసుని దని సోమదేవభట్టు యశస్తిలకమునఁ జెప్పియున్నాఁడు. కాని, ముద్రితము లైనభాసరూపకములలో నిది కనరాదు. ముకుటతాడితకములో నున్నదేమో? తత్త్వము తెలియక కింవదంతినిబట్టి పుట్టినయిట్టివ్రాఁతలే విమర్శకలోకము నట్టిటు త్రిప్పుచున్నవి. అందుచేఁ బ్రహసనములం దిదే యాద్య మని నిర్ణయింపఁ నెవరును సాహసింపలేరు.

మత్తవిలాసమందలికపాలి శాక్యభిక్షువు మొదలగుపాత్రములసంభాషణములనుబట్టి తత్కాలమునందలికాపాలికబౌద్ధమతములయభివృద్ధి గోచరించును. స్త్రీసురాపానములవర్ణనలనుబట్టి యే యిది మత్తవిలాస మనుతనపేరును సార్థకము గావించుకొనుచున్నది. ఇది నవ్వు పుట్టించుచు దుర్వ్యసనములవలని యనర్థమును బోధించుచుఁ దుదకు నీతిదాయక మగుచున్నది. ఇఁక—

భవభూతిరూపకత్రయము. క్రీ. అష్టమశతకమందలిమహాకవులలో భవభూతి యగ్రగణ్యుఁడు. రాజతరంగిణిలో వర్ణింపఁబడినలలితాదిత్యనృపాలునికి సమకాలికుఁడై క్రీ. 730 ప్రాంతమున నుజ్జయినీకాన్యకుబ్జము లేలినయశోవర్మయాస్థానములోని విద్వత్కవి. ఇందుకు రాజతరంగిణిలోనియీపద్యము ప్రమాణము.

"కవి ర్వాక్పతిరాజశ్రీభవభూత్యాదిసేవితః,
జితో యయౌ యశోవర్మా తద్గుణస్తుతివన్దితామ్"

ఈయశోవర్మ కవి యని దీనినిబట్టి తెలియుచున్నది. ఇతఁడు రామాభ్యుదయ మనెడినాటకము నిర్మించె నని కొంద ఱందురు. ఆనందవర్ధనుఁడు "యథా రామాభ్యుదయే. కృతకకుపితై రిత్యాదిశ్లోకః" అనుచు ధ్వన్యాలోకతృతీయోద్ద్యోతమున దీనిప్రసంగ మెత్తెనుగాని యిది యశోవర్మకృతి యని చెప్పలేదు. ఇంతకు నిది దుర్లభ మగుటచే నిదమిత్థ మన వీలు లేదు.

భవభూతి, తనపూర్వకవులవలెఁ గాక స్వవిషయము నిజరూపకప్రస్తావనలలో వర్ణించుకొనెను. ఇతఁడు విదర్భదేశమందలిపద్మావతీపురమున శ్రోత్రియకుటుంబమున జన్మించినవెలనాటిబ్రాహ్మణుఁడు. వాజపేయయాజి యైనమహాకవి కైదవపురుషుఁడు. భట్టగోపాలునిపౌత్రుఁడు. జ్ఞాననిధిమహోదయునిశిష్యుఁడు. తైత్తిరీయశాఖీయుఁడు. వేదవేదాంగవేత్త శ్రీకంఠపదలాంఛనుఁడు. ఇతఁడు రచియించినవి మహావీరచరిత్ర, ఉత్తరరామచరిత్ర, మాలతీమాధవము. ఇందు మొదటిదానిలోనియితివృత్తముప్రఖ్యాతము రెండవదానిలోనిదిమిశ్రము మూఁడవదానిలోని దుత్పాద్యము. మొదటిరెండును శ్రీరామాయణకథాశ్రయము లైననాటకములు. మూఁడవది కల్పిత మైనమాలతీమాధవులకథ నాశ్రయించిన ప్రకరణము. మహావీరచరిత్రమునఁ బ్రధానరసము వీరము. ఉత్తరరామచరిత్రలోని కథ శుభాంతముగాఁ బరిణమించుటచేతను, నాటకమునఁ గరుణము ప్రధాన మగుటకు లక్షణ మంగీకరింపకుండుటచేతను, ఇందలిప్రధానరసము విప్రలంభశృంగార మని కొందఱు భావించుచున్నారు. సీతావివాసనప్రసక్తినిబట్టి రామునికిఁ గాని సీతకుఁ గాని పునస్సమాగమప్రత్యాశ లేకపోవుట విస్పష్ట మగుటచే నిది కరుణమే యని కొంద ఱనుచున్నారు. ఇతివృత్త మంతయుఁ జక్కఁగాఁ బరామర్శించినచో విప్రలంభ మంగముగాఁ గరుణమే ప్రధానరస మైనట్లు కనవచ్చును. పూర్వకవు లందఱును, కొంచెముగానో గొప్పగానో రూపకలక్షము నతిక్రమించుచు వచ్చిన ట్లింతకు మున్నె తెలిసికొనియున్నాము గావున నిందు కరుణము ప్రధాన మగుట లక్షణమునకు విరుద్ధ మన్నను హాని లేదు. మహాకవులు తమకావ్యము సహృదయుల మనసు కరఁగించునట్లు రసరంజక మగుట చూతురు గాని గ్రుడ్డిగా లక్షణములవెంటఁ బడరు. ఈరూపకములు మూఁడును మూఁడువిధము లైనయితివృత్తములను స్వీకరించినట్లే మూఁడుతెఱఁగు లైనరసములను వరించినట్లు వస్తువర్ణనములే తెలుపును. ఇందు వీరచరితమాలతీమాధవములలోనివీరశృంగారములు సర్వసమ్మతములు గదా! ఇఁక నుత్తరచరితమందలికరుణము నాంతరదృష్టిఁ బరిశీలింతము.

అయోగ విప్రయోగభేదమున విప్రలంభశృంగారము రెండువిధములు. మాన ప్రవాస భేదమున విప్రయోగము రెండుతెఱఁగులు. కార్య సంభ్రమ శాపములవలనఁ బ్రవాసవిప్రయోగము మరల మూఁడువిధములు. ఇందు దైవిక మానుషము లైనవిప్లవములవల్ల నైనసంభ్రమప్రవాసము గూడఁ దుదకు నాయికానాయకసమాగమరూపమునఁ బరిణమించినట్లు కనఁబడునుగాని, లోకాపవాదము నిమిత్తముగా వచ్చినయుత్తరరామచరిత్రలోనిప్రవాస విప్రయోగము దానికంటెఁ గూడ నధికమై పునస్సమాగమప్రత్యాశలేని దైనది. అందుచే నిందు

విప్రలంభ మంగముగా, కరుణ మంగియైన దనుమత ముదయించినది. ఇందుకు వ్యాఖ్యాత యైనవీరరాఘవపండితునియీ క్రిందిమాటలు సహాయపడుచున్నవి.

"యద్యపి కరుణ ఏ వాస్మి న్నాటకే ప్రధాన మితి సార్వజనీనమ్. సూచితంచ మరణప్రసక్తిపూర్వప్రతిషేధో నాటకప్రతిపాద్యఇతి సూచయతా నాందీస్థావృతా మితిపదేన కరుణ ఏవాస్మి న్నాటకే ప్రధాన మితి. తథాపి వీరశృంగారా ప్రాయికా విత్యుక్తే రదోషః"

ఇది యిట్లుండ సీత జీవించియున్న దని రాముఁడు తలంచినట్లు గాని విశ్వసించినట్లుగాని నాటకమున నెక్కడను గనఁబడదు. అట్లే సీత తాను మరలరాముని జేరఁ గల నని యాశించి నట్లెక్కడను గనఁబడదు. అందుచేతనే శుభాంతముగా నాటకము సమాప్తి నొందింప నూహించిన కవి యంతర్నాటకము కల్పింపవలసి వచ్చినది. మఱియు శ్రీరాముఁడు తమస రామాయణముచదివినకుశుఁడు జనకుఁడు వాల్మీకిమాటలు చెప్పినయంతర్నాటకసూత్రధారుఁడు మొదలగువారి మాట లన్నియు సీత గతించిన దనుభావమే వెల్లడించుచు నిందు కరుణమే ప్రధాన మని చాటుచున్నవి. వీరివాక్యములను నాయనువాదమునుండి యుదాహరించుచున్నాను.

"దేవీ! నీపాదపద్మస్పర్శము రామునిశిరస్సున కిదియే కడపటిది"
"జానకీశూన్య మైనట్టిజగతి కిపుడు, వఱలుచున్నది ద్వాదశవత్సరంబు"
"కరుణరస మొక్కటే వేఱుకారణముల, వేఱువేఱువిధంబుల మాఱుచుండు
"ఆయెను సీత లేనిబ్రతు కక్కట! దుఃఖము రాదె తేనికిన్?"
ప్రేయసి పోయినన్ జగము పెద్దయరణ్యము—"

"మేము యోగదృష్టితోఁ జక్కఁగాఁ జూచి కరుణాద్భుతరస మిశ్రమును బావనము నైనవచనామృతమును సమకూర్చినాము"

"హా సచ్చరిత్రదేవతా! దీనినిబట్టి నీవులోకాంతరమున విశ్రమించియున్నావనుట నిశ్చయము. హా దేవీ!—

ఇంక నిట్టి వెన్నేని కలవు. తృతీయాంకషష్ఠాంకములందు నాయికానాయకులవిరహావ్యథ వర్ణింపఁబడుటచే విప్రలంభము కరుణమున కంగ మనవలసివచ్చినది. అది యైనను రూపకాంతరములలోని విప్రలంభమువంటిది కాదు. తృతీయాంకమందలిప్రసంగ మంతయురామునికి సీతయందు గలనిర్వ్యాజనిర్మలానురాగము ప్రకటించుటకుఁ గల్పింపఁబడినది. సీతాకరస్పర్శమున రామునికిఁ గలిగిన యానందములో సహస్రాంశ మైనను, రాముని గన్నులారఁ జూచి చేతులారఁ

దాఁకినసీతకుఁ గలుగలేదు. అందుకుఁ గారణ మతఁడు మరలఁ దన్నుఁ బరిగ్రహించు ననెడియాశ యామెకు లేకపోవుటయే. సీత పన్నెండేళ్ల క్రిందటనే గతించినదనుమాట యాత్రేయినోటనే వచ్చినది. వాసంతి విశ్వసించినది. రాముఁడను కొన్నాఁడు. సీత జీవించియున్న దనుట కావ్యార్థమైనది. కవి యట్టిభావమును గనఁబఱచియున్నాఁడు. కావున భవభూతి యిం దుద్దేశించిన రసము కరుణ మనుట స్పష్టము.

ఇతనికి వచ్చినయశస్సున కంతకుఁ గారణ ముత్తరరామచరితమే. ఇందుకు "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అనునార్యోక్తియే తార్కాణము. చిత్రప్రదర్శనరంగమందలి ప్రతిమాటయు సార్థకము కథాపాత్రరసపోషణబీజము. అందలిజృంభకాస్త్రప్రదానమే షష్ఠాంకమందు రామునిసమాలోచననిశ్చయజ్ఞానములకు సాధన మైనది. అందలిగంగావసుంధరలప్రార్థనమే యంతర్నాటకకథ కాధారమైనది. ఇంత యేల? దానిమీఁదనే యితివృత్త మంతయు నిలిచియున్నది. ఇట్టి యద్భుతకల్పనమున భవభూతిప్రతిభకు సాటి యేది? అరణ్యావాసకాలమున నేవి సీత యెఱుఁగదో, ఏవి సీతయెడ రామునికిఁ గలగాఢానురాగమునకు సాక్షులో, ఏవి యుద్దిష్టరసమునకు సూచకములో, ఏవి యితివృత్తము వికసింప హేతువులో, అట్టిపూర్వరామాయణములోనివృత్తాంతములను జిత్రప్రదర్శనమునఁ జూపుటయే యితనిప్రతిభను వేనోళ్లఁ బొగడుచున్నది. ఇతని కిట్టి మహిమ కలదు కావుననే పూర్వు లెందఱో యెన్నివిధములనో యితనిఁ గొనియాడియున్నారు. అందలి సీతాహరణవృత్తాంతసందర్భమందలి 'అపి గ్రావా రోదితి' అనుదానిని జదివి పరవశుఁడైనగోవర్ధనాచార్యుఁడు తాను గొప్పకవి యయ్యు భవభూతిని—

"భవభూతే స్సంబంధా ద్భూధరభూ రేవ భారతీ భాతి,
ఏతత్కృతకారుణ్యే కి మన్యథా రోదితి గ్రావా"

అని ప్రశంసించెను. ఇతనికవితను మెచ్చుకొన్ననీలకంఠదీక్షితు లిట్లు వర్ణించియున్నాఁడు.

"ప్రా చేతసేన యాఽఽసీతా పాలితా భవభూతినా,
సర్వత శ్చర్వ్యతే వాణీ సైవా ద్య కవిమానిభిః"

వీరరసనాటకములలో నితనిమహావీరచరితమున కగ్రస్థానముకలదు గాని, అది యుత్తరచరితమువలెఁ బ్రసిద్ధి గాంచలేదు. మాలతీమాధవ మితనిస్వకపోలకల్పనాచాతురికి నిదర్శన మగుచుఁ బండితులహృదయ మాకర్షించినది. అందలి శృంగారమో, ఔచిత్యపారము గాంచి బాహ్మణికులపొగడ్త కెక్కినది. ఇతరము లైన

యద్భుతబీభత్సభయానకాదిరసములను గూడ నితఁ డాయాసందర్భముల సముచిత మగ వర్ణించె ననుట పాఠకలోకవిదితము. సౌజన్యము, అనుకూలదాంపత్యానురాగము ఆనందవిషాదములు అపత్యస్నేహము మొదలయినవి వర్ణించుపట్టున నితఁడు హృదయము విప్పి చూపినట్లుగా మఱియొకకవి చూపలేఁ డనుట యతిశయోక్తి కాదు. నదీగిరితరులతామృగవిహంగములస్వభావవర్ణన మితనిసొమ్ము. శిఖరిణీవృత్త మెందఱో వాడిరిగాని, ఇతనివాడుకలో, అందును గరుణరసవర్ణనమున నది యెంతయుఁ జక్కఁగా నడచినది. ఇందుకు క్షేమేంద్రమహాకవిస్తుతి—

"భవభూతే శ్శిఖరిణీ నిరర్గళతరఙ్గిణీ,
రుచిరా ఘనసందర్భే యా మయూరీవ నృత్యతి"

ఇతనిభావరసపదన్యాసములఁ గాంచి మైమఱచినతిలకమంజరీకర్త యగు ధనపాలునిమాట లివి—

"స్పష్టభావరసా చిత్రైః పదన్యాసైః ప్రవర్తితా,
నాటకేషు నటస్త్రీవ భారతీ భవభూతినా"

ఇంకొకమహాకవి భవభూతిరసపోషణవిధానమున కచ్చెరువడి యిట్లు పొగడియున్నాఁడు.

"భవభూతికవే ర్వాచ స్స్వదన్తే రసరఙ్జితాః,
సుమనోభ్య స్సుధాస్యన్ది బన్ధమాధుర్యబన్ధురాః"

ఇంతయేల? ఏయవస్థయందు మానవహృదయ మెట్లుండునో, వర్ణించు నెడ భవభూతికిఁ జాలినవాఁడు లేఁడు. ఇందు కొక్కయుదాహరణము—నన్ను నిష్కారణముగా విడిచిపెట్టినయాప్రియు నీస్థితిలోఁ జూచుచున్న నాహృదయావస్థ యెట్లున్నదో యేమి చెప్పుదును?—అని సీత యనఁగా, అమ్మా! నే నెఱుఁగుదు ననుచు, తమస యన్నమాటలు—

"తటస్థం నైరాశ్యా దపిచ కలుషం విప్రియవశా,
ద్వియోగే దీర్ఘేఽస్మి న్ఝుడితి ఘటనా త్స్తమ్భిత మివ,
ప్రసన్నం సౌజన్యా ద్దయితకరుణై ర్గాఢకరుణం,
ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణ ఇవ"

సీ. ఎఱిఁగి యూరక యన న్నెడఁబాసె నితఁ డెంత, వంచనం బని కోపగించినట్లు,
నాయాస లడుగంటె నా కెందు కిఁక నంచు, నాస్థ మాని తటస్థ మైనయట్లు,
ఘనవియోగమున నాకస్మికఘటనచేఁ, బరవశం బయి భ్రాంతిపడినయట్లు,
నవాజిసౌజన్యభాస్వర మాటఁ బతిభక్తి, నల్క దేఱి ప్రసన్న మైనయట్లు,

గీ. భర్తదుఃఖంబునకు దుఃఖపడినయట్లు, ఘనతరం బగుననురక్తిఁ గరఁగినట్లు,
పాలు పోకున్నయట్లు నీపట్టునందు, నీదుహృదయంబు గనవచ్చు నిర్మలాంగి !.

"కవివాక్పతిరాజశ్రీభవభూత్యాదిసేవితః,
జితో యయౌ యశోవర్మా తద్గుణస్తుతివన్దితామ్"

అనురాజతరంగిణీశ్లోకమునుబట్టి యశోవర్మయాస్థానమున భవభూతితోఁ గూడ వాక్పతిరాజకవి యున్నట్లు తెలియును. ఇతఁడు గఉడవహా మనుప్రాకృత కావ్యమురచియించియున్నాఁడు. అందు భవభూతిస్తుతి యిట్లున్నది. ఇది, ౭౯౯ వ, ప్రాకృతపద్యమునకు సంస్కృతానువాదము—

"భవభూతిజలధినిర్గతకావ్యామృతరసకణా ఇవ స్ఫురన్తి,
యస్య విశేషా అద్యాపి వికటేషు కథానివేశేషు"

ఈస్తుతి, వాక్పతిరాజు భవభూతిశిష్యుఁ డనిసూచించుచున్న దనియు, 'అద్యాపి' అనుమాటనుబట్టి వాక్పతిరాజు ప్రాకృతకావ్యమువ్రాయునాఁటికి భవభూతి యుండియుండఁ డనియు, వల్వాల్కారుపండితుని యూహ [1].

రాజశేఖరునినాఁటికి భవభూతిమహత్త్వము మఱియు హెచ్చినది. అతఁడు తాను భవభూతి యవతార మైనట్లు బాలరామాయణమున వర్ణించుకొని యున్నాఁడు.

"బభూవ వల్మీకభవః కవిః పురా, తతః ప్రపేదే భువి భర్తృమేణ్ఠతామ్,
స్థితః పునర్యో భవభూతిరేఖయా, సవర్తతే సంప్రతి రాజశేఖరః"

భవభూతిపేర నీమూఁడురూపకములు తప్ప మఱేవియుఁ గనరావు కాని, శార్ఙ్గధరపద్ధతిలోను రసికజీవనములోను గ్రమముగా నీక్రింది రెండుశ్లోకములును భవభూతివిగా నున్నవి. ఈశ్లోకము లీరూపకములలోనివి కావు, కావున మఱియొక గ్రంథ మితని దంతరించినదో, లేక యివి యితనిచాటువులో తెలియరాదు.

"నిరవద్యాని పద్యాని, యది నాట్యస్య కా క్షతిః,
భిక్షుకక్షావినిక్షిప్తః కి మిక్షు ర్నీరసో భవేత్"
"కిం చన్ద్రమాః ప్రత్యుపకారలిప్సయా, కరోతి గోభిః కుముదావబోధనమ్,
స్వభావ ఏవోన్నతచేతసాం సతాం, పరోపకారవ్యసనం హి జీవితమ్"

---

1. డా॥ M. R. Kale B. A. గారి, ఉత్తరరామచరిత్ర పీఠిక.

వేదశాస్త్రపారీణుఁడు లోకజ్ఞుఁడు సత్కవితామూర్తి ప్రతిభాశాలి యైన భవభూతివంటిమహాకవిగూడఁ దనరూపకములయెడ నరుచి చూపునవారలికు లుండుటచేఁ గాఁబోలు, మాలతీమాధవప్రస్తావనలో "యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞా" మిత్యాదిగా వ్యాజవినయమును, ఉత్తరరామచరితప్రస్తావనలో సీతాపవాదముతో స్వకవితాపవాదము గూడ సూచించుచు "యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" అనుచుఁ గుజననిందయు నావిష్కరించెను. కాని, తనపాండిత్యకవిత్వములం దితని కెంతేని విశ్వాసము గల దని యీ క్రింది శ్లోకము వల్లఁ దెలియఁగలదు.

"య ద్వేదాధ్యయనం త థోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ,
జ్ఞానం తత్కథనేన కిం న హి తతః కశ్చి ద్గుణో నాటకే,
య త్ప్రౌఢిత్వ ముదారతా చ వచసాం య చ్చార్థతో గౌరవం,
త చ్చే దస్తి తత స్త దేవ గమకం పాణ్డిత్యవైదగ్ధ్యయోః"

ఒకపద్యమున నిద్దఱుమాటలాడుటయు, పద్యమధ్యమున భావాంతరముఁ జొనుపుటయు, ఇద్దఱు వేఱువేఱుపద్యముల సంభాషించుటయు ననెడిరచనాచాతుర్య మితనియుత్తరరామచరిత్రమున నత్యుచితముగాఁ గనవచ్చును. మఱియు నిం దున్న "అమృతా మాత్మనః కలామ్—బ్రహ్మణీవ వివర్తానాం క్వాపి విప్రలయః కృతః" ఇత్యాదివాక్యములు విజ్ఞానఖని యగుభవభూతియద్వైతభావమును దెలుపుచున్నవి. తరువాత—

కుందమాలానాటకము:—అందు, ఉత్తరరామచరిత్రవలె నుత్తరరామాయణకథను గైకొన్న యాఱంకములకుందమాలను ముందు గ్రహింతము. శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవి రామనాథశాస్త్రిగార్లు 1923 లో సంపాదించినలిఖితపుస్తకమునుబట్టి శ్రీజయచంద్రశాస్త్రిగారు దీనిని లాహోరునగరమున ముద్రింపించి ప్రకటించిరి. ముద్రితపుస్తకములోనిప్రస్తావనలో "అరారాలపుర వాస్తవ్యస్య కవే ర్దిఙ్నాగస్య కృతిః కున్దమాలా నామ" అనుమాటలు కనఁబడుచున్నవి. ఈమాటలు ప్రధానాధారముగా దీనికర్త దిఙ్నాగుఁ డనియు, ఇతఁడు కాళిదాసుప్రతిపక్షుఁ డనియుఁ దెలుపుచు ఆంగ్లమందును సంస్కృతమందును బీఠికలు వెలసినవి. తంజావూరుపుస్తకభాండాగారమునందు లిఖితకుందమాలాపుస్తకములు రెండున్నవి. మదత్పుస్తకమున రెంటియందును గూడ సూత్రధారోక్తులతోఁ బ్రథమాంకము మొదటిపుట యొకటి నశించినది. అందుచే స్థాపనలోఁ గృతికర్తను దెలుపుమాట లెట్లున్నవో తెలియరాకపోయినది గాని, నాటకశాస్త్రగ్రంథములలో

రెంటను గూడ "అనూపురాధస్య[1] కవేర్ధీరనాగస్య కృతిః కున్దమాలా నామ నాటకం సమాప్తమ్" అనుమాటలు స్పష్టముగాఁ గనఁబడుచున్నవి. ముద్రిత నాటకమందును వీటియందును గనవచ్చుగ్రంథ మంతయు సమానమే కావున, అముద్రిత మైనతంజావూరులోనికుందమాల వే అనుటకు వీలులేదు. బహువిధముల నాలోచింపఁగా దీనికర్త విఖ్యాతుఁడైనదిఙ్నాగుఁడు కాఁడని తోఁచుచున్నది. ఐనను, గ్రంథసంపాదకప్రకాశకులయభిప్రాయ మించుక పరామర్శింతము.

దిఙ్నాగుఁ డనునొకబ్రాహ్మణుఁడు, కాంచీమండలమునకుఁ జేరియున్న సింహవక్త్రనగరమున జన్మించి పండితుఁడై న్యాయవిద్యావిశారదుఁడై బౌద్ధమతావలంబియై నలాంద మొదలగువిద్యాపీఠములయందలివిద్వాంసులను వాదమున గెలిచి యనేకులను బౌద్ధమతమునకుఁ ద్రిప్పె నని టిబెట్టుదేశమందలిగ్రంథములలో నున్నట్లు తత్త్వసంగ్రహాపీఠికలో వ్రాయఁబడినది. దిఙ్నాగకృతములుగా న్యాయప్రవేశము ప్రమాణసముచ్చయము ఆలంబనపరీక్ష త్రికాలపరీక్ష మొదలగు న్యాయవిషయకగ్రంథములు కనఁబడుచున్నవి. మల్లినాథుఁడు—

స్థానా దస్మా త్సరసనిచులా దుత్పతో దఙ్ముఖః ఖం,
దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్"

అనుమేఘసందేశములోనివాక్యములకు ముఖ్యార్థము వ్రాసి కర్ణాకర్ణికగా వినవచ్చినతననాఁటి కాళిదాసవిషయకకింవదంతినిబట్టి — నిచులుఁ డనుమహాకవి కాళిదాససహాధ్యాయుఁడు. కాళిదాసునుగూర్చి యితరులు కావించు దూషణములను బరిహరించుచుండువాఁడు—దిఙ్నాగాచార్యుఁడు కాళిదాసుప్రతిపక్షుఁడు—అనుచు ధ్వన్యర్థము వ్రాసియున్నాఁడు. దక్షిణావర్తనాథుఁ డనుమఱియొకమేఘసందేశవ్యాఖ్యాతకూడ దిఙ్నాగుఁ డనెడి యొకయాచార్యుఁడు కాళిదాసశ్లోకముల నాక్షేపించుచుండెడివాఁ డని మల్లినాథునికిఁ బూర్వము వ్రాసియున్నాఁడు. ఇట్లు దిఙ్నాగుఁడనెడియొకగొప్పపండితుఁడు పూర్వ మున్నట్లు తెలియుచున్నను, ఇతఁడే కుందమాలకర్త యైనట్లు ప్రమాణ మేదియుఁ గనఁబడదు. కుందమాలనాల్గవ యంకములో రాముని మాటగా నున్న—

"ద్యూతే పణః ప్రణయకేళిషు కంఠపాశః
క్రీడాపరిశ్రమహరం వ్యజనం రతాన్తే,
శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః,
ప్రాప్తం మయా విధివశా దిద ముత్తరీయమ్"

1. ఈపద మర్థము గాకున్నది. ఇది నివాసమునో వంశమునో తెలుపునది కావచ్చును. ఇందు కొంత పొరబా యుండును.

అనెడిశ్లోకము భోజదేవునిశృంగారప్రకాశమందును, మహానాటకమందును గూడఁ గనఁబడుచున్నది. మఱియు సూత్రధారునిమాటగా నున్నయిందలి—

"లఙ్కేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి,
రామేణ లోకపరివాదభయాకులేన,
నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణో ఽయమ్"

అనుశ్లోకము సాహిత్యదర్పణమునఁ గనఁబడుచున్నది. అంతేకాని, భోజమహారాజునకుఁ బూర్వులైనలాక్షణికులలో నొకరును గూడ నిందలియొకశ్లోకము నుదాహరించినట్లు కనరాదు. నిజముగా నేతత్కర్త న్యాయశాస్త్రనిష్ణాతుఁడు బౌద్ధమతప్రచారకుఁడు కాళిదాసప్రతిపక్షుఁడు నైన దిఙ్నాగుఁడే యైనచో నతని యాకృతిలోనిశ్లోక మొకటి యైనదండిభామహవామనాదు లెఱుఁగ కుందురా? రాజశేఖరాదిమహాకవులు మహాకవి యైనయితనిపేరు స్మరింపకుందురా? కవిపేరు తెలుపకపోయినను, "కుందమాలా ఽత్ర సుశ్లిష్టా సన్ధిపఞ్చక సంయుతా" అనుచు నాటకముపేరుచెప్పినవాఁడు భావప్రకాశకర్త యగుశారదాతనయుఁడు. భోజుని పెత్తండ్రి యైనముంజమహీపాలునియాస్థానకవి యైనధనంజయుఁడు కూడ దీని నెఱుఁగఁడు దీనిశ్లోక మెఱుఁగఁడు. భోజుఁ డిందలిశ్లోక మొత్తెను గావున ధనంజయుని కీకుందమాలాకర్త సమకాలికుఁడేమో! అందుచేఁ గింవదంతినిబట్టి మేఘసందేశవ్యాఖ్యాతలు పేర్కొన్న దిఙ్నాగుఁడే యీకుందమాలాకర్తదిఙ్నాగుఁ డనుమాట ప్రబలప్రత్యక్షప్రమాణబాధమగువఱకును విశ్వసనీయము కాఁజాలదు. మఱియు—

ప్రస్తావనలో నున్న అరారాలగ్రామము తత్త్వసంగ్రహపీఠికలోఁ జెప్పఁబడిన సింహవక్త్రనగర మనుట కాధారము కనరాదు.

"జంభారిమౌళిమందారమాలికామధుచుంబినః
పిబేయు రంతరాయాబ్ధిం హేరమ్బపదపాంసవః"

అనెడియిందలిమంగళాచరణశ్లోక మితఁ డాపీఠిక చెప్పినబౌద్ధవిద్వాంసుఁ డనుట కవకాశ మీయదు. కుందమాలాసంపాదకు లాబౌద్ధవిద్వాంసుఁడే యితఁ డనుటకై సింహళద్వీపములోనియనురాధపురమే లేఖకప్రమాదమువలన 'అరారాల' పురమైన దని తలంచిరి గాని, అదియు విశ్వసనీయముగా లేదు. ఊహల కంత మెక్కడ? ఇంతకును, పూర్వోక్తలిఖితపుస్తకములలో ధీరనాగుఁడు ప్రత్యక్షమగుచుండ నతనిని ద్రోసివేయుట యెట్లు? ఇది లేఖకప్రమాదమో! అదే లేఖకప్రమాదమో! ఏమైనను దీనికర్త ధీరనాగుఁడే కాని దిఙ్నాగుఁడు కాఁ డని నాయభిప్రాయము. ఇఁక విషయము—

ఉత్తరరామచరిత్రకంటె నెక్కువగా నిది యుత్తరరామాయణకథ ననుస రించినది. లక్ష్మణుఁడు సీత నడవికిఁ గొనిపోవుట యందు దృశ్యము గాదు. ఇం దగును. అశ్వమేధప్రసక్తి రెంటను గలదుగాని, దానికంటె నిది విస్తృతము. అందు వాల్మీకి నాటకాంతమున వచ్చి సీతాకుశలవులను రామున కర్పించును. ఇందు ప్రథమాంక మందే వాల్మీకి వచ్చును. అందలిపరిత్యక్తసీతగతికంటె నిందలిది వేఱు. పైగా, అందు విదూషకపాత్రమునకుఁ జోటు లేదు. ఇందు కల్పింపఁబడినది. ఇట్టిభేదము లున్నను, చిన్నచిన్నపోలికలును గొన్ని కలవు. అందు రామునియవస్థకు రా ళ్లేడ్చిన వని చెప్పినలక్ష్మణుఁడే యిందు సీతకష్టమునకుఁ బక్షులేడ్చుచున్న వని చెప్పును. అశ్వమేధయాగమున నాకు ధర్మపత్ని సీతాప్రతికృతి యని యందు వాసంతితో రాముఁ డన్నమాటనే యిం దతనిమాటగా లక్ష్మణుఁడు సీతతో ననును. అందు వసిష్ఠుఁడు సీతకుఁ బంపిన 'వీరప్రసవాభూయాః' అనునాశీర్వచనమే యిందు 'వీర ప్రసవా భవ' అనువిధమున వాల్మీకినోట వచ్చును. అంతగా గణింపఁ దగనియిట్టి పోలికలు కొన్ని యున్నను మొత్తముమీఁద రచనములు భిన్నములు గానే కనఁ బడును. అందుచే నిది దానిని జూచి పుట్టిన దని యొత్తి చెప్పఁ జాలము గాని, గుణపరీక్ష గావించునపు డుత్తరరామచరిత్ర దగ్గఱఁ గుందమాల నిలవఁ జాల దనిమాత్రము చెప్పవచ్చును. ఇఁక—

రెండవ దాశ్చర్యచూడామణి. పూర్వరామాయణకథాశ్రయ మైనయిది యేడంకములనాటకము. ఇది 1926 లో, మహామహోపాధ్యాయకుప్పుస్వామి శాస్త్రిగారిపీఠికతో మదరాసునగరమున ముద్రిత మైనది. దీనికర్త శక్తి భద్రుఁడు. ఇతఁడు శంకరాచార్యులశిష్యుఁ డనెడివాడుక మలబారుదేశమునఁ గల దఁట. క్రీ.౯౩౫-౯౫౫ నడుమఁ గేరళదేశము పాలించినవాఁడును, తపతీసంవరణము సుభద్రాధనంజయము ననెడిరెండునాటకములను, ఆశ్చర్యమంజరీకథయు నిర్మించిన వాఁడు నగుకులశేఖరవర్మకాలమున సమకూర్పఁబడినక్రమదీపిక ఆట్టప్రకరణము, అనెడిసూచికలలోఁ జేర్కొనఁబడినపదునాల్గురూపకములలో, ఈయాశ్చర్యచూ డామణి కనఁబడుచున్నది గావునను, దీనిప్రస్తావనలోని—

"ఆర్య! అత్యాహితం ఖల్వేతత్, ఆకాశం ప్రసూతే పుష్పమ్. సికతా స్తైల ముత్పాదయన్తి. యది దక్షిణస్యా దిశః, ఆగతం నాటక నిబన్ధనమ్" అను నటీవాక్యమునుబట్టి దక్షిణదిక్కున నుదయించిననాటకముల కిది మొదటి దైనట్లు కనఁబడుచున్నది గావునను, కులశేఖరవర్మకుఁ బ్రాచీనుఁడై శక్తిభద్రుఁడు క్రీ. అష్ట మశతాబ్దికడపటనో నవమశతాబ్దిమొదటనో యుండియుండు నని శాస్త్రిగారు నిర్ణయించిరి. వామనాద్యాలంకారికు లెవరును దీనిని జేర్కొనకపోయినను, ఇతని కాలము నిర్ణయించుటకుఁ దగినప్రమాణములు లభించునంతవఱకు నీమాటయే నిలచును.

వీరకార్యాద్భుతరసభూయిష్ఠమై యాశ్చర్యకరముల కిది చూడామణియగుట నాశ్చర్యచూడామణి యనఁబరఁగుచున్న దని దీనివ్యాఖ్యాత చెప్పుచున్నాఁడు. ఈవ్యాఖ్యాతపేరు తెలియదు గాని గ్రంథాంత మందున్నశ్లోకమున నితఁడు భారద్వాజగ్రామవాసి, కుమారిలమతానుయాయి యైనబ్రాహ్మణుఁ డనిమాత్రము తెలియుచున్నది.

ప్రస్తావనలోనిమాటనుబట్టి శక్తిభద్రుఁడు, ఉన్మాదవాసవదత్తప్రభృతికావ్యములకర్త యని తెలియునుగాని, అట్టి వింకను బయటికి రాలేదు. పైపేరునుబట్టి యితఁడు భాసునిస్వప్నవాసవదత్త చూచియున్నాఁ డనుటకు నిదర్శనముగా నతని వలెనే యితఁ డిందుప్రస్తావన యనక స్థాపనాశబ్దమునే వాడెను. కథ సుప్రసిద్ధము. ఐనను, సంవిధాన మించుక యపూర్వ మని యీక్రిందిగ్రంథాంతశ్లోకమునఁ దెలియును.

పర్ణశాలా శూర్పణఖా మాయాసీతా తతః పరమ్,
జటాయుషో వధో ఽశోక వనికా ప్యఙ్గులీయకమ్,
సప్తమో ఽఙ్క స్తత శ్చైత్థం చూడామణ్యఙ్కకీర్తనమ్,

దీనినిబట్టి యిం దరణ్యసుందరకాండములవృత్తాంతముమాత్రము సంగ్రహము గాఁ బ్రదర్శనోచితముగా నున్న దని తెలియఁగలదు. కవిత్వము పూర్వకాలకవిత్వమువలె రసవంతమై హృద్యముగానే యున్నది. తరువాత—

వేణీసంహారము. దీనికాలము సరిగాఁదెలియరాదు. కాని, ఆనందవర్ధనవామనాచార్యు లిందలిశ్లోకములను దమలక్షణముల నుదాహరించుటచే నిది, ఉత్తరరామచరితమున కించుక తరువాత, క్రీ. అష్టమశతకమున నుదయించిన దని మాత్రము చెప్పవచ్చును. దీనికర్త యైనభట్టనారాయణకవి కాన్యకుబ్జమునుండి వంగదేశమునకు వచ్చినవాఁ డని కొంద ఱభిప్రాయపడిరి గాని, అందుకుఁ దగిన ప్రమాణము కనఁబడదు.

వీరరసప్రధాన మైనయీనాటకము సుప్రసిద్ధనాటకములలో నొకటి. దుశ్శాసనుఁడు ద్యూతసభలోని కీడ్చుకొనివచ్చినపుడు విడిపోయినద్రౌపది శిరోజములను భీముఁడు మహాసంగ్రామమున దుర్యోధనునితొడలు తెగఁగొట్టి వానిరక్తమునఁ దడిసినచేతులతో ముడివేయుట యనుభారతకథ యిందలియితివృత్తము. ఇందు, కౌరవశతమును సంహరించుట దుశ్శాసనునిపొట్ట చీల్చి నెత్తురు త్రాగుట యనుభీమునిప్రతిజ్ఞలు కూడ నిర్వహింపఁబడినవి. ఈక్రిందిభీమవచన మీనాటక మందలిసారాంశమును దెల్పును.

"చత్వారో వయ మృత్విజ స్స భగవాన్ మర్త్యోపదేష్టా హరిః,
సంగ్రామాధ్వరదీక్షితో నరపతిః పత్నీ గృహీతవ్రతా,
కౌరవ్యాః పశవః ప్రియాపరిభవక్లేశోపశాన్తిః ఫలం,
రాజన్యోపనిమన్త్రణాయ రసతి స్ఫీతం యశో దున్దుభిః"

ఈక్రిందిసాభిమానమైనభీమవచనము వీరరసము వెడలఁగ్రక్కుచుఁ గావ్యఫలము సూచించుచున్నది.

"ఊరూ కరేణ పరిఘట్టయత స్సలీలం
దుర్యోధనస్య పురతో ఽపహృతాంబరా యా
దుశ్శాసనేన కచకర్షణభిన్నమౌళి
స్సా ద్రౌపదీ కథయత క్వ పునః ప్రదేశే"

లోకవిఖ్యాతమైనదీనికి సమకాలిక మనఁదగినదియు, వీరరసప్రధానమయ్యు రాజనీతిప్రయోగబంధురమైనదియు ముద్రారాక్షస మనెడిచరిత్రాత్మకనాటకము. ఈనాటకము బృహత్కథామూల మని దశరూపకవ్యాఖ్యలో ధనికుఁడు చెప్పియున్నాఁడు. దానిబట్టి నందమౌర్యవృత్తాంతము బృహత్కథలో నున్న దని తెలియ నయ్యెడి. సామంతరాజైనవటేశ్వరదత్తునికిఁ బౌత్రుఁడును మహారాజైనపృథున్రుపాలునిపుత్రుఁడు నైనవిశాఖదత్తుఁడు నిర్మించినయీకావ్య మెప్పటి దనువిషయము నేఁటికిని నిశ్చితము కాలేదు. కావ్యాలంకారసూత్రవృత్తిలోను ధ్వన్యాలోకములోను గూడ నీనాటకములోనిశ్లోక మొక్కటియు నుదాహరింపఁబడినట్లు కనఁబడకుండుట వాని కిది పరమై యుండు ననుట కొకహేతు వగుచున్నది. ఇది యిట్లుండ, ద్వితీయాంకమున విరాధగుప్తుఁ డమాత్యరాక్షసునితో సంభాషించుసందర్భమునం దున్న—

"ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః,
విఘ్నైః పునః పున రపిప్రతిహన్యమానాః,
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి"

అనుశ్లోకము భర్తృహరినీతిశతకమునఁ గనఁబడుచున్నది. దీనినే ధనికుఁడు దశరూపకావలోకముద్వితీయప్రకాశమున 'యథా వా భర్తృహరిశతకే' అనుచు నాయకస్థిరత్వమున కుదాహరించియున్నాఁడు. కాని, అందు, కడపటిపాదము "ప్రారబ్ధ ముత్తమగుణా స్త్వమి వోద్వహన్తి" అనువిధమున నున్నది. సందర్భమునుబట్టి యీశ్లోకము ముద్రారాక్షసములోని దనుట నిజము. ఇంక నిట్లే యితర

శ్లోకములు కొన్ని ప్రక్షిప్తము లైనభర్తృహరిశతకమున నిది దశరూపకోత్పత్తికి మున్నే చేరియుండుటయు నిజము. ఇందుకు ధనికుఁ డుదాహరించినపాఠమే ప్రమాణము. విరాధగుప్తుఁడు మంత్రిరాక్షసునితోఁ జెప్పునపు డుచితమగు'త్వామివ'(నీవలె) అనునది నీతిశతకమున నతుకదు. అయినను, ప్రాచీన మైనభర్తృహరిశతకములో నీపద్యము గాంచినధనికుఁడు ముద్రారాక్షసమున దీనిని జూచియో చూడకయో యిదిభర్తృహరిశతకములోని దని యుదాహరించి యుండును. తరువాత నీపాఠము 'నపరిత్యజన్తి'యనువిధమున మాఱినది. అదే లిఖితముద్రారాక్షసపుస్తకముల కెక్కి యచ్చులో స్థిరపడినది. దీని నంతను బట్టి చూచినచో ముద్రారాక్షసము పదియవ శతాబ్దికి వెనుకటి దని తెలియకపోదు. కాశీనాథత్ర్యంబకతెలాంగుపండితులు దీని కాలమును గూర్చి సవిమర్శముగాఁ జర్చించి, ఇది మిక్కిలి యర్వాచీన మనెడి పాశ్చాత్యులమతములు ఖండించుచు, క్రీ. ౭—౮ శతాబ్దులలో నిది పుట్టియుండు ననెడియభిప్రాయము సూచించిరి[1]. వామనాదు లిందలిశ్లోకము లుదాహరింపక పోవుట యొకయాక్షేపము గా గణింపకపోయినచో వారియభిప్రాయము సయుక్తిక మనవచ్చును. గణించినచో నిది క్రీ. ౯౦౦ ప్రాంతములోని దనియూహింప వచ్చును. ఇంతకంటె సరిగా నిశ్చయింప గతి లేదు.

చాణక్యుఁడు చంద్రగుప్తుని నందసింహాసనమునఁ బ్రతిష్ఠించి, వివిధోపాయములు పన్ని మంత్రిరాక్షసు నతనిమంత్రిఁగాఁ జేయుట యనెడియిందలిప్రధాన వస్తువు లోకప్రసిద్ధము. చందనదాసునింట దొరకినరాక్షసునియుంగరము (ముద్ర) ఆధారముగా నతని వశపఱుచుకొనుట సంభవించుటంజేసి యిది ముద్రారాక్షస మనఁబడినది. కథాకల్పన మత్యద్భుతము, అతిగంభీరము. కవిత్వము మృదుమధురము సరసము. పాత్రరసపోషణము నిరుపమానము. రాక్షసుఁడు నందవంశపక్షపాతి స్వామిభక్తుఁడు ప్రతిభాశాలి కార్యజ్ఞుఁడు రాజ్యతంత్రస్వతంత్రుఁడు. అయితే నేమి? చాణక్యునికపటరాజనీతితోడికుతంత్రములకు లొంగిపోయి చివరకు మలయకేతువునకుఁ గూడ నప్రియుఁడై ప్రాణమిత్రుఁ డైనచందనదాసు తనకై శత్రువశుఁడగుట యెఱింగి యిట్లు విచారించెను.

"కిం గచ్ఛామి తపోవనం, న తపసా శామ్యే త్సవైరం మనః,
కిం భర్తౄ ననుయామి, జీవతి రిపౌ స్త్రీణా మియం యోగ్యతా,
కిం వా ఖడ్గసఖః పతా మ్యరిబలే, నై తచ్చ యుక్తం భవే,
చ్చేత శ్చన్దనదాసమోక్షరభసం రున్ధ్యా త్కృతఘ్నం న చేత్"

---

1. చూ. నిర్ణయసాగరముద్రణము. ముద్రారాక్షసపీఠిక—1908.

రాక్షసుఁడును రాజనీతికుశలుఁడే. అయిన నేమి? అతఁడు చంద్రగుప్తుని జంపఁ గావించినవిషకన్యాప్రయోగాదులు చాణక్యనీతిచేఁ దిరుగఁబడి పర్వతకా దులవినాశమున ఫలించినవి. చాణక్యుఁడు రాక్షసుని లొంగదీయఁ గావించిన యుపాయము లన్నియు నమోఘముగా ఫలించినవి. రాక్షసుఁడు వీరుఁడు మాని రాజ్యతంత్రజ్ఞుడు. కాని, చాణక్యునివంచనముతోడిరాజనీతి కతనినీతి చాలినది కాదు. విక్రమించి రాక్షసుని బట్టరాదు. అతఁడు బలవంతముగాఁ జావరాదు. బ్రతికియుండి చంద్రగుప్తునికి హాని చేయరాదు. అతఁడు మంత్రికానిమౌర్యుని రాజ్యము వృద్ధికి రాదు. తానెత్తినయెత్తుతో వనగజమువలె నతఁడు వశ్యుఁడు కావ లెను. ఇదిచాణక్యునినయపద్ధతి. అట్లే జరిగినది. ఇందు కతనిముద్ర లభించుట చందనదాసును బంధించుట పరమసాధనము లైనవి. ఇట్లు, ఎత్తుమీఁదియెత్తుగా నెప్పటి కపుడు ప్రేక్షకు లాశ్చర్యవిషాదసంతోషపరవశులై కథామయహృదయు లగునట్లు బహుపాత్రములు కల్పించి యితివృత్తము నడపినవిశాఖదత్తునిప్రతిభ యనన్యసామాన్యము. తరువాత—

అనర్ఘరాఘవము. దీనికర్త యగుమురారి మౌద్గల్యగోత్రుఁడు. తంతుమతీవర్ధమానభట్టులపుత్రుఁడు. సర్వశాస్త్రజ్ఞుఁడు. బాలవాల్మీకిబిరుదాంకితుఁడు. ఇతనికాల మిది యని నిశ్చయింప వీలు లేదుకాని, ఉత్తమ మైనయీనాటకము లోనిపద్య మొకటియు వామనుఁ డుదాహరింపకపోవుటచే నతని కితఁడు పరుఁడన వలసివచ్చుచున్నది. తొమ్మిదివశతాబ్దిలోనిరత్నాకరకవి తనహరవిజయకావ్య ములోఁ జెప్పిన—(౩౮ సర్గ)

"అఙ్కే ఽథ నాటక ఇవోత్తమనాయకస్య,
నాశం కవి ర్వ్యధిత యస్య మురారి రిత్థమ్"

అనుశ్లోకములోని—అంక నాటక కవి మురారి — పదము లప్రకృతార్థములై మురారినిదెల్పుచుండుటచే నతని కితఁడు పూర్వుఁ డని యూహింపఁబడుచున్నది. అందుచే నితఁడు క్రీ. ౭౫౦—౮౫౦ నడుమ నున్నవాఁ డనవలసివచ్చినది. మఱియు "యది క్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్య చరితమ్" మ్మనెడియితనిమాటలనుబట్టి యితనికిఁ బూర్వ మనేకులు రామనాటకములు వ్రాసియున్నారనుట విస్పష్టమగు చున్నదిగావున, మహావీరచరితోదాత్తరాఘవాదు లనర్ఘరాఘవమునకుఁ బూర్వ ములని భావింపవలసియున్నది.

మహావీరచరితముకంటెఁ దననాటకము చక్కఁగా నుండవలె నన్నతలంపుతో మురారి యనర్ఘరాఘవము రచియించె ననెడియభిప్రాయము పూర్వమే వ్యాప్త మైనది. కథాసన్నివేశమునం దట్టిగుణమును గోచరించును. ఇందు కొక

పూర్వచాటువుగూడఁ గనఁబడుచున్నది. ఇది శ్లిష్టార్థ మైనను బ్రకృతోపయోగి కాఁగలదు.

"మురారిపదచిన్తాయాం భవభూతే స్తు కా కథా,
మురారిపదచిన్తాం చే త్తథా మాఘే మతిం కురు"

మఱియు, అనర్ఘరాఘవ మాకాలముననే మెప్పు గాంచి నట్టీక్రిందిశ్లోకము చెప్పుచున్నది.

"దేవీం వాచ ముపాసతే హి బహవ స్సారంతుసారస్వతం,
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః"

వీరరసప్రధాన మైనయీనాటకము కథాపాత్రరసౌచిత్యములఁ బ్రశంస కెక్కినమాట నిజ మైనను, తక్కిననాటకములవలెఁ గాక, భాషలో దృఢజ్ఞానమలవఱుచుకొనుటకు భాషాభిమాను లెక్కువగా నాదరించి పఠనపాఠవ్యవహారమునఁ బెట్టుటచే నిది మిక్కిలి ఖ్యాతి గాంచినది. అందుచే లోకమున వ్యాపించిన పూర్వరామాయణకథాశ్రయము లైననాటకములలో నిది యగ్రగణ్య మైనది. భాష క్లిష్టమైనను శైలి సరళముగా నుండును. కవి తనబహుశాస్త్రవిజ్ఞానము ప్రదర్శించుట కుపయోగించినపారిభాషికపదము లర్థజ్ఞానమున కడ్డుపడును గాని, అర్థము తెలిసికొన్నపిదప నవి మిక్కిలి సముచితములై కనఁబడును. ఐనను, ఇది పఠనపాఠరమ్య మైనట్లు ప్రదర్శనరమ్యము కాఁజాలదు. అందుచేతనే యీక్రింది చాటువు పుట్టినది.

"యే శబ్దశాస్త్రనిష్ణాతా యే శీలితనిఘంటవః,
తేషా మే వాధికారోఽస్తి మురారికృతనాటకే"

చతుర్థాంకములోనిరామజామదగ్న్యసంవాదము చదువునపుడు వీరముకంటె హాస్యము ముందు కనఁబడును. ఈవిషయమున భవభూతికంటె నితఁడెక్కువచూపినచాతుర్యము కనరాదు. పంచమాంకమున రామలక్ష్మణులవద్దకు గుహుఁడు వచ్చినపుడు సుగ్రీవునివిషయమై లక్ష్మణుఁ డన్నమాట లంతగాఁ బాత్రోచితములు కావు. ఆమాటలను "యయా కయా చి ద్వాచా సౌమిత్రి రభిదధాతు నామ" ఏదో సౌమిత్రి యన్నాఁడు దాని కే మనుచు రాముఁడు సర్దినను, అవి వెగటుమాటలే కాని, ఆసందర్భములోనియీక్రిందిశ్లోకముమాత్రము లక్ష్మణునివీరావేశము సూచించుచుఁ జక్కఁగా నున్నది.

"పితా యస్యం రేతోధా స్తవ తరణి ర స్మత్కులగురు,
రను ర్వైమాత్రేయ స్త దపి సహజం మిత్త్ర మసి నః,

అథాపి జ్ఞాతేయం శిధిలయసి కా పేయతరళ,
శ్శరా_స్త స్నే వాలిక్షతజరసలోలాః ప్రతిభువః,

ఐనను, సీతారామపాత్రపోషణమునఁ జాతుర్యము చూపినయీనాటకము విద్వద్రంజకమై వెలయుచున్న దనుట వా_స్తవము.

కాశ్మీరీయుఁడును, అవంతివర్మయాస్థానములోనివాఁడునగుశివస్వామి నాఁటి కానాటకప్రకరణము లనేకములు రచియించినవాఁ డని వినవచ్చును గాని, అం దొకటియుఁ గనఁబడదు. మాయురా జుదాత్తరాఘవము నిర్మించినట్లు ధనికునిమాట వల్లఁ దెలియును గాని, అదియు మాయ మైనది. దశరూపకవ్యాఖ్యలో ధనికుఁడు పేర్కొన్న ఛలితరామము, పాండవానందము త్రిపురదాహడిమము మొదలైనవి ప్రచ్ఛన్నము లైనవి. సముద్రమంథనసమవాకారమును భరతాచార్యుఁడు పేర్కొనెను గాని, దానిని భాసకాళిదాసాదులే యెఱుఁగరు. ఇట్లు ప్రాచీనము లైనరూపకము లెన్ని కాలగర్భమున నణఁగిపోయినవో యూహింప శక్యము కాదు. ఎట్లయినను మురారిమాటనుబట్టి యతనికిఁ బూర్వ మెన్నో రామనాటకము లుదయించిన వని మాత్ర మూహింపవచ్చును. తరువాత లెక్కకువచ్చునవి—

రాజశేఖరునిరూపకములు. మాధవాచార్యునిశంకరవిజయమున నాటకత్రయకర్త యని ప్రశంసింపఁబడినరాజశేఖరుఁ డితనికంటె వేఱు. అతఁడు కేరళరాజు. మనరాజశేఖరుఁడు కావ్యమీమాంసాదికర్తయై ప్రసిద్ధి గన్నవాఁడు. ఇతని కాల మింతకు మున్నే తెలిసికొనియున్నాము.

అవంతివర్మరాజునకు సమకాలికు లగునానందవర్ధనరత్నాకరులను స్తుతించినట్లు కనఁబడుటచే [1] వారి కితఁడు పరుఁడు. క్రీ. ౯౫౯ ప్రాంతమందలిజైనసోమదేవుఁ డితనిని స్తుతించెనుగావున నతని కితఁడు పూర్వుఁడు. బాలరామాయణాదుల లోనిప్రస్తావనలవల్ల నితఁడు యాయావరవంశీయుఁడు సురానందునిసంతతివాఁడు అకాలజలదకవిమునిమనుమనికొడుకు శీలవతీదుర్దుకుల (దుహిక) పుత్త్రుఁడు రఘుకులచూడమణి యగుమహేంద్రపాలునిగురువు ననియు, ఇతనిపూర్వపురుషుఁ డగు సురానందునినాఁ డితనివంశమువారు చేదిదేశవాసు లనియు, అకాలజలదునినాఁడు మహారాష్ట్రదేశవాసు లనియుఁ దెలియుచున్నది. కాని, బిల్హణకవి కాశ్మీరమువిడిచి కర్ణాటదేశము చేరినట్లే యితఁడు స్వదేశము వదలి కాన్యకుబ్జము చేరినవాఁడు.

---

1. ఆనందవర్ధనః కస్యనాపీదానందవర్ధనః—ఇతీవ సకృతో ధాత్రా కవిరత్నాకరో ౭పరః. సూక్తిముక్తావళీ సుభాషితహారావళులలో రాజశేఖరునివిగా నున్నవి.

కర్పూరమంజర్యాదిప్రస్తావనలలో "మహేంద్రపాలస్య గురుః—నిర్భయరాజస్య తథోపాధ్యాయః, అనుచు నిర్భయరాజనామాంతరుఁ డైనమహేంద్రపాలునికిఁ దాను గురు వైనట్లు వర్ణించుకొనియున్నాఁడు. ఆకాలమందలిరాజగురువులు బ్రాహ్మణులగుటచే నితఁడు బ్రాహ్మణుఁ డనుటకు వీలు కనఁబడుచున్నది. చాడువాణకుల మండలికన్య యైనయవంతిసుందరి తనభార్య యని వర్ణించుకొనుటచే క్షత్రియుఁ డనుట కవకాశము కలుగుచున్నది. ఈచాడువాణశబ్దమే చావహువాన—చావహమాన—రూపముల వాడుక కెక్కినది. ఇదే చౌహాణ యైనట్లు కనఁబడుచున్నది. హమ్మీరనరపతి మొదలగువారు చౌహాణరాజులు గా వర్ణింపఁబడియున్నారు. దీనినిబట్టి, బ్రాహ్మణుఁ డైనచో క్షత్రియకన్యను బెండ్లాడఁ గలిగెనా? ఇతఁడు క్షత్రియుఁడే యని కొంద ఱూహించిరి. పండితరాయలు లవంగిని బెండ్లాడిన ట్లితఁ డవంతిసుందరిని బరిణయమయ్యె నని చెప్పెడికథ వినరాదు. కావున నితఁడు క్షత్రియుఁడే యందము. కాని, రాజశేఖరసంజ్ఞమాత్రము శివనామపరమే కాని క్షత్రియశ్రేష్ఠపరము గా దని యితఁడు కర్పూరమంజరిలోఁ దనకు నామాంతరముగాఁ బ్రయోగించుకొన్నరజనీవల్లభశిఖండశబ్దమునుబట్టి తెలియునది.

బాలరామాయణప్రస్తావనలోని 'విద్ధి న షట్ప్రబంధాన్' అనుమాటను బట్టి యితఁ డాఱుప్రబంధములు రచియించినట్లు తెలియును. కర్పూరమంజరి విద్ధసాలభంజిక బాలరామాయణము బాలభారతము (ప్రచండపాండవము) ఇవి ప్రసిద్ధములు. కావ్యమీమాంస ప్రబంధములలోఁ జేర దన్నచో నిక రెం డుండవలెను. ఆపర్టుపండితుఁ డితనిసవ్యాఖ్యలిఖితసట్టక మొకటి సంపాదించె నని వినికిడి. అది నిజ మైతే, సుభాషితావళ్యాదులలో రాజశేఖరకృతములుగాఁ గనవచ్చెడి కవిప్రశంసాపరము లైనబహుశ్లోకములవల్ల నితఁడు కవివిమర్శ మనునొక గ్రంథము రచియించె ననెడిప్రతీతి విశ్వసనీయ మగును. ఇతఁడు బాలరామాయణమున భవభూతి భర్తృమేంఠ శంకరవర్మ తరల కవిరాజులను, కర్పూరమంజరిలో మృగాంకలేఖాకథ రచియించినయపరాజితకవిని హాలహరిచంద్ర నందిచంద్ర కోటిస కవులను బేర్కొనియున్నాఁడు.

ఇతనిరూపకములలో, కర్పూరమంజరి మొదటిది. ఇది ప్రాకృతమున రచియింపఁబడినసట్టకము. ప్రవేశకవిష్కంభములు లేక, అంకములకు బదులు నాలుగు జవనికాంతరములు కలది సట్టక మనఁబడును. ఇది యితనిభార్య సంతోషమునకు రచియింపఁబడిన దని యీక్రిందిప్రస్తావనాపద్యము తెల్పును.

"చాహువానకులమౌళిమాలికా, రాజశేఖరకవీంద్రగేహినీ,
భర్తుః కృతి మవంతిసుందరీ, సా ప్రయోజయితు మేత దిచ్ఛతి"

సంస్కృతవాక్కులు పురుషులవంటివి, కఠినములు. ప్రాకృత వాక్కులు సుకుమారములు స్త్రీలవంటివి, అని యితని యభిప్రాయము. శృంగార ప్రధాన మైనయీరూపకమున, చండపాలుఁ డనురాజు, వినోదార్థముగా భైరవానందుఁడు మంత్రసిద్ధిబలమునఁ దనయింటికి రప్పించినతనపట్టమహిషిపిన తల్లికూఁతురును, కుంతలరాజపుత్రియు నైనకర్పూరమంజరిని బెండ్లాడుట వర్ణింపఁబడినది. దేశభాషలో వ్రాయఁబడినరూపకములకిదే మొదలు. దీనికిఁ బూర్వము కేవలప్రాకృతమున రచియింపఁబడినరూపకము కనఁబడదు. రూపకము సర్వసాధారణముగా రంజకము కావలె నన్నయూహ కిది తార్కాణము—బాలరామాయణము పదంకములమహానాటకము. ఇందు రామాయణకథ యంతయు సంగ్రహముగా వర్ణింపఁబడినది—బాలభారతము కూడ నిట్లే మహానాటకమై భారతకథ యంతయు సంగ్రహించినట్లు తోఁచునుగాని, రెండంకముల గ్రంథము మాత్రమే సజీవమై యున్నది. మొదటియంకములో ద్రౌపదీస్వయంవరము, అర్జునుఁడు రాధావేధ మనులక్ష్యము గొట్టి పందెము గెలుచుట; రెండవదానిలో మాయ జూదము, అవమానితు లైనపాండవులు ద్రౌపదితో నడవికిఁ బోవుట, అనువిషయములు వర్ణింపఁబడినవి. విద్ధసాలభంజిక నాలుగంకములనాటిక. ఇందు నాయకుఁడు కేరలక్ష్మీశుఁ డైనవిద్యాధరమల్లదేవుఁడు. నాయిక లాటరా జైనచంద్రవర్మకూఁతు రగుమృగాంకావళి. వీరిపరిణయ మిందు చక్కఁగా వర్ణింపఁబడినది.

రాజశేఖరునికవిత్వము మృదులము రసవంతము. ఇందు కితఁడు వర్ణించు కొన్నవిద్ధసాలభంజికలోనిమాటలే చాలును.

శ్రోతుం శ్రోత్రరసాయనం రచయితుం వాచ స్సతాం సమ్మతా,
వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం లబ్ధుం రసస్రోతసః,
భోక్తుం స్వాదుఫలం చ జీవితతరో ర్యద్యస్తి తే కౌతుకం,
తద్భ్రాతః శృణు రాజశేఖరకవే స్సూక్తీ స్సుధాస్యన్దినీః.

రాజశేఖరుఁడు మిక్కిలి శృంగారప్రియుఁ డని, యితరకవులవలెఁ గాక యితఁడు మన్మథుని వామలోచనలను మంగళాచరణపద్యములందు వర్ణించుటయే తెలుపును.

“కులగురు రబలానాం కేళిదీక్షాప్రదానే,
పరమసుహృ దనఙ్గో రోహిణీవల్లభస్య,
అపి కుసుమపృషత్కై ర్దేవదేవస్య జేతా,
జయతి సురతలీలా నాటికాసూత్రధారః”
“దృశాదగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః,
విరూపాక్షస్య జయినీ స్తాః స్తువే వామలోచనాః”

కర్పూరమంజరి ప్రాకృతములో నుండుటచే నిపుడు దానికి వ్యాప్తి తగ్గినది గాని, అదియుఁ నిదియుఁ గూడ రత్నావళీప్రియదర్శికలవలె సహృదయరంజకము లనుట నిర్వివాదము. రస భావ వస్తు వర్ణనములందు రాజశేఖరుఁడు స్వతంత్రుఁడు. స్వకాలమున ఖ్యాతి గాంచినకొందఱుకవులలో నితఁ డొకఁడు. ఇతఁడు, భీమటకవి యైదునాటకములు నిర్మించె నని వర్ణించినట్లుగా సుభాషితముక్తావళిలో నొకశ్లోకము కనఁబడుచున్నది.

"కాలంజనపతి శ్చక్రే భీమటః పంచనాటకీమ్,
ప్రాప ప్రబన్ధరాజత్వం తేషు స్వప్నదశాననమ్"

ప్రయాగనగరమునకు వాయవ్యభాగమునఁ బన్నెండామడదూరమం దున్న కాలంజనగిరినామముతోడి దేశము పాలించినభీమటుఁ డనురాజకవి నిర్మించినయైదు నాటకములలో స్వప్నదశానన మనునది యుత్తమ మని దీనివల్లఁ దెలియుచున్నది. కాని, అదియును గనరాదు. ఈభీమటుఁ డితనికిఁ బూర్వుఁడో సమకాలికుఁడో తెలి యదు. కాని, ఆస్వప్నదశాననము స్వప్నవాసవదత్త ననుసరించిన దని పేరును బట్టి చెప్పవచ్చును.

రాజశేఖరునికి సమకాలికుఁ డైనయార్యక్షేమీశ్వరుఁడు నైషధానందము చండకౌశికము ననురెండునాటకములు రచియించెను. కాని, మొదటిది యల భ్యము [1]. ఐదంకములచండకౌశికము ప్రసిద్ధమై యున్నది. ఇందలికథ విశ్వామిత్రునికిని హరిశ్చంద్రునికిని సంబంధించినది. ఈనాటకము మహీపాలదేవునికాలమున రచియింపఁబడిన దని యిందలిప్రస్తావనాశ్లోకము తెలుపుచున్నది.

"య స్సంశ్రిత్య ప్రకృతిగహనా మార్యచాణక్యనీతిం,
జిత్వా నందాన్ కుసుమనగరం చంద్రగుప్తో జిగాయ
కర్ణాటత్వం ధ్రువ ముపగతా నద్య తా నేవ హన్తుం,
దోర్దండాఢ్య స్స పున రభవ చ్ఛ్రీమహీపాలదేవః"

ఈమహీపాలదేవుఁడు, రాజశేఖరుఁడు వర్ణించినమహేంద్రపాలునికుమారుఁడే. క్రీ. ౮౪౩ లోఘూర్జరరాజై పిదపఁ గాన్యకుబ్జము గెలిచి యది రాజధానిగా రాజ్య మేలినప్రథమభోజుఁ డితనిపితామహుఁడు. ఇతనితండ్రి యైనమహేంద్ర పాలుఁడు ద్వితీయభోజుఁ డనఁబడెడివాఁడు. ఈమహీపాలదేవుఁడు క్రీ. ౯౧౭ లో రాష్ట్రకూటవంశమువాఁడును, కర్ణాటరాజ్యపాలకుఁడు నైనద్రుధువునితోఁ బోరాడి

---

1. చూ. పేటర్సనురిపోర్టులు III. 340.

ఘూర్జరరాజ్యమునఁ గొంతభాగము పోఁగొట్టుకొని, తరువాత మరల నతనిమీఁద దండెత్తఁగోరునపు డీనాటకము పుట్టియుండు నని పై శ్లోకమువలనఁ దెలియవచ్చును.

విజయప్రకోష్ఠపండితునిమునిమనుమఁ డైనయీకవి భారతములోనిహరిశ్చంద్రకథనే తీసికొని యించుక మార్చి, ఉగ్రకోపుఁ డైనకౌశికునిపేర దీనికిఁ జండకౌశిక మనుపేరు పెట్టెను. హరిశ్చంద్రునిసత్యపరిపాలనము ప్రధానవిషయము. ఇందలివర్ణన లతిసరసములు. కవితాశైలి మిక్కిలి సరళము. హరిశ్చంద్రునిసత్యధైర్యములను దెల్పుధర్మవచన మిట్లున్నది.

"సుఖంవా దుఃఖంవా కిమివహి జగ త్యస్తి నియతం,
వివేకప్రధ్వంసా ద్భవతి సుఖదుఃఖవ్యతికరః,
మనోవృత్తిః పుంసాం జగతి జయినీ కాపి మహతాం,
యయా దుఃఖం దుఃఖం సుఖ మపి సుఖం వా న భవతి"

పూర్వోక్తుఁ డైనకులశేఖరవర్మ రచియించినతపతీసంవరణ మాఱంకముల నాటకము. భారతాంతర్గత మైనయందలికథ సుప్రసిద్ధము. ప్రస్తావననుబట్టి యీరాజు కేరళదేశముపాలించినవాఁ డనియు మహోదయపురమున నివసించినవాఁ డనియుఁదెలియుచున్నది. ఈనాటకమం దితనియాశ్చర్యమంజరీకథ ప్రశంసింపఁబడినది. ఇఁక మతవిషయకరూపకములలోఁ బ్రసిద్ధి కెక్కినది—

ప్రబోధచంద్రోదయము. అద్వైతమత మందఱికి సుబోధ మగునట్లు దృశ్యకావ్యముగా రచియించినదీనికర్త కృష్ణమిశ్రుఁడు. ఇతనికాలము సరిగాఁ దెలియరాదు కాని, క్షేమేంద్రునివఱకుఁ గలయాలంకారికులలో నొకఁడును గూడ సుప్రసిద్ధ మైనయీనాటకమందలిశ్లోక మొకటియు నుదాహరింపకపోవుటనుబట్టి యితఁడు క్రీ. ౧౧౦౦ ప్రాంతమువాఁడై యుండు ననియూహింపఁబడుచున్నది. ఇతఁడు గోపాలమంత్రి కానందసంధాయకముగా దీనిని నిర్మించినట్లును, అతఁడు తనమిత్రుఁడును, చంద్రవంశపురాజు నగుకీర్తివర్మమూర్ధాభిషేకకాలమందు దీనిని బ్రయోగింపఁజేసినట్లును దెలియును [1]. దీనికి వ్యాఖ్యానము వ్రాసినఘనశ్యాముఁడు "చేదిపతి యైనకర్ణరాజు నోడించి మరల నతనిరాజ్యమునకుఁ బట్టము గట్టినగోపాలమంత్రి పరశురామునివంటివిప్రవీరుఁడు" అని తెలిపియున్నాఁడు.

ఇది యాఱంకములనాటకము. ఇందు మతివివేకులుకథానాయికానాయకులు. ప్రబోధోదయము ఫలము. ఇందలిషడ్వర్గనిరసనము శమదమాదిషడ్క-

---

1. కీర్తివర్మ క్రీ. ౧౦౯౭ లో నున్నవాఁడని దేశచరిత్ర.

సంపత్ప్రశంస యెక్కువగా విశదీకరింపఁబడినవి. బౌద్ధకాపాలికాదిమతఖండనము గావింపఁబడినది. కవిత్వధార నిరర్గళము. రసోదంచితము. ఇందు క్రింది ప్రబోధోదయవచన మొక్కటే చాలును.

> "కిం వాప్తం కి మపోహితం కి ముదితం కిం వా సముత్సారితం,
> స్యూతం కిను విలాయితం ను కి మిదం కిం చి న్న వా కించన,
> య స్మి న్న భ్యుదితే వితర్కపదవీం నైవం సమారోహతి,
> త్రైలోక్యం సహజప్రకాశదళితం సోఽహం ప్రబోధోదయః"

దీని ననుకరించినవానిలో వేంకటనాథవేదాన్తదేశికాచార్యునిసంకల్పసూర్యోదయము కొంత ప్రసిద్ధి గాంచినది. ఇది విశిష్టాద్వైతమతప్రశంసాపరము. ఇందు పంచవిధ మైనశారీరకశాస్త్రార్థము విశదీకరింపఁబడినది. సంసారాంధకారమున నిద్రించువారిని మేలుకొల్పునది కావునను, భగవన్మాయలో మునిఁగియున్న వారికి విమలదృష్టి నిచ్చునది గావునను, ఇది సంకల్పసూర్యోదయ మైనది. ఇది పదియంకముల ప్రకరణము.

విశ్వామిత్రగోత్రజుఁడు లక్ష్మీసంభవస్వామిభట్టసూనుఁడు చోళభూవల్లభాస్థానపండితుఁడుషడ్భాషాసార్వభౌముఁ డభినవభవభూతిబిరుదాంకితుఁడు నగురత్నఖేటశ్రీనివాసదీక్షితుఁ డద్వైతమతబోధకముగా భావనాపురుషోత్తమ మను నైదంకములనాటకము రచియించెను. ఇది సర్వవిధములఁ బ్రబోధచంద్రోదయమును బోలియున్నది.

రామానుజాచార్యులచెల్లెలిమునిమనుమనికొడు కైనవరదాచార్యుఁడు, రామానుజాచార్యులజీవితము నతనివిశిష్టాద్వైతమతస్థాపనవిశేషములతో వేదాన్తవిలాస మనునామాంతరము గలయతిరాజవిజయ మనునాఱంకములనాటకము నిర్మించెను.

గౌరాంగుఁ డనఁబడుచైతన్యునిధర్మాచరణము నతనియుపదేశములను బోధించుచు, కవికర్ణపూరకవి చైతన్యచంద్రోదయ మనుప్రకరణమును నిర్మించెను. అదియుఁ బ్రబోధచంద్రోదయము ననుసరించినదే. ఈకవి కపిలేశ్వరదేవపౌత్రుఁడు పురుషోత్తమదేవపుత్రుఁడు నీలగిరిప్రభువు నైనగజపతిప్రతాపరుద్రదేవునికాలము లోనివాఁ డగుటచేఁ క్రీ. ౧౫౨౦—౧౫౪౦ నడుమ నున్నవాఁ డని గ్రంథాంతగద్యాదులవల్ల విదిత మగును. సరసశైలీనిబద్ధ మైనయిందలియద్వైతోక్తి యిది—

> "ధర్మార్థకామేషు పరైవ కుత్సా, లిప్సా న మోక్షస్యతు కర్హి చిన్నః,
> పళి స్సమస్తై స్తవ దేవలోకై, ర్లోకాంతరే ఽప్యస్తు సదైవ వాసః"

న్యాయమతబోధకముగా నృసింహకవి యనునొక తార్కికుఁ డనుమతిపరి ణయ మనురూపకము రచియించియున్నాఁడు. ఇందు, పరామర్శపుత్రిక యైన యనుమితి న్యాయరసికుని వరించుట యనువిషయము న్యాయశాస్త్రసిద్ధాంతపుర స్సరముగా వర్ణింపఁబడినది.

జాతవేదుఁ డనుమఱియొకకవి పూర్ణపురుషార్థచంద్రోదయ మనునైదంక ములనాటకము రచియించెను. ఇం దానందపక్వవల్లీదశాశ్వలపరిణయము మోక్ష పురుషార్థసిద్ధిపరముగా వర్ణింపఁబడినది. దశాశ్వుఁ డనఁగా, దశేంద్రియవిశిష్టుఁ డైనజీవాత్మ యని యర్థము. ఈనాటకమునందు చార్వాకజైనబౌద్ధకాపాలిక మీమాంసకాదిమతవిచారములు ప్రవేశపెట్టఁబడినవి. తుదకు సర్వమతసార మద్వైత మనుభావము తేలును. రాజైనదశాశ్వునిమాట యిట్లున్నది.

"ఆనందపక్వవల్లీ సా, నామ్నా ప్రియతమా మమ,
తత్ప్రాప్త్యా పురుషార్థో మే పూర్ణ స్స్యా న్నాత్ర సంశయః"

ఇట్లింకను గనవచ్చువీనిని విడిచి దేశమున వ్యాపించియున్నమఱికొన్ని రూపకములు చూతము.

ప్రసన్నరాఘవము. రతిమంజరీచంద్రాలోకములఁ బ్రసిద్ధి గాంచినజయ దేవుఁడు దీనికర్త. వంగదేశీయుఁ డైనయితఁడు సుమిత్రామహాదేవులతనయుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఇతఁడు పండ్రెండవశతాబ్దిలోనివాఁ డని కొంద అందురు. ఈయుత్తమనాటకములోనిశ్లోక మొకటియు విశ్వనాథకవిరాజుసాహిత్యదర్పణ మున లేక పోవుటచే నతని కితఁడు పరుఁ డని కొంద అందురు. అర్వాచీననాటక ములలోఁ బ్రఖ్యాతి గాంచినదీని కాంధ్రదేశమునఁ బిల్లమురారి యనువాడుక వచ్చినది. దీనినిబట్టి యిది మురారియనర్ఘరాఘవము ననుకరించిన దనుట తెల్లము. కవిత్వము పటువై సరసమై హృదయంగమముగా నుండును. ఇందలిశతానందరామ లక్ష్మణజామదగ్న్యులసంభాషణము విన నింపై పాత్రోచితముగా నున్నది. ఈక్రిందిశ్లోక మితనికవిత్వప్రియత్వమును జాటుచున్నది.

"న బ్రహ్మవిద్యా న చ రాజ్యలక్ష్మీ, స్తథా యథేయం కవితా కవీనామ్,
లోకోత్తరే పుంసి నివేశ్యమానా, పుత్రీవ హర్షం హృదయే కరోతి"

దేశమున వ్యాపించి యున్నపార్వతీపరిణయనాటకము భట్టబాణుని దనెడి ప్రవాదముకూడఁ గలదు గాని, పర్యాలోచన చేయఁగా నిది మన మింతకు మున్ను పెక్కుసార్లు స్మరించినవామనభట్టబాణునిదే యని తేలినది. ఇది కుమార సంభవకథ ననుసరించినయైదంకములనాటకము.

మహానాటక మనుపేరు దేశప్రసిద్ధము. ఈపేర నొకరూపకమును ముద్రిత మైనది. హనుమంతుఁడు దీనికర్త యగుటహనుమన్నాటక మనువ్యవహారముగల యీమహానాటకము ముద్రితనాటకముకంటె వేఱైనను, ముద్రిత మైనదానికిని హనుమన్నాటక మనెడివాడుక కలదు. ఈనాటకములో నితరులకృతులలోనిశ్లోక ములు గూడఁ గనవచ్చును. అందుచే నిది సంకలనరూపక మని తోఁచుచున్నది. ఇందు కిందలియీ క్రిందిమాటలు కూడఁదోడ్పడుచున్నవి.

"ఏష శ్రీలహనూమతా విరచితే శ్రీమన్మహానాటకే,
మిశ్రశ్రీమధుసూదనేన కవినా సందర్భసజ్జీకృతే."

హనుమంతుఁడు దీనిని రచియించె నఁట. మధుసూదన మిశ్రుఁడు సందర్భో చితముగా సవరించె నఁట. ఇది విశ్వాస్యమా? కావున మధుసూదనమిశ్రుఁడే కొంత రచియించియుఁ గొంత సేకరించియు దీనిని గూర్చె ననుట నిజము. ఇందు పదంకములు కలవు. విదేహతనయాలాభము మొదలుగా శ్రీరా ముఁడు స్వర్గమున కేగువఱకును గల రామకథాభాగ మంతయు సంగ్రహముగా నున్నది. ఇందలిశ్లోకసంఖ్య సుమా రేడువందలు. ఇట్టిరూపకము ప్రదర్శనయో గ్యమా? ప్రయోగసాధ్యమా? ఇందలిసూత్రధారునిమాట లిట్లున్నవి.

"వాల్మీకే రుపదేశతః స్వయ మహో వక్తా హనూమాన్ కవిః,
శ్రీరామస్య రఘూద్వహస్య చరితం సౌమ్యా వయం నర్తకాః,
గోష్ఠీ తావ దియం సమస్తసుమనస్సంఘేన సంవేష్టితా,
త ద్ధీరాః కురుత ప్రమోద మధునా వక్తా స్మి రామాయణమ్"

అచ్చుపడినమహానాటకములోనినాంది యిట్లున్నది.

"యం శైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో,
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః,
అర్హ న్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః,
సోఽయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః"

అముద్రితమహానాటకపుస్తకములలోఁ గొన్నిచోట్ల 'మహానాటకసుధా నిధి' అనుపేరు గూడఁ గనవచ్చుచున్నది. దీనినిబట్టి పూర్వరామాయణనాటక ములలోనిమంచిపద్యము లేరి కూర్చియుఁ గొన్ని కల్పించియు మధుసూదనుఁడే దీనిని గల్పించె ననుట సమంజసము.

ఉత్పన్నము లైనవివిధరూపకములు కొన్నివందలున్నను వానిలో వ్యాప్తికి వచ్చినవి మిక్కిలి తక్కువ. అర్వాచీనములలోఁ బ్రసన్నరాఘవమువంటివి రెండో

...పాడో యుండునేమో! తత్త్వమూహించినయెడ ననర్ఘరాఘవమువంటి నాటకములు రచియించినరూపకములలోఁ గూడ నాట్యకలాచాతుర్యము చూపున వెన్నో యుండవచ్చు. అవి మాత్రమే దేశమునలుఁగడల వ్యాపించి విద్వజ్జనమనోరంజనము లగుచున్న వనుట పాఠకలోక మెఱుఁగనిది కాదు. గ్రంథరచనము వేఱు కవిత్వము వేఱు. పద్యాత్మకమో గద్యాత్మకమో, గ్రంథము రచించినవా రందఱు కవులుగారు. కవి యగువాఁడు వ్రాసిన దంతయుఁ గూడఁ గవిత్వముకాదు. "యేనాస్మి న్నతివిచిత్రకవిపరమ్పరావాహిని సంసారే కాళిదాసప్రభృతయో ద్విత్రాః పఞ్చషావా మహాకవయ ఇతి గణ్యన్తే" మహాకవులుగా గణింపఁదగినవారు కాళిదాసాదు లిద్దఱు ముగ్గురో ఐదాఱుగురో యుందు రని యానందవర్ధనాచార్యుఁడు చెప్పినమాట యెంతయు విమర్శనపూర్వకము సత్యము. అట్టిమహాకవులకావ్యములలోఁ గూడఁ దారతమ్యము లేక పోలేదు. ప్రాచీనరూపకప్రపంచ మంతయుఁ గలయవెదకినచో, భాసరూపకములలో స్వప్నవాసవదత్త ముందు కనఁబడును. కొందఱికి బ్రతిమావిమారకములు గూడఁ గనఁబడవచ్చును. కాళిదాసరూపకములలో శాకుంతలమున కున్న గౌరవము తక్కినవాని కున్నదా? శ్రీహర్షరూపకములలో నాగానందమే మిన్న. భవభూతికృతములలో నుత్తరరామచరిత్రమే యుత్తమము. ఈచెప్పినవానివలె మనోహరము లైనవి మృచ్ఛకటిక ముద్రారాక్షస వేణీసంహారాదు లింక నైదాఱుండును. ఇంతే కదా! ఇవియేకదా లోకమునఁ బఠనపాఠవ్యవహారమందు ప్రసిద్ధము లైనవి! ఇట్లనుటచేఁ దక్కినరూపకసమూహ మంతయు వట్టిదేనా యనవద్దు. వానికిఁ దగినగుణము వాని కున్నది. ఇది యాంతరపరీక్ష చేసినప్పటిమాట.

క్రీ. ౧౩—౧౮ శతాబ్దులనడుమ నుత్పన్నము లైనరూపకములలో నముద్రితములై ప్రాచీనలిఖితపుస్తకాలయములఁ బడియున్నవి కొన్నివందలు. అవి యన్నియుఁ గూడఁ గొన్నియేండ్లు దేశమున సంచారము చేసినట్లు వ్రాఁతప్రతుల కాలమునుబట్టి యూహింపవచ్చును. ఐన నేమి? సుమారు వందసంవత్సరములుగా సారస్వతములో నివివిధజాతిగ్రంథములవలె నవియును నామరూపములు లేక యణఁగి యున్నవి. ఇందుకు సంస్కృతభాషాభ్యాసము దేశమున మిక్కిలి సన్నగిల్లుటయు గ్రంథసంతతి మితి మీఱుటయుఁ గూడఁ గారణములు. కాని, ఒకచిత్రము. అణఁగున దణఁగిపోవుచుండఁ బుట్టునది పుట్టుచునే వచ్చినది. ఇది కవులసంస్కృతభాషాభిరుచికి సాక్షి. ఈకాలమం దాయాముద్రితగ్రంథము లచ్చుపడినను జూచువారు తే రని యవి యుపేక్షణీయములా? కావు. దొరతనమువారు వానిని సంరక్షించుచు రాకపోయిన వానిపేళ్లు కూడ మనకు దొరకకపోవును. అముద్రితగ్రంథపట్టికలఁ ద్రష్టమా యని యిప్పుడు వందలకొలఁదిశాస్త్రకర్తలు కావ్యకర్తలు

మనకంటెఁ బడుచున్నారు. వారిమాటలు నాలు గైన మననోటఁ బడుచున్నవి. కావున హైందవార్యులవివిధకలాభిజ్ఞానమునకు సాక్షు లైనయాగ్రంథము లన్నియు రక్షణీయములు ప్రకాశయోగ్యములు నని భాషాభిమాను లుద్యమింతురు గాక. ఇఁక నట్టి వానిలోఁ గ్రొత్తగా ముద్రితములు నముద్రితములు నైనకొన్నిటి నవలోకింతము.

బరోడాసంస్థానమువారు ౧౯౧౮ లో రూపకషట్కము ముద్రింపించిరి. కిరాతార్జునీయవ్యాయోగము కర్పూరచరితభాణము రుక్మిణీహరణేహామృగము త్రిపురదాహడిమము హాస్యచూడామణిప్రహసనము సముద్రమథనసమవాకారము, అను నామముల దశరూపకభేదము లైనయాఱురూపకములను, అమాత్యవత్సరాజను కవీంద్రుఁడు నిర్మించెను. ఇతఁడు, కాలంజరాధిపతిపరమర్దిదేవునిరాజ్యకాలమందును, అతనికుమారుఁ డైనత్రైలోక్యవర్మదేవునికాలమునందును గూడ నున్నట్లితనిరూపకములోనిప్రస్తావనావాక్యములనుబట్టి తెలియుచున్నది గావున, క్రీ. ౧౧౭౦–౧౨౩౦ నడుమ నితఁడు జీవించియున్నవాఁ డనవచ్చును. భరతనాట్యశాస్త్రదశరూపకవ్యాఖ్యలు పేర్కొన్నత్రిపురదాహసముద్రమథనములు మృగ్యములు. ఆపేళ్ల వెలసినయివి వే అని తెలియునది. ఈరూపకములలోనివిషయమును రూపకనామములే తెలుపుచున్నవి. హాస్యచూడామణి తప్పఁ దక్కిన వన్నియుఁ బౌరాణికకథలనే గ్రహించినవి.

కిరాతార్జునీయమున నీశ్వరుఁడు కిరాతవేషముతోనే కాక, దుర్యోధనవేషముతోఁ గూడఁ బోరుట కల్పింపఁబడినది. ఇది త్రైలోక్యవర్మదేవునియనుమతి నభినయింపఁబడిన దఁట. దీనితరువాత వెలసినవ్యాయోగములలో వారణాసిధర్మసూరి నరకాసురవ్యాయోగ మెన్నఁదగినది. సదాశివకవిప్రచండభైరవమును, కాంచనకవికృత మైనధనంజయవిజయమును గోవిందపండితునివినతానందమును సజీవములై యున్నవి.

కర్పూరచరితభాణము చదువుట కింపుగానే కనఁబడుచున్నది. ఇందలి నాయకుఁడు కర్పూరుఁడు. ఇందలిశృంగారము హద్దు దాఁటిలేదు. భాణములపేరెత్తినంతనే పాఠకులకు వసంతతిలకభాణమును, పంచబాణవిజయమును, స్మృతికి వచ్చును. అందుకుఁ దగినగుణ మందు కలదుకావుననే యవి లోకమున నెక్కువగా వ్యాపించినవి. ఇవి పదునేడవశతాబ్దిలోనివి. రామభద్రదీక్షితునిశృంగారతిలకము దానికంటె రసవంతముగా గనఁబడుచున్నను బైకి రాలేదు. శృంగారశబ్దము మొదటఁ గలభాణములు పెక్కుకలవు. వానిలో, అభినవకాళిదాసు శృంగారకోశము, ప్రసిద్ధనీలకంఠదీక్షితునితృతీయపుత్త్రుఁ డగుగీర్వాణేంద్రదీక్షి

తునిశృంగారకోశము, అవధానసరస్వతిశృంగారజీవనము, నల్లాబుధునిశృంగార సర్వస్వము, వేదాంతాచార్యునిశృంగారసర్వస్వము మొదలైనవి ప్రధానములు. వీనికిఁ బూర్వమై వీనిని మించినది వామనభట్టబాణునిశృంగారభూషణము. ఇది మొన్నమొన్ననే బొంబాయిలో ముద్రితమైనది. తంజావూరుశరభాజీకాలములోనిజగన్నాథకవి రచించినయనంగవిజయముగూడ సరసముగానే కనవచ్చును.

వత్సరాజు రుక్మిణీహరణము తప్ప, ఈహామృగరూపకమునకు మఱియొక యుదాహరణము కనఁబడదు. ఇది నాలుగంకములరూపకము. ఇందలివిషయము విఖ్యాతము. ఇందు నాయకుఁడు కృష్ణుఁడు. ప్రతినాయకుఁడు శిశుపాలుఁడు. రుక్మిణీకన్యను గృష్ణుఁ డపహరించుట కావ్యఫలము.

డిమరూపకమునకుఁ ద్రిపురదాహ మొకటియే యిప్పటి కుదాహరణము. ఇందలికథ శివుఁడు త్రిపురాసురులను దహించుట. సమవాకారము లున్నట్లు విన వచ్చునుగాని . ముద్రితమైనది వత్సరాజుసముద్రమథనమే. భరతనాట్యశాస్త్రములోఁ గనవచ్చిన పేళ్లనుబట్టి యితఁ డీడిమసమవాకారములు నిర్మించియుండును. ఇఁక నితనిహాస్యచూడామణివంటిప్రహసములా, అనేకములు.

కాళిదాసు పేర నొకప్రహసన మచ్చుపడి యున్నది. దానివలెనే జ్యోతిరీశ్వరునిధూర్తసమాగమము, వేంకటేశ్వరకవిభానుప్రబంధము, అరుణగిరినాథుని యోగానందము, శంఖధరునిలటకమేలకము, వాసుదేవకవీంద్రునిసుభగానందము మొదలైనవియు హాస్యరసప్రధానములై కనవచ్చుచున్నవి. ఇట్టివానిలో ఘనశ్యామునిచండానురంజనము గణింపఁదగినది. ఇతనినిగూర్చియు నితనికవిత్వమును గూర్చియు వెనుకఁ బెక్కుచోట్లఁ దెలిసికొనియున్నాము. అర్వాచీనస్వతంత్రకవులలో నితఁడు లెక్కింపఁదగినవాఁడు. ఈప్రహసనముకడపట నితఁ డిట్లు చెప్పుకొని యున్నాఁడు.

"పటుషడ్భాషాకావ్యం నాటకభాణౌ చ సట్టకం చంపూః,
అన్యాపదేశశతకం రచితం యే నాశు ఖేలేన"

ఈశ్లోకమే యితనిడమరుకము చివరఁ గూడ నున్నది. డమరుక మనునది విచిత్రమైనయొకరూపకము. ఇందలిప్రకరణము లలంకారము లనఁబడును. ఇందు పదియలంకారములు కలవు. అవి, రాజానురంజన కవిదూషణ సుకవిసంజీవన కుకవిసంతాపన అబోధాకర శాబ్దికభంజన పండితఖండన జాతిసంతర్జన ప్రభువర్ణన అఖండానందనామములు కలవి. సూత్రధారపారిపార్శ్వకులు ప్రస్తావన జరిపినపిదప, కలహంస కలకంఠు లనుపాత్రములు ప్రవేశించి కథ యారంభింతురు. దీనిలో సూత్రధారోక్తిగాఁ గవివర్ణన మిట్లున్నది.

“సరస్వతీ ఘనశ్యామో ఘనశ్యామ స్సరస్వతీ,
ఇత్యేవ యం ప్రతి ప్రాయః కింవదంతీ ప్రవర్తతే”

ఇట్లు తక్కినరూపకభేదములు కనవచ్చును గాని, వీథి అంకము, అనెడిభేదములకు మాత్ర ముదాహరణము కనరాదు. ఇఁక వీని నిట్లుంచి ప్రసక్త మైన యర్వాచీననాటకాదివిషయ మెత్తుకొందము. నాటకములు లెక్క లేనన్ని పుట్టినవి. భోజరాజుకాలమునఁ గూడ దేశమున రూపకప్రదర్శనాచారము గనరాక పోయినను, పాఠ్యకావ్యములవలె దృశ్యకావ్యములుకూడఁ బుట్టుచునే వచ్చినవి. వాని నెల్ల నిందు పేర్కొనఁ జోటులేదు. అందు కొన్నిటిని మాత్రము గ్రహింతము.

రామభద్రదీక్షితుని యేడంకములజానకీపరిణయము పఠనపాఠముల వ్యాప్తి గాంచినది. సీతారామవివాహ మిందు వర్ణితము. ఇతఁడు ప్రస్తావనలో వ్రాసికొన్న యీ క్రిందిపద్యమునుబట్టి యితనివృత్త మించుక తెలియవచ్చును.

“యస్య స్తౌతి మతిం మనీషిసదసి శ్రీనీలకంఠాధ్వరీ
కోండజ్యోతిషికశ్చ యస్య కురుతే సమ్మాన మార్యైస్సమమ్,
యత్రానుగ్రహదృష్టి మర్పయతి చ శ్రీబాలకృష్ణో గురుః,
సోఽయం దీవ్యతి చొక్కనాథమఖినా మక్రీతదాసః కవిః”

వేంకటాధ్వరి ప్రద్యుమ్నానందనాటకమును, శఠకోపస్వామివాసంతికాపరిణయమును ముద్రితములై యించుక వ్యాప్తికి వచ్చినవి కాని, యచ్చుపడని కారణమున వీనివలె హృద్యము లైనను, నృసింహసూరిద్రౌపదీపరిణయము చక్రవర్తిశఠకోపాచార్యునిమైథిలీపరిణయము కవితార్కికసింహునిరుక్మిణీపరిణయము వీరరాఘవకవివల్లీపరిణయము మొదలైనబహురూపము లణఁగియున్నవి. గుహవంశనభస్తలైకసింహుఁ డైనగౌడేంద్రరాజునాస్థానమున నమాత్యకవిపండితగౌరవము గాంచినశ్రీహర్షనామకునిపుత్త్రుఁ డైనరామచంద్రకవి యయాతిచరిత్రము నైందవానంద మనుపేర నాటకముగా నిర్మించెను. ప్రతాపసింహుఁ డనుతంజావూరుపాలకునిపుత్త్రుఁ డైనతులజమహారాజునాస్థానములోనిరామచంద్రశేఖరకవి, ౧౭౬౫—౧౭౮౭ నడుమ, కలావతీనందక మను నేడంకములనాటకము రచియించెను. చొక్కనాథుఁడు కాంతిమతీపరిణయ మను నైదంకములనాటకము నిర్మించెను. ఇందలివిషయము శాహరాజు కాంతిమతిని బెండ్లాడుట. ఘనశ్యాముఁడు కార్తికేయునివృత్తాంతము కుమారవిజయ మను నైదంకములనాటకముగా రచియించెను. అప్పయదీక్షితులతమ్మునిపౌత్త్రుఁడును నీలకంఠదీక్షితునిసోదరుఁడు నైన అతిరాత్రయాజి, శ్రీరామపుత్త్రుఁ డైన కుశుఁడు కుముద్వతిని బరిణయ మగుట కుశకుముద్వ

తీయు మను పేర నైదంకములనాటకముగా నిర్మించెను. కృష్ణకవికంసవధనాటకమును, భోసలశాహారాజుచంద్రశేఖరవిలాసమును, రచియించిరి. తంజావూరురాజులకాలమందు వెలసిన విట్టివింకను గలవు. ఐన నేమి? వీనిలో ననేకములు పాఠకలోకమెఱుఁగవు.

భాస శ్రీహర్ష రాజశేఖరులనాటికల ననుకరించి యర్వాచీను లనేకులు నాటికలు రచియించిరి. వానిలో రాజచూడామణిదీక్షితునికమలినీకలహంసము వ్యాప్తి గాంచినది. కేరళీయుఁడును సంగమగ్రామ (కూడలూరు) వంశీయుఁడును నీలకంఠ పుత్త్రుఁడు నగునీలకంఠకవి రచియించినయింకొకకమలినీకలహంసము కలదు. అదియు, పూర్ణసరస్వతినిర్మించినకమలినీరాజహంసము, రుద్రదేవునియుషారాగోదయము నారాయణసూరికమలాకంఠీరవము మొదలైననాటికలును వ్యాపించలేదు.

అర్వాచీనప్రకరణములలో, ఉద్దండకవిమల్లికామారుతము ఖ్యాతి గాంచినది. మలబారుదేశీయుఁడైనయీకవి పదునేడవశతాబ్దిలోనివాఁడు. మహాదేవకవి నిర్మించినయద్భుతదర్పణము రామకథాశ్రయమై రాజశేఖరునిబాలరామాయణమును బోలియున్నది. క్రీ. పండ్రెండవశతాబ్దికడపట జైనకవులలో, ప్రసిద్ధహేమచంద్రునిశిష్యుఁడైనరామచంద్రకవి, కౌముదీమిత్రానంద మనుకల్పితవృత్తమైన ప్రకరణమును, ఆకాలమందే జయభద్రసూరిశిష్యుఁడైనరామభద్రముని ప్రబుద్ధరౌహిణేయ మనుప్రకరణమును రచియించినట్లు తెలియుచున్నది. ఇంకను గొన్ని ప్రకరణములు కలవేమో కాని మాలతీమాధవ మృచ్ఛకటికములవలె సహృదయరంజకము లైనవి కనరావు.

సట్టకము లెక్కువగా నుదయించినట్లు కనఁబడదు. కర్పూరమంజరి ననుకరించి ఘనశ్యాముఁ డానందసుందరి యనునాలుగుయవనికలసట్టకము నిర్మించెను. ఇది యముద్రితము. విశ్వేశ్వరకవి శృంగారమంజరీసట్టకము నిర్మించినట్లు తెలియుచున్నది గాని యది నాకు లభింపలేదు.

ప్రతాపరుద్రమహారాజున కానందము కలుగఁ బ్రదర్శించుటకై విశ్వనాథకవి భీముఁడు ద్రౌపదికై సౌగంధికపుష్పము తెచ్చుట యనుకథను సౌగంధికాపహరణప్రేక్షణక మనెడిరూపకముగా నిర్మించినట్లు దానిప్రస్తావనవల్లఁ దెలియుచున్నది. ఇతఁడు విద్యానాథునిసమకాలికుఁ డని తోఁచుచున్నది. ఇది యముద్రితము. ఇందలిసూత్రధారునిమాట లివి—

"రాజ్ఞా ప్రతాపరుద్రేణ సంభావితైః...స్సభా సద్భి రాహూయ సబహుమాన మాదిష్టోఽస్మి, విదిత్వా—

"విశ్వనాథ ఇతి ఖ్యాతః కవి రస్తి యదుక్తయః,
అకాంక్షిత మనుక్తంచ విదుషాం కర్ణభూషణమ్"

కాంచీపురవాసుఁ డర్వాచీనుఁడు నైనలోకనాథభట్టు కృష్ణాభ్యుదయ మను నొకప్రేక్షణకము రచియించెను. అది హస్తిగిరినాథునివార్షికయాత్రోత్సవమునఁ బ్రదర్శింపఁబడుటకు రచియించిన దఁట. ఇట్టిమాట యర్వాచీనభాణములం దంతటఁ గనవచ్చును. ఈకవి, కవిశేఖరబిరుదుఁ డైనవరదార్యుని పుత్త్రుఁడు. ఇందు శ్రీకృష్ణుని జననశైశవాదికవృత్తాంతము వర్ణింపఁబడినది.

ఇట్లనేకపాఠ్యదృశ్యకావ్యము లచ్చుపడక పోయినను, పుస్తకభాండాగారముల సజీవములై కొందతికైనఁ గనఁబడుచున్నందుకు సంతోషించవలసినదే కాని, కొన్నిపూర్వకావ్యములు నామమాత్త్రావశిష్టము లైనందుకు మాత్త్రము విషాదపడవలసియున్నది. అట్టివానిలోఁ బూర్వకవులు స్తుతించినవికొన్ని—

రాజశేఖరుఁడు ప్రశంసించినట్లు సూక్తిముక్తావళ్యాదులలోఁ గనఁబడుశ్లోకములనుబట్టి తెలియువిషయము [1].

"జానకీహరణం కర్తుం రఘువంశే స్థితే సతి,
కవిః కుమారదాసశ్చ రావణశ్చ యది క్షమః"

రఘువంశ ముండఁగా జానకీహరణము గావించుటకు రావణుఁడు సమర్థుఁడు కుమారదాసుఁడు సమర్థుఁ డన్నదీని యర్థమును బట్టి కాళిదాసు రఘువంశకావ్యమునకుఁ బిదపఁ గుమారదాసుని జానకీహరణకావ్యము పుట్టిన దని తెలియుచున్నది. ఇందలి పెక్కుశ్లోకముల నుజ్జ్వలదత్తుఁ డుణాదిసూత్త్రవృత్తియం దుదాహరించియున్నాఁడు. క్షేమేంద్రుఁ డౌచిత్యవిచారచర్చలో నుపసర్గాచిత్యమునకు వ్యతిరేకోదాహరణముగా 'నతు కుమారదాసస్య' అనుచు నీశ్లోక ముదాహరించెను.

"అయి విజహీహి దృఢోపగూహనం, త్యజ నవసంగమభీరువల్లభమ్'
అరుణకరోద్గమ ఏష వర్తతే, వరతను సంప్రవదన్తి కుక్కుటాః"

వ్యాకరణమహాభాష్యములోఁ బైశ్లోకముకడపటిపాద ముదాహరింపఁబడియున్నది [2]. దానినిబట్టి పతంజలికి మున్నే జానకీహరణ ముదయించిన దని కొం

1. ఈశ్లోకములు 1917 లో, నిర్ణయసాగరముద్రాలయమున ముద్రింపఁబడిన కర్పూరమంజరీ పీఠికలోఁ గూర్పఁబడినవి.

2. వ్యక్తవాచాం సముచ్చారణే (1-3-48) ఇతి సూత్త్రస్యవ్యాఖ్యాయామ్.

దఱు తలంతురు. కాని, యది సరికాదు. పైశ్లోకములో నిరఘువంశశబ్దమునకుఁ గుమారదాసపక్షమున రఘువంశకావ్య మని యర్థము. అది కాళిదాసు దనుట స్పష్టము. కావున నితఁడు కాళిదాసునకుఁ బరుఁడే. ఐతే మహాభాష్యములో నున్నయీపాదముమాటయేమి ? పతంజలివంటిమహామునులకొన్నిమాటలు ఛందోబద్ధములుగానే యుండును, అతఁడు స్వయముగాఁ గల్పించిన "వరతను సంప్రవదన్తి కుక్కుటాః" అనెడియుదాహరణమును, కుమారదాసు సంగ్రహించి తన శ్లోకమున నతుకుకొనియుండును. లేదా, జానకీహరణకావ్యము పుట్టినతరువాత నిందలియీపాదము నర్వాచీను లెవరైన మహాభాష్యవ్యాఖ్యలోఁ జేర్చియుందురు.

రాజశేఖరునివృద్ధప్రపితామహుఁ డకాలజలదపండితుఁడు వచనచంద్రికాది గ్రంథములు రచియించెనఁట. ప్రవరకవి యతనిశ్లోకములు తనవిగాఁ జూపి కాదంబరీరామ మనునాటకము నిర్మించె నఁట.

"అకాలజలదశ్లోకై శ్చిత్ర మాత్మకృతై రివ,
జాతః కాదమ్బరీరామో, నాటకే ప్రవరః కవిః"

ప్రద్యుమ్నుఁ డనుకవి యొకనాటకము నిర్మించె నని తెలియునుగాని దాని పేరుగూడఁ దెలియకున్నది.

"ప్రద్యుమ్నా న్నాపర స్యేహ నాటకే పటవో గిరః,
ప్రద్యుమ్నా న్నాపర స్యేహ పౌష్పా అపి శరాః ఖరాః"

త్రిలోచనుఁ డనుకవి పార్థవిజయమును, కులశేఖరవర్మ ఆశ్చర్యమంజరియు నిర్మించిన ట్లివి చెప్పుచున్నవి.

"కర్తుం త్రిలోచనా దన్యః కః పార్థవిజయం క్షమః"
"కులశేఖరవర్మాఖ్య శ్చకా రాశ్చర్యమంజరీమ్"

కాళిదాసుతరువాత వైదర్భవాక్కులఁ గవిత చెప్పినదానను నేనే యని కర్ణాటరాజపత్ని యగువిజయాంకాదేవి చెప్పిన ట్లీక్రిందిశ్లోకమున నున్నది.

"సరస్వతీవ కర్ణాటీ విజయాంకా జయత్యసౌ,
యా వైదర్భగిరాం వాసః కాళిదాసా దనన్తరమ్"

గద్యపద్యరచనయం దీమె సమర్థురాలైనట్లు చెప్పుకొన్నయీక్రిందిశ్లోకము చాటువుగా వినవచ్చును.

"ఏకో౽భూన్నలినాత్తతశ్చ పులినాద్వల్మీకత శ్చాపర,
స్తే సర్వే కవయో భవన్తి గురవ స్తేభ్యో నమస్కుర్మహే,
అర్వాఞ్చో యది గద్యపద్యరచనై శ్చేత శ్చమత్కుర్వతే,
తేషాం మూర్ధ్ని దదామి వామచరణం కర్ణాటరాజప్రియా"

ఇంతసమర్థురాలైనరాజస్త్రీ కృతులుగూడఁ గలలోనివార్తలైనవి. ఇంక నిట్లెయెందఱికృతులపేళ్లో యందందు కనిపించును.

ఇది, శృంగారరసవిమర్శన మహాభారతవిమర్శనాదికృతికర్తయగు
మల్లాది సూర్యనారాయణశాస్త్రిరచియించిన
లౌకికవాఙ్మయచరిత్రయందు,
అష్టమాధ్యాయము.

---

# నవమాధ్యాయము



## కోశాదులు.

### నిఘంటువులు.

ఇవి, అర్థములను స్పష్టపఱుచున వగుట నిఘంటువు లనియు, శబ్దార్థసంగ్రహము లగుటఁ గోశము లనియుఁ జెప్పఁబడుచున్నవి [1]. సారస్వతమున నిఘంటుశబ్దము సనాతనము, వైదికనిఘంటువులు నిరుక్తము లనఁబడినవి. యాస్కునినిరుక్తము నైఘంటుక నైగమ దైవత కాండముల విలసిల్లుచు ఋగాదులలోనిపర్యాయపదములను శబ్దములనానార్థములను వ్యుత్పత్తులను దెలుపుచున్న దని ప్రథమభాగమునఁ జదివియున్నాము [2]. వైదికశబ్దరూప తదర్థవిజ్ఞానమునకు నిరుక్తములును బ్రాతిశాఖ్యలు నెట్లుసహాయపడునో, అట్లే లౌకికశబ్దార్థస్వరూపవిజ్ఞానమునకు వ్యాకరణములును నిఘంటువులును దోడ్పడును. అందుచే నవి ఛందస్సున కంగము లైనట్లే యివి భాష కంగములై పాఠకులకు శబ్దార్థవిజ్ఞానమున నెక్కువ సహాయము లగుచున్న వనుట స్పష్టము.

ధాత్వర్థమును శబ్దరూపనిష్పత్తిని విశదీకరించినవ్యాకరణము పుట్టినపిదపనే భాషలో నిఘంటువు పుట్టినది. పాణినికిఁ బూర్వము గాని, అతనికిఁ బిదప రెండుమూఁడుశతాబ్దులలోఁ గాని పుట్టిననిఘంటు వొకటియు వినరాదుగాని, ఆకాలము నేదో యొకరూపమున నిఘంటు వుండియుండును. పాణినీయమందలి యుణాదిపాఠ మొకక్రమము ననుసరింప లేదుగాని, యది యొకచిన్నశబ్దకోశ మనవచ్చును. అందలిలింగానుశాసనము మిక్కిలి చిన్నదిగాని, శబ్దములలింగములను విశదీకరించుదానియందు నిఘంటులక్షణములు కొన్ని కలవు. అందుచే లౌకికభాషలో వెలసిననిఘంటువులకు నిరుక్తములు నిదియును మార్గదర్శకము లైన వనవచ్చును.

క్రీ. పూ. నాలుగైదుశతాబ్దులలో వ్యాడి వరరుచి కాత్యాయనుఁడు భాగురి మొద లగుమహావిద్వాంసులు కొందఱు నిఘంటువులు నిర్మించినట్లు తెలి

1. అర్థా న్నిఘంటయ స్త్వస్మా న్నిఘంటుః పరికీర్తితః
   కోశః తథాశబ్దార్థసంగ్రహే.
2. చూ. సం. వా. ప్రథ. 282-286 పుటలు.

యుచున్నది. పురుషోత్తమదేవునిహారావళిలో నియీక్రిందిశ్లోకము, వ్యాడి ఉత్పలిని యనుపేరు గలకోశము నిర్మించినట్లు గ్రంథకవిక్రమమునఁ జెప్పుచున్నది.

"శబ్దార్ణవ ఉత్పలినీ సంసారావర్త ఇత్యపి,
కోశా వాచస్పతి వ్యాడి విక్రమాదిత్య నిర్మితాః"

సర్వానందుఁ డమరకోశవ్యాఖ్యలో "సమాహృత్యాన్యతంత్రాణి" త్యాది శ్లోకమున కర్థము వ్రాయుచు, త్రికాండము ఉత్పలిని మొదలైనవి నామమాత్ర తంత్రములు, వ్యాడివరరుచ్యాదులు నిర్మించినవో, అవి లింగమాత్రతంత్రములు, అనిచెప్పినమాటలనుబట్టి[1] వ్యాడి రచియించిన దుత్పలిని కాదని తోఁచుచున్నది. గురుబాలప్రబోధికాకారుఁ డగులింగాభట్టు, వరరుచి భాగురి వామనాదులు రచియించినత్రికాండి ఉత్పలిని మొదలైనగ్రంథములను సంగ్రహించి[2] అని యర్థము వ్రాసెనుగాని, దానినిబట్టి వరరుచి త్రికాండిని, భాగురి ఉత్పలిని రచియించి రనుటకవకాశము కనఁబడకున్నది. ఎట్లయిన నితఁ డొకకోశము నిర్మించె ననుట నిజము.

పైని జేర్కొన్నవరరుచి కాత్యాయనుఁ డని త్రిలింగశేషకర్తయైనపురుషోత్తమదేవుఁ డనెను గాని, హర్షవర్ధన వామన సర్వానందాదులు కొందఱు వరరుచికృతమైనలింగవిశేషవిధి యనఁబడులింగానుశాసనమునుండి వాక్యము లుదాహరించుటను, క్షీరస్వామిహేమచంద్రాదులు కాత్యునిపేరెత్తి వాక్యము లుదాహరించుటను జూడఁగా, ఈవరరుచి కాత్యాయనవరరుచికంటె వే అనితోఁచుచున్నది. పైలింగానుశాసనము ప్రకటించినజర్మనీదేశీయుఁ డగుఆట్టోఫ్రాంకుపండితుఁడు; వరరుచి శాకటాయనుఁడు హర్షవర్ధనుఁ డనుముగ్గురు మూఁడులింగానుశాసనములు నిర్మించి రని తెలిపియున్నాఁడు. కాత్యకోశముపేరు తెలియదు గాని దానినుండి, వామనుఁడు తనకావ్యాలంకారసూత్రవృత్తిలో—నీవీశబ్దార్థవిచారణ చేయుచు "నీవీ సంగ్రథనం నార్యా జఘనస్థస్య వాససః" అనెడినామమాలాప్రతీకము నెత్తుటం బట్టి, యది నామమాలయై యుండు నని రామావతారశర్మపండితు లూహించినారు[3]. ఈయూహకు, అమరకోశవ్యాఖ్యాతయైనక్షీరస్వామి, "యత్కాత్యః—నీవి ర్గ్రన్థనం నార్యా జఘనస్థస్య వాససః" అనుచు నీవీశబ్దార్థ

---

1. త్రికాణ్డోత్పలిన్యాదిని నామమాత్రతంత్రాణి, వ్యాడివరరుచ్యాదిప్రణీతానితు లిఙ్గమాత్రతంత్రాణి. టీకాసర్వస్వే—
2. వరరుచి వాగురి వామనాదికృతాన్ త్రికాణ్ద్యుత్పలినీప్రభృతీన్—
3. చూ. కల్పద్రుకోశపీఠిక—బరోడాముద్రణము.

వివరణసందర్భమునఁ జెప్పుట సహాయపడినది[1]. కావున, వరరుచికోశము లింగానుశాసన మనియు, కాత్యనికోశము నామమాల యనియుఁ దలంపవలసియున్నది. అప్పుడీవరరుచియొక్కఁడివాఁడో యెప్పటివాఁడో చెప్ప నలవికాదు గాని, అమరసింహునికిఁ బూర్వుఁ డని మాత్రము చెప్పవచ్చును.

భాగురిపేరెత్తి క్షీరస్వామి తననామలింగానుశాసనవ్యాఖ్యలోఁ బెక్కుచోట్లఁ గొన్నిశ్లోకపాదము లుదాహరించియున్నాఁడు[2]. కాని, యతనికోశముపేరెత్తలేదు. సర్వానందాదులు కొందఱుత్రికాండముపేరెత్తి కొన్నిశ్లోకపాదములు తమవ్యాఖ్యలలో నుదాహరించియున్నారు కాని భాగురిపేరెత్తలేదు. ఐనను, ఆయుదాహృతశ్లోకపాదము లొకటిరెం డేకీభవించుటంజేసి భాగురి త్రికాండ మనుకోశమునిర్మించె నని యూహింపఁబడుచున్నది.

రత్నకోశ మనెడియొకనిఘంటువు స్త్రీపున్నపుంసకకాండవిధానము నవలంబించిన దని సర్వానందునివ్యాఖ్యవల్లఁ దెలియుచున్నది[3]. కాని, దానికర్తపేరు తెలియకున్నది. దీనివలెనే ప్రాచీన మైనది మాల, లేక అమరమాల, అనుపేర వ్యాఖ్యాతలమాటలలోఁ గనఁబడుచున్నది. ఇది భాగురికోశమునకుఁ దరువాతఁ బుట్టినట్లు క్షీరస్వామి వ్యాఖ్యానమునఁ దెలియుచున్నది[4]. త్రికాండచింతామణీకారుఁ డమరమాలపేరు చెప్పి యందలిమాట లుదాహరించియున్నాఁడు[5]. హాలాయుధుఁ డమరదత్తునిపేరెత్తియుదాహరించిన "ద్రప్సం దధ్యఘనం స్యాత్" అనుమాటనే క్షీరస్వామి, మాలాకృత్తుపేరెత్తి యుదాహరించియున్నాఁడు. వీటినిబట్టి, అమరదత్తుఁ డనువాఁడు మాల యనుకోశము నిర్మించె ననియు, అది యుత్తని నామైకశేషముతోఁ గలసి, అమరమాల యనఁబడె ననియుఁ దెలియవచ్చును.

వెనుక నుదాహరించినపురుషోత్తమదేవునిశ్లోకమునుబట్టి వాచస్పతి యను పండితుఁడు శబ్దార్ణవ మనుకోశము నిర్మించినట్లు తెలియును. హేమచంద్రునియభి

---

1. అమరకోశక్షీరస్వామివ్యాఖ్య—కాం. 3. 3–213. సంగ్రహశబ్దనివామనపాఠముకనఁబడుచున్నది. ఇట్టిపాఠభేదములు, అన్ని గ్రంథములవిషయమునను గనఁబడుచునే.
2. యద్భాగురిః. సర్వర్తుపరివర్తస్తు స్మృతస్సంవత్సరోబుధైః. ఇత్యాదులు. కాలవర్గాద్యులు.
3. అమరకోశవ్యాఖ్యా—టీకాస—నను, రత్నకోశాదివత్, స్త్రీపున్నపుంసకవిధానే నైవకథనముచితమిత్యాది—
4. ఏతచ్చ ద్రప్సం శర మితి భాగురిపాఠే సర మితి బుద్ధ్వా మాలాకృద్భ్రాన్తః అమరకో—క్షీరస్వా—వైశ్యవర్గ.
5. కజ్జ—తీచ ప్రసాధ నీతి స్త్రీకాండే, అమరమాలా—త్రికాండచిం—పుట 70—

ధానచింతామణివ్యాఖ్యలోఁ గూడ నితనిని వాసుకి వ్యాడి మొద లగువారిని ప్రశంసించుశ్లోక మొకటియున్నది [1]. పేరుకుఁ దగినట్లుగా రూపాంతరములతోడి శబ్దములు శబ్దార్ణవమున సమకూర్పఁబడినట్లు త్రికాండచింతామణ్యాదులలోని యుదాహరణములవల్లఁ దెలియుచున్నది [2]. దీనినిబట్టి వాచస్పతి శబ్దార్ణవము నిర్మించె ననవచ్చునుగాని, యితనినిగూర్చి యితరవిషయము లేమియుఁ దెలియ రావు. అయిన నితఁ డమరసింహునికిఁ బూర్వుఁ డనియే రామావతారశర్మగారి యభిప్రాయము. అమరకోశమునకుఁ బూర్వమే వైద్యశాస్త్రమునకు సంబంధించిన ధన్వంతరినిఘంటువు పుట్టిన దనుట విదితము. జ్యోతిర్విదాభరణము మిక్కిలి యర్వాచీనము, అది ప్రసిద్ధకాళిదాసు నిర్మించినది కాదు, అనువిషయమును బెక్కండ్రు సమ్మతించుచున్నను, కొంద అది శ్రీహర్షవిక్రమాదిత్యునినాఁటి దని విశ్వసించుచు, అందలి 'ధన్వంతరిక్షపణకామరసింహ' త్యాదిశ్లోకమునుబట్టి ధన్వంతర్యాదులు విక్రమార్కునిసభలోనినవరత్నము లని చెప్పుచు, వీరందఱు క్రీ. పూ. ౫౭ లోనివా రందురు. మఱికొందఱు వీరిలోఁ గాళిదాసాదులు క్రీ. నాలుగైదుశతాబ్దులలోనివా రందురు. ఇపు డీబెడఁద మరల ద్రవ్వుట యనా వశ్యకము. ఎట్లయినను, పైశ్లోకము ప్రమాణము కాఁజాలదు. అమరసింహుని కంటె ధన్వంతరి పూర్వుఁ డనుట నిరాక్షేపము. ఇందుకు, ఈక్రిందిక్షీరస్వామి మాటలే ప్రమాణము.

అమరసింహునినామలింగానుశాసనము వనౌషధివర్గులోని "గాయత్రీ బాలతనయః ఖదిరో దన్తధావనః" అనుశ్లోకమున కర్థము వ్రాయుచు, క్షీరస్వామి, "బాలపత్రో యవాసః ఖదిర శ్చేతి ద్వ్యశ్లేషు, ధన్వంతరిపాఠ మదృష్ట్వా బాల పుత్రభ్రాన్త్యా గ్రన్థకృత్ (అమరసింహః) బాలతనయ మాహ" అనుచు, ధన్వంతరి చంద్రచె ట్టనునర్థమునఁ జూపినబాలపత్రశబ్దము, తిన్నగాఁ జూడక, అదిబాల పుత్రశబ్ద మని భ్రాంతిపడి, అమరసింహుఁడు పుత్రశబ్దమునకు, తనయశబ్దము పెట్టి బాలతనయశబ్దమును ఖదిరపర్యాయముగాఁ బ్రయోగించె నని గ్రంథకారునిపొర పాటు చూపియున్నాఁడు. దీనినిబట్టి యమరసింహునికి ధన్వంతరిపూర్వుఁ డనుట స్పష్టము.

---

1. ప్రామాణ్యం వాసుకే ర్వ్యాడేః వ్యుత్పత్తి ర్ధనపాలతః, ప్రశ్చాచ్ఛ వాచస్పతిప్రభృ తే రిహ లక్ష్యతామ్—

2. అపి గంధర్వాగాంధర్వదివ్యగాయనగాథకః, సర్వానం–40.
కృష్ణపాకఫలః కృష్ణఫలపాకో వనాలకః, ఇత్యాది. త్రికాం. చింతా. 99.

ఇట్లు వ్యాడిమొదలగుప్రాచీనులెందఱో లౌకికశబ్దార్థనిరూపణపరములైననిఘంటువులు రచియించినమాట సత్యమైనను, అవి కొంతకాలము దేశమున వ్యాపించినమాట నిజమైనను, అమరసింహునినామలింగానుశాసనము తలయెత్తి భరతఖండమునలుదెసల కెగఁబ్రాకినంతనవి మఱుఁగుపడి పోయినవి. లోకప్రసిద్ధమైనయిది త్రికాండాత్మకము. ఇదిలింగభేదము ననుసరించినపర్యాయపదకోశము. ప్రతికాండమందును గ్రహింపఁబడినవర్గులనామములు వరుసగాఁ దెలుపు నొకశ్లోకము కాండాంతమునఁ గనవచ్చును. దానినిబట్టి యేవర్గమం దేశబ్ద ముండునో గ్రహింపవచ్చును. సంస్కృతభాష నభ్యసించువా రందఱును, కంఠపాఠము గావించెడిదీనిగుణము వర్ణించుట యనావశ్యకము.

అమరసింహుఁడు బౌద్ధుఁడని మంగళాచరణరూపమైన 'యస్య జ్ఞానదయాసింధోః' రిత్యాదిశ్లోకమే తెల్పును. క్షీరస్వామ్యాదివ్యాఖ్యాతలుగూడనీశ్లోకము జినస్మరణరూపమని వ్రాసియున్నారు. ఆకాలమున బౌద్ధులు రచియించినగ్రంథములలో దీనివలె సర్వజనాదరణపాత్రమైనదివేఱొకటి లేదనుట సాహసముకానేరదు. దీనియందలిసుగుణము మతద్వేషమును మఱపింపఁజేసి సకలమతములవారిహృదయము నాకర్షించిన దనుటకు దీనివ్యాప్తియే తార్కాణము.

అమరసింహుఁ డెప్పటివాఁ డనువిషయమును బెక్కండ్రు చర్చించియున్నారు. వారియభిప్రాయములు వివిధముగా నున్నవి [1]. మన మిపుడు తత్తదభిప్రాయసారమునే సంగ్రహింతము. శా. శ. ౭౮౯ లోనిజినేంద్రబుద్ధి తనకాశికావివరణపంజికలో, తంత్రం ప్రధానే సిద్ధాన్తే' అనెడియమరసింహునివాక్య ముదాహరించియున్నాఁడు. అమరసింహుఁడు ధన్వంతరికిఁ బరుఁ డనియింతకు మున్ను తెలిసికొనియున్నాము. ఇతఁ డెక్కువగాఁ బాణినీయము ననుసరించె ననుట విదితము. నృపసభ మిత్యాదిసభాంతశబ్దములు పేర్కొనునపుడు—

'శాలార్థాపి పరా రా జామనుష్యార్థా దరాజకాత్'

అనుచు 'సభా రాజామనుష్యపూర్వా' అనెడిపాణినిసూత్రమును (౨-౪-౨౩) సరిగా ననుసరించెనుగాని, ఇంతకంటె విశదమును సుగమము నైన 'ఈశ్వరార్థాదరాజ్ఞ స్సభా' అనెడిచాంద్రవ్యాకరణసూత్రమును స్మరింపలేదు. నిజముగాఁ జాంద్రవ్యాకరణ మితనికిఁ బూర్వమే యుదయించి యున్నచో బౌద్ధుఁడైన యితఁడు బౌద్ధుఁడైనచంద్రగోమిసూత్రమును స్మరింపక యుండఁడు. ఇది

---

1. చూ. పూనా, బరోడా, ట్రావెన్కూరు, అమరకోశముద్రణములు. బరోడా, కల్పద్రుకోశముద్రణము–పీఠికలు.

యిట్లుండ, అమరసింహుఁ డొప్పను అమ్మయము ననెడి రెండురూపములు చూపుట యెఱిఁగియే చంద్రగోమి 'అప్యంవా' అనుసూత్రమును, ఇతఁడు మందశబ్దము నాలస్యపర్యాయముగాఁ బ్రయోగించుట తెలిసియే యతఁడు 'మదిజాడ్యే' అను ధాతువును గల్పించె నని క్షీరస్వామి చెప్పియున్నాఁడు[1]. వీటినిబట్టి చంద్రగోమి కమరసింహుఁడు పూర్వుఁ డని తెలుచున్నది. చంద్రగోమి క్రీ. ౪౭౦ ప్రాంతము వాఁడు. కావున నమరసింహుఁ డతనికిఁ బూర్వుఁడై నాల్గవశతాబ్దిలోనున్నవాఁ డనవచ్చును. దీని కీక్రిందివిషయము ప్రోద్బలక మగును.

అమరసింహుఁడు నానార్థవర్గులలో గంధర్వశబ్దము, మరణజననములకు మధ్యకాలమం దగుసత్వమునఁ గూడ (యాతనాశరీరమందు) వర్తించు నని చెప్పి యున్నాఁడు. సాంఖ్యుఁడైనయీశ్వరకృష్ణుఁడు (వింధ్యవాసి) అట్టిదేహము లే దని చెప్పినట్లుగా "అన్తరాభవదేహో హి నేష్యతే వింధ్యవాసినా" అని కుమారిల భట్టు శ్లోకవార్తికములోఁ దెలిపియున్నాఁడు. ఈశ్వరకృష్ణునికపిలసాంఖ్యవివర ణము నమరసింహుఁడు చూచియుండె నేని పైవిధముగాఁ జెప్పియుండఁడు గావున, క్రీ. ౪౭౦ ప్రాంతములోనియతనినిబట్టి చూచినను, అమరసింహుఁడు నాల్గవ శతాబ్దిలోనివాఁ డనుట ధ్రువపడుచున్నది.

భరతఖండమందలియన్ని దేశములలోను నామలింగానుశాసనమునకు వ్యాఖ్యలు పుట్టినవి. ముద్రితములు నముద్రితములు నైనదీనివ్యాఖ్యలు సుమారేఁబది. అందు, చిరకాలముగా వ్యాప్తిలో నున్న వైదాలు. కనవచ్చినయన్నిటిలోను భట్ట క్షీరస్వామి నిర్మించినయమరకోశోద్ఘాటనము మొదటిదిగాఁ గనవచ్చును. క్రీ. ౧౧౪౦ లోని వర్ధమానుఁడు తనగణరత్నమహోదధిలో నితనిఁ బేర్కొనుట చేతను, రాజశేఖరభోజమహారాజుల నితఁడు పేర్కొనుటచేతను, ఇతడు క్రీ. ౧౧౦౦ ప్రాంతమున నున్నవాఁ డని తెలియుచున్నది. ఇతఁడు, గౌడుఁడు ఉపాధ్యాయుఁడు భోజుఁడు ననువారు నామలింగానుశాసనమునకు వ్యాఖ్యలు రచియించినట్లు తన వ్యాఖ్యలో సూచించెను, మాలాకారుని స్మరించెను, కాని, ఆవ్యాఖ్యలు కనరావు. క్షీరస్వామివ్యాఖ్య మిక్కిలి సులభము సవిమర్శము, ఇం దనేకము లైనపూర్వ గ్రంథములలోనిమాట లుదాహరింపఁబడినవి.

గుణమునుబట్టియు, కాలమునుబట్టియుఁ దరువాత గణింపఁదగినది టీకా సర్వస్వము. దీనికర్త యైనవంద్యఘటీయము సర్వానందుఁడు క్రి. ౧౧౫౯ లోనివాఁ డని, యితఁడు కాలవర్గులోని 'దైవే యుగసహస్రే ద్వే బ్రాహ్మః' అను

1. అతఏవ అప్యం చేతి చాంద్రం సూత్రమ్, అతఏవమది జాడ్యే ఇతి చాంద్రో ధాతుః. వారి, శూద్ర-వర్గములవ్యాఖ్యలు.

శ్లోకమున కర్థము వ్రాయుసందర్భమునఁ జెప్పినమాటలవల్లనే తెలియుచున్నది[1].
తాను, అమరకోశటీకలు పది యొకటిఁగినట్లు గా నితఁ డవతారికలో నిట్లు చెప్పెను.

"అథ టీకాసర్వస్వం దశటీకావి త్కరో త్యమరకోశే,
శ్రీమ త్సర్వానందో నంద్యఘటీయార్తిహరపుత్రః"

బహుశాస్త్రమర్మజ్ఞుఁడైనయితనివ్యాఖ్య భాషాజిజ్ఞాసువుల కత్యంతోప
కారముగా నున్నది. ఇతఁడు వంగీయుఁ డందురు.

కామధేనువు—దీనికర్త సుభూతిచంద్రుఁడు. క్రీ. ౧౧౭౩ లోని శరణదేవుని
దుర్ఘటవృత్తిలో స్మరింపఁబడినయితఁడు సర్వానందునిసమకాలికుఁ డని తోఁచు
చున్నది. ఇతనికామధేనువు పెక్కండ్రు కావ్యవ్యాఖ్యాతల నాకర్షించినది. ఇతఁడు
బౌద్ధుఁడు వంగదేశీయుఁడు.

రాయముకుటనామమున వాడుకకెక్కినబృహస్పతి యనుపండితుఁ డమర
కోశమునకుఁ బదచంద్రిక యనుటీక నిర్మించెను. రాధాపురవాసి యైనయితఁడు
వంగీయుఁడు. క్రీ. ౧౪౩౧ లోనివాఁడు. ఇతఁడు తనపూర్వులైనవ్యాఖ్యాతలను
బదునాఱుగురిని బేర్కొనియున్నాఁడు. ఇతనివ్యాఖ్యలో నుదాహృతము లైన
పూర్వగ్రంథములు సుమారుమూఁడువందలు. ఈవ్యాఖ్యకు వంగదేశమున మంచి
ప్రచారము కల దఁట.

అమరకోశపంజిక, లేక పదార్థకౌముది యనుపేర నారాయణశర్మ యొకటీక
వ్రాసెను. క్రీ. ౧౬౧౯ లోని యితనిటీకయు ముద్రితమై వ్యాప్తిలో నున్నది.
ఇతని కించుక సమకాలికుఁ డైనరమానాథవిద్యావాచస్పతి త్రికాండవివేక మను
టీక నిర్మించెను. వీనికించుక తరువాత, భట్టోజీదీక్షితునిపుత్రుఁ డైనభానుజీదీక్షి
తుఁడు వ్యాఖ్యాసుధ యనుపేర నొకటీక నిర్మించెను. రామాశ్రమి యనునామాం
తరముగల యిది, వఘేలరాజవంశమునకుఁ జెందినమహీధరదేశపాలకుఁ డగుకీర్తి
సింహరాజునుమతిని రచియింపఁబడినట్లుగద్య చెప్పుచున్నది. భరతసేనుఁ డను
పండితుఁ డొకవ్యాఖ్య నిర్మించెను. భరతునిపేర ముగ్ధబోధిని యనువ్యాఖ్య కనఁ
బడుచున్నది. వోపదేవునికవికల్పద్రుమమునకు వ్యాఖ్య రచియించినదుర్గాదాస
పండితుఁడు. "ఇత్యమరటీకాయాం భరతః" అని పేర్కొన్నభరతుఁడు ముగ్ధబో
ధినీకారుఁ డని తోఁచుచున్నది. అతఁ డెవఁడైనను, క్రీ. ౧౬౩౯ లోని దుర్గా
దాసునకుఁ బూర్వుఁ డగుట నిజము.

---

1. ఇదానీంచ, ఏకాశీతివర్షాధికసహస్రికపర్యన్తేనశాకాబ్దకాలేన—౧౦౮౧—।

క్రీ. ౧౬౬౬ లో, మథురేశవిద్యాలంకారుఁడు నిర్మించినసారసుందరీ వ్యాఖ్య యొకటి కలదు. ఇందితఁడు శబ్దములవ్యుత్పత్తులు దెలుపునపుడు 'సుపద్మ' వ్యాకరణము ననుసరించినవాఁడు. ఈవ్యాకరణ మెవరిదో యెప్పటిదో యెట్టిదో తెలియరాదు[1]. ఈవ్యాఖ్యాత యిదియే కాక, శబ్దరత్నావళి యనునిఘంటు వొకటి స్వతంత్రముగా నిర్మించెను.

అచ్యుతోపాధ్యాయుఁడు వ్యాఖ్యాప్రదీపమును, రంగాచార్యుఁడు, అమర పదముకురమును, ఆశాధరుఁడు క్రియాకలాపమును, గోస్వామి బాలబోధినిని, నారాయణవిద్యావినోదుఁడు శబ్దార్థసందీపికను, రఘునాథచక్రవర్తి త్రికాండచింతా మణిని, నిర్మించిరి. ఇట్టివానిలోఁ గొన్నికొన్ని యితరవ్యాఖ్య అందు స్మరింపఁ బడినవి. కొన్ని యెందును గనరావు.

అప్పయదీక్షితులు నీలకంఠదీక్షితులు మొద లగుదాక్షిణాత్యపండితులు కొందఱు రచియించినటీకలును, మల్లినాథసూరిభానుదీక్షితులుమొద లైనయాంధ్ర దేశపండితులు రచియించినటీకలును గొంతకాలము వ్యాప్తిలో నున్నట్లు వ్రాత ప్రతులనుబట్టి తెలియనయ్యెడి. మల్లినాథునియమరపదపారిజాతముకంటె దీక్షి తునిగురుబాలప్రబోధినికి వ్యాప్తి హెచ్చని తెలియవచ్చును. తాళ్లపాకఅన్న మాచార్యునిపుత్త్రుఁ డగుతిరువెంకటాచార్యులు తాను వ్రాసినయమరకోశాంధ్ర టీకలో నిట్లు తెలిపియున్నాఁడు.

"ఆలోక్య దీక్షితీయాదిటీకా, బాలప్రబోధికామ్,
టీకా మమరసింహస్య, రచయా మ్యాంధ్రభాషయా"

దీనినిబట్టి భానుదీక్షితునిగురుబాలప్రబోధినికి దీక్షితీయ మనెడివ్యవహార మున్నట్లును, దాని ననుసరించి తిరువెంకటాచార్యుఁడు బాలప్రబోధిక యను నాంధ్రటీక నిర్మించినట్లును దెలియఁగలదు. ఈ తెలుఁగుటీక యముద్రితపుస్తకభాండా గారముల నున్నది కాని, యిపుడు ప్రచారములో లేదు.

అమరకోశవ్యాఖ్యాతలలో లింగభట్టు లింగయసూరి యనునిద్దఱు కన వత్తురు. మొదటియతనిటీకపేరు తెలియరాదు. రెండవయతనిటీక పదవివృతి. దీనికి దేశమునలింగాభట్టీయ మని ప్రసిద్ధి. దీనినిబట్టి లింగభట్టలింగసూరు లిద్దఱు నొకరే యని తోఁచుచున్నది. దృశ్య మగుచున్నపదవివృతికంటె లింగభట్టుటీక వే ఱని తెలియువఱకు నిట్లే తలంపవచ్చును. పదవివృతి కాంధ్రటీక గురుబాల

1. చూ. కల్కత్తాకోశపీఠిక—

ప్రబోధిక. దీనికర్తపేరు తెలియరాదు. కాని, తిరువెంకటాచార్యుని బాలప్రబోధికను జూచియే యిది యుదయించిన దని పేరునుబట్టి చెప్పవచ్చును. తిరువెంకటాచార్యుని తెలుఁగుటీక బాలప్రబోధిక యగుటచేతను, అది దీక్షితీయాదుల ననుసరించుటచేతను, దానికంటె నిది వే అనుట స్పష్టము. పదవివృతితోను, ఈయాంధ్రటీకతోను గలసినయమరకోశమే మనదేశమునఁ జిరకాలముగా వాడుకలో నున్నది. ఇట్లనేకవ్యాఖ్యానములకు మూలాధారమై భరతఖండమంతట వెలసిన శాస్త్రకావ్యనాటకాదివ్యాఖ్యానములకుఁ బ్రమాణమై లోకసన్నుతమైననామలింగానుశాసనము కోశసారస్వతమున నగ్రస్థానము వహించియున్న దనుట నిర్వివాదము. ఇఁక దీనితరువాత వెడలినకోశములు సుమారు రెండువంద లుండును. అందు గొన్నిటి నైనఁ బరిశీలింతము.

పాణిన్యష్టాధ్యాయికి భాషావృత్తి రచియించినపురుషోత్తమదేవుఁడు త్రికాండశేషము హారావళి వర్ణదేశన యనెడిమూఁడు నిఘంటువులు నిర్మించెను. లోకమున నందందు వ్యాపించినయేకాక్షరకోశద్విరూపకోశములు గూడ నితనివే యని కొందఱు విమర్శకు లూహించిరి. సర్వానందుఁడితనికృతులను బేర్కొనుటనుబట్టి యతనికిఁ బూర్వుఁడైనయితఁడు క్రీ. ౧౧౦౦ ప్రాంతములోనివాఁ డన వచ్చును.

త్రిలింగశేషము, అమరసింహునినామలింగానుశాసనమందలిలోపములను బూరించినయనుబంధకోశము. అమరకోశమునకు మఱింతవన్నె తెచ్చినయిదియే పురుషోత్తమదేవునికి యశస్సు తెచ్చినది. ఇతనియుద్దేశము నీక్రిందియవతారికాశ్లోకములు తెల్పుచున్నవి.

"అత్రాకికత్వా దమర స్వ్వకోశే, న యాని నామాని సముల్లిలేఖ,
విలోక్య తైరప్యమునా ప్రచార, మయం ప్రయత్నః పురుషోత్తమస్య"
"వర్గక్రమ స్తథా నామ, లింగయో స్స్వపదేశతా,
పరిభాషాదికం సర్వ, మత్రా ప్యమరకోశవత్"

వీటినిబట్టి, అమరుఁడు విడిచినపదముల నితఁడు కూర్చె నని విదిత మగును. ఇది సుమా రెనిమిదివందలశ్లోకములకోశము. ఇతఁడు కవిప్రయుక్తము లైనశబ్దములను మాత్రమే గ్రహించి, అప్రయుక్తము లైనశబ్దము లుత్పలిన్యాదినిఘంటువులఁ గనఁబడుచున్నను, వానిని గ్రహింప లే దని గ్రంథాంతమం దిట్లు చెప్పెను.

"కృతప్రయోగా యే శబ్దాః ప్రాయ స్త ఇహ కీర్తితాః,
అప్రయుక్తా స్తూత్పలిన్యాదిదృష్టా అప్యుపేక్షితాః"

హారావళి. ఇది ౨౭౦ శ్లోకములకోశము. ఇందు మొదటిభాగమునఁ బర్యాయపదములు, రెండవభాగమున నానార్థములు తెలుపఁబడినవి. మహాశాబ్దికుఁడైన యీకవి, శబ్దశాస్త్రము గట్టిగా వచ్చునన్న యభిమానమును మాత్సర్యమును విడిచి కంఠమున ధరించువారికి విదగ్ధగోష్ఠియందు తనహారావళి దివ్యముగాఁ బ్రకాశించు నని చెప్పియున్నాఁడు. ఇతనివర్ణ దేశన వచనగ్రంథము. ఇది, లిపిభేదమునుబట్టి ఖ-క్ష, హ-ఘ, హ-డ, ఇత్యాద్యక్షరములయెడఁ గలుగుభ్రాంతిని నివారించునది.

శాశ్వతనిఘంటువు. అనేకార్థసముచ్చయ మనుమాఱుపేరు గలయది సుమా రెనిమిదివందలశ్లోకములకోశము. దీనికర్త శాశ్వతుఁడు. క్షీరస్వామిచేఁ బేర్కొనఁబడినయితఁడు క్రీ. ఆఱవశతాబ్దిలోనివాఁడై యుండు నని కొందఱూహించిరి. ఈనిఘంటువున మొదటిమూఁడుభాగములు శబ్దార్థములను జక్కఁగా విశదీకరించినవి. తక్కినవానిలో నవ్యయాదులరూపములు చెప్పఁబడినవి. దీనివలెనే పెక్కండ్రు కావ్యవ్యాఖ్యాతలకుఁ బ్రమాణ మైనది—

అభిధానరత్నమాల. దీనికర్త హలాయుధుఁడు. అవతారికలోనియీ క్రిందిశ్లోకమునుబట్టి యితఁ డమరదత్తాదులకోశము లెఱిఁగి యీకోశము రచించినవాఁ డని తెలియును.

"ఇయ మమరదత్త వరరుచి భాగురి వోపాలితాదిశాస్త్రేభ్యః,
అభిధానరత్నమాలా కవికంఠవిభూషణార్థ ముద్ధ్రియతే"

ఇందు, స్వర్భూమిపాతాలసామాన్యానేకార్థనామకము లైనయైదుకాండములు కలవు. ప్రతికాండయందును స్త్రీలింగపుంలింగనపుంసకలింగనానాలింగార్థవల్లింగాదిసంజ్ఞలతో నధ్యాయము లున్నవి. ఇందలివిషయ మీక్రిందిశ్లోకమున విదిత మగును.

"ఏకార్థో బహుభి శ్శబ్దైః కథితః కథ్యతే ఽధునా,
ఏక స్యైవహి శబ్దస్య బహు ష్వర్థేషు వర్తనమ్"

హలాయుధుఁడు మాన్యఖేటాధిపతి యగుతృతీయకృష్ణరాజునాదరణమునకుఁ బాత్రుఁ డగుటచే, క్రీ. ౯౫౦ ప్రాంతమున నున్నవాఁ డని తెలియుచున్నది. ఇతఁడు ధారానగరాధీశుఁ డగువాక్పతిముంజదేవునిసంతుష్టికై పింగళచ్ఛందస్సునకు మృతసంజీవినీవృత్తి రచియించినవాఁ డని ప్రతీతి కలదు [1].

---

1. చూ. కల్పద్రుకోశపీఠిక.

వైజయంతి—ఇది యొకగొప్పనిఘంటువు. రామానుజాచార్యులగురువైన యాదవప్రకాశుఁడు దీనికర్త. కాంచీపురవాసియు, యతిరాజపూజితాంఘ్రియు నైనయితఁడు క్రీ. ౧౦౫౦—౧౧౦౦ నడిమివాఁడు. ఇతనికోశము, స్వర్గా న్తరిక్ష భూమి పాతాల సామాన్య ద్వ్యక్షర త్ర్యక్షర శేష సంజ్ఞలు కలయెనిమిదికాండముల విలసిల్లుచున్నది. ఈవిభాగమందును, స్త్రీపున్నపుంసకాధ్యాయవిభాగమందును, ఇది హలాయుధనిఘంటువువలెనే కనవచ్చును. కాని, యంతకంటె విపుల మైనది. ఈకాలమునందే, కాళిదాసున కారోపింపఁబడిననానార్థశబ్దరత్నమునకు నిచులకవియోగీంద్రుఁడు తరల యనువ్యాఖ్య వ్రాసినట్లు తెలియవచ్చును గాని యది లభింపలేదు.

విశ్వప్రకాశము—దీనికర్త మహేశ్వరుఁడు. ఇతఁడు క్రీ. ౧౧౧౧ లోనివాఁడని కొన్నిప్రతుల తుదఁ గనవచ్చుశ్లోకమునఁ దెలియుచున్నది[1]. ఇది లోకప్రసిద్ధమైననిఘంటువు. దీనివిధాన మీ క్రిందిశ్లోకమున విదిత మగును.

"ఏక ద్వి త్రి చతుః పఞ్చ షడ్వర్ణానుక్రమోజ్జ్వలైః,
కాన్తాదివర్గై ర్నానార్థ సంగ్రహో ఽయం విధీయతే"

ఇందలిశబ్దవిభాగము, కైకక, కద్వికే, కత్రి కేత్యాదిగాను, కాన్త, ఖాన్త, గాన్తేత్యాదిగాను, ఉండును, కవి, తనకుఁ బూర్వము కోశములు వ్రాసినయమరసింహాదులను బెక్కండ్రను స్మరించియున్నాఁడు. ఇతఁడు గొప్పవైద్యుఁ డనియు, కవిరాజనియు, అనేకపద్యగద్యకావ్యములు నిర్మించినవాఁ డనియు, సాహసాంకరాజుచరితము కావ్యముగా వర్ణించినవాఁ డనియు, అవతారికాశ్లోకగ్రంథాంతగద్యలవల్లఁ దెలియుచున్నది.

"య స్సాహసాఙ్కచరితాదిమహాప్రబన్ధ,
నిర్మాణనైపుణగుణాగతగౌరవశ్రీః,
యో వైదికత్రయసరోజవనైకబన్ధుః,
బన్ధు స్సతాఞ్చ కవికైరవకాననేన్దుః"

"ఇతి వైద్యరాజచక్రముక్తాశేఖరస్య కవిరాజపరమేశ్వరస్య
పద్యగద్యవిద్యానిధిశ్రీమహేశ్వరస్య విశ్వప్రకాశే...

ఇతఁడే విశ్వప్రకాశమున కనుబంధముగా శబ్దభేదప్రకాశము రచియించెను. అందు శబ్దభేదము బకారభేదము ఊష్మభేదము లింగభేదము, అనుభాగములు

1. రామానల వ్యోమ రూపై శ్శకకాలే ఽభిలక్షితే,
కోశం విశ్వప్రకాశాఖ్యం నిరమాత్, శ్రీమహేశ్వరః.

కలవు. మొత్తమీవిశ్వప్రకాశమందు వాఙ్మయములోనిశబ్దజాలము శాలవఱ కర్థభేద లింగభేదాదులతోఁ గనవచ్చును. తత్పూర్వకోశములలో లేనిశబ్దములు నర్థములు నిందు గనఁబడును. ఇందు కొంకయుదాహరణము.

"భృశం ప్రకర్షే చాత్యర్థే ఉవశ్యం నిత్యప్రయత్నయోః,
అయి ప్రశ్నానునయయోః—ఇత్యాది.

భట్టారహరిచంద్రవంశములోనివాఁడును, చరకవ్యాఖ్యాతయు నైనయితఁడు తనకోశముయొక్క గొప్పతనము నిట్లు వర్ణించుకొనియున్నాఁడు.

"సతాం పుస్తకసంభారభారమోక్షః కృతో మయా,
నానానుశాసన మిదం సంపూర్ణం తన్న నాద్భుతమ్"

ఈసంపూర్ణకోశము నిర్మించి తాను బాలకుల కితరకోశము లనేకములు మోయవలసినభారము తగ్గించినాఁడఁట. నిజమే. ఇది పుట్టినయచిరకాలముననే యీకవి కించుకతరువాతివారిలో వంగీయుఁడు సర్వానందుఁడును, గూర్జరీయుఁడు హేమచంద్రుఁడును దీనిని సగౌరవముగాఁ జదివి రనుటయే యిందుకు నిదర్శనము.

అనేకార్థకోశము—కాశ్మీరీయుఁడు సుప్రసిద్ధుఁడు నైనమంఖుఁడు దీనికర్త. ఇతఁడు చూచిననిఘంటువుల నిట్లు తెలిపెను.

"భాగురి కాత్య హలాయుధ హు గ్గామరసింహ శాశ్వతాదికృతాన్,
కోశా న్నిరీక్ష్య నిపుణం ధన్వంతరినిర్మితం నిఘంటు ఇచ"

వీరిలో హగ్గుఁడు నిర్మించినకోశ మేదో తెలియదు. ఇతఁడు మహేశ్వరుని విశ్వప్రకాశమును బేర్కొనలేదుగాని, యిందలికాంతాదివిభాగము దానినే పోలియున్నది. ఇతఁడు కాశ్మీరరాజగుజయసింహునికాలమున (క్రీ. ౧౧౨౯-౧౧౫౯.) శ్రీకంఠచరితకావ్యము రచియించినవాఁడు. ఇతనినిఘంటువు ముఖ్యముగా శబ్దముల బహ్వర్థములను దెల్పునది. కాని, దీనికి వ్యాప్తి తక్కువ.

క్షీరస్వామిసర్వానందులకుఁ బూర్వము పదకొండుపన్నెండుశతాబ్దులలో మఱికొన్ని నిఘంటువులు పుట్టినవి. వానిలోఁ గొన్ని నామావశిష్టములు కొన్ని ప్రాణావశిష్టములు. అజయపాలుఁ డనుబౌద్ధుఁడు నానార్థసంగ్రహము నిర్మించెను. తంజావూరుపుస్తకభాండాగారమున నీపేరు కలవి రెండు కర్తపేరు లేక శిథిలములై యసమగ్రములై పడియున్నవి. అందొకదానిలో, "అర్క ఇత్యర్కపర్ణే స్ఫటికే సూర్యే జ్యేష్ఠభ్రాతరి చ" ఇత్యాదిగద్యపాఠము కనవచ్చును. రెండవదానిలో "అర్క స్స్యాచ్చండతేజసే, అఖండలేచ స్ఫటికే జ్యేష్ఠే భ్రాతరి తాపకే" ఇత్యాది

పద్యపాఠము కనవచ్చును. సర్వానందుఁడజయునిపేరెత్తి తనవ్యాఖ్యలో నుదాహరించిన "శంబరో వారిణే దైత్యే శంబరం సలిలే స్మృతం" మిత్యాదిపద్యభాగములనుబట్టి యజయపాలునికోశము శ్లోకాత్మకమే యని స్పష్టమగును. పరిశీలింపఁగా, గద్యాత్మకముగా నున్నది, దీనికే యెవరో యేర్పఱిచినవివరణ మనితోఁచు చున్నది—సర్వానందాదివ్యాఖ్యాతలు కొందఱు తారపాలునిపేరెత్తిరి కాని, అతనికోశము కనరాదు—క్షీరస్వామ్యాదులు కొన్నిశ్లోకభాగము లుదాహరించుచు (సర్వజ్ఞభిషజౌ వైద్యావాత్మాకామశ్చ హృచ్ఛయా) పేర్కొన్నదుర్గుఁడు, ధాతుపాఠము శబ్దవ్యుత్పత్తులు గూడ నిర్మించిన ట్లందందలియుదాహరణములఁ గనవచ్చుటంబట్టి కాతంత్రవ్యాకరణమునకు వ్యాఖ్య వ్రాసిన దుర్గసింహుఁడే యని తోఁచుచున్నది. కాని, ఇతనికోశము కనరాదు—ద్విసంధానకావ్యకర్తయు శ్రుతకీర్తిత్రైవిద్యబిరుదుఁడు నగుధనంజయుఁడు నామమాల యనుకోశము నిర్మించినవాఁడు. ఈపేరు గలకోశములు రెండుమూఁడున్నవి. కాశీపురమున ముద్రితమైనద్వాదశకోశసంగ్రహమున నొకనామమాల కనవచ్చును. కొన్నివ్రాతప్రతులలోనివిషయముకంటె ముద్రితనామమాలలోనివిషయము వేఱుగా నున్నది. శబ్దసంకీర్ణరూపాదిపరిచ్ఛేదత్రయముతో నొకనామమాల యున్నట్లు తెలియవచ్చును. కావున ధనంజయునినామమాల సంశయాస్పద మగుచున్నది. కర్ణాటకుఁడైన యితఁడు దిగంబరజైనమతమువాఁడు. ౧౧–౨౩ ప్రాంతమువాఁడు. ఇట్లే ధరణీదాస ధర్మముని రంతిదేవ రభసపాల వోపాలిత విశ్వరూపాదులు పెక్కండ్రు రచియించిననిఘంటువులు నిపుడు కనరావు, వీరిపేళ్లెత్తి సర్వానందాదు లందందొకటి రెండు వాక్యము లుదాహరించుటచే వీరు కోశకర్తలని తెలిసికొనవలసివచ్చినది.

క్రీ. పండ్రెండవశతాబ్దిమొదటిభాగములోనివాఁడైనజైనుఁడగు హేమచంద్రుఁడు, అభిధానచింతామణి అనేకార్థసంగ్రహము నిఘంటుశేషము హేమచంద్రీయము దేశీనామమాల అనుకోశములు నిర్మించి ఖ్యాతి కెక్కినవాఁడు. ఇందు మొదటిది దేవాధిదేవ దేవ మర్త్య తిర్యక్ నారక సామాన్యసంజ్ఞలుకల యాఱుకాండములగ్రంథము. ఇందు మొదటికాండము జైనదేవతాదివిషయకము. మొత్త మీకోశ మమరకోశము ననుకరించిన దనుట నిజము. రెండవదికూడ నాఱుకాండములకోశమే. అందు, అకారాది కాది క్రమమున శబ్దార్థములు చెప్పఁబడిన ట్లీక్రిందిశ్లోకమే చెప్పును.

"అకారాదిక్రమే ణాదా వత్ర కాదిక్రమో ఽ న్తతః,
ఉద్దేశ్యవచనం పూర్వం పశ్చా దర్థప్రకాశనమ్"

మూఁడవది వనౌషధిపర్యాయబోధకము. నాల్గవది పన్నెండధ్యాయముల చిన్నకోశము. ఇందు ప్రయోగప్రసిద్ధపదములు చూపఁబడినవి. ఐదవది ప్రాకృత పదనిఘంటువు. వీనిలో మొదటి రెండును దరువాతికోశకర్తల మెప్పు గాంచినవి. కవికాలసర్వజ్ఞుఁ డనవిఖ్యాతిగాంచిన హేమచంద్రుఁడు జయసింహకుమారపాలరాజుల యాదరమునకుఁ బాత్రమైనవాఁడు. మొత్త మితనినిఘంటువులలోనిశ్లోకములు రమారమినాలుగు వేలు. అభిధానచింతామణియవతారికలోని యీ క్రిందిశ్లోక మందలివిధానము తెల్పును.

"ప్రణిపత్యార్హతః, సిద్ధసాంగశబ్దానుశాసనః,
రూఢయౌగికమిశ్రాణాం నామ్నాం మాలాం తనో మ్యహమ్"

కేశవస్వామి, రమారమి యాఱువేలశ్లోకములతో నానార్థార్ణవసంక్షేప మనునిఘంటువు రచియించెను. ఇం దాఱుకాండము లున్నవి. ప్రతికాండము, స్త్రీ పుం న్నపుంసక వాచ్య నానాదిభేదమున లింగములు నిరూపింపఁబడినవి. ఇం దనేకము లైనవైదికశబ్దములు గూడఁ గలవు. ఇది శబ్దములవివిధార్థప్రదర్శనమున నుత్తమనిఘంటు వనవచ్చును. ఈస్వామి, చోళరాజైనకులోత్తుంగుని కుమారుఁ డగు రాజరాజు నాశ్రితుఁడైనట్లిందలియవతారిక చెప్పుచున్నది. కావున నితఁడు ద్వాదశశతాబ్దికడపటివాఁ డని తెలియుచున్నది. ఇతనిశ్లోకములను, అరుణనాథమల్లినాథులు తమవ్యాఖ్యలలో నుదాహరించికొనియున్నారు.

మేదినీకోశము లేక నానార్థశబ్దకోశ మనుదానిని మేదినీకరుఁడు నిర్మించెను. మిక్కిలి వ్యాప్తమైనయిది విశ్వప్రకాశము నెక్కువగాఁ బోలియున్నది. ఇతఁడు తనపూర్వకోశకర్తల ననేకులఁ బేర్కొనియున్నాఁడు. గ్రంథాంతశ్లోకమునుబట్టి యితఁడు షట్కృతగాథాకోశ మనుపేర నాఱువందలనీతిశ్లోకములు నిర్మించినట్లు తెలియుచున్నది.

"షట్కృతగాథాకోశప్రణయనవిఖ్యాతకౌశలే నాయమ్,
మేదినికరేణ కోశః ప్రాణకరసూనునా విరచితః"

క్రీ. ౧౩౭౫ లో, పృషోదరాదివృత్తి రచియించినపద్మనాభదత్తుఁడు తన భూరిప్రయోగమందును [1] మల్లినాథాదులు తమవ్యాఖ్యలందును మేదినిని స్మరించి యున్నారు. ఒరిస్సారాజులైనగాంగరాజులలో నొకరికిమేదినీకరుఁడు సంరక్షకుఁ

1. శాకే శైల నవాదిత్యే చైత్రే మాసి రవేః స్థితా,
ద్విజేన పద్మనాభేన భాషాసూత్ర మిదం కృతమ్.

ముగాఁ గూడ నుండె నని తెలియుచున్నది[1]. దీనినిబట్టి యితఁడు పంద్రెండవశతాబ్దికడపటివాఁడై యుండు నని తోఁచుచున్నది.

ఐంద్రనిఘంటు వన నొకటి వరరుచిపేరఁ గనవచ్చునుగాని, అది ప్రసిద్ధకాత్యాయనవరరుచిది కా దని మొదటిశ్లోకమే తెలుపఁగలదు.

"పూర్వం పద్మభువా ప్రోక్తం శ్రుత్వేంద్రేణ ప్రకాశితమ్
తద్బుధేభ్యో వరరుచిః కృతవా నైంద్రనామకమ్"

ఏకాక్షరనిఘంటు వనుమాఱుపేరు గలయిది పరిమాణమున నెంతచిన్నదో గుణమున నంతకనిష్ఠము. అర్వాచీనుఁ డెవఁడో దీనిని గూర్చి వరరుచిపేరు పెట్టెను— ఇట్లే మండనమిశ్రునిపేర నానార్థశబ్దానుశాసన మొకటి యున్నది. పైదానికంటె నిది కొంచెము పెద్దది. దీనికడపటిశ్లోక మిది—

"ఇతి మండనమిశ్రేణ సాహిత్యరసపోషిణీ,
క్లృప్తం నానార్థశబ్దానుశాసనం సంగ్రహాశ్రియా"

ఆయానిఘంటువులలోనిశ్లోకములు సంగ్రహించి కూర్చినయిది యు మిక్కిలి యర్వాచీనము.

తంజావూరుపుస్తకాలయమునందు, ఏకాక్షరరత్నమాల, నానార్థరత్నమాల, అను రెండుకోశము లున్నవి. మొదటిదాని కొకప్రతి, రెండవదానికిఁ బదునెనిమిదిప్రతులును గలవు. నామములనుబట్టియే వీనిలోనివిషయము తెలియును. ఇం దేకాక్షరరత్నమాలాపుస్తకముతుద—

"యస్త్యాగేన సురద్రుమం రఘుపతిం సత్యేన ధర్మాత్మజం,
ధర్మేణానుకరో త్యసౌ హరిహరో నామ క్షమావల్లభః,
తత్సమ్రాజి ధురంధరో గుణనిధిః శ్రీమాయణామాత్యజో,
మంత్రీ మారగురో ర్నిఘంటు మకరో న్నానార్థ మేకాక్షరమ్"

అనుశ్లోక మున్నది. 'రామాయణాఖ్యాత్మజో' అనుపాఠమును గ్రంథపట్టికాప్రకాశకులు పైవిధముగా సవరించి, ఇరుగపదండాధినాధుఁడు దీనికర్త యని యాంగ్లమున వ్రాసిరి. రెండవదానియొక ప్రతిలో (నం. 4768) అవతారికాశ్లోకము లేడున్నవి. అందు ముఖ్యమైనవి కొన్ని—గ్రంథాంతశ్లోక మొకటి యు—

---

1. చూ. శబ్దరత్నసమన్వయకోశపీఠిక — బరోడా ప్రతి.

"అస్తి శ్రీమా న్నిరుపమదండనాథః ప్రచండధీః,
స...త్తో చ్ఛేదదండేశవంశముక్తామణి ర్గుణీ,
ద్వితీయ మన్తఃకరణం రాజ్ఞో హరిహరస్య యః,
రాజకార్యం ప్రజారక్షాం ద్వయం ధత్తే కుల...
సోఽయం గృహ్ణాతి నానార్థరత్నమాలాం గుణోజ్జ్వలామ్
శ్రీమా న్నిరుపమదండేశో నాత్యల్పాం నాతివిస్తరమ్,
కాండై శ్చతుర్భి రేకద్విత్రిచతుర్వర్గవర్ణితైః"
ఇతి జగదుపకారిణ్యాం నిరుపమదండాధినాథరచితాయామ్,
ఏష త్ర్యక్షరకాండః పూర్ణో నానార్థరత్నమాలాయామ్"

తక్కినప్రతులలో మొదటికాండము మొదఁటగూడఁ బైయవతారికా శ్లోకములు లేవుగాని "అకారో బ్రహ్మవిష్ణ్వీశకమఠే ష్వఙ్కణే రణే" ఇత్యాది గ్రంథముమాత్రము సమానముగానే యున్నది. కొన్నిప్రతులచివర—

"శ్రీజగదుపకారిణ్యాం భాస్కరవిబుధేన సంగృహీతాయామ్,
ద్వ్యక్షరపదకాండో ఽయం పూర్ణో నానార్థరత్నమాలాయామ్"

అనురీతి నొకశ్లోకము భాస్కరవిబుధుఁడు కర్త యని చెప్పుచున్నది. ఈశ్లోకములో మొదటిభాగ మొక్కప్రతిలో "ఇతి జగదుపకారిణ్యా మిరుగప దండాధినాథరచితాయా"మనురీతి నున్నది. ఇట్లు కర్తపేరు వివిధముగా నున్నను గ్రంథ మంతయు సమానమే. ఇరుగపదండనాథుఁడు లేక నిరుపమదండనాథుఁ డను వాని మొదటిపేరు భాస్కరుఁ డని వీటినిబట్టి విశ్వసింపవచ్చును. హరిహరునివద్ద, ఇరుగపదండనాథుఁ డున్నాఁడనియుఁ జెప్పవచ్చును. కాని, ఇతఁడు మాయణుని పుత్త్రుఁ డనువిషయముమాత్రము సందిగ్ధముగా నున్నది. మాధవసాయణులలో నొకరును గూడ భాస్కరుఁ డనుసోదరుఁడు తమ కున్నట్లు గాని, అతఁడు హరి హరరాజుమంత్రి యైనదండనాథుఁ డైనట్లు గాని చెప్పియుండ లేదు. ఆంధ్రలిపిలో ముద్రిత మైననానార్థరత్నమాల యాద్యంతముల—

"శ్రీమా నిరుగపదండేశో నాత్యల్పాం నాతివిస్తరమ్—
"ఇతిజగదుపకారిణ్యా మిరుగపదండాధినాథరచితాయామ్"

అనిమాత్రమే యున్నది. భాస్కరనామము లేదు. మాయణపుత్త్రుఁడు హరిహరమంత్రి యనుమాటలు లేవు. అందుచే నీవిషయ మింకను విచారణీయము.

నానార్థరత్నమాలలో, ఏకాక్షర ద్వ్యక్షర త్ర్యక్షర చతురక్షర సంకీర్ణాక్షరము నామముల నాలుకాండములు కలవు. ఇందు ప్రతికాండమందును, కకారము

మొదలు క్షకారమువఱకుఁగలవర్ణము లంతమందు గలశబ్దములు వానివివిధార్థములును గ్రమముగాఁ జూపఁబడినవి. మొత్తమిందు ౧౨౬౯ శ్లోకము లున్నవి. వంద్యభట్టు దీనికి వ్యాఖ్య రచియించినట్లు తెలియుచున్నది. కాని, మూలము గాని వ్యాఖ్య గాని, నాగరలిపిలో నచ్చుపడినట్లు కనఁబడదు. ఆంధ్రలిపిలో నైనను, వ్యాఖ్య యచ్చుపడలేదు. ఈనిఘంటువు పూర్వనిఘంటువుల ననుసరించిన దైనను, పద్ధతి విశదముగా నున్నది. చక్కనియేర్పాటుతో ముద్రింపవలసిన గ్రంథములలో నిది యొకటి.

నామమాలిక యనుచిన్నకోశ మొకటి, అహిరాజనిర్మితముగాఁ గనఁబడును. దీనిచివర—

"ఇతి నామమాలికాయా మహిరాజే నైన సంగృహీతాయామ్,
భూమ్యాదినామధేయప్రకరణ మిద మఖిలసుకవిమతమ్"
భోజనిఘంటు స్సమాప్తః"

అనుమాట లున్నవి. కడపటిమాటనుబట్టి బర్నెల్ పండితుఁడు భోజరాజు దీనిని రచియించియుండు నని యూహించెను. కాని, అహిరాజు దీనిని భోజరాజు పేర నిర్మించె ననుటయే సముచితము. ఇది భోజకృతముగాఁ బ్రతీతమై యుండఁ తత్త్వము తెలిసినయర్వాచీనుఁ డొకఁ డిది యహిరాజకృతమే యనెడి యర్థము వచ్చునట్లు 'అహిరాజే నైవ' అనుచో, ఏవకారము చేర్చి పైశ్లోకము కల్పించె నని తోఁచుచున్నది. కాని, ఇది యెవరి దన్నను, ప్రాచీన మని గౌరవింపఁదగినదే కాని, యిందలివిషయ మంత శ్లాఘ్యముగా లేదు.

బాలబోధిక యనుపేర నాలుగువందలశ్లోకములచిన్న నిఘంటు వొకటి నక్కీరకృతముగాఁ గనఁబడుచున్నది. "జ్ఞానప్రసూనకలికాం నమస్కృత్య మహేశ్వరీమ్" అనెడిధ్యానశ్లోకమునుబట్టి గ్రంథకర్త కాళహస్తిజ్ఞానప్రసూనాంబనే స్మరించినట్లు తెలియవచ్చును. కాళహస్తిమహాత్మ్యములో నక్కీరుఁ డనుద్రవిడకవియొకఁడు వర్ణింపబడియున్నాఁడు. ఆనక్కీరుఁడే యీకోశము నిర్మించినవాఁడేమో యని సంశయము గలుగుచున్నది.

వామనభట్టబాణుఁడు శబ్దరత్నాకర మనునిఘంటువు నిర్మించిన ట్లొకవ్రాఁతప్రతిలోని 'ఇతివత్సకులవామనభట్టబాణవిరచితే' అనుగద్యమున దెలియుచున్నది. "బాణవిరచితాయాం శబ్దచంద్రికాయామ్" అని మఱియొకగద్య బాణుఁడు శబ్దచంద్రిక రచియించినట్లు చెప్పుచున్నది. ఈబాణుఁడు వామనబాణుఁడే యని కొందఱియూహ. ఈచంద్రిక అయిదుసర్గలకోశము. శబ్దరత్నాకరము మూఁడుకాండలనిఘంటువు. విషయము సర్వసామాన్యమే.

శబ్దభేదనిర్దేశము శ్లేషార్థపదసంగ్రహము, అనురెండునిఘంటువులు శ్రీహర్షుఁడు రచియించినట్లు కనఁబడుచున్నది. రెండవదానికడపటిశ్లోక మిది—

"ఇత్యేవం కవిరాజేన శ్రీహర్షేణ మహాత్మనా,
ఏకాధ్యాయేన రచితః శ్లేషార్థపదసంగ్రహః"

ఈశ్రీహర్షుఁడు నైషధకర్తశ్రీహర్షుఁడేమోయని తోఁచుచున్నది. ఐన నిది విచారణీయము.

కవిరాక్షసుఁడు షడర్థనిర్ణయ మనుకోశము రచియించెను. ఇది, ఆఱేసి యర్థములు గలశబ్దములను జూపును.

"అబ్జే మోక్షే జలే క్షీరే సింహే సూర్యేఽపి చామృతమ్"
ఇది సుమారఱువదిశ్లోకములచిన్నకోశము. చదువ నింపుగా నున్నది.

శ్రీపతిసార్వభౌమమురారికవికృత మైనసుప్రసిద్ధపదమంజరి యనుకోశము కలదు. ఇది సుమా రేఁబదిశ్లోకములకోశము. ఇందు—
"బ్రహ్మా విధాతా విశ్వాత్మా తస్య శక్తిః సరస్వతీ,
వాణీ విశ్వమయీ బ్రాహ్మీ తస్య పుత్రోహి నారదః"

ఇత్యాదిగాఁ బ్రసిద్ధశబ్దములు చూపఁబడినవి. ఈసార్వభౌమమురారి యెవరో తెలియకున్నది. ఇది యిట్లుండ—

అక్బరుకాలమున భానుచంద్రగణి యనుపండితుఁడు వివిక్తనామసంగ్రహమును, ముచ్ఛాఖానుకాలమున మధురేశుఁడు శబ్దార్థరత్నావళిని, జోధపురరాజగుసూర్యసింహునికాలమున వల్లభగణి సారోద్ధారమును (ఇదిహేమచంద్రునియభిధానచింతామణికి విపులవ్యాఖ్య) ఛత్రపతిశివాజీకాలమున రఘునాథపండితుఁడు రాజవ్యవహారకోశమును (ఇదిసంస్కృతపారశీకనిఘంటువు) త్రిపురేశుఁ డగురాజధరునికాలమున కర్ణపూరకవి వర్ణప్రకాశమును రచియించినట్లు తెలియును. కాని, వీనికి వ్యాప్తి రాలేదు. తరువాత గణింపఁదగిన—

గొప్పనిఘంటువు కల్పద్రుకోశము. నాలుగువేలశ్లోకములయీకృతికర్త కేశవపండితుఁడు. పర్యాయపదనిఘంటువులలో నింత గొప్పది మఱియొకటి లేదన వచ్చును. పాట్నాకలాశాలయందలిసాహిత్యాచార్యు లగురామావతారశర్మగారి యుత్తమపీఠికతో దీనిని బరోడాసంస్థానమువారు ప్రకటించిరి. ఇది భూర్భువస్స్వర్గ సంజ్ఞలుకలమూఁడుస్కంధముల గ్రంథము. ప్రతిస్కంధము ప్రకాండములుగా విభజింపఁబడినది. ప్రథమస్కంధమున ౧౭, ద్వితీయమున ౫, తృతీయమున ౪,

మొత్తము ౨౭ ప్రకాండములు కలవు. ఇందు భూమిపర్యాయములు ౯౪, అగ్ని పర్యాయములు ౧౧౪, ఉన్న వనుటయే యిది శబ్దములకల్పతరు వనుటకుఁ జాలును. ఈకవి గ్రంథాదియం దీక్రిందికోశకర్తలను స్మరించెను.

కాత్య వాచస్పతి వ్యాడి భాగు ర్యమర మజ్గలాః,
సాహసాజ్క మహేశాద్యా విజయన్తే జినాన్తిమాః॥

ఇందుజినశబ్దము హేమచంద్రపర మని తోఁచుచున్నది. ఇతఁడు తృతీయ స్కంధమున, కాలప్రకాండమున, కలిశబ్దసందర్భమున నిట్లు చెప్పియున్నాఁడు.

“...సాంప్రతంకలిః, తద్గతాబ్దాఃకుతిథిభాః ౪౭౬౧ సంవర్తఃప్రలయః క్షయః॥—

దీనినిబట్టి కేశవుఁ డీనిఘంటువు రచించునాఁటికి గతించినకలియుగసంవత్సరములు తెలియుచున్నవి. కావున నితఁడు క్రీ. ౧౬౬౦ లో నున్నట్లువిదితము.

ఈనిఘంటువునఁబర్యాయపదములసంఖ్య యధికమైనమాట నిజమే. కాని యిందొకవిశేషము. అమరసింహుఁడు చూపినపర్యాయపదములు కొన్నిసమస్త పదము లైనను, అవిసంజ్ఞావాచకములవలెనే కనఁబడును. ఇందుకు, ‘ద్వాదశాత్మా ఉష్ణరశ్మిః’ ఇత్యాదు లుదాహరణము. ఇందు సూర్యపర్యాయములు ౧౨౨ ఉన్నవి. వానిలో ననేకములు సమస్తపదములు. ఇందు కొకటి—

“సుగ్రీవ మను కర్ణానాం యమయమ్యో శ్శనేఃపితా॥

అనఁగా, సుగ్రీవపితా మనుపితా, ఇత్యాదిగా నిందుసూర్యవాచకము లైనవి. ఇతఁడు పెంచినపర్యాయపదరాశి చాలవఱ కిట్టిదే యైనను, తక్కినకొన్ని కోశములకంటె నిది మఱికొంతయుపయోగకారి కాకపోదు.

తంజావూరుభోసలరాజైన శహాజీ శబ్దార్థసంగ్రహము శబ్దరత్నసమన్వయ కోశము, అను రెండుపెద్దనిఘంటువులు రచియించెను. ఇందు రెండవది బరోడా సంస్థానమువారిచే దివ్యముగా ముద్రింపఁబడినది. మొదటి దచ్చుపడినట్లు కనఁబడదు. పెక్కండ్రు దాక్షిణాత్యకవిపండితులను బోషించి స్వయముగా విద్వాంసుఁడై యైనయీమహారాజు భాషకుఁ జేసినసేవ యమూల్యము. ఇతనిశబ్దార్థసంగ్రహమితనితంజావూరులోనే సగము మిగిలియున్నది. కాలము దురతిక్రమము గదా! గ్రంథకర్త రెండవదాని విధానము నిట్లు తెలిపెను.

"కేచి న్నానార్థకాః కేచి త్త్వేకాః స్త్వేకార్థగోచరాః,
ఏకో ఽనేకార్థయుక్తో ఽయం శబ్దరత్నసమన్వయః॥
కేషు చి త్త్వాదినియమః, కృతో ఽన్యత్రా న్త్యగోచరః,
కోశే ఽస్మిన్ ద్వయ మప్యస్తి కవీనా ముపకారకమ్॥
ఏక ద్వి త్రి చతు ష్పఞ్చ షడ్వర్ణానుక్రమా న్మయా,
స్వర కాద్యాది కాద్యన్త వర్గైః కోశో ఽయ మీర్యతే॥

ప్రకాశకు లిందలిశబ్దజాలము నంతను, అకారాదివర్ణక్రమము ననుసరించి నవీనపద్ధతినిగూర్చి దీని కనుబంధముగా ముద్రించి లోకోపకారము గావించిరి.

ఇంక నిట్టికోశములు వంద లున్నవి. వానివ్యాఖ్యలకు లెక్కలేదు. అం దనేకము లముద్రితములు మృగ్యములు జీర్ణములు. వాని నెల్ల నిందు వర్ణించుట కవకాశము చాలదు. కావున, ప్రత్యేకగుణము గలమఱికొన్నిటిని స్మరింతము.

పాణినీయసిద్ధాంతకౌముదితుదం గనవచ్చెడియుణాదిపాఠము ననుసరించి, రామశర్మ ఉణాదికోశమును, శుభశీలగణి ఉణాదినామమాలను, వేంకటేశ్వరపండి తుఁడు ఉణాదినిఘంటువును నిర్మించిరి. వీరిలోఁ గడపటియతఁడు శహాజీకాలము లోనివాఁడు. ఆకాలముననే నల్లాశాస్త్రి శ్రీధరవెంకటేశ్వరులు పదమణిమంజరి యనుకోశము కూర్చిరి. శాకల్యగోత్రుఁడు నాంధ్రుఁడు నైనమల్లుభట్టు అవ్యయసంగ్రహనిఘంటువు నిర్మించెను. ఇట్టి వన్నియు మఱుఁగుపడియున్నవి.

లోకప్రసిద్ధ మైనధన్వంతరినిఘంటువునకుఁ బిదప వెలసినవైద్యనిఘంటువు లలో మాధవకరునిపర్యాయరత్నమాల మొదటిదిగాఁ గనవచ్చును. ఈకవి క్రీ. ౮ లేక ౯ వ, శతాబ్దిలోనివాఁడని వింటర్నిట్జుపండితుఁ డనెను. ఈగ్రంథ మున సుమారు రెండువందలశ్లోకములు మాత్ర మున్నవి. దీని ననుసరించియే పర్యాయముక్తావళి పుట్టినది. అందు శబ్దవిభాగ మొకక్రమము ననుసరించియున్నది. హేమచంద్రునినిఘంటుశేషము వైద్యమునకు సంబంధించిన దనుట తెల్లము. అం దోషధులపే ళ్లెక్కువగా నున్నవి. అభిధానరత్నమాల యనునామాంతరము గలషడ్రసనిఘంటు వొకటి రసవిషయకము కలదు. వీని నన్నిటిని మించి మదన పాలుఁ డనురాజు క్రీ. ౧౩౭౪ లోఁ దనపేర రచియించిన మదనపాలనిఘంటువు ముద్రిత మైనట్లు కనఁబడదు. ౧౯౭౭ లో శివదత్తుఁడు శివకోశము నిర్మించెను. అవియును, చక్రపాణిదత్తుని శబ్దచంద్రిక, వేంకటేశ్వరునిదక్షిణామూర్తినిఘంటువు, గుణపాఠముతోడి ద్రవ్యముక్తావళి, నీలకంఠమిశ్రునిపర్యాయార్ణవము మొద లైన వియుఁగూడ వైద్యశాస్త్రాభిలాషుల కుపయోగకరము లనఁ దగియున్నవి.

జ్యోతిషనిఘంటువులలో పారదత్తునిగణితరత్నమాల ప్రశంసనీయము. తరువాతివానిలో వ్యాప్తికి వచ్చినవి సంఖ్యాకోశము నవగ్రహకోశము రాశికోశము నక్షత్రకోశము మొదలైనవి.

ఇట్లెన్నెని నిఘంటువులు సంస్కృతమున వెలసినవి కాని, యివి యన్నియుఁ బద్యమయము లగుటచేఁ బూర్వకాలమునఁ గంఠపాఠము చేయువారికి మాత్రమే యెక్కువ యుపయోగకరములై తక్కినవారి కంతయుపయోగకరములు గాక పోయినవి. ఈకాలమునఁ బూర్వపద్ధతిని విద్యాభ్యాసమే లేదు. నిఘంటువులు వల్లించిశబ్దార్థములను జ్ఞప్తియం దుంచుకొన, జూచువాఁడు వేయింటికిఁ గాదు గదా, లక్షకుఁ గూడ నొకఁడు కనరాఁడు. అందుచే శబ్దములను వానియర్థములను బుస్తకము తెఱచినంతనే తెలిసికొనుట కనువుగా వర్ణక్రమము ననుసరించినశబ్దకోశము లిపు డావశ్యకము లైనవి. విల్సనుపండితుఁడు మోనియర్ విలియంపండితుఁడు వామనశివరామఆప్టే మహాశయుఁడు మొద లగుపాశ్చాత్యభారతీయ విద్వాంసులు కొందఱు విశేషశ్రమ కోర్చి సంస్కృతాంగ్లనిఘంటువులు నిర్మించి ప్రకటించిరి. అవి, సంస్కృత మభ్యసించు నాంగ్లేయులకును, ఆంగ్ల మభ్యసించిన భారతీయసంస్కృతపండితులకును, కలాశాలలలో సంస్కృతాంగ్లము లభ్యసించు విద్యార్థులకు మిక్కిలి యుపయోగపడుచున్నవి కానిఁ ఆంగ్లభాష రానిసంస్కృత భాషాభిజ్ఞులకును సంస్కృతవిద్యార్థులకును, ఉపయోగకరములు కాకున్నవి. మహామహోపాధ్యాయపరవస్తురంగాచార్యులుగా రొక గొప్పనిఘంటువు నిర్మింప నారంభించిరిగాని, యది నెఱవేఱినదికాదు. సంస్కృతభాషాసర్వస్వ మనఁదగిన తారానాథతర్కవాచస్పతి నిర్మితవాచస్పత్యము భారతీయగీర్వాణభాషాభిలాషులపాలిటి కల్పతరు వనవచ్చును. కాని, అమూల్యమైన యామహాగ్రంథముమూల్యము దరిద్రదేశములోని భారతీయులకు భరింపరాని దైనది. ఐనను, దానిప్రతు లిపుడు లభింపకున్నవి. సుమారు పదివేలపుటలయాకోశమును మహారాజు లెవరైన మరల మంచియక్షరములతో ముద్రింపించి చౌకగా దేశీయులకు లభించునట్లు చేయుట దేశమునకును భాషకునుగూడఁ బరమోపకార మగును.

## ఛందశ్శాస్త్రము.

లౌకికసారస్వతమున మిక్కిలి తక్కువగా నున్నఛందోగ్రంథములకు మూలాధారము పింగళచ్ఛందస్సు. దాని కాధారము ఋగ్వేదమందలిపాదబద్ధమంత్రములు. ప్రథమభాగమున వేదాంగ మైనఛందస్సునుగూర్చి వ్రాయుసందర్భమున, ఛందస్సులయుత్పత్తినిగూర్చియు, పింగళచ్ఛందస్సునుగూర్చియుఁ గొంత తెలుపఁబడినది.

పింగళనాగకృతసూత్రములతోఁడి యెనిమిదధ్యాయముల ఛందశ్శాస్త్రము ముద్రితమై వ్యాప్తిలో నున్నది. దీనికి హలాయుధభట్టు మృతసంజీవినీటీకయు, సమీాక్షాచక్రవర్తిమధుసూదనవిద్యావాచస్పతులుఛందోనిరుక్తియు రచియించిరి. అవియు దీనితో నచ్చుపడినవి. ఇది పింగళనాగకృత మని హలాయుధుని యీక్రింది మాటలు చెప్పుచున్నవి.

"పింగళాచార్యసూత్రస్య మయా వృత్తి ర్విధాస్యతే,
క్షీరాబ్ధే రమృతం యద్వ ద్ధృతం దేవై స్సదానవైః
ఛన్దోబ్ధేః పింగలాచార్యై శ్ఛందోఽమృతం త థోద్ధృతమ్,
పింగళాచార్యరచితే ఛన్దశ్శాస్త్రే హలాయుధః,
మృతసంజీవినీం నామ వృత్తిం నిర్మితవా నహమ్"

ఈమాటలనుబట్టి, ఛందస్సుల (వేదముల) నుండి పింగళుఁడు లక్షణరూపచ్ఛందస్సు నుద్ధరించె నని విదిత మగును. వైదికచ్ఛందస్సులకు లక్షణ మైనయిదియే లౌకికచ్ఛందస్సులకును మూల మైనది. ఇందు మొదటినుండి నాల్గవయధ్యాయములోఁ గొంతవఱకును మయాదిగణములు గాయత్ర్యాదిసప్తచ్ఛందస్సులు తదక్షరసంఖ్యలు తద్దేవతాగోత్రములు మొద లైనవైదికచ్ఛందోవిషయములు వర్ణింపఁబడినవి. అక్కడినుంటి 'అత్ర లౌకికమ్' అనుసూత్రముతో లౌకికచ్ఛంద స్సారంభింపఁబడినది.

ఇది గణచ్ఛందస్సు మాత్రాఛందస్సు అక్షరచ్ఛందస్సు, అని మూఁడు విధములు. ఆర్య మొదలుగా నుద్గీతిపర్యంతము గణచ్ఛందస్సు. వైతాళి మొదలు చూళికాపర్యంతము మాత్రాఛందస్సు. సామాన్య మొదలుగా నుత్కృతిపర్యంతము, అక్షరచ్ఛందస్సు. ఇందలివృత్తప్రస్తారమార్గము ననుసరించియే తరువాతఁ బ్రస్తారలక్షణము లుదయించినవి. ఇందు సుమారు ౪౦౦ సూత్రము లున్నవి. ఈసూత్రములు సమన్వయించి వ్యాఖ్య వ్రాయుట మిక్కిలి క్లిష్టము. వీనికిఁ బూర్వు లెవ రైన వ్యాఖ్య రచియించి రేమో తెలియదు. హలాయుధుఁడు గూడఁ బూర్వవ్యాఖ్యలు తాను జూచినట్లు చెప్పలేదు. అందుచే నతనివల్లనే యీసూత్రముల యర్థము లోకమునకు విశద మైన దనవచ్చును.

హలాయుధుఁడీవృత్తిగాక, అభిధానరత్నమాల, బ్రాహ్మణసర్వస్వ—పండితసర్వస్వ—శివసర్వస్వ — న్యాయసర్వస్వ — మత్స్యసూక్తతంత్ర — కవిరహస్యము లను గ్రంథములను గూడ రచియించినవాఁ డనియు, బ్రాహ్మణసర్వస్వమునఁ దనవృత్తాంతము నీక్రిందివిధముగా వర్ణించుకొన్నవాఁ డనియుఁ దెలియుచున్నది.

ధారానగరాధీశుఁడు వాక్పతిరా జనఁబడువాఁడు నగుముంజమహీపాలుని యాస్థానపండితుఁడును దశరూపకకర్తయు నగుధనంజయునిపుత్త్రుఁడు భట్టనారాయణుఁ డనియు, అతనివంశమున జన్మించినవాఁడు హలాయుధుఁ డనియు నందు న్నదఁట. మఱియు నితఁడు లక్ష్మణసేనునియాస్థానమునందు బాల్యమున రాజపండితపదవిని యౌవనమున మంత్రిపదవిని వార్ధకమున ధర్మాధికారిపదవిని బొందిన మహాపండితుఁ డనియుఁదెలియుచున్నది. ఇతనిమృతసంజీవిని ఛందస్సుపాలిటిసంజీవిని యని చెప్పవచ్చును. ఇది లేకున్న లక్ష్యములనుబట్టి వివిధవృత్తములు పుట్టవలసినదే కాని, శాస్త్రము తెలియకపోవును. ఆయనర్థము తొలఁగించినవాఁడు హలాయుధుఁడు.

కావ్యాదర్శముమొదల నున్న 'ఛందోవిచిత్యాం సకల స్తత్ప్రపఞ్చో నిదర్శితః' అనుమాటనుబట్టి దండ్యాచార్యుఁడు ఛందోవిచితి రచియించియుండునని కొందఱును, అది యీపింగళచ్ఛందస్సే యని కొందఱు నందురు. ఎట్లయిననేమి? అది లేదు. ఛందః కౌస్తుభ మనులక్షణగ్రంథ మొకటి కలదు. దానికర్త పేరు గాని కాలముగాని తెలియదు. అందలిశ్లోకములు కొన్ని ఛందోనిరుక్తి వ్యాఖ్యలో నుదాహరింపఁబడినవి. అందలివిషయము పరిశీలింపఁగా నది హలాయుధునితరువాతఁ బుట్టిన దని తోఁచుచున్నది. ఇది మగణాదులశత్రుమిత్రోదాసీనభృత్యత్వములను వానిఫలములను, ఈక్రిందివిధముగాఁ జూపినది.

"మనౌ సఖాయౌ కథితౌ, భయౌ భృత్యౌ వుదీరితౌ,
ఉదాసీనౌ తజౌ ప్రోక్తౌ, సరౌ శత్రూ మతావిహ,
సిద్ధి ర్భవే త్సఖిభ్యాం సఖిభృత్యాభ్యాం జయస్థిరత్వంచ,
స్యా ద్భృత్యమిత్రభృత్యై శ్శుభం స్వపీడా తు మిత్రశత్రుభ్యామ్,
అఫల ముదాసీనాభ్యాం శత్రుసఖిభ్యాంతు త ద్భవతి,
శత్రుభ్యాం తు విరోధో నాయకనాశశ్చ సంప్రోక్తః"

పింగళచ్ఛందస్సు ననుసరించి యుదయించినఛందోగ్రంథములలోఁ బ్రశంసనీయ మైనది వృత్తరత్నాకరము. ఇది యాఱధ్యాయములపద్యగ్రంథము. దీని కర్త కేదారభట్టు, వేదాన్తశైవశాస్త్రజ్ఞుఁడు శివపూజాధురంధరుఁడు కాశ్యపగోత్రుఁడు నైనపబ్యేకపండితునితనూజుఁడు. ఇతనిదేశకాలములు తెలియకున్నవి. కాని యితనియీగ్రంథమునకు మాత్రము నలుదేశములవారు టీకలువ్రాసిరి. గోవిందభట్టసూనుఁ డగుశ్రీనాథపండితునిధీశోధినియు, నృసింహాయజ్వపుత్త్రుఁ డగు నారాయణపురోహితునిమణినిధియు, భాస్కరపండితునిసేతువు, బౌద్ధాగమచక్రవర్తి యనురామచంద్రకవిభారతిపంచిక, ఇంకను జ్ఞానదీపము నృసింహభారతి

యము మొదలైనవి మూలముతో నందందు ముద్రితము లైనవి. ౧౩౬ గ్రంథ సంజ్ఞగలయీచిన్నలక్షణమున కన్ని దేశముల వ్యాఖ్యలు, దేశభాషాటీకలు పుట్టుటయే దీనిగొప్పతనమును దీనిసుగుణమును దెలుపఁగలవు.

ఇందు ఛందస్సులపేళ్లు మాత్రావృత్త సమవృత్తార్ధసమవృత్త విషమవృత్త షట్ప్రత్యయనిరూపణములు ననువిషయములు వర్ణింపఁబడినవి. గురు లఘు విజ్ఞానము గణవిజ్ఞానము వృత్త యతి వివేకము మొద లగువివిధచ్ఛందోవిషయముల కిది నిజముగా రత్నాకరమే.

కాళిదాసుపేర శ్రుతబోధ యనులక్షణ మొకటి యున్నది "ఆదిమధ్యావసానేషు యరతా యాంతి లాఘవ" మిత్యాదిప్రసిద్ధశ్లోక మందలిదే. విషయపరిశీలనమునుబట్టి వృత్తరత్నాకరశ్రుతబోధలకు సామ్యము కనఁబడుచున్నది. అందుచే దేనిని జూచి యేది పుట్టెనో నిర్ణయింప నలవిగా కున్నదికాని, అది కాళిదాసుది కా దనుటమాత్రము నిజము. పెక్కుస్థలములందు వృత్తరత్నాకరములోనివిషయములను మిక్కిలి వివరించినట్లున్న శ్రుతబోధ పర మనుట కవకాశము కనఁబడుచున్నది. ఇందు కొకయుదాహరము.

"మో మో గో గో విద్యున్మాలా" అనివృత్తరత్నాకము చెప్పఁగా—
"సర్వే వర్ణా దీర్ఘా యస్యాం, విశ్రామ స్స్యా ద్వేదై ర్వేదైః,
విద్వ ద్బృన్దై ర్వీణా వాణీ, వ్యాఖ్యాతా స్యా ద్విద్యున్మాలా"

అని శ్రుతబోధ వివరించినది. ఇట్టివివరణము లనేకములుకలవు. వీటిని బట్టి వృత్తరత్నాకరమును జూచి శ్రుతబోధ పుట్టిన దనవచ్చును. క్రీ. ౧౬౦౦ లో, పింగళచ్ఛందస్సునకు, తార్కికచక్రచూడామణిరాయణభట్టపుత్రుఁడు లక్ష్మీనాథుఁడొకవ్యాఖ్య నిర్మించెను. ఛందఃప్రదీప మనెడియావ్యాఖ్య ముద్రిత మైనట్లుకనఁబడదు. కాని, అది చక్కనిటీక యగును. గంగాదాసుఁ డనుపండితుఁడు ఛందోమంజరి యనునొకలక్షణము రచియించెను. దీనివ్రాతప్రతి యొకటి క్రీ. ౧౬౯౦ లోఁ బుట్టినట్లు కనఁబడుచున్నది. కావున నిది యంతకుఁ బూర్వము కవియవతారికలోఁ జెప్పినయీక్రిందిమాటలనుబట్టి నాఁటికి ఛందోగ్రంథము లనేకము లున్న వని తెలియును.

"సన్తి యద్యపి భూయాంస శ్ఛన్దోగ్రన్థా మనీషిణామ్,

ప్రస్తారశేఖర మనునొకలక్షణము వృత్తప్రస్తారమును తెల్పుచున్నది. దానికర్త యగు శ్రీనివాసుఁడెప్పటివాఁడో తెలియదు. ఆగ్రంథ మచ్చుపడలేదు.

ప్రస్తారవిషయమున నిది యుత్తమగ్రంథ మగును. ఇందు, వర్ణ మాత్రా విషమానుష్టు బార్యా శబ్దప్రస్తారములు కలవు. వృత్తమణికోశ మనులక్షణమును లక్ష్మీవేంకటేశ్వరులపుత్త్రుఁ డగు పైశ్రీనివాసపండితుఁడే నిర్మించెను. ఇది ముద్రితమైనది. ఇందు వివిధవృత్తములలక్షణములు కలవు. అవధానసరస్వతీపుత్త్రుఁడైన వేంకటేశపండితుఁడు వృత్తరత్నావళి నిర్మించెను. అది యముద్రితము. అది వృత్తరత్నాకరము ననుకరించినదే కాని, అన్యము కాదు. వృత్తరత్నావళి యనుపేరనే సదాశివముని నిర్మించినలక్షణము మఱియొకటి యున్నది. కాళిదాసుపేర మఱియొకవృత్తరత్నావళి యున్నది. ఇవి యన్నియు వృత్తరత్నాకరార్వాచీనములే. ఇట్లు లౌకికచ్ఛందస్సునఁ బుట్టినగ్రంథము లింకను గొన్ని కలవు. వీటి కన్నిటికిఁ బరమాధారము పింగళచ్ఛందస్సే. దానికాధారము ఛంద స్సనువేదము.

ఇది, శ్రీహరితసగోత్రాధీత సకలతంత్ర రామస్వామిశాస్త్రి పౌత్త్రుఁడును
వెంకమాంబా శ్రీరామావధాని పుత్త్రుఁడును, ఆంధ్రవిశ్వకలా
పరిషత్కలాశాలా సంస్కృతాంధ్రా ధ్యాపకుఁడునగు
మల్లాది సూర్యనారాయణశాస్త్రి రచియించిన
సంస్కృతవాఙ్మయ చరిత్రయందు ద్వితీయ
భాగమున నవమాధ్యాయము

సర్వము.

ఓంతత్సత్, బ్రహ్మార్పణమస్తు.



# సంస్కృతవాఙ్మయచరిత్ర

## లౌకికవాఙ్మయము

## అకారాదిపదపట్టిక


అ.

అకలంకుఁడు 102
అక్బరు 410
అగస్త్యుఁడు 19-47-289-323
అగస్త్యమతము 20
అగ్నిపురాణము 186-187
అగ్నిమిత్రుఁడు 341-346
అగ్నివేశుఁడు 2-3-4-7
అగ్రిముఁడు 200
అచ్యుతప్రేక్షుఁడు 127
అచ్యుతరాయాభ్యుదయము 262-330
అచ్యుతోత్తరము 207
అచ్యుతోపాధ్యాయుఁడు 400
అజయపాలుఁడు 404-405
అజయుఁడు 405
అతిరాత్రయాజి 388
అథర్వవేదము 2-12-54-75-93
అథర్వసంహిత 19
అద్దంకి 263
అద్భుతదర్పణము 298
అద్భుతసాగరము 160
అద్వైతమతము 83
అద్వైతరసమంజరి 308
అద్వైతానందుఁడు 123
అధ్యాత్మవిద్యోపదేశవిధి 123
అనవేముఁడు 303-304
అనర్ఘరాఘవము 375-376-385
అన్యాపదేశము 307
అన్యాపదేశశతకము 305
అనిరుద్ధుఁడు 119
అనుభూతిస్వరూపాచార్యుఁడు 148
అనేకార్థకోశము 404
అన్యోక్తిమాల 308
అన్యోక్తిముక్తాలత 304
అన్యోక్తిశతకము 305
అనంగరంగము 180
అనంతనారాయణ 281
అనంతభట్టు 144-324-329
అనంతభూవరుఁడు 221
అనంతవీర్యుఁడు 102
అనంతాచార్యుఁడు 121
అనంతానందగిరి 266
అన్నంభట్టు 106-117
అపరాజితుఁడు 378
అపరోక్షానుభూతి 123
అప్పయదీక్షితుఁడు 112-123-124-129-205-287-288-289-305-308-319-331-356-388-400
అప్పయామాత్యుఁడు 319
అప్పాధ్వరి 332
అభయచంద్రసూరి 139
అభయనందిముని 147
అభయానందపూజ్యపాదుఁడు 61
అభిధానచింతామణి 396-405-406
అభిధానరత్నమాల 402-412-414
అభిధావృత్తిమాతృక 221-223

అభినయదర్పణము 16
అభినయశాస్త్రము 16
అభినవగుప్తుఁడు 13-14-18-132-216-217-220-224-225-226-239-242-243-339
అభినయదర్పణము 13
అభినవభారతి 242
అభినవభారతీవ్యాఖ్య 13-14
అమరకోశము ; వ్యాఖ్య 14-146-246-394-400-401
అమరదత్తుఁడు 395
అమరపదపారిజాతము 400
అమరపదముకురము 400
అమరమాల 395
అమరశక్తి 274
అమరసింహుఁడు 64-113-395-396-397-398-403-411
అమరుకము 210
అమరుకశతకము 263-302
అమలానందుఁడు 123
అమాత్యవత్సరాజు 386
అమృతస్మృతి 145
అమృతానందుఁడు 255
అమోఘవృత్తి 137-138
అయోధ్య 31-39-40-268
అయోనియా 28
అర్థశాస్త్రము 2-163-167-168-173-267
అర్థశ్లేష 185
అర్జునచరితము 214-220-281
అర్జునదేవవర్మ 302
అర్జునమిశ్రుఁడు 61
అరుణగిరినాథుఁడు 249-262-387
అరాలగ్రామము 370
అలగ్జాండరు 28-29
అల్లాబాదు 340
అలంకారచూడామణి 222
అలంకారమంజరి 233
అలంకారవార్తికము 233
అలంకారవృత్తి 219
అలంకారవివరణము 208
అలంకారశాస్త్రము 182
అలంకారసర్వస్వము; వ్యాఖ్య 209-226-233-234-266
అలంకారానుసరిణి 233
అవధానసరస్వతి 387
అవలోకము 218
అవసరాల పద్మరాజు 330
అవిమారకము 177-343-344
అవ్యయసంగ్రహనిఘంటువు 412
అవంతి 48-143-159-204-249-259
అవంతివర్మ 131-209-216-224-231-377
అవంతిసుందరి 378
అశ్మకవంశము 207
అశ్వఘోషుఁడు 64-104-187-254-255-340-348-349
అశోకునిశాసనములు 166
అష్టాధ్యాయి 11-133-136-140-144-148-401
అష్టాంగహృదయము 4-315
అసగుఁడు 267
అసఫవిలాసము 269
అహిరాజు 409
అహిర్బుధ్న్యసంహిత 79
అహోబలసూరి 51
అళియరామరాజు 16
అక్షపాదుఁడు 94-95
అంగలోకము 48
అంతర్వేది 132
అంశుమద్భేదము 19


ఆ.


ఆగాషీ 204
ఆచార్యదిగ్విజయము 334

ఆచార్యశ్రీరత్ననంది 268
ఆచారేందుశేఖరుఁడు 144
ఆచ్చాన్ 308
ఆట్టోఫ్రాంకు 394
ఆఢ్యరాజు 321
ఆణవదీక్ష 89
ఆత్మబోధ 123
ఆత్మషట్క-భాష్యము 123
ఆత్మారామయోగీంద్రుఁడు 121
ఆత్రేయభాషితము 3
ఆదిత్యదాసు 159
ఆదిత్యదేవుఁడు 113
ఆదినాథుఁడు 235
ఆన్వీక్షికి 95
ఆనందకవి 232-306-324
ఆనందగిరి 123
ఆనందగిరీయము 123
ఆనందతీర్థుఁడు 127-128-284
ఆనందపూర్ణమునీంద్రుఁడు 61
ఆనందమందాకిని 313
ఆనందరాఘవప్రస్తావన 291
ఆనందవర్ధనుఁడు 208-213-216-217-218-219-220-221-222-225-235-238-240
281-362-372-377-385
ఆనందసుందరి 389
ఆపదేవుఁడు 112
ఆపట్టుపండితుఁడు 138-378
ఆపస్తంబధర్మసూత్రములు 34-63
ఆఫ్రటుపండితుఁడు 279
ఆపిశలివ్యాకరణము 138
ఆప్తనిశ్చయాలంకారము 102
ఆప్టే వి. సి. 413
ఆయుర్వేదము 2-3
ఆరణ్యకములు 2-33-63-182
ఆర్యభటాచార్యుఁడు 152-153-159
ఆర్యభటసిద్ధాంతము 152
ఆర్యమంజు శ్రీమూలకల్పము 78
ఆర్యవజ్రుఁడు 136
ఆర్యసూత్రములు 153
ఆర్యాసప్తశతి 247-304
ఆర్యులు 3-7-48
ఆర్హతము 101
ఆర్హతదర్శనచరిత్రము 98
ఆలంచ రామచంద్రుఁడు 188
ఆశాధరగణకుఁడు 155
ఆశాధరుఁడు 215-400
ఆశ్చర్యచూడామణి 371-372
ఆశ్చర్యమంజరి 371-391
ఆహవమల్లుఁడు 261
ఆంగ్లేయులు 29
ఆంధ్రసాహిత్యపరిషత్తు 55
ఆంధ్రులు 17-21-264-284-285-290-312-326

ఇ.

ఇమ్మడీంద్రుఁడు 303
ఇరుగపదండాధిపుడు 407-408
ఇంగ్లండు 274
ఇంద్రాదులు ధానుష్కులు 6

ఈ.

ఈశ్వరకృష్ణభట్టు 118
ఈశ్వరదత్తు 353
ఈశ్వరప్రత్యభిజ్ఞాహృదయము 132
ఈశ్వరసుమతి 291
ఈశ్వరసంహిత 79-80
ఈశ్వరరాజు 262
ఈశ్వరానందుఁడు 144

ఉ.

ఉక్తిగర్భుఁడు 185-222
ఉగ్రశ్రవసుఁడు 55
ఉజ్జయిని 48-131-213-259-267-297-322-358
ఉజ్జ్వలదత్తుఁడు 139-145-390

ఉణాదికోశము 412
ఉణాదినామమాల 412
ఉణాదినిఘంటువు 412
ఉత్తరమీమాంస 92-98-99-121
ఉత్తరరామచరిత 210-342-363-365-368-371-372-385
ఉత్పలపరిమళ 159
ఉత్పలాచార్యుఁడు 130
ఉత్పలిని 394
ఉత్ప్రేక్షావల్లభుఁడు 292
ఉదయనచరితము 354
ఉదయనాచార్యుఁడు 116-117-118-125-265-304
ఉదయసుందరీకథ 223_325-326
ఉదయాకరసూనుఁడు 130
ఉద్భటుఁడు 196-207-208-209-212-214-219-220-241
ఉద్భటవివేకము 209
ఉద్భటాలంకారవివృతి 209-210-219
ఉదాత్తరాఘవము 375-377
ఉదాత్తరాఘవకిరణావళీనాటకము 336
ఉద్యోతకరుఁడు 116
ఉద్యోతము 144
ఉద్యోతప్రభాభావప్రదీపిక 146
ఉద్దండకవి 299-389
ఉన్మాదవాసవదత్త 372
ఉపపురాణములు 64-72
డిటో పట్టిక 72
ఉపనిషత్తులు 63-99-121-126-182
ఉపమన్యుఁడు 145-185
ఉపవర్షవృత్తి 107
ఉపవర్షుఁడు 106-122-141
ఉపవేదములు 2
ఉపాధ్యాయనిరపేక్ష 173
ఉభయాభిసారిక 353
ఉమాస్వాతివాచకాచార్యులు 102
ఉలూకమహర్షి 95
ఉవ్వటుడు 143
ఉషాపరిణయము 333
ఉషాహరణము 292

ఋ.

ఋగ్వేదము 2-4-6-12-31-40-79-82-149-182-296-335-346-413
ఋజువిమలాప్రకరణపంచికలు 112
ఋతుసంహారము 251

ఎ.

ఎవలిన్ ఆర్థరు 79-84
ఏకనాథుఁడు 252-253
ఏకాశిలానగరము 236
ఏకావళి 229
ఏకామ్రనాథుఁడు 290
ఏకాక్షరరత్నమాల 407
ఏకోజీ 329-332
ఏలేశ్వరపురవరమహోపాధ్యాయ పెద్దిభట్టు 312

ఐ.

ఐతరేయబ్రాహ్మణము 2-336
ఐంద్రనిఘంటువు 407

ఒ.

ఒరిస్సా 406
ఓరుగల్లు 288
ఔక్తికము 185-222
ఔచిత్యవిచారచర్చ 221-230
ఔద్దాలకి 174

క.

కంకణబంధము 285
కంచం యల్లయ్య 161
కందళి 118
కందాళ రామానుజాచార్యులు 51
కందుకూరి నాగనాథసూరి 333
కంపణాభ్యుదయము 262
కంబల 16
కణభక్షు 207
కణాదసూత్రము 118
కణాదుఁడు 95–98
కథాకావ్యము 269
కథాత్రయి 281
కథాసరిత్సాగరము 274–357
కన్నమాచార్యుఁడు 21
కన్యాకుబ్జము 261
కన్యాసంప్రయుక్తకము 175
కనుపర్తిబసవాచార్యుఁడు 21
కపిలముని 95–96
కపిలవస్తు 103
కపిలసాంఖ్యము 99
కపిలసూత్రము 118
కపిలాచార్యుఁడు 98
కపిలాక్షపాదుఁడు 83
కపింజలసంహిత 79
కమలా కంఠీరవము 389
కమలినీ కలహంసము 389
కమలినీ రాజహంసము 389
కయ్యటుఁడు 142–143–194–281–282
కరణకుతూహలము 154
కరణప్రకాశము 157
కరవీర్య 3
కర్ణపూరకవి 410
కర్ణసుందరీనాటకము 261
కర్మమీమాంస 106
కర్ణాటకదేశము 17–18
కర్రా విశ్వనాథశాస్త్రి 330
కర్పూరచరితభాణము 386
కర్పూరమంజరి 251–378–380
కలకత్తా 61
కలశభూపతి 261
కల్లటుఁడు 209
కల్పద్రుకోశము 410
కల్పద్రుమము 160
కల్పలతావివరణము 154
కల్పసూత్రము 78–80–113
కల్యాణపండితుఁడు 256–257–258
కలాపరిచ్ఛేదము 204–205
కలావతీనందకము 388
కలావిలాసము 181–274
కళ్యాణపురము 261
కల్యాణమల్లకవి 180–268
కలివిడంబనము 307
కల్కిపురాణము 72
కళింగదేశము 204
కళింగులు 29
కవికర్పటిక 285
కవికల్పద్రుమము 136
కవికంఠాభరణము 230
కవితామృతకూపము 308
కవితార్కికసింహుఁడు 126–388
కవిపూర్ణకవి 382
కవిరహస్యము 185
కవిరంజని 330
కవిరాక్షసీయము 308
కవివాదిశేఖరుఁడు 333
కవివిమర్శము 336–359
కవిశేఖరుఁడు 292
కవిసంజీవిని 308
కవిసింధుసుధాంశుబిందువు 322
కవిహృదయము 205
కవీంద్రాచార్యసరస్వతి 298
కశ్యపుఁడు 15

కా.

కాంచనకవి 386
కాంచీ— 102-126-361-369
కాంచీనాథుఁడు 180
కాంభోజులు 29
కాంతము 198
కాంతిమతీపరిణయము 388
కాకతిప్రతాపరుద్రుఁడు 236
కాటయవేమఁడు 341
కాణభూతి 271
కాణాదరహస్యము 118
కాణే 195-196-200-205-206-216-217-226-243
కాత్యాయనుఁడు 4-28-133-140-141-194-246-393-407
కాత్యుఁడు 395
కాదంబరి 210-214-247-259-270-274-319-322
కాదంబరీరామము 391
కాపాలికము 82
కామకళావిలాసస్తోత్రము 79-89
కామధేనువు 399-211
కామదేవుఁడు 185
కామరూప 305
కామశాస్త్రము 174-210
కామసూత్రములు 175-176
కామందకము 173-210
కామాక్షీదాసు 331
కారికాదర్పణకర్త 289
కారికావళి 117
కాలటి 122
కాలార్ణవస్తోత్రము 79
కావేరి 204
కావ్యకౌతుకము 224
కావ్యప్రకాశము 186-231-224-241-247-360
కావ్యప్రకాశసంకేతవ్యాఖ్య 233
కావ్యమీమాంస 185-186-222-223-377-378
కావ్యశరీరము 207
కావ్యాదర్శము 187-196-197-200-204-205-228-339-415
కావ్యానుశాసనము 221-224-225
కావ్యాలంకారము 187-192-196-205-207-339
కావ్యాలంకారసూత్రవృత్తి 210-212-213-321-339-373
కాశకృత్స్నవ్యాకరణము 138
కాశికావృత్తి 137-145-146-212
కాశికావివరణపంజిక 397
కాశి 68-71-102-103-137-139-160-179-261-405
కాశిఖండము 71-83-86
కాశీనాథకవి 321
కాశీనాథభట్టు 68
కాశీనాథత్ర్యంబకతిలాంగు 374
కాశీరాజదివోదాసుఁడు 3
కాశీరామవాచస్పతి 322
కాశ్యపుఁడు 186
కాశ్మీరదేశము 15-130 to 132-258-292-312-360-377
కాశ్మీరరాజచరిత్రము 258
కాళహస్తి 408
కాళిదాసు 29-47-49-64-160-177-183-184-220-232-248 to 251-254-255-269-270-273-283-284-286-294-295-296-300-309-318-319-321-337 to 341-344 to 348-353-361-368- to 371-385-387-390-391-396-403
కాళీవిలాసస్తోత్రము 79
కాశీస్తోత్రము 79

కి.

కిరణావళి 118
కిరాతజాతి 48
కిరాతార్జునీయము 214_247_251_252_258
కిరాతార్జునీయవ్యాయోగము 386
కిష్కింధాకాండము 41_48

కీ.

కీతుపండితుఁడు 107_109_176_195_273_326_340_349_358_361
కీరదూతము 299
కీర్తివర్మ 125
క్రియాకలాపము 400

కుం.

కుంకుమవికాసము 145
కుండమండపకౌముది 19
కుండరత్నాకరము 19
కుండసిద్ధి 19
కుంతకుఁడు 219_281
కుంతేశ్వరదౌత్యము 251
కుందమాల 368_369_371
కుంభకర్ణనరేంద్రుఁడు 15_16
కుంభో 21

కు.

కుచమారుఁడు 175_223
కుట్టనీమతము 302_357
కుతూహలవృత్తి 116
కుప్పుస్వామిశాస్త్రిమహామహోపాధ్యాయ 109_371
కుమారకవి 21
కుమారదాసుఁడు 390
కుమారపాలుఁడు 406
కుమారవిజయము 388
కుమారసంభవము 247_250_254_255
కుమారస్వామి 147_148_229_234_236_329
కుమారిలభట్టు 73_107_108_110_111_194_398
కుమారిలుఁడు 104_106_107_108_109_116_194_372_398
కుమారీభూతబోధిసత్త్వుఁడు 78
కురవిరామకవి 329
కురుపాంచాలదేశములు 57
కురువంశము 51
కులశేఖరుఁడు 286_371_381
కువలయానందము 144_235
కుశకుముద్వతీయము 388
కుసుమపురము 322
కూచిమారతంత్రము 181
కూపికాసూర్యప్రకాశము 154
కూర్పరగ్రామము 61
కూర్మపురాణము 26_66

కృ.

కృష్ణకవి 292_300_389
కృష్ణకర్ణామృతము 315
కృష్ణగణకుఁడు 154
కృష్ణచరితము 323
కృష్ణచంద్రుఁడు 299
కృష్ణదాసుఁడు 316
కృష్ణదేవుఁడు 106
కృష్ణద్వైపాయనుఁడు 25_32_33_38_93_94_120
కృష్ణపండితుఁడు 286
కృష్ణభవనామృతము 315
కృష్ణభూపతి 311_402
కృష్ణభూషణము 333
కృష్ణమాచార్యుఁడు 7_8_79_319_320
కృష్ణమిత్రపండితుఁడు 144_145
కృష్ణమిశ్రుఁడు 125_314_381
కృష్ణయజ్వ 112
కృష్ణలీలాకావ్యము 315
కృష్ణవిజయము 289

కృష్ణవిద్యావాగీశభట్టాచార్యుఁడు 83
కృష్ణవిలాసము 333
కృష్ణాభ్యుదయము 289_390
కృష్ణానందభట్టాచార్యుఁడు 80
కృష్ణాయనము 290
కృషిపద్ధతి 19

కె.

కెర్ను పండితుఁడు 159

కే.

కేదారభట్టు 415
కేరళచంద్రిక 161
కేరళజ్యోతిషము 161
కేరళదేశము 21_122_286_381
కేరళాచార్యుఁడు 161
కేరళాభరణము 331
కేరళులు 86
కేశవపండితుఁడు 161_264_406_411
కేశవభట్టు 333
కేశవమిశ్రుఁడు 116_233
కేసరినరసింహుఁడు 235

కై.

కైవల్యదీపిక 69

కొ.

కొక్కోకము 180
కొక్కోకకవి 179
కొల్లాపురము 82

కో.

కోంకణము 155
కోకిలసందేశము 299
కోటిఫలి 147
కోదండరామస్వామి 7
కోరాడ రామచంద్రశాస్త్రి 301
కోల్ బ్రూక్ 317
కోలాచలమల్లినాథుడు 329
కోలాధిపుఁడు 289
కోశాదులు 393
కోసల 39_103
కోహల, కోహలుఁడు 13_15_16
క్రోధీశభైరవ 80

కౌ.

కౌటిల్యుఁడు 75_164_165_166_167_168_176_344
కౌండభట్టు 146_329
కౌణపదంతుఁడు 170
కౌమారభృత్యకము 5
కౌశాంబి 141
క్షీరస్వామి 14
క్షేత్రరాజు 16

ఖ.

ఖండఖాద్యవ్యాఖ్యానము 159
ఖండదేవుఁడు 112_113_114_115_237
ఖండనఖండఖాద్యము 124_125
ఖండనఖండనము 254

గ.

గంగాదేవి 263
గంగాధరపండితుఁడు 154_264_333
గంగాధరభక్తకింకరుఁడు 123
గంగాధరమిశ్రుఁడు 106
గంగానాథఝూ, మహామహోపాధ్యాయ 107_109
గంగారాముఁడు 15
గంజాంజిల్లా 112
గంగేశపండితుఁడు 116
గఉడవహ 367
గజపతిప్రతాపరుద్రదేవుఁడు 382
గణపతిదేవుఁడు 288
గణపతిశాస్త్రి మహామహోపాధ్యాయ 164_167_169_270_303_337_339_344
గణితచూడామణి 155
గణితతత్త్వచింతామణి 154

గణితరత్నమాల 413
గణితసారము 155
గణితాధ్యాయము 154
గణితామృతలహరి 154
గణితామృతసాగరీవ్యాఖ్య 154
గణేశపండితుఁడు 154
గదాధరభట్టాచార్యుఁడు 117
గద్యమణి 324
గద్యవిద్యాధరకవి 180
గయ 104
గయాశాసనము 103
గరుడపురాణము 70
గర్గమతము 20
గర్భోపనిషత్తు 9
గ్రహజ్ఞానము 155

గా.

గాంగరాజులు 406
గాంధర్వవేదము 2-8-9-184
గాంధర్వవేదసారము 13
గాణాపత్యమతము 72
గాయత్రీరామాయణము 35
గార్లపాట లక్ష్మణాచార్యుఁడు 21

గి

గీతగోవిందము 247-314-315-317
గీతగౌరీశము 317
గీర్వాణేంద్రదీక్షితుఁడు 386
గ్రీకులు 28-29-30

గు.

గుంటూరు 7
గుణచంద్రుఁడు 338
గుణవినయగణి 325
గుణాఢ్యుఁడు 270-271-273
గురుబాలప్రబోధిని 394-400-401
గురువృత్తి 139

గూ.

గూఢార్థదర్శిని 143
గూఢార్థప్రకాశకము 151
గూర్జరదేశము 253

గే.

గ్రేపండితుఁడు 256-280-319

గో.

గోకులనాథుఁడు 313
గోజాదత్తసూరి 280
గోజాదేవీబల్లాలుఁడు 151
గోణికాపుత్రుఁడు 178
గోదాపరిణయము 333
గోనర్దీయుఁడు 175
గోపాలగురుఁడు 51
గోపాలభట్టు 106-215
గోపాలరాజు 279
గోపాలసముద్రము 308
గోపేంద్రత్రిపురహరభూపాలుఁడు 211
గోరక్షనాథుఁడు 121
గోరూపస్వామి 298
గోవర్ధనుఁడు 116-297-304-314-348-365
గోవర్ధనసుధి 117
గోవిందచరిత్ర 288
గోవిందమంత్రి 288
గోవిందదీక్షితుఁడు 16-189
గోవిందరాజు 51
గోవిందలీలామృతము 315
గోవిందసూరి 61-386
గోస్వామి 400

గౌ.

గౌడపాదుఁడు 119
గౌతముఁడు 4-94-95-98
గౌతమభాష్యము 116
గౌతమబుద్ధుఁడు 141-255

